# ఆంధ్రగ్రంథములు.

## పద్యకావ్యములు.

| | | ప్రతి 1-కి వెల రు. | అ. |
|---|---|---|---|
| అప్పకవీయము, గిడుగు రామమూర్తిపంతుల విమర్శతో | | అచ్చు | |
| ఆముక్తమాల్యద, (విష్ణుచిత్తీయము) | ... | 6 | 0 |
| ఆంధ్రభాగవతము, పద్యకావ్యము. 1, 2 సంపుటములు | ... | 15 | 0 |
| ఆదిపర్వము, పద్యకావ్యము. మూలము | ... | 1 | 8 |
| ,, సటీక | ... | 4 | 0 |
| ఆంధ్రభారతము, పద్యకావ్యము | | | |
| ఆది సభాపర్వములు | ... | 4 | 0 |
| ఆరణ్యపర్వము | ... | 4 | 0 |
| విరాటోద్యోగపర్వములు | ... | 4 | 0 |
| భీష్మద్రోణపర్వములు | ... | 4 | 0 |
| కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | ... | 4 | 0 |
| శాంతిపర్వము | ... | 4 | 0 |
| ఆనుశాసనిక, అశ్వమేధ, ఆశ్రమవాస, మౌసల, మహాప్రస్థానిక, స్వర్గారోహణపర్వములు | ... | 4 | 0 |
| ఆదిపంచకము, ఒకటేసంపుటము | ... | 11 | 4 |
| యుద్ధపంచకము, స్త్రీపర్వము | ... | 7 | 8 |
| శాంతిసప్తకము | ... | 7 | 8 |
| ఆనందరంగరాట్ఛందము | ... | 1 | 8 |
| ఆంధ్రనామసంగ్రహము, ఆంధ్రనామశేషము, సాంబనిఘంటువు, క్యాలికోబైండు | ... | 2 | 8 |
| ఉత్తరరామాయణము, కంకంటి పాపరాజప్రణీతము | ... | 6 | 0 |
| ఉత్తరహరివంశము, నాచన సోమనాథకృతము | ... | 8 | 0 |
| కవికర్ణరసాయనము, (మాంధాతృచరిత్ర) | ... | అచ్చు | |
| కాశీఖండము, శ్రీనాథకవి | ... | 8 | 8 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| గోపీనాథరామాయణము, 2-సంపుటములు ... | అచ్చు | |
| చాటుపద్యమణిమంజరి, ప్రథమభాగము, క్రొత్తకూర్పు | 2 | 0 |
| చిత్రభారతము. చరిగొండ ధర్మనార్య[illegible] | 1 | 8 |
| చెన్నబసవపురాణము, పా[illegible]కృతము | 2 | 0 |
| ఛందోదర్పణము (అనంతునిఛందము) ... | 3 | 0 |
| జైమినీభారతము, అశ్వమేధపర్వము ... | 2 | 8 |
| దశకుమారచరిత్రము, పద్యము, కేతనకవి ... | అచ్చు | |
| దశావతారచరిత్ర, చక్కనిక్రొత్తకూర్పు ... | 3 | 0 |
| ధ్రువోపాఖ్యానము, సటీక, భాగవతములోనిది ... | 0 | 10 |
| నరసభూపాలీయము, అట్టబైండు ... | 2 | 0 |
| నలచరిత్ర, ద్విపద, వక్రపురి రాఘవాచార్య ప్రణీతము | 2 | 4 |
| నిర్వచనోత్తర రామాయణము, తిక్కనాచార్యప్రణీతము | 1 | 8 |
| పంచతంత్రము, [illegible] ... | 1 | 8 |
| " కాలికోబైండు ... | 2 | 0 |
| " వేంకటనాథ రాజకవికృతము ... | 1 | 4 |
| " కాలికోబైండు ... | 2 | 0 |
| పారిజాతాపహరణము, చిన్నసైజు, క్రొత్తకూర్పు ... | 1 | 0 |
| " సాంధ్రటీకాతాత్పర్యము ... | 3 | 0 |
| బ్రహ్మోత్తరఖండము, క్రొత్తకూర్పు, శ్రీధరమల్లె వేంకటరామకవి | 3 | 8 |
| బసవపురాణము, పిడుపర్తి సోమనాథకవి ... | 3 | 8 |
| భాస్కరరామాయణము, చక్కనిక్రొత్తకూర్పు ... | 8 | 0 |
| మనుచరిత్ర, సటీక, వావిళ్ల రామస్వామిశాస్త్రిగారి వ్యాఖ్యానముతో చిన్నసైజున మేలుకాగితములమీద స్ఫుటమైన అక్షరములతో చక్కగ ముద్రితము ... | 5 | 0 |
| మార్కండేయపురాణము, మారనకృతము ... | 3 | 0 |
| భక్తిరసశతకసంపుటము I (20 శతకములు) ... | 3 | 0 |
| " II " ... | 3 | 0 |
| " III " ... | 3 | 0 |
| నీతిశతకసంపుటము I " ... | 3 | 0 |
| రంగనాథరామాయణము, ద్విపద ... | 6 | 0 |

| | | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|---|
| రాఘవపాండవీయము, సటీక, ద్వ్యర్థిప్రబంధరాజము | ... | 4 | 0 |
| లంకావిజయము (రావణదమ్మీయము) సటీక | ... | 1 | 8 |
| వసుచరిత్రవిమర్శనము | ... | 1 | 2 |
| వసుచరిత్ర, సటీక, రామరాజభూషణప్రణీతము | ... | 8 | 0 |
| వాసిష్ఠరామాయణము, ద్విపద, తరిగొండ వెంకమ్మ | ... | 1 | 4 |
| విక్రమార్కచరిత్ర, జక్కనకవిది | ... | 1 | 8 |
| విష్ణుపురాణము, వెన్నెలకంటి సూరనార్యప్రణీతము, లఘుటిప్పణము | ... | అచ్చు | |
| వివేకసింధు, కొండమార్యప్రణీతము | ... | 1 | 0 |
| వేంకటాచలమాహాత్మ్యము, తరిగొండ వెంకమ్మ | ... | 3 | 8 |
| వైశ్యపురాణము, శ్రీగురు భాస్కరాచార్యకృతము | ... | 1 | 8 |
| వీరభద్రవిజయము, పోతనకృతము | ... | 2 | 0 |
| శకుంతలాపరిణయము, కృష్ణకవికృతము | ... | 1 | 0 |
| శశిరేఖాపరిణయము, అప్పప్పకవికృతము | ... | 1 | 0 |
| శృంగారనైషధము, శ్రీనాథకవిది | ... | 2 | 8 |
| శృంగారశాకుంతలము, పినవీరభద్రకవి | ... | 1 | 8 |
| శేషధర్మము, తామరపల్లి తమ్మయ్య | ... | 1 | 0 |
| శుకసప్తతి, కదిరీపతికృతము | ... | 1 | 6 |
| సవివారకకుమారవిజయము | ... | 1 | 8 |
| సానందోపాఖ్యానము, శ్రీశివరామకవి విరచితము | ... | 1 | 2 |
| సీతారామాంజనేయసంవాదము, సటీక, ఆత్మానందకృతము ... | | 6 | 0 |
| సుగాత్రీశాలీనపరిణయము, తెనాలి అన్నయకవి, (క్రొత్తకూర్పు) | | 1 | 0 |
| హరివంశము, ఎఱ్ఱాప్రగడ | ... | 8 | 0 |
| హరవిలాసము, శ్రీనాథకవి | ... | 1 | 8 |
| హరిశ్చంద్రోపాఖ్యానము, శంకరకవి | ... | 1 | 8 |
| హరిశ్చంద్రనలోపాఖ్యానము, సటీక, రామరాజభూషణకవి | | 6 | 0 |


వావిళ్ల రామస్వామిశాస్త్రులు అండ్ సన్స్,

292, ఎస్ప్లనేడ్, చెన్నపురి.

శ్రీ

శ్రీ కృష్ణాయ నమః.

# శ్రీమద్భగవద్గీత

పదలువాడ సుందరరామశాస్త్రులచే

వ్రాయఁబడిన గీతార్థసర్వస్వరూపమగు

## పరమార్థచంద్రిక

యను వ్యాఖ్యానముతోఁ గూడినది.

నవమ దశమైకాదశ ద్వాదశాధ్యాయములు

సంపుటము ౪.

చెన్నపురి

శారదాంబావిలాస ముద్రాక్షరశాలయందు

ముద్రితమయి ప్రకటింపఁబడెను.



1915.

శ్రీ

శ్రీజగన్నాథస్వామినే నమః

# విజ్ఞాపిక.

శ్రీమద్భగవత్ప్రసాదమువలన నిప్పుడు ద్వాదశాధ్యాయము పూర్ణము గావింపఁజాలితిమి. నానాఁటికి ద్రవ్యసాధనసంపత్తి వికలం బగుచున్నను, ఈసమారంభంబునకు సర్వమహత్తరం బయిన పరమేశ్వరప్రసాదమునే సమగ్రసాధనముగా నమ్మియున్నారము.

ప్రస్తుతము నానాఁటికి ముద్రాసాధనము లగు పత్త్రాదులవర్గం బుత్తరోత్తరాభివృద్ధి నొందుచున్నది. చందాదాఱులసంఖ్య తద్విపరీతం బగుచున్నది. ఏతదాద్యనేక కారణములవలన నేతత్కార్యం బనివార్యముగా నప్పుడప్పుడు విలంబితం బగుచున్నను. అట్లగుచున్నను, అల్పసంఖ్యు లయినను అనల్పానుభావసంపన్ను లగుచందాదాఱులయుదంచత్సాహాయ్యబలంబుచే నవిహారితం బగు భగవత్సంకల్పము కలిమింజేసి, వివిధకష్టంబులచే విలంబితం బయ్యును విఘ్నితంబు గానీక వెలయింపఁజాలియున్నారము.

ఏతద్వ్యతికరంబునను నా భాగ్యవశముచే నియ్యాషాఢమాసంబునం బునఃపవిత్రక్షేత్రయాత్ర నాకు లభించెను. ఆషాఢశుద్ధఏకాదశీగురువాసరంబున రథారూఢుం డగు శ్రీజగన్నాథుని సందర్శించుపరమభాగ్యంబునకు భాజనము నైతిని. దివ్యస్యందనస్థితుం డగు దేవదేవునిఁ బరమేశ్వరునిఁ బరమగురుని గీతాచార్యుని సందర్శించి పరమహర్షపరిప్లుతుండనై యిట్లు ప్రార్థించితిని.—

ప్రణతోఽస్మి జగన్నాథ త్వాం మహాం కరుణానిధే
త్వద్గ్రీష్టం పూరయ క్షిప్రం మత్కష్టాని నివారయ.

అనంతరము విశాఖపట్టణంబున నాషాఢకృష్ణసప్తమీసోమవాసరము రాత్రి [illegible]నునియందును ఏతట్టీయసమారంభమునందును భగవంతుఁడు తాఁ బ్రసన్నుం డగుట ప్రార్థనాముఖంబునం బ్రదర్శింపఁగా మఱునాఁ డంతయు నిరతిశయా

నందనిమగ్నుండనై యుండి నవమీసౌమ్యవాసరంబున భగవన్నామాక్షరక్రమంబున నష్టాదశశ్లోకం బగు స్తవంబున శ్రీజగన్నాథు నారాధించితిని.

జ = ౮, గ = 3, న్నా కు సంఖ్య లేదు, థ = ౭, ఇట్లు పదునెనిమిదిశ్లోకములు. ఈ స్తవం బిట నవసరయుక్తం బగుటంజేసి యేతదంతంబునఁ బ్రకటించెదను.

ఇట నిల్లు సేరినపిదప సుఖముగా ద్వాదశాధ్యాయము పరిసమాపితం బయ్యెను. ఇట్లు భగవత్ప్రసాదము దృష్ట మగుటవలన నవశిష్టం బగు నధ్యాయషట్కం బనాయాసముగా నవిఘ్నపరిపూర్తి నొందఁగల దని సుదృఢంబుగా విశ్వసించుచున్నాను.

ఈ నవమ దశ మైకాదశ ద్వాదశాధ్యాయములు, సంపుటమునకుం దగు పరిమాణము గల వగుటవలనను ద్వాదశాధ్యాయముతోఁ దత్పదార్థప్రపంచనప్రధానం బగు ద్వితీయషట్కము పరిసమాప్త మగుటవలనను నాలవసంపుటముగాఁ జేయఁ బడియె. దీని క్రయము ప్రతి ౧-కి రు. ౪-౮-౦. వి-పి. రు. ౫-౦-౦.

ఇఁకఁ దత్త్వంపదార్థైక్యవివరణపరం బగు తృతీయాధ్యాయషట్కము మాత్రమే పరిశిష్టము. ఫలప్రదాత పరమేశ్వరుఁడే యయినను దృష్టద్వారంబుననే యగుం గావున, భగవంతునిదృష్టరూప మైనభాగవతు లాదరసమన్వితులై యల్పావశేషమయిన యిమ్మహాగ్రంథమును బోషించి సమగ్రముగా సాధింతురు గాత. ఏనో మదీయారంభం బన్యదుస్సాధం బైనను బరమేశ్వరుకరుణచేఁ బరిసమాప్తప్రాయం బని తదీయచరణాంభోజవిన్యస్తభరుండనై పరమానందనిర్భరుండ నగుచున్నాను.

ప్రథమద్వితీయాధ్యాయములు గలది ప్రథమసంపుటము ౧-కి రు. ౫-౦-౦
వి-పి. చార్జితో రు. ౫-౮-౦

తృతీయచతుర్థపంచమాధ్యాయములు గలది ద్వితీయసంపుటము ౧-కి రు. ౫-౮-౦
వి-పి. చార్జితో రు. ౬-౦-౦

షష్ఠసప్తమాష్టమాధ్యాయములు గలది తృతీయసంపుటము ౧-కి రు. ౪-౮-౦
వి-పి. చార్జితో రు. ౫-౦-౦

నవమదశమైకాదశద్వాదశాధ్యాయములు గలది చతుర్థసంపుటము ౧-కి రు. ౪-౮-౦
వి-పి. చార్జితో రు. ౫-౦-౦

ఇదివఱకు సిద్ధ మయిన ద్వాదశాధ్యాయి గల నాలుగు సంపుటములకును } రు.౧౯-౮-౦
వి-పి. చార్జితో రు. ౨౧-౦-౦

ఇప్పు డీభగవద్గీతాశాస్త్రమునందుఁ ద్రిభాగము సంపూర్ణ మయ్యెను. ఇంకఁ జతుర్థాంశము మాత్రమే యవశిష్టము. సత్పురుషులు వలయువార లీక్రింది విలాసమునకు వ్రాసి తెప్పించుకొని యేతద్భగవత్కార్యపరిపూర్తికిఁ గారణభూతులై పుణ్యకీర్తిభాజనము గావలయు నని ప్రార్థించుచున్నాను.

తేషాం సమ్మానా దియ మయతా మృద్ధిం కృతి ర్మమోదారామ్
యేషాం దర్శనపథ మిద మేష్యతి భగవత్కృపాయోగాత్.

చదలువాడ సుందరరామశాస్త్రులు
శారదాంబావిలాస ముద్రాక్షరశాలాధిపతి,
319 నెం. తిరువట్టూరు హైరోడ్డు, రాయపురము పోస్టు, మదరాసు.

౧౯౧౫ సం.
సెప్టెంబరు ౩౦ వ తేది.

శ్రీ ర స్తు.

# శ్రీ జగన్నాథ స్తవః

నమః ప్రాచ్యా మద్ధే రధితటి సమావిష్కృతతనో
శ్రితానాం రక్షాయై నిరుపధికృపాధీనహృదయ
నిజస్థానా త్క్షేత్రం జగతి పురుషోత్తంసవిలస
త్పదం కుర్వ౯ సర్వామరనుత జగన్నాథ భవతే. ౧

నమస్తే సంసారక్షితిధరమహేన్ద్రాయుధ పున
ర్నమస్తే శోకౌఘప్రవితతతమస్తీక్ష్ణకిరణ
నమస్తే దారిద్ర్యద్రుమనిశితధారోరుపరశో
నమో భూయో భూయో ముహు రపి జగన్నాథ భవతే. ౨

రథే తిష్ఠన్తం త్వాం సురగణనిరీక్ష్యం నయనయోః
ద్వయే నాద్రాక్షం ప్రాక్సుకృతవిభవా త్త్వత్కరుణయా
కథఙ్కారం భూయో భవజనితసన్తాపవశగో
భవేయం భద్రాత్మ న్నహ మిహ కృతార్థో ఽస్మి భగవ౯. 3

అనన్తం కారుణ్యం సకలజనతాయై విదధతా
స్వయం నీత్వా దేవ స్వరథ మనపాయంచ భవతా
రథస్థస్య ప్రేమ్ణా తవచ గమిత స్స్పర్శన మహం
విధాత్రాద్యై రారా దభిలషిత మాప్త్యైశ్చ మునిభిః. ౪

ఫలం చాక్ష్ణోః ప్రాప్తః ఫలద వరిపాకా ద్భవచయే
పురా ఽహం పుణ్యానా మనువిధి కృతానా మధిప తే
అవిత్తో ఽశక్త స్స న్నృదహ మిహ దూరా దుపగతో
భవద్దివ్యక్షేత్రం సుకృతరహితానా మసులభమ్. ౫

కృపా తే నిర్వక్తుం కృతినుత న శక్యా విధిముఖై
రపారా య ద్భద్రం మమ వదసి సుప్తా సురవిభో
వినా ఽఽజ్ఞాం తే విప్రః కథ మనుదదా ద్రూప్యవితతిం
క్వ సుబ్రహ్మణ్యశ్చ క్వనుచ బహుదూరో ఽహ మధిప. ౬

మహాత్మ్య న్వర్తన్తే చరితసుకృతా యే చ బహవో
భవాం స్తేషాం భూత్వా పరమసులభో మే ఽకృతవతః
య వాసీ ద్దేవేశః పరమసులభ స్సర్వసమతా
స్ఫలం జ్ఞాతా తస్మా ద్విధినుత జగన్నాథ భవతః. ౭

భవత్తన్త్రి దేవా ఽశుభ మపి శుభం యాతి మనుజః
క్వచి న్న స్వాతన్త్ర్యం ఫల ఇహ నరస్యాస్తి హి విభో
స్థితః క్షిప్త్వా భారం త్వయి తదహ ముద్యోగరహితో
యతో హ్యార్యా దృష్టో ఽన్త స్సురమకుటనీరాజితపదః. ౮

అసా రామో రుద్ర స్త్వియ మపి సుభద్రా భగవతీ
భవచ్ఛక్తి ర్మధ్యే త్వ మపి తదను శ్రీపరిబృఢః
త్రయం యుష్మాకం న స్సముపగత మేకత్ర భగవన్
శ్రితానాం శ్రేయాంసి ప్రతినియత మాత్మ ఘటయితుమ్. ౯

విభిన్నప్రజ్ఞా యే భువి మధురిపౌ శూలిని తయోః
రమణ్యాం శక్తౌ వా నిరతహృదయా స్సంస్కృతివశాత్
విభో తత్స ర్వేషాం శ్రుతినిగదితైకత్వనియతం
మతానా మేకాన్తం విశదయతి యుష్మత్త్రియ మిదమ్. ౧౦

మహాదేవో విష్ణు శ్శివ ఇతిచ నారాయణ ఇతి
ద్విధా భిన్నాం మూర్తిం వహసి పరిపాకాయ భజతామ్
భవా నేక స్త్వాత్మా తవ విభవలీలైవ భగవన్
సుభద్రా మా యేతి శ్రుతిహృదయ మాహుః స్థితివిదః. ౧౧

క్షర స్సీరీ శౌరే ఽక్షరపురుషనామ్నా భగవతీ
సుభద్రా గీతోక్త స్త్వ మసి పురుష స్తూత్తమ ఇతి
త్రయాణాం సంవాస స్సకలజగదాధారవపుషా
మవన్యా మేకత్ర ప్రకటయతి మన్యే తవ వచః. ౧౨

అధిష్ఠానం బ్రహ్మం స్త్వ మసి నిఖిల స్యాపి జగతః
త్వయి భ్రాన్తం చేదం స్థితి రియ మబాధా మునిమతా
యత స్త్వా మాత్మానం య ఇహ విబుధో వేత్తి స పుమాన్
విజానీతే సర్వం శ్రుతి రితి జగన్నాథ వదతి. ౧౩

యదాప్నో త్యానన్దం విషయవశతో వాఽఽప్త మతనో
త దాత్మానం మర్త్యోఽనుభవతి పరిచ్ఛేదరహితమ్
పరిచ్ఛేదా ద్దుఃఖం త్వితర దపరిచ్ఛేదనియతం
యతోఽనన్తే ద్విత్వం నచలగతి తద్ద్వైత మనృతమ్. ౧౪

ఫలం దత్సే కర్మప్రతినియత మీశాఽస్య జగతో
నరద్వారైవ త్వం య ఇహ వితర త్యప్రతిఫలమ్
స ఆత్మానం త్వాం తత్క్షణ మనుభవ త్యాత్మని పుమాం
త ద్వైక్యం జీవస్య శ్రుతిభణిత మీశస్యచ ఋతమ్. ౧౫

అనన్తత్వం సత్త్వం బుధనుత చిదానన్దఘనతా
పరాధిష్ఠానత్వం శ్రుతివిదిత మేత చ్చ సకలమ్
తవాఽద్వైతం మిథ్యాత్వ మపి భవదన్యస్యచ గురోః
కృపాపాత్రాణాం తే విశదయతి విస్పష్ట మధిప. ౧౬

అభేదప్రాప్త్యై వాఽప్యఖిలజగతి స్త్రీసుతముఖే
స్వ మానన్దం నిత్యం స్వయ మనుభవ న్న ప్యకృతధీః
న జానీతే దుఃఖం ప్రభవతి హి భేదా దితి విభో
తవై వేయం మాయా మయి కరుణయా మా ప్రసరతు. ౧౭

విధత్తాం నిత్యం మే విధిజనక తృప్తిం సమమతిః
న భూయా త్స్వాలాభా న్నతశరణ నిస్స్వత్వ మపి మే
త్వయి స్యా త్ప్రీక్షా మే సతత మపి నస్యా త్కృపణతా
జగన్నాథ శ్రీమ న్నభవ తవ కారుణ్యవిభవాత్. ౧౮

శ్రీమత్క్షవాటోపనామ శ్రీరామతనుజన్మనా
కృత స్సున్దరరామేణ జగన్నాథస్తవ శ్శివః.
ఆషాఢే కృష్ణనవమీతిథౌ రాక్షసవత్సరే
సప్తత్ర్యష్టైకసఙ్ఖ్యేచ శకాబ్దే భవతు శ్రియే.



శ్రీరస్తు.

# అకారాదిశ్లోకానుక్రమణిక.

## నవమాధ్యాయము.



## దశమాధ్యాయము.

## ఏకాదశాధ్యాయము.

ద్వాదశాధ్యాయము.

# శుద్ధాశుద్ధపత్రము.

| పుట. | బంతి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 3 | 17 | అనసూయవే= | అనసూయవే– |
| 5 | 24 | జ్ఞాస్తుత్య | జ్ఞానస్తుత్య |
| 10 | 27 | ధర్మాధి | ధర్మాది |
| 12 | 2 | మూలసూ | మూలసూ |
| 14 | 13 | నబ్రవ | నబ్రహ్మ |
| 17 | 16 | మత్స్వాని | మత్స్వని |
| 20 | 2 | సత్త్వాంతము | సత్త్వపంతము |
| ,, | 21 | పిండము నగ్ని | పిండమున నగ్ని |
| 22 | 5 | ఇట్లుం గూడ, | ఇట్లయినను, |
| 25 | 2 | కాదు | కాదు |
| 31 | 14 | రిక్షా జ్యా | రిక్షా జ్య |
| 43 | 14 | భూతాది | భూతాధి |
| 49 | 9 | సత్తుగల | సత్త్వగల |
| 68 | 12 | విచ్ఛితి | విచ్ఛిత్తి |
| ,, | 13 | ఆసుప్తే | ఆసుప్తే |
| 75 | 3 | రసరిక్షు | రక్షరిక్షు |
| ,, | 23 | విభకము | విభక్తము |
| 76 | 8 | నేనే. మఱియు, నేనే. | యజ్ఞః = స్మార్తకర్మ విశేష ము; అహమ్= నే నే. మఱియు, |
| 80 | 13 | తండితండ్రిని | తండ్రితండ్రిని |
| 82 | 20 | అవ్యయి మయన | అవ్యయ మయిన |
| 86 | 4 | యొడకా | యొండకా |
| 135 | 8 | మనుభవించు | ననుభవించు |
| 136 | 14 | దుష్ప్రాప | దుష్ప్రాప |
| 140 | 16 | జేవాంశా | దేవాంశా |
| 148 | 3 | ప్రవర్గణే | ప్రవర్షణే |
| 154 | 4 | బున నుసంధించి | బు ననుసంధించి |
| 155 | 8 | నిగమ న్త | నిగమా న్త |
| ,, | 27 | చే నప్య | చే నమ్య |
| 162 | 4 | నానాజిహ్వ | నాసాజిహ్వ |
| ,, | 9 | దేవర్షిత్వా | దేవర్షిత్వా |
| 166 | 21 | ఏవమ్ = పే | ఇట్టివాఁడను– పే |
| 171 | 17 | సామర్థ్యము | సామర్థ్యము |
| 175 | 16 | బోవుదానికి | బోవువానికి |
| ,, | 21 | జైత్ర్యము | జైత్ర్యము |
| 176 | 16 | బుద్ధ్యాద్య | బుద్ధ్యాద్య |
| 183 | 2 | నాగ్వత | నాగ్హత |
| 189 | 21 | భ క్త్యా | భ క్త్యా |
| 193 | 9 | వేతనే | చేతనే |
| 198 | 4 | పరోహ | సరోహ |
| 212 | 11 | విభూతయః= | విభూతీః |
| 222 | 24 | • గీని కానం గిగీయము | • చీని కానంత గిగీయము |
| 228 | 14 | నిగ్రము | నిగ్రహము |

| పుట. | బంతి. | అశుద్ధము. | శుద్ధము. |
|---|---|---|---|
| 237 | 9 | అట్టి స్త్రీలలో | అట్టి |
| ,, | 21 | వేనితో | ఎవ్వరితో |
| 243 | 21 | మాసముచే | మానముచే |
| 248 | 14 | యణాగ్స్థితః | యణాఃస్థితః |
| 252 | 6 | యద్య ర్విభూతి | యద్య ద్విభూతి |
| 256 | 15 | చెప్వును | చెప్పును |
| 268 | 17 | ఆపుఁడ | ఆప్తుఁడ |
| 269 | 5 | వాఫల్య | సాఫల్య |
| ,, | 24 | బోధనము | బోధనముచే |
| 270 | 7 | మాణ్డీరే | భాణ్డీరే |
| ,, | 23 | మాండీరము | వటవృక్షము |
| 272 | 13 | అవ్యయమ్= నిన్ను; | అవ్యయమ్= నిత్యుని; |
| 295 | 12 | వచ్చును | వచ్చునని |
| 311 | 5 | స్వన్త | స్వస్త |
| 325 | 11 | ఋర్వే; | అందఱును; |
| 330 | 10 | రాక్షకుని | రాక్షసుని |
| 331 | 2 | తు= | తుమ్= |
| 334 | 1 | ప్రతినత్తు | ప్రతిపత్తు |
| 339 | 25 | యరము | యర్థము |
| ,, | 27 | ముమాటా | ముహ్మాటా |
| 341 | 1 | పచ సము | వచ సము |
| 342 | 25 | దివ్యాప్ర | దివ్యాస్త్రి |
| 348 | 29 | అవ్యా నపి | ఆన్యా నపి |
| 349 | 27 | దగుట | దనుట |
| 362 | 18 | జగతును | జగత్తును |
| 367 | 3 | పాదావ్య | పాదవ్య |
| 368 | 4 | విచించు | వచించు |
| 375 | 12 | ప్రయా యా | ప్రియా యా |
| 387 | 21 | త్వదన్య | త్వదన్యేన |
| 388 | 3 | పునస్వం | పునస్త్వం |
| 409 | 2 | దాదిసూ | దాదస్థూ |
| 419 | 20 | అనిర్దేశత్వ | అనిర్దేశ్యత్వ |
| 421 | 25 | సకులలో | సకులో |
| 436 | 4 | సౌహృదః । | సౌహృదాః । |
| 455 | 17 | త్మత్వ ముపమా | త్మత్వము సమా |
| 457 | 15 | బులు; దుఃఖ | బులు దుఃఖ |
| 458 | 17 | భయాభగ్రుఁ | భయప్రదుఁ |
| 469 | 22 | అధిక్య | ఆధిక్య |
| 479 | 12 | తే=అట్లు; | తే=అట్టి; |
| 480 | 12 | జిజ్ఞానువు | జిజ్ఞాసువు |

# సంకేతాక్షర వివరణము.

భా. శంకరభాష్యము.

ఆ. ఆనందగిరికృత శంకరభాష్య టీక.

హ. హనుమద్విరచిత పైశాచభాష్యము.

శం. శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.

మ. మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.

శ్రీ. శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.

ప. పరమార్థప్రపా, దైవజ్ఞసూర్యపండిత ప్రణీతము.

రా. రామానుజభాష్యము.

మా. మాధ్వభాష్యము.

శ్రీ ర స్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, నవమాధ్యాయము.

యోగోపాసనశీల స్సంసారా న్ముచ్యతే క్రమే ణైవ
యామా మ్యేతీ హోక్తం తాం విద్యా మమ్బికాం వన్దే.
అభ్యాసయోగ మూచే ప్రణవోపా స్తిం చ పరమకృపయా యః
తత్ఫల మపి దేవపథం కృష్ణం వన్దే త మాత్మానమ్.

శ్రీభగవా నువాచ.—

ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే
జ్ఞానం విజ్ఞానసహితం యద్ జ్ఞాత్వా మోక్ష్యసే ఽశుభాత్. ౧

శంకరభాష్యము.—

అష్టమాధ్యాయంబునందు నాడీద్వారంబున ధారణాయోగము సగుణముగాఁ బ్రతిపాదింపఁబడినది. దానిఫలంబును అగ్న్యర్చిరాదిక్రమంబునఁ గాలాంతరమునందు బ్రహ్మప్రాప్తిలక్షణమే యనావృత్తిరూపము నిర్దేశింపఁబడినది. అందు, « ఈప్రకారంబుననే మోక్షప్రాప్తిఫలం బధిగతం బగును, వేఱువిధంబునఁ గాదు » అనునాశంకను నివర్తింపఁ గోరి శ్రీభగవంతుం డి ట్లనియె.—ఇదంతు=దీనిని, బ్రహ్మజ్ఞానమును చెప్పఁ బోవుదానిని బూర్వాధ్యాయములందుఁ జెప్పినదానిని దాని బుద్ధియందు సన్నిధీకరించి దీనిని అని చెప్పుచున్నాఁడు. తుశబ్దము విశేషనిర్ధారణార్థకము, ఈబ్రహ్మజ్ఞానమే సాక్షాన్మోక్షప్రాప్తిసాధనము, « వాసుదేవ స్సర్వ మితి, ఆత్మైవేదం సర్వమ్, ఏక మేవా ఽద్వితీయమ్ » ఇత్యాదిశ్రుతిస్మృతులవలన, ఇతరము గాదు, « అథ యే ఽన్యథా ఽతో విదు రన్యరాజాన స్తే క్షయ్యలోకా భవన్తి " * ఇత్యాదిశ్రుతులవలనఁగూడ;

* ఇఁక నెవ్వరు దీనికన్న వేఱువిధముగా నెఱుంగుదురో ఇతరులు రాజులుగాఁ గలవారు వారు నశ్వర మయినలోకము గలవా రగుచున్నారు.

తే=నీకొఱకు; గుహ్యతమమ్=గోప్యతమ మయినదానిని; ప్రవక్ష్యామి=చెప్పెదను; అనసూయవే = అసూయారహితునికొఱకు *; ఏది యది ? జ్ఞానమ్=జ్ఞానమును; దేనితోఁ గూడినదానిని ? విజ్ఞానసహితమ్=అనుభవముతోఁ గూడినదానిని; యత్ = ఏజ్ఞానమును; జ్ఞాత్వా=పొంది; మోక్ష్యసే=విడివడుదువో; అశుభాత్=సంసారబంధనమునుండి.

తా. ఏజ్ఞానమును బొందిననే సంసారబంధమునుండి విముక్తుఁడ వగుదువో అట్టి గోప్యతమ మగు సజ్ఞానమును అనుభవయుక్తముగా అసూయారహితుఁడ వగు నీకుఁ జెప్పెద నని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

కడచినయధ్యాయముచే మీఁదియధ్యాయము గతార్థము కాదని వచించుటకై కడచినవిషయము ననువదించుచున్నారు అష్ట మేత్యాదిగా. నాడీ—సుషుమ్నాఖ్యము. ధారణయనుపేరు గల యంగముతోఁ గూడినయోగము ధారణాయోగము. సగుణముగా—సర్వద్వారసంయమనాదికము గుణము, దానితోఁ గూడినట్లుగా నని యర్థము. దానిఫలముఁ జెప్పుటకొఱకు మీఁదియధ్యాయము నారంభించుట యని యాశంకించి చెప్పుచున్నారు దానిఫలంబును ఇత్యాదిగా. అగ్న్యర్చిరాదిక్రమంబున—అగ్ని అర్చి ఇత్యాదులచే నుపలక్షిత మయినక్రమవంత మగు దేవయానపథముచే నని యర్థము. జ్ఞానానంతరమే యథోక్తఫలము లభించుటవలన నీ మార్గమేల ? అని యాశంకించి చెప్పుచున్నారు కాలాంతరమునం దని. అర్చిరాదిమార్గంబుచే బ్రహ్మప్రాప్తి యనునెడ ముక్తి మార్గాయత్తం బగుటవలన "నతస్య ప్రాణా ఉత్క్రామన్తి" ఇత్యాదిశ్రుతివిరోధం బగు ననునభిప్రాయంబున శంకించుచున్నాఁడు అందు ఇత్యాదిగా. అందు—కడచినయర్థమునందు. చెప్పినయాశంకను నివర్తించుటకై యనంతరాధ్యాయము నెత్తుచున్నారు అనునాశంకను ఇత్యాదిగా. ఇంద్రియసంప్రయోగముచే నపరోక్షము గాకున్నను బూర్వోత్తరగ్రంథాలోచనచే బుద్ధియందు సన్నిహితం బగుటవలన ఇదంశబ్దముచే బ్రహ్మజ్ఞానము గ్రహింపఁబడినదని చెప్పుచున్నారు దాని బుద్ధియందు ఇత్యాదిగా. ప్రకృత మయినధ్యానముకంటె జ్ఞానము విశిష్టం బని తెలుపుచున్నది తుశబ్దం బని చెప్పుచున్నారు తుశబ్దము ఇత్యాదిగా. తుశబ్దార్థమునే స్ఫుటీకరించుచున్నారు ఈబ్రహ్మజ్ఞానమే ఇత్యాదిగా. ఆయర్థమునందు సంవాదకములుగా శ్రుతిస్మృతులం జూపుచున్నారు వాసుదేవ ఇత్యా

* తే అనుదానికి విశేషణము.

దిగా. అద్వైతజ్ఞానమువలె ద్వైతజ్ఞానముగూడఁ గొందఱకు మోక్షహేతు వని యాశంకించి చెప్పుచున్నారు ఇతరము గాదు అని. ద్వైతజ్ఞానము మోక్షమునకు సమర్థము గా దనుటకు శ్రుతి నుదాహరించుచున్నారు అ థేత్యాదిగా. అథశబ్దము నకు అవిద్యాప్రకరణోపక్రమం బర్థము. అతః—అద్వైతముకంటె, అన్యథా—భిన్న ముగా నని యర్థము. విదుః—ఎఱుంగుచున్నారో, తత్త్వము నని శేషము. ద్వైత ము దుర్నిరూపం బగుటచేఁ గల్పితం బగుటవలన తద్జ్ఞానము రజ్జుసర్పాదిజ్ఞానతుల్యం బగుటవలన క్షేమప్రాప్తికి హేతువు గా దనుట కూడ అనుశబ్దమున కర్థము. అనసూ య యనఁగా గుణములందు దోషము ప్రకటించుట, తద్రహితునికొఱకు—జ్ఞానము నం దధిక్ృతుం డైనవానికొఱ కని యర్థము. జ్ఞాన మనఁగా బ్రహ్మచైతన్యము, లేక, తద్విషయ మయినప్రమాణజ్ఞానము. అది దానిచేతనే విశేషితం బగుట యనుప పన్న మని యాశంకించి చెప్పుచున్నారు అనుభవముతో నిత్యాదిగా. విజ్ఞాన మనఁగా అనుభవము సాక్షాత్కారము, దానితోఁ గూడినదాని నని యర్థము. చెప్పినజ్ఞానము నొందినవాని కేమి యగు నని యాశంకించి చెప్పుచున్నారు ఏజ్ఞానమును ఇత్యాదిగా.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

సప్తప్రశ్ననిర్ణయానంతరం బర్జునునకు సలం దడుగకున్నను బరమార్థము నుపదేశించుటకై భగవంతుం డిట్లనియె.—ఇదమ్ = వక్ష్యమాణమును; నీకు, గుహ్యతమమ్ = రహస్యమును; ప్రవక్ష్యామి; అనసూయవే = గుణములయందు దోషావిష్కరణ మసూయ; జ్ఞానమ్=తత్త్వబోధమును; విజ్ఞానసహితమ్ = అనుభవ యుక్త మయినదానిని. యత్ జ్ఞాత్వా మోక్ష్యసే అశుభాత్.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.—

మందబుద్ధికిఁ జిత్తశుద్ధికొఱకును యోగమార్గంబున బ్రహ్మప్రాప్తికొఱకును అధ్యాత్మాదిభేదరహితమై యక్షరశబ్దవాచ్య మయినబ్రహ్మము నుపాస్యమునుగా నుపదేశించి తదుపాసకుం డగుయోగికి నర్చిరాదిమార్గంబున గమనంబును బ్రహ్మ ప్రాప్తిని అష్టమాధ్యాయంబునఁ బ్రతిపాదించి, ఇప్పుడు, ముముక్షువులు కీమార్గంబు ననే మోక్షప్రాప్తి, వేఱువిధంబునఁ గా దని సంభవించు నీయాశంకను నివర్తించుట కును, అధికారు లగుశుద్ధబుద్ధుల కిందే మోక్షసిద్ధికొఱకును, సాక్షాన్మోక్షకారణం బగు పరబ్రహ్మవిషయ మయినజ్ఞానంబును, విజ్ఞానంబును, బ్రహ్మస్వరూపంబును, పర బ్రహ్మమునకుం దనకుఁ బ్రకృతికర్తృకంబు లగుసృష్ట్యాదులయందు సాక్షిత్వము అసం గత్వము ఉదాసీనత్వము మొదలగుధర్మములను, ఉపాసనాప్రకారభేదంబులను, తనకు

మాహాత్మ్యంబును, ఇతరవిషయంబునుం బ్రతిపాదించుటకును నవమాధ్యాయం బారంభింపఁబడుచున్నది. అందు మొదట, అడుగంబడకున్నను భక్తులయెడ దయావిష్టచిత్తుం డగుటంజేసి తానే జ్ఞానమును విజ్ఞానమును దన్మాహాత్మ్యంబును బ్రతిపాదించుటకై శ్రీభగవంతుం డిట్లనియె.—"పరస్తస్మాత్తు భావో ఽన్యః" అనియు, "పురుషస్స పరః పార్థ" అనియుఁ గడచినయధ్యాయంబున నిరూపితం బగునిర్విశేషబ్రహ్మము సన్నిహితం బగుటవలనఁ దద్విషయమగుటచేతను భక్తానుగ్రహేచ్ఛావేగంబున బుద్ధ్యారూఢం బగుటచేతను ఇదమ్ అని యిదంశబ్దముచే జ్ఞానము ప్రత్యక్షంబున నిర్దేశింపఁబడినది. తుశబ్దము బ్రహ్మజ్ఞానము యమనియమాద్యక్లేశరహితం బగుటవలనను సాక్షాన్మోక్షైకసాధనం బగుటవలనను సగుణజ్ఞానముకన్న విశిష్టం బని తెలుపుచున్నది. సగుణజ్ఞానము జ్ఞాతృజ్ఞేయాదిభేదమునే సంపాదించి యనర్థమునే కలిగించుచున్నది కాని పురుషార్థము నొసంగదు, "యే ఽన్యథా ఽతో విదురన్యరాజాన స్తే క్షయ్యలోకా భవన్తి" అని బ్రహ్మమునకును దమకును భేదముఁ జూచునట్టి యవిద్వాంసులకు నీశ్వరాధీనతను జన్మాదిబంధమును శ్రుతి చెప్పుచున్నది, ఇదియో "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" అనుశ్రుతివలన బ్రహ్మప్రాప్తినే కలిగించును, అందువలన బంధకం బగు సగుణబ్రహ్మజ్ఞానమునకంటెఁ బుట్టినవెంటనె మోక్షము నొసంగునట్టి బ్రహ్మజ్ఞాన ముత్కృష్టం బని చెప్పఁబడుచున్నది యని యర్థము. తుశబ్దముచేఁ జెప్పఁబడిన యుత్కృష్టత్వమునే స్పష్టీకరించుచున్నాఁడు.—విజ్ఞానసహితమ్=విజ్ఞాన మనఁగా అపరోక్షానుభవము, "బ్రహ్మైవేదం సర్వమ్, అహం బ్రహ్మాస్మి" ఇత్యాదిశ్రుత్యుక్తరీతిచే సర్వంబును దానును బ్రత్యక్షంబున బ్రహ్మమాత్రమే యని యెఱుంగుట, కాని పాతాలమునందు సూర్యగ్రహణం బనునట్లు తటస్థాస్థము నెఱుంగుట గాదు, ఇట్టిలక్షణము గల విజ్ఞానముతోఁ గూడినట్టి; జ్ఞానమును సాక్షాన్మోక్షకారణమును; అందువలననే బ్రహ్మజ్ఞానమునకు విశేషణము చేయుచున్నాఁడు.—గుహ్యతమమ్=కాయసిద్ధి యష్టైశ్వర్యసిద్ధి మొదలగు యోగముల కాచార్యులగువారికేరహస్యములు మంత్రయంత్రౌషధములు కలవో ఆయన్నిరహస్యములకంటె నుత్కృష్టము గుహ్యతమమును, పరమరహస్యము నని యర్థము; అందువలననే యెవ్వనికిం యయోగ్యునకు దుర్గుణవంతున కొసంగరాదు, మఱేమనఁగా శుద్ధాత్మునకే యొసంగవలయునని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—అనసూయవే = పరగుణములయందు దోషావిష్కరణము అసూయ, కామక్రోధలోభమోహమాత్సర్యాదులకు నుపలక్షణము, అసూయాదిదుర్గుణము లెవ్వనికిలేవో అతం డనసూయుఁడు, అట్టిగుణవంతుఁడగుశిష్యుని

కొఱకు; తే=నీకొఱకు; ఇదం జ్ఞానమ్; ప్రవక్ష్యామి—చక్కఁగా నుపదేశించెద నని యర్థము. ఓయీ! ఈజ్ఞానము నొందినట్టి నా కేమి యగును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తీవ్రముముక్షేచ్ఛా వైరాగ్య శమదమా ద్యుత్తమసాధనసంపన్నుఁడవై నీవు నాచెప్పునట్టి యుక్తవిశేషణవిశిష్ట మయిన, యత్ = ఏబ్రహ్మాత్మైకత్వవిషయ జ్ఞానమును; జ్ఞాత్వా=పొంది; ఇందుచే నాత్మస్వరూపము నెఱిఁగినవాఁడవై, అశుభాత్=అనాద్యవిద్యాసంభావిత మయినసంసారదుఃఖప్రవాహమునుండి; మోక్ష్యసే—ముక్తుఁడవై యఖండానందైకరసబ్రహ్మస్వరూపంబున సుఖముగా నుండఁగల వని యర్థము.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

పూర్వాధ్యాయమునందు మూర్ధన్యనాడీద్వారకంబును హృదయకంఠభ్రూమధ్యధారణాసహితంబును సర్వేంద్రియద్వారసంయమగుణకంబు నగు యోగముచే స్వేచ్ఛను బ్రాణములు విడిచి యర్చిరాదిమార్గంబున బ్రహ్మలోకము నొందినవానికి నందు సమ్యగ్దర్శనోదయముచేఁ గల్పాంతంబునఁ బరబ్రహ్మప్రాప్తిలక్షణం బగు క్రమముక్తి వ్యాఖ్యాతం బయ్యెను. అచటనే యీ ప్రకారంబుననే ముక్తి లభింపవలయును వేఱువిధంబునఁ గా దని యాశంకించి « అనన్యచేతా స్సతతం యో మాం స్మరతి నిత్యశః, తస్యా హం సులభః » ఇత్యాదివచనముచే భగవత్తత్త్వవిజ్ఞానమువలన సాక్షాన్మోక్షప్రాప్తి ప్రతిపాదింపఁబడియెను. అందుకు ననన్యం బగుభక్తి యసాధారణం బగుహేతు వని చెప్పఁబడినది « పురుష స్సపరః పార్థ భక్త్యా లభ్య స్త్వ నన్యయా » అని. అందుఁ బూర్వోక్తము లగు యోగధారణాపూర్వక ప్రాణోత్క్రమణము అర్చిరాదిమార్గగమనము కాలవిలంబము మొదలగుక్లేశము లేకయే సాక్షాన్మోక్షప్రాప్తికొఱకు భగవత్తత్త్వంబును దద్భక్తిని విస్తరంబున బోధించుటకై నవమాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అష్టమంబున ధ్యేయబ్రహ్మము నిరూపించి తద్ధ్యాననిష్ఠునకు గతి చెప్పఁబడినది. నవమమునందో జ్ఞేయబ్రహ్మము నిరూపించి జ్ఞాననిష్ఠునకు గతి చెప్పఁబడుచున్న దని సంక్షేపము. అందు వక్ష్యమాణజ్ఞానస్తుత్యర్థము మూఁడుశ్లోకములను శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁడు.—ఇదమ్ = మున్ను బహువిధంబులఁ జెప్పినదానిని ముందును జెప్పఁబోవుదానిని ఇప్పుడు చెప్పుచున్న దానిని; జ్ఞానమ్=శబ్దప్రమాణకము బ్రహ్మతత్త్వవిషయక మగుజ్ఞానమును; తే=నీకొఱకు; ప్రవక్ష్యామి=చెప్పెదను. తుశబ్దము పూర్వాధ్యాయోక్తమగు ధ్యానమునకంటె జ్ఞానమునకు వైలక్షణ్యముఁ జెప్పుచున్నది.—ఈసమ్యక్జ్ఞానమే సాక్షాన్మోక్షప్రాప్తి

సాధనము, కాని ధ్యానము గాదు అది యజ్ఞానము నివర్తింపఁజాలనిది యగుటవలన, అప్పుడో అంతఃకరణశుద్ధిద్వారమున నీజ్ఞానమునే కలిగించి క్రమంబున మోక్షము నొందించుచున్న దని చెప్పఁబడినది. ఎట్టి జ్ఞానమును? గుహ్యతమమ్=గోపనీయత మమును * అతిరహస్యం బగుటవలన; ఎందువలన ననఁగా, విజ్ఞానసహితమ్=బ్రహ్మాను భవపర్యంతమును; ఇట్టి యతిరహస్యమును గూడ నేను శిష్యగుణంబులు నీయం దధికముగా నుండుటవలనఁ జెప్పెదను నీకు, అనసూయవే=అసూయ యనఁగా గుణం బులయందు దోషదృష్టి, దోషావిష్కరణాది హేతువు, ఎల్లప్పుడు వీఁడు తనయైశ్వర్య మును బ్రకటించి తన్నుఁ బొగడుకొనుచున్నాఁడు నాయెదుట—అనునట్టిది, అది లేని వానికొఱకు; ఇందుచే ఆర్జవసంయమములు గూడ శిష్యగుణములు ప్రతిపాదింపఁ బడినవి. మఱియు నెట్టిజ్ఞానమును? యత్=దేనిని; జ్ఞాత్వా = పొంది; మోక్ష్యసే; అప్పుడే సంసారబంధమునుండి, అశుభాత్ = సర్వదుఃఖహేతు వయినదానినుండి.

శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.—

శుద్ధభక్తిచేతఁ బరమేశుండు ప్రాప్యుఁ
డనుచు వచియింపఁబడియెను సప్తమంబు
నందు నవమంబునం గడు నద్భుతంబు
పరుసైశ్వర్యము వచింపఁబడెడు నింక.

ఇట్లు సప్తమాష్టమాధ్యాయములయందు స్వీయను పారమేశ్వర మగు తత్త్వము భక్తిచేతనే సులభము వేఱువిధంబునం గా దని ప్రతిపాదించి, ఇప్పుడు అచింత్య మగు స్వకీయ మయినయైశ్వర్యంబును నసాధారణం బగు భక్తిప్రభావం బును బ్రపంచింపఁబోవువాఁడై శ్రీభగవంతుం డిట్లనియె.—విశేషంబున జ్ఞాయతే—తెలియఁబడుచున్నది కావున విజ్ఞాన మనఁగా నుపాసనము దానితోఁ గూడినట్టి, జ్ఞానమ్=ఈశ్వరవిషయ మగుజ్ఞానమును; ఇదంతు; అనసూయవే=పలుమాఱు తనమా హాత్మ్యమునే యుపదేశించుచున్నాఁ డని పరమకారుణికుండ నగు నాయందు దోష దృష్టి లేనట్టి; తే=నీకొఱకు; ప్రవక్ష్యామి. తుశబ్దము వైశిష్ట్యార్థకము. దానినే చెప్పుచున్నాఁడు.—గుహ్యతమమ్—గుహ్యము ధర్మజ్ఞానము, దానికంటె దేహాదివ్యతి రిక్తాత్మజ్ఞానము గుహ్యతరము, దానికన్నను గూడఁ బరమాత్మజ్ఞాన మతిరహస్య మగుటవలన గుహ్యతమము. యత్ జ్ఞాత్వా; అశుభాత్ = సంసారమునుండి; మో క్ష్యసే=వెంటనే ముక్తుఁడవు కాఁగలవో.

---

* మిక్కిలి రక్షింపఁదగినదానిని.

పరమార్థప్రపా, దైవజ్ఞసూర్యపండిత ప్రణీతము.—

ఇట్లు పూర్వాధ్యాయమునందు « భూతగ్రామ స్స ఏవా ఽయమ్ » ఇత్యాదివాక్యములచే దృశ్యప్రపంచమునకు నశ్వరత్వగర్భిత మయిన మిథ్యాత్వముఁ బ్రదర్శించి యిప్పుడు దానినే యుపపత్తిచే దృఢీకరించుటకును, యోగవైభవముచేఁ దనసత్యత్వమును బ్రదర్శించుటకును నవమాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట వక్ష్యమాణవిషయం బతిరహస్య మగుటచే దుర్లభం బని చెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—కృపచేఁ జెప్పఁబూనిననాయందు, అనసూయవే=దేహధారిత్వాదిదోషదృష్టి లేనట్టి; తే=నీ కొఱకు; విజ్ఞానసహితం జ్ఞానం ప్రవక్ష్యామి. జ్ఞానము శాస్త్రాచార్యులచే నుపదేశింపఁబడినది. విజ్ఞానము అనుభవరూపము. గుహ్యతమమ్—ప్రకటింపఁగూడనివిషయ మయినదానిని; స్వధర్మాచరణాదికము గుహ్యము, దానికన్నను దేహాదివ్యతిరిక్తాత్మస్వరూపము గుహ్యతరము, దానికన్నను బరమాత్మసాక్షాద్దర్శనము గుహ్యతమము. దానినే చెప్పుచున్నాఁడు.—యత్ జ్ఞాత్వా; అశుభాత్=దుఃఖప్రద మయినప్రపంచమునుండి; మోక్ష్యసే—పరమాత్మప్రతీతి కలుగుటచేఁ బ్రపంచాతీతుఁడవు కాఁగలవో.

రామానుజభాష్యము.—

ఉపాసకభేదముచేఁ గలుగువిశేషములు ప్రతిపాదింపఁబడినవి. ఇప్పు డుపాస్యుం డగుపరమపురుషునిమాహాత్మ్యంబును జ్ఞానులవిశేషంబును విభజించి భక్తిరూపం బగు నుపాసనముయొక్క-స్వరూపము చెప్పఁబడుచున్నది. ఇదం తు తే గుహ్యతమమ్, జ్ఞానమ్=భక్తిరూపమయినయుపాసనమును; విజ్ఞానసహితమ్=ఉపాసనగతవిశేషజ్ఞానముతోఁ గూడినదానిని; అనసూయవే తే ప్రవక్ష్యామి—సకలేతరవిజాతీయంబును అపరిమితప్రకారంబు నగు మద్విషయమాహాత్మ్యమును ఇది యిట్లే యుపపన్న మని తలంచునట్టి నీ కుపదేశించెద నని యర్థము. యత్=ఏజ్ఞానమును; అనుష్ఠానపర్యంతము, జ్ఞాత్వా; అశుభాత్ = మత్ప్రాప్తికివిరోధి యయినట్టి యెల్లయశుభమునుండి; మోక్ష్యసే.

మాధ్వభాష్యము —

సప్తమాధ్యాయంబునఁ జెప్పినదాని స్పష్టీకరించుచున్నాఁ డీయధ్యాయమునందు.

రాజవిద్యా రాజగుహ్యం పవిత్ర మిద ముత్తమమ్
ప్రత్యక్షావగమం ధర్మ్యం సుసుఖం కర్తు మవ్యయమ్. ౨

భా. అదియును.—రాజవిద్యా= విద్యలకురాజు, ప్రకాశాతిశయము వలన, ప్రకాశించుచున్నది గదా ఈబ్రహ్మవిద్య యతిశయంబున సర్వ విద్యలలోను. అట్లు, రాజగుహ్యామ్ = గుహ్యములకురాజు. పవిత్రమ్= పావనము; ఇదమ్=ఇది; ఉత్తమమ్=ఉత్తమము, సమస్తపావనములలోను ఈబ్రహ్మజ్ఞాన ముత్కృష్టతమ మైనశుద్ధికారణము, అనేకజన్మసహస్రసంచిత మును గూడ ధర్మాధర్మాదికర్మమును సమూలముగా క్షణమాత్రను భస్మీకరించునది కావున దానిపావనత్వము చెప్పెడి దేమి? మఱి యును.—ప్రత్యక్షావగమమ్ = ప్రత్యక్షంబున సుఖాదికమునకుంబోలె అవ గమము దేనికో అట్టిది. పెక్కుగుణములు గలదైనను ధర్మవిరుద్ధ మగు టం జూచుచున్నారము, అట్లు ధర్మవిరోధి కా దాత్మజ్ఞానము, మఱే మనఁగా, ధర్మ్యమ్=ధర్మమునుండి తొలఁగనిది. ఇట్టిదైనను దుఃఖము చే సంపాదింపఁ దగినది కావచ్చును, అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—కర్తుమ్= చేయుటకు; సుసుఖమ్=మిక్కిలిసుఖము, రత్నవివేకజ్ఞానమువలె. అందు, అల్పాయాసములై సుఖసంపాద్యము లగుకర్మముల కల్పఫలత్వంబును దుష్కరంబు లగువానికి మహాఫలత్వంబును గానవచ్చుచున్నది, కావున నిదియు సుఖసంపాద్యం బగుటవలన ఫలక్షయమువలన నశించునని ప్రాప్తించుచున్నది, కావునఁ జెప్పుచున్నాఁడు.—అవ్యయమ్ = దీనికి ఫలము వలన కర్మమునకువలె వ్యయము లేదు కావున అవ్యయము. అందువలన శ్రద్ధేయం బాత్మజ్ఞానము.

ఈబ్రహ్మజ్ఞానము విద్యలకెల్లరాజు, గుహ్యములకెల్ల రాజు, పవిత్రముల లో నెల్ల నుత్తమము, ప్రత్యక్ష మయినఫలము గలది, ధర్మము దప్పనిది, సుఖముగా సాధింపఁ దగినది, నాశము లేనిది యని తాత్పర్యము.

ఆ. దానియందభిముఖత సిద్ధించుటకై యాజ్ఞానమును స్తుతించుచున్నారు అదియును అని. బ్రహ్మవిద్య విద్యలకురాజు—శ్రేష్ఠము అనుటకు హేతువుఁ జెప్పు చున్నారు ప్రకాశేత్యాదిగా. ఎందువలన బ్రహ్మవిద్యకు విద్యాంతరములకంటెఁ బ్రకాశాతిశయం బనఁగా దానిఁ జెప్పుచున్నారు ప్రకాశించుచున్నది ఇత్యాదిగా. కనఁబడుచున్నది గదా యితరవిద్వాంసులకంటె లోకమున బ్రహ్మవిదులకుఁ బూజాతి శయం బని భావము. ఉత్కృష్టతమ మగుశుద్ధికారణము బ్రహ్మజ్ఞానం బనుసీయంశ

ము నుపపాదించుచున్నారు అనే కేత్యాదిగా. ఇట శ్రుతిస్మృతులను బ్రమాణీకరింపవలయును. శాస్త్రమాత్రముననే తెలియందగినది కాదీజ్ఞానము, మ ఱే మనఁగా బ్రత్యక్షప్రమేయం బని చెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. ప్రత్యక్షము అవగమము—ప్రమాణము దీనియందు కావున బ్రత్యక్షావగమము, లేక, అవగమింపఁబడుచున్నది కావున అవగమ మనఁగా ఫలము, ప్రత్యక్ష మయినయవగమము—ఫలము గలది, ఇందుచే జ్ఞానమునకు దృష్టఫలత్వము చెప్పఁబడుచున్నది. ధర్మ్యపదమును వివరించుచున్నారు ధర్మమునుండి తొలఁగనిది యని. ధర్మమువలె నదియుఁ గ్లేశసాధ్యం బని యాశంకించి చెప్పుచున్నారు ఇట్టి దైనను ఇత్యాదిగా. రత్నవిషయ మయినవివేకజ్ఞానము ఉపదేశాపేక్ష మయిన యింద్రియసంప్రయోగమువలన అనాయాసంబునఁ గలుగుట దృష్టము, అట్లు ఈబ్రహ్మజ్ఞానం బని చెప్పుచున్నారు ర త్నే త్యాదిగా. అవ్యయ మ్మనువిశేషణము నాశంకాపూర్వకముగా వివరించుచున్నారు అందు ఇత్యాదిగా. అందు—వ్యవహారభూమియందు. జ్ఞానం బక్షయఫలం బని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా.

హ. రాజవిద్యా = విద్యలకు రా జీబ్రహ్మవిద్య. రాజగుహ్యామ్, వివస్వంతుఁడు మొదలగురాజులచే రక్షితం బగుటవలన. పవిత్రమ్=పావనము. ప్రత్యక్షావగమమ్=స్వానుభవము. ధర్మ్యమ్=ధర్మమునుండి తప్పనిది. సుసుఖమ్ = సుఖంబున ననుష్ఠేయము. అవ్యయమ్=అవినాశి.

శం. చెప్పినజ్ఞానమునే గ్రహింప నిచ్ఛ కలుగుటకై దాని మాహాత్మ్యమును బ్రతిపాదించుచున్నాఁడు.—రాజవిద్యా=విద్యలు—జ్ఞానములు సకలవేదశాస్త్రాధ్యయనముచేఁ గలుగునవి యిహలోకపరలోకసాధనములు ఏవి గలవో అవి యన్నియుఁ బురుషునకు సంసారమును వృద్ధిఁ బొందించునవియే కాని నివర్తించునవి కావు, బ్రహ్మవిద్యయో తానుబుట్టినమాత్రముననే విద్వాంసుని బ్రహ్మభావము నొందించి సకారణ మగుసంసారమును నిశ్శేషముగా నివర్తించుచున్నది, ఎట్లు ప్రబోధము స్వప్నమునందలిసంసారమును తద్దుఃఖమును నివర్తించునో అట్లు, అందువలన సర్వవిద్యలకును రాజు—శ్రేష్ఠ మగుచున్నది, కావునఁ జెప్పఁబడుచున్నది రాజవిద్య యని. లేక. సర్వవిద్యలును శాస్త్రజన్యములు మిక్కిలి యహంకారమును వృద్ధినొందించి యాత్మతత్త్వమును మఱుఁగుపఱచుచున్నవి, ఇదియో "స ఆత్మా తత్త్వమసి" అనువాక్యమును విన్నమాత్రమునఁ బుట్టినదై యనాత్మయం దహంకారమును నశిం

కంజేసి సర్వసంసారధర్మనిర్ముక్త మయినయాత్మతత్త్వమును రాజయతి-ప్రకాశింపఁజేయుచున్నది కావున రాట్టు, రాజ్ఞి యగువిద్య రాజవిద్య. రాజగుహ్యమ్ = గుహ్యములు-దాఁచఁదగినవి మంత్రయంత్రదివ్యౌషధాదులు, లేక, అమూల్యము లగు రత్నాదిపదార్థములు, వానికన్నిటికిని రాజు అతిరహస్యంబై గోపనీయం బగుట వలన, కావున రాజగుహ్యము. లేక రాజువలె రక్షింపఁదగిన దగుటవలన రాజ గుహ్యము. మఱియును. పవిత్రమ్ = పునాతి-పరిశుద్ధము చేయుచున్నది కావున పవిత్రము, అందును ఈబ్రహ్మజ్ఞానము, ఉత్తమమ్=అనుత్తమ మయినపవిత్రము, సూర్యానలానిలాదిదేవతలును ఋగాదివేదములును గంగాదినదులును సర్వప్రాయశ్చిత్తంబులును భజించువారికి నరకదుఃఖకారణ మయినపాపమునే నశింపఁజేయుచున్నారు, అందును తాత్కాలిక మయినపాపమునే, కాని పుణ్యమును నశింపఁజేయరు, ఈ బ్రహ్మజ్ఞానమో «తదా విద్వాన్పుణ్యపాపే విధూయ" అనుశ్రుతివలన శతకోటి బ్రహ్మకల్పార్జిత మయినపాపరాశిని బుణ్యరాశిని గూడ బహుజన్మమరణాదిదుఃఖ ప్రవాహకారణమును దూదిరాసులను అగ్నివలె అంధకారపటలమును సూర్యుఁడువలె సమూలముగా నిర్మూలించి బ్రహ్మవిదుని నిష్కల్మషునింగాఁ జేయుచున్నది, అందువలన బ్రహ్మజ్ఞానమే బ్రహ్మవిష్ణుశివాదులకును సూర్యాదులకును పావకం బగుటవలన ఉత్కృష్టతమ మయినపవిత్రము, శుద్ధికర మయినవస్తు వని యర్థము. ఈజ్ఞానమాహాత్మ్యము శాస్త్రముచేతనే తెలియఁ దగినదా? ప్రమాణాంతరముచేఁ దెలియఁ దగినదా? లేక, కాలాంతరమునఁ దెలియఁదగినదా? అని యాకాంక్షింపఁగా, సూర్యుఁడు గాఢాంధకారమును తత్కార్యముతోఁ గూడ నశింపఁజేయుట యెట్లు శాస్త్రముచే మాత్రమే తెలియఁదగినది కాదో, మ తేమనఁగా ప్రత్యక్షమునఁ గూడ దెలియఁ దగినదో, అట్లు జ్ఞానముయొక్కమాహాత్మ్యముగూడ నని చెప్పుచున్నాఁడు.— ప్రత్యక్షావగమమ్=అవగమ్యతే— తెలియఁబడుచున్నది దీనిచేత కావున అవగమ మనఁగా ప్రమాణము, ప్రత్యక్షము అవగమము-ప్రమాణము దేనికో అది ప్రత్యక్షావగమము, జ్ఞానమాహాత్మ్యము విద్వాంసునకుఁ బ్రత్యక్ష మాని యర్థము. లేక. అవగమ్యతే-అనుభవింపఁబడుచున్నది కావున అవగమ మనఁగా ఫలము, ప్రత్యక్ష మయిన అవగమము-ఫలము దేనికో అది ప్రత్యక్షావగమము, భోజనాదులయందువలె జ్ఞానఫలము తత్క్షణమే ప్రత్యక్షము, కాని ధర్మాదిఫలమువలెఁ బరోక్షము కా దని యర్థము. ధర్మ్యమ్ = ముముక్షువునకు ధర్మమువలెఁ దగినది కావున ధర్మ్యము, వర్ణాశ్రమలక్షణ తమలతమధర్మములకు ననుకూలమే జ్ఞానము కాని ధర్మవిరోధి కా దని

యర్థము. గృహస్థునకు జయనసర్వతోముఖాదిక్రతువు ధర్మ్యమే యయినను అతి శ్రమసాధ్యము, అట్టిది కాదు జ్ఞాన మని చెప్పుచున్నాఁడు.—కర్తుం సుసుఖమ్=సు—మిక్కిలి—దేహేంద్రియాదులకు శ్రమము లేకయే తత్త్వజ్ఞానిప్రసాదమువలన రత్నాది జ్ఞానమువలె బ్రహ్మజ్ఞానము గూడ బుద్ధియందు ఆరూఢముగాఁ జేయుటకు సుఖము—అనాయాసమ, శుద్ధాత్ములకు సులభముగా సంపాదింప శక్య మని యర్థము. ఓయీ! కటికెండపాయనము ♦ వలె జ్ఞానము అల్పక్రియాసాధ్య మగునేని తత్ఫలము గూడ అల్పమే యగును; క్రియ యధిక మయినచో ఫలం బధిక మనుటయుఁ క్రియ యల్పం బయినచో ఫలము గూడ నల్పమే యనుటయు సర్వప్రసిద్ధము అని యాశంకింతువేని అట్లు కాదు, చంద్రదర్శనక్రియ యల్ప మైనను అది చేయువానికి దానివలన ఆహ్లాదసుఖము మహాఫలము కానఁబడుటవలన. అట్లు జ్ఞానం బల్పక్రియాసాధ్యమయినను ఫలము గొప్పది కల దని చెప్పుచున్నాఁడు.—అవ్యయమ్=ఫలముచే నవ్యేతి—నశింపదు కావున అవ్యయము, అవ్యయ మయిన ఫలముగలది, "న హ్యధ్రువైః ప్రాప్యతే హి ధ్రువం తత్" * అని జ్ఞానప్రాప్యమయిన వస్తువు ధ్రువం బని శ్రుతి చెప్పుటవలన జ్ఞానం బశ్రమసాధ్యమయినను నిత్యఫలజనకం బని యర్థము. లేక, జ్ఞానము మోక్షసాధనమనుటయందు బాధకప్రమాణము లేమివలన, అవ్యయము.

వ. వెండియు దానియం దాభిముఖ్యము గలుగుటకై యాజ్ఞానమును స్తుతించుచున్నాఁడు.——రాజవిద్యా = సర్వవిద్యలకును రాజు, సమస్తమయిన యవిద్యను నశింపఁజేయున దగుటవలన, ఇతరవిద్య యవిద్యలో నేకదేశమును మాత్రమె విరోధించునది యగుటవలన. అట్లు, రాజగుహ్యమ్ = సర్వగుహ్యములకును రాజు, అనేకజన్మకృతసుకృతసాధ్యం బగుటచేఁ బెక్కండ్రకుఁ దెలియనిది యగుటవలన. రాజదంతాది యగుటవలన నుపసర్జనమునకుఁ బరనిపాతము §. పవిత్ర మిద ముత్తమమ్—ప్రాయశ్చిత్తములచే నొకానొకపాప మొక్కటియే నివర్తింపఁబడునుగదా! నివృత్తమయ్యును అది స్వకారణమునందు సూక్ష్మరూపంబున నుండనే యున్నది,

---

♦ మొలగోకుట.

* అధ్రువములచే—అస్థిరములచే ధ్రువము—స్థిర మగునది పొందఁబడదు గదా!

§ దంతములకు రాజు రాజదంత మనునట్లు విద్యలకు రాజు గుహ్యములకు రాజు అనునో నుపసర్జన మయిన విద్యాగుహ్యశబ్దములు రాజశబ్దమునకు ముందు ప్రయోగింపఁబడవలసినవి వెనుకఁ బ్రయోగింపఁ బడినవి.

అందువలననే వెండియు నాపాపము చేయుచున్నాఁడు పురుషుఁడు, ఇదియో అనేక జన్మసహస్రసంచితము లయిన స్థూలసూక్ష్మాపస్తంబు లగుసమస్తపాపంబులను తత్కారణ మగు నజ్ఞానంబును తత్క్షణంబుననే ఛేదించునది, కావున సర్వోత్తమం బగుపావన మిదియే. మఱియు, అతీంద్రియం బగుధర్మమునందుంబోలె నిట నెవ్వనికిని సందేహములేదు స్వరూపంబునను ఫలమునను బ్రత్యక్ష మగుటవలన నని చెప్పుచున్నాఁడు— ప్రత్యక్షావగమమ్ = అవగమ్యతే—ఎఱుంగఁబడుచున్నది దీనిచేతఁ గావున అవగమ మనఁగా ప్రమాణము, అవగమ్యతే—పొందఁబడుచున్నది కావున అవగమ మనఁగా ఫలము, ప్రత్యక్షము అవగమము—ప్రమాణముగాఁ గలది, కావున స్వరూపంబున సాక్షిప్రత్యక్షము, ప్రత్యక్ష మయిన అవగమము—ఫలము గలది కావున ఫలంబున సాక్షిప్రత్యక్షము. నాచే నిది యెఱుంగఁబడినది కావున నిక్కము దీనియందలి నాయజ్ఞానము నశించినది యని గదా సార్వలౌకిక మగుసాక్ష్యనుభవము. ఇట్లు లోకానుభవసిద్ధ మయినను ఆత్మజ్ఞానము, ధర్మ్యమ్ = ధర్మమునుండి తొలంగనిది, అనేక జన్మసంచిత మగున నిష్కామధర్మముయొక్క ఫలము. అట్లయినచో పొంద నశక్య మనఁగా కాదని చెప్పుచున్నాఁడు.—సుసుఖం కర్తుమ్=గురువుచే ప్రదర్శిత మగువిచారముతోఁ గూడినవేదాంతవాక్యముచే సుఖమున చేయశక్య మయినది, దేశకాలాది వ్యవధానము నపేక్షింపదు, జ్ఞానము ప్రమాణవస్తుపరతంత్ర మగుటవలన. ఇట్లనాయాససాధ్య మయినచో దానిఫలము స్వల్పం బగును, అత్యాయాససాధ్యంబు లగుకర్మములకే మహాఫలత్వము కనఁబడుటవలన, అనఁగా కాదని చెప్పుచున్నాఁడు —అవ్యయమ్—ఇట్లనాయాససాధ్య మయినను దీనికి ఫలముచే వ్యయము లేదు కావున అవ్యయము—అక్షయఫలం బని యర్థము. కర్మములు మిక్కిలి గొప్పవైనను అవి క్షయిఫలంబులే యగును, "యో వా ఏతదక్షరం గార్గ్యవిదిత్వాఽస్మిఁల్లోకే జుహోతి యజతే తప స్తప్యతే బహూని వర్షసహస్రాణ్యన్తవ దేవాఽస్య తద్భవతి" అనుశ్రుతివలన. అట్లు సర్వోత్కృష్టం బగుటవలన ఆత్మజ్ఞానము శ్రద్ధేయమే యగును.

శ్రీ॰ మఱియును.—ఇదమ్ = ఈజ్ఞానము; రాజవిద్యా = విద్యలకు రాజు; రాజగుహ్యమ్ = గుహ్యములకు రాజు; విద్యలయందును గోప్యములయందును అతి శ్రేష్ఠం బని యర్థము. రాజదంతాది యగుటవలన నుపసర్జనము నకుఁ బరత్వము. ఉత్తమం పవిత్ర మిదమ్=అత్యంతపావనం బిది. ప్రత్యక్షావగమమ్ = స్పష్ట మయిన ఫలము గలది. ధర్మ్యమ్=ధర్మమునుండి తప్పనిది, సర్వధర్మఫలం బగుటవలన, కర్తుం

సుసుఖమ్—సుఖముగ సంపాదింప శక్యమని యర్థము. అవ్యయమ్, అక్షయఫలం బగుటవలన.

ప. ఇఁకఁ బ్రతిపాద్యం బగువిషయము దుర్లభం బనియుఁ దారకం బనియుఁ జెప్పుచున్నాఁడు.—విద్యలకు—అధ్యాత్మవిద్యలకు రాజు, అట్లు గుహ్యాము లయినయర్థములకు రాజు, అతిశ్రేష్ఠం బని యర్థము; పవిత్రమ్ = శోధకము; ఉత్తమమ్=ఉత్కృష్టతమము ఆత్మప్రాప్తియం దంతరంగ కారణము; ప్రత్యక్షావగమమ్= ప్రత్యక్షంబున తెలియుటకు యోగ్యము; ధర్మ్యమ్=ధర్మమునుండి తొలఁగనిది, సర్వ ధర్మఫలం బగుటవలన; కర్తుమ్ = అనుష్ఠించుటకు; సుసుఖమ్ = మిక్కిలిసుఖంబున శక్యము, కాని కాయద్రవ్యక్లేశము కలిగించునది కాదు; అవ్యయమ్, అక్షయఫలం బగుటవలన.

రా. రాజవిద్యా=విద్యలకురాజు. రాజగుహ్యమ్ = గుహ్యములకు రాజు. లేక, రాజులయొక్క విద్య రాజవిద్య, విశాల మయి గంభీర మయినమనస్సు గలవారు గదా రాజులు, అట్టి గొప్పమనస్సు గలవారి కీవిద్య యని యర్థము. గొప్పమనస్సు గలవారలే దాఁచఁ దగినదాని దాఁచుటయందు సమర్థులు, కావున వారలకే గుహ్యం బిది. ఉత్తమం పవిత్రమ్=మత్ప్రాప్తికి విరోధియైన యశేషకల్మషంబులఁ బోఁగొట్టునది. ప్రత్యక్షావగమమ్=అవగమ్యతే— తెలియఁబడుచున్నది కావున అవగము మనఁగా విషయము, ప్రత్యక్షభూతము అవగమము—విషయము విజ్ఞానమునకో అది ప్రత్యక్షావగమము, భక్తిరూపం బగునుపాసనముచే నుపాసింపఁబడుచున్న నేను అప్పుడే యుపాసించువానికిఁ బ్రత్యక్షం బగుదు నని యర్థము. మఱియును. ధర్మ్యమ్=ధర్మమునుండి తొలఁగనిది, నిశ్శ్రేయససాధనత్వము గదా ధర్మత్వము, స్వరూపంబుననే అత్యంతప్రియం బగుటచే నప్పుడే మద్దర్శనము కలిగించునది యగుటం జేసి తానే నిశ్శ్రేయసరూపమైనను నిరతిశయనిశ్శ్రేయసరూప మగునాత్యంతికమత్ప్రాప్తికి సాధన మని యర్థము. అందువలననే, సుసుఖం కర్తుమ్=మిక్కిలిసుఖ మయిన గ్రహణము గలది, అత్యంతప్రియంబుగా గ్రహింపఁదగినది. అవ్యయమ్ = అక్షయము, మత్ప్రాప్తిని సాధించియును దాను క్షయింపదు. ఇట్టియుపాసనముఁ జేయువానికి నన్నే యిచ్చినను వీని కేమియు నేనుఁ జేయనైతి నని నాకుఁ దోఁచు నని యర్థము.

మా. రాజవిద్యా = ప్రధానవిద్య. ప్రత్యక్ష మగుబ్రహ్మము అవగమింపఁ బడుచున్నది దేనిచేతనో అది ప్రత్యక్షావగమము. అక్షములయందు—ఇంద్రియముల

యందు ప్రతి—ఒక్కొకదానియందును ఉన్నవాఁడు కావునఁ బ్రత్యక్షుఁడు పరమాత్మ. ఇట్లు శ్రుతి.—«యః ప్రాణే తిష్ఠ న్ప్రాణా దన్తరో యం ప్రాణో న వేద యస్య ప్రాణ శ్శరీరం యః ప్రాణమన్తరో యమయ త్యేష త ఆత్మాఽన్తర్యా మ్యమృతః। యో వాచి తిష్ఠన్ ..... యశ్చక్షుషి తిష్ఠన్" ఇత్యాదికము. "య ఏషోఽన్తరక్షిణి పురుషో దృశ్యతే" అనియును. «అఙ్గుష్ఠమాత్రః పురుషోఽఙ్గుష్ఠం చ సమాశ్రితః» అనియును. «త్వం మన స్త్వం చన్ద్రమా స్త్వం చక్షురాదిత్యః» ఇత్యాదికములవలనను మోక్షధర్మమునందు. «స ప్రత్యక్షః ప్రతి ఇతి హి సోఽన్వేష్టవ్యో భవతి యః ఏవం విద్వాన్ ప్రత్యక్షం వేద" అని సామవేదంబున భాల్లవిశాఖయందు. ధర్మమనఁగా భగవంతుఁడు, తద్విషయము ధర్మ్యము. సమస్త జగత్తును ధర్తే—ధరించుచున్నాఁడు కావున ధర్మము. «పృథివీ ధర్మమూర్ధని" అని మోక్షధర్మమునందు ప్రయోగమువలనను. «భారభృత్కథితో యోగీ» అనియును. «భర్తా సన్ ధ్రియమాణో బిభర్తి» అనియును శ్రుతి. «ధర్మో వా ఇదమగ్ర ఆసీన్న పృథివీ న వాయు ర్నాకాశో న బ్రహ్మా న రుద్రో న ఋషయః సోఽధ్యాయత్» అనియును సామవేద శాఖయందు.

అశ్రద్దధానాః పురుషా ధర్మస్యాఽస్య పరన్తప
అప్రాప్య మాం నివర్తన్తే మృత్యుసంసారవర్త్మని. 3

భా. ఎవ్వరు మఱి.—అస్య ధర్మస్య = ఆత్మజ్ఞానరూపమైన యీ ధర్మముయొక్క, అశ్రద్దధానాః = శ్రద్ధ లేనివారలు, ధర్మముయొక్క స్వరూపమునందును ఫలమునందును నాస్తికులు, పాపకారులు, అసురుల యుపనిషత్తను * దేహమాత్రాత్మదర్శనమునే పొందినట్టి యసుతృప్తులు †; పురుషాః = పురుషులు గలరో వారు; పరన్తప = శత్రువులఁ దపింపఁ జేయునట్టి యర్జునుఁడా! మామ్ = నన్ను పరమేశ్వరుని; అప్రాప్య = పొందక, మత్ప్రాప్తియందు ఆశంకయే లేదు కావున మత్ప్రాప్తిమార్గమునకు సాధనవిశేషమయినభక్తిమాత్రమును గూడ పొందక యని యర్థము; నివర్తన్తే = నిశ్చయముగ వర్తించుచున్నారు. ఎందు? మృత్యుసంసారవర్త్మని = మృత్యుయుక్తమయినసంసారము మృత్యు

* సిద్ధాంతమును.

† ప్రాణములనే తృప్తిఁ బొందించువారు.

సంసారము, దానియొక్క-వర్త్మము— నరకతిర్యగాదియోనులం బొందు మార్గము, దానియందే; వర్తించుచున్నా రని యర్థము.

ఈధర్మమునందు శ్రద్ధ లేని నాస్తికులు దేహమాత్రపోషణపరు లగుపురుషులు నన్నుం బొందకుండుట యట్లుండఁగా మత్ప్రాప్తికి సాధన మయినభక్తిని గూడఁ బొందక మరణయుక్త మయినసంసారమార్గమునందే పడియుందు రని తా.

ఆ. ఆత్మజ్ఞానాఖ్యం బగుధర్మమునందు శ్రద్ధావంతులై తన్నిష్ఠు లగు పురుషులకు పరమపదప్రాప్తిం బ్రతిపాదించి తద్విముఖు లగువారికి సంసారప్రాప్తిని బ్రతిపాదించుచున్నారు ఎవ్వరు మఱి అని. ఆత్మజ్ఞానతత్ఫలములయందు నాస్తికు లగువారికే విశేషణము చేయుచున్నారు పా పేత్యాదిగా. ఈచెప్పఁబడిన యుదరంభరులకు భగవత్ప్రాప్తిసంభావనయే లేక పోవుటవలన అప్రాప్యమామ్ అనుచో అప్రసక్తప్రతిషేధము * సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు మత్ప్రాప్తి యందు ఇత్యాదిగా.

హ. అశ్రద్దధానాః = శ్రద్ధ లేనివారు; అస్యధర్మస్య—జ్ఞానలక్షణ మయిన ధర్మము ననుష్ఠించుటయందు శ్రద్ధ లేనివా రని సంబంధము; మామ్=నన్ను పరమాత్మను; అప్రాప్య, నివర్తన్తే=మరలివచ్చుచున్నారు; మృత్యుసంసారవర్త్మని=మృత్యుయుక్త మయినసంసార మనుమార్గమునందు.

శం. ఇట్లు జ్ఞానం బనాయాససాధ్యం బనియు నవ్యయఫలజనకం బనియుఁ బ్రతిపాదించి నిశ్శేషసంసారదుఃఖాంధకారవిధ్వంసకారణ మయినజ్ఞానము సూర్యుని వలె నప్రయాసలభ్యమై యున్నను అంధులవలె నశ్రద్ధచే ముక్తిమార్గంబు విడిచి కామనాపరులై కర్మోపాసనాదికమునందుఁ బ్రవర్తించునట్టి పురుషులం జూచి యాక్రోశించువాఁడువోలెఁ గరుణచే నిది చెప్పుచున్నాఁడు.—ఈయుక్తగుణవిశేషవిశిష్ట మయినధర్మము నెఱుంగక యవిద్యచే జననమరణప్రవాహమునందుఁ బడఁద్రోయఁబడుచుండుపురుషులు, ధ్రియతే—ధరింపఁబడుచున్నది దీనిచేతఁ గావున ధర్మ మనఁగా జ్ఞానము, అట్టి మోక్షైకహేతు వగుజ్ఞానముయొక్క-స్వరూపమునందును తత్ఫలమయినమోక్షమునందును; అశ్రద్దధానాః=శ్రద్ధయనఁగా ఫలప్రాప్తిపర్యంతము కార్యహేతు వగునాస్థావిశేషము, అది లేనియట్టి యవివేకు లగు; పురుషాః=పురుషులు; దుష్కర్మముచే మోక్షమునందును మోక్షసాధన మగుజ్ఞానమునందును శ్రద్ధాభక్తిప

* ప్రసక్తింపనిదాని నిషేధించుట యనుదోషము.

యత్నములు లేనివారలై, మామ్ అప్రాప్య=నన్ను ఆత్మను ఆనందైకరసమైన, హస్తగతం బగుమోక్షాఖ్యఫలంబును విడిచి; మృత్యుసంసారవర్త్మని = మృత్యుయుక్తమైన సంసారము మృత్యుసంసారము, నానాయోనులందును నరకమునందును మాటిమాటికిఁ బతనరూపము, అదియే వర్త్మము—మార్గము, దానియందే; నివర్తన్తే = మిక్కిలి వర్తించుచున్నారు. మాటిమాటికిఁ బుట్టుచున్నారు గిట్టుచున్నారు. అయ్యో! వీరియవివేకము అనంతదుఃఖకారణము! ఇందువలన సులభప్రాప్యమగు ఆత్మజ్ఞానరూప మయినధర్మమునందు ఏయత్నములు శ్రద్ధావంతులును నిష్ఠావంతులు నగుచున్నారో వారలే ముక్తులగుదు రని సూచితం బగుచున్నది.

మ. ఇట్టిది సుకరంబును సర్వోత్కృష్టంబు నగునేని అందఱును ఏలను వలన నిందుఁ బ్రవర్తింపరు? అట్లు ప్రవర్తింతురేని ఎవ్వండును సంసారి యుండఁడు. అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అస్య=ఈ; ధర్మస్య = ఆత్మజ్ఞానాఖ్య మయినధర్మము యొక్క, స్వరూపంబును సాధనంబును ఫలంబును శాస్త్రముచేఁ బ్రతిపాదింపఁబడి యున్న నిది; అశ్రద్దధానాః = వేదవిరోధి యగు కుతర్కదర్శనముచే దూషిత మయిన యంతఃకరణము గలవార లగుటచేఁ బ్రామాణ్యమును దలంపని యట్టిపాపకారులు; అసురసంపద నొందినవారు స్వబుద్ధికల్పిత మయినయుపాయముచే నెట్లు ప్రయత్నించినను శాస్త్రవిహిత మయినయుపాయము లేమివలన, అప్రాప్యమామ్=మత్ప్రాప్తిసాధనమును గూడ పొందక; నివర్తన్తే = నిశ్చయమున వర్తించుచున్నారు. దేని యందు? మృత్యుయుక్త మయినసంసారమార్గమునందు. సదా జననమరణప్రపంచముచే నరకమునందును దిర్యగాదియోనులందునే భ్రమించుచుందు రని యర్థము.

శ్రీ. ఓయీ! ఇట్లది యతిసుకరం బైనచో నెవ్వరు మాఱి సంసారులుగా నుందురు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—అస్యధర్మస్య=భక్తిసహితజ్ఞానరూప మయినధర్మమును, కర్మార్థమునందు షష్ఠులు; ఈధర్మమును, అశ్రద్దధానాః= ఆస్తికులై స్వీకరింపనివారు; ఉపాయాంతరముచే మత్ప్రాప్తికొఱకుఁ బ్రయత్నము చేసినవా రయ్యును, మామ్; అప్రాప్య; మృత్యుయుక్త మయినసంసారమార్గమునందుఁ బరిభ్రమించుచుందు రని యర్థము.

ప. ఇట్లయినయెడ నప్పుడందఱును ముక్తులై యుండవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అస్యధర్మస్య—కర్మార్థమునందు రెండుషష్ఠులును, ఈధర్మమును; అశ్రద్దధానాః=ఆస్తికతతో ననుష్ఠింపనివారు; పురుషాః; మామ్; అప్రాప్య; మృత్యుసంసారవర్త్మని; నివర్తన్తే=వెండియు సంసరించుచున్నారు.

రా. అస్యధర్మస్య=ఈయుపాసనాఖ్యమయినధర్మముయొక్క, నిరతిశయప్రియమద్విషయం బగుటచేఁ దానును నిరతిశయప్రియరూపమయినదానియొక్క, పరమనిశ్శ్రేయసరూపమయినమత్ప్రాప్తికి సాధనమయినదానియొక్క, అవ్యయమైనదానియొక్క, గ్రహణయోగ్యదశను బొంది; అశ్రద్దధానాః = విశ్వాసపూర్వకమయిన త్వరలేనివారలగు; పురుషాః=పురుషులు; మామ్; అప్రాప్య; మృత్యురూపమయినసంసారవర్త్మమునందు; నివర్తన్తే=మిక్కిలియు వర్తించుచున్నారు. అహో! ఇది మహాశ్చర్యం బని యర్థము.

మా. *

మయా తత మిదం సర్వం జగ దవ్యక్తమూర్తినా
మత్స్థాని సర్వభూతాని నచాఽహం తే ష్వవస్థితః. ౪

భా. స్తుతిచేసర్జునసభిముఖుంగావించి చెప్పుచున్నాఁడు.—మయా=నాచేత, నాయొక్కపరమైనభావము ♦ ఏది గలదో దానిచేత; తతమ్=వ్యాపింపఁబడినది; సర్వమ్=సమస్తమయిన; ఇదమ్=ఈ, జగత్=జగత్తు; అవ్యక్తమూర్తినా=వ్యక్తము కాని మూర్తి—స్వరూపము ఏనాకో అట్టి నేను అవ్యక్తమూర్తిని, అట్టి యవ్యక్తమూర్తి నగునాచేత, కరణములకు అగోచరమయినస్వరూపము గలవానిచేత నని యర్థము. మత్స్థాని=అట్టి యవ్యక్తమూర్తి నగునాయందు ఉన్నవి కావున మత్స్థములు; సర్వభూతాని=బ్రహ్మాదిస్తంబపర్యంతము లగుభూతములు. నిరాత్మకమగుభూత మేదియు వ్యవహారమునకు సమర్థము కాదు గదా! అందువలన మత్స్థములు—నాచే—ఆత్మచే ఆత్మవంతములై యున్నవి, కావున నాయం దున్నవి యని చెప్పఁబడుచున్నవి. ఆభూతంబులకు నేనే యాత్మ యని యందువలన నేను వానియం దున్నా నని మూఢబుద్ధులకుఁ దోఁచుచున్నది, కావునఁ జెప్పుచున్నాను.—అహమ్=నేను; తేషు=ఆభూతముల యందు; నచ అవస్థితః = ఉన్నవాఁడఁ గానే కాను, మూర్తమువలె ⁋

* దీనికి మాధ్వభాష్యము లేదు.

♦ స్వరూపము.

⁋ క్రియాశ్రయ మగుదానివలె.

సంశ్లేషము లేమింజేసి యాకాశమునకుఁ గూడ అంతరతముఁడఁ గదా నేను. అసంసర్గి ♦♦ యగువస్తువు ఎందును ఆధేయంబై యవస్థితము కాదు గదా!

ఇంద్రియంబుల కగోచర మయినస్వరూపము గల నాచే నీజగత్తంతయు వ్యాపింపఁబడి యున్నది. సర్వభూతంబులును నాచేతనే ఆత్మవంతములు కావున నాయందున్నవి. నేనో వానియందున్నవాఁడఁ గాను. అని తాత్పర్యము.

ఆ. స్తుతినిందలచే జ్ఞాననిష్ఠను సంస్తుతించి జ్ఞానమును వివరింప నారంభించుచున్నారు స్తుతిచే నిత్యాదిగా. సోపాధికమునకు వ్యాప్తి సంభవింప దని తలఁచి విశేషణము చేయుచున్నారు నాయొక్క ఇత్యాదిగా. అనవచ్ఛిన్న మగుభగవద్రూపముయొక్క నిరుపాధికత్వమునే సాధించుచున్నారు కరణములకు ఇత్యాదిగా. వ్యాప్యవ్యాపకభావముచే జగత్తునకును భగవంతునకును బరిచ్ఛేదము నాశంకించి చెప్పుచున్నారు అట్టి ఇత్యాదిగా. అట్లయినను భగవంతునకును భూతంబులకును ఆధారాధేయభావముచే భేదము సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు నిరాత్మకము ఇత్యాదిగా. నిరాత్మకము వ్యవహారమున కసర్హ మగుటవలన ఫలితమును జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. ఈశ్వరుఁడు భూతముల కాత్మ యయినప్పుడు అతనికి వానియందు స్థితి సంభవించు నని యాశంకించి చెప్పుచున్నారు అభూతంబులకు నిత్యాదిగా. ఈశ్వరునకు భూతములయందు స్థితి లేదనుటను వ్యవస్థాపించుచున్నారు మూర్తమువలె నిత్యాదిగా. సంశ్లేషము లేకున్నను ఆధేయత్వం బేల కారా దనఁగాఁ జెప్పుచున్నారు అసంసర్గి ఇత్యాదిగా.

ప. మయా; తతమ్=వ్యాపింపఁబడినది; సర్వమ్; ఇదంజగత్. అవ్యక్తమూర్తినా=అవ్యక్త మయినస్వరూపముగల నాచేత, ఈశ్వరునిచేత, ఇంద్రియముల కగోచర మయినస్వరూపము గలవానిచేత నని యర్థము. మత్స్థాని; సర్వభూతాని=సర్వప్రాణులును. నచాఽహం తేషు భూతేషు అవస్థితః.

శం. ఇట్లు జ్ఞానము సర్వోత్తమం బనియు సులభం బనియుఁ బాపుల కలభ్యం బనియుఁ బ్రతిపాదించి, మున్ను "పర స్తస్మాత్తు భావో ఽన్యః" అనియు "యస్యాన్తస్స్థాని భూతాని యేన సర్వ మిదం తతమ్" అని యేది చెప్పఁబడినదో

♦♦ మఱియొకవస్తువుతో నంటనిది.

అదియే యిప్పుడు పరబ్రహ్మముయొక్క స్వరూపంబును జ్ఞానంబును విజ్ఞానంబును జెప్పుచున్నాఁడు సార్ధశ్లోకముచేత.—ఏప్రమాణముచేతను నన్యాజ్యతే-బోధింపఁబడదు కావున అవ్యక్తము-అప్రమేయ మగుమూర్తి-స్వరూపము ఎవ్వనికో అలఁడవ్యక్తమూర్తి. ఓయీ! ఏప్రమాణముచేతను బోధింపఁబడ దని యేమి చెప్పితివో అది సరికాదు, «తం త్వౌపనిషదమ్» అనుశ్రుతివలన బ్రహ్మమునకు శ్రుతిబోధ్యత్వ ముండనే యున్నది. అందువేని లేదు, శ్రుతికిఁ గూడ అగోచరం బగుట వలన దానికి బ్రహ్మబోధకత్వము అనుపపన్న మగుటవలన. శ్రుతి «అస్థూలమ్» ఇత్యాదిగా సర్వదృశ్యములను నిషేధించి యేది నిషేధమున కవిషయమో సర్వదృశ్యవిలక్షణమో దాని బ్రహ్మ మని బోధించుచున్నది కాని సాక్షాత్తుగా నిది యని బోధింపదు గదా! ఓయీ! సత్యం జ్ఞానమ్” అనియు «ఆనన్దో బ్రహ్మ” అనియు శ్రుతి సత్యాదిస్వరూపము బ్రహ్మ మని బోధించుచునే యున్న దని యందువేని, అది సరికాదు, ఆశ్రుతి బ్రహ్మమునకు అసద్వైలక్షణ్యముఁ బ్రతిపాదించునది యగుట వలన. సకారణం బగుజగత్తు అనృతజడదుఃఖాత్మకము ప్రత్యక్ష మగుటవలన బ్రహ్మమునకుఁ దద్వైలక్షణ్యం బర్థసిద్ధము, ఆయసద్వైలక్షణ్యమునే శ్రుతి యుపదేశించుటకై «సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, ఆనన్దో బ్రహ్మ” అని చెప్పుచున్నది. కాని సాక్షాత్తుగా నిది యని యుపదేశింపదు, శ్రుతి వాగ్రూప మగుటవలన తద్వ్యావృత్త బ్రహ్మం బవిషయం బగుటవలన. అందువలన సిద్ధము బ్రహ్మము సర్వప్రమాణంబులచేతను అన్యాజ్యం బని. అట్టి యవ్యక్తమూర్తి నగు, నిర్విశేషుఁడ నగు, మయా = నాచేత, బ్రహ్మముచేత; సర్వం ఇదం జగత్ = సమస్త మయినయీజగత్తు; తతమ్ = వ్యాపింపఁబడినది, ఎట్లు రూపవంత మగుద్రవ్యము సమస్తమును సర్వత్ర సూర్యప్రకాశముచే వ్యాప్తమై చక్షుర్గ్రాహ్య మగుచున్నదో అవ్యాప్తమై కాదో అట్లు చిదేకస్వరూపుఁడ నగునాచే వెలుపలను లోపలను సర్వత్ర వ్యాప్తమైయే జగత్తు సర్వంబును సర్వకరణవ్యవహార్య మగుచున్నది, కాని యవ్యాప్తమై కాదు, తాను నిరాత్మకం బగుటవలనను అప్రకాశం బగుటవలనను, «తస్య భాసా సర్వ మిదం విభాతి» అనుశ్రుతివలన. అందువలన నీజగము సర్వంబును నాచే నంతటను వ్యాపింపఁబడి ప్రకాశింపఁజేయఁబడుచున్న దని యర్థము. ఇందుచే, సర్వజగత్ప్రకాశకత్వ మేదో అది బ్రహ్మ మని జ్ఞాన ముపదిష్ట మగుచున్నది. మఱియును. సర్వభూతాని = సమస్తములు అవ్యక్తమహదాదులును స్థూలాంతములు నగుభూతములు, జంగమములు స్థావరములు సమస్తములును. మత్స్థాని = నాయందు—అవ్యక్తమూర్తియందు

ఉన్నవి కావున మత్స్థములని చెప్పఁబడుచున్నవి. ఎట్లు జలమునందుఁ దరంగబుద్బుదాదులు జలసత్తచే సత్తావంతములై జలమునం దున్నవో మఱియు నెట్లు నగరవాసులు దర్పణసత్తచే సత్తావంతులై దర్పణమునం దున్నారో అట్లు సర్వభూతంబులును నా సత్తచే సత్త నొంది నాయం దున్నవి యని యర్థము, "సదాయతనా స్సత్ప్రతిష్ఠాః" అను శ్రుతివలన. ఇందుచే, సర్వభూతంబులకు నాధార మెద్దో అది బ్రహ్మంబని జ్ఞాన ముపదిష్ట మగుచున్నది. "పర స్తస్మాత్తు భావోఽన్యోఽవ్యక్తోఽవ్యక్తాత్సనాతనః" అనుచోట అవ్యక్తముకన్నఁ బరమాత్మ పరుఁడు ఉత్కృష్టుఁ డని యెది చెప్పఁబడినదో—తన కుత్కృష్టత్వంబును అవ్యక్తమునకు నికృష్టత్వంబును—దానినే వెండియు స్పష్టీకరించుటకై సకార్యం బగు నవ్యక్తము వ్యాప్యం బగుటచేతను ఆధేయం బగుటచేతను నికృష్టం బనియుఁ దాను వ్యాపకం బగుటచేతను ఆధారం బగుటచేతను ఉత్కృష్టుం డనియుఁ బ్రదర్శించి ఇట్లు వ్యాప్యవ్యాపకభావము చేతను ఆధారాధేయభావముచేతను భేదం బంగీకరించినచో భేదమునకు యథార్థతయు భేదదర్శు లగుముముక్షువులకు మోక్షాభావంబును అద్వైతశ్రుతివిరోధంబును బ్రసక్తించుచున్నది. కావున దానిం బరిహరించుటకై "అథాత ఆదేశో నేతి నేతి, న సన్నాసన్నసదసత్" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధం బగు సర్వదృశ్యనిషేధమును జేయుచున్నాఁడు బ్రహ్మమున కద్వితీయత్వసిద్ధికొఱకు.—చకారం బవధారణార్థకము. తేషు = అవ్యక్తాదిస్థూలాంతము లగు నాభూతములందు బ్రహ్మాదిస్తంబపర్యంతముల యందు; అహమ్=కూటస్థాసంగచిద్రూపుఁడను బరమాత్మ నగు నేను, లోపలఁ బ్రవేశించి యాత్మరూపంబునఁ గాని వ్యాపకభావంబునఁ గాని, నచ అవస్థితః=ఉన్నవాఁడఁ గానే కాను. గృహమునందు వాయువువలెఁ గాని బిలంబునందు సర్పమువలెఁ గాని అయఃపిండమునందగ్నివలెఁ గాని నేను వికారియట్లు ఆభూతములందుఁ బ్రవేశించి గాని వ్యాపించి గాని యున్నవాఁడఁ గానే కానని యర్థము. వికారి యగుదానికిఁ గదా వాయ్వగ్న్యాదికమునకు గృహాయఃపిండాదికమునందుఁ బ్రవేశంబును వ్యాప్తియు నుపపన్న మగును, కాని యవికారిని నిరవయవుండను అసంగుఁడను అక్రియుఁడను బరిపూర్ణుఁడ నగు నా కుపపన్నము కాదు, ఎట్లాకాశమున కుపపన్నము గాదో అట్లు. ఓయీ! ఘటాకాశం బనుచో నెట్లాకాశమునకు ఘటమునందుఁ బ్రవేశించి యునికి యుపపన్న మగునో అట్లు భూతములందు నీకు నుపపన్న మగుఁ గాక. యందువేని, కాదు. ఆకాశమునకు ఘటాంతఃప్రవేశకల్పన భ్రమమే, నిరవయవమునకుఁ జలనము సంభవింపమివలన. "ఓయీ! "తత్సృష్ట్వా త దేవాను

ప్రావిశత్ " ఇత్యాదిశ్రుతులచే బ్రహ్మమునకు భూతములందుఁ బ్రవేశము చెప్పఁబడు చున్నది. అందువేని, కాదు. అది యాభాసవిషయం బగుటవలన బ్రహ్మవిషయం బనుట చెల్లను. «నిష్కలం నిష్క్రియమ్" అనియు 'అసఙ్గో నహి సజ్జతే' అనియు «ఆకాశవత్సర్వగతః» అనియు, «పూర్ణమదః» అనియు బ్రహ్మము నకు నిరవయవత్వంబును నిష్క్రియత్వంబును అసంగత్వంబును పూర్ణత్వంబును శ్రుతి యుపదేశించుటవలనఁ బ్రవేశక్రియ గాని వ్యాపనక్రియ గాని సంయోగము గాని యితరము గాని సంభవించు నన శక్యము గాదు. అందువలన ఆభూతములందుఁ బ్రవేశించి నే నున్నవాఁడనే కా ననుట సిద్ధము.

మ. ఇట్లు వక్తవ్యముగాఁ బ్రతిజ్ఞాతం బగుజ్ఞానమును విధిముఖంబునను ఇతరని షేధముఖంబునను స్తుతించుటచే నర్జును నభిముఖీకరించి యతని కాజ్ఞానమునే యుపదేశించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఇదమ్; జగత్ సర్వమ్ = మదజ్ఞాన కల్పితం బైనభూతభౌతికతత్కారణస్వరూపం బగుదృశ్యజాతం బంతయు; మయా= అధిష్ఠానంబను బరమార్థస్వరూపుండను స్ఫురణరూపుండ నగు నాచేత; తతమ్= వ్యాపింపఁబడినది, రజ్జుఖండముచే తదజ్ఞానకల్పితం బగుసర్పధారాదికమువలె. నాను దేవుఁడవు పరిచ్ఛిన్నుండ వగునీచే సర్వజగంబును ఎట్లు వ్యాపింపఁబడినది? ప్రత్యక్ష విరోధము గదా! అనఁగా కా దని చెప్పుచున్నాఁడు —అవ్యక్తమూర్తినా = అవ్య క్తము—సర్వకరణంబులకును అగోచర మైనది స్వప్రకాశాద్వయ చైతన్యసదానంద రూపం బగుమూర్తి యెవ్వనికో అట్టినాచేత; వ్యాపింపఁబడిన దిది సమస్తంబును, కాని యీదేహమునఁ గా దని యర్థము. అందువలననే, ఉన్నవివలె స్ఫురించు చున్నవివలె, మత్స్థాని = మద్రూపంబున నున్నవి; సర్వభూతాని—స్థావరంబులును జంగమంబులును. పరమార్థంబుననో, అహమ్= నేను; తేషు = ఆకల్పితము లగుభూత ములయందు; నచ అవస్థితః=ఉన్నవాఁడనే కాను, కల్పితాఽకల్పితములకు సంబంధము సంభవింపమినలన. అందువలననే చెప్పఁబడినది «యత్ర యదధ్యస్తం తత్కృ తేన గుణేన దోషేణ వా అణుమాత్రేణాఽపి న స సంబధ్యతే» ♦ అని.

శ్రీ. ఇట్లు చెప్పవలసినట్లుగాఁ బ్రస్తుతమయిన జ్ఞానమును స్తుతించుటచే శ్రోత నభిముఖీకరించికొని యాజ్ఞానమునే చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—

♦ దేనియం దేది యధ్యసింపఁబడినదో అయధ్యస్త మగుదాని గుణముతోఁ గాని దోషముతోఁ గాని యది యణుమాత్ర మయినను సంబంధింపదు. సూత్రభాష్యము.

అవ్యక్తమూర్తినా = అవ్యక్తము—అతీంద్రియ మగుమూర్తి—స్వరూపము గలవాం
డగు; మయా=కారణభూతుండ నగునాచేత; సర్వమ్. ఇదం జగత్; తతమ్ = వ్యా
పింపఁబడినది, «తత్సృష్ట్వా త దేవా ఽనుప్రావిశత్» అను శ్రుతివలన. అందు
వలననే, కారణభూతుఁడ నగునాయందు దున్నవి కావున మత్స్థానములు సర్వభూతము
లయిన చరాచరభూతములు. ఇట్లయునను గూడ, ఘటాదికార్యములయందు మృత్తిక
వలె, తేషు=ఆభూతములయందు, అహమ్=నేను; నచ అవస్థితః, ఆకాశమువలె అసం
గుఁడ నగుటవలన.

ప॥ ఇట్లు సత్యముగాఁ ప్రస్తుత మయిన రాజవిద్యారాజగుహ్యాఖ్యశాస్త్ర
మును స్తుతించి శ్రోతసభిముఖీకరించికొని యాథార్థ్యమునే చెప్పుచున్నాఁడు
రెండుశ్లోకములచేత.—ఇదమ్=ఇది యని భాసిల్లుచున్నది; మరల, జగత్ = నాఁటికి
పోవునది యగు; సర్వమ్=నామరూపకర్మాత్మక మగుదృశ్యజాతము; మయా=అధిష్ఠాన
రూపుఁడ నగునాచేత; తతమ్=విస్తారము నొందినది. ఎట్టి నాచేత? అవ్యక్తమూర్తి
నా=అవ్యక్తము—అజ్ఞాతము ♦ అగుమూర్తి—స్వరూపము గలవాఁడ నగునాచేత,
నిమిత్తభూతునిచేత. మదజ్ఞానమువలన నాయందే యారోపితము, శుక్త్యజ్ఞానమువలన
శుక్తియందు రజతమువలెనని యర్థము. అది చెప్పఁబడినది వాసిష్ఠమునందు «మద
జ్ఞానోదితం విశ్వం మయ్యేవ లయ మాగతమ్» * అని. ఇఁక మయా అనుతృతీయ
చేఁ బరమాత్మకుఁ గారణత్వము ప్రాప్తింపఁగా తద్వ్యతిరేకంబున నిషేధించు
చున్నాఁడు.—కారణము కార్యమునంతయు వ్యాపించి యుండు ననున్యాయంబున,
వాస్తవమే, సర్వభూతంబులును నాయందు దున్నవి యని తోఁచుచున్నది, అట్లయ్యు
నను, తేషు=ఆభూతములయందు; అహమ్=నేను; న అవస్థితః= ఉన్నవాఁడఁ గాను.
ఎట్లు శుక్తియందు రజతము తోఁచుచున్నను రజతమునందు శుక్త్యంశము తోఁపదో
అట్లు. తోఁచునేని అప్పుడు భ్రమయే లేకపోవు నని యర్థము.

రా॥ వినుము ప్రాప్యభూతుఁడ నగు నాయచింత్యమహిమను.—ఇదమ్=
ఈచేతనాఽచేతనాత్మక మగు; సర్వం జగత్=సమస్తజగత్తును; అవ్యక్తమూర్తినా=
అప్రకాశిత మయిన § స్వరూపము గల; మయా=నాచేత, అంతర్యామి యైనవాని

---

♦ తెలియఁబడనిది.

* నాయజ్ఞానమువలనఁ బుట్టినది విశ్వము, నాయందే లయము నొందినది.

§ వెల్లడి చేయఁబడని.

చేత; తతమ్—ఈజగత్తుయొక్క ధారణముకొఱకును నియమనముకొఱకును శేషి భావంబున వ్యాపింపఁబడినది యని యర్థము. అట్లు అంతర్యామిబ్రాహ్మణమునందు "యః పృథివ్యాం తిష్ఠన్......యం పృథివీ న వేద, య ఆత్మని తిష్ఠన్......య మాత్మా న వేద" అని చేతనాఽచేతనవస్తుజాతములచే నదృష్టుండై యంతర్యామి వానియందు వ్యాపించి యుండునట్లు చెప్పఁబడినది. అందువలన, మత్స్థాని సర్వ భూతాని=సర్వభూతములును అంతర్యామి నగు నాయం దున్నవి. ఆబ్రాహ్మణము నందే "యస్య పృథివీ శరీరం...యః పృథివీ మన్తరో యమయతి, య స్యాత్మా శరీరం...య ఆత్మాన మన్తరో యమయతి" అని శరీరభావంబున నియామ్యత్వము ప్రతిపాదించుటవలన తదధీనములు లయిన స్థితినియమనంబులును శేషిత్వంబును ప్రతి పాదితంబు లగుచున్నవి. నచా ఽహం తే ష్వవస్థితః—నేనో తదధీన మైనస్థితి గల వాఁడను కాను, నాస్థితియందు వానిచే నుపకార మేదియు లే దని యర్థము.

మూ. ప్రత్యక్షావగమశబ్దముచే నపరోక్షజ్ఞానసాధనత్వము చెప్పఁబడినది. తద్జ్ఞానాదికముఁ జెప్పుచున్నాఁడు న యేత్యాదిగా. అప్పుడు ఏల కనఁబడఁడు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అవ్యక్తమూర్తినా అని.

న చ మత్స్థాని భూతాని పశ్య మే యోగ మైశ్వరమ్
భూతభృ న్నచ భూతస్థో మమా ఽఽత్మా భూతభావనః. ౫

భా. ఇందువలననే, నేనసంసర్గి నగుటవలననే, నచ మత్స్థాని=నాయం దున్నవియే కావు; భూతాని=భూతములు బ్రహ్మాదులు. మే=నాయొక్క; యోగమ్=యుక్తిని, ఘటనమును; ఐశ్వరమ్=ఈశ్వరుని దైనదానిని, ఆత్మ యొక్కయాథాత్మ్యము నని యర్థము; పశ్య= చూడుము. అట్లు శ్రుతి యసంసర్గిత్వమువలన నసంగతను దెలుపుచున్నది "అసఙ్గో నహి సజ్జతే" అని. ఇదియో ఆశ్చర్యము వేఱువిధము. చూడుము. భూతభృత్=అసంసర్గ మయినను భూతములను భరించునది; నచభూతస్థః=భూతములయం దున్నది కానే కాదు, యథోక్తన్యాయముచే భూతస్థత్వం బనుపపన్నం బని ప్రద ర్శితం బగుటవలన. మమ ఆత్మా = నాయొక్క ఆత్మ; ఎట్లు మఱి చెప్ప వచ్చును ఇది నాయాత్మ యని ? దేహాదిసంఘాతమును విభజించి దాని యం దహంకారము నధ్యారోపించి లోకబుద్ధి ననుసరించుచు వ్యపదేశించు

చున్నాఁడు మమాత్మా యని, మఱి, ఆత్మకంటె నాత్మ యన్యుం డని లోకములవలె నెఱుంగక కాదు. అట్లు, భూతభావనః = భూతంబులను భావించుచున్నది—పుట్టించుచున్నది, లేక, వృద్ధిఁ బొందించుచున్నది కావున భూతభావనము.

అందువలననే భూతములును నాయందున్నవి కానే కావు. నాయం బగునాయాథాత్మ్యముఁ జూడుము. నాస్వరూపము అసంగమై భూతముల భావించుచున్నది. ఐనను భూతములయం దున్నది కాదు. అట్లే భూతములఁ బుట్టించుచున్నది యని తాత్పర్యము.

ఆ. పరమేశ్వరునకు భూతములయందు స్థితి లేకున్నను భూతములకు వానియందు స్థితి యంగీకరింపఁబడినది, కావునఁ బరమేశ్వరుఁ డసంగుం డని యెట్లు చెప్పవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నారు ఇందువలననే ఇత్యాదిగా. నచ అనుచో చకారం బవధారణార్థకము. భూతముల కీశ్వరునియందు స్థితియును లే దనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు పశ్య అని. ఆత్మకు అసంగత్వము స్వరూప మనుటకుఁ బ్రమాణముఁ జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. ఈశ్వరుం డసంగుఁడే యగునేని అప్పుడు ఎట్లు «మత్స్థాని భూతాని» అని చెప్పఁబడినది? మఱియును, అట్లు చెప్పి «నచ మత్స్థాని» అని తద్విరుద్ధముగా నెట్లు చెప్పఁబడినది? అని యాశంకించి చెప్పుచున్నారు ఇదియును ఇత్యాదిగా. అప్పుడు భూతసంబంధము కలుగు ననఁగా లే దని చెప్పుచున్నారు నచ భూతస్థః అని. యుక్తన్యాయముచే—అసంగత్వముచేత నని యర్థము. అసంగుఁ డగుటచే వాస్తవమున భూతసంబంధము లేకున్నను ఉన్నట్లు కల్పించుటచే దానికి విరోధము లేమివలనఁ బరస్పరవిరోధము లే దని భావము. ఆత్మకంటె ఆత్మ యన్య మనుట యనుచితం బగుటవలన నెట్లు సంబంధము చెప్పవచ్చును? అని యాశంకించి చెప్పుచున్నారు ఎట్లు మఱి ఇత్యాదిగా. ఎట్లు లోకము వస్తుతత్త్వము నెఱుంగక భేదము నారోపించి «నాది యిది» యని సంబంధము దలంచుచున్నదో అట్లు గా దిట సంబంధవ్యపదేశము, ఆత్మయందుఁ దనకంటె భేదము లేమివలన. అందువలన భేదము లేక యుండఁగానే లోకమునందుఁ గనఁబడుసంబంధబుద్ధి ననుసరించుచు భగవంతుం డాత్మనుండి దేహాదిసంఘాతమును విభజించి యహంకారమును దానియం దారోపించి యిది నాయాత్మ యని భేదమును వ్యపదేశించుచున్నాఁడు; అట్లు, దేహాదిసంఘాతము మమ అనుశబ్దముచే వ్యపదే

శింపఁబడుటవలన, దానినుండి వివిక్తమయినస్వరూపము ఆత్మశబ్దముచే నిర్దేశింప బడుటవలన, కాఁడు భూతస్థుఁ డితం డని యర్థము. పూర్వోక్తమగునసంగత్వము నంగీకరించియే యాత్మ భూతముల భావించుచున్న దని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా.

హా. నచ మత్స్థాని భూతాని=ఈభూతములు నాయం దున్నవియుఁ గావు. « అసఙ్గో నహి సజ్జతే » అను శ్రుతివలన. పశ్య=చూడుము. మే; యోగమ్; ఐశ్వరమ్=ఈశ్వరుని దైనసదానిని. భూతముల భరించునది కావున భూతభృత్తు. నచభూతస్థః=భూతములయం దుండునది కానేకాదు. మమ = ఈశ్వరుఁడ నగు నాయొక్క-కి. ఆత్మా; భూతభావనః=భూతములఁ బుట్టించునది కావున భూతభావనము.

శం. ఓయీ! అవిక్రియుఁడవు పూర్ణుఁడవు పరబ్రహ్మ మగు నీకు భూతములయందు స్థితియు వ్యాప్తియు లేకపోవుఁగాక. భూతములుమాత్రము నీయందుండనే యున్నవి. అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—నచ మత్స్థాని భూతాని = అవ్యక్తమూర్తిని జిదేకరసుఁడను బరిపూర్ణుఁడను బ్రహ్మ మగు నాయందు సకార్యము లగు నవ్యక్తాదిస్థూలాంతము లయినభూతములు ఉన్నవి కానేకావు. నేను భూతములయం దెట్లు లేనో అట్లు నాయందును భూతములు లే వని యర్థము. ఓయీ! « సర్వభూతనివాసో உసి » * అని నీవు సర్వభూతాశ్రయుండ వని స్మృతి చెప్పుచున్నది, ఎట్లు నచ మత్స్థాని భూతాని యని చెప్పవచ్చును? అని యందు వేని నిన్నిట నడుగవలయును. నిష్కలము నిరాకారము నిర్విశేషము పరిపూర్ణ మగుబ్రహ్మమునందు భూతము లేమి సంయోగసంబంధముచే నున్నవా? సమవాయ సంబంధముచే నున్నవా? లేక, తాదాత్మ్యసంబంధముచే నున్నవా? మొదటి పక్షమున భూతములకును బ్రహ్మమునకును సంయోగము సర్వముతోనా? లేక, ఏకదేశముతోనా? మొదటిది కాదు, పరిచ్ఛిన్నముల కపరిచ్ఛిన్నముతో సర్వత్ర సంయోగము సంభవింపమివలన. రెండవది కాదు, నిరవయవమునకు దేశకల్పనము సంభవింపమివలన. పరమాణువునందు ద్వ్యణుకమువలె నుండుఁగాక యందువేని సరికాదు, నిరవయవసావయవములకు సంయోగం బనుపపన్న మగుటవలన. సమవాయసంబంధంబును సంభవింపదు, భూతములకును బ్రహ్మమునకును అయుతసిద్ధ

* సర్వభూతములకును ఉనికిపట్టు వగుచున్నావు.

త్వము * లేమింజేసి సమవాయము సిద్ధింపమివలన. తాదాత్మ్యసంబంధంబును సంభవింపదు, జడాఽజడములకుఁ దాదాత్మ్యము సంభవింపమివలన. అప్పు డేసంబంధం బని యడుగుదు వేని, అధ్యాససంబంధం బని చెప్పెదము. అందువలన, దేనియం దేది యధ్యసింపఁబడినదో దానియం దది నామమాత్రముగానే యున్నది; కాని వాస్తవముగ లేదు, శుక్తిరజతాదికమునం దట్లు కనఁబడుటవలన. ఆకారణము వలన, పరిపూర్ణుఁడును పరబ్రహ్మమును నిర్విశేషుఁడు నగునా యందు భూతము లుండుట సంభవింపనే సంభవింపవు, భూతము లున్న వన్నచోఁ దత్కృతపరిచ్ఛేదముచేఁ బూర్ణత్వము సంభవింపమివలన. "పూర్ణమదః పూర్ణమిదమ్" అని బ్రహ్మమునకుఁ బూర్ణత్వమే శ్రుతి చెప్పుచున్నది. "తదేతద్బ్రహ్మా ఽపూర్వ మనపర మనన్తర మబాహ్యమ్" అనియు, "ఏక మేవా ఽద్వితీయం బ్రహ్మ" అనియు, "ఏకో హి రుద్రో నద్వితీయాయ తస్థుః" అనియు శ్రుతిశతంబులు బ్రహ్మమున కద్వితీయత్వము నే నియమంబునఁ బ్రతిపాదించుచున్నవి. ఎందువలన, నిష్కలుఁడును నిష్క్రియుఁడును నిస్సంగుఁడును నిరంతరుఁడును నిరాశ్రయుఁడును నిర్విశేషుఁడును బరిపూర్ణుఁడు నగు నాయందు "నేహ నానా ఽస్తి కించన" ఇత్యాదిశ్రుతులు ప్రపంచాఽభావమును బ్రతిపాదించు చున్నవో అందువలన, మే=నాయొక్క; పారమార్థికము అప్రాకృత మగు, ఐశ్వరమ్=బ్రహ్మసంబంధి యయిన; యోగమ్=యుజ్యతే—జ్ఞానముచేఁ బొందఁబడుచున్నది కావున యోగమును—స్వరూపమును, సద్ఘనమును చిద్ఘనమును ఆనందఘనమును అద్వితీయమును; పశ్య=ఇదియే నే నని స్వస్వరూపంబునఁ జూడుము, సద్రూప మైనయీబ్రహ్మమే నేనని నిన్ను బ్రహ్మమునుగానే యెఱుంగు మని యర్థము. ఓయీ! నేతినేతి యనిసర్వమును నిషేధింపఁబడఁగాఁ దన్నిషేధావధి యగుటచే జగదభావముమాత్రమే మిగులుచున్నది, అందు ఈబ్రహ్మము నేనే యనుజ్ఞాన మెక్కడను? అందు వేని; సత్యము, ప్రపంచాఽభావమే యిటఁ బ్రతీత మగుచున్నది, అట్లయినను వినుము, ఇటఁ జెప్పెదను. దృశ్యప్రపంచము దేనిచే భాసింపఁజేయఁబడుచున్నదో దేనిరూపంబున దేనియం దున్నదో తదభావంబును దానిచేతనే భాసిల్లఁ జేయఁబడుచున్నదై దానిరూపంబున దానియందే యున్నది, వేఱువిధము గాదు. అందువలన జగత్తునకును జగదభావంబునకును స్వరూపభూతము తదవభాసకము తదధిష్ఠానము నిర్విశేషము నిర్వికల్పము ఏదో అది బ్రహ్మం బని సూక్ష్మబుద్ధులు యుక్తిశాలు లగు

* ఏరెంటిలో వినాశకారణము లేనియప్పుడు ఒకటి మఱియొకదాని నాశ్రయించియే యుండునో ఆరెండును అయుతసిద్ధములు.

వారి తెలియంగవలయును. అట్టి యీ బ్రహ్మస్వరూపము తన కపరోక్షము తానే యెఱుంగవలయును, తన యారోగ్యమువలె. అందువలననే భగవంతుండును నచమత్స్థాని భూతాని యని తనయం దారోపింపఁబడిన భూతజాతమును సర్వంబును నిషేధించి యానిషేధంబున కవధిగాఁ దన్ను మిగిలించుచున్నాఁడు పశ్య మే యోగమైశ్వరమ్మని, సర్వస్వరూపనిషేధావధిభూతుని తదభావావభాసకుని దన్నుఁ బరబ్రహ్మమును గా ముముక్షువులందఱును శుద్ధాత్ములు స్వస్వరూపంబున నెఱుంగుదురు గాక యని. ఇందుచే, సర్వదృశ్యనిషేధావధిరూపమై సర్వాధిష్ఠానమై నిర్విశేషము ప్రజ్ఞానైకరసం బగు నేపరబ్రహ్మము గలదో అదియే నేనని యెఱుంగుటయే విజ్ఞానం బని సూచితమగుచున్నది. ఓయీ! "సో మ్యేమా స్సర్వాః ప్రజా స్సదాయతనా స్సత్ప్రతిష్ఠాః" అనియు "సర్వభూతనివాసో ఽసి" అనియు బ్రహ్మము సర్వభూతాధారం బని శ్రుతియు స్మృతియుఁ జెప్పుచున్నవి, ఎట్లు "నచ మత్స్థాని భూతాని" అని చెప్పవచ్చును? అందువేని; సత్యము శ్రుతియు స్మృతియుఁ జెప్పుచున్నవి నేను సర్వభూతాశ్రయుండ నని. అట్లయినను అది పారమార్థికము కాదు. మఱేమనఁగా, మాయావిలసనము నాశ్రయించి లోకదృష్టిచేఁ జెప్పుచున్నవి. అది నేను సంగీకరించుచునే యున్నా నను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు సార్ధశ్లోకముచేత.—అజ్ఞానుఁడు తాను ఇతండే సాక్షాత్పరమేశ్వరుం డని నాయందీశ్వరత్వబుద్ధి గలవాఁ డగుటవలన నే నాత్మ యని చెప్పఁగునేని నాదేహమునందే పరమాత్మత్వబుద్ధిని వహించు నని శ్రీభగవంతుం డాత్మశబ్దార్థమును దనదేహమునుండి విభజించి భిన్నమునుగా నిర్దేశించుచున్నాఁడు మమాత్మా యని. "అయమాత్మా సన్మాత్రో నిత్య శ్శుద్ధో బుద్ధ స్సత్యో ముక్తో నిరఞ్జనో విభు రద్వయానన్దః పరః ప్రత్యగేకరసః" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధ మయిన, మమ=శరీరాశ్వదత్వాభిమాని నగునాయొక్క, ఆత్మా=అవ్యక్తమూర్తి, ప్రత్యగ్వస్తుఁణము; భూతభావనః=భూతములను ఆకాశాదిపృథివ్యంతములను సకార్యములను సమస్తములను భావయతి—స్వసత్తచేతను స్వప్రకాశముచేతను సత్తావంతములను గాను ప్రకాశవంతములను గాను జేయుచున్నది కావున భూతభావనము, అట్టిదై; భూతభృత్=తనయం దారోపితము లగుభూతములను స్వసత్తచే స్వమాత్రములనుగా * బిభర్తి—ధరించుచున్నది కావున భూతభృత్తగుచున్నది. చకారము తుకారార్థకము. కాని, నభూతస్థః=భూతములయం దాత్మరూపం

* తాను నశ్య- నేటు జేనివిగా.

బున నభిమానాస్పదమై యున్నది కాదు కావున భూతస్థ మని చెప్పఁబడదు. ఆత్మ భూతస్థ మనునెడ, «విశేష్యనాశమువలన విశిష్టమునకుఁ గూడ నాశ మగును» అను న్యాయంబున భూతనాశమువలన ఆత్మకుఁ గూడ నాశము ప్రసక్తించుటవలన. భూత సంబంధి కర్తృత్వ భోక్తృత్వాదిధర్మసంబంధము గూడ సంభవించును. అందువలనఁ జెప్పుచున్నాను భూతస్థము కా దని. ఓయీ! ఆత్మకు భూతస్థత్వము లేనిచో ఆ భూతములచేఁ బరిచ్ఛేదం బగును అందు వేని, కాదు, ఆకాశమునందు నైల్యమువలె నవి నాయందుఁ గల్పితంబు లగుటవలన వానికి స్వసత్త లేమివలనఁ బరిచ్ఛేదకత్వ మనుపపన్నం బగుటవలన. లేక, అధిష్ఠానవ్యతిరేకంబున భూతములకు వేఱుస్వరూపము లేమివలన స్వమాత్రము లగునవానియందు వెండియు నుండెడి దేమి యని చెప్పఁబడుచున్నది నచ భూతస్థః అని. అందుచే సిద్ధము, భూతములే నాయందు మరుభూమియందు జలమువలె ఆకాశమునందు నైల్యమువలె నున్నవి, కాని భూతములందు నే నున్నవాఁడఁ గా నని.

మ. ఇందువలననే.—దివియం దున్న యాదిత్యునియందుఁ గల్పితంబు లగు జలచలనాదులుం బోలె నాయందుఁ గల్పితంబు లగుభూతంబులు పరమార్థంబున నాయందు లేవు. నీ వర్జునుండవు ప్రాకృతం బగుమనుష్యబుద్ధిని విడిచి, పశ్య= పర్యాలోచింపుము; మే=నాయొక్క; యోగమ్=ప్రభావమును; ఐశ్వరమ్ = ఈశ్వర సంబంధిని. మాయావియొక్కవలె నాయొక్క యఘటనఘటనాచాతుర్యము చూడు మని యర్థము. నేను దేనికిని ఆధేయమును గాను, దేనికి నాధారమునుం గాను, అట్లయినను నేను సర్వభూతములయందు నున్నాను, నాయందును సర్వ భూతంబులు నున్నవి—ఇది మహామాయ. అందువలన, భూతములను సర్వంబులను కార్యములను ఉపాదాన మగుటచే బిభర్తి—ధరించుచున్నది పోషించుచున్నది కావున భూతభృత్తు. భూతములను సర్వములను కర్తయై భావయతి—సృష్టించుచున్నది కావున భూతభావనము. ఇట్లభిన్ననిమిత్తోపాదానభూతం బైనను, మమ ఆత్మా= నాయొక్క పరమార్థస్వరూపము, సచ్చిదానందఘనము అసంగాద్వితీయస్వరూపం బగుటవలన, నభూతస్థః=పరమార్థంబున భూతసంబంధి కాదు. స్వప్నద్రష్టవలెఁ బరమార్థంబున స్వకల్పితసంబంధి కా దని యర్థము. మమ ఆత్మా యనుచో రాహోః శిరః అనుచోటంబోలె కల్పనచే షష్ఠి.

శ్రీ. మఱియును.—నచ మత్స్థాని = నాయం దున్నవియుఁ గావు; భూతాని = భూతములు, నే నసంగుఁడ నగుటవలననే. ఓయీ! అప్పుడు వ్యాపకత్వా

బును ఆశ్రయత్వంబును మున్ను చెప్పినది విరోధించును అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—మే; ఐశ్వరమ్ = అసాధారణ మగు; యోగమ్ = యుక్తిని, అఘటితఘటనాచాతుర్యమును; పశ్య. నాదైన యోగమాయావైభవం బతర్క్య మగుటవలన లేదు విరోధ మేమియు నని యర్థము. మఱియొకటియు నాశ్చర్యముఁ జూడుమని చెప్పుచున్నాఁడు.—భూతములను బిభర్తి—ధరించుచున్నది కావున భూతభృత్తు; భూతములను భావయతి—పాలించుచున్నది కావున భూతభావనము; ఇట్టి దైనను, మమ; ఆత్మా = పర మయినస్వరూపము; భూతస్థః = భూతములయం దున్నది; న = కాదు. ఇది భావము.—ఎట్లు జీవుఁడు దేహమును భరించుచును బాలించుచును అహంకారముచే దానితో సంశ్లిష్టుఁడై యున్నాఁడో అట్లు నేను భూతములను ధరించుచుఁ బాలించుచున్న వాఁడ నైనను వానియం దుండను, నిరహంకారుఁడ నగుటవలన.

ప. ఇఁక దీనినే ప్రకటించి చెప్పుచున్నాఁడు.—చ= మఱియును; భూతములు నాయం దున్నవి కావు. అందువలన, మున్ను మత్స్థాని సర్వభూతాని అని యేది చెప్పఁబడినదో అది యీనిషేధముచేఁ బ్రాతిభాసికం బని తెలుపఁబడినది. అట్లు భ్రమనివృత్తికాలమునందు శుక్తియందు రజతము లేదే గదా! అది చెప్పఁబడినది.—« సౌమ్యా ఽమ్భసి యథా వీచిర్న చాస్తి న చనాస్తి చ । తథా జగద్బ్రహ్మణీదం శూన్యా ఽశూన్యపదం గతమ్ "* అని. ఇఁక నధికరణము లేక భ్రమోత్పత్తి సంభవింప దని చెప్పుచున్నాఁడు.—దృశ్యజాతము ప్రతీత మయినను, మే = నాయొక్క; ఐశ్వరం యోగమ్=ఈశ్వరునితోఁ గూడఁ బుట్టినది యైశ్వరము, ఆధ్యాసిక మైనసంబంధమును; పశ్య = చూడుము. దానినే చెప్పుచున్నాఁడు.—మమ ఆత్మా= నాస్వరూపము; భూతభృత్ = అధికరణరూపంబున భూతములను భరించునది; కాని, నభూతస్థః, అసంగ మగుటవలన. ఆకాశమునందు భూతము లున్నవని గాని ఆకాశము భూతములయం దున్నదని గాని యెవ్వనికేని ప్రతీతము కాదు గదా! అట్లు నాస్వరూపము, భూతభావనః = భూతములు భావ్యన్తే = కల్పింపఁబడుచున్నవి దేనియందో అట్టిది.

రా. నచ మత్స్థాని భూతాని = ఘటాదులు జలాదికమునుం బోలె నేను ధరించువాఁడఁ గాను. మఱి యెట్లు? నాసంకల్పముచేత. పశ్య మమ ఐశ్వరం

* సౌమ్యుఁడా! జలమునందు ఎట్లు తరంగము ఉన్నదియుఁ గాదో లేనిదియుఁ గాదో అట్లు బ్రహ్మమునం దీజగత్తు శూన్యమును అశూన్యము నై యున్నది.

యోగమ్ = ఇతరునియం దెచ్చటను అసంభావనీయంబై నాయందే యసాధారణంబై యైశ్వర్య మగు యోగమును జూడుము. ఏది యా యోగము? భూతభృత్ నచ భూతస్థః మమాత్మా భూతభావనః = సర్వభూతములకును భర్తను నేను, వానిచే నా కేమియు నుపకారము లేదు, నాయొక్క యాత్మయే భూతభావనము — నాయొక్క మనోమయ మైన సంకల్పమే భూతములకు భావయితయు ధారయితయు నియంతయు.

విశే. మత్స్థము లైనను, ఎట్లు ప్రకృతియందు స్పృశించి యున్నవో కా దట్లు నాయం దని చెప్పుచున్నాడు.—"న దృశ్య శ్చక్షుషా చాఽసౌ న స్పృశ్యః స్పర్శనేన చ" * అని గదా మోక్షధర్మమునందు. "సంజ్ఞాసంజ్ఞః" ♦ అనియు. మమ; ఆత్మా=దేహమే; భూతభావనః. "మహావిభూతే ర్మాహాత్మ్య శరీర" ❡ అని గదా మోక్షధర్మమునందు.

యథాఽఽకాశస్థితో నిత్యం వాయు స్సర్వత్రగో మహాన్
తథా సర్వాణి భూతాని మత్స్థానీ త్యుపధారయ. ౬

**భా.** ఈశ్లోకద్వయంబున జెప్పినయర్థమును దృష్టాంతముచే నుపపా దించుచు జెప్పుచున్నాడు.—యథా = ఎట్లు; లోకమునందు, ఆకాశ స్థితః = ఆకాశమునం దున్నదో; నిత్యమ్ = ఎల్లప్పుడును; వాయుః = వా యువు; సర్వత్రగః = అంతటను దిరుగునది; మహాన్ = పరిమాణముచే గొప్పది. తథా = అట్లు; మత్స్థాని = ఆకాశమువలె సర్వగతుఁడ నైన నాయందు సంశ్లేషము లేకయే యున్నవి; సర్వాణి భూతాని = సమస్త భూతములును; ఇతి = అని; ఉపధారయ = ఎఱుంగుము.

ఎట్లు సర్వత్ర సంచరించునట్టి మహాపరిమాణ మయినవాయువు ఎల్లప్పుడు నాకాశమునం దున్నదో అట్లు ఆకాశమువలె సర్వగతుఁడ నైననాయందు సర్వలోకంబులును నన్నంటకయే యున్న వని యెఱుంగు మని తాత్పర్యము.

ఆ. సృష్టిస్థితిసంహారంబుల కసంగాత్మ యాధారం బనుట మయాతత మిద మిత్యాదిశ్లోకద్వయమునం జెప్పినయర్థము, దాని దృష్టాంతముచే నుపపాదించుట్లు?

* ఇతఁడు చక్షుస్సుచే దృశ్యుఁడు కాఁడు, త్వగింద్రియముచే స్పృశింపఁ దగినవాఁడును కాఁడు.

♦ సంజ్ఞచే—శబ్దముచేతనే సమ్యక్జ్ఞానము ఎవ్వనియొక్క—యో అట్టివాఁడు.

❡ మహావిభూతియొక్క—మాహాత్మ్యమే శరీరముగా గలవాఁడా!

మొదట దృష్టాంతముఁ జెప్పుచున్నాఁ డని యన్వయము. ఎల్లప్పుడును అనుటచే నుత్పత్తిస్థితిసంహారకాలము గ్రహింపఁబడుచున్నది. గొప్ప దైన యాకాశాదికము నకు ఇతర మాధార మగుట యెట్లు? అని యాశంకించి చెప్పుచున్నారు మహాన్ అని. ఎట్లు సర్వగామి యగుటవలనఁ బరిమాణమున గొప్ప దైనవాయువు ఆకాశ మునం దెల్లప్పుడు నున్నదో అట్లు ఆకాశాదులు గొప్ప వైనను సర్వభూతంబులును ఆకాశకల్పుఁడై పూర్ణుఁడును బ్రహ్మస్వరూపుఁడును అసంగుఁడు నగు పరమాత్మయందు సంశ్లేషము లేకయే యున్న వని యర్థము.

హ. ఇది దృష్టాంతము.—యథా; ఆకాశస్థితః = ఆకాశమునం దున్నదో, వాయుః=చలనస్వభావము. సర్వత్రగః; మహాన్=మహాపరిమాణము; నిత్యమ్=ఎల్లప్పుడును. తథా=అట్లు; సర్వభూతాధారుఁడ నగుటచే, సర్వాణి భూతాని; మత్స్థాని= నాయం దున్నవి; ఇతి=అని; ఉపధారయ= తెలిసికొనుము.

శం. ఓయీ! గొప్పవి గదా యాకాశాదిభూతములు. అట్లు గొప్పవైన కార్యము లైనవానికి నీయం దవస్థాన మెట్లుపపన్న మగును? అని యాశంకింపఁగా; « స దివో జ్యాయా నన్తరిక్షా జ్జ్యాయాన్ । ఏతావా నస్య మహిమా । అతో జ్యాయాంశ్చ పూరుషః । పాదో ఽస్య విశ్వా భూతాని । త్రిపాదస్యా ఽమృతం దివి » * అనుశ్రుతులవలన మహాత్ముఁడను బరబ్రహ్మము నగునాయందు, చంద్రునందు నైల్యమువలె, ఏకదేశమునందే అవ్యక్తాదిసర్వభూతంబులు నున్నవియని దృష్టాంతసహితముగా నుపపాదించుచున్నాఁడు.—సర్వత్రగః=ఆకాశమును స్పృశింపకయే తాను సర్వత్ర గచ్ఛతి—ఆవిర్భావమును దిరోభావమును బొందుచు సంతతమును జరించుచున్నది కావున సర్వత్రగము; మహాన్ = మహాపరిమాణము గలది; వాయుః = వాయువు; నిత్యమ్=ఎల్లప్పుడును; యథా=ఎట్లు; ఆకాశస్థితః = ఆకాశమునం దున్నది యగునో; తథా=అట్లు; సర్వాణిభూతాని = మహదాదిస్థూలాంతము లగుసర్వభూతములును; మత్స్థాని=పరిపూర్ణుఁడను నిష్క్రియుఁడను నిరాకారుఁడను నిరంతరుఁడను బరబ్రహ్మము నగునాయం దున్నవి; ఇతి=అనియే; ఉపధారయ=నిశ్చయింపుము.

---

* అతఁడు ఆకాశమునకన్నను పెద్ద అంతరిక్షమునకన్నను పెద్ద. ఇంతమాత్రము దీనిమహిమము. దీనికన్నను పురుషుఁడు పెద్ద. వీనియొక్క యొకపాదము—నాలవపాలు సర్వభూతములును. వీనిమూఁడుపాదములు దివియం దమృతమై యున్నది.

మ. అసంశ్లిష్టము లయినవానికిని ఆధారాధేయభావమును దృష్టాంతముచేఁ జెప్పుచున్నాఁడు.—యథా=ఎట్లు; ఆకాశస్థితః = అసంగస్వభావ మయినయాకాశమునం దున్నదో; నిత్యమ్ = ఎల్లప్పుడును, ఉత్పత్తిస్థితిసంహారకాలములయందును; వాతి—వీచుచున్నది కావున, వాయుః=వాయువు, సదాచలనస్వభావము; అందువలననే, సర్వత్ర గచ్ఛతి—అంతటను దిరుగుచున్నది కావున సర్వత్రగము; మహాన్=పరిమాణముచే గొప్పది. ఇట్టిదైనను ఒకప్పుడును ఆకాశముతోఁ గూడ సంశ్లేషము నొందదో. తథా=అట్లే; సర్వాణి భూతాని=గొప్పవియు సర్వత్రగంబులు నగు నాకాశాదిభూతములు; మత్స్థాని=అసంగస్వభావుఁడ నగు నాయందు సంశ్లేషము లేకయే యున్నవి; ఇతి=అని; ఉపధారయ=విమర్శించి నిశ్చయించుకొనుము.

శ్రీ. అసంశ్లిష్టములకుఁ గూడ ఆధారాధేయభావమును దృష్టాంతమునం జెప్పుచున్నాఁడు.—అవకాశము లేక యవస్థానము ♦ అనుపపన్న మగుటవలన, నిత్యమ్; ఆకాశమునం దున్నట్టి వాయువు సర్వత్రగం బైనను గొప్పది యైనను ఆకాశముతో సంశ్లేషము నొందదో, ఆకాశము నిరవయవం బగుటచే సంశ్లేషము సంభవింపమివలన; అట్లు సర్వభూతంబులును నాయం దున్నవి యని యెఱుంగుము.

ప. ఇఁక నసంశ్లిష్టంబులకును ఆధారాధేయభావంబును దృష్టాంతముచే దృఢీకరించుచున్నాఁడు.—అవకాశము లేనిచో నవస్థానం బనుపపన్నం బగుటవలన నిత్యము ఆకాశస్థితంబును గొప్పదియు సర్వగంబు నైనను వాయువు నిరవయవం బగు నాకాశముతో సంశ్లిష్టము గాదో. అట్లు సర్వభూతంబులును నాయం దున్న నైనను నాయందు సంశ్లేషము నొందవు అని, ఉపధారయ=ఎఱుంగుము. చెప్పఁబడినది.—“యథా విశుద్ధ ఆకాశే సహసైవా ఽభ్రమణ్డలమ్ । భూత్వా విలీయతే తద్వదాత్మనీహా ఽఖిలం జగత్” ‡ అని.

రా. ఇది సమస్తంబును దనసంకల్పమున కధీన మయిన స్థితిప్రవృత్తులు కలదనుటకు నిదర్శనము చెప్పుచున్నాఁడు.—ఎట్లు అనాలంబన మయినయాకాశమునందు గొప్పది యగువాయు వున్నదై సర్వత్ర చరించుచున్నదో, ఆవాయువు నిరాలంబనము కావున నాయధీన మయినస్థితి గలది యని యంగీకరింపవలయుటం జేసి

---

♦ ఉనికి.

‡ ఎట్లు విశుద్ధం బగునాకాశమునందుఁ దటాలున మేఘమండలము పుట్టి లయము నొందుచున్నదో అట్లు ఇట ఆత్మయందు సమస్తజగత్తును తటాలునఁ బుట్టి లయము నొందుచున్నది.

నాచేతనే ధరింపఁబడినది యని తెలియుచున్నదో; అట్లు సర్వభూతంబులును వానిచే అదృష్టుఁడ * నగు నాయందున్నవై నాచేతనే ధరింపఁబడినవి యని యెఱుంగుము. అట్లు చెప్పెదరు వేదవిదులు.—“ మేఘోదయ స్సాగర సన్నివృత్తి రిన్దో ర్విభాగ స్స్ఫురితాని వాయోః। విద్యుద్విభఙ్గో గతి రుష్ణరశ్మే ర్విష్ణో ర్విచిత్రాః ప్రభవన్తి మాయాః ” • అని. విష్ణువుయొక్క యనన్యసాధారణంబు లగుమహాశ్చర్యంబులని యర్థము. శ్రుతియును.—“ ఏతస్య వా అక్షరస్య ప్రశాసనే గార్గి సూర్యా చన్ద్రమసౌ విధృతౌ తిష్ఠతః, భీషా ౽స్మా ద్వాతః పవతే। భీషోదేతి సూర్యః । భీషా ౽స్మా దగ్ని శ్చేన్ద్రశ్చ ” § ఇత్యాదికము.

మా. మత్స్థాని నచమత్స్థాని అనుచో దృష్టాంతము చెప్పుచున్నాఁడు.—ఆకాశస్థిత మగువాయువు స్పర్శాదికముఁ బొందదు గదా.

సర్వభూతాని కౌన్తేయ ప్రకృతిం యాన్తి మామికామ్
కల్పక్షయే పున స్తాని కల్పాదౌ విసృజా మ్యహమ్. ౭

భా. ఇట్లు వాయువాకాశమునందుం బోలె నాయందున్నవి సర్వభూతంబులును స్థితికాలమునందు. అట్టి —సర్వభూతాని=సమస్తభూతములును; కౌన్తేయ=అర్జునా! ప్రకృతిమ్ = త్రిగుణాత్మకము అపరము—నికృష్ట మగుప్రకృతిని; మామికామ్=నాదైనదానిని; కల్పక్షయే=ప్రలయకాలమునందు; యాన్తి=పొందుచున్నవి. పునః = వెండియు; తాని=ఆభూతములను; కల్పాదౌ = ఉత్పత్తికాలమునందు; అహమ్ = నేను; విసృజామి=పుట్టించుచున్నాను, పూర్వమువలె.

అర్జునా! అట్టి సర్వభూతంబులును ప్రలయకాలమునందు నాదైన త్రిగుణాత్మక మగునపరప్రకృతిని బొందుచున్నవి. వెండియు వాని నుత్పత్తికాలమునందు నేను బుట్టించుచున్నా నని తాత్పర్యము.

---

* చూడఁబడ వాఁడను.

• మేఘ ముదయించుటయు సముద్రము నిలుచుటయు—చంద్రునిభాగంబును—వృద్ధిక్షయంబులును వాయువు వీచుటలును మెఱుపులు మెఱయుటయును సూర్యునిగతియు—విష్ణువిచిత్రమాయలు పుట్టుచున్నవి.

§ వీనివలని భయముచే వాయువు వీచుచున్నాఁడు। భయముచే సూర్యుఁ డుదయించుచున్నాఁడు। వీనివలనిభయముచే అగ్నియును ఇంద్రుఁడును.

అ. ఆకాశమునందు వాయువువలె నుండునట్లు ఆకాశాదిభూతములు స్థితి కాలమునందుఁ బరమేశ్వరునందుండునేని, అప్పుడు ప్రలయకాలమునందు మఱి యెక్కడ నుండు నని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. ప్రకృతిశబ్దమునకు స్వభావార్థమును వ్యావర్తించుచున్నారు త్రిగుణాత్మక మని. అదియు అపరేయమ్ అని మున్నే సూచితం బని చెప్పుచున్నారు అపర మని. అదియు నీశ్వరాధీనం బగుటచే నస్వతంత్రం బని చెప్పుచున్నారు నా దైవదాని అని. ప్రలయకాలమునందు భూతములు అపరప్రకృతిని బొందు ననునప్పుడు ఉత్పత్తికాలమునందును వాని కాయపరప్రకృతివలననే యుత్పత్తి కలుగుటవలన సృష్టి యీశ్వరాధీనము కాదని యేర్పడు నని యాశంకించి చెప్పుచున్నారు పునః ఇత్యాదిగా.

హ. కౌన్తేయ=సర్వభూతాని; మామికామ్; ప్రకృతిమ్—ప్రసవించుధర్మము గలదానిని; యాన్తి=పొందుచున్నవి, లయించుచున్నవి యని యర్థము; కల్పక్షయే= కల్పింపఁబడుచున్నది—సృజింపఁబడుచున్నది కావున కల్ప మనఁగా మహదాదిప్రపంచము, దాని క్షయము—మహాప్రలయము, దానియందు. పునః; తాని=ఆభూతములను; కల్పాదౌ=కల్పాంతర ప్రారంభమునందు; విసృజామి.

శం. ఇట్లు సర్వభూతంబులకును ఆకాశమునందు వాయువునకుంబోలె తన యందే స్థితిం జెప్పి యిప్పుడు తనయందే ప్రలయము నుత్పత్తిని జెప్పుచున్నాఁడు.—— « అవ్యక్తాద్వ్యక్తయః » అనుచో నేది భూతములకుఁ బ్రలయాదికము చెప్పఁబడిన దో అది దైనందినము. ఇప్పుడు ప్రాకృతప్రలయాదికము చెప్పబడుచున్నది. ఏవి నాయందున్నవో అవియే, సర్వభూతాని=ఆకాశాదులు; కల్పక్షయే=కల్ప మనఁగా బ్రహ్మకల్పము, దానికి క్షయము కలిగినప్పుడు, మహాప్రలయము ప్రాప్తించినప్పుడు; మామికామ్=మదీయ మయిన; అపరాఖ్య మయిన, ప్రకృతిమ్ = త్రిగుణాత్మకమగు మాయను, « మాయాంతు ప్రకృతిం విద్యాత్ » అని శ్రుతిప్రసిద్ధ మయినదానిని; యాన్తి—తమయుత్పత్తికి వ్యుత్క్రమముగాఁ బ్రకృతియందుఁ బ్రలయము నొందుచున్న వని యర్థము. తాని=ప్రకృతియందే వి లయము నొందినవో ఆభూతములనే; కల్పాదౌ=బ్రహ్మకల్పాదియందు; పునః=మఱల; అహమ్; విసృజామి—నాప్రకృతిద్వారంబున యథాక్రమముగ యథాలక్షణముగ జగత్తును బుట్టించుచున్నా నని యర్థము.

మ. ఇట్లుత్పత్తికాలమునందును స్థితికాలమునందును గల్పితం బగుప్రపంచముతో నసంగుం డైనయాత్మకు సంశ్లేషము లే దని ప్రతిపాదించి ప్రలయమునం

సంబంధము సంశ్లేషము లేదని చెప్పుచున్నాఁడు.—సర్వభూతాని = సమస్తభూతములును; కల్పక్షయే=ప్రలయకాలమునందు; మామికామ్=నాశక్తిగాఁ గల్పిత మయిన; ప్రకృతిమ్ = త్రిగుణాత్మక మయినమాయను, తమకుఁ గారణ మయినదానిని; యాన్తి– అందే సూక్ష్మరూపంబున లయము నొందుచున్నవి యని యర్థము. ఓ కౌంతేయుఁడా! పునః; కల్పాదౌ = సర్గకాలమునందు; విసృజామి = ప్రకృతియందు అవిభాగమును * పొందియున్నవానిని విభాగంబున వ్యక్తీకరించుచున్నాను; అహమ్= నేను, సర్వజ్ఞుఁడను సర్వశక్తిని ఈశ్వరుఁడను.

శ్రీ. ఇట్లు అసంగునకే యోగమాయచే స్థితిహేతుత్వము చెప్పఁబడినది. అట్లే సృష్టిప్రలయహేతుత్వము గూడఁ జెప్పుచున్నాఁడు —కల్పక్షయే = ప్రలయకాలమునందు; సర్వభూతంబులును నాదైనప్రకృతిని పొందుచున్నవి – త్రిగుణాత్మిక యగు మాయయందు లయము నొందుచున్నవి. పునః; కల్పాదౌ = సృష్టికాలమునందు; తాని; విసృజామి = విశేషంబున సృజించుచున్నాను.

ప. అసంగుఁడనైనను నాకు జగత్కారణత్వంబును జగత్తునకు మిథ్యాత్వంబును సత్త్వత్వంబును మాయచే నగుచున్నది యని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఓకౌంతేయుఁడా! కల్పక్షయే = కల్పప్రలయమునందు; సర్వభూతాని; మామికామ్ = మత్సంబంధి యయిన; ప్రకృతిమ్; యాన్తి. అట్లు, కల్పాదౌ; పునః; తాని; విసృజామి.

రా. సకల మయిన యితరము నపేక్షింపకయే భగవంతునిసంకల్పమువలన సర్వభూతంబులకును స్థితియుఁ బ్రవృత్తియుఁ జెప్పఁబడినది. అట్లు తత్సంకల్పమువలననే యుత్పత్తిప్రలయంబులు నని చెప్పుచున్నాఁడు.—సర్వభూతాని = స్థావరజంగమాత్మకంబు లగుసకలభూతంబులును; మామికామ్ = నాకు శరీరభూత మయిన; ప్రకృతిమ్ = తమస్సు అను పేరు గలదానిని, నామరూపవిభాగమునకు అయోగ్య మయినదానిని; కల్పక్షయే = చతుర్ముఖుని యవసానసమయమునందు; నాసంకల్పమువలన, యాన్తి= పొందుచున్నవి. తాని= ఆభూతములనే; కల్పాదౌ; పునః; అహమ్; విసృజామి. అట్లు మనువు—« ఆసీ దిదం తమోభూతమ్ . . . సో ఽభిధ్యాయశరీరాత్స్వాత్ » అని. శ్రుతియును—« యస్యా వ్యక్తం శరీరమ్, అవ్యక్త మక్షరే

---

* కలయికను.

లీయతే । అక్షరం తమసి లీయతే" ఇత్యాదికము. "తమ ఆసీత్తమసా గూఢమగ్రే ప్రకేతమ్" అనియును.

మూ. జ్ఞానప్రదర్శనమునకొఱకుఁ బ్రళయాదికమును బ్రపంచించుచున్నాఁడు సర్వభూతానీత్యాదిగా.

ప్రకృతిం స్వామవష్టభ్య విసృజామి పునః పునః
భూతగ్రామమిమం కృత్స్నమవశం ప్రకృతేర్వశాత్. ౮

భా. ఇట్లవిద్యాలక్షణమయిన, ప్రకృతిమ్ = ప్రకృతిని; స్వామ్ = నాదైనదానిని; అవష్టభ్య = వశీకరించి; విసృజామి = పుట్టించుచున్నాను; పునఃపునః = మాటిమాటికి; ప్రకృతివలనఁ బుట్టిన, భూతగ్రామమ్ = భూతసముదాయమును; ఇమమ్ = వర్తమానమయినదానిని; కృత్స్నమ్ = సమస్తమును; అవశమ్ = అస్వతంత్రమైనదానిని, అవిద్యాదిదోషములచేఁ బరవశముగాఁ జేయఁబడినదానిని; ప్రకృతేః వశాత్ = స్వభావవశమువలన.

ఇట్లు అవిద్యాలక్షణమగు నాదైన ప్రకృతిని వశీకరించి స్వభావవశము వలన నవిద్యాదిదోషములచేఁ బరవశమై యీ ప్రకృతివలనఁ బుట్టుచున్నట్టి యీ భూతసమూహము సమస్తమును మాటిమాటికిఁ బుట్టించుచున్నాను అని తాత్పర్యము.

ఆ. అప్పుడు, ఎట్టిది ప్రకృతి? అదియు నెట్లు సృష్టియందుపయోగించును? అని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. సంసారమున కనాదిత్వము తెలుపుటకై పునఃపునః అని చెప్పఁబడినది. భూతసముదాయము నవిద్యాఽస్మితాదిదోషపరవశం బనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు స్వభావవశమువలన నని.

హ. ప్రకృతిమ్; స్వామ్; అవష్టభ్య = ఆశ్రయించి; విసృజామి; పునఃపునః = మాటిమాటికి; అవశమ్ = పరవశమయినదానిని; ప్రకృతేః; వశాత్ = ప్రాధాన్యమువలన.

శం. "య ఏకో వర్ణో బహుధా శక్తియోగాద్వర్ణాననేకాన్నిహితార్థో దధాతి । విచైతి చాన్తే విశ్వమాదౌ స దేవః స నో బుద్ధ్యా శుభయా సంయునక్తు" * అను శ్రుతివలన, తాను కూటస్థాసంగచిద్రూపుఁడైనను బరమాత్మ తన

* ఎవ్వఁడు ఒక్కఁడే వర్ణమై శక్తియోగమువలన బహువిధములుగా ననేకములను వర్ణములను నిహితార్థుఁడై ధరించుచున్నాఁడో ఆదియందును అంతమునందును బ్రపంచమును వ్యాపించి యున్నాఁడో అట్టి దేవుఁడు మమ్ము శుభమయినబుద్ధితోఁ గూర్పుఁ గాక.

యుపాధిధర్మ మయిన భూతసృష్ట్యాదికమును స్వధర్మమునుగా నిరూపించుచున్నాఁడు, «ఇతఁడే జగదుత్పత్తిస్థితిలయములఁ జేయువాఁడు సర్వజ్ఞుఁడు మోక్షదాతయును, ఇతని నారాధించి మేము కృతార్థుల మగుదుము» అని ముముక్షువులు సగుణబ్రహ్మము నుపాసింపవలయు నని సూచించుటకు. లేక, కొందఱు జగత్తున కీశ్వరుఁడే లేఁ డని తలంచెదరు, వారిమతమును నిరసించుటకు—మాయ యనుపేరు గలదాని, స్వామ్=తన కుపాధిభూత మయినదాని; ప్రకృతిమ్—శుద్ధసత్త్వాత్మికను; అవష్టభ్య=గ్రహించి; నేను పరమేశ్వరుఁడను, ప్రకృతేః వశాత్=అవిద్యాఽస్మితాఽభినివేశరాగద్వేషాత్మక మయినప్రకృతియొక్క—స్వభావముయొక్క వశమువలన. అవశమ్=అస్వతంత్ర మయిన, అనాదిసంసారవాసనాగ్రస్త మయిన; ఇమమ్=ఈకనఁబడుచున్న; భూతగ్రామమ్=దేవతిర్యఙ్మనుష్యాదిరూప మయినప్రాణిసమూహమును; కృత్స్నమ్=సమస్తమును; సంహరించి, పునఃపునః=మాటిమాటికి; విసృజామి—వారికర్మముల కనురూపముగా నానాయోనులయందుఁ బుట్టించుచున్నా నని యర్థము. ఇందుచే «ప్రాణులకుఁ గర్మము నిమిత్తమాత్రము, నేనేస్రష్టను భర్తను సంహర్తను నేతను, నాకన్న నితరుఁ డీశ్వరుఁడు లేఁడు» అని సూచిత మగుచున్నది. అట్లు శ్రుతి «ఏష సర్వేశ్వర ఏష భూతానామ్" అని.

మ. పరమేశ్వరుని కైనయీసృష్టి యేలకొఱకు? తనకు భోగార్థ మేమో కాదు, సర్వసాక్షిభూతచైతన్యమాత్రుఁ డైనయతనికి భోక్తృత్వము లేమివలన, కలదను నో సంసారిత్వము సంభవించుటచే నీశ్వరత్వము వ్యాహత మగుటవలన. ఇతరుఁడు భోక్త కలఁడు, వానికొఱ కీసృష్టి యన వలను లేదు, చేతనాంతరము లేమివలన, ఈశ్వరుఁడే సర్వత్ర జీవరూపంబున నున్నవాఁ డగుటవలన, అచేతనమో అభోక్త యగుటవలన. ఇందువలననే మోక్షార్థము గూడఁ గాదు సృష్టి, బంధము లేమివలనను మోక్షవిరోధి యగుటవలనను—ఇది మొదలగు ననుపపత్తి సృష్టికి మాయామయత్వము సాధించుచున్నదై మాకుఁ బ్రతికూలము కాదు, కావునఁ బరిహర్తవ్యము కా దనునభిప్రాయమున మాయామయం బగుటవలనఁ బ్రపంచము మిథ్య యని చెప్ప నారంభించుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—ప్రకృతిమ్—అనిర్వచనీయ మయి మాయ యనుపేరు గలదాని; స్వామ్=తనయందుఁ గల్పిత మయినదాని; అవష్టభ్య=తనసత్తాస్ఫూర్తులచే దృఢీకరించి; అట్టి, ప్రకృతేః=మాయయొక్క; వశాత్=అవిద్యాఽస్మితా రాగద్వేషాభినివేశకారణము లయినయావరణవిక్షేపశక్తుల ప్రభావమువలన; పుట్టుచున్నట్టి, ఇమమ్ = సర్వప్రమాణములచేతను

సన్నిహితముగాఁ దోఁచుచున్న; భూతగ్రామమ్=ఆకాశాదిభూతసముదాయమును; నేను మాయావివలె, పునః పునః; విసృజామి=వివిధముగా సృజించుచున్నాను కల్పనా మాత్రంబున, స్వప్నద్రష్టయునుం బోలె స్వప్నప్రపంచమును.

శ్రీ. ఓయీ! అసంగుఁడవు నిర్వికారుఁడవు నగు నీ వెట్లు సృజించు చున్నావు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—స్వామ్=స్వీయ మయిన, స్వాధీన మయిన; ప్రకృతిమ్; అవష్టభ్య=అధిష్ఠించి; ప్రలయమునందు లీన మయి యున్న చతుర్విధ మగునీభూతగ్రామమును సమస్తమును కర్మాదివశ మయినదాని మాటిమాటికి వివిధముగా సృజించుచున్నాను. ఎట్లు? ప్రకృతేః వశాత్=ప్రాచీనకర్మముచేఁ గలిగిన తత్తత్స్వభావబలమువలన.

ప. అవశమ్=పరవశమును. ఎందువలన? ప్రకృతేర్వశాత్=ప్రాచీన కర్మముచేఁ గలుగు స్వభావముయొక్క బలమువలన.

రా. స్వకీయ మయినవిచిత్రపరిణామిని యగు, ప్రకృతిమ్; అవష్టభ్య = ఎని మిదివిధములుగాఁ బరిణమింపఁజేసి; ఇమమ్=ఈ నాలుగువిధము లయిన దేవతిర్యఙ్మను ష్యస్థావరాత్మక మగు; భూతగ్రామమ్; ప్రకృతేః = నాదైనమోహిని యగు గుణ మయప్రకృతియొక్క; వశాత్; అవశమ్ = అస్వతంత్ర మయినదానిని; పునఃపునః= ఆయాకాలమునందు; విసృజామి.

మా. ఎట్లు ఒకానొకఁడు పాదచారంబున నడచుటకు సమర్థుఁడైనను లీలమెయి కఱ్ఱ నూని నడుచునో అట్లు ప్రకృత్యవష్టంభము. «సర్వభూతగుణై ర్యుక్తం నైవం మాం జ్ఞాతు మర్హసి, సర్వభూతగుణై ర్యుక్తం నైవం మాం జ్ఞాతు మర్హసి» ♦ అని మోక్షధర్మమునందు. «విదిత్వా సప్తసూక్ష్మాణి షడఙ్గం చ మహేశ్వరమ్। ప్రధాన వినియోగస్థః పరం బ్రహ్మాధిగచ్ఛతి" * అనియు «న కుత్ర చిచ్ఛక్తి రనన్తరూపా విహన్యతే తస్య మహేశ్వరస్య। తథా ఽపి మాయా

♦ సర్వవస్తువులసామర్థ్యములతోఁ గూడినవాని నన్ను—భూతములచేఁ బరతంత్రునిఁగాఁ దెలియ వలదు, సర్వభూతసామర్థ్యములతోఁ గూడినవాని నన్ను దేహోపేతునిఁగా నెఱుంగకుము.

* ఏడుసూక్ష్మములను—పంచభూతములను మహదహంకారములను, సర్వజ్ఞత్వము తృప్తి మొదలగు నాఱంగములు గల మహేశ్వరునిఁ దెలిసి మూలప్రకృతికార్యముల నెఱింగినవాఁడు పరబ్రహ్మమును పొందుచున్నాఁడు.

మధిరుహ్య దేవః ప్రవర్తతే సృష్టివిలాపనేషు" ** అని ఋగ్వేదఖిలములయందు. "మయ్యనన్తగుణే ఽనన్తే గుణతో ఽనన్తవిగ్రహే" అని భాగవతమునందు. "అథ కస్మాదుచ్యతే పరం బ్రహ్మేతి బృహతి బృంహయతి" § అనియు నాథర్వణమునందు. "పరాఽస్య శక్తిర్వివిధైవ శ్రూయతే" అనియు "విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి, న తే విష్ణో జాయమానో న జాతో దేవ మహిమ్నః పరమన్తమాప" • ఇత్యాదికమునవలనను. ప్రకృతేర్వశాత్ అవశమ్—"త్వమేవైతత్సృజసే సర్వకర్మణ్యానన శక్త్యాఽపి స్వమాయయైవ। మాయావశం చాఽవశం లోకమేతత్తస్మాత్సృజస్యత్సి పాసీశ విష్ణో" * అని గౌతమఖిలములయందు.

న చ మాం తాని కర్మాణి నిబధ్నన్తి ధనఞ్జయ
ఉదాసీనవదాసీనమసక్తం తేషు కర్మసు. ౯

భా. అప్పుడు, అట్టి పరమేశ్వరునకు నీకు విషమ మయినభూతగ్రామమును సృజించువానికిఁ దన్నిమిత్తము లయినధర్మాఽధర్మములతో సంబంధము సంభవించును. అనఁగా నిది చెప్పుచున్నాఁడు భగవంతుఁడు — మామ్=ఇట్టి నన్ను; తాని=భూతగ్రామమును విషమముగా సృజించుటచేఁ గలుగునట్టి; కర్మాణి=కర్మములు; ననిబధ్నన్తి=బంధింపవు. ధనఞ్జయ=అర్జునా! వానియందుఁ గర్మములసంబంధము లే దనుటకుఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—ఉదాసీనవత్ = ఉదాసీనుఁడు—ఉపేక్షకుఁడు ఒకానొకఁడు ఎట్లో అట్లు; ఆసీనమ్=ఉన్నవానిని, ఆత్మ యవిక్రియుఁ డగుటవలన; తేషు కర్మసు=ఆకర్మములయందు; అసక్తమ్=ఫలాసంగము లేని

---

** అమ్మహేశ్వరుని యనంతరూప మయినశక్తి రొంమును అడ్డుపడదు, అట్లయినను అతఁడు మాయ నవలంబించి సృష్టియందును ప్రలయమునందును బ్రవర్తించుచున్నాఁడు.

§ ఇఁక నెందువలనఁ బరబ్రహ్మ మని చెప్పఁబడుచున్నది? పెద్దది, పెద్దగాఁ జేయుచున్నది.

• ఎవ్వఁడు పృథివియందలి పరాగములను లెక్కపెట్టునో అట్టివాఁడు గూడ నెవ్వఁడు విష్ణువుయొక్క వీర్యములను జెప్పఁగలఁడు? ఓవిష్ణూ! పుట్టుచున్నవాఁడుగాని పుట్టినవాఁడుగాని దేవా! నీమహిమముయొక్క యంతము నెఱుంగలేఁడు.

* అనంతుఁడా! నీవే యీలోకము సృజించుటయందు సర్వకార్యములందును సమర్థుఁడ వైనను నీమాయచేతనే మాయావశంబును అందువలన అవశంబు నగు నీలోకమును సృజించుచున్నావు భక్షించుచున్నావు రక్షించుచున్నావు, ఈశుఁడా! విష్ణూ!

వానిని, నేను జేయుచున్నా నని యభిమానము లేనివానిని. ఇందువలన నితరునకును గర్తృత్వాభిమానాభావంబును ఫలాసంగాభావంబును బంధము లేమికిఁ గారణము, లేనిచో మూఢుఁడు కర్మములచే బంధింపఁబడుచున్నాఁడు కోశకారక్రిమివలె * నని యభిప్రాయము.

అర్జునా! ఉదాసీనునివలె నున్నవాఁడను ఆకర్మములయందుఁ గర్తృత్వాభిమానంబును ఫలాసక్తియు లేనివాఁడ నగుటవలన న న్నాధర్మాధర్మములు బంధింపవు. అని తాత్పర్యము.

ఆ. ప్రాకృతమయి స్వభావంబువలన నవిద్యాదిపరతంత్రమై విషమ మగు భూతగ్రామమును నీవు సృజింతువేని, అప్పుడు నీకు విషమసృష్టిప్రయుక్త మయిన ధర్మాదులు సంభవించును, కావున నీకీశ్వరత్వము లేకపోవు నని శంకించుచున్నారు అప్పుడు ఇత్యాదిగా. వానియందు—ఆపరమేశ్వరునందు. ఈశ్వరునకు ఫలాసంగము లేమివలనను గర్తృత్వాభిమానము లేమివలనను గర్మములతో సంబంధము లేకుండు నట్లు, ఈశ్వరునికంటె నితరునకుఁ గూడ ఆరెండును లేమి ధర్మాదిసంబంధము లేమికిఁ గారణ మని చెప్పుచున్నారు ఇందువలన నిత్యాదిగా. కర్మములయందుఁ గర్తృత్వాభిమానము గాని ఫలాసంగము గాని యుండునెడ నాపకమునఁ జెప్పుచున్నారు లేనిచో నిత్యాదిగా.

హ. మఱియు నొకటి.—తానికర్మాణి; మామ్; ననిబధ్నన్తి. ధఃష్ఠయు. జగదుత్పత్తిస్థితిసంహారకర్మములు నాకు బంధహేతువులు కా వని యర్థము. ఎందువలన ననగాఁ జెప్పుచున్నాఁడు.—ఉదాసీనుఁడు—ఉపేక్షకుఁడు, వానియట్లు; ఆసీనమ్=పక్షపాతము లేక యున్నవానిని; తేషు కర్మసు = సృష్టిస్థితిసంహారకర్మములయందు; అసక్తమ్=ఫలాసక్తి లేనివానిని. ఇందువలనఁ దెలియవచ్చుచున్నది—ఫలాసక్తి లేని వానిని గర్మములు బంధింప వని.

శం. ఓయీ! ఇట్లు భూతగ్రామమును మాటిమాటికి నానాయోనులందుఁ బుట్టించుచు సంహరించుచు స్వర్గమును నరకమును బొందించుచున్న నీకును బుణ్యపాపకర్మసంబంధము సంభవించు నని యాశంకింపఁగా. అట్లు సంభవింపదు, భూతములసంహారమును సృష్టియును సుఖదుఃఖాదిఫలము నొందించుటయు సమస్తమును ప్రకృతియొక్క కార్యమే, ఆత్మకు నాకు అవిక్రియునకు అసంగునకు అవ్యక్తమూర్తికి

* సాలెపురుగువలె.

వాస్తవంబునఁ దత్కార్యలేశముతో నేనియు సంబంధము లేదు, అని ప్రకృతికృతము లయినసృష్ట్యాదులయందుఁ దా నసంగోదాసీనుఁ డనుటనే ప్రతిపాదించుచున్నాఁడు.— చకారము తు అనుదానియర్థము గలది. తానికర్మాణి = ఆభూతసృష్టిసంహారాదికర్మములు ప్రకృతిచేఁ జేయఁబడినవి; మాంచ=పరమాత్మను అసంగుని అవిక్రియుని తటస్థుని నన్నే; న నిబధ్నన్తి—నాకు బంధము కలిగింపవు, నన్ను స్పృశింప వని యర్థము. తనతటస్థత్వమునే ప్రతిపాదించుచున్నాఁడు.— తేషు కర్మసు = ప్రకృతిచేఁ జేయఁబడిన యాసృష్ట్యాదికర్మములయందు; అసక్తమ్=సక్తి యనఁగా సంయోగసంబంధము, అది లేనివానిని అసంగుని; అందువలననే, ఉదాసీనవత్=ఉదాసీనుఁ డనఁగా ఊరక యుండువాఁడు తటస్థుఁడు, వానియట్లు; ఆసీనమ్=ప్రకృతికిని దత్కార్యంబులకును సాక్షినై దూరంబున నున్నవానిని. అట్టి నన్ను తత్కర్మములు స్పృశింప వని యర్థము. ఇందుచే, ఉపాధియందును తద్ధర్మములయందును తత్కర్మములయందును అసక్తుఁడై తత్సాక్షియై యున్నవానిని ఆకాశమువలె అసంగుఁడును అవిక్రియుఁడు నగు తన్ను ఏబ్రహ్మవిదుఁ డగుయతి యెఱుంగుచున్నాఁడో అతఁడు ఉపాధికృతంబు లగు విహితప్రతిషిద్ధకర్మములచే బద్ధుఁడు కాఁ డని సూచిత మగుచున్నది.

మ. ఇందువలన.—తాని= ఆసృష్టిస్థితిప్రలయాఖ్యము లగు; కర్మాణి=కర్మములు, మాయావిచేతం బోలె స్వప్నద్రష్టచేతం బోలె నాచేఁ జేయఁబడుచున్నవి; మామ్=నన్ను; నచ నిబధ్నన్తి=బంధింపనే బంధింపవు, అనుగ్రహనిగ్రహములవలన సుకృతదుష్కృతవంతునిగాఁ జేయవు, మిథ్యాభూతంబు లగుటవలన. ఓధనంజయుఁడా! యుధిష్ఠిరుని రాజసూయమునకొఱకు సర్వరాజులను జయించి ధనముఁ దెచ్చినవాఁడవని మహాప్రభావము సూచింపఁబడినది ప్రోత్సాహనమునకొఱకు. ఆకర్మము లెందువలన బంధింపవు? అందుకుఁ జెప్పుచున్నాఁడు.—ఉదాసీనవత్ ఆసీనమ్=ఏ ట్లొకానొకయుపేక్షకుఁడు ఇద్దఱు వాదులాడుచుండఁగా జయపరాజయముల సంబంధము లేనివాఁడై వానిచేఁ గలుగుహర్షవిషాదము లొందక నిర్వికారుఁడై యుండునో అట్లు నిర్వికారుఁడనై యున్నవానిని; ఇద్దఱు వాదులాడువా రిచ్చట లేమివలన ఉపేక్షకత్వమాత్రసాధర్మ్యముచే వతిప్రత్యయము; ఇందువలననే నిర్వికారుఁడ నగుటవలన, తేషు కర్మసు=ఆసృష్ట్యాదికర్మములయందు; అసక్తమ్=నేను జేయుచున్నాను అనునట్టి యభిమానరూప మయినసంగము లేనివానిని. అట్టి న్ను బంధింపవు కర్మము లనుట యుక్తమే. ఇతరునకును గదా కర్తృత్వము లేని యప్పుడును ఫలాసంగము లేనియప్పుడును కర్మములు బంధహేతువులు కా వని చెప్పఁబడినది దీని

చేత. ఆ రెండును ఉన్ననో కోశకారమువలెఁ గర్మములచే బంధింపఁబడుచున్నాఁడు మూఢుఁ డని యభిప్రాయము.

శ్రీ. ఓయీ! ఇట్లు నానావిధము లగుకర్మములను జేయుచున్న నీకు జీవునకుంబోలె బంధం బెట్లు లేక పోవును? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.— తాని కర్మాణి=ఆసృష్ట్యాదికర్మములు; మామ్; నినిబధ్నన్తి. కర్మమునం దాసక్తి గదా బంధహేతువు. అదియో ఆప్తకాముఁడ నగుటవలన నాకు లేదు. అందువలన; ఉదాసీనునివలె వర్తించుచున్న నాకు బంధమును గలిగింపవు. ఉదాసీనుఁడైనయెడఁ గర్తృత్వ మనుపపన్న మగుటవలనను కర్త యైనచో నుదాసీనత్వ మనుపపన్న మగుటవలనను ఉదాసీనవత్ అని చెప్పఁబడినది.

వ. •

రా* ఇట్లయినయెడ విషమసృష్ట్యాదికర్మములు నైర్ఘృణ్యాము * నాపాదించి భగవంతుని బంధించునసఁగాఁ జెప్పుచున్నాఁడు.— తాని=ఆవిషమసృష్ట్యాదు లగు; కర్మాణి=కర్మములు; మామ్; నచ నిబధ్నన్తి—నాయందు నైర్ఘృణ్యాదికము నాపాదింపవు, ఎందువలన ననఁగా, క్షేత్రజ్ఞులయొక్క పూర్వకృతము లగు కర్మములే దేవాదివిషమభావమునకు హేతువులు. నేనో, అందు నైషమ్యమునందు ఆసక్తుఁడను, అందు ఉదాసీనునివలె నున్నవాఁడను. అట్లు చెప్పుచున్నాఁడు సూత్రకారుఁడు.—« వైషమ్య నైర్ఘృణ్యే న సాపేక్షత్వాత్ తథాహి దర్శయతి, న కర్మవిభాగా దితిచే న్నాఽనాదిత్వాత్ » ‖ అని.

మ॰ ఉదాసీనవత్=ఉదాసీనునివలె. ఉదాసీనుఁ డేమో కాఁడు. దానియర్థముఁ జెప్పుచున్నాఁడు అసక్త మ్మని. « అవాక్యనాదరః » అని శ్రుతి. « ద్రవ్యం కర్మచ కాలశ్చ స్వభావో జీవ ఏవచ । య దనుగ్రహాత స్సన్తి నసన్తి య దుపే

• శ్రీధరీయముతో సమానము.

* నిర్ఘృణతను.

‖ బ్రహ్మసూ. అ-౨. పా-౧. సూ-౩౪-౩౫. విషమసృష్టికి ఈశ్వరుఁడు కారణ మనునెడ నతనికి వైషమ్యనైర్ఘృణ్యములు సంభవించును, అనఁగా, సంభవింపవు, సాపేక్షుఁ డగుటవలన—సృజింపఁబడు ప్రాణుల ధర్మాధర్మముల నపేక్షించి విషమముగా సృజించువాఁ డగుటవలన, అట్లు శ్రుతి చెప్పుచున్నది. కర్మము లేదు, సృష్టికి ముందు శరీరాదులు లేమింజేసి విభాగము లేమివలన, అనఁగా, అట్లు కాదు, సంసారం బనాది యగుటవలన.

క్షయా" ♦ అని భాగవతమునందు. ఎవ్వని యసక్తిచేతనే సర్వకర్మశక్తి యగునో ఎక్కడిది వానికి సర్వకర్మబంధ మని భావము. "నకర్మణా వర్ధతే నోకనీయాన్" * అని గదా శ్రుతి. ఎవ్వఁడు కర్మములను నియమించుచున్నాఁడో యెట్లు అతనిఁ గర్మము బంధించును?

మయాఽధ్యక్షేణ ప్రకృతి స్సూయతే సచరాచరమ్
హేతునాఽనేన కౌన్తేయ జగ ద్విపరివర్తతే. ౧౦

భా. అందు, "భూతగ్రామ మిమం విసృజామి, ఉదాసీనవదాసీనమ్" అని విరుద్ధము చెప్పుచున్నావు, అనఁగా తత్పరిహారార్థము చెప్పుచున్నాఁడు.—మయా=నాచేత; అధ్యక్షేణ=అంతటను దృశిమాత్రస్వరూపుఁడనై అవిక్రియాత్ముఁడ నగువానిచేత; ప్రకృతిః = నాయొక్క-మాయ త్రిగుణాత్మకము అవిద్యాలక్షణ మగుప్రకృతి; సూయతే = పుట్టించుచున్నది; సచరాచరమ్ = జంగమస్థావరములతోఁ గూడిన ప్రపంచమును; అట్లు మంత్రవర్ణము.—"ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా । కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ" అని. అనేన హేతునా= నిమిత్తభూత మయిన యీ యధ్యక్షత్వముచేత; కౌన్తేయ = అర్జునా! జగత్ = చరాచరసహితము; వ్యక్తాఽవ్యక్తాత్మక మగుజగత్తు; విపరివర్తతే = వివిధముగాఁ దిరుగుచున్నది, సర్వావస్థలయందును. దృశికర్మత్వాపత్తినిమిత్తము § గదా జగత్తుయొక్క సర్వప్రవృత్తియు—నేను దీని భుజించెదను, దీనిఁ జూచుచున్నాను, దీని వినుచున్నాను, సుఖము ననుభవించుచున్నాను, దుఃఖము ననుభవించుచున్నాను. దానికొఱకు దీనిఁ జేసెదను, దీనికొఱకు దీనిఁ జేసెదను, దీని నెఱింగెదను—ఇత్యాదికము, అవగతినిష్ఠము అవగత్యవసానమే ?. "యో అస్యాఽధ్యక్షః పరమే వ్యోమన్" ఇత్యాదికములగు మంత్రవర్ణంబులును ఈయర్థమును బ్రదర్శించుచున్నవి. అందు

♦ ద్రవ్యమును కర్మమును కాలమును స్వభావంబును జీవుండును ఎవ్వనియనుగ్రహముచే నున్నారో ఎవ్వని యుపేక్షచే నుండరో.

* కర్మముచే వృద్ధిఁ బొందఁడు తగ్గఁడు.

§ జ్ఞానమునకు విషయ మగుటను బొందుటయే నిమిత్తముగాఁ గలది.

? జ్ఞానమునందే నిష్ఠ-ఉనికి గలది, జ్ఞానమునందే యవసానము గలది.

వలన సర్వాధ్యక్షభూతచైతన్యమాత్రుఁడు పరమార్థంబున సర్వభోగ సంబంధము లేనివాఁడు ఒక్కఁడే యగుదేవునకు, ఇతరుఁడు చేతనుఁడు లేనిచో నాఁడు ఇతరుఁడు భోక్త లేమివలన నెందుకొఱకీసృష్టియను నీ విషయమునందుఁ బ్రశ్నంబును బ్రతివచనంబును అనుపపన్నములు, "కో అద్ధా వేద క ఇహ ప్రవోచ త్కుత ఆజాతా కుత ఇదం విసృష్టిః"* ఇత్యాది మంత్రవర్ణములవలన. ప్రదర్శింపఁబడినది కూడ భగవంతుని చేత.—"అజ్ఞానేనా ఽఽవృతం జ్ఞానం తేన ముహ్యన్తి జన్తవః" అని.

నేను సాక్షిభూతుఁడనై యుండుటచే నాయవిద్యాలక్షణ మయినప్రకృతి చరాఽచరసహిత మయినజగత్తును సృజించుచున్నది. నాసాక్షిత్వ మను హేతువు చేతనే ప్రపంచము నానావిధముగాఁ బరివర్తనము నొందుచున్నది యని తా.

**ఆ॰** ఈశ్వరునందు స్రష్టృత్వమును ఔదాసీన్యంబును విరుద్ధమని శంకించు చున్నాఁడు అంద ఇత్యాదిగా. అందు—పూర్వగ్రంథమునందు విరోధ పరిహారా ర్థము మీఁదిశ్లోకమును దించుచున్నారు తత్పరిహారార్థము ఇత్యాదిగా. మయా అధ్యక్షేణ అను రెండుతృతీయలు సమానాధికరణము లని యంగీకరించి వ్యాఖ్యా నము చేయుచున్నారు మయేత్యాదిగా. ప్రకృతి శబ్దార్థముఁ జెప్పుచున్నారు నా యొక్క ఇత్యాదిగా. అదియు జ్ఞానము కాదని చెప్పుచున్నారు త్రిగుణాత్మకము అని. సాంఖ్యులు చెప్పుప్రధానము కాదని తెలుపుచున్నారు అవి ద్యేత్యాదిగా. సాక్షియనుటకుఁ బ్రమాణమును జెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. త్రిమూర్తి రూపంబున భేదమును నివారించుచున్నది ఏకః అని. అఖండమగు జడత్వమును నిరాకరించుచున్నది దేవః అని. సూర్యునివలెఁ దటస్థుఁడనుటను నిషేధించుచున్నది సర్వభూతేషు అని. అప్పుడు ఏల యందఱకును గనఁబడఁడు? అనఁగాఁ జెప్పు చున్నది గూఢః అని. బుద్ధ్యాదికమువలెఁ బరిచ్ఛిన్నుఁడు గాఁడని చెప్పుచున్నది సర్వవ్యాపీ యని. అప్పుడాకాశమువలె అనాత్మ యగునసఁగా కాఁడని చెప్పు చున్నది సర్వభూతాన్తరాత్మా యని. అప్పుడు అచ్చటచ్చట కర్మతత్ఫలసంబం ధము సంభవించు ననఁగా నందుకుఁ జెప్పుచున్నది కర్మాధ్యక్షః అని. సమస్తమున కును అధిష్ఠానమని చెప్పుచున్నది సర్వభూతాధివాసః అని. సర్వభూతములయందును

* ఎవ్వఁ డయ్యా! ఎటుంగుచున్నాఁడు? ఎవ్వఁ డిందుఁ జెప్పెను! ఎవ్వనివలనఁ బుట్టినది? ఎవ్వనివలన ఈవివిధసృష్టి?

సత్తాస్ఫూర్తుల నిచ్చువాఁడై సన్నిహితుఁ డగుట వాస మని యిటఁ జెప్పఁబడుచున్నది. కేవలము కర్మములకే కాదు ఇతఁడు అధ్యక్షుఁ డనుట, మ త్తే మనఁగా కర్మవంతులకుఁ గూడ నితఁ డధ్యక్షుం డని చెప్పుచున్నది సాక్షీయని. దర్శనకర్త ♦ అను శంకను నిరాకరించుచున్నది చేతాః * అని. కేవలః—అద్వితీయుఁడు ధర్మాధర్మాదిరహితుఁ డని చెప్పుచున్నది నిర్గుణః అని. అధిక మేల? సర్వవిశేషశూన్యుఁ డని చకారార్థము. ఉదాసీనుఁ డైనను ఈశ్వరుని సాక్షిత్వమాత్రము నిమిత్తముగా నీజగత్తు మాటిమాటికి సృష్టిసంహారముల ననుభవించుచున్న దని చెప్పుచున్నారు అనేన హేతునా ఇత్యాదిగా. కార్యమునకుం బోలెఁ గారణమునకును సాక్ష్యధీనము ప్రవృత్తి యని చెప్పుటకై వ్యక్తావ్యక్తాత్మక మని చెప్పఁబడినది. సర్వావస్థలయందును అనుటచే సృష్టి స్థితిసంహారావస్థలు గ్రహింపఁబడుచున్నవి. అట్లయినను జగత్తునకు సృష్ట్యాదులకంటె భిన్నమయిన ప్రవృత్తి స్వాభావికము, ఈశ్వరాధీనము కా దని యాశంకించి చెప్పుచున్నారు దృశికర్మత్వేత్యాదిగా, దృశివ్యాప్యత్వము లేక జడవర్గమునకు మఱి యేప్రవృత్తియు లేదుగదా యని కదా యనుదాని యర్థము. ఆప్రవృత్తినే యుదాహరించుచున్నారు నేను ఇత్యాదిగా. విషయోపలబ్ధి లేనిచో భోగము సంభవింపమివలన నానావిధమయిన విషయోపలబ్ధిని జూపుచున్నారు దీనిఁ జూచుచున్నాను ఇత్యాదిగా. భోగఫలము నిప్పుడు చెప్పుచున్నారు సుఖము నిత్యాదిగా. విహిత ప్రతిషిద్ధాచరణము వలనఁ గలిగినది సుఖంబును దుఃఖంబు నని చెప్పుచున్నారు దానికొఱకు నిత్యాదిగా. విమర్శపూర్వక మగు విజ్ఞానము లేక యనుష్ఠానము సంభవింపదని చెప్పుచున్నారు దీని నెఱింగెదను అని. ఇత్యాదికము—ఇత్యాదిక మగు సర్వప్రవృత్తియు నని సంబంధము. ఆప్రవృత్తి సర్వంబును దృశికర్మత్వము నంగీకరించియే యని చెప్పినదానిని నిగమనము చేయుచున్నారు అవగతినిష్ఠమని. దానియందే ప్రవృత్తి కవసాన మని చెప్పుచున్నారు అవగత్యవసానమే యని. పరమాత్మయొక్క యధ్యక్షత్వమాత్రంబున జగత్ప్రవృత్తి యనుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు యో అస్యేత్యాదిగా. అస్య—ఈజగత్తునకు, యః అధ్యక్షః—ఎవ్వఁడు సాక్షి నిర్వికారుఁడు గలఁడో, అతఁడు, పరమే వ్యోమన్—ప్రకృష్టమయిన హృదయాకాశమునం దున్నాఁడు, దుర్విజ్ఞేయుఁ డని యర్థము. ఈశ్వరుఁడు సాక్షిత్వమాత్రంబున స్రష్ట యని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన

♦ చూచుటను జేయువాఁడు.

* జ్ఞానస్వరూపుఁ డనుట.

నిత్యాదిగా. ఎందుకొఱకు పరమేశ్వరుని కీసృష్టి? భోగార్థమేమో కాదు, పరమేశ్వరుఁడు పరమార్థంబున భోగసంబంధము లేనివాఁ డగుటవలన, అతఁడు సర్వసాక్షిభూత చైతన్యమాత్రుఁ డగుట వలన. ఇతరుఁడును భోక్త లేఁడు, చేతనాంతరము లేమి వలన, ఈశ్వరుఁ డొక్కఁడే యున్నవాఁ డగుటవలన, అచేతనంబ భోక్త యగుటవలన. స్రష్టకు మోక్షార్థమునుం గాదు మోక్షవిరోధి యగుటవలన—ఇట్టి ప్రశ్నముగాని తదనుహావ మగు ప్రతివచనముగాని యుక్తముగాదు, ఈశ్వరుని మాయానిబంధన మగు సృష్టియందు వాని కవకాశము లేమివలన నని యర్థము. పరమాత్మ దుర్విజ్ఞేయుఁ * డనుటకు శ్రుతి నుదాహరించుచున్నారు కో అద్ధేత్యాదిగా. వానివిషయమునఁ జెప్పువాఁడును సంసారమండలమునందు లేఁ డని చెప్పుచున్నది క ఇహ ప్రవోచత్ అని. జగత్తునకు సృష్టికర్తనుగాఁ బరమాత్మ నెఱుంగవచ్చు నని యాశంకించి కూటస్థుఁ డగుటవలన వానివలన సృష్టి కలుగ లే దని చెప్పుచున్నది కుత ఆజాతా అని. ఈవివిధ మయినసృష్టి యితరునివలనఁ గాని యెవ్వనివలనను ఉపపన్నము కాదు ఇతరమయిన వస్తువు లేమివలన నని చెప్పుచున్నది కుత ఇయం విసృష్టిః అని. అప్పుడు ఎట్లు సృష్టి? అని యాశంకించి యజ్ఞానాధీనం బని చెప్పుచున్నారు ప్రదర్శింపఁబడినది గూడ నిత్యాదిగా.

హ॰ ఆత్మయొక్క యుదాసీనతను జూపుటకై చెప్పుచున్నాఁడు.—మయా=నాచేత; అధ్యక్షేణ=సాక్షినగువానిచేత; ప్రకృతిః; సచరాచరమ్=జంగమస్థావరభూతసహితమయిన జగత్తును; సూయతే. హేతునా = నిమిత్తమాత్రమైన; అనేన=ఈయీశ్వరునిచేత; జగత్; విపరివర్తతే—సృజింపఁబడుచున్నదియు సంహరింపఁబడుచున్నదియు నని యర్థము.

శం. తనకుఁ బ్రకృతికృతంబు లగు కర్మములయందు అసంగత్వమును ఉదాసీనత్వమును ఏది చెప్పఁబడినదో దానినే స్పష్టీకరించుచున్నాఁడు.—రాజుయొక్క వలె నెవ్వనియొక్క సన్నిధిమాత్రంబునఁ బ్రధానామలకుఁ బ్రవృత్తి యగునో అతఁ డధ్యక్షుఁడు, అట్టి యధ్యక్షుఁడను సాక్షిని కూటస్థాసంగచిద్రూపుఁడనగు; మయా=నాచేత; తనప్రవృత్తికి హేతువ నగువానిచే నుపహితంబై; ప్రకృతిః=ప్రకృతియే; సచరాచరమ్=చరమనఁగా జంగమము, అచరమనఁగా స్థావరము, జంగమస్థావరములతోఁ గూడిన జగత్తును సర్వంబును; సూయతే=పుట్టించుచున్నది, నిలుపుచున్నది, సంహ

---

* తెలియరానివాఁడు.

రించుచున్నదియు, నేనో ఆయాప్రవృత్తికి సాక్షిమాత్రుఁడనే. అనేన=ఈ, నాయొక్క సాన్నిధ్యమాత్రమే యగు; హేతునా=తనప్రవృత్తికిఁ గారణముచేత; జగత్ = అవ్యక్తాది స్థూలాంతము సమష్టి వ్యష్ట్యాత్మకముగు జగత్తు సమస్తంబును; విపరివర్తతే= అన్నివిధములుగాను చేష్టించుచున్నది. ఎట్లు సర్వసాక్షియగు సూర్యుని సాన్నిధ్యమాత్రంబునఁ దత్ప్రకాశబలముచే సర్వప్రాణులకును బ్రవృత్తియు నివృత్తియు సిద్ధించుచున్నదో, అట్లు సర్వసాక్షినగు నాసాన్నిధ్యమాత్రంబున నాప్రకాశబలముచే దేహేంద్రియప్రాణ మనోబుద్ధ్యాదులకుఁ దనతనవిషయమునందుఁ బ్రవృత్తియు నివృత్తియు ఇష్టానిష్ట సుఖాది జ్ఞానంబును సిద్ధించుచున్నది. ఇంతమాత్రమే నాకార్యము. కాని కూటస్థాసంగచిన్మూర్తి నగు నాకు కర్తృత్వముగాని కారయితృత్వముగాని భోక్తృత్వముగాని భోజయితృత్వముగాని దాతృత్వంబుగాని దాపయితృత్వంబుగాని లే దని భావము.

మఱి భూతగ్రామ మిమం విసృజామి అనియు ఉదాసీనవ దాసీనమ్ అనియుఁ బరస్పరవిరుద్ధముగాఁ జెప్పితివి. అను శంకను బరిహరించుటకై వెండియు మాయామయం బని ప్రకటించుచున్నాఁడు.—మయా = అంతటను దృశిమాత్రస్వరూపుఁడను అవిక్రియుఁడ నగు నాచేత; అధ్యక్షేణ = నియామకుఁడను బ్రకాశకుఁడ నగువానిచేత; ప్రకాశిత మయిన, ప్రకృతిః = త్రిగుణాత్మకము ఉన్న దని గాని లే దని గాని యనిర్వచనీయ మగు మాయ; సూయతే = పుట్టించుచున్నది; సచరాచరమ్ — జగత్తును, మాయావిచే నధిష్ఠిత మయినమాయ కల్పితగజతురగాదికమునుం బోలె. కాని నేను కార్యసహితమాయను బ్రకాశింపఁ జేయుట దక్క యితరవ్యాపారముఁ జేయను. హేతునా = నిమిత్త మయిన; అనేన = ఈ యధ్యక్షత్వముచేత; ఓకౌంతేయుఁడా! జగత్ =చరాచరసహిత మయినప్రపంచము; విపరివర్తతే= వివిధముగాఁ బరివర్తించుచున్నది, జన్మాదివినాశాంత మగువికారజాతము నెల్లప్పుడు పొందుచున్నది యని యర్థము. ఇందువలన భాసకత్వమాత్రరూప మగు వ్యాపారముచే విసృజామి యని చెప్పితిని. అంతమాత్రమున ఆదిత్యాదులకుం బోలెఁ గర్తృత్వము లేమివలన ఉదాసీనవదాసీనమ్ అని చెప్పితిని. కావున విరోధము లేదు. అది చెప్పఁబడినది.—అస్య ద్వైతేన్ద్రజాలస్య య దుపాదానకారణమ్। అజ్ఞానం త దుపాశ్రిత్య బ్రహ్మ కారణ ముచ్యతే॥ ♦ అని. శ్రుతిస్మృతివాక్యంబులును ఈ యర్థమునందు వేలకొలఁది యుదాహరింప వచ్చును.

---

♦ ఈద్వైత మనునింద్రజాలమున కేది యుపాదానకారణ మయినయజ్ఞానము గలదో దాని నాశ్రయించి బ్రహ్మము కారణ మని చెప్పఁబడుచున్నది.

శ్రీ॰ దానినే యుపపాదించుచున్నాఁడు.—మయా; అధ్యక్షేణ= అధిష్ఠాతను నిమిత్తభూతుఁడ నగువానిచేత; ప్రకృతిః; సచరాచరమ్—ప్రపంచమును; సూయతే=పుట్టించుచున్నది. అనేన=ఈ; హేతునా = నాయధిష్ఠానం బనునిమిత్తముచేత; ఈ; జగత్; విపరివర్తతే = మాటిమాటికిఁ బుట్టుచున్నది. సన్నిధిమాత్రంబున నధిష్ఠాత నగుటవలనఁ గర్తృత్వంబును ఉదాసీనత్వంబును విరుద్ధము గా దని భావము.

ప॰ ఇఁక దీనినే యుపపాదించుచున్నాఁడు.—మయా; అధ్యక్షేణ=అధిష్ఠాత నగువానిచేత; ప్రకృతిః; సచరాఽచరమ్; సూయతే=జనియింపఁ జేయుచున్నది. అనేన హేతునా = ఈ మదధిష్ఠానరూప మయినినిమిత్తముచేతనే; ఈజగత్తు, విపరివర్తతే=మాటిమాటికి జనియించుచున్నది. సాన్నిధ్యమాత్రంబున నధిష్ఠాత నగుటవలనఁ గర్తృత్వంబును ఉదాసీనత్వంబును అవిరుద్ధం బని భావము. ఇట నిది యభిప్రాయము.—సత్య మయినయాశ్రయము లేనిచో యసత్యమున కునికియే యుపపన్నము గాదు, శుక్తిక లేనిచో రజతమునకుఁ బోలె. ఇట్లగునపుడు రజతోత్పత్తిస్థితివినాశంబులను శుక్తి స్పృశింపదు గదా, అట్లు ప్రకృతంబునందు ననియర్థము. ఇఁక మొదటనుండి నిరూపించినయర్థమునందు ఋక్సాఖీయశ్రుతిసందర్భము.—"కింస్విదాసీ దధిష్ఠాన మారమ్భణం కతమం స్విత్కథాసీత్। యతో భూమిం జనయన్విశ్వకర్మా వి ద్యా మౌర్ణో న్మహినా విశ్వచక్షాః॥ నాసదాసీ న్నోసదాసీ త్తదానీం నాసీ ద్రజో నో వ్యోమా పరో యత్। కి మావరీవః కుహ కస్య శర్మ న్నమ్భః కిమాసీ ద్గహనం గభీరమ్॥ న మృత్యు రాసీ దమృతం న తర్హి న రాత్ర్యా అహ్న ఆసీ త్ప్రకేతః। ఆనీ దవాతం స్వధయా తదేకం తస్మా ద్ధా ఽన్యం న పరః కించనా స" అని. వీనికిఁ గ్రమంబున రావణభాష్యము—పూర్వమంత్రమునందు జగత్ప్రలయకాలంబున జగమును సంహరించి పిమ్మట సృజనేచ్ఛ చెప్పఁబడినది. అప్పుడు ద్యావాపృథివులఁ బుట్టించునసమయమునందు, అధిష్ఠానము, కిం స్విదాసీత్ =ఏమి యుండెను ? ఏమియు లే దని యర్థము. అట్లు, ఆరమ్భణమ్ = ఆరంభింపఁబడుచున్నది దీనిచేతఁ గావున ఆరంభణ మనఁగా నుపాదానకారణము; కతమంస్విత్ = ఏది? అదియు లే దని యర్థము. ఆరంభణము సంభవించు ననుచో, కథాసీత్ =ఎట్లుండెను ? సత్తుగా నుండెనా ? అసత్తుగా నుండెనా ? అని యర్థము. రెండును ఉపపన్నములు గావు. సత్తనుచో అద్వైతభంగము, అసత్తనునెడ అసదాత్మకము లయిన ద్యావాపృథివుల కుపాదానము కాఁజాలదు. "నాన్య త్కించ న మిషత్" ఇత్యాదిశ్రుతుల వలనను. యతః = ఏయధిష్ఠానమువలనఁ గాని యుపాదానమువలనఁ గాని; విశ్వ

చక్షాః=సర్వద్రష్ట యగు; విశ్వకర్మా=పరమేశ్వరుఁడు; భూమిమ్=భూమిని; జనయన్=పుట్టించుచున్నాఁడో; అట్లు, ద్యామ్=దివిని, వ్యౌర్ణోత్=సృజించెనో; మహినా=స్వమహిమముచేత. అట్టి యధిష్ఠానమును ఆరంభణమును సంభవింపదని సంబంధము. ఇఁక నీప్రశ్నోత్తరములఁ బ్రతిపాదించునట్టి శ్రుతిని జెప్పుచున్నది.—ఈశ్రుతిచే సృష్టికి మున్ను నిరస్తసమస్తప్రపంచ మగు లయావస్థ నిరూపింపఁబడుచున్నది. ప్రలయదశయం దుండినది జగత్తుయొక్క మూలకారణ మేది గలదో అది, అసత్ = శశవిషాణమువలె నిరుపాఖ్యము; నాసీత్=కాదు. అట్టికారణమువలన ఈసత్తయినజగత్తున కుత్పత్తి సంభవింపదు గదా! అట్లు, నో సత్ ఆసీత్ = సత్తును గాదు. పరమాత్మకంటె నితరము పరమార్థసత్తుగల దన్నచో ద్వైతము ప్రసక్తించును. వ్యవహారసత్తును గాదు, ముందు వ్యవహారాభావము చెప్పఁబోవుటవలన. అందువలన నుభయవిలక్షణ మయిన యనిర్వచనీయమే యుండె నని యర్థము. ఇఁక వ్యవహారసత్తను నిషేధించుచున్నది.—తదానీమ్=అప్పుడు; రజః=“లోకో రజాం స్యుచ్యతే” * అని యాస్కుఁడు, సామాన్యము నపేక్షించి యేకవచనము, లోకము; నాసీత్ = లేదు, వ్యవహారసత్త లేదు పృథివ్యాదులు లేమివలన నని యర్థము. అట్లు, వ్యోమా=అంతరిక్షము, అదియు; నో = లేదు. పరః అనునది సకారాంతము, పరస్తాత్ అనుదాని యర్థము గలది, అంతరిక్షమున కావల ద్యులోకప్రభృతి సత్యలోకాంతము, యత్ = ఏది గలదో; అదియు లే దని యర్థము. ఇందుచే బ్రహ్మాండము గూడ నిషిద్ధ[illegible] చున్నది. ఎందువలన ననఁగా, ఈభాసమాన మగుభూతజాతము మున్ను [illegible] మట్టి యే మనఁగా, శుక్తిరజతమువలె నడుమనే పుట్టిన దని శ్రుతిచే నిరూపింపఁబడి నది. ఓయీ! ఆసీత్ అనుధాతువును తదానీ మ్మనునవ్యయంబును భూత[illegible]చకం బగుటవలన వ్యోమాదులు లేకుండుట కించిత్కాలమే యందువేని యట్లు కాదు, ఆనీదవాతమ్ అని శ్రుతిచే నదియు నిషిద్ధ మగుటవలన. ఇందువలన సమస్త దృశ్యజాతంబును మున్ను నిరూపించినట్టి సదసద్విలక్షణ మయిన యుపాదానము గల దనియుఁ బ్రాతిభాసికం బనియు సిద్ధము. ఇఁక నిది జ్ఞానైకనాశ్యం బని ప్రాతిభాసికత్వమును దృఢీకరించుటకై చెప్పుచున్నది——మున్ను చెప్పిన దృశ్యజాతము, శర్మన్—శర్మణి = అబాధిత మగుబ్రహ్మమునందు; కిమ్ ఆవరీవః = ఆవరక మగునా? కా దని యర్థము. ఇందుచే నేది సదసద్విలక్షణ మయ్యెనో అది స్వాశ్రయమును మోహింపఁ జేయునది కా దని చెప్పఁబడినది. ఎట్లనఁగా, కుహకస్య = ఐంద్ర

* రజస్సు లనుటచే లోకము చెప్పఁబడుచున్నది.

జాలికునియొక్క; గహనమ్; గభీరమ్= అక్షోభ్య మగు; అమ్భః= వానిచే మాయా బలంబునఁ బుట్టింపఁబడినజలము; నడుమనే పుట్టినదై, కుహకున కావరకము, కి మాసీత్= అగునా ? కా దని యర్థము. మఱియును—తర్హి= అప్పుడు; శర్మము నందు—కేవలస్వరూప మయిన బ్రహ్మమునందు, మృత్యుః = జన్మమరణాత్మక మయిన బంధము; నాసీత్ = లే దయ్యెను. అమృతమ్ = మోక్షము; న = లే దయ్యెను. ఎట్లు సూర్యునియందు, రాత్ర్యాః = రాత్రియొక్కయు; అహ్నః = పగటియొక్కయు; ప్రకేతః = జ్ఞానము; నాసీత్ = లేదో, అట్లు. మ ఱే మనఁగా, ఏకమ్ = ఒక్కటి; అవాతమ్=అప్రాణ మగుశుద్ధబ్రహ్మమే; ఆసీత్ = ఉండెను. « అప్రాణో హ్యమనాః, అప్రాణ మనామనోత్రమ్ » అనుశ్రుతులవలన. తత్ =అది; స్వధయా=తనయందు ధరింపఁబడుచున్నది కావున స్వధ, దానిచేత, కర్తృరూపముచేత; ఉండెను. ఆసీత్ అనుదానియర్థమునందు ఆనీత్ అనుధాతువు ప్రయోగింపఁబడెను. ఇట్లు మాయాశబలితమై నూత్రాత్మ యనఁబడునది యుండె నని చెప్పఁబడినది. హ=నిశ్చ యము తస్మాత్ =దానికంటె; అన్యత్=ఇతరము; కించన=ఏదియు; పరః = ముందును వెనుకను; నాస = లే దయ్యెను. ఎల్లప్పుడును అదియే యుండెను.

తా॰ అందువలన క్షేత్రజ్ఞులకర్మమున కనుగుణముగా నాదైన, ప్రకృతిః = ప్రకృతి. సత్యసంకల్పుఁడ నగు, మయా = నాచేత; అధ్యక్షేణ *; చూడఁబడినదై; సచరాచరమ్; జగత్; సూయతే. అనేన = ఈ, క్షేత్రజ్ఞకర్మానుగుణముగా నా చూపుటయును; హేతునా = హేతువుచేత; జగత్తు, విపరివర్తతే. కావున, నా స్వామిత్వంబును సత్యసంకల్పత్వంబును నైర్ఘృణ్యాదిదోషరహితత్వంబును మొద లగుదానిని వసుదేవపుత్త్రుఁడ నగు నాయైశ్వరం బగుయోగమును జూడుము. అట్లు చెప్పుచున్నది శ్రుతి.—« అస్మా న్మాయీ సృజతే విశ్వ మేత త్తస్మిం శ్చాన్యో మాయయా సన్నిరుద్ధః । మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వ రమ్ ” అని.

మూ॰ ఉదాసీనవత్ అనునెడ ప్రకృతి తనయంతనే పుట్టించుచున్న దనఁగా వంకకుఁ జెప్పుచున్నాఁడు.—ప్రకృతి పుట్టించుటను జూచువాఁడను కర్తను నేనే యని యర్థము. అట్లు శ్రుతి—« యతః ప్రసూతా జగతః ప్రసూతీ తోయేన జీవా న్వ్యసనసర్జ భూమ్యామ్ » ♦ అని.

---

* స్వామి నగువానిచేత.

♦ ఎవ్వనివలన సృష్టియం దభిముఖమై జగత్తుయొక్క కారణ మగుప్రకృతి కర్మములతో జీవులను భూమియందు సృజించెనో.

అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్
పరం భావ మజానన్తో మమ భూతమహేశ్వరమ్. ౧౧

**భా.** ఇట్టి నన్ను నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుని సర్వజంతువులకును ఆత్మనై యున్నవానిని గూడ.—అవజానన్తి = అవజ్ఞ—పరిభవము చేయుచున్నారు; మామ్=నన్ను; మూఢాః=అవివేకులు; మానుషీమ్=మనుష్య సంబంధి యగు; తనుమ్= దేహమును; ఆశ్రితమ్ = ఆశ్రయించినవానిని; మనుష్యదేహముచే వ్యవహరించుచున్నవాని నని యర్థము; మమ = నాయొక్క; పరమ్ = ప్రకృష్ట మయిన; భావమ్ = పరమాత్మతత్త్వమును, ఆకాశకల్పమును ఆకాశముకన్న నంతరతమ మయినదానిని; భూతమహేశ్వరమ్=సర్వభూతములకును గొప్పయీశ్వర మైనదానిని, తన్ను ఆత్మను; అజానన్తః= తెలియనివారలై. అందువలన అట్టి నాయొక్కయవజ్ఞాభావనముచే హతులు వరాకులు వారు.

ఇట్టి నన్ను, మనుష్యదేహము నొందినవానిని, సర్వభూతములకును ఆత్మయగు నాపరతత్త్వము తెలియనివారలై పరిచ్ఛిన్నునిఁగా నవమానించుచున్నా రని తాత్పర్యము.

**టీ.** నీవు సర్వాధ్యక్షుఁడవు సర్వభూతాధివాసుఁడవు నిత్యముక్తుండ వగుదువేని, అప్పుడు ఎందువలన నిన్నే యాత్మత్వంబునఁ గాని భేదంబునఁ గాని యందఱును భజియింపరు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు ఇట్టి ఇత్యాదిగా. బుద్ధివిపర్యాసము భగవదవజ్ఞకుఁ గారణ మని చెప్పుచున్నారు మూఢాః అని. భగవంతునకు మనుష్యదేహముతో సంబంధము గలుగుటవలన నతనియెడ బుద్ధివిపర్యాసము సంభవించు చున్న దని చెప్పుచున్నారు మానుషీ మిత్యాదిగా. అస్మదాదులకుం బోలె దేహతాదాత్మ్యాభిమానము భగవంతునకు లే దని చెప్పుచున్నారు మనుష్యదేహముచే నిత్యాదిగా. భగవంతుని నవమానించువారలకు అవివేకమూల మయిన యజ్ఞానమును హేతువునుగాఁ జెప్పుచున్నారు మమ ఇత్యాదిగా. ఈశ్వరావజ్ఞ చేయుటవలన నేమి యగు ననఁగా తదజ్ఞానముచేఁ బ్రతిబద్ధ మయినబుద్ధి గలవారలై శోచనీయు లగుచున్నా రని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. భగవదవజ్ఞానమును హేతువువలననే యవజ్ఞ చేయునట్టియాప్రాణులు వరాకులు— శోచ్యులు సర్వపురుషార్థబాహ్యు లగుదు రని సంబంధము. అందు హేతువును సూచించుచున్నాడు

అట్టి ఇత్యాదిగా. ఈ భగవంతునియొక్క యనవజ్ఞాన మనఁగా—అనాదరణము, లేక, నిందనము, దానియొక్క భావనము—మాటిమాటికిఁ జేయుట, దానిచే హేతువు— దానివలనఁ గలుగు దురితముయొక్క ప్రభావమువలనఁ బ్రతిబద్ధబుద్ధు లని యర్థము.

ప°. అవజానన్తి; మామ్; మూఢాః = అజ్ఞులు; మానుషీమ్ = మనుష్యోచిత మయిన; తనుమ్ = శరీరమును; ఆశ్రితమ్ = అధిష్ఠించినవానిని; మమ = నాయొక్క; పరమ్ = ప్రకృష్ట మయిన; భావమ్ = అనుభావమును; అజానన్తః = ఎఱుంగనివారలై; భూతమహేశ్వరమ్ = భూతములకు—ప్రాణులకు గొప్పయీశ్వరుని.

శం. ఇట్లు సర్వప్రకాశకుఁడను సర్వద్రష్టను సర్వసాక్షి నగు నన్నాత్మను శాస్త్రహితములు పశుకల్పు లగుజను లవమానించుచున్నా రని చెప్పుచున్నాఁడు.— "ఏకో దేవ స్సర్వభూతేషు గూఢ స్సర్వవ్యాపీ సర్వభూతాన్తరాత్మా। కర్మాధ్యక్ష స్సర్వభూతాధివాస స్సాక్షీ చేతాః కేవలో నిర్గుణశ్చ"—ఈ శ్రుతి కిది యర్థము.— జగతు కు బ్రహ్మాదిభేదంబునఁ బ్రాప్తించిన యీశ్వరానేకత్వమును నిరసించుచున్నది ఏకః అని, "ఏక ఏవ హి రుద్రో న ద్వితీయాయ తస్థుః" అను శ్రుత్యంతరప్రసిద్ధి వలన ఇందువలన వారియైశ్వర్యము ప్రాకృతమును అనిత్యమును ఆభాసికంబు నని సూచింపఁబడినది. అప్పుడు ఏకత్వంబును కారణత్వంబును అవ్యాకృతంబునకుఁ గల దనఁగా దాని నిరసించుచున్నది దేవః అని. కాలత్రయమునందును ఇతరాపేక్ష లేక యఖండచిద్రూపంబున తానే దీవ్యతే—ప్రకాశించుచున్నాఁడు కావున దేవుఁడు, అవ్యాకృతము జడ మగుటచే దానికి దేవత్వము సంభవింపమివలన స్వతఃకారణత్వంబును అనుపపన్న మగుటవలన; ఏకత్వదేవత్వములు గలుగుటచే సూర్యునకు ఈశ్వరత్వము ప్రాప్తించు ననఁగా దాని నిరసించుచున్నది సర్వభూతేషు అని; సర్వభూతములయందుఁ జిదేకరసరూపంబున నున్నవాఁ డని యర్థము; ఇందుచే, సూర్యునకు ఏకత్వదేవత్వంబు లున్నను చిద్రూపంబున భూతంబులయం దునికి లేకుంటవలన ఈశ్వరత్వము లేదు; సర్వభూతంబులందును సర్వదా యేకరూపంబునఁ జిదాత్మ తను ఉన్నయెడ బ్రహ్మమునకు సర్వవేద్యత్వము ♦ ప్రాప్తించు ననఁగా దాని నిరసించుచున్నది గూఢః అని; సర్వభూతంబులయందును బ్రకాశరూపంబున నున్నవాఁ డైనను మేఘములచే సూర్యుఁడుం బోలె అవిద్యాతత్కార్యములచేఁ దిరోహితుం డగుట వలనఁ బరమాత్మ యందఱకును విదితుఁడు గాఁ డని యర్థము; భూతములయందు

♦ అందఱకును తెలియఁబడిన దగుట.

గూఢం బన్నచో బ్రహ్మమునకు బుద్ధ్యాగులకుం బోలెఁ బరిచ్ఛిన్నత ప్రాప్తించు ననఁగా దాని నిరసించుచున్నది సర్వవ్యాపీ అని. ఘటాదికములు వ్యాప్తికవలె జగత్తును వెలుపలను లోపలను అంతటను స్వసత్తచే వ్యాపించుచున్నాఁడు కావున సర్వవ్యాపి, వెలుపలను లోపలను బూర్ణ మగుటవలన బ్రహ్మమునకుఁ బరిచ్ఛేదము లేదని భావము. గూఢరూపంబున సర్వవ్యాపకత్వము ఆకాశమునకుఁ గల దనఁగా దాని నిరసించుచున్నది సర్వభూతాన్తరాత్మా అని. సర్వభూతములయొక్క అంతఃబుద్ధి గుహాయందు ఆత్మరూపంబున నున్నవాఁ డని యర్థము. సర్వవ్యాపకం బైనను ఆకాశము జడం బగుటచే దానికి సర్వభూతాంతరాత్మత్వము సంభవింపమివలన బ్రహ్మత్వము సంభవింపదు; సర్వభూతంబులకును ఆత్మ యనునెడ బ్రహ్మమునకుఁ గర్మకర్తృత్వంబును తత్ఫలభోక్తృత్వంబును సంసారిత్వంబును బ్రాప్తించు ననఁగా దాని నిరసించుచున్నది కర్మాధ్యక్షః అని; ఉపాధి నధిష్ఠించి తద్ధర్మముల నీక్షించుచున్నాఁడు కావున అధ్యక్షుఁడు, భూతకర్మంబులకును తత్ఫలభోగములకును సాక్షియే యగుచున్నాఁ డాత్మ, నిరవయవుం డగుటవలనను నిష్క్రియుం డగుటవలనను దాను ఏ కర్మమునుం జేయఁడు భోగంబునుం బొందఁ డని యర్థము; బ్రహ్మము సర్వభూతాంతరాత్మ యనుచో సర్వభూతంబులే యాశ్రయముగాఁ గలవాఁ డనుటయును తదధీనతయుఁ బ్రాప్తించు ననఁగా దాని నిరసించుచున్నది సర్వభూతాధివాసః అని. దీనియందు సర్వంబును వసతి—ఉన్నది కావున వాసము, అధిక మయినవాసము అధివాసము, లేక దీనియందు సర్వంబును అధివసించుచున్నది కావున అధివాసము, శుక్తియందు రజతమువలె దర్పణమునందుఁ బురమువలెఁ దనయందుఁ గల్పితంబులగు భూతములకుఁ బరమాత్మ యధివాసము—అధిష్ఠానమే యగుచున్నాఁడు, కాని తాను అవి యధికరణముగాఁ గలవాఁడు కాఁ డని యర్థము; కర్మములకుమాత్రమే కాఁడు ఈయాత్మ ద్రష్ట, మ తే మనఁగా, భూతంబులకును తద్ధర్మములకును తత్కర్మములకును తత్ఫలానుభవములకును తదవస్థలకును గూడ ద్రష్ట యని చెప్పుచున్నది సాక్షీ అని; బుద్ధికిని తద్వికారంబులకును సర్వంబులకును సాక్షి యని యర్థము; సాక్షాత్తుగా ఈక్షించుచున్నాఁడు కావున సాక్షి, ఇందుచే ఆత్మకు ఈక్షణక్రియాకర్తృత్వము ప్రాప్తించు ననఁగా దాని నిరసించుచున్నది చేతా అని; చేత యనఁగా అవిక్రియుఁడు, తా నవిక్రియస్వరూపుఁడై సర్వంబును జూచుచున్నాఁ డని యర్థము; "శబ్దగుణక మాకాశమ్" ♦ అనుటచే నిరవయవం బైనను ఆకాశమునకు ఎట్లు

♦ శబ్దము గుణముగాఁ గలది యాకాశము.

గుణవత్త్వము కలిగెనో అట్లు బ్రహ్మము నిరవయవం బైనను దానికి సత్త్వచిత్త్వాది గుణవత్త్వము ప్రాప్తించు ననఁగా దానిఁ బరిహరించుచున్నది నిర్గుణశ్రుతి. "ఆత్మన ఆకాశ స్సంభూతః" అని శ్రుతి యాకాశమునకు జన్మమును జెప్పుచున్నది. జన్మవంత మగుటచే సావయవం బగుటవలన ఆకాశమునకు గుణవత్త్వము యుక్తము. నిష్కల మ్మని శ్రుతి బ్రహ్మము నిరవయవం బని చెప్పుటవలన గుణవత్త్వ మెంతమాత్రము ఉపపన్నము కాదు, అందువలన సత్త్వచిత్త్వాదులు స్వరూపమే యగుం గాని గుణము కా దని యర్థము. పరబ్రహ్మమునకు సర్వవిశేషంబులును సంభవింప వని చెప్పుచున్నది చకారము. ఇట్లు శ్రుతిచే నిరూపింపఁబడినలక్షణము గలవాఁడును, భూతమహేశ్వరమ్=స్వసన్నిధిమాత్రంబునఁ బ్రకృతిని బ్రాకృతమును సర్వమును ఈష్టే—చేష్టింపఁ జేయుచున్నాఁడు కావున ఈశ్వరుఁడు, తా నవిక్రియుఁ డైనను అయస్సునకు అయస్కాంతమువలె సర్వంబునకును బ్రవృత్తిహేతువు. మహతో మహీయాన్ అను శ్రుతివలన మహత్తముం డగుటవలన మహత్తముఁ డైనయీశ్వరుఁడు మహేశ్వరుఁడు, భూతంబులకు—అవ్యక్తాదిస్థూలాంతములకు మహేశ్వరుఁడు భూతమహేశ్వరుఁడు, అట్టిభూతమహేశ్వరుని, సర్వమునకును చేష్టాకారణమును సర్వమహత్తమంబును; పరమ్=నిత్యత్వ కూటస్థత్వాఽసంగత్వ సత్త్వ చిత్త్వాఽనంతత్వ సర్వవ్యాపిత్వ సర్వజ్ఞత్వ సర్వప్రకాశకత్వాదిధర్మములచే సర్వదృశ్యవిలక్షణంబును; మమ=నాయొక్క, పరబ్రహ్మముయొక్క; ఆకాశకల్పము సచ్చిదానందైకరసం బగు, భావమ్ = స్వరూపంబును, అహంశబ్దార్థమును; అజానన్తః = శాస్త్రాచార్యులవలనఁ గొంచె మేని యెఱుంగనట్టి; మూఢాః=పశుకల్పు లగుజనులు; మానుషీమ్=మనుష్యసంబంధి యయిన; తనుమ్ = శరీరమును, మానుషీం తను మ్మని సర్వప్రాణులశరీరమాత్రమున కుపలక్షణము; ఆశ్రితమ్ = తమదేహమునందు బుద్ధిగుహయందు సర్వప్రకాశకుండవై సర్వసాక్షివై యున్నవానిని; మామ్ = నన్ను, ప్రత్యగ్లక్షణుం డగు ఆత్మను; అవజానన్తి = తిరస్కరించుచున్నారు. నాయందు అహమర్థ మయినస్వాత్మయందు ఆనందైకరసునియందు మలమాంసపిండ మగుదేహము నారోపించి తద్ధర్మములను కర్తృత్వ భోక్తృత్వాదులను జరారోగాదులను అధ్యసించి యవమానించుచున్నారు, కర్తను నేను భోక్తను నేను బాలుఁడను నేను మూఢుఁడ నేను పాపిష్ఠుఁడ నేను బధిరుఁడను అంధుఁడను కాణుఁడను ఖంజుఁడను పంగువను జీర్ణుఁడ నేను హతుఁడ నేను మృతుఁడ నేను — అని యిట్లు సర్వదా నాకు విపరీతభావమునే యాపాదించుచున్నా రని యర్థము.

మ. ఇట్లు, నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుఁడును సర్వజంతువులకు నాత్మయు ఆనందఘనుఁడును అనంతుండ నైనను.—అవజానన్తి మామ్=నన్ను సాక్షాదీశ్వరుఁడని యాదరింపరు, లేక, నిందించుచున్నారు; మూఢాః=అవివేకు లగుజనులు. వారల ట్లవజ్ఞ చేయుటకు హేతు వయిన భ్రమమును సూచించుచున్నాఁడు—మానుషీం తను మాశ్రితమ్=మనుష్యుఁడుగాఁ దోఁచునట్టిమూర్తిని స్వేచ్ఛచే భక్తానుగ్రహార్థము గ్రహించినవానిని, మనుష్యుఁడుగాఁ దోఁచునట్టిదేహముచే వ్యవహరించుచున్నవానిని యర్థము. అందువలన మనుష్యుం డితఁడను భ్రాంతిచేఁ గప్పఁబడినబుద్ధి గలవారలై, మమ=నాయొక్క; పరంభావమ్=ప్రకృష్ట మయిన పారమార్థిక మగుతత్త్వమును; సర్వభూతంబులకును గొప్పయీశ్వరుఁ డైనదానిని, అజానన్తః = ఎఱుంగనివారలై. అట్టివారు న న్నాదరింపకుండుట గాని నిందించుట గాని యేది గలదో అది యను రూపంబే వారిమూఢత్వమునకు.

శ్రీ. ఓయీ! ఇట్టివానిని బరమేశ్వరుని నన్ను నెందువలనఁ గొందఱు నాదరింపరు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—సర్వభూత మహేశ్వరరూప మయిన నా దగు, పరమ్; భావమ్ = తత్త్వమును; అజానన్తః= ఎఱుంగనట్టి; మూఢాః = మూర్ఖులు; మామ్=నన్ను; అవజానన్తి = అవమానించుచున్నారు. అవమానించుటకు హేతువు.—శుద్ధసత్త్వమయము నైనను దేహమును భక్తేచ్ఛావశంబున మనుష్యాకార మైనదాని నాశ్రయించినవానిని.

ప. ఇఁక మున్ను చెప్పిన తీనయధ్యక్షత్వమును బ్రకటించుచు జగత్కారణ మయినమాయవలనఁ గలిగినమూఢత జీవులయం దనువర్తించుచున్న దని చెప్పుచున్నాఁడు.—మమ = నాయొక్క; పరమ్ = ఉత్కృష్ట మయిన; భావమ్ = తత్త్వమును; ప్రకటము నైనను, అజానన్తః; మూఢాః; సర్వభూతమహేశ్వరమ్; మామ్; అవజానన్తి = అవమానించుచున్నారు. మహచ్ఛబ్దముచే సర్వభూతనివాసుఁడై తదంతర్యామియై యీశ్వరుఁ డైనవానిని—నియామకుని, ఇట్టివానినిగా గణన చేయరు. అవాఙ్మానసగోచరుఁడై చిన్మాత్రుఁ డై నవాని నె ట్లెఱుంగుదురు? అనఁగా చెప్పుచున్నాఁడు—మానుషీం తను మాశ్రితమ్ = భక్తానుకంపచే నెఱుంగుటకు సులభంబును శుద్ధసత్త్వమయంబును మనోహరంబు నగు మనుష్యాకారమూర్తి నధిష్ఠించి యావిర్భవించినవానిని. అది చెప్పఁబడినది—«విశ్వప్రకాశే మపి యోజనషట్సహస్రవిస్తార ముక్తమృషిభి ర్యదిహార్కబిమ్బమ్! మర్త్యై ర్వితస్తిమిత మీక్ష్యత

వీత దేవ పశ్యన్తి మర్త్యా మిమ విశ్వవిభుం విమూఢాః" * అని. శ్రుతియును ఋగ్వేదమునందు.—"మయా సో ౽న్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈం శృణోత్యుక్తమ్ । అమన్తవో మాం త ఉపక్షియన్తి శ్రుధి శ్రుత శ్రద్ధివం తే వదామి" అని. భావ్యము.—బ్రహ్మరూపుఁ డగు అమ్భృణుఁ డనుమహర్షికన్య వాక్కనుపేరు గలది బ్రహ్మరూపిణి చెప్పుచున్నది. ఎవఁ డన్నముఁ దినుచున్నాఁడో, సః=అతఁడు; భోక్తృత్వశక్తిరూప నగు, మయా=నాచేత; అన్నమత్తి = అన్నమును దినుచున్నాఁడు. అట్లు, యః = ఎవఁడు; విపశ్యతి = మనోభిరామ మగువిషయములఁ జూచుచున్నాఁడో—సాదరముగ నవలోకించుచున్నాఁడో; యః = ఎవ్వఁడు, ప్రాణితి= శ్వాసోచ్ఛ్వాసాదికము చేయుచున్నాఁడో; యః ఈమ్=ఏ యితఁడు; ఉక్తమ్=చెప్పఁబడినదాని; శృణోతి = వినుచున్నాఁడో, వారలందఱును నాచేతనే. ఎవ రిట్టిదాని నంతర్యామిరూపంబున నుండి యుపకారిణి నైనదాని నెఱుంగరో అట్టి, మామ్= నన్ను; అమన్తవః=ఎఱుంగనివారు, మద్విషయజ్ఞానము లేనివారై; ఉపక్షియన్తి=ఉపక్షీణులు, సంసారముచే—యాతాయాతదుఃఖముచే దీను లగుచున్నారు. శ్రుత=ఓ విశ్రుతుఁడా! చెలికాఁడా! శ్రుధి= నేను జెప్పఁబోవుదాని వినుము. ఏది వినవలసినది? శ్రద్ధివమ్=శ్రద్ధి యనఁగా శ్రద్ధ, దానితోఁ గూడినదాని, శ్రద్ధ గలవానిచేఁ బొందఁ దగినదానిని, ఇట్టి బ్రహ్మాత్మక మయినవస్తువును, తే వదామి = నీకుఁ జెప్పుచున్నాను.

౧౧. ఇట్టి, మామ్; భూతమహేశ్వరమ్—సర్వజ్ఞుని సత్యసంకల్పుని నిఖిలజగదేకకారణభూతుని, పరమకారుణికుండ నగుటచే సర్వజనులకును సమాశ్రయణీయుఁడ నగుటకై, మానుషీం తనుమ్ ఆశ్రితమ్; తమ చేసినపాపకర్మములచే, మూఢాః; అవజానన్తి=ప్రాకృతమనుష్యసమానునిఁగాఁ దలంచుచున్నారు; భూతమహేశ్వరుఁడ నగు నామొక్క—యపారకారుణ్యౌదార్య సౌశీల్య వాత్సల్యములచేఁ జేసినట్టి మనుష్యత్వసమాశ్రయణరూప మయిన యీ, పరంభావమ్; అజానన్తః=ఎఱుఁగనివారై, మనుష్యత్వసమాశ్రయణమాత్రంబున నన్నితరమనుష్యునివంటివానిఁగాఁ దలఁచి తిరస్కరించుచున్నా రని భావము.

* ప్రపంచమున కంతకును బ్రకాశ మయినదానినిగూర్చి ఋషులచే అనేకవేలయోజనముల విస్తారము గల దని చెప్పఁబడినదానిని సూర్యబింబము నెట్లు మనుష్యులు జేనెడుకొలఁది గలదానిఁగాఁ జూచుచున్నారో అట్లే మూఢులు పరమేశ్వరుని మనుష్యునిగాఁ జూచుచున్నారు.

వ్యా. అప్పుడు కొందఱెట్లు నన్నవమానించుచున్నారు? ఏది వారలకు గతి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—మానుషీం తనుమ్=మూఢులకు మనుష్యునివలెఁ దోఁచుచున్నట్టిశరీరమును, కాని మనుష్యరూపమును గాదు. చెప్పఁబడినది మోక్షధర్మమునందు.—« యత్తత్కృంచి దిహ లోకే౽స్మిన్ దేహబద్ధం విశాం పతే । సర్వం పఞ్చభి రావిష్టం భూతై రీశ్వరబుద్ధిజైః॥ ఈశ్వరోహి జగత్స్రష్టా ప్రభు ర్నారాయణో విరాట్। భూతాన్తరాత్మా వరద స్సగుణో నిర్గుణో౽పిచ॥ భూతప్రలయ మవ్యక్తం శుశ్రూషు ర్నృపసత్తమ » అని. అవతారప్రసంగమునందే యిది చెప్పఁబడినది. అందువలన నవతారములు వే అని శంకింపఁ గూడదు, « రూపా ణ్యనేకా న్యసృజ త్ప్రాదుర్భావభవాయ సః । వారాహం నారసింహం చ వామనం మానుషం తథా » అని యందే ప్రథమసర్గకాలమునందే యవతారకాపక్షిభాగము చెప్పుటవలన. అందువలన వానికి మనుష్యత్వాదికము లేదు, భ్రాంతి లేశమైన. భూతంబును మహత్తును ఈశ్వరుండును అని భూతమహేశ్వరుఁడు. అట్లు బా. భవ్యశాఖయందు—« అనాద్యనన్తం పరిపూర్ణరూప మీశం వరాణా మపి దేవవీర్యమ్ »* అని. « అస్య మహతో భూతస్య నిశ్శ్వసితమ్ » అనియు. « బ్రహ్మాపురోహిత బ్రహ్మకాయిక మహారాజిక » అనియు మోక్షధర్మమునందు.

మోఘాశా మోఘకర్మాణో మోఘజ్ఞానా విచేతసః
రాక్షసీ మాసురీం చైవ ప్రకృతిం మోహినీం శ్రితాః. ౧౨

భా. ఎట్లు?—మోఘాశాః = వ్యర్థమయిన ఆశలు గలవారలును. అట్లు, మోఘకర్మాణః = ఏవి యగ్నిహోత్రాదికర్మములు వారిచే ననుష్ఠింపఁబడుచున్నవో అవియు వారలకు భగవంతునిఁ బరిభవము చేయుటవలనను స్వాత్మభూతుని అవజ్ఞ చేయుటవలనను మోఘములే- నిష్ఫలములే యగుచున్నవి కావున మోఘకర్ములును. అట్లు, మోఘజ్ఞానాః= నిష్ఫల మయినజ్ఞానము గలవారును, జ్ఞానము గూడ వారికి నిష్ఫలమే యగును. విచేతసః=పోయినవివేకము గలవారును. వార లగుచున్నా రని యభిప్రాయము. మఱియు నేమి యగుదురు? రాక్షసీమ్=రక్షస్సులదైన; ప్రకృతిమ్=స్వభావమును; ఆసురీమ్ = అసురులదైన; ప్రకృతిం చైవ= స్వభావమును; మోహినీమ్=మోహకరమైనదానిని, దేహాత్మవాదినిని;

* వరులకు ఈశుఁడు కావున ఈశ్వరుఁ డని వ్యుత్పత్తి.

శ్రితాః-ఆశ్రయించినవారు, ఛేదింపుము భేదింపుము త్రాగుము తినుము పరస్వము నపహరింపుము—ఇట్లు చెప్పుస్వభావము గలవారు క్రూరకర్ము లగుచున్నా రని యర్థము, «అసుర్యా నామ తే లోకాః» * ఇత్యాది శ్రుతివలన.

అట్టివారికోరికలును, వారలచేయుకర్మములును నిష్ఫలము లగును, జ్ఞానంబును నిష్ఫలం బగును, అవివేకు లగుదురు, మఱియు మోహాకరం బైనరాక్షసప్రకృతిని ఆసురప్రకృతిని బొందుదు రని తాత్పర్యము.

రా. భగవంతుని నవమానించువారల శోచనీయత్వమును ప్రశ్నపూర్వకముగా విశదీకరించుచున్నారు ఎట్లు అని. భగవంతుని నిందించువారలకు ప్రార్థనంబును సార్థకము కా దని చెప్పుచున్నారు వ్యర్థము ఇత్యాదిగా. ఓయీ! భగవంతుని నిందించువారు గూడ నిత్యనైమిత్తికకర్మముల ననుష్ఠించుదురు, తదనుష్ఠానంబువలన వారిప్రార్థనంబులు సార్థకంబులు కాఁగలవు, అనఁగాఁ గా వని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. పరిభవము—తిరస్కరించుట. అవజ్ఞ—అనాదరణము. అట్టివారలైనను శాస్త్రార్థజ్ఞానము గలవారికి తద్ద్వారంబున ప్రార్థనము సార్థక మగు ననియాశంకించి చెప్పుచున్నారు అట్లు మోఘజ్ఞానాః అని. అట్లయినను యుక్తిసిద్ధమైనవివేకమువలన వారికిఁ బ్రార్థన సఫలము కావచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు విచేతసః అని. ఇంతమాత్రమే కాదు వారికి, మ త్తే మనఁగా వర్తమానదేహము పడినపిమ్మట ఆయాక్రూరయోనులఁ బొందుట గూడ నిశ్చితం బని చెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. మోహాకరీమ్ అనునది రెండుప్రకృతులకును తుల్యముగా విశేషణము. ఛేదింపుము భేదింపుము త్రాగుము తినుము అని ప్రాణిహింసారూపము రాక్షసస్వభావము. అసురులస్వభావమో, ఇయ్యకుము వేల్వకుము పరస్వము నపహరింపుము—ఇత్యాదిరూపము. మోహ మనఁగా మిథ్యాజ్ఞానము. చెప్పినదానినే స్ఫుటీకరించుచున్నారు ఛేదింపుము ఇత్యాదిగా.

హ. ఎట్టివార లా రెఱుంగనివారు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.——మోఘాశాః = వ్యర్థము లయినయాశలు—కోర్కులు గలవారు, మృగతృష్ణాజలమును

* అసుర్యా నామ తే లోకా అన్ధేన తమసా వృతాః । తాం స్తే ప్రేత్యాభిగచ్ఛన్తి యే కే చాత్మహనో జనాః ”—అసుర్యము లనులోకములు గలవు, అంధతమసముచేఁ గప్పఁబడినవి; ఆత్మహత్య చేసినవారు—ఆత్మజ్ఞానము లేనిజను లెవ్వరు గలరో వారు మృతిఁ బొంది యాలోకములఁ బొందుచున్నారు.

ద్రాగఁ గోరువానివలె. మోఘకర్మాణః = వ్యర్థము లయినకర్మములు గలవారు, మృగతృష్ణాజలపానమునకొఱకుఁ బోవువానివలె. మోఘజ్ఞానాః=వ్యర్థ మయినజ్ఞానము గలవారు, మృగతృష్ణాజలము నెఱుంగువానివలె. విచేతసః = విగతవివేకులు. రక్షస్సులది రాక్షసి తామసప్రకృతి; అసురులది యాసురి రాజసప్రకృతి; రాక్షసీమ్, ఆసురీం చైవ, ప్రకృతిమ్, మోహినీమ్, శ్రితాః.

శం. «అసుర్యా నామ తే లోకాః» ఇత్యాదిశ్రుత్యర్థమును వెల్లడించుటకై యాత్మజ్ఞానవిముఖులై యాత్మకు సర్వదా విపరీతభావమునే యాపాదించునట్టి మూఢులస్వభావమును వర్ణించి వారియాత్మజ్ఞానవైముఖ్యమునకు ఫలమును శ్రుతిప్రతిపాదితమునే ప్రతిపాదించుచున్నాఁడు.—ఏమూఢులు నాతత్త్వము నెఱుంగక ఆత్మను నన్నవజ్ఞ చేయుచున్నారో వారు, మోఘాశాః=మోఘములు—వ్యర్థము లగు ఆశలు—మనోరథములు గలవారు. «అక్షయ్యం హవై చాతుర్మాస్య యాజినస్సుకృతం భవతి» అను ప్రరోచనవాక్యమును బట్టి స్వర్గమునందు శతకోటికల్పపర్యంతము వసించెద నని చాతుర్మాస్యముఁ జేసినట్టి కాములమనోరథము «క్షోభావా మర్త్యస్య యదన్తకై తత్» అనున్యాయంబున స్వల్పకాలికం బగుటవలన వ్యర్థం బనుట యుక్తమే. మఱియు, మోఘకర్మాణః=మోఘములు—విఫలము లగు శ్రౌతస్మార్తకర్మములు గలవారు, బహుతరశ్రమముచే సంపాదితము లైనశ్రౌతాదిపుణ్యకర్మములు క్షణికము తుచ్ఛమునగు జిహ్వోపస్థసుఖమే ఫలముగాఁ గలవి యగుటవలన మోఘకర్మ లనుట యుక్తము. మఱియు, మోఘజ్ఞానాః=మోఘము—అనర్థసాధకము లసద్విషయ మైనసకలవేదశాస్త్రాధ్యయనజన్యజ్ఞానము గలవారు, «బ్రహ్మచారివాసో ఽష్టా చత్వారింశ ద్వర్షాణి» ♦ అను స్మృతివలన బహుకాలము చేసినట్టి సకలవేదశాస్త్రాధ్యయనతదర్థవిచారములచేఁ గలిగినజ్ఞానము సర్వంబును బంధమునకే యయ్యెను గాని మోక్షార్థము కాదు కావున యుక్తము మోఘజ్ఞాను లనుట. మోఘజ్ఞాను లగుటవలననే, విచేతసః=విపరీతబుద్ధి గలవారు, సర్వదా దేహమాత్రాత్మదర్శులై; రాక్షసీమ్=«అగ్నిహోత్రంచ వేదాశ్చ రాక్షసానాం గృహేగృహే। దయా సత్యంచ శౌచంచ రాక్షసానాం నవిద్యతే» ✻ అని చెప్పినలక్షణము గలవారు రాక్షసులు, వారలసంబంధి, దయ సత్యము శౌచము క్షమ హ్రీ

♦ నలుబదియెనిమిది సంవత్సరములు వేదాధ్యయనము చేయుచుండవలయును.

✻ రాక్షసులయింటింటను అగ్నిహోత్రంబును వేదంబులును గలవు, దయయును సత్యంబును శౌచంబును రాక్షసులకు లేవు.

దానము మొదలగు సద్ధర్మములు లేనిదియు క్రౌర్య హింసా దంభ దర్పాది దుర్గుణైక ప్రధానంబు నగుదాని; ఆసురీం చైవ=« ఇద మద్య మయా లబ్ధమ్ » •• ఇత్యాది లక్షణము గలవారు అసురులు, వారిస్వభావము అధికముగాఁ గలది యాసురి, అట్టిదాని; మోహినీమ్ = మిక్కిలిమిక్కిలిగా మూఢత్వాతిశయమునే కల్గించుదానిని; ప్రకృతిమ్ = యోనిని; శ్రితాః = పొందినవార లగుచున్నారు. నూఁటికినూటికి నని యర్థము. లేక, ఎవ్వ రాత్మమోక్షణమునందుఁ బ్రయత్నము చేయక రాక్షసిని గాని యాసురిని గాని మోహిని యగుప్రకృతిని—స్వభావము నాశ్రయించుచున్నారో వారు ప్రతిజన్మమునందును మోఘాశలును మోఘకర్మలును మోఘజ్ఞానులును విచేతసులునే యగుచున్నారు. అర్థము మున్నె చెప్పఁబడినది.

వు. వారు భగవదవజ్ఞానజనితమగుదుష్కర్మలచేఁ గలుగు మహాదురితముచేఁ బ్రతిబద్ధబుద్ధులై నిరంతరముగా నరకనివాసమునకే యర్హు లగుచున్నారు — ఈశ్వరుఁడు ఫలప్రదాత గాఁడు, కర్మములే మాకు ఫలము నియ్యఁగలవు అను మోఘము—నిష్ఫలమేయగు ఆశ—ఫలప్రార్థన గలవారు. ఇందువలననే యీశ్వరవిముఖు లగుట వలన మోఘములు—శ్రమమాత్రరూపము లగు అగ్నిహోత్రాదికర్మములు గలవారు. అట్లు, మోఘము—ఈశ్వరునిఁ బ్రతిపాదింపని యట్టి కుతర్క—శాస్త్రములచేఁ గలిగిన దగు జ్ఞానము గలవారు. ఎందువలన ననఁగా. విచేతసః = భగవదవజ్ఞానముచేఁ గలిగినదురితముచేఁ బ్రతిబద్ధ మయినవివేకవిజ్ఞానము గలవారు. మఱియు వారు భగవదవజ్ఞానాదిదోషమువలన, రాక్షసీమ్=తామసిని, శాస్త్రవిహితము గాని హింసకు హేతు వైన ద్వేషమే ప్రధానముగాఁ గలదానిని; ఆసురీంచ = రాజసిని, శాస్త్రముచే నను మతింపఁబడనివిషయముల భోగములకు హేతు వగురాగమే ప్రధానముగాఁ గలదానిని; మోహినీమ్=శాస్త్రీయజ్ఞానభ్రంశమునకు హేతు వైనదానిని; ప్రకృతిమ్ = స్వభావమును; శ్రితా ఏవ=పొందినవారలే యగుచున్నారు. అందువలన « త్రివిధం నరకస్యేదం ద్వారం నాశన మాత్మనః । కామః క్రోధ స్తథా లోభః '' * అని చెప్పిన నరకద్వారమును బొందినవార లగుటచే నరకయాతననే వారు నిరంతర మనుభవించుచుందు రని యర్థము.

---

•• ఇది యిప్పుడు నాచేఁ బొందఁబడినది.

* ఆత్మనాశనంబును నరకమునకు ద్వారము నగు నిది మూఁడువిధములు—కామమును క్రోధమును లోభమును.

శ్రీ. మఱియును.—నాకంటె నితరదేవత శీఘ్రముగా ఫలము నిచ్చునని మోఘము-నిష్ఫలమే యగు ఆశ గలవారలు. ఇందువలననే మద్విముఖు లగుట చేత మోఘములు-వ్యర్థము లగుకర్మములు గలవారలు. మోఘము-వ్యర్థమే యగు నానాకుతర్కాశ్రితశాస్త్రజ్ఞానము గలవారలు. ఇందువలననె, విచేతసః = విక్షిప్త మయినబుద్ధి గలవారు. అంతకును హేతువు—రాక్షసీమ్ = తామసిని, హింసాదిప్రచురమును; ఆసురీంచ = రాజసిని, కామదర్పాదిబహుళంబును; మోహినీమ్= బుద్ధిభ్రంశము చేయుదానిని; ప్రకృతిమ్ = స్వభావమును; శ్రితాః = ఆశ్రితులై. న న్నవమానించుచున్నా రని పూర్వశ్లోకముతో నన్వయము.

ప. ఇంక వారల మూఢత్వమునే ప్రకటించుచున్నాఁడు.—మోఘాశాః= మోఘము-నిష్ఫలము, క్షుద్రదేవతోపాసనచే క్షణభంగుర మయినక్షుద్రఫలాశ గలవారు. ఇందువలననే నాయెడ విముఖు లగుటవలననే, మోఘము లగుసర్వకర్మములును గలవారు. అట్లు, మోఘము-కుతర్కాశ్రిత మగుజ్ఞానము గలవారు. విచేతసః = విక్షిప్త మయినమనస్సు గలవారు. ఇంక నంతకును హేతువుఁ జెప్పుచున్నాఁడు.—రాక్షసీమ్=తామసిని, హింసాప్రధాన మయినదాని; ఆసురీమ్—కామక్రోధదర్పప్రధాన మయినదాని. మోహినీమ్ = బుద్ధిభ్రంశకర మయినదాని; ప్రకృతిమ్= స్వభావమును; ఆశ్రితులై న న్నవమానించు చున్నా రని పూర్వశ్లోకముతో నన్వయము. అది చెప్పఁబడినది.—“కాచి ద్వ్యామోహ మూర్తిః పరపురుషరతా రాక్షసీ ప్రాదురాసీ త్సాగర్భిణ్యగ్రకౌఘం విషమ మజనయ త్పంచభూతాభిధానమ్। యా త్వేకం నీచమార్గై రతిజడ మపరం ధావతీ త న్తతో ఽన్య ద్బాహ్యా న్తశ్శూన్య మన్య ద్దహతీ త దపరం కిం పున స్తత్సమాజే” * అని.

రా. నన్ను మనుష్యునిగాఁ దలఁచుటచే, నాయొక్క పరమకారుణ్యాది పరత్వమును మఱుఁగుపఱుచునట్టి రాక్షసిని ఆసురిని మోహిని యగుప్రకృతిని ఆశ్రయించినవారలై, మోఘాశాః = మోఘ మయినవాంఛితము గలవారు, నిష్ఫల మయినవాంఛితము గలవారు; మోఘకర్మాణః = నిష్ఫల మయినయారంభము గల

---

* వ్యామోహమూర్తియై పరపురుషాసక్త యగు నొకానొకరాక్షసి ప్రాదుర్భవించెను. అది గర్భిణియై పంచభూతము లను పేరు గలవిషమము లగుబిడ్డలం గనెను. వానియందు, ఒకటి—జలము నీచమార్గమునఁ బోవునది, మఱియొకటి—భూమి యతిజడము, మఱియొకటి—వాయువు ఇట్టటు పరుగు లిడును, ఇంకొకటి—ఆకాశము లోపలను వెలుపలను శూన్యము, వే ఱొకటి—అగ్ని దహించును. ఇంక వానిసమాజమునందు—అవియెల్లఁ జేరి యుండునపుడు చెప్పెడి దేమి?

వారు; మోఘజ్ఞానాః = మదీయము లయినచరాచరము లనన్నియు మంతటను విపరీతజ్ఞానము గలవార లగుటచే నిష్ఫల మయినజ్ఞానము గలవారు; విచేతసః = అట్లు అంతటను యాథార్థ్యజ్ఞానము లేనివారు. సర్వేశ్వరుని నన్ను ఇతర సమానునిఁగాఁ దలఁచి నాయెడ నేది చేయఁదలఁచుచున్నారో దేని నుద్దేశించి యారంభములఁ జేయుచున్నారో అది సర్వంబును నిష్ఫలం బగుచున్నది యని యర్థము.

మూ॰ వారలకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—స్వర్గమునందు నయామ గలవారు, భగవద్ద్వేషులకోరిక యేదియు నెఱవేఱదు. యజ్ఞాదికర్మములు గూడ వ్యర్థములే వారలకు. జ్ఞానముఁగూడ. బ్రహ్మరుద్రాదిభక్తిమొదలగునుపాయములచే దేనిచే నేనియు ఆముష్మికపురుషార్థ మేదియు వారికి సిద్ధింప దని యర్థము. చెప్పఁబోవుచున్నాఁడు — "తానహం ద్విషతః క్రూరాన్" ఇత్యాదిగా. మోక్షధర్మమునందును.—"కర్మణా మనసా వాచా యో ద్విష్యా ద్విష్ణు మవ్యయమ్। మజ్జన్తి పితర స్తస్య నరకే శాశ్వతీ స్సమాః॥ యో ద్విష్యా ద్విబుధశ్రేష్ఠం దేవం నారాయణం హరిమ్। కథం స న భవే ద్ద్వేష్య ఆచణ్డాల స్తస్య కస్యచిత్" ♦ అని. "సర్వోత్కృష్టే జ్ఞానభక్తీ హి యస్య నారాయణే పుష్కరవిష్టరాద్యే। సర్వోత్తమే ద్వేషయుతో హి తస్మిన్ భూరిజ్ఞా నన్తఘ్నో ఽస్య సమో న హ్యైవ" * అని సామవేదంబున శాండిల్యశాఖయందు. "ద్వేషా చ్చైద్యాదయో నృపాః, వైరేణ యన్నృపతయ శ్శిశుపాల పౌణ్డ్ర సాల్వాదయో గతి విలాసవిలోకనాద్యైః। ధ్యాయన్త ఆకృతధియ శ్శయనాసనాదౌ తత్సామ్య మాపు రనురక్తధియః పునః కిమ్" ♦♦ అని భాగవతమునందు. ఇది భక్తప్రియత్వముఁ దెలుపుటకొఱకును నిత్యధ్యానము స్తుతించు

♦ కర్మచేతనను మనస్సునను వాక్కునను ఎవ్వఁ డవ్యయుం డగువిష్ణువును ద్వేషించునో వాని పితరులు నరకమునందు శాశ్వతవత్సరములు మునుఁగుదురు. ఎవ్వఁడు దేవశ్రేష్ఠుఁ డగు నారాయణుని హరిని ద్వేషించునో అతండు ఎట్లు ఎవనికిని చండాలునకుఁ గూడ నిక్కముగ ద్వేష్యుఁడు కాఁ డగును?

* ఎవ్వనికి బ్రహ్మదేవునితండ్రియు సర్వోత్తముఁడు నగు నారాయణునియందు సర్వోత్కృష్టము లగు జ్ఞానభక్తులు గలవో అతనికి సమానుఁడు లేఁడు. మఱియు నతనియందు ద్వేషము గల వాఁ డెవ్వఁడు గలఁడో అతఁడు అనంతభ్రూణహత్యలు చేసినవాఁ డగును. వానికిని సమానుఁ డెవ్వఁడును లేఁడు.

♦♦ శిశుపాలుఁడు మొదలగురాజులు ద్వేషమువలన. శిశుపాలుఁడు పౌండ్రకుఁడు సాల్వుఁడు మొదలగురాజులు వైరమున భగవంతుని గతి విలాసము చూపు మొదలగువానిచే ఆకృష్ట మయినబుద్ధి గలవారలై శయనాసనాదులయందు ధ్యానించుచున్నవారలై భగవత్సామ్యము నొందిరనఁగా నిక భక్తివిశిష్ట మయినబుద్ధి వారలు పొందుదు రని చెప్పెడి దేమి?

కొంటకును, తనభక్తుఁడు ఒకానొకప్పుడు చాపలమువలన ద్వేషము గలవాఁడైనను అతనికి భక్తిఫలమునే భగవంతుఁ డిచ్చుచున్నాఁడని. భక్తులే గదా మున్ను శిశుపాలాదులు, శాపబలమువలన ద్వేషులైరి. అది ప్రాగ్దత్త్వమును శాపమును మొదలగునవి చెప్పుటవలనఁ దెలియుచున్నది. కానిచో నెందు కది యుపన్యాసము చెప్పవలయును? భగవంతునిసామ్యము చెప్పుటయో ద్వేషులకును గూడ ద్వేషముఁ దలంపక పూర్వస్థిత భక్తిఫలమునే యిచ్చుచున్నాఁడని తెలుపుటకొఱకు. «న మే భక్తః ప్రణశ్యతి» అని చెప్పఁబోవుచున్నాఁడు. «భావో హి భవకారణమ్» § ఇత్యాదులకు విరోధం బనఁ దగదు. ద్వేషము చింతించువారలకు ద్వేషమే యగు ననుట గదా యుక్తము. అట్లు కానిచో గురుద్వేషులకుఁ గూడ గురుత్వము సిద్ధించు నని యనిష్ట మాపాదిల్లును. ఆకృతధీత్వమునందును సామ్య మనఁ దగదు, అట్టి వారలకే హిరణ్యకశిపుప్రభృతులకుఁ బాపము తెలియవచ్చుటవలన, «హిరణ్యకశిపుశ్చాపి భగవన్నిన్దయా తమః। వివిక్షు రత్యగాత్సూనోః ప్రహ్లాదస్యానుభావతః» ♦ అని. «యదనిన్దత్పితా మహ్యమ్» అని యారంభించి «తస్మాత్పితా మే పూయేత దురన్తాద్దుస్తరా దఘాత్» * అని ప్రహ్లాదుఁడు భగవంతుని వరం బడుగుటవలనను. బహుగ్రంథములయందు నిషేధంబును ఒకానొకచోటనే తత్ప్రతిపాదనంబును ♦♦ అని విశేషము. దేనియం దది చెప్పఁబడుచున్నదో దానియందే నిషేధము చెప్పఁబడినది. మహాతాత్పర్యవిరోధంబును బ్రతిపాదింపఁబడినది మున్ను. యుక్తివిహీనంబు లగువాక్యములకన్న యుక్తిమంతము లగువాక్యములే బలవత్తరములు. యుక్తులును ఇతరవాక్యములకుఁ జెప్పఁబడినవి. మఱి వీనికి గతి వేఱు లేదు. వాక్యములు సమంబులైనను లోకానుకూలానుకూలములలో లోకానుకూల మగు నదియే బలవత్తరము. భక్తప్రియత్వమే లోకానుకూలము, ఇతరము కాదు. చెప్పఁబడినది గూడ వారలకుఁ బూర్వము భక్తత్వము, «మన్యే ఽసురాన్భాగవతాంస్త్ర్యధీశే సంరమ్భమార్గాభినివిష్టచిత్తాన్» ¶ ఇత్యాదిగా. అందువలన భగవ

§ ఎట్లయినను చింతించుట గదా మోక్షమునకుఁ గారణము.

♦ హిరణ్యకశిపువు గూడ భగవన్నిందచే తమస్సును బ్రవేశింపఁ బోయి కుమారుఁ డయిన ప్రహ్లాదుని మహిమవలన దాఁటి పోయెను.

* నాతండ్రి నిన్ను నిందించె ననునది యేది గలదో ఆదురంతమై దుస్తర మగుపాపమునుండి నాతండ్రి పవిత్రుఁడు కావలయును.

♦♦ ద్వేషమువలనఁ గూడ భగవత్సాయుజ్య మగు నని చెప్పుటయును.

¶ అసురులను భాగవతులనుగా త్రిలోకనాయకునియందు సంరంభమార్గంబున నివిష్టచిత్తులనుగాఁ దలంచుచున్నాను.

ద్వేషులకు నేగతియు లే దని సిద్ధము. ద్వేషకారణముఁ జెప్పుచున్నాఁడు రాక్షసీ మిత్యాదిగా.

మహాత్మానస్తు మాం పార్థ దైవీం ప్రకృతి మాశ్రితాః
భజ న్త్యనన్యమనసో జ్ఞాత్వా భూతాది మవ్యయమ్. ౧౩

**భా.** ఎవ్వరు మఱి శ్రద్ధ గలవారలు భగవద్భక్తిలక్షణ మగుమోక్ష మార్గమునందుఁ బ్రవృత్తులు గలరో, అట్టి — మహాత్మానస్తు = అక్షుద్ర చిత్తులే; దైవీమ్ = దేవుల దైన; ప్రకృతిమ్ = శమ దమదయా శ్రద్ధాది లక్షణ మయినస్వభావమును; ఆశ్రితాః = పొందినవారలై; పార్థ = అర్జునా! మామ్ = నన్ను ఈశ్వరుని; అనన్యమనసః = అనన్యచిత్తులై; భజన్తి = సేవించుచున్నారు; జ్ఞాత్వా = ఎఱిఁగి; భూతాదిమ్ = భూతములకు — ఆకాశాదులకును ప్రాణులకును ఆదినిగా — కారణమునుగా; అవ్యయమ్ = అవినాశినిగా.

అర్జునా! పరిశుద్ధ మయినచిత్తము గలవారలే దైవి యగు ప్రకృతిని బొంది నన్ను సర్వభూతములకును గారణమును గాను అవినాశిని గాను ఎఱింగి యనన్యచిత్తులై సేవించుచున్నా రని తాత్పర్యము.

**ఆ.** ఎవ్వరు మఱి భగవంతుని భజియింతురు? అనఁగా వారిం జెప్పుచున్నారు ఎవ్వరు మఱి ఇత్యాదిగా. మహాత్ — ఉత్కృష్టము — యజ్ఞాదులచే శోభిత మగు, ఆత్మ — అంతఃకరణము గలవార లను వ్యుత్పత్తి నాశ్రయించి చెప్పుచున్నారు అక్షుద్రచిత్తు లని. తుశబ్ద మవధారణార్థకము. ప్రకృతిని విశేషణము చేయుచున్నారు శ మేత్యాదిగా. అనన్యనియందు — ప్రత్యగ్భూతుఁడ నగు నాయందు పరమాత్మ యందే మనస్సు ఎవ్వరికో అట్టివార లను వ్యుత్పత్తిచే వ్యాఖ్యానము చేయుచున్నారు అనన్యచిత్తు లని. ఎఱుంగనియెడ సేవించుట యనుపపన్నం బగుటవలన శాస్త్రోపపత్తులవలన మొదట నెఱింగి పిమ్మట సేవింపవలయు నని చెప్పుచున్నారు జ్ఞాత్వే త్యాదిగా.

**హ.** మహాత్మానః = అక్షుద్ర మయినయంతఃకరణము గలవారలు; మామ్ = నన్ను ఈశ్వరుని; పార్థ; దేవసంబంధి దైవి సాత్త్వికము అట్టిదాని; ప్రకృతిమ్; ఆశ్రితాః; భజన్తి = సేవించుచున్నారు; అనన్యమనసః = ఈశ్వరునికంటె నితరమునందు మనస్సు

లేనివారలై; భూతాదిమ్=నన్ను సకలభూతకారణ మయినవానిఁ గాను; అవ్యయమ్=నాశరహితునిఁ గాను; జ్ఞాత్వా=ఎఱింగి.

శం. ఇట్లాసురసంపత్తిమంతు లగు నవిద్వాంసులగతిం బ్రతిపాదించి యిప్పుడు దైవసంపత్తిమంతు లగు విద్వాంసులస్థితిని బ్రతిపాదించుటకై యందు నుత్తమ మధ్యమాధికారిభేదంబున బ్రహ్మోపాసనకును భేదముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత. అందు దైవసంపత్తి గలవారియం దుత్తములం జెప్పుచున్నాఁడు.—తుశబ్దము బ్రహ్మవిదులకు మూఢులకంటె వైలక్షణ్యద్యోతకము. మహాత్మానః=బహుజన్మముల నారాధించిన పరమేశ్వరునిప్రసాదాతిశయమువలనఁ జక్కఁగా మృదితకషాయం బగుటచే విషయగ్రహణవిముఖంబై సర్వదా ప్రత్యక్ప్రవణస్వభావం బగుటవలన మహత్—ఉత్కృష్ట మయిన, ఆత్మ—చిత్తము ఎవ్వరికో వారు మహాత్ములు, ప్రసన్నచిత్తులు, అట్టి కొందఱు యతులు; తాము, దైవీమ్=దేవునియొక్క—పరమాత్మయొక్క—ప్రాప్తికి అంతరంగసాధన మగుటవలన దైవి, అట్టి; ప్రకృతిమ్=సంపత్తిని, తీవ్రమోక్షేచ్ఛా వైరాగ్య శమ దమ తితిక్షోపర మాది సత్త్వగుణసమృద్ధిలక్షణమును; ఆశ్రితాః=పొందినవారలై; మామ్ = నన్ను; భూతాదిమ్ అవ్యయమ్ జ్ఞాత్వా—భూతాది యనఁగా భూతముల కాది—ఆవిర్భూతికారణము, తదనన్యత్వమ్ ♦ అనున్యాయంబున భూతాది యని చెప్పఁబడినది, కార్యము కారణమాత్ర మగుటచే భూతములకు వేఱుస్వరూపము లేమివలన బ్రహ్మము అద్వితీయం బని తెలుపుటకొఱకు; కదల్యాదులందు కార్యనాశముచేఁ గారణమునకుఁ గూడ నాశము కనఁబడుటవలన అట్లు భూతనాశమువలన బ్రహ్మమునకుఁ గూడ నాశము ప్రసక్తింపఁగా దాని వారించుచున్నాఁడు అవ్యయమ్ అని; జ్ఞానముచేఁ గాని యజ్ఞానముచేఁ గాని కార్యనాశముచేఁ గాని కారణనాశముచేఁ గాని తనయంతఁ గాని యితరముచేఁ గాని దేనిచే నేనియు నవ్యేతి—నశింపదు కావున, అవ్యయము, నిత్యము సర్వాత్మకము అద్వితీయము అఖండానందైకరసము బ్రహ్మ మగు నన్ను; జ్ఞాత్వా = శ్రవణాదులచే స్వస్వరూపంబునఁ జక్కఁగా నెఱింగి; అనన్యమనసః=మన స్సనఁగా బుద్ధివృత్తి, లేదు అన్యము—మద్వ్యతిరిక్తము బుద్ధివృత్తికి విషయముగా నెవ్వరికో వా రనన్యమనసులు, ఇతరవస్తుదర్శనము లేనివారలై; మామ్=నన్ను; భజన్తి—ఇది యంతయు నేనును బ్రహ్మమే యని యప్రతిబద్ధవృత్తిచే సదా సర్వంబును బ్రహ్మమునుగానే చూచుచున్నా రని యర్థము, అందువలననే మహాత్మానః అనువిశేషణ మర్థవంతము.

---

♦ కార్యము కారణముకంటె అనన్యము—అభిన్నము.

మ. భగవద్విముఖులకు ఫలకామనయుఁ దత్ప్రయుక్త మగు నిత్యనైమిత్తికకామ్యకర్మానుష్ఠానంబును దత్ప్రయుక్త మగు శాస్త్రీయజ్ఞానంబును వ్యర్థము లగుటవలన వారలకుఁ బారలౌకికఫలంబును దత్సాధనంబును సిద్ధింపదు. ఇహలోక ఫలము గూడఁ గొంచెమేనియు వారికిఁ గలుగదు, వివేకవిజ్ఞానశూన్యు లగుటచే విచేతసులు గదా వారు. అందువలన సర్వపురుషార్థబాహ్యులు శోచనీయులే యందఁదగుదురు వారు వరాకు లని చెప్పఁబడినది. ఇప్పుడు, ఎవ్వరు సర్వపురుషార్థభాక్కులు అశోచ్యులు? అనఁగా నెవ్వరు భగవదేకశరణులో వా రని చెప్పుచున్నాఁడు.— మహత్ — అనేకజన్మములఁ జేసిన సుకృతములచే సంస్కృతము క్షుద్రకామాదులచే నభిభూతము కానిది, ఆత్మ — అంతఃకరణము ఎవ్వరికో అట్టివారు; కావుననే «అభయం సత్త్వసంశుద్ధిః» ఇత్యాదిగాఁ జెప్పఁబోవునట్టి, దైవీమ్ = సాత్త్వికి యయిన; ప్రకృతిమ్; ఆశ్రితాః; అందువలననే, అనన్యమనసః — మద్వ్యతిరిక్తమునందు లేదు మనస్సు ఎవ్వరికో అట్టివారు; భూతాదిమ్ = సర్వజగత్కారణమును; అవ్యయమ్ = అవినాశిని; మామ్ = నన్ను ఈశ్వరుని; జ్ఞాత్వా; భజన్తి = సేవించుచున్నారు.

శ్రీ. ఎవ్వ రప్పుడు ని న్నారాధించుచున్నా రనఁగాఁ జెప్పుచున్నాఁడు.— మహాత్మానః = కామాదులచే నభిభూతము కాని చిత్తము గలవారు; ఎందువలన ననఁగా, «అభయం సత్త్వసంశుద్ధిః» ఇత్యాదిగా వక్ష్యమాణం బగు, దైవీం ప్రకృతిమ్ = దైవస్వభావమును; ఆశ్రితాః; ఇందువలననే, అనన్యమనసః = మద్వ్యతిరిక్తం బగుదానియందు మనస్సు లేనివారు; అట్టివారు మాత్రమే, భూతాదిమ్ = జగత్కారణమును; అవ్యయమ్ = నిత్యుని; మామ్; జ్ఞాత్వా; భజన్తి.

ప. ఎవ్వ రప్పుడు ని న్నారాధించుచున్నా రని యాశంకించి నన్నుపాసించువారు రెండువిధములుగా నున్నారని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— మహాత్మానః = మహత్ — కామక్రోధజయశీల మగునట్టి ఆత్మ — మనస్సు గలవారలు; దైవీమ్ = మోక్షసాధనభూత మయిన; ప్రకృతిమ్ = స్వభావమును; ఆశ్రితాః = పొందినవారలై; అనన్యమనసః = అవ్యభిచారి యగు మద్భక్తితోఁ గూడినట్టి సాధకులు; మామ్ = నన్ను; సగుణబ్రహ్మమునుగా; భజన్తి. జ్ఞానులో నన్ను, అవ్యయమ్ = ఆద్యంతములు లేనివానినిగా; భూతాదిమ్ = స్థూలాదిప్రపంచకారణభూతునిఁగా నిర్గుణబ్రహ్మరూపునిఁగా; జ్ఞాత్వా; భజన్తి.

రా. ఎవ్వరు మఱి తమచేసినట్టిపుణ్యసంచయములచే నన్ను శరణముఁగాఁ బొంది విధ్వస్తమయిన సమస్తపాపబంధము గలవారలై, దైవీం ప్రకృతిమ్; ఆశ్రితాః; ఆట్టిమహాత్ములు; భూతాదిమ్; అవ్యయమ్—వాఙ్మనసాఽగోచరనామకర్మస్వరూపునిఁగాఁ బరమకారుణికుఁడ నగుటచే సాధుపరిత్రాణముకొఱకు మనుష్యత్వమున నవతరించినవానిఁగా, మాం జ్ఞాత్వా = నన్నెఱింగి; నన్ను, భజన్తి; మత్ప్రియత్వాతిశయంబున * నన్ను భజించుటచేఁ దక్క మనస్సునకును ఆత్మకును బాహ్యకరణంబులకును ధారణము ♦ నొందనివారై మద్భజనమే ప్రయోజనముగాఁ గలవారై, భజించుచున్నారు.

మా. ఇతరులు ద్వేషింప రని చూపుటకై దేవతలఁ జెప్పుచున్నాఁడు మహాత్మాన ఇత్యాదిగా ⁋.

సతతం కీర్తయన్తో మాం యతన్తశ్చ దృఢవ్రతాః
నమస్యన్తశ్చ మాం భక్త్యా నిత్యయుక్తా ఉపాసతే. ౧౪

భా. ఎట్లు? సతతమ్ = ఎల్లప్పుడును; మామ్ = భగవంతుని బ్రహ్మస్వరూపుని నన్ను; కీర్తయన్తః = కీర్తించుచును; యతన్తశ్చ = ఇంద్రియోపసంహారము శమము దమము దయ అహింస మొదలగుధర్మములచేఁ బ్రయత్నించుచును; దృఢవ్రతాః= స్థిరము—చలింపఁజేయ నలవిగానిదగు వ్రతము గలవారై; మామ్ = నన్ను హృదయగతుని ఆత్మను; నమస్యన్తశ్చ = నమస్కరించుచును; భక్త్యా = భక్తితో; నిత్యయుక్తాః = ఎల్లప్పుడును గూడినవారలై; ఉపాసతే = ఉపాసించుచున్నారు.

ఎల్లప్పుడును నన్నుఁ గీర్తించుచు ఇంద్రియనిగ్రహము మొదలగుధర్ములతో యత్నించుచు నన్ను నమస్కరించుచు దృఢ మగునవ్రతము గలవారలై నిత్యమును భక్తితోఁ గూడినవారలై నన్నుపాసించుచున్నా రని తాత్పర్యము.

రా. భజించువిధము నడుగుచున్నాఁడు ఎట్లు అని. తత్ప్రకారమును జెప్పుచున్నారు సతతమ ఇత్యాదిగా. ఎల్లప్పుడును అనుటచే శ్రవణావస్థ గ్రహింపఁబడుచున్నది. కీర్తించుట—వేదాంతశ్రవణంబును బ్రణవజపంబును వ్రతము—బ్రహ్మ

* నేనే ప్రియుఁడుగాఁ గలవా రగుటయొక్క యతిశయంబున.
♦ పోషణము, లేక, నిలుకడ.
⁋ దేవతల ననవది యుత్తమజీవుల నుపలక్షణము.

చర్యాదికము. నమస్కరించుచును—నన్నుఁ గూర్చి మనస్సున నమ్రులై. భక్తితో— పరమప్రేమతో.

హ. సతతమ్ = సర్వకాలంబును; కీర్తయన్తః = చెప్పుచు. యతన్తః = యత్నము చేయుచు. దృఢవ్రతాః = దృఢ మయినవ్రతము గలవారలై. నమస్యన్తః = నమస్కారము చేయుచు. మామ్ = నన్ను ఈశ్వరుని; భక్త్యా = ప్రీతితో; నిత్యయుక్తాః; ఉపాసతే—సేవించుచున్నా రని యర్థము.

శం. ఇట్లు ఉత్తములయుపాసనప్రకారముఁ బ్రతిపాదించి యిఁక మధ్యముల యుపాసనప్రకారముఁ బ్రతిపాదించుచున్నాఁడు.—కొందఱు ముముక్షువులు స్వాత్మతత్త్వము నెఱుంగుటకై తీవ్రమోక్షేచ్ఛావైరాగ్యములచే సాధనసహితముగా సమస్తకర్మమును సన్న్యసించి, దృఢవ్రతాః = తమజీవనాదికమునందును అపేక్ష లేమిచేతను బ్రహ్మచర్యా ఒహింసా ద్యుత్తమధర్మములచేతను బాహ్యాంతరము లగు నింద్రియముల నిగ్రహించుటచేతను దృఢము—విచ్ఛిత్తి లేనియట్టి జ్ఞానసంపాదనపరత్వము నను వ్రతము—నియమము గలవారలై; సతతమ్=ఎల్లప్పుడును « ఆసుప్తే రామృతేః కాలం నయే ద్వేదాన్తచిన్తయా » * అను స్మృతివలన నిరంతరముగా; మామ్ = ప్రత్యగ్రూపుఁ డైనయాత్మను నన్నే యుద్దేశించి, సాక్షాత్కారము సిద్ధించుటకై; సద్గురుసన్నిధియందు వేదాంతములను, కీర్తయన్తః = పఠించుచు; తదర్థమును ఉపపత్తులచే విచారించుచు జ్ఞాన మెట్లు సిద్ధించునో అట్లు, యతన్తశ్చ = యత్నము చేయుచును; « తం హ దేవ మాత్మ బుద్ధిప్రకాశం ముముక్షుర్వై శరణ మహం ప్రపద్యే » † అను శ్రుతివలన శ్రద్ధతోను, భక్త్యా = భక్తితోను; మామ్ = జ్ఞానప్రదుని ఈశ్వరుని నన్ను; నమస్యన్తశ్చ = ప్రార్థించుచును; ఇట్లు, నిత్యయుక్తాః = నిరంతరనియమము గలవారలై, శుశ్రూషువులై; నన్ను, ఉపాసతే. లేక. నిత్య మనఁగా మోక్షము, తత్సిద్ధికొఱకు యుక్తులై—నియతులై న న్నుపాసించుచున్నారు. « సతతం కీర్తయన్తో మామ్ » అనుటచే నామకీర్తనము వివక్షితం బని మూఢబుద్ధులు తలంప రాదు, ఉపక్రమము విరోధించుటవలనను బ్రకరణవిరోధమువలనను విశేషణవిరోధమువలనను ఆయర్థ మిట సిద్ధింపదు.

---

* సుషుప్తివఱకును మరణమువఱకును కాలమును వేదాంతచింతచేఁ గడపవలయును.

† అట్టి యాత్మజ్ఞానమును బ్రకాశింపఁ జేయునట్టి దేవుని ముముక్షుఁడనై నేను శరణు పొందుచున్నాను.

మ. వా రేవిధంబున భజించుచున్నారు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—సతతమ్ = సర్వదా, బ్రహ్మనిష్ఠుం డగుగురువునొద్దఁ జేరి వేదాంతవాక్యవిచారము చేతను గురువునొద్ద లేనికాలమునఁ బ్రణవజపోపనిషదావర్తనాదులచేతను; మామ్ = సర్వోపనిషత్ప్రతిపాద్యుని బ్రహ్మస్వరూపుని నన్ను; కీర్తయన్తః — వేదాంతశాస్త్రాధ్యయనరూప మయినశ్రవణమునకు విషయమునుగాఁ జేయుచు నని యర్థము; అట్లు, యతన్తశ్చ = గురుసన్నిధియందుఁ గాని యితరస్థలమునందుఁ గాని వేదాంతముల కవిరోధు లగు తర్కములకు * ననుసంధించుచు అప్రామాణ్యశంక లేనియట్లు గురూపదిష్ట మయిన మత్స్వరూపావధారణముకొఱకు యత్నించుచును, శ్రవణమున నిర్ధారిత మయినయర్థమునందు బాధశంకను దొలఁగించునట్టి తర్కానుసంధానరూప మయిన మననము చేయుచు నని యర్థము. అట్లు, దృఢవ్రతాః= దృఢములు—ప్రతిపక్షములచేఁ జలింపఁజేయ నశక్యములు. అహింసా సత్యా ఽ స్తేయ బ్రహ్మచర్యా ఽ పరిగ్రహాదు లగువ్రతములు గలవారలై, శమదమాది సాధనసంపన్నులై యనుట; అట్లు చెప్పఁబడినది పతంజలిచేత—«అహింసా సత్యా ఽ స్తేయ బ్రహ్మచర్యా ఽ పరిగ్రహా యమాః» అనియు, «జాతిదేశకాలసమయా ఽ నవచ్ఛిన్నా స్సార్వభౌమా మహావ్రతమ్» అని. బ్రాహ్మణత్వాదికజాతిచేతను తీర్థాదిదేశముచేతను చతుర్దశ్యాదికాలముచేతను యజ్ఞాదిసమయముచేతను అనవచ్ఛిన్నములు † అహింసాదులు సార్వభౌమములు — క్షిప్తమూఢవిక్షిప్తభూములయందును భావింపఁబడుచున్నవి, ఏజాతియందును ఏదేశమునందును ఏకాలమునందును యజ్ఞాదిప్రయోజనమునందును హింసను జేయ నని యిట్లు ఎట్టి పర్యుదాసంబును ‡ లేక సామాన్యంబునఁ బ్రవృత్తంబులై యివి మహావ్రతం బనఁబడు నని యర్థము. అట్లు, మామ్ = నన్ను భగవంతుని వాసుదేవుని సకలకల్యాణగుణనిధిని ఇష్టదేవతారూపంబునను గురురూపంబునను ఉన్నవానిని; నమస్యన్తశ్చ = మనోవాక్కాయములచే నమస్కరించుచును, చకారమువలన, «శ్రవణం కీర్తనం విష్ణోః స్మరణం పాదసేవనమ్ । అర్చనం వన్దనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్» అని నందనసహచరితముగాఁ జెప్పఁబడిన శ్రవణాదికమును గూడ గ్రహింపవలయును, అర్చనపాదసేవనాదులును గురురూపుఁ డగు నతనియందు సుకరంబులే; ఇట మామ్ అని పున

* యుక్తుల.

† నియమింపఁబడనివి.

‡ ఎట్టిభేదంబును — యజ్ఞాదిభిన్నస్థలంబునమాత్రము హింస చేయను — అని యిట్లు యజ్ఞాదులయందు మాత్రము హింసచేయుదు నను భేదము.

భక్తి సగుణరూపపరామర్శముకొఱకు, కానిచో న్యర్థ మగుటవలన; అట్లు, భక్త్యా= మద్విషయ మయిన పరమప్రేమముతో; నిత్యయుక్తాః=సర్వదా సంయుక్తులై; ఇందుచే సర్వసాధనపుష్కలతయుఁ బ్రతిబంధకాభావంబును జూపఁబడినది, "యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ । తస్యైతే కథితా హ్యర్థాః ప్రకాశన్తే మహాత్మనః" * అనుశ్రుతివలన; పతంజలిచేతనుం జెప్పఁబడినది—"తతః ప్రత్యక్చేతనాధిగమో ఽప్యన్తరాయా భావశ్చ" అని. తతః—ఆయీశ్వరప్రణిధానమువలన, ప్రత్యక్చేతనునియొక్క—త్వంపదలక్ష్యార్థముయొక్క అధిగమము—సాక్షాత్కారము అగుచున్నది, అంతరాయములయొక్క—విఘ్నములయొక్క అభావంబును అగుచున్నదని సూత్రార్థము; ఇట్లు శమదమాదిసాధనసంపన్నులును వేదాంతశ్రవణమననపరాయణులును బరమేశ్వరునందుఁ బరమగురువునందుఁ బ్రేమముచేతను నమస్కారాదులచేతను విఘ్నవిరహితులును బరిపూర్ణసర్వసాధనులునై నన్ను ఉపాసతే= విజాతీయప్రత్యయానంతరితం బగు సజాతీయప్రత్యయప్రవాహముచే శ్రవణమననోత్తరభావి యగుదానిచే నిరంతరంబును జింతించుచున్నారు మహాత్ములు. ఇందుచేఁ బరమసాధనం బగు నిదిధ్యాసనము ప్రశస్తింపఁబడినది. ఇట్టి సాధనసమృద్ధి సిద్ధింపఁగా వేదాంతవాక్యజన్యము అఖండవిషయము సాక్షాత్కారరూప మగు అహం బ్రహ్మాస్మి యను జ్ఞాన మేది గలదో అది సర్వశంకాకలంకములచేతను అస్పృష్ట మయి సర్వసాధనఫలభూతం బగుచు స్వోత్పత్తిమాత్రంబుననే దీపము చీకటిం బోలె సకలం బగు నజ్ఞానంబును దత్కార్యంబును నశింపఁజేయుచున్నది, కావున నిరపేక్షమే ♦ సాక్షాన్మోక్షహేతువు; కాని, భూమిజయక్రమంబున భ్రూమధ్యంబునఁ బ్రాణప్రవేశనంబును గాని మూర్ధన్యనాడిచేఁ బ్రాణోత్క్రమణంబును గాని అర్చిరాదిమార్గంబున బ్రహ్మలోకగమనంబును గాని తద్భోగాంత కాలవిలంబమును గాని ప్రతీక్షింపదు. అందువలన, ఏది మున్ను ప్రతిజ్ఞ చేయఁబడినదో "ఇదం తు తే గుహ్యతమం ప్రవక్ష్యా మ్యనసూయవే । జ్ఞానమ్" అని, అది యిటఁ జెప్పఁబడినది. దీనిఫలము అశుభమునుండి మోక్షణం బేది గలదో అది మున్ను చెప్పఁబడినదే యని యిట వెండియుఁ జెప్ప లేదు. ఇట్లు, ఇట భగవంతుని గంభీర మగు నభిప్రాయం బిది. బాహ్యార్థమో ప్రసిద్ధంబే.

---

* ఎవ్వనికి దేవునియందుఁ బరమభక్తి గలదో దేవునియం దెట్లో అట్లు గురువునందును గలదో అట్టి మహాత్మునకుఁ గదా యీ చెప్పినయర్థములు ప్రకాశించుచున్నవి—తెలియుచున్నవి.

♦ ఇతరాపేక్ష లేనిదే,

శ్రీ. వారల భజనప్రకారముఁ జెప్పుచున్నాఁడు — సతతమ్ = సర్వదా; స్తోత్రమంత్రాదులచేఁ గీర్తించుచుఁ గొందఱు నన్ను, ఉపాసతే=సేవించుచున్నారు. దృఢము లయినవ్రతములు=నియమములు గలవారై; యతన్తశ్చ=ఈశ్వరపూజాదుల యందును ఇంద్రియనిగ్రహాదులయందును బ్రయత్నము చేయుచున్నవారలై కొందఱు. భక్త్యా; నమస్యన్తశ్చ=ప్రణమిల్లుచున్నవారై మఱి కొందఱు. నిత్యయుక్తాః= ఎల్లప్పుడును ఎచ్చరిక గలవారలై. భక్త్యా అనునదియు నిత్యయుక్తాః అనునదియుఁ గీర్తనాదులయందును అన్వయింపవలయును.

ప. ఇఁక భక్తులభజనప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—సతతమ్=నిరంతర మును; కీర్తయన్తః=నానామము ఘోషించుచు; అట్లు, దృఢవ్రతాః=నిశ్చిత మయిన సంకల్పము గలవారలై; యతన్తః=ప్రయత్నము చేయుచు; భక్త్యా=భక్తిచే, దంభ ముచేఁ గాదు; నావిభూతులను గాని మూర్తులను గాని, నమస్యన్తః=నమస్కరించుచు, నిత్యయుక్తాః=నియమము గలవారలై; ఉపాసతే.

రా. అత్యంతము మత్ప్రియు ♦ లగుటచే మత్కీర్తనయత్ననమస్కార ములచేతం దక్క క్షణమాత్రం బైనను ఆత్మధారణము నొందనివారలై మద్గుణ విశేషవాచకము లగు మన్నామములను స్మరించి పులకాంచితసర్వాంగులై హర్ష గద్గదకంఠులై నారాయణా! కృష్ణా! వాసుదేవా! ఇత్యాదిగా, సతతమ్; కీర్త యన్తః; అట్లే, దృఢవ్రతాః యతన్తః=అర్చనాదు లగు మత్కర్మములందును తదుప యోగు లయిన భవననందనవననిర్మాణాదులయందును దృఢసంకల్పులై యత్నిం చుచు; భక్తిభరముచే వంపఁబడిన మనస్సు బుద్ధి అభిమానము రెండుకాళ్లు రెండు చేతులు శిరస్సు అనునీయష్టాంగములచే దుమ్ము బురద రాలు మొదలగునవి తలంపక భూతలమునందు దండమువలెఁ బ్రణామములు సేయుచు నెల్లప్పుడును నన్ను, నిత్య యుక్తాః = నిత్యయోగము కాంక్షించుచున్నవారలై, అత్యంతము నాదాస్యము నందుఁ బ్రవర్తించుచున్నవారలై యుపాసించుచున్నారు.

మా. *

జ్ఞానయజ్ఞేన చాఽ ప్యన్యే యజన్తో మా ముపాసతే
ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్. ౧౫

---

♦ నేనే ప్రియుఁడుగాఁ గలవారు.

* దీనికి మాధ్వభాష్యము లేదు.

**భా.** వార లేయే ప్రకారంబున నుపాసించుచున్నారు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—జ్ఞానయజ్ఞేన=భగవద్విషయం బగుజ్ఞానమే యజ్ఞము జ్ఞానయజ్ఞము, దానిచేత; యజన్తః=పూజించుచు; మాం చ=నన్నే ఈశ్వరుని; అన్యే—బ్రహ్మనిష్ఠులు; ఉపాసతే అపి=ఇతర మయినయుపాసనమును విడిచి యుపాసించుచున్నారు. అజ్ఞానంబునను, ఏకత్వేన = ఒక్కఁడేపరబ్రహ్మము అను పరమార్థదర్శనముచే యజించుచు నుపాసించుచున్నారు. కొందఱు, పృథక్త్వేన = ఆదిత్యచంద్రాదిభేదముచేత; ఆభగవంతుఁడు విష్ణువే యాదిత్యాదిరూపంబున నున్నవాఁ డని యుపాసించుచున్నారు. మఱికొందఱు బహుప్రకారములుగా నున్నాఁ డాభగవంతుఁడే సర్వతోముఖుఁడు విశ్వరూపుం డని, అట్టి, విశ్వతోముఖమ్ = సర్వతోముఖుఁడ నగు నన్ను, బహుధా=బహుప్రకారముల; ఉపాసించుచున్నారు.

బ్రహ్మనిష్ఠు లగువారు నన్ను జ్ఞానయజ్ఞముచే నుపాసించుచున్నారు, అందు ఒక్కఁడె పరబ్రహ్మ మని యుత్తము లేకత్వంబున నుపాసించుచున్నారు. కొందఱు ఆదిత్యాదిరూపంబున నేనే యున్నా నని తత్తద్భేదమున నుపాసించుచున్నారు. మఱికొందఱు బహుప్రకారముల నే నున్నా నని సర్వతోముఖుండ నగు నన్ను బహు ప్రకారముల నుపాసించుచున్నారు.

**ఆ.** ఉపాసనప్రకారభేదముల నెఱుంగఁ గోరి యడుగుచున్నాఁడు వారలు ఇత్యాదిగా. తత్ప్రకారభేదములఁ జెప్పుటకై శ్లోకమును దించుచున్నారు చెప్పుచున్నాఁ డని. ఇజ్యతే—పూజింపఁబడుచున్నాఁడు పరమేశ్వరుఁడు దీనిచేత నను వ్యుత్పత్తిచే ప్రకృతజ్ఞానమునందు యజ్ఞశబ్దము. మాంచ అనుచో చకార మవధారణార్థకము. అపిశబ్దసూచిత మయిన దేవతాంతరధ్యానత్యాగమును జూపుచున్నారు ఇతర మయిన ఇత్యాదిగా. జ్ఞానయజ్ఞమునే విభజించుచున్నారు అజ్ఞానంబునను ఇత్యాదిగా. ఉత్తమాధికారుల యుపాసనముఁ జెప్పి మధ్యమాధికారుల యుపాసనముఁ జెప్పుచున్నారు కొందఱు ఇత్యాదిగా. వారలదే ప్రకారాంతరంబున నుపాసనము చెప్పుచున్నారు మఱి కొందఱు ఇత్యాదిగా. బహుప్రకారంబుల— అగ్న్యాదిత్యాదిరూపంబున నని యర్థము.

**హ.** ఈశ్వరవిషయ మగు జ్ఞానమే యజ్ఞము జ్ఞానయజ్ఞము, దానిచేత; అన్యే=ఇతరజనులు; యజన్తః=పూజించుచు; మామ్—ఈశ్వరుని; ఉపాసతే=సేవించు

చున్నారు. ఏకత్వేన—ఏకమే పరబ్రహ్మమని పృథక్త్వేన—ఇంద్రాదిదేవతా దిత్యరూపంబున. బహుధా = బహుప్రకారములనున్నవానిని విశ్వతోముఖమ్=విశ్వరూపంబున—విశ్వరూపము ధరించినవానిని.

శ౦. ఇట్లు ఆత్మతత్త్వజిజ్ఞాసువులై యతు లగు ముముక్షువులకు వేదాంత శ్రవణరూప మయినయుపాసనముఁ జెప్పి శ్రవణమననంబులచే జక్కగా తత్త్వ జ్ఞానము నొందినవార లగుయతులకు నిదిధ్యాసనాదిరూప మయినయాత్మోపాసనముఁ బ్రతిపాదించుచున్నాఁడు.—జ్ఞానయజ్ఞేన = జ్ఞానము బ్రహ్మాత్మైకత్వవిషయము, అది యే బ్రహ్మోపాస్తికి సాధన మగుటచే యజ్ఞ మని చెప్పఁబడుచున్నది, ఇజ్యతే—పూ జింపఁబడుచున్నాఁడు దీనిచేతఁ గావున యజ్ఞము, జ్ఞానమే యజ్ఞము జ్ఞానయజ్ఞము, దానిచేత; అన్యే=కొందఱు అపక్వాంతఃకరణులు; యజన్తః = బ్రహ్మమే నేను నేనే బ్రహ్మ మని తన్ను బ్రహ్మమునుగానే భావించుచు; మామ్ = నన్ను ప్రత్యగభిన్న మగుపరబ్రహ్మమును; ఉపాసతే = విపరీతభావనానాశముకొఱకు నిత్యంబు ననుసం ధించుచున్నారు. అపిశబ్దముచే కొందఱు కర్ములు కర్మయజ్ఞముచే నుపాసించు చున్నా రని సూచింపఁబడుచున్నది. ఓయీ! జ్ఞానయజ్ఞంబున నెట్లు నిన్నుపాసింప వలయును? భేదంబుననా? అభేదంబుననా? అని యాశంకింపఁగా, « స య శ్చాయమ్, అయ మాత్మా బ్రహ్మ, అహం బ్రహ్మాస్మి ” ఇత్యాదిశ్రుత్యర్థమును బ్రహ్మ విదుఁ డగునాచార్యునిముఖంబున రహస్యసహితముగఁ జక్కగా గ్రహించి యా యర్థమునే శ్రుత్యుక్తవిశేషములచే స్వస్వరూపంబునం జక్కగా ననుభవించి మరల భేదము నవలంబింపక తదేకత్వమునే సదా భావించుటకు శక్తు లెవ్వరో వార లేక త్వంబున నుపాసింపవలయును, అశక్తు లగువారు భేదంబున నుపాసింపవలయు నని బోధించుటకై చెప్పుచున్నాఁడు.—జ్ఞానయజ్ఞముచే నెవ్వరు ముఖ్యాధికారు లగు పరమహంస యతు లుపాసించుచున్నారో వారు, ఏకత్వేన=అభేదముచేత, బ్రహ్మమే నే నని తమ కభిన్నునిఁగా నన్నుపాసించుచున్నారు. ఎవ్వరు మఱి మధ్యమాధి కారులు హంస కుటీచకాదులు గలరో వారు, పృథక్త్వేన = భేదముచేత; విశ్వతో ముఖమ్=సర్వాత్మకుఁడ నగు నన్ను; బహుధా = అనేకప్రకారముగా, « ఆదిత్యో బ్రహ్మ, మనో బ్రహ్మ, ఓమి త్యేతే నైవా ఽక్షరేణ » ఇత్యాదిశ్రుత్యుక్తరీతిని బహు విధంబుల భేదంబున నుపాసించుచున్నారు, అందును అనధికారులు కొందఱు ముముక్షువులు వైదికులు « సో మేన యజేత ” ఇత్యాదిగా కర్మయజ్ఞముచేత ఇం

ద్రాదిరూపుని నన్నుపాసించుచున్నారు. అందును గొందఱు శివవిష్ణుబ్రహ్మాదిరూపుండ నగు నన్ను వైదికతంత్రంబున నుపాసించుచున్నారు.

మ ఇప్పుడు, ఎవ్వరిట్టి శ్రవణమననిదిధ్యాసనములయందసమర్థులో వారలును మూఁడువిధములు, ఉత్తములు మధ్యములు అధములు అని. వారందఱును దమ కనురూపముగా నన్నుపాసించుచున్నారని చెప్పుచున్నాఁడు — అన్యే = మున్ను చెప్పిన సాధనముల ననుష్ఠించుటయందు అసమర్థులు; జ్ఞానయజ్ఞేన = "త్వం వా అహ మస్మి భగవో దేవతే; అహం వై త్వ మసి" * ఇత్యాదిశ్రుత్యుక్త మగు నహంగ్రహోపాసనము జ్ఞానము, అదియే పరమేశ్వరయజనరూపం బగుటవలన యజ్ఞము, దానిచేత; చకార మేవకారార్థకము; అపిశబ్దము సాధనాంతరసముచ్చయార్థకము; కొందఱు ఇతరసాధనములయందు స్పృహ లేనివారలై ఉపాస్యోపాసకాభేదభావనారూప మగు జ్ఞానయజ్ఞముచే, ఏకత్వేన = భేదనిరాకరణముచే; మాం చ ఉపాసతే = నన్నే ధ్యానించుచున్నారు ఉత్తములు. ఇతరులలో కొందఱు మధ్యములు, పృథక్త్వేన = ఉపాస్యోపాసకులకు భేదముచేత, "ఆదిత్యో బ్రహ్మేత్యాదేశః" ఇత్యాదిశ్రుత్యుక్త మగు ప్రతీకోపాసనరూప మగు జ్ఞానయజ్ఞముచే నన్నే యుపాసించుచున్నారు. ఇతరులలో అహంగ్రహోపాసనమునందుఁ గాని ప్రతీకోపాసనమునందుఁ గాని యసమర్థులగువారు కొందఱధములు ఇతరదేవతోపాసనమును గాని అన్యకర్మంబులం గాని చేయుచు, బహుధా = అనేకప్రకారములచేత; విశ్వతోముఖమ్ = విశ్వరూపుని సర్వాత్ముని నన్నే యుపాసించుచున్నారు, ఇట్టియా జ్ఞానయజ్ఞముచేత. ఇందు, ఉత్తరోత్తరులకుఁ గ్రమంబునఁ బూర్వపూర్వభూమికాలాభ మగును.

వ్యా శ్రీ* మఱియును.— వాసుదేవ స్సర్వమ్ అని సర్వాత్మత్వదర్శనము జ్ఞానము, అదియే యజ్ఞము, అట్టిజ్ఞానయజ్ఞముచేత; మామ్; యజన్తః = పూజించుచు, అన్యే అపి; ఉపాసతే. అందును గొందఱు, ఏకత్వేన = అభేదభావనచేత. కొందఱు; పృథక్త్వేన — దాసుఁడను నేనని. మఱికొందఱు, విశ్వతోముఖమ్ = సర్వాత్మకుఁడ నగు నన్ను; బహుధా = బ్రహ్మరుద్రాదిరూపంబున; ఉపాసించుచున్నారు.

ప. ఇఁక, జ్ఞానులెట్లు భజించుచున్నారనఁగాఁ జెప్పుచున్నాఁడు.— అన్యే చ = ఇతరులును, జ్ఞానయజ్ఞేన — సర్వత్రాత్మదర్శనరూప మగుదానిచేత; మామ్;

* భగవంతుఁడా! దేవుఁడా! నీవే నేను, నేనే నీవు.

యజన్తః; ఏకత్వేన=స్థూలసమష్టిరూపంబునఁ గాని; పృథక్త్వేన=ఇంద్రాదివ్యష్టిరూప మునఁ గాని; బహుధా=స్వదేహములయందుఁ గాని; విశ్వతోముఖమ్ = విశ్వరూపుని నన్ను; ఉపాసతే. శ్రుతియును.—"హంసశ్శుచిష ద్వసు రన్తరిక్షస ద్ధోతా వేదిష దతిథి ర్దురోణ సత్ । నృష ద్వరస దృతస ద్వ్యోమస దబ్జా గోజా ఋతజా అద్రిజా ఋతం బృహత్" అని. భాష్యము.—ఈవ్యష్టిరూపము సమస్తమును జే. ఋతం బృహత్ = సమష్టిరూపము సత్య మగు బ్రహ్మమే యగుచున్నది. దానినే చెప్పు చున్నది.—హంసః=జీవుఁడు బ్రహ్మమే. అట్లు, శుచియందు—జ్ఞానమునందు జ్ఞేయుండై యున్నాఁడు కావున శుచిషత్తు; వసుః=స్థూలప్రపంచరూపుఁ డగువిరాట్టు; అన్తరిక్ష సత్ = ఆకాశమునం దున్నవాఁడు, అతఁడును బ్రహ్మమే. లేక. వసుః = యజ్ఞము. జుహోతి—వేల్చుచున్నాఁడు కావున హోత, అతఁడును బ్రహ్మమే. అట్లు, వేది షత్=ఉత్తరవేదియందు ఉన్నట్టి; అతిథిః=అగ్ని, అతఁడును బ్రహ్మమే. దురోణసత్= దురోణమునందు—యజ్ఞార్థము స్థాపింపఁబడినద్రోణకలశమునం దున్నది, అదియు బ్రహ్మమే. అట్లు, నృషత్ = మనుష్యులయం దున్నదియు; వరసత్=వరులయందు— దేవతలయం దున్నదియు; అట్లు, ఋతసత్ = ఋతమునందు—ప్రాణమునం దున్న దియు; వ్యోమసత్ = వ్యోమమునందు—ఆకాశమునం దున్నదియు; అట్లు, అబ్జాః= ఉదకంబునందుఁ బుట్టినజీవులును; గోజాః=భూమిజులును; ఋతజాః = వాయుజులును; అద్రిజాః=పర్వతజులును, ఇది సమస్తంబును బ్రహ్మరూపము.

తా. అన్యేఽపి=ఇతరులును మహాత్ములు; పూర్వోక్తము లగు కీర్తనాదుల చేతను జ్ఞానాఖ్యయజ్ఞముచేతను యజించుచు నన్నుపాసించుచున్నారు. ఎట్లు? బహుధా పృథక్త్వేన—జగదాకారముచేత, విశ్వతోముఖమ్ = సర్వప్రకారముగా నున్నవానిని నన్ను, ఏకత్వంబున నుపాసించుచున్నారు. ఇది యభిప్రాయము.—భగ వంతుఁడు వాసుదేవుఁడే నామరూపవిభాగానర్హము లగు నతిసూక్ష్మచిదచిద్వస్తువులు శరీరముగాఁ గలవాఁడై సత్యసంకల్పుఁడు కావున నానావిధములుగా విభక్తములగు స్థూలచిదచిద్వస్తువులు శరీరముగాఁ గలవాఁడ నగుదు నని సంకల్పించి యతం డొ క్కఁడే దేవతిర్యఙ్మనుష్యస్థావరాఖ్య మగు విచిత్రజగత్తు శరీరముగాఁ గలవాఁడై యున్నవాఁ డని యనుసంధించుచును నన్నుపాసించుచున్నారు. అని.

మా. అంతటను ఒక్కఁడే నారాయణుఁ డున్నవాఁ డని యేకత్వంబునను పృథక్త్వంబున—అంతటను వైలక్షణ్యంబున బహువిధములుగాఁ గదా యతని

రూపము తోఁచుచున్నది. «శుక్ల మివ లోహితమివా ఽథో నీల మథో ఽర్జునమ్» అని సనత్సుజాతమునందు. లేక, «దైవమేవా ఽపరే" అని చెప్పినప్రకారంబున పెక్కండ్రు పెక్కువిధములుగా.

అహం క్రతు రహం యజ్ఞ స్స్వధా ఽహ మహ మౌషధమ్
మన్త్రో ఽహ మహ మేవా ఽఽజ్య మహ మగ్ని రహం హుతమ్. ౧౬

భా. బహుప్రకారముల నుపాసింతురేని యెట్లు నిన్నే యుపాసించుచున్నారు? అందుకుఁ జెప్పుచున్నాఁడు —క్రతుః=శ్రౌతకర్మవిశేషము; అహమ్=నేనే. మఱియు, స్వధా=అన్నము, పితృదేవతల కేని యియ్యఁబడుచున్నదో అది; అహమ్ = నేనే. ఔషధమ్ = సర్వప్రాణులచే నేది భుజింపఁబడుచున్నదో అట్టి యౌషధశబ్దవాచ్యము ♦; అహమ్ = నేనే. లేక. స్వధా=సర్వప్రాణులును భుజించునన్నము. ఔషధమ్ = వ్యాధి శాంతికై సేవించుమందు. మన్త్రః=దేనిచేఁ బితరులకును దేవతలకును హవిస్సు ఇయ్యఁబడుచున్నదో అట్టిమంత్రము; అహమ్=నేనే. ఆజ్యమ్= హవిస్సును; అహమేవ=నేనే. అగ్నిః = దేనియందు హోమము చేయఁబడుచున్నదో అట్టి యగ్ని; అహమ్=నేనే. హుతమ్=హవనకర్మమును *; అహమ్=నేనే.

క్రతువు నేనే, యజ్ఞము నేనే, అన్నము నేనే, ఔషధము నేనే, మంత్రము నేనే, ఆజ్యము నేనే, అగ్ని నేనే, హోమమును నేనే యని తాత్పర్యము.

ఆ. అప్పుడు భగవదేకవిషయం బగు నుపాసనము సిద్ధింపదని శంకించుచున్నాఁడు బహుప్రకారముల నిత్యాదిగా. ప్రకారభేదము నవలంబించి ధ్యానించువారలు గూడ భగవంతునే ధ్యానించుచున్నారు, అతఁడు సర్వాత్మకుం డగుటవలన నని చెప్పుచున్నారు అందుకుఁ జెప్పుచున్నాఁడు అని. క్రతుయజ్ఞశబ్దముల కపునరుక్తతను బ్రదర్శించుచు వ్యాఖ్యానము చేయుచున్నారు శ్రౌతేత్యాదిగా. క్రియాకారకఫలజాతం బేదియు భగవదతిరిక్తము లే దని సముదాయార్థము.

హ. ఎట్లు ఒక్కఁడే భగవంతుఁడు బహువిధుం డని చెప్పవచ్చును? అని యాశంకించి తాను బహువిధుం డని ప్రదర్శించుటకై చెప్పుచున్నాఁడు.—అహమ్;

♦ అన్న మనుట.
* హోమము చేయుటయును.

క్రతుః = సోమయాగప్రభేదము అగ్నిష్టోమాదికము. అహమ్; యజ్ఞః = పూటపూట చేయునట్టి దేవయజ్ఞాదికము. అహమ్; స్వధా = పితృపూజార్థమై మయినయజ్ఞము స్వధా యని చెప్పఁబడుచున్నది, పితృయజ్ఞాదికము అహమ్; ఔషధమ్=ఏది వ్యాధి నివృత్తికై యుపయోగింపఁబడుచున్నదో అది యౌషధము, హారీతకి మొదలగునది. అహమ్; మన్త్రః=దేనిచే దేవతలకు హవి స్సియ్యఁబడు చున్నదో అట్టి యజురాదికము. అహమేవ; ఆజ్యమ్=నేయి. అహమ్; అగ్నిః= దేనియందు హవిస్సు వేల్వఁబడు చున్నదో అట్టి యాహవనీయాదికము. అహమ్; హుతమ్ = హోమము, అదియు నేను.

౫౦. ఓయీ! "యత్తదద్రేశ్యమ్, తదరూప మనామయమ్, దివ్యోహ్యమూర్తః పురుషః" అని శ్రుతి పరబ్రహ్మమునకు నామరూపాదులు లే వనియే ప్రతిపాదించుచున్నది. ఎట్లు నామరూపాదిశూన్యుఁడ వగు నిన్ను దృశ్య్యలయిన యింద్రాదులయందును శివాదులయందును ఉపాసించుట యుపపన్న మగును? అని యాశంకింపఁగా, "ఇన్ద్రో మాయాభిః పురు రూప ఈయతే, మాయాంతు ప్రకృతిం విద్యా న్మాయినంతు మహేశ్వరమ్, తస్యా వయవభూతై స్తు వ్యాప్తం సర్వ మిదం జగత్, ఏకం సద్విప్రా బహుధా వదన్తి, ఇన్ద్రం మిత్రం వరుణ మగ్ని మాహుః" ఇత్యాదిశ్రుతులచేఁ బరబ్రహ్మమునకు నాకే మాయచే సవిశేషత్వంబును సర్వాత్మత యుఁ బ్రతిపాదింపఁబడుచున్నది; అందువలన నింద్రాదులును శివాదులును క్రతు యజ్ఞమంత్రాదులును జగంబును సర్వంబును నేనే యని తాను విశ్వతోముఖుం డనుటను బ్రతిపాదించుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.—అహం క్రతుః = క్రతువు—ఆధానాద్యశ్వమేధాంత మగు శ్రుత్యుక్తయాగ మేది గలదో అది నేనే. అన్వతీ యార్థమునందు ఏవకారము అంతటను అన్వయించుచున్నది. అహం యజ్ఞః= ఔపాసనం బాదిగా ఈశానబల్యంత మగు స్మార్తకర్మము నేనే. అంగులగు క్రతు యజ్ఞములు బ్రహ్మమైనపుడు తదంగము లగు దేవతాయజమానాదులును బ్రహ్మమే యని యెఱుంగవలయును. అహం స్వధా= పితరుల కేది పార్వణశ్రాద్ధాదిక మియ్యఁ బడుచున్నదో అది స్వధా, అదియు నేనే. అహ మౌషధమ్=ఏది ప్రాణులచే భుజింపఁ బడుచున్నదో వ్రీహి మొదలగు నోషధులవలనఁ బుట్టినది, అట్టి యన్నము నేనే. భోజ్యము బ్రహ్మ మయినపుడు భోక్త్రాదులును బ్రహ్మమే యని సిద్ధము. అహం మన్త్రః=దేనిచే దేవతలకును బితరులకును స్వాహాస్వధాంతముగా హవి స్సియ్యఁ

బడు చున్నదో అట్టిమంత్రము నేనే. అహ మేవాజ్యమ్=చరుపురోడాశాదికము నేనే. అహ మగ్నిః=అగ్నియు నేనే. అహం హుతమ్=హవనక్రియయు నేనే.

మ. బహువిధముల నుపాసింతురేని అప్పుడు నిన్నే యనుట యెట్లు? అని యాశంకించి తన విశ్వరూపతను బ్రపంచించుచున్నాఁడు నాలుగుశ్లోకముల చేత.—సర్వస్వరూపుఁడను నే నని చెప్పవలసి యుండఁగా దత్తదేకదేశకథనము, విభజించి యనువదించుటచే ద్వాదశకపాలుం డగు వైశ్వానరునియం దష్టాకపాల త్వాదికథనమువలె. క్రతుః=శ్రౌతం బగు నగ్నిష్టోమాదికము. యజ్ఞః=స్మార్త మగు వైశ్వదేవాదికము, మహాయజ్ఞ మని శ్రుతిస్మృతిప్రసిద్ధము. స్వధా=పితరుల కియ్యఁ బడునట్టియన్నము. ఔషధమ్ = ఓషధులవలనఁ బుట్టినయన్నము, సర్వ ప్రాణులచే భుజింపఁబడునది; లేక, మందు. మన్త్రః=దేనిచే దేవతలను నుద్దేశించి హవి స్సియ్యఁ బడు చున్నదో అట్టి యాజ్యాపురోనువాక్యాదికము. ఆజ్యమ్=నేయి, ఇది సర్వహవి స్సులకు నుపలక్షణము. అగ్నిః = ఆహవనీయాదికము, హవిస్సును వేల్చుట కధికర ణము. హుతమ్=హవనము, హవిస్సును వేల్చుట ఇది సర్వంబును నేనే పరమేశ్వ రుఁడనే. వీనిలో నేకైకజ్ఞానంబును భగవదుపాసనం బని చెప్పుటకై ప్రత్యేకము అహంశబ్దప్రయోగము. క్రియాకారకఫలజాతం బేదియు భగవదతిరిక్తము లే దని సముదాయార్థము.

శ్రీ. సర్వాత్మకతను బ్రపంచించుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.— క్రతుః=శ్రౌత మయిన యగ్నిష్టోమాదికము. యజ్ఞమో స్మార్తము పంచమహాయజ్ఞా దికము. స్వధా=పితరులకొఱకుఁ జేయు శ్రాద్ధాదికము. ఔషధమ్=ఓషధులవలనఁ గలిగినయన్నము, లేక, మందు. మన్త్రః=యాజ్యాపురోనువాక్యాదికము. ఆజ్యమ్— హోమాదులకుసాధనము. అగ్నిః=ఆహవనీయాదికము. హుతమ్ = హోమము. ఇది సమస్తమును నేనే.

ప. ఇఁక సర్వరూపతను బ్రపంచించుచున్నాఁడు నాలుగింటిచేత.— అందును బాహ్యకస్వరూపతను మొదటఁ జెప్పుచున్నాఁడు. ♦

రా. అట్లె గదా విశ్వశరీరుఁడనై నేనే యున్నా నని చెప్పుచున్నాఁడు.— అహం క్రతుః=నేను జ్యోతిష్టోమాదిక్రతువను. అహం యజ్ఞః=నేను మహాయజ్ఞమను. నేనే పితృగణంబులకుఁ దుష్టి యిచ్చునట్టి స్వధ. ఔషధమ్—హవిస్సును నేనే. నేనే

♦ తక్కినవని శ్రీధరీయమునందో సమానము.

మంత్రమును, నేనేయాజ్యమును, ఇది యుపలక్షణార్థము, సోమాదిక మగు హవిస్సును నేనే యని యర్థము. నేనే యాహావనాదికం బగు నగ్నిని. హోమంబును నేనే.

మా ప్రతిజ్ఞ చేయఁబడినవిజ్ఞానంబుఁ జెప్పుచున్నాఁడు.—క్రతువులు అగ్నిష్టోమాదులు. యజ్ఞ మనఁగా దేవత నుద్దేశించి ద్రవ్యపరిత్యాగము, “ఉద్దిశ్య దేవాః ద్రవ్యాణాం త్యాగో యజ్ఞ ఇతీరితః” * అను నిఘంటువువలన.

పితా ఽహ మస్య జగతో మాతా ధాతా పితామహః
వేద్యం పవిత్ర మోఙ్కార ఋక్సామ యజు రేవచ. ౧౭

భా. మఱియును.—అహమ్ = నేను; అస్య జగతః = ఈప్రపంచమునకు; పితా = తండ్రిని. మాతా = తల్లిని. ధాతా = కర్మఫలమును ప్రాణులకు విధించువాఁడను. పితామహః= తండ్రికిఁ దండ్రిని. వేద్యమ్= ఎఱుంగఁ దగినవాఁడను. పవిత్రమ్ = పావనమను. ఓంకారః = ప్రణవమను. ఋక్= ఋగ్వేదంబను. సామ = సామవేదంబను. యజురేవచ = యజుర్వేదంబను గూడ.

నేనే యీజగంబునకుఁ దండ్రిని తల్లిని కర్మఫలము నిచ్చువాఁడను పితామహుఁడను. నేనే యెఱుంగఁ దగినవాడను. నేనే పావన మయినపుణ్యకర్మమును. నేనే ప్రణవంబను. నేనే ఋగ్వేదంబను సామవేదంబను యజుర్వేదంబను అని తా.

శ్రీ. ఇందువలనఁ గూడ భగవంతుఁడు సర్వాత్మకుం డని యెఱుంగవలయు నని చెప్పుచున్నారు మఱియును అని. పవిత్రమ్ అనఁగా పరిశుద్ధము చేయఁబడుచున్నది దీనిచే ననువ్యుత్పత్తిచేఁ బరిశుద్ధికారణం బగుపుణ్యకర్మ మని చెప్పుచున్నారు పావనమ నని. వేద్యం బగుబ్రహ్మమునందు వేదనసాధనము ఓంకారము. అందుఁ బ్రమాణము ఋగాదులు. చకారమువలన అథర్వాంగిరస్సులు గ్రహింపఁబడుచున్నవి.

మా. అహమ్; అస్య; జగతః; పితా=జనకుఁడను. మాతయు నేనే. ధాతా= కర్మఫలమును ప్రాణుల కిచ్చువాఁడను నేనే. పితామహః=తండ్రితండ్రిని. వేద్యమ్= ఎఱుంగవలసినవాఁడను నేనే. పవిత్రమ్=పావనంబను నేనే. ఓంకారః=ప్రణవమను నేనే, “ఓ మితి బ్రహ్మ” అనుశ్రుతివలన. ఋక్—మంత్రవిశేషము. సామ—మంత్రవిశేషము. ఇట్లు, యజుః=మంత్రవిశేషము.

* దేవతల నుద్దేశించి ద్రవ్యముల నిచ్చుట యజ్ఞ మని చెప్పఁబడినది.

శం. మఱియును.—“ మాయా శబలం బ్రహ్మ బ్రహ్మణో ఽవ్యక్త మవ్యక్తాన్మహా న్మహతో ఽహఙ్కారో ఽహఙ్కారా త్పఞ్చతన్మాత్రాణి ” అనుశ్రుతివలన, అస్య జగతః = ఈయాకాశాదిప్రపంచముయొక్క; పితా = జనకుఁడు, భూతాదిః అహమ్=నేనే. మాతా=అవ్యక్తము, అపరప్రకృతి; నేనే. పితామహః=అక్షరుఁ డను పేరు గలవాఁడు మాయోపాధి యగు ఈశ్వరుఁడు; నేనే. ధాతా=పోషించువాఁడను; నేనే. వేద్యమ్ = ఏ దేది యెఱుఁగఁ దగినది శబ్దస్పర్శరూపాదివస్తువు గలదో అది యంతయు; నేనే. ఇంకను, పవిత్రమ్ = ఏ దేది శుద్ధి చేయువస్తువు గలదో అట్టి సూర్యాగ్నివాయ్వాదులు సమస్తమును; నేనే. ఓంకారః=పరాపరబ్రహ్మములకు వాచకము, నేనే. ఋక్సామయజుస్సులును చకారమువలన అథర్వేతిహాసపురాణాదులును నేనే.

మ మఱియును.—అస్య జగతః = సమస్త మయినప్రాణిజాతమునకును; పితా=తండ్రిని. మాతా=తల్లిని. ధాతా=పోషించువాఁడను, లేక, ఆయాకర్మఫలము విధించువాఁడను. పితామహః=తండ్రితండ్రిని. వేద్యమ్=ఎఱుంగఁదగిన వస్తువను. పరిశుద్ధము చేయఁబడుచున్నది దీనిచేతఁ గావున, పవిత్ర మనఁగా పావనము, శుద్ధిహేతువగు గంగాస్నానగాయత్రీజపాదికము. వేదితవ్యం బగు బ్రహ్మమునందు వేదనసాధనము ఓంకారము. నియతము లయినయక్షరములు గలపాదములు గలది ఋక్కు, అదియే గాన విశిష్టము సామము, గానమాత్రమునకు వాచక మగు సామపదము వేఱు. గానరహితమై యనియతము లైనయక్షరములు గలది యజుస్సు. ఈమూఁడువిధము లయినమాత్రములును కర్మోపయోగులు. చకారమువలన అథర్వాంగిరస్సులును గ్రహింపఁబడుచున్నవి. ఏవకారము నేనే యని యవధారణమునకు అగు.

శ్రీ. మఱియును.—ధాతా = కర్మఫలము విధించువాఁడు. వేద్యమ్= ఎఱుంగఁ దగినవస్తువు. పవిత్రమ్ = శుద్ధి చేయునది. ఓంకారః = ప్రణవము. ఋగ్వేదాదివేదంబులును నేనే. ఇతరము స్పష్టము.

ప. మఱియును సూక్ష్మప్రపంచరూపుఁడను గూడ నే నగుచున్నా నని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—పితా=లింగరూపుఁడను, బీజప్రదుఁడ నగుటవలన. మాతా—మాయయున కాశ్రయుఁడ నగుటవలన. ధాతా=కర్మఫలము నిచ్చువాఁడను. వేద్యమ్=జ్ఞేయం బగువస్తువను. పవిత్రమ్=శోధకుఁడను. ఓంకారః=వాగ్జమును అవాగ్జమును ♦ అగు నోంకారము నేను. ఋగాదివేదంబులు మూఁడును నేనే.

♦ వాక్కువలనఁ బుట్టినదియు, వాక్కువలనఁ బుట్టనిదియు.

తా. అస్యజగతః = ఈస్థావరజంగమాత్మక మగుజగత్తునకు; అచ్చటచ్చట పిత గాను మాత గాను ధాత గాను పితామహుఁడు గాను ఉన్నవాఁడను నేనే. ఇట ధాతృశబ్దము మాతాపితృవ్యతిరిక్తుఁడై జన్మప్రయోజక మైనచేతనవిశేషమును వచించుచున్నది. వేద్యమ్ = వేదవేద్యంబగు; పవిత్రమ్ = పావన మగునది యేది గలదో, అది నేనే. వేదకంబును వేదబీజభూతంబు నగుప్రణవము నేనే. ఋక్సామ యజురాత్మక మగువేదంబును నేనే.

మూ. *

గతి ర్భర్తా ప్రభు స్సాక్షీ నివాస శ్శరణం సుహృత్
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజ మవ్యయమ్. ౧౮

భా. మఱియును.—గతిః = కర్మఫలంబును. భర్తా = పోషకుఁడను. ప్రభుః=స్వామిని. సాక్షీ=ప్రాణులకృతాకృతంబులకు ‡ సాక్షిని. నివాసః= దేనియందుఁ బ్రాణులు నివసించుచున్నారో అది నేను. శరణమ్=ఆర్తులై ప్రపన్ను లయినవారికి ఆర్తిని హరించువాఁడను. సుహృత్ = ప్రత్యుపకారము నపేక్షింపనివాఁడనై యుపకారము చేయువాఁడను. ప్రభవః= దేనివలన జగమున కుత్పత్తి యగునో అది నేను. ప్రలయః = దేనియందుఁ బ్రలయము నొందునో అది నేను. అట్లు, స్థానమ్=దేనియం దుండునో అది నేను. నిధానమ్=నిక్షేపము, ప్రాణులకుఁ గాలాంతరంబున నుపభోగ్యము, అది నేను. బీజమ్=ప్రరోహధర్ములకు ♦ ప్రరోహకారణము; అవ్యయమ్= యావత్సంసారభావి యగుటవలన అవ్యయము, బీజము లేక యేదియుఁ బ్రరోహింపదు గదా! నిత్యంబును బ్రరోహము కనఁబడుటవలన, బీజసంతతి వ్యయము నొందదని తెలియవచ్చుచున్నది; అట్టిబీజము నేనే.

నేనే కర్మఫలంబును, పోషకుండను, ప్రభువను, ప్రాణికర్మంబులకు సాక్షిని, ప్రాణులనివాసస్థానంబును, ఆర్తులకు శరణంబును, ప్రత్యుపకారము నపేక్షింపని యుపకారిని, జగత్తున కుత్పత్తికారణంబును, ప్రలయస్థానంబును, స్థితిస్థానంబును, నిక్షేపంబును, అవ్యయం బగు ప్రరోహకారణంబును అని తాత్పర్యము.

* దీనికి మాధ్వభాష్యము లేదు.

‡ చేయఁబడినదానికిని జేయఁబడనిదానికిని.

♦ మొలచుస్వభావము గలవానికి.

ఆ. భగవంతుఁడు సర్వాత్మకుండనుటకు మఱియొక్క హేతువుఁ జెప్పుచున్నారు మఱియును అని. గమ్యతే—పొందఁబడుచున్నది కావునఁ బ్రకృతివిలయమువఱకుఁ గర్మఫలము గతి యని చెప్పుచున్నారు కర్మఫలంబనని. పోషకుఁడను—కర్మఫలము నిచ్చువాఁడను. కార్యకారణప్రపంచమున కధిష్ఠానం బని చెప్పుచున్నారు నివాసః అని. శీర్యతే—నశించుచున్నది దుఃఖము దీనియందను వ్యుత్పత్తి నాశ్రయించి చెప్పుచున్నారు శరణమ్ అని. ప్రభవతి—పుట్టుచున్నది దీనివలన జగత్తు అనువ్యుత్పత్తిని గ్రహించి చెప్పఁబడినది దేనివలన నిత్యాదిగా. కారణం బెట్లు వ్యయం బగు నని యాశంకించి చెప్పుచున్నారు యాన దిత్యాదిగా. కారణము లేకున్నను కార్యము కానేకప్పుడు పుట్టఁగలదు, కారణం బేల? అని యాశంకించి చెప్పుచున్నారు బీజము ఇత్యాదిగా. అప్పుడు సంసారదశయందే యెప్పుడును కార్యోత్పత్తి లేక యుండదే అని యాశంకించి చెప్పుచున్నారు నిత్యంబును ఇత్యాదిగా. కారణవ్యక్తికి నాశము నంగీకరించి వానిలో నే వ్యక్తియుఁ బూర్వకాలంబున లేమి సంభవింప దనుట సిద్ధం బని విశేషణము చేయుచున్నారు బీజసంతతి యని.

హ. గతిః=కర్మఫలము. భర్తా=పోషించువాఁడు. ప్రభుః=స్వామి. సాక్షీ—ప్రాణుల శుభాఽశుభకర్మమునకు. నివాసః = ప్రాణులు నివసించుచోటు. శరణమ్= ప్రాణుల యార్తిని బోఁగొట్టువాఁడు. సుహృత్ = ప్రత్యుపకారము నపేక్షింపక యుపకరించువాఁడు. మఱియును. ప్రభవః = జగమున కుత్పత్తిస్థానము. ప్రలయః= దేనియందు లయించుచున్నదో అది. స్థానమ్ = జగత్తు దేనియందున్నదో అది. నిధానమ్ = జగమునకు కాలాంతరమున నుపభోగమునకై యేది నిక్షేపింపఁబడుచున్నదో అది. బీజమ్=జగత్తును అంకురింపఁజేయ సమర్థమయినది, అవ్యయ మయిన బీజ మని సంబంధము. ఇదంతయు నేనే.

శం. మఱియును.—గతిః=గమ్యతే—కర్మముచేఁ బొందఁబడుచున్నది కావు గతి యనఁగా కర్మఫలము స్వర్గాదికము, నేనే. భర్తా=జగత్తును ధరించునది కూర్మాదికము, నేనే. ప్రభుః=నియామకుఁడ నేనే. ప్రాణులు చేయుకర్మములకు, సాక్షీ—“ఆదిత్య చన్ద్రావనలోఽనిలశ్చ” ♦ అని చెప్పఁబడినసూర్యాదులు నేనే. నివాసః=సర్వభూతంబులును దేనియందు నివసించునో అది నివాసము, భూతధాత్రి * నేనే. ఆర్తులకు, శరణమ్=ఆర్తిని బోఁగొట్టువాఁడు నేనే. సుహృత్ = దయచేతనే

♦ సూర్యుఁడును చంద్రుఁడును అగ్నియు వాయువును కర్మసాక్షులు.

* భూమి.

ప్రాణుల కుపకరించువాఁడు, చంద్రుఁడు గాని పర్జన్యుఁడు గాని వాయువు గాని, నేనే. ప్రభవః = ప్రభవతి—పుట్టుచున్నది దీనివలన సర్వంబును అనువ్యుత్పత్తిచేఁ ప్రభవం బనఁగా సర్వజగత్సృష్టికారణము; అది నేనే. ప్రలయః=సమస్తమునకును ప్రకృష్ట మాయినలయము దేనివలననో అది ప్రలయము, సర్వజగత్సంహర్తయు నేనే. స్థానమ్—ఇది గర్భితణిజంతము, నాశదశను బొందినట్టి సమస్తమును ఎవ్వాఁడు స్థాపించునో అతఁడు స్థానము, స్థితికారణము, నేనే. నిధానమ్—నిధీయతే = ఉంపఁబడుచున్నది సమస్తమును దీనియందు కావున నిధానము, కార్యకారణప్రపంచమునకధిష్ఠానము, నేనే. అవ్యయమ్=జ్ఞానముచేఁ దక్క నితరముచే నవ్యేతి—నశింపదు కావున అవ్యయము, నాశరహిత మగు; బీజమ్ = జగద్బీజము అవ్యాకృత మనుపేరు గలది, నేనే.

మ. మఱియును.—గతిః=గమ్యతే—పొందఁబడుచున్నది కావున కర్మఫలము, “బ్రహ్మా విశ్వసృజో ధర్మో మహానవ్యక్త మేవచ। ఉత్తమాం సాత్త్వికీమేతాం గతి మాహు ర్మనీషిణః” ♦♦ అని యిట్లు మన్వాదులచేఁ జెప్పఁబడినది. భర్తా=పోషించువాఁడు, సుఖసాధనములనే యిచ్చువాఁడు. ప్రభుః=స్వామి, నావాఁడవీఁ డని స్వీకరించువాఁడు. సాక్షీ = సర్వప్రాణులయు శుభాశుభములను జూచువాఁడు. నివసతి—నివసించుచున్నాఁడు దీనియం దని నివాస మనఁగా భోగస్థానము. శీర్యతే—నశించుచున్నది దుఃఖము వీనియం దని శరణ మనఁగా ప్రపన్నుల యార్తిని బోఁగొట్టువాఁడు. సుహృత్ =ప్రత్యుపకారము నపేక్షింపక యుపకారముఁ జేయువాఁడు. ప్రభవః=ఉత్పత్తి. ప్రలయః=వినాశము. స్థానమ్=స్థితి. లేక. ప్రకర్షంబునఁ బుట్టుచున్నది వీనిచేత నని ప్రభవ మనఁగా స్రష్ట. ప్రకర్షంబున లయము నొందుచున్నది వీనిచేత నని ప్రలయ మనఁగా సంహర్త. తిష్ఠతి—ఉన్నది వీనియం దని స్థాన మనఁగా నాధారము; నిధీయతే—నిక్షేపింపఁబడుచున్నది తత్కాలంబున భోగమున కయోగ్య మగుటచేఁ గాలాంతరోపభోగ్య మగువస్తువు దీనియం దని నిధానము, సూక్ష్మరూపసర్వవస్తువులకధికరణం బగుప్రలయస్థాన మని యర్థము. లేక, శంఖపద్మాదినిధి. బీజమ్=ఉత్పత్తికారణము; అవ్యయమ్ = అవినాశి యగునది, కాని వ్రీహ్యాదికమువలె నశ్వరము కాదు, అందుచే అనాదియు అనంతము నగుకారణ మేది గలదో అది ఇదంతయు నేనే యని పూర్వముతోనే సంబంధము.

---

♦♦ బ్రహ్మదేవుఁడును ప్రజాపతులును ధర్మమును మహత్తును అవ్యక్తమును—వీరు ఉత్తమ మయిన సాత్త్వికగతి యని పండితులు చెప్పుచున్నారు.

శ్రీ. మఱియును.—గతిః=ఫలము. భర్తా=పోషకకర్త. ప్రభుః=నియామకుఁడు. సాక్షీ=శుభాశుభములఁ జూచువాఁడు. నివాసః = భోగస్థానము. శరణమ్=రక్షకుఁడు. సుహృత్=హితము చేయువాఁడు. ప్రభవః=ప్రకర్షంబునఁ బుట్టుచున్నది వీనిచేత నని స్రష్ట. ప్రలీయతే—ప్రలయము నొందుచున్నది వీనిచేత నని ప్రళయ మనఁగా సంహర్త. స్థానమ్=తిష్ఠతి—ఉన్నది వీనియం దని ఆధారము. నిధీయతే—ఉంపఁబడుచున్నది వీనియం దని నిధాన మనఁగా లయస్థానము. బీజమ్=కారణము; అట్లయినను, అవ్యయమ్=అవినాశి, కాని వ్రీహ్యాదిబీజమువలె నశ్వరము కా దని యర్థము.

ప. మఱియును.—గమ్యతే—పొందఁబడుచున్నది దీనిచేత నని గతి యనఁగా పాదవ్యాపారహేతువు. భర్తా = పోషకుఁడు. ప్రభుః=నియంత. సాక్షీ=శుభాశుభద్రష్ట. నివాసః=భోగస్థానము. శరణమ్=రక్షకుఁడు. సుహృత్=ప్రియహితుఁడు. ప్రభవః = ప్రకృష్టము—ఉత్తమ మయినచరమదేహము * కలుగుచున్నది యెవ్వని వలననో అట్టివాఁడు. ప్రలయః = ప్రకర్షంబునలయము—అపునర్భవము † ఎవ్వని వలననో వాఁడు. నిధీయతే—ఉంపఁబడుచున్నది దేనియందో అది నిధానము. బీజమ్=కారణము; అదియు, అవ్యయమ్ = అవినాశి, కాని వ్రీహ్యాదిబీజమువలె నశ్వరము కా దని యర్థము.

రా. గమ్యతే—పొందఁబడుచున్నది కావున గతి, అచ్చటచ్చట ప్రాప్యస్థాన మని యర్థము. భర్తా=ధరించువాఁడు. ప్రభుః=శాసించువాఁడు. సాక్షీ=సాక్షాత్తుగాఁ జూచువాఁడు. నివాసః=వాసస్థానము, గృహాదికము. శరణమ్=ఇష్టమును బొందించువాఁడును అనిష్టమును నివారించువాఁడు నగుటచే సమాశ్రయింపఁ దగిన చేతనుఁడు శరణము, అతఁడు నేనే. సుహృత్=హితముఁ గోరువాఁడు. ప్రభవప్రలయస్థానమ్ ‡ దేనికైనను ఉత్పత్తిప్రలయముల కేది స్థానమో అది నేనే. నిధానమ్ = నిధీయతే—ఉంపఁబడుచున్నది కావున నిధానము, ఉత్పాద్యంబును ఉపసంహార్యంబును § నేనే యని యర్థము. అవ్యయం బీజమ్=అచ్చటచ్చట వ్యయరహిత మయినకారణ మేది గలదో అది నేనే.

---

* మోక్షసాధన మయిన కడపటిదేహము.

† పునర్జన్మము లే కుండుట.

‡ వీరిమతమున ప్రభవప్రలయస్థానమ్ అని పాఠము.

§ పుట్టింపఁదగినదియు ఉపసంహరింపఁ దగినదియు.

మూ. గమ్యతే-పొందఁబడుచున్నాఁడు ముముక్షువులచేతఁ గావున గతి. అట్లు సామవేదంబున వాసిష్ఠశాఖయందు.—« అథ కిస్మా దుచ్యతే గతి రితి బ్రహ్మైవ గతి రితి తద్ధి గమ్యతే పాపనిముక్తై: » ‡ అని. సాక్షాత్తుగాఁ జూచుచున్నాఁడు కావున సాక్షి, అట్లు బాష్కలశాఖయందు.—« స సాక్షా దిద మద్రాక్షీ ద్య దద్రాక్షీ త్త త్సాక్షిణ స్సాక్షిత్వమ్ » ** అని. శరణమ్ = సంసారము వలన భయపడినవానికి ఆశ్రయము, « పరంపరాణామ్ » ఇత్యాదిగాఁ జెప్పఁబడినది, « నారాయణం మహాజ్ఞేయం విశ్వాత్మానం పరాయణమ్ " అనియు. సంహారకాలమునందుఁ బ్రకృతిచే జగత్తు వీనియందు నిధీయతే-ఉంపఁబడుచున్నది కావున నిధానము. అట్లు ఋగ్వేదఖిలములయందు.—« అపశ్య మహ్య మే మాయయా విశ్వకర్మ ణ్యాదౌ జగ స్సహితం శుభ్రచక్షు: " * అని.

తపా మ్యహ మహం వర్షం నిగృహ్ణా మ్యుత్సృజామి చ
అమృతం చైవ మృత్యుశ్చ స దసచ్చా ఽహ మర్జున. ౧౯

భా. మఱియును.—అహమ్ = నేను; తపామి = తాపము చేయుచున్నాను, ఆదిత్యుఁడనై కొన్ని యుల్బణంబు † లగు కిరణములచేత. నేను, వర్షమ్ = వర్షమును; విడుచుచున్నాను. విడిచి నెండియు, నిగృహ్ణామి=నిగ్రహించుచున్నాను, కొన్నికిరణములచే నెనిమిదిమాసములు. మరల, ఉత్సృజామిచ=విడుచుచున్నాను వర్షర్తువునందు. అమృతం చైవ=దేవతలయమృతంబును నేనే. మృత్యుశ్చ = మర్త్యులమృత్యువును నేనే. సత్=దేనికి సంబంధియై యేది యున్నదో అది యట సత్తు; అసచ్చ=దానికి విపరీతము అసత్తు, ఆరెండును; అహమ్=నేనే. మఱి, అత్యంతమే యసత్తుగాఁడు భగవంతుఁడు, కార్యకారణములు గాని స్వయము సదసత్తులు గావు. అర్జున = అర్జునా! ఎవ్వరు జ్ఞానవిదులు పూర్వోక్తము లయిన

‡ ఇఁక నెందువలనఁ జెప్పఁబడుచున్నది గతి యని? బ్రహ్మమే గతి యని. అది గదా పొందఁబడుచున్నది పాపవిముక్తులచేత.

** అతఁడు సాక్షాత్తుగా దీనిఁ జూచెను. చూచె ననునది యేది గలదో అది సాక్షియొక్క సాక్షిత్వము.

* ప్రలయమునందు మాయచే విశ్వకర్మయందు-ఈశ్వరునియం దుంపఁబడినయాజగత్తును స్వచ్ఛమయిన నేత్రములు గలవాఁడనై చూచితిని.

† అధికము.

యనువృత్తిప్రకారము * లగు నేకత్వపృథక్త్వాదివిజ్ఞానరూపయజ్ఞములచే నన్నుఁ బూజించుచు నుపాసించుచున్నారో వారు తమవిజ్ఞానము చొప్పున నన్నే ప్రాపించుచున్నారు.

అర్జునా! నేనే సూర్యుఁడనై యెండగాయుచున్నాను, వర్షమును గురియించి నేనే యాజలము నాకర్షించుచున్నాను, మఱియు నేనే వర్షము గురియించుచున్నాను, దేవతలయమృతంబును నేనే, మర్త్యులమృత్యువును నేనే, సత్తును— కారణసంబంధమై యభివ్యక్త మయినకార్యంబును నేనే, అసత్తును — అనభివ్యక్త నామరూపం బగుకారణంబును నేనే యని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁ గూడ భగవంతుఁడు సర్వాత్ముఁ డనుటయందు వివదింపఁ గూడ దని చెప్పుచున్నారు మఱియును అని. “ఆదిత్యా జ్జాయతే వృష్టిః” అను స్మృతి నవలంబించి వ్యాఖ్యానము చేయుచున్నారు కొన్ని ఇత్యాదిగా. వర్షోత్సర్గ నిగ్రహములు ఒక్కని కేకకాలంబున సంభవింప వని యాశంకించి చెప్పుచున్నారు ఎనిమిదిమాసములు అని. ఋతుభేదంబున వర్షోత్సర్గనిగ్రహంబులు ఒక్కనికి విరుద్ధములు కా వని యర్థము. ఏకారణమునకు సంబంధమై యేకార్య మభివ్యక్త మగుచున్నదో అది యట సత్తని చెప్పఁబడుచున్నది. కారణసంబంధముచే అనభివ్యక్తము — కారణమే అనభివ్యక్తము లయిననామరూపములు గలది యసత్తని వ్యవహరింపఁబడుచున్నది. ఆయభిప్రాయమునే చెప్పుచున్నారు సత్ ఇత్యాదిగా. శూన్యవాదమును నిరాకరించుచున్నారు అత్యంతమే ఇత్యాదిగా. భగవంతుఁ డత్యంతమసత్తైనయెడ కార్యకారణకల్పన యధిష్ఠానరహితమై నిలువనేర దని యర్థము. అప్పుడు యథాశ్రుతముగా కార్యము సత్తనియు కారణ మసత్తనియు సంగీకరింపఁబడుఁ గాక యని యాశంకించి నిషేధించుచున్నారు కార్యకారణములు ఇత్యాదిగా. కార్యమునకు ఆత్యంతిక మయినసత్త్వము లేదు గదా వాచారంభణశ్రుతివలన, కారణమునకును ఆత్యంతిక మగునసత్త్వము లేదు, “కుతస్తుఖలు” ఇత్యాదిశ్రుతి వలన నని యర్థము. ఈచెప్పిన జ్ఞానయజ్ఞములచే భగవంతునం దభినివిష్ట మయిన బుద్ధి గలవారల కేమిఫలము? అని యాశంకించి అప్పుడే గాని క్రమంబునఁ గాని ముక్తి ఫలం బని చెప్పుచున్నారు ఎవ్వరు ఇత్యాదిగా.

ప. అహమ్; తపామి = నే నాదిత్యుఁడనై తాపము సేయుచున్నాను. అహం వర్షం నిగృహ్ణామి = నేను కొన్నికిరణములచే నెనిమిదిమాసములు వర్షమును

* అనువృత్తి—అనుసరించి వృత్తి—ఉండుట, ఉపాసనభేదము లనుట.

నిగ్రహించుచున్నాను. మఱియు, ఉత్సృజామి = కొన్నికిరణములచే నాలుగుమా
సములు వర్షమును విడుచుచున్నాను. అమృతం చైవ = దేవతలయమృతము నేనే.
మృత్యుశ్చ = మర్త్యులమృత్యువును నేనే. దేనితో సంబంధిన్తె యేది యున్నదో
అది యట సత్తు. దానికి విపరీతము అసత్తు. కాని అత్యంతమే యసత్తు కాదు. కార్య
కారణములు గాని సదసత్తులు కావు. ఆసదసత్తులును నేనే. అర్జునా!

౧౦. మఱియును—అహమ్ = ఆదిత్యరూపుఁడ నగు నేను; తపామి= వసంత
గ్రీష్మర్తువులందు జగత్తునకు తాపక్రియ చేయుచున్నాను, జగత్తును సమస్తముఁ
దపింపఁజేయుచున్నా నని యర్థము. కార్తికము మొదలుగా నెనిమిదిమాసములు,
అహం వర్షం నిగృహ్ణామి. వర్షాకాలమునందు నాలుగుమాసములు వర్షమును, ఉత్సృ
జామి. చకారమునవలన, అతివృష్ట్యనావృష్టులచే సుభిక్షమును దుర్భిక్షమును జేయు
చున్నాను. సన్మియుస్తే — చావరు దేవతలు దేనిచేతనో అట్టి యమృతము నేనే.
చత్తురు ప్రాణులు దేనిచేతనో అట్టి మృత్యువు నేనే. ఏది ఇద మస్తి—ఇది యున్నది
యని నామముచేతను రూపముచేతను నిర్దేశింపఁబడుచున్నదో అట్టి వ్యక్తము నామ
రూపాత్మక మగు కార్యము సత్తని చెప్పఁబడుచున్నది. దానికి విలక్షణ మగునవ్య
క్తము నామరూపకారణము అసత్తని చెప్పఁబడుచున్నది. అసత్తును అసత్తును
రెండును నేనే. చకారము ఆసదసత్తులను వ్యక్తావ్యక్తములను రెంటిని నిషేధింపఁగా
తన్నిషేధావధియై యున్న కార్యకారణభావవిహీనము నిర్విషయము నిర్విశేష మగు
పరవస్తు వేది గలదో అది నే నని సూచించుచున్నది. ఇందుచే, క్రతుయజ్ఞంబు
లాదిగా సదసత్తులవఱకుఁ గల సర్వంబును బ్రహ్మస్వరూపం బగుటవలన ముముక్షు
వులు బ్రహ్మబుద్ధిచే నేయేవస్తువు నుపాసించుచున్నను తత్తద్రూపంబున బ్రహ్మమునే
యుపాసించువార లగుటవలన వారికిఁ జిత్తశుద్ధియుఁ గ్రమంబున మోక్షసిద్ధియు
నగు నని సూచింపఁబడినది. ఓయీ! అబ్రహ్మమునందు బ్రహ్మబుద్ధిచేఁ జేయు
నుపాసన మెట్లు ఫలప్రదం బగును? ఎట్లు మఱి బ్రహ్మము దృశ్యం బగును? అందు
వేని; నిన్నిట నడుగవలయును, దృశ్యం బని యేదేనివస్తువు గలదా? లేదా యని.
రెండవపక్షము సంభవింపదు, సర్వవ్యవహారలోపము ప్రసక్తించుటవలన. మొదటి
పక్షమునందు, దృశ్యము సద్రూపంబున నున్నదా? లేక, అసద్రూపంబున నున్న
దా? ఇందును రెండవది సంభవింపదు, శశవిషాణతుల్య మయిన యసత్తును కల
దని నిర్దేశించుట యనుపపన్నం బగుటవలన. అప్పుడు సద్రూపంబుననే యున్న
దందువేని, ఆపక్షమున సర్వంబును బ్రహ్మమే, బ్రహ్మమునకంటె అతిరిక్తమునకు

సత్త్వము సంభవింపమివలన. ఓయీ! సర్వంబును బ్రహ్మమైనచో ఘటపటాదు లకు నాశము కలిగినపుడు బ్రహ్మమునకును నాశము ప్రసక్తించు నందువేని; అట్లు ప్రసక్తింపదు, నాశము భ్రాంతికల్పిత వ్యాప్యాంశవిషయం బగుటవలన. ఎట్లు దండాదికముచేఁ గల్పితకంబుగ్రీవాద్యాకారము గల ఘటమునకే వ్యాప్యాంశమునకు నాశము కనఁబడుచున్నదో, కాని వ్యాపకాంశ మయిన మృత్తునకుఁ గనఁబడదో; అట్లు భ్రాంతికల్పిత నామరూపాదికమునకే వ్యాప్యాంశమునకు నాశము, కాని వ్యాపకాంశ మయినసత్తునకు లేదు, దానికిని నాశంబు గలదన్నచో దృశ్యాభావము భానాభానము ప్రసక్తించుటవలన. అందువలన దృశ్యంబును దృశ్యాభావంబును సద్రూపంబుననే యున్నవి. కావున సర్వంబును బ్రహ్మమే యనుట సిద్ధము. అందుచే, ఇష్టవస్తువునందు బ్రహ్మబుద్ధితోఁ జేయు నుపాసనము ఫలప్రదమే యగును, ఫలసిద్ధి భావనానురూపం బగుటవలన.

మ. మఱియును.—అహం తపామి — అనిత్యాద్యర్థ. ఆతాపమువలననే, అహమ్; వర్షమ్ = పూర్వవర్షరూపమయినరసమును; పృథివినుండి, నిగృహ్ణామి = ఆకర్షించు చున్నాను, కొన్నికిరణములచే నెనిమిదిమాసములు. మఱియు, ఆకర్షింపఁబడిన యారసమునే నాలుగుమాసములు కొన్నికిరణములచే, ఉత్సృజామిచ = వర్షరూపంబున విడుచుచున్నానుగూడ భూమియందు అమృతంచ = దేవతలయమృతమును, లేక, సర్వప్రాణులజీవనంబును. ఏనకారమునకు అహంశబ్దముతో సన్వయము. మృత్యుశ్చ = మర్త్యులమృత్యువును, లేక, సర్వప్రాణులవినాశంబును. సత్ = దేనితో సంబంధియై యేది యున్నదో అట్టి నది సత్తు అసచ్చ = దేనితో సంబంధమై యేది లేదో అది యట అసత్తు. ఇది యంతయు నేనే. ఓయర్జునా! అందువలన సర్వాత్మునిఁగా నన్నెఱిఁగి తమతమయధికారము ననుసరించి బహుప్రకారంబుల నన్నే యుపాసించుచున్నా రనుట యుపపన్నము.

శ్రీ. ఆదిత్యరూపంబుననుండి గ్రీష్మర్తువునందు, తపామి = జగత్తునకుఁ దాపము చేయుచున్నాను. వృష్టిసమయమునందు, వర్షమ్; ఉత్సృజామి = విడుచుచున్నాను. ఒకానొకప్పుడు వర్షమును, నిగృహ్ణామి = ఆకర్షించుచున్నాను. అమృతమ్ = జీవనము. మృత్యుః = నాశము. సత్ = స్థూలమై దృశ్య మగునది. అసత్ = సూక్ష్మమై దృశ్యము కానిది. ఇది సమస్తంబును నేనే యని తలంచి పన్నే బహువిధంబుల నుపాసించుచున్నా రని పూర్వముతోనే యన్వయము.

ప. ఇఁక స్థూలప్రపంచరూపుఁడు గూడ నేనే యని చెప్పుచున్నాఁడు.— ఒకానొకప్పుడు ప్రలయకాలంబునందు ద్వాదశాదిత్యరూపమున. తపామి= భూతజాతమును శోషిల్లఁ జేయుచున్నాను. శ్రుతియును నారాయణోపనిషత్తులయందు— “ఆర్ద్రం జ్వలతి జ్యోతి రహ మస్మి జ్యోతి ర్జ్వలతి బ్రహ్మాహ మస్మి” ఇత్యాదిగా. భాష్యము.—ప్రలయకాలమునందు, ఆర్ద్రమ్ = శుక్లశోణితములవలనఁ బుట్టిన ప్రాణిజాతము; జ్వలతి = ద్వాదశాదిత్యరూపునిచేతను సంకర్షణముఖాగ్నిచేతను దహింపఁబడుచున్నది. అప్పుడు, జ్యోతిః = తైజసుం డగువిరాట్టు; అహ మస్మి = నే నగుచున్నాను. మఱియు నెప్పుడు, జ్యోతిః = ఆవిరాట్టు గూడ; జ్వలతి; అప్పుడు, బ్రహ్మ అహ మస్మి = లింగరూప మగుబ్రహ్మము నే నగుచున్నాను అని. అట్లు, వర్షమ్= పర్జన్యుని; నిగృహ్ణామి = ఆకర్షించుచున్నాను. పెండియు సృష్టికాలమునందు ఆపర్జన్యుని, ఉత్సృజామి= విడుచుచున్నాను. అమృతమ్= జీవనము, నేనే. మృత్యుః= క్రమమున వచ్చునట్టి మృత్యువును నేనే. ఇఁక నుపసంహరించుచున్నాఁడు—సత్ = వ్యవహారసత్తు, స్థూలప్రపంచరూపము; అసత్ = సూక్ష్మప్రపంచరూపము; నేనే.

రా. అగ్న్యాదిత్యాదిరూపంబున నేనే తాపము చేయుచున్నాను. గ్రీష్మాదులయందు నేనే వర్షమును నిగ్రహించుచున్నాను. అట్లు వర్షర్తువునందు నేనే విడుచుచున్నాను. అమృతం చైవ మృత్యుశ్చ = దేనిచే లోకము జీవించుచున్నదో దేనిచే మరణము నొందుచున్నదో ఆరెండును నేనే. అధికము చెప్ప నేల? సత్తును అసత్తును నేనే—ఏది వర్తమానమై యున్నదో అది సత్తు, ఏది యతీతమో అనాగతమో అది యసత్తు; సర్వావస్థావస్థితము లయినచిదచిద్వస్తువులు శరీరముగాఁ గలవాఁడ నగుటచేఁ దత్తత్ప్రకారుఁడనై నేనే యున్నా నని యర్థము. ఇట్లు బహువిధంబులఁ బృథక్త్వంబున విభక్తంబు లగునామరూపములతో నుండు సర్వజగత్తును శరీరముగాఁ గలవాఁడ నగుటచేఁ దత్ప్రకారుఁడనై నేనే యున్నవాఁడ నని యేకత్వజ్ఞానముతో ననుసంధించుచును గూడ న న్నుపాసించుచున్నారు

మా. సత్ = కార్యము. అసత్ = కారణము. “స దభివ్యక్తరూపత్వాత్ కార్య మి త్యుచ్యతే బుధైః। అస దవ్యక్తరూపత్వాత్ కారణం చాపి శబ్దితమ్ ॥*

* సత్తు అభివ్యక్త మయినరూపము గల దగుటవలన కార్య మని పండితులచేఁ జెప్పఁబడుచున్నది. అసత్తు అవ్యక్త మయినరూపము గల దగుటవలన కారణ మని చెప్పఁబడినది.

అని నిఘంటువు. “అసచ్చ సచ్చైవ చ యద్విశ్వం సదసతః పరమ్” ✦ అనియు భారతమునందును.

త్రైవిద్యా మాం సోమపాః పూతపాపా
యజ్ఞై రిష్ట్వా స్వర్గతిం ప్రార్థయన్తే
తే పుణ్య మాసాద్య సురేన్ద్రలోక
మశ్నన్తి దివ్యా న్దివి దేవభోగాన్. ౨౦

భా. ఎవ్వరు మఱి యజ్ఞులు కామకాములో, అట్టి — త్రైవిద్యాః = ఋగ్యజుస్సామవేదముల నెఱింగినవారు; సోమపాః = సోమపానము చేసినవారు; ఆసోమపానముచేతనే, పూతపాపాః = శుద్ధ మయినపాపము గలవారు; మామ్ = వస్వాదిదేవరూపుఁడ నగు నన్ను; యజ్ఞైః = అగ్నిష్టోమాదియాగములచే; ఇష్ట్వా = పూజించి; స్వర్గతిమ్ = స్వర్గగమనమును; ప్రార్థయన్తే = కోరుచున్నారు. తే = వారును; పుణ్యమ్ = పుణ్యఫల మగు; సురేన్ద్రలోకమ్=ఇంద్రునియొక్క-స్థానమును; ఆసాద్య= పొంది; దివ్యాన్ = స్వర్గమునందుఁ గలుగునట్టి, అప్రాకృతము లైనట్టి, దేవభోగాన్ = దేవతల భోగములను; అశ్నన్తి = భుజించుచున్నారు.

అజ్ఞులును సకాములునై ఋగ్యజుస్సామవేదముల నధ్యయనించినవారును సోమపానము చేసినవారును నిష్పాపులు నగువారు ఎవ్వరు అగ్నిష్టోమాదియజ్ఞములచే నన్నుఁ బూజించి స్వర్గప్రాప్తిఁ గోరుచున్నారో వారు తత్పుణ్యఫల మయినస్వర్గము నొంది యచ్చట నప్రాకృతము లయినదేవభోగముల ననుభవించుచున్నా రని తా.

ఆ. భగవద్భక్తులకును నిష్కాము లగువారికే ముక్తి యని ప్రదర్శించుటకై సకాము లగుపురుషులకు సంసారము చెప్ప నారంభించుచున్నారు ఎవ్వరు మఱి ఇత్యాదిగా. మూఁడువిద్యలను అధ్యయనించుచున్నారు, లేక, ఎఱుంగుచున్నా రను వ్యుత్పత్తిచే త్రైవిద్యు లనఁగా వేదవిదులు. ఆయర్థమునే చెప్పుచున్నారు ఋగ్యజు రిత్యాదిగా. వస్వాది యనుచోటి యాదిశబ్దముచే నవసద్వసుశానాదిత్యులును రుద్రులును గ్రహింపఁబడుచున్నారు. శుద్ధ మయిన— పోఁగొట్టఁబడిన యని యర్థము.

✦ అసత్తును సత్తును ఏది గలదో అది ప్రపంచము, అట్టి సదసత్తులకంటెఁ బర మయినబ్రహ్మము.

ప. త్రైవిద్యాః = ఋగ్యజుస్సామవిదులు; సోమపాః = సోమయాజులు; పూతపాపాః = కడుగఁబడినపాపము గలవారు; మామ్= సర్వేశ్వరుని నన్ను; యజ్ఞైః= అగ్నిష్టోమాదులచే; ఇష్ట్వా = ఆరాధించి; స్వర్గతిమ్ = స్వర్గలోకప్రాప్తిని; ప్రార్థయన్తే = కోరుచున్నారు. తే; పుణ్యమ్; సురేన్ద్రలోకమ్; ఆసాద్య; దివ్యాన్ = అప్రాకృతము లైన; దేవభోగాన్; అశ్నన్తి = భుజించుచున్నారు.

తా. ఇట్లు ముముక్షువు లగుమందబుద్ధుల కుపాసనము సిద్ధించుటకై క్రతువు మొదలుగా నసత్తువఱకు సర్వంబును నేనే యని సర్వంబును దానే యనుటను ప్రతిపాదించి, రాజవిద్య యనుచోట బ్రహ్మవిద్యావ్యతిరిక్తము లగు సకలవేదశాస్త్రాధ్యయనజనితంబు లయినవిద్య లన్నియు సంసారమును వృద్ధిఁ బొందించునవియే యని యేది చెప్పఁబడినదో దానినే అశ్రద్దధానాః పురుషాః అనుచోట నిరూపించి యిప్పుడును ముముక్షువులకు వివేకసిద్ధికొఱకు వెండియుఁ బ్రతిపాదించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఋగ్యజుస్సామరూపము లయిన మూఁడువిద్యలను ఎవ్వరు అధ్యయనించుచున్నారో వారు త్రైవిద్యులు, ఋగ్యజుస్సామాధ్యయనము గలవారును తదర్థజ్ఞానము గలవారు నగుసకాములు; తాము, సోమపాః=సోమమును ద్రాగువారును; దానివలననే, పూతపాపాః=నిర్గత మయినబహువిధపాపము గలవారునై; యజ్ఞైః= అగ్నిష్టోమాతిరాత్రాదిక్రతువులచేత; మామ్=నన్ను, ఎనమండ్రు వసువులు పదునొకండ్రురుద్రులు పండ్రెండుగు రాదిత్యులు ప్రజాపతి వషట్కారము—ఏతద్దేవతారూపునిఁ బరమేశ్వరుని; ఇష్ట్వా=చక్కఁగా నారాధించి; స్వర్గతిమ్=స్వర్గప్రాప్తిని; ప్రార్థయన్తే—« స్వర్గే లోకే న భయం కించ నాఽస్తి, స్వర్గలోకా అమృతత్వం భజన్తే » * అని స్వర్గఫలంబు విని స్వర్గము నాకు కలుగుఁ గాక యని స్వర్గసుఖమునే కామించుచున్నారో. తే=అట్టి స్వర్గకాములు; పుణ్యమ్=అగ్నిష్టోమాదిపుణ్యకర్మఫల మైన; సురేన్ద్రలోకమ్ = స్వర్గస్థానమును; ఆసాద్య = పొంది; దివి=ఆస్వర్గమునందు; దివ్యాన్=స్వర్గసంబంధు లైన; దేవభోగాన్=దేవతల కేభోగములు గలవో—ఎట్టిశరీరము గలదో ఎట్టి భోగ్యము గలదో ఎట్టిసుఖము గలదో అట్టివియే యగు భోగములను—సుఖవిశేషములను; లేక, దేవతలచేఁ బొందింపఁబడినట్టిభోగములను; అశ్నన్తి=అనుభవించుచున్నారు, యావత్సంపాత ముషిత్వా అను న్యాయంబున ఎంత

* స్వర్గలోకమునందు భయ మేమియు లేదు, స్వర్గమునందు లోకులు అమృతత్వము నొందుచున్నారు.

వఱకుఁ బుణ్యఫలానుభవము నిర్ణీతమో అంతపర్యంతము స్వర్గభోగముల ననుభవించు చున్నారని యర్థము.

వ్యా. ఇ ట్లేకత్వంబునను బృథక్త్వంబునను బహువిధంబులను–ఈమూఁడు విధంబుల నయినను నిష్కాము లై భగవంతు నుపాసించుచున్నవారు సత్త్వశుద్ధిజ్ఞానో త్పత్తిద్వారమునఁ గ్రమంబున ముక్తు లగుదురు. ఎవ్వరు మఱి సకాములై యీప్రకా రంబున నేనియు భగవంతు నుపాసింపరో, మ తేమనఁగా, స్వస్వకామసాధనంబు లగు కామ్యకర్మంబుల నే యనుష్ఠింతురో, వారు సత్త్వశోధకము లేమిం జేసి జ్ఞానసాధనము నారోహింపక మాటిమాటికి జన్మమరణప్రబంధముచే సర్వదా సంసారదుఃఖము నే యనుభవించుచుందు రని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఋగ్వేదయజు ర్వేదసామవేదరూపములు హౌత్రము ఆధ్వర్యవము ఔద్గాత్రము–ఈమూఁడింటి జ్ఞానమునకు హేతువు లగు మూఁడువిద్యలు ఎవ్వరికిఁ గలవో వారు త్రివిద్యులు, త్రివిద్యులే స్వార్థికతద్ధితముచే త్రైవిద్యులు; లేక, మూఁడువిద్యలను ఎఱుంగుచున్నా రని గాని త్రైవిద్యులు, వేదత్రయవేదులగుయాజ్ఞికులు; యజ్ఞైః=అగ్నిష్టోమాదులచేత; క్రమంబున సవనత్రయంబునందు వసురుద్రాదిత్యరూపి నగు, మాం = నన్ను ఈశ్వ రుని; ఇష్ట్వా=తద్రూపంబున నన్నెఱుంగనివా రయ్యును వస్తుగతిచేఁ బూజించియు అభిషవము చేసియు హోమము చేసియు; సోమపాః = సోమమును త్రాగినవారలై; ఆసోమపానము నేతనే, పూతపాపాః = పోఁగొట్టఁబడిన స్వర్గభోగప్రతిబంధకపాపము గలవారలై; సకాములై, స్వర్గతిం ప్రార్థయన్తే, కాని సత్త్వశుద్ధిజ్ఞానోత్పత్త్యాదిక మును ప్రార్థింపరు లేఁవారు; దివి = స్వర్గలోకమునందు; పుణ్యమ్ = పుణ్యఫలము సర్వోత్కృష్టమగు; సురేన్ద్రలోకమ్ = దేవేంద్రునిస్థానమును, ఆసాద్య = పొంది; దివ్యాన్ = మనుష్యులకు దుర్లభము లగు; దేవభోగాన్ = దేవతాదేహముచే నుపభో గ్యము లయినకామములను; అశ్నన్తి=భుజించుచున్నారు.

శ్రీ. ఇట్లు అవజానన్తి మాం మూఢా ఇత్యాదిగా శ్లోకద్వయంబున నీచుని ఫలాశచే దేవతాంతరమును భజించుచు నన్నాదరింప రని భక్తులు కానివారు ప్రద ర్శింపఁబడిరి. మహాత్మానస్తు మాం పార్థ ఇత్యాదిగా మద్భక్తులు చెప్పఁబడిరి. అందు, ఏకత్వంబునఁ గాని పృథక్త్వంబునఁ గాని పరమేశ్వరుని శ్రీవాసుదేవుని నెవ్వరు భజింపరో వారలకు జన్మమృత్యుప్రవాహము దుర్వారం బని చెప్పుచున్నాఁడు రెండు శ్లోకములచేత. ఋగ్యజుస్సామరూపము లైనమూఁడువిద్య లెవ్వరికిఁ గలవో వారు

త్రివిద్యులు త్రివిద్యులే త్రైవిద్యులు, స్వార్థమునందు తద్ధితము; లేక, మూఁడువిద్యలను అధ్యయనించుచున్నారు లేక ఎఱుంగుచున్నారు కావున త్రైవిద్యులు; వేదత్రయోక్త కర్మపరులని యర్థము; వేదత్రయవిహితంబు లగు, యజ్ఞైః; మామ్ ఇష్ట్వా=నారూప నన్నే దేవతాంతర మని యెఱుంగనివా రయ్యును వాస్తవంబున నింద్రాదిరూపంబున నన్నే యజించి—పూజించి. సోమపాః=యజ్ఞశేషం బగు సోమమును త్రాగినవారలై; అందు చేతనే, పూతపాపాః=శోధిత మయినకల్మషము గలవారలై; స్వర్గతిమ్ = స్వర్గమును గూర్చి పోవుటను; ప్రార్థయన్తే=ఎవరు ప్రార్థించుచున్నారో; తే; పుణ్యమ్=పుణ్యఫల రూప మయిన; సురేన్ద్రలోకమ్ = స్వర్గమును; ఆసాద్య=పొంది; దివి=స్వర్గమునందు; దివ్యాన్=ఉత్తమము లగు; దేవభోగాన్ = దేవతలభోగములను, అశ్నన్తి=భుజించుచున్నారు.

వ. ఇఁక, ఏకత్వేన పృథక్త్వేన బహుధా విశ్వతోముఖమ్ ఇత్యాదిగాఁ జెప్పినవిధంబున నెవ్వరు భజింపరో వారలకు జన్మమృత్యుప్రవాహము తప్ప దని చెప్పుచున్నాఁడు రెంటిచేత.—ఋగ్యజుస్సామవేదములు మూఁడువిద్యలు, వాని యందుఁ గర్మఫలప్రశంసనభాగము త్రైవిద్యము, దాని ననుష్ఠించువారు త్రైవిద్యులు. యజ్ఞావశిష్ట మగు లతారూపసోమమును త్రాగువారలు కావున సోమపులు; పూత పాపాః = శోధింపఁబడినకల్మషము గలవారలై; మామ్ = ఇంద్రాదిదేవతారూపి నగు నన్ను; ఇష్ట్వా = పూజించి; స్వర్గలోకప్రాప్తిని బ్రార్థించుచున్నారు. తే; పుణ్యమ్= పుణ్యఫలప్రద మగు; సురేన్ద్రలోకమ్; ఆసాద్య; దివి=స్వర్గమునందు; దివ్యము లగు దేవతలకుభోగ్యము లయినభోగములను, అశ్నన్తి = భుజించుచున్నారు.

రా. ఇట్లు మహాత్ములు జ్ఞానులు భగవదనుభవైకభోగులు నగువారివృత్తిని బ్రతిపాదించి వారివిశేషమునే తెలుపుటకై యజ్ఞు లగు కామకాములవృత్తిని జెప్పుచున్నాఁడు.—ఋగ్యజుస్సామరూపంబు లగుమూఁడువిద్యలు త్రివిద్యము, కేవల త్రివిద్యనిష్ఠులు త్రైవిద్యులు, కాని వేదాంతనిష్ఠులు కారు, వేదాంతనిష్ఠులు గదా మహాత్ములు పూర్వోక్తప్రకారంబున నిఖిలవేదవేద్యుండ నగు నన్నే యెఱింగి యత్యంతమద్భక్తీకృతంబు లగుకీర్తనాదులచేతను జ్ఞానయజ్ఞముచేతను నేనే ప్రాప్యుఁడుగాఁ గలవారలై నన్నే యుపాసించుచున్నారు, త్రైవిద్యులో వేదప్రతిపాదితము లగు కేవలేంద్రాదియాగముల మిగిలినసోమములను త్రాగుచు, పూతపాపాః=స్వర్గాది ప్రాప్తివిరోధి యగుపాపమునుండి పరిశుద్ధులై, కేవలేంద్రాదిదైవత్యము లని యను

సంధింపఁబడు యజ్ఞములచే వాస్తవంబున నింద్రాదిరూపుండ నగు నన్ను యజించి యష్టృత్వానినిగా నన్నెఱుంగనివారలై స్వర్గగతిని బ్రార్థించుచున్నారు వారు పుణ్య ము—దుఃఖరహితం బగు సురేంద్రలోకము నొంది యచ్చటచ్చట దివ్యము లగు దేవ భోగముల భుజించుచున్నారు.

**మూ.** అట్లయినను, నన్ను భజించుటయే యితరదేవతలభజించుటకన్న నుత్తమం బని చెప్పుచున్నాఁడు త్రైవిద్యా ఇత్యాదిగా.

> తే తం భుక్త్వా స్వర్గలోకం విశాలం
> క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి
> ఏవం హి త్రైధర్మ్య మనుప్రపన్నా
> గతాగతం కామకామా లభన్తే. ౨౧

**వ్యా.** తే=వారు; తమ్=ఆ; విశాలమ్=విస్తీర్ణ మయిన; స్వర్గలోకమ్= స్వర్గలోకమును; భుక్త్వా=అనుభవించి; పుణ్యే=పుణ్యము; క్షీణే=నశించి నది కాఁగా; మర్త్యలోకమ్ = ఈమనుష్యలోకమును; విశన్తి= పొందు చున్నారు. ఏవం హి=ఈ చెప్పినప్రకారముగఁ గదా; త్రైధర్మ్యమ్= కేవలవైదికకర్మమును; అనుప్రపన్నాః = అనుసరించి పొందినవారు; కామ కామాః=కామములను గోరువారు; గతాగతమ్=గతమును ఆగతమును— రాకపోకలను; లభన్తే = పొందుచున్నారు. గతాగతమునే పొందుచు న్నారు కాని యెందును స్వాతంత్ర్యమును బొంద రని యర్థము.

వారు తమకోరినట్లు విస్తీర్ణ మయినస్వర్గభోగము ననుభవించి పుణ్యము క్షీణించినపిదప మర్త్యలోకముఁ జేరుచున్నారు. ఇట్లు కామకాములై వేదోక్తకర్మము కేవలముఁ నాశ్రయించినవారు రాకపోకలనే పొందుచుందు రనుట ప్రసిద్ధ మని తా.

**ఆ.** అప్పుడు స్వర్గప్రాప్తియు భగవత్ప్రాప్తిసమానం బని యాశంకించి చెప్పుచున్నారు.—పుణ్యము—స్వర్గప్రాప్తిహేతు వని యర్థము. హింకేమునకుఁ బ్రసిద్ధి యని యర్థము. వేదవిహితము లగు శాస్త్రాదు లగుమూఁడుధర్మములసమా హారము త్రిధర్మము, అదియే త్రైధర్మ్యము. కామకాములకు గతాగతద్వారముగఁ గామితఫలప్రాప్తి యగునేని యది యిష్టమే యని యాశంకించి చెప్పుచున్నారు గతాగతమునే ఇత్యాదిగా.

హా. తే=ఆస్వర్గముఁ బొందినవారు. విశాలమ్=విస్తీర్ణమును. ఏవమ్=ఇట్లు చెప్పినప్రకారమున. త్రయీధర్మమ్ ♦ = ఋగ్యజుస్సామవేదములచేఁ జెప్పఁబడిన ధర్మమును; అనుప్రపన్నాః=ఆశ్రితులు; కామకామాః=కామములను—విషయములను గోరువారు; గతాగతమ్=గమనమును ఆగమనమును; లభన్తే=పొందుచున్నారు.

శం. మఱియును.—తే=వారు; సోమపానము చేసి స్వర్గకాములై స్వర్గము నొందినవారై; విశాలమ్=తమపుణ్యాతిశయముచేత నధిక మయిన; స్వర్గలోకమ్= స్వర్గమునందలిసుఖవిశేషమును; భుక్త్వా=అనుభవించి; పిమ్మట, పుణ్యేక్షీణే=తత్సుఖ భోగకారణ మయిన తమపుణ్యముక్షీణము కాఁగా; మర్త్యలోకం విశన్తి—ఆదేహ మును విడిచి వెండియు నిటఁ బుట్టుచున్నా రని యర్థము. ఏవమ్; త్రయీధర్మమ్= * త్రయి యనఁగా మూఁడువేదములు కర్మకాండము, దానిచేఁ జెప్పఁబడినధర్మము త్రయీధర్మము, దానిని, «త్రికర్మకృత్తరతి జన్మమృత్యూ, దక్షిణావన్తో అమృ తత్వం భజన్తే" ఇత్యాదిగా అర్థవాదపూర్వకముగ వేదములచేఁ జెప్పఁబడినధర్మ మును, కర్మమునే; అనుప్రపన్నాః = శ్రుతిప్రతిపాదిత మగుకర్మమే నిశ్శ్రేయసంబును అభ్యుదయంబును సిద్ధింపుటకుఁ బరమకారణము, శమము గాని దమము గాని సన్న్యాసము గాని జ్ఞానము గాని యీశ్వరుఁడు గాని కారణము కాదు అను నిశ్చ యము ననుసరించి కేవలకర్మమునందే నిష్ఠ గలవార లగు; కామకామాః=కామింపఁ బడుచున్నవి గావున కామము లనఁగా భూమియందును స్వర్గమునందును గలుగు విషయములు, వానినే కామించుచున్నారు కావున కామకాములు, విషయభోగ లంపటు లగుమీమాంసకులు; పండితు లైనను వారు, ఏవమ్ = ఈచెప్పినవిధంబున; గతాగతమ్=గతమును ఆగతమును, గమనాగమనములనే, అంతములేని కర్మఫలమును; లభన్తే—స్వర్గమునుండి వచ్చి పుట్టుచున్నారు, పుట్టి వెండియు మృతులై స్వర్గము నొందుచున్నారు—ఇట్లు కాములు జననమరణప్రవాహమునందు మగ్ను లగుచున్నా రని యర్థము.

మ. అందువలన నేమి యనిష్ట మనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తే=ఆసకా ములు; తమ్=ఆకామ్యపుణ్యముచేఁ బొందఁబడినట్టి; విశాలమ్=విస్తీర్ణ మగు; స్వర్గ లోకమ్; భుక్త్వా; తద్భోగజనక మగు, పుణ్యేక్షీణే=పుణ్యము క్షీణింపఁగా; ఆదేహ

♦ వీరిమతమున "త్రయీధర్మ మను ప్రపన్నాః" అని పాఠము.

* వీరిమతమునందును "ఏవం త్రయీధర్మ మనుప్రపన్నాః" అని పాఠము.

ము నశించుటవలన మెండియు దేహము గ్రహించుకొఱకు, మర్త్యలోకం విశన్తి—మెండియు గర్భవాసాది బాధలను అనుభవించుచున్నారని యర్థము. మాటికి మాటికి, ఏవమ్=ఈచెప్పినచొప్పున; త్రైధర్మ్యమ్=హౌత్రము ఆధ్వర్యవము ఔద్గాత్రము అను మూఁడుధర్మముల కర్మ మయిన జ్యోతిష్టోమాది కామ్యకర్మమును, త్రయీధర్మమ్ అనుపాఠమునందును త్రయిచేత—వేదత్రయముచేత ప్రతిపాదిత మయినధర్మము నని యదియే యర్థము; అనుప్రపన్నాః=అనాది యగు సంసారమునందుఁ బూర్వప్రతిపత్తి నపేక్షించి అనుశబ్దము ♦, పూర్వము కర్మము నాశ్రయించి స్వర్గము నొంది మనుష్య లోకమునకు వచ్చినవారై మరల నాశ్రయించినట్టి; కామకామాః=దివ్యభోగములఁ గామించువారు; ఇట్లు, గతాగతం లభన్తే—కర్మముఁ జేసి స్వర్గము నొందుచున్నారు, అటనుండి వచ్చి మెండియుఁ గర్మముఁ జేయుచున్నారు—ఇట్లు గర్భవాసాదియాతనా ప్రవాహము వారలకు నిరంతరం బనువర్తించుచున్నది యని యభిప్రాయము.

శ్రీ. అంత.—తే = ఆస్వర్గకాములు; తమ్=తమకోరినట్టి; విపుల మయిన, స్వర్గలోకమ్—అచటిసుఖమును; భుక్త్వా; భోగమును గలిగించుపుణ్యము క్షీణింపఁగా, మర్త్యలోకం విశన్తి. మెండియు నిట్లే, మూఁడువేదములచే విధింపఁబడినధర్మము ననుసరించినట్టి, కామకామాః=భోగములను గామించువారు; గతాగతమ్ = గమనాగమనములను; లభన్తే.

ప. అందువలన నేమి యగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—తే; తమ్=ఉక్తప్రకార మయిన; స్వర్గలోకమ్; విశాలమ్=స్థూలఫలద మయినదానిని; భుక్త్వా; పుణ్యము క్షీణ మయినపిదప, మర్త్యలోకం విశన్తి=దేవదేహమును విడిచి మరల లింగదేహమున గర్భమును బ్రవేశించుచున్నారు. ఏవమ్=ఈప్రకారమున; త్రయీధర్మమ్ = త్రయిచే—వేదత్రయముచేఁ బ్రదర్శింపఁబడిన ఫలప్రశంసనరూప మగుధర్మమును; అను=ఉద్దేశించి; ప్రపన్నాః=ప్రవృత్తు లగుయాజ్ఞికులు; కామములను—విషయములను గోరుచున్నారు కావున కామకాములై; గతాగతమ్=యాతాయాతమును; లభన్తే. శాతపథశ్రుతియును.—“ఆత్మాన మేవ లోక ముపాసీత స య ఆత్మాన మేవ లోక ముపాస్తే న హాస్య కర్మ క్షీయతే। అస్మాద్ధ్యే వాత్మనో యద్య త్కామయతే తత్త త్సృజతే” అని. భాష్యము.—అన్యదేవతోపాసనముచే నుత్తమఫలము పొందఁబడ దని మున్ను చెప్పఁబడినది. అందువలన, ఆత్మాన మేవ లోకమ్ = లోక్యతే—

♦ అను అనఁగా పిమ్మట, పూర్వము కర్మము నాశ్రయించిన పిమ్మట అని యర్థము.

పొందఁబడుచున్నది సర్వమును దీనిచేతఁ గావున లోకము, అట్టి యాత్మనే; ఉపాసీత=ఉపాసింపవలయును, ఇతరుని నుపాసింపఁ గూడదు. సః యః ఆత్మాన ముపాస్తే=అట్టివాఁ డెవ్వఁ డాత్మ నుపాసించుచున్నాఁడో; అస్య=వీనియొక్క; కర్మ=కర్మము; హ=నిశ్చయముగా; నక్షీయతే=భోగముచే క్షీణము గాదు, మ తే మనఁగా, జ్ఞానముఁ బుట్టించి మోక్షము నొందించుచున్నది. ఇఁక, అతఁడు విషయసుఖము నపేక్షించు నేని అప్పుడు అదియును ఆత్మవలననే పొందఁబడుచున్న దని చెప్పుచున్నది.—అస్మాత్ ఆత్మనః=ఈయాత్మవలన; యః యత్ యత్ కామయతే = ఎవ్వఁడు దేనిదేనిఁ గోరుచున్నాఁడో; అతఁడు, తత్తత్ సృజతే = ఆయాసిద్ధ్యాదికముఁ బుట్టించుచున్నాఁడు, ఇతరముఁ జెప్ప నేల ? అది చెప్పఁబడినది టిప్పణికలయందు—ఏది సత్యమో దానినుపాసింపవలయును, ఏల యనఁగా, దానిచే సత్యముఁ బొందఁబడుచున్నది. అసత్యము నుపాసించుటచే అట్టిదే స్వప్నమునందుఁ బుట్టిన రాజ్యాదికమువంటి యసత్య ఫలము కలుగును. ఆయాసము సమాన మయినను తుచ్ఛఫలద మయినమార్గము నందుఁ బ్రవృత్తి యెట్లు కలుగును ? ఇదియే మాయావైభవము, హరిభక్తిచే హరింపఁబడుచున్నది. అని.

రా. తే; తం విశాలం స్వర్గలోకం భుక్త్వా; తదనుభవమునకు హేతుభూత మగుపుణ్యము క్షీణింపఁగా, వెండియును, మర్త్యలోకం విశన్తి. ఇట్లు వేదాంతసిద్ధ మయినజ్ఞానము లేనట్టి కామ్యస్వర్గాదికాములు కేవలము త్రయీధర్మమును అనుప్రపన్నులై, గతాగతం లభన్తే—అల్పములును అస్థిరములు నగు స్వర్గాదుల ననుభవించి మాటిమాటికి మరలి వచ్చుచున్నా రని యర్థము.

మూ. *

అనన్యాశ్చిన్తయన్తో మాం యే జనాః పర్యుపాసతే
తేషాం నిత్యాభియుక్తానాం యోగక్షేమం వహామ్యహమ్. ౨౨

భా. ఎవ్వరు మఱి నిష్కాములు సమ్యగ్దర్శులు.—అనన్యాః=అపృథగ్భూతులై, పరమదేవుని నారాయణుని ఆత్మనుగా నెఱింగినవారలై; చిన్తయన్తః=ధ్యానించుచు; మామ్=నన్ను; యే జనాః=ఎవ్వరు సన్న్యాసులు; పర్యుపాసతే = ఉపాసించుచున్నారో. తేషామ్=అట్టి పరమార్థదర్శులకు; నిత్యాభియుక్తానామ్ = ఎల్లప్పుడును అభియోగము గలవార

* దీనికి మాధ్వభాష్యము లేదు.

లకు; యోగక్షేమమ్ = యోగమనఁగా అప్రాప్తమును బొందుట, క్షేమ మనఁగా దాని రక్షించుట, ఆరెంటిని; అహమ్=నేను; వహామి=పొందించుచున్నాను, "జ్ఞానీత్వాత్మైవ మే మతమ్, సచ మమ ప్రియః" * ఎందువలననో, అందువలన వారు నా కాత్మభూతులును ప్రియులును అని. ఓయీ! ఇతరులకుఁ గూడ భక్తులకు యోగక్షేమమును వహించుచునే యున్నాఁడు భగవంతుఁడు. సత్యము, ఇట్లు వహించుచునే యున్నాఁడు. మఱి తేమనఁగా, ఇదివిశేషము.—ఇతరులు భక్తు లెవ్వరుగలరో వారు స్వార్థము తాముగూడ యోగక్షేమముఁ గోరుచున్నారు, అనన్య దర్శులో ఆత్మార్థము యోగక్షేమము నపేక్షింపరు. వారు తమకు జీవితమునందుఁ గాని మరణమునందుఁ గాని యుపేక్షను జేయరు గదా! కేవలమే భగవచ్ఛరణులు వారు. అందువలన భగవంతుఁడే వారలకు యోగక్షేమము వహించుచున్నాఁడు అని.

ఎవ్వరు పృథగ్భావము విడిచి నన్నే తానుగా నెఱింగి యుపాసించుచున్నారో అట్లు నిత్యంబును భక్తితో నన్నే ధ్యానించుచుండు నట్టివారికి నేనే యోగక్షేమము సంపాదించుచున్నా నని తాత్పర్యము.

టీ. ఫలము నభిసంధింపక నన్నే యారాధించుచుండు సమ్యగ్దర్శననిష్ఠులయిన యత్యంతనిష్కాములకు యోగక్షేమము లెట్లు సిద్ధించు నని యాశంకించి చెప్పుచున్నారు ఎవ్వరు మఱి ఇత్యాదిగా. ఎవ్వరికన్న అన్యుఁడు లేఁడో అట్టివారు అనన్యు లనువ్యుత్పత్తి నాశ్రయించి చెప్పుచున్నారు అపృథగ్భూతులు అని. కార్యమునకుంబోలెఁ గారణమునందు తాదాత్మ్యమును వ్యావర్తించుచున్నారు పరమ దేవుని ఇత్యాదిగా. నేనే వాసుదేవుఁడను సర్వాత్ముఁడను నాకన్న నితర మేదియు లేదని యెఱింగి యాప్రత్యగాత్మనే సదా ధ్యానించుచున్నవా రని చెప్పుచున్నారు చిన్తయన్తః అని. ప్రాకృతులను వ్యావర్తించి ముఖ్యులైనయధికారులను నిర్దేశించుచున్నారు సన్న్యాసు లని. పర్యుపాసతే—పరితః—అంతటను అనవచ్ఛిన్నముగా చూచుచున్నారో అని యర్థము. నిత్యాభియుక్తానామ్—నిత్యమును—ఎల్లప్పుడును ఆదరంబున ధ్యానమునందు వ్యాపృతులైనవారికని చెప్పుచున్నారు ఎల్లప్పుడును ఇత్యాదిగా. యోగమును క్షేమమును యోగక్షేమము. అందు ధనసంపత్తిని బరిహా

---

* అధ్యా-౭,—శ్లో-౧౭, శ్లో-౧౮.

రించుచున్నారు యోగ మనఁగా నిత్యాదిగా. ఎందుకుఁ బరమార్థదర్శులకు యోగక్షేమమును వహించుచున్నావు? అని యాశంకించి చెప్పుచున్నారు జ్ఞానీ ఇత్యాదిగా. అందువలన వారికి యోగక్షేమమును వహించుచున్నా నని సంబంధము. సమ్యగ్దర్శననిష్ఠులకుమాత్రమే యోగక్షేమమును వహించుచున్నాఁడు భగవంతుఁడనువిశేషమును సహింపక శంకించుచున్నాఁడు ఓయీ ఇత్యాదిగా. ఇతరులకుఁ గూడ భక్తులకు భగవంతుడు యోగక్షేమము వహించుచున్నాఁ డనుట నంగీకరించుచున్నారు సత్యము అని. అప్పుడు భక్తులయందును జ్ఞానులయందును విశేషము లే దని యాశంకించి చెప్పుచున్నారు మ తే మనఁగా నిత్యాదిగా. అందు విశేషము కల దని దాని వివరించుచున్నారు ఇది విశేషము ఇత్యాదిగా. యోగక్షేమము నుద్దేశించి తాము యత్నము చేయుచున్నా రని యర్థము. ఆత్మవిదులకు స్వార్థము యోగక్షేమము నుద్దేశించి యత్నము లేమిని స్పష్టీకరించుచున్నారు వారు ఇత్యాదిగా. జ్ఞానుల కప్పుడు అంతలను ఆస్థ లే దని యాశంకించి చెప్పుచున్నారు కేవలమే ఇత్యాదిగా. వారు భగవదేకశరణు లగుటచే ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. అని అనుశబ్దమునకు ఇది విశేషము అనుదానితో సంబంధము.

హ. అనన్యాః=లేఁడు నాకన్నను ఈశ్వరునికన్నను ఇతరుఁడు ఉపాస్యుఁడు ఎవ్వరికో వా రనన్యులు, అట్టివారై; చిన్తయన్తః; మామ్—యేజనాః; పర్యుపాసతే. తేషామ్; నాయందు ఈశ్వరునియందు, నిత్యాభియుక్తానామ్; యోగక్షేమమ్=యోగమును క్షేమమును; అహమ్; వహామి=భరించుచున్నాను.

శం. ఇ ట్లీశ్వరుఁడు లేఁ డని వాదించుచుఁ గర్మైకశరణులై బాహ్యజ్ఞాననిష్ఠులగు కాములగతిని బ్రతిపాదించి యిప్పుడు నిర్ద్వంద్వులును నిత్యసత్త్వస్థులును నిర్యోగక్షేములును ఆత్మవంతులును నిష్కాములును నిరహంకారమమకారులును మదేకశరణులు నగు బ్రహ్మవిదులకు యోగక్షేమమును నేనే వహించుచున్నా నని చెప్పుచున్నాఁడు.—అనన్యాః = లేదు అన్యము—మద్వ్యతిరిక్త మయినవిషయము అహంబుద్ధికిని ఇదంబుద్ధికిని ఎవ్వరికో వారు అనన్యులు, సదా అద్వైతదర్శననిష్ఠులై; యే జనాః=ఏయతులు; మామ్=నన్ను, నిర్విశేషుని నిత్యానందైకరసుని పరబ్రహ్మమునే; చిన్తయన్తః=వెలుపలను లోపలను విషయముల గ్రహింపనియట్టి యేకవృత్తిచే నిదియంతయు నేనును బ్రహ్మమే యని భావించుచు; పర్యుపాసతే=తన్నును సర్వంబును బ్రహ్మమునుగానే సర్వదా చూచుచున్నారో. తేషామ్=అట్టి; నిత్యాభియుక్తానామ్=

నిత్యము—నిరంతరము అవిచ్ఛిన్న మగు అభియోగము—ఆభిముఖ్యంబున బుద్ధివృత్తికి సాక్షాత్కారలక్షణ మయిన వస్తుసంయోగము, అది గలవారు నిత్యాభియుక్తులు, నిరంతరము సమాహిత మయినచిత్తము గలవారు, అట్టివారికి బ్రహ్మవిదులకు; యోగక్షేమమ్ = అప్రాప్త మయి యపేక్షిత మగువస్తువుయొక్క ప్రాప్తి యోగము, ఉన్నదాని రక్షణము క్షేమము, ఆరెంటిని; అహం వహామి=నేనే వహించుచున్నాను. లేక. యోగక్షేమమ్=యోగ మనఁగా నిరంతరబ్రహ్మనిష్ఠ, దానియొక్క క్షేమమును—ఆధ్యాత్మికాద్యుపద్రవములచే విచ్ఛేదము లేకుండుటను; దాని నేను సదా చేయుచుందు నని యర్థము.

మ. ఇఁక నిష్కాము లగు సమ్యగ్దర్శులు —అనన్యాః—భేదదృష్టికి విషయము లేదు ఎవ్వరికో వారు అనన్యులు, సర్వాద్వైతదర్శులు సర్వభోగనిస్పృహులు; నేనే భగవంతుఁ డగువాసుదేవుఁడను సర్వాత్ముఁడను మద్వ్యతిరిక్త మేదియు లేదని యెఱింగి యాప్రత్యగాత్మనే సదా, చిన్తయన్తః; మామ్=నన్ను నారాయణుని; ఆత్మనుగా *, యేజనాః = సాధనచతుష్టయసంపన్ను లగు సన్న్యాసులు; పర్యుపాసతే= పరి—అంతటను అనవచ్ఛిన్నముగా చూచుచున్నారో; వారు నాకంటె అనన్యు లగుటచేఁ గృతకృత్యులే యని శేషము. అద్వైతదర్శననిష్ఠులును అత్యంతనిష్కాములును తాము యత్నింపనివారు నగువారికి యోగక్షేమము లెట్లు సిద్ధించును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తేషామ్; నిత్యాభియుక్తానామ్ = నిత్యమును—ఎల్లప్పుడును ఆదరంబున ధ్యానమునందు వ్యాపృతులై దేహయాత్రకొఱకుఁ గూడ యత్నము చేయనివారికి; యోగమును—అలబ్ధముయొక్క లాభమును, క్షేమమును—తద్రక్షణమును, శరీరస్థితికొఱకు యోగక్షేమమును వారు కామింపకున్నను, అహమ్ = నేను సర్వేశ్వరుఁడు; వహామి=కలిగించుచున్నాను. “ప్రియో హి జ్ఞానినో౽త్యర్థ మహం స చ మమ ప్రియః। ఉదారాః సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్” అని గదా చెప్పితిని. అందఱకును యోగక్షేమమును భగవంతుఁడే వహించుచున్నాఁడు సత్యమే, అయినను ఇతరులకుఁ బ్రయత్నమును బుట్టించి తద్ద్వారంబున వహించుచున్నాఁడు, జ్ఞానులకో తదర్థము ప్రయత్నమును బుట్టింపక వహించుచున్నాఁ డని విశేషము.

శ్రీ. నాభక్తులో నాప్రసాదంబునఁ గృతార్థు లగుచున్నా రని చెప్పుచున్నాఁడు.—అనన్యాః = నేను దక్క నితర మయినకామ్యము ఎవ్వరికి లేదో అట్టి

* తన్నుఁగా.

వార లగు; యేజనాః; మామ్; చిన్తయన్తః; పర్యుపాసతే = సేవించుచున్నారో. తేషామ్; నిత్యాభియుక్తానామ్=సర్వదా మదేకనిష్ఠు లగువారికి, యోగమును–ధనాది లాభమును, క్షేమమ్ = తత్పాలనంబును మోక్షమును, వారు ప్రార్థింపకున్నను, నేనే, వహామి=పొందించుచున్నాను.

ప. ఇట్లు క్షుద్రదేవతోపాసకులకుఁ బ్రయాసము వ్యర్థమని ప్రతిపాదించి తన్నుపాసించువారలకు సుఖోపాయప్రాప్తిని బ్రదర్శించుచున్నాఁడు.—లేఁడు నాకంటె నితరుఁడు దేవత యెవ్వరికో వారు అనన్యులు, అట్టివారలై; యేజనాః; చిన్తయన్తః=కేవలము స్మరించుచు, కాని ద్రవ్యవ్యయమును కాయక్లేశమును చేయని వారలై; మామ్=పర్యుపాసతే. తేషామ్; నిత్యాభియుక్తానామ్=నిరంతరము అభితః—అంతటను మద్యోగనిష్ఠు లయినవారికి; అహమ్; యోగక్షేమమ్; వహామి—అప్రాప్త వస్తుప్రాప్తి యోగము, ప్రాప్తమయినదానిని నిర్విఘ్నముగా రక్షించుట క్షేమము, ఆరెంటిని నిర్వహించుచున్నాను.

రా. మహాత్ములలో నిరతిశయప్రియరూపుఁడ నగు నన్ను ధ్యానించి యనవధికానందరూపుఁడ నగు నన్నుఁ బొంది పునరావృత్తిరహితులై యుందు రని వారలకు విశేషముఁ బ్రదర్శించుచున్నాఁడు.—అనన్యాః = ఇతరప్రయోజనము లేనివారలై, నన్ను ధ్యానించుటచేతనే గాని యాత్మధారణము లభింపమిచేఁన మద్ధ్యానమే ప్రయోజనముగాఁ గలవారలై, మామ్; చిన్తయన్తః; యేజనాః = ఏమహాత్ములు; పర్యుపాసతే=సర్వకల్యాణగుణాన్వితుఁడను సర్వవిభూతియుక్తుఁడ నగు నన్ను, పరితః= అన్యూనముగా ♦ ఉపాసించుచున్నారో. తేషామ్; నిత్యాభియుక్తానామ్=నాయందు నిత్యాభియోగమును గోరుచున్న వారలకు; అహమ్=నేను; యోగక్షేమమ్=మత్ప్రాప్తి రూప మయిన యోగమును అపునరావృత్తిరూప మయిన క్షేమమును; వహామి.

మా. అనన్యాః = ఇతరమును జింతింపనివారలై. అట్లు గౌతమఖిలములయందు.—“ సర్వం పరిత్యజ్య మనోగతం య ద్వినా దేవం కేవలం శుద్ధ మాద్యమ్ । యే చిన్తయన్తీహ తమేవ ధీరా అనన్యాస్తే దేవమేవావిశన్తి ” * అని. “ కామం కామేన మహతా ఏ కా నిత్యాత్సమాహితైః । శక్యో ద్రష్టుం స భగవాన్ ప్రభా

♦ సంపూర్ణముగా.

* కేవలుండును శుద్ధుఁడును ఆద్యుఁడు నగుదేవుఁడు దక్క నితర మేది గలదో దాని సమస్తమును విడిచి యెవ్వరు ధీరులు ఈలోకమున నద్దేవునే చింతించుచున్నారో వారు అనన్యులు ఆదేవునే పొందుచున్నారు.

సంద్రశ్య మహాత్మభిః ॥ ♦♦ అని మోక్షధర్మమునందు. నిత్యాభియుక్తానామ్=నిత్యమును అభితః—అంతటను యుక్తు లయినవారికి.

యే ఽప్యన్యదేవతాభక్తా యజన్తే శ్రద్ధయాఽన్వితాః
తే ఽపి మామేవ కౌన్తేయ యజన్త్యవిధిపూర్వకమ్. ౨౩

**భా.** ఓయీ! ఇతరదేవతలుగూడ నీవే యగునెడ వారిభక్తులును నిన్నే యజించుచున్నారు. సత్యమిది.—యేఽపి = ఎవ్వరు; అన్యదేవతాభక్తాః=ఇతరదేవతలయందు భక్తులై; శ్రద్ధయా = ఆస్తిక్యబుద్ధితో; అన్వితాః కూడినవారై; యజన్తే=పూజించుచున్నారో. తేఽపి = వారుకూడ; మామేవ= నన్నే; కౌన్తేయ= అర్జునా! యజన్తి = పూజించుచున్నారు; అవిధిపూర్వకమ్=అవిధి యనఁగా అజ్ఞానము, అజ్ఞానపూర్వకముగా.

అర్జునా! ఎవ్వరు మఱి యితరదేవతలను శ్రద్ధతో నారాధించుచున్నారో వారును నన్నే యారాధించుచున్నారు. కాని నన్నని తెలియక యారాధించుచున్నా రని తాత్పర్యము.

**ఆ.** తత్తద్దేవతారూపంబునఁ బరమాత్మయే యున్నవాఁడని నిశ్చయించుటవలన దేవతాంతరపరులకుఁ గూడ భగవద్భక్తత్వము సమానం బగుటవలనఁ దదేకనిష్ఠతయందు విశేషము లేదని తలంచి శంకించుచున్నాఁడు. ఓయీ ఇత్యాదిగా. చెప్పినదాని నంగీకరించి పరిహరించుచున్నారు సత్యము ఇత్యాదిగా. దేవతాంతరయాజులకు భగవద్యాజులకన్న విశేషము చెప్పుచున్నారు అవిధిపూర్వకమ్ అని. దాని వివరించుచున్నారు అవిధి యనఁగా నిత్యాదిగా.

**హ.** యే = ఏపురుషులు; అన్యదేవతాభక్తాః = ఇతరదేవతయందు భక్తులై; యజన్తే. తేఽపి=వారుగూడ; మామేవ=నన్ను, పరమేశ్వరునే; యజన్తి=పూజించుచున్నారు; అవిధిపూర్వకమ్—అజ్ఞానపూర్వకముగా నని యర్థము.

**శం.** ఓయీ! "అహం క్రతు రహం యజ్ఞః" ఇత్యాదిగా క్రతుయజ్ఞమంత్రదేవతాదికము సమస్తమును నేనే యని నీసర్వాత్మభావమును నీవే ప్రతిపాదించితివి. కామకాములుగూడ నింద్రాది దేవతారూపుని నిన్నే క్రతువులచే నుపాసించు

♦♦ దీర్ఘకాలమునకు ఏకాంతు లగుటవలన సమాహితు లగువారికి ప్రభచేత—కాంతిచేత చక్కఁగా దృశ్యమైనమండలము గల యాభగవంతుఁడు పర్శింప శక్య మయినను గావచ్చును.

చున్నారు. కావున వారును నీభక్తులై యుండఁగా వారికిమాత్ర మెట్లు ముఖ్యఫలము లేకపోవును? అనర్థప్రాప్తియు నెట్లు సంభవించును? అందు వేని, చెప్పెదను. «సర్వం హ్యేతద్బ్రహ్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ, ఇన్ద్రం మిత్రమ్, ఏకం స ద్విప్రా బహుధా వదన్తి» ఇత్యాది శ్రుతులచేతను, «భూతానివిష్ణుః» ఇత్యాదిస్మృతుల చేతను సర్వమును బ్రహ్మమే యని ప్రతిపాదింపఁబడుచున్నది. అహం క్రతు రిత్యాదిగా నేనే సర్వాత్ముఁడ నని నేనును జెప్పితిని. సర్వదేవాత్మకుఁడనే నేను. సత్యము. వారుగూడ నన్నే క్రతువులచే నుపాసించుచున్నారు. అట్లయినను శ్రుతియందును శ్రుత్యర్థమునందును విశ్వాసము నుంపక యవిద్యా ఒస్మితాది దోషముచే సర్వమును బ్రహ్మమే యని నన్నెఱుఁగనివారలై తమదేవతలయందును మంత్రాదులయందును భేదబుద్ధిని విడువక నన్నుపాసించుచున్నారు. అందువలన వారు నాభక్తులు కారు. మ ఱే మనఁగా దేవయజులే యగుదురు. కావుననే వారలకు ముఖ్యఫలము లేక పోవుటయు ననర్థప్రాప్తియు నని సింహావలోకనన్యాయమునఁ దత్పూర్వశ్లోకార్థ మనుసరించి ప్రతిపాదించుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—యే ఒపి=ఎవ్వరు, ఐహికాముష్మికఫలముఁ గోరువారు బ్రాహ్మణాదులు; తమయిష్టదేవతలయందును తదారాధనములయందును, శ్రద్ధయా=ఇతఁడే పరదేవత ఇతని నారాధించుటచే నేను కృతార్థుఁడ నగుదును అను నాస్తిక్యబుద్ధితో; అన్వితాః = కూడినవారలై; అన్యదేవతాభక్తాః=తాను అన్యుఁడు, ఇతఁడు నాదేవత, ఇతని నారాధించువాఁడను నేను, అని తమకంటె భిన్నులనుగా గ్రహించిన యింద్రాదిదేవతలకే భక్తులై; తదారాధనమునందు భక్తియుక్తులై; యజన్తే—వైదికమంత్రములచేతనే యుపాసించుచున్నారో యని యర్థము. తేఽపి=వారు గూడ; ఇంద్రాదిదేవతాయాజకు లైనను, మామేవ=ఇంద్రాదిదేవతారూపుఁడ నగు నన్నే; యజించుచున్నారు—బ్రహ్మము సర్వాత్మకం బగుటవలన నింద్రాదిదేవతారూపంబున నేనే వారిచే నారాధింపఁబడుచున్నాను. అయినను వారు నన్ను, అవిధిపూర్వకం యజన్తి=ఏది విధియును విధ్యర్థజ్ఞానమును లేదో అది యవిధి—అజ్ఞానము, తత్పూర్వకముగా నారాధించుచున్నారు. అహం క్రతు రిత్యాదిగాఁ జెప్పినవిధంబున, ఇజ్యుఁడును యాజకుఁడును యజనంబును యాగంబును సర్వమును బ్రహ్మమే యనుజ్ఞానము లేనివారలై నన్నారాధించుచున్నా రని యర్థము.

**మ.** ఓయీ! ఇతరదేవతలును నీవే గదా! నీకంటె వ్యతిరిక్త మయిన యితరవస్తువు లేమివలన. అందుచే, దేవతాంతరభక్తులును నిన్నే భజించుచున్నారు,

కావున విశేషమేమియు లేక యుండవలయును. అట్లుండఁగా, "కామకాము లగు వసురుద్రాదిత్యాదిభక్తులు గతాగతముఁ బొందుచున్నారు, అనన్యులై నన్నుఁ జింతించువారు మాత్రము కృతకృత్యులు" అని యెట్లు చెప్పితివి? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—ఎట్లు నాభక్తులు నన్నే యజించుచున్నారో అట్లు, యే=ఎవ్వరు; అన్యదేవతాభక్తాః=ఇతరు లగు వస్వాదిదేవతలకు భక్తులై; శ్రద్ధయా=ఆస్తిక్యబుద్ధితోఁ; అన్వితాః; యజన్తే తే౽పి=వారు గూడ; నాభక్తులవలె; కౌన్తేయ = అర్జునా! ఆయా దేవతలరూపంబున నున్నట్టి, మామేవ=నన్నే; యజన్తి = పూజించుచున్నారు; అవిధిపూర్వకమ్=అవిధి యనఁగా అజ్ఞానము, తత్పూర్వకముగా. సర్వాత్ముఁడ నని నన్నెఱుఁగక నాకంటె భిన్నులనుగా వస్వాదిదేవతలను కల్పించి పూజించుచున్నా రని యర్థము.

శ్రీ. ఓయీ! వాస్తవంబున నీకంటె వ్యతిరిక్త మయిన దేవతాంతరము లేకుండుటవలన నింద్రాదుల సేవించువారు గూడ నీభక్తులే కావున నెట్లు వారు గతాగతముఁ బొందుదురు? అందుకుఁ జెప్పుచున్నాఁడు.—శ్రద్ధయా అన్వితాః=శ్రద్ధతోఁ గూడినవారై; భక్తాః=భక్తులై; యే౽పి = ఏజనులు; యజ్ఞముచే, అన్యదేవతాః= ఇంద్రాదిరూపు లగు నితరదేవతలను; యజన్తే. తే౽పి = వారు గూడ; మామేవ యజన్తి = నన్నే యజించుచున్నా రనుట సత్యము. మఱే మనఁగా, అవిధిపూర్వకమ్=మోక్షప్రాపక మయిన విధి లేక, యజించుచున్నారు. కావున వారు పునరావృత్తి నొందుచున్నారు.

ప. ఓయీ! పూర్వము చెప్పితివి—నన్ను యజించి స్వర్గతిని బ్రార్థించుచున్నా రని. అప్పుడు నిన్నుఁ బూజించుటవలన స్వర్గము నొందినవారు వెండియు నెట్లు స్వర్గమునుండి చ్యుతు లగుదురు? అని యాశంకించి చెప్పుచున్నారు, రెండు శ్లోకములచేత.—అన్యదేవతాభక్తాః=ఇంద్రాదిదేవతోపాసకులు; యే౽పి = ఎవ్వరు; శ్రద్ధతోఁ గూడినవారలై; యజన్తే; తే౽పి=వారు గూడ; ఆదేవతల కంతర్యామినై యున్న నన్నే, యజన్తి; కాని, అవిధిపూర్వకమ్=మోక్షప్రాపక మయినయుపాసనము విధి, అది కానిది యవిధి, తత్పూర్వకముగా, యజించుచున్నారు.

రా. ఎవ్వరు ఇంద్రాదిదేవతాభక్తులు కేవలత్రయీనిష్ఠులు శ్రద్ధాయుక్తులై యింద్రాదులను యజించుచున్నారో, వారు గూడఁ బూర్వోక్తన్యాయంబున సర్వంబును మచ్ఛరీరంబై మదాత్మకం బగుటచే నింద్రాదిశబ్ద[illegible]లును మద్వాచకంబు

లగుటవలన వాస్తవంబున నన్నే యజించుచున్నారు. కాని, అవిధిపూర్వకముగా యజించుచున్నారు. ఇంద్రాదిదేవతలకుఁ గర్మములయందు ఆరాధనంబున కన్వయంబును ఎట్లు వేదాంతవాక్యములు "చతుర్హోతారో యత్ర సంపదం గచ్ఛన్తి దేవైః" ఇత్యాదులు విధించుచున్నవో తత్పూర్వకముగా యజింపరు. వేదాంతవాక్యములు పరమపురుషునకు శరీరముగా నున్న యింద్రాదిదేవతల కారాధ్యత్వమును విధించుచు ఆత్మభూతుఁడగు పరమపురుషునకే గదా సాక్షాదారాధ్యత్వమును విధించుచున్నవి. చతుర్హోతారః=అగ్నిహోత్రదర్శపూర్ణమాసాదికర్మములు, యత్ర—ఏపరమాత్మ ఆత్మగా నున్నచో, తచ్ఛరీరభూతు లగు, దేవైః = ఇంద్రాదిదేవతలచేత, సంపదం గచ్ఛన్తి—ఇంద్రాదిదేవతల కారాధనంబు లీకర్మము లను నీసంపదను—అతిశయమును బొందుచున్నవో యని యర్థము.

మూ. అప్పుడు, "అహం క్రతుః" ఇత్యాదిక మసత్యము. అనఁగాఁ జెప్పుచున్నాఁడు రెం ౨౪ శ్లోకాదిగా.

> అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ
> నతు మా మభిజానన్తి తత్త్వే నాతశ్చ్యవన్తి తే. ౨౪

భా. ఎందువలన వా రవిధిపూర్వకముగా యజించెదరు ? చెప్పెదను. ఎందువలన ననఁగా.—అహం హి=నేను గదా ! సర్వయజ్ఞానామ్=శ్రౌతములకును స్మార్తములకును అన్నియజ్ఞములకును; దేవతారూపుఁడ నగుటచే, భోక్తాచ=భుజించువాఁడను. ప్రభు రేవచ=ప్రభువను గూడ. నేను గదా యజ్ఞమునకు స్వామిని. అధియజ్ఞో ౨హ మేవాత్ర అని చెప్పితిని గదా ! అట్లుండఁగా; మామ్=నన్ను; తత్త్వేన=యథావస్థితముగా; నతు అభిజానన్తి=ఎఱుంగనే యెఱుంగరు. అతః = ఇందువలన; అవిధిపూర్వకముగా యజించి యాగఫలమునుండి, తే=వారు; చ్యవన్తి=భ్రష్టు లగుచున్నారు.

సర్వయజ్ఞములకును భోక్తను ప్రభువను నేనే గదా. అట్లు నేనే యజ్ఞములకు భోక్తను ప్రభువ నని వారు తత్త్వము నెఱుంగరు. కావున అవిధిపూర్వకముగా యజించుటచే వారికిఁ గర్మఫలము సమగ్రముగా సిద్ధింప దని తాత్పర్యము.

ఆ. ఓయీ ! వస్వాదిత్యేంద్రాదిజ్ఞానపూర్వకముగానే తద్భక్తులు వారిని యజించుచున్నారు కావున వా రవిధిపూర్వకముగా యజించుచున్నా రని యెట్లు

చెప్పవచ్చును ? అని శంకించుచున్నాఁడు ఎందువలన నిత్యాదిగా. దేవతాంతర యాజులయజనం బవిధిపూర్వకం బనుటకు హేతువును దెలుపుటకై శ్లోకము నెత్తుచున్నారు చెప్పెదనుఅని. ద్వివిధము లగు సర్వయజ్ఞములకును వస్వాదిదేవతారూపంబున నేనే భోక్తను, నాదైన యంతర్యామిరూపంబునఁ బ్రభువును నేనేయని ప్రసిద్ధం బిదియని హి శబ్దము సూచించుచున్నది. ప్రభురేవచ అని చెప్పినదాని వివరించుచున్నాఁడు నేను గదా ఇత్యాదిగా. అందుఁ బూర్వాధ్యాయగతవాక్యమును బ్రమాణీకరించుచున్నారు అధియజ్ఞః ఇత్యాదిగా. అట్లయినను దేవతాంతరయాజుల యజన మవిధిపూర్వక మని యెట్లు సిద్ధించును ? అనఁగాఁ జెప్పుచున్నారు అట్లుండఁగా ననిమ్న నేనే యజ్ఞములందు భోక్తను బ్రభువనై యుండఁగా నని యర్థము. ఆభోక్తృప్రభుత్వులభావము తత్త్వము, నేను భోక్త ననియుఁ బ్రభువ ననియు నన్ను యథార్థముగా నెఱుంగరు అందువలన—భోక్త్రాదిభావంబున స న్నెఱుంగమివలన నాయందుఁ గర్మము నర్పింపనివారై వారు కర్మఫలమునుండి చ్యుతు లగుచున్నా రని చెప్పుచున్నాను ఇందువలన నిత్యాదిగా.

ప. అహమ్ = నేను వాసుదేవుఁడను; సర్వయజ్ఞానామ్; భోక్తాచ; ప్రభురేవచ=స్వామినిగూడ. నతుమా మభిజానన్తి; తత్త్వేన=పరమార్థముగా. అతః = ఈ కారణమువలన; తే=ఆయజ్వులు; చ్యవన్తి = కర్మఫలమునుండి భ్రష్టు లగుచున్నారు.

తా. ఓయీ ! శుంఠలు మువ్వురు వైష్ణవులును « అగ్నేః ప్రభృతం శ్రష్ఠోస్తణ్డులాః యజ్ఞో వై విష్ణుః » అని నన్ను యజ్ఞములందు భోక్తనుగాను నేతనుగాను నెఱింగియె యజించుచున్నారు. ఎట్లజ్ఞానపూర్వకముగా యజించెద రని చెప్పవచ్చును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—హిశబ్దము ఉదాహృతశ్రుతి ప్రసిద్ధిని సూచించుచున్నది. వాస్తవమే, సర్వయజ్ఞానామ్=శ్రౌతములు స్మార్తము లగుసమస్త యజ్ఞములకును; ఇంద్రాదిదేవతారూపంబున నేనే, భోక్తాచ, ప్రభురేవచ=నియామకుఁడనుగూడ; అగుచున్నాను; అట్లే వారును భోక్తనుగాను బ్రభువునుగాను నన్నెఱుంగుచున్నారు, అట్లయినను, తత్త్వేన నతు అభిజానన్తి = « బ్రహ్మార్పణం బ్రహ్మహవిః, సర్వం ఖల్విదం బ్రహ్మ » ఇత్యాదిశ్రుతులచేతను నాచేతను జెప్పఁబడిన ప్రకారంబున, యజ్ఞమును యజ్ఞభోక్తయు యజ్ఞనేతయు యజమానుఁడును యాజకులును జుహుపురోడాశాదికమును—ఇది సమస్తంబును బ్రహ్మమే, దానికంటె నితరమేదియు లేదని తత్త్వమున—యాథాత్మ్యంబున పరమార్థస్వరూపంబున, మామ్—నన్ను బ్రహ్మ

మును, ఎఱుంగరు. అతః=నాతత్త్వము నెఱుంగమివలననే; తే=ఆదేవతాంతరయాజులు; చ్యవన్తి=పరమపురుషార్థమునుండి భ్రష్టు లగుచున్నారు, ఎప్పుడును ముక్తిని బొంద రని యర్థము.

మ. అవిధిపూర్వకత్వమును వివరించుచు వారికి ఫలభ్రంశమును జెప్పుచున్నారు.—అహమ్=నేను భగవంతుఁడను వాసుదేవుఁడనే; సర్వయజ్ఞానామ్=సమస్తము లయిన శ్రౌతస్మార్త యజ్ఞములకు; తత్తద్దేవతారూపంబున భోక్తయును, నాదైన యంతర్యామిరూపంబున అధియజ్ఞుఁడ నగుటవలన, ప్రభుశ్చ=ఫలదాతయును, అని ప్రసిద్ధం బిది. దేవతాంతరయాజులో, మామ్=నన్ను ఇట్టివానిని; తత్త్వేన=భోక్తృత్వమునను ప్రభుత్వమునను; భగవంతుఁడు వాసుదేవుఁడే వస్వాదిరూపంబున యజ్ఞంబులకు భోక్త, నిజరూపంబున ఫలదాతయు, వానికంటె నితరుఁ డెవ్వఁడు నారాధ్యుఁడు లేఁ డని యీవిధంబున ఎఱుంగరు, కావున నాస్వరూపము నెఱుంగమివలన మహాప్రయాసంబున యజ్ఞములుచేసియు నాయందుఁ గర్మముల నర్పింపక తత్తద్దేవలోకము ధూమాదిమార్గమునఁ బొంది తద్భోగాంతమున, చ్యవన్తి=భ్రష్టు లగుచున్నారు, తద్భోగజనక మయినకర్మము క్షయింపఁగాఁ దద్దేహాదులు వీడి వెండియు దేహగ్రహణము కొఱకు మనుష్యలోకమునకు వచ్చుచున్నారు. ఎవ్వరు మఱి తత్తద్దేవతల యందు భగవంతునే సర్వాంతర్యామిని జూచుచు యజించుచున్నారో, వారు భగవంతునందుఁ గర్మంబు లర్పించినవారై తద్విద్యాసహితకర్మవశమువలన నర్చిరాది మార్గమున బ్రహ్మలోకము నొంది యట సమ్యగ్దర్శనముఁ జెందినవారై తద్భోగాంతమున ముక్తు లగుదు రని వివేకము.

శ్రీ. దీనినే వివరించుచున్నాఁడు.—సర్వయజ్ఞములకును తత్తద్దేవతారూపంబున నేనే భోక్తను, ప్రభుశ్చ=స్వామిని, ఫలదాత గూడ నేనే యని యర్థము. ఇట్టివానిని నన్ను, వారు, తత్త్వేన=యథార్థముగా; నాభిజానన్తి. అతః=ఇందువలన; చ్యవన్తి= పునరావృత్తి బొందుచున్నారు. ఎవ్వరు మఱి సర్వదేవతలందును నన్నే యంతర్యామినిగాఁ జూచుచు యజించుచున్నారో, వారు మాత్రము పునరావృత్తిఁ బొందరు.

ప. దీనినే వివరించి చెప్పుచున్నాఁడు.—హి=ఏకారణమువలన; నేనే సర్వయజ్ఞములకును భోక్తయును, ప్రభుః = ఫలదాతయును. ఇట్లుండఁగా నన్ను, తత్త్వేన=యాథాతథ్యంబున; నాభిజానన్తి = ఎఱుంగరో. అందువలన, తే చ్యవన్తి=

వారు వెండియు మర్త్యలోకముఁ బ్రవేశించుచున్నారు. ఇది యభిప్రాయము.—దేవర్షి పితృప్రభృతులు నశ్వరము లయిన నామరూపములు గలవారు దేహవిశేషములు నా యుపాధులు ఆయాలోకంబున వసించుచున్నారు. అచ్చటచ్చట నందఱకు నంత ర్యామిని నేనే యున్నాను. ఇట్టి నన్నెఱుంగక భేదభావంబున నాయాయుపాధుల నుద్దేశించి యేయజనము చేయఁబడునో దానిచే నేనే సంతర్పితుఁడ నగుదును. అంత మత్సంతర్పణశేషంబున వారును సంతర్పితు లగుదురు. అట్లు నన్ను అద్వయానందుని అఖండైకరసుని నుద్దేశించి యేయుపాసనము చేయఁబడునో అదియే విధి, మూఢుల యుపాధ్యుపాసన మేది గలదో అదియే యవిధి, తత్పూర్వక మగుయజనము నశ్వర ఫలం బగును. ఇట శాతపథశ్రుతియును.—« అథ యో ఽన్యాం దేవతా ముపాస్తే అన్యో ఽసా వన్యో ఽహ మస్మీతి న సవేద యథా పశు రేవమ్ " * అని. అర్థము స్పష్టము. మఱియును. « అథో అయం వా ఽఽత్మా సర్వేషాం భూతానాం లోకః స య జ్జుహోతి య ద్యజతే తేన దేవానాం లోకః అథ య దనుబ్రూతే తేన ఋషీణా మథ యత్ప్రజా మిచ్ఛతే య త్పితృభ్యో నిపృణాతి తేన పితౄణా మథ య న్మనుష్యా న్వాసయతే య దేభ్యో ఽశనం దదాతి తేన మనుష్యాణా మథ యత్ప శుభ్య స్తృణోదకం విన్దతి తేన పశూనాం య దస్య గృహేషు శ్వాపదా వయాం స్యా పిపీలికాభ్య ఉపజీవన్తి తేన తేషాం లోకః యథాహ వై స్వాయలోకాయా ఽరిష్టి మిచ్ఛే దేవం హైవం విదే సర్వాణి భూతా న్యరిష్టి మిచ్ఛన్తి తద్వా ఏత ద్విదితం మీమాంసితమ్ " అని. భాష్యము.—అథో=అనంతరము, వా—ప్రకా రాంతరమునఁ జెప్పఁబడుచున్నది. అది యేది యనఁగా. అయ మాత్మా=ఈయాత్మ, సర్వేషాం భూతానామ్=సర్వప్రాణులకును, లోకః=సంతర్పణస్థానము. సః=అతఁడు, యత్ జుహోతి=మంత్రపూర్వకముగా హవిస్సు నగ్నియందు వేల్చుచున్నాఁ డను నది యేది గలదో, అట్లు, యత్ యజతే=యజ్ఞము సేయుచున్నాఁ డనునది యేది గలదో శ్రౌతస్మార్తప్రకారంబున, తేన=దానిచేత; దేవానామ్=ఇంద్రసూర్యాదులకు, లోకః—సంతర్పణస్థానము. అథ=ఇఁక, యత్ అనుబ్రూతే=స్వాధ్యాయము నధ్యయ నించుచున్నాఁ డనునది యేది గలదో, తేన ఋషీణామ్—దానిచే ఋషులకు సంతర్పణ స్థానము. అథయత్ ప్రజా మిచ్ఛతే=ఇఁకఁ బితరులఋణమును దీర్చునట్టి సంతతిని గోరు చున్నాఁ డనునది యేది గలదో, మఱియు, పితృభ్యః=పితృదేవతలకొఱకు, యత్ నిపృ

* ఇఁక నెవ్వఁ డన్యదేవత నుపాసించుచున్నాఁడో, అన్యుఁ డతఁడు—దేవత, అన్యుఁ డను నే నని. అతఁ డెఱుంగఁడు. పశువువంటివాఁ డతఁడు.

దాతి=శ్రాద్ధమునం దిచ్చుచున్నాఁ డనునది యేది గలదో, తేన పితౄణామ్=దానిచేఁ బితరులకు సంతర్పణస్థానము. యత్ మనుష్యాన్ వాసయతే=మనుష్యులకు వాస మిచ్చుచున్నాఁ డనునది యేది గలదో, యత్ ఏభ్యః అశనం దదాతి=ఈమనుష్యుల కన్నము నిచ్చుచున్నాఁ డనునది యేది గలదో, తేన మనుష్యాణామ్=దానిచే మనుష్యులకు సంతర్పణస్థానము. అథ యత్ పశుభ్యః తృణోదకం విన్దతి=ఇఁక గేదెలు ఎద్దులు మొదలగుపశువులకొఱకు గడ్డిని ఉదకమును ఇచ్చుచున్నాఁ డనునది యేదిగలదో, తేన పశూనామ్=దానిచేఁ బశువులకు లోకము. అస్య గృహేషు = వీనియింటియందు, శ్వాపదాః=కుక్కలు పిల్లులు మొదలగునవి, వయాంసి=కాకకలవింకాదు లగుపక్షులు, ఆపిపీలికాభ్యః=చీమలవఱకుఁ గలపురుగులు, యత్ ఉపజీవన్తి=ఆశ్రయించి జీవించుచున్నవి యనునది యేది గలదో, తేన తేషాం లోకః= అందుచే వానికి లోకము. యథాహవై—నిశ్చయమున, ఏవమ్=ఇట్లు, స్వాయలోకాయ = పరమాత్మకొఱకు, అరిష్టిమ్=కుశలమును, ఇచ్ఛతి = కోరుచున్నాఁడు. కావున, ఏవం విదే సర్వాణి భూతానిఅరిష్టి మిచ్ఛన్తి=ఇట్లెఱింగినవానికి సర్వభూతంబులును కుశలమును గోరుచున్నవి. తత్ వై ఏతత్=అట్టి యిదియే, విదితమ్=జ్ఞాత మని చెప్పఁబడు. మీమాంసితమ్=విచారిత మనియు. ఇతరము అజ్ఞాతము అవిచారిత మని యర్థము. అది చెప్పఁబడినది టిప్పణికలయందు.—“ఇట్లెఱింగినవానిచే దేవర్షిపితృమనుష్యప్రభృతులకు ఏది యియ్యఁబడినదో అది సత్యాత్మార్పణ మగుటవలన అమృతప్రదం బని చెప్పుచున్నారు. ఇట్లెఱుంగనివానిచే దేవతలకుఁ దత్పదముఁ బొందుటకొఱకు ఏది యియ్యఁబడినదో అది యసత్యసంతర్పణ మగుటవలన గతాగతపరిశ్రమప్రద మని చెప్పుచున్నారు. అట్లు. ఒక్కనటవర్యుఁడె వేఱువేఱభిలాషలు అను సామాజికులయందు నానావిధము లయిన హావభావములఁ జూపుచు అనేకస్వరూపములచే నటించుచున్నాఁడు. అందు ఒకానొకనికిమాత్రము అర్థము నిచ్చినచో అతఁడు మాత్రమె తర్పితుండై సంతుష్టుం డగును, సర్వాంతరాత్మ కర్పణము చేసినచో సర్వదేహములకును అర్పితం బగును.” అని. ఋగ్వేదమునందును.—“హిరణ్యగర్భస్సమవర్తతాగ్రే భూతస్యజాతః పతిరేక ఆసీత్ । స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ ॥” అని. భాష్యము.—హిరణ్యగర్భ ఇత్యాది సూక్తము పదిఋక్కులు గలది, త్రైష్టుభము అని సర్వానుక్రమము. అందు మొదటిది హిరణ్యగర్భ ఇత్యాదికము. హిరణ్మయ మయిన యండము గర్భమువలె నెవ్వని యుదరమునం దున్నదో ఆసూత్రాత్ముఁడు హిరణ్యగర్భుఁడు, అగ్రే=ప్రపంచోత్పత్తికి

మున్ను; సమవర్తత = మాయాధ్యక్షుండై సృజింపఁ దలంచిన పరమాత్మవలనఁ బుట్టెను. వాస్తవమే పరమాత్మయే హిరణ్యగర్భుఁడు, అయినను తదుపాధిభూతంబు లగు వియదాదిసూక్ష్మభూతములు బ్రహ్మమువలన నుత్పన్నము లగుటవలన తదుపహితుఁ డుత్పన్నుఁ డని చెప్పఁబడుచున్నాఁడు. అతఁడు, జాతః=పుట్టినంతనే, ఏకః= అద్వితీయుఁడై, భూతస్య = బ్రహ్మాండాదివికారజాతమునకు సమస్తమునకును, పతిః= ఈశ్వరుఁడు, ఆసీత్ =అయ్యెను. ఈశ్వరుఁడు మాత్రమే కాదు, మఱి యేమనఁగా, సః=అతఁడు, పృథివీమ్=భూమిని, ఇమాం ద్యామ్ ఉత = ఈ యాకాశమును గూడ, దాధార = ధరించుచున్నాఁడు. ఇట్లుండఁగా. సర్వాత్మకుం డతని విడిచి, కస్మై దేవాయ=ఏ దేవతకొఱకు, హవిషా=హవిస్సుచేత, విధేమ=పరిచరింతుము ? సర్వంబును బ్రహ్మార్పణమే యగుచున్నది యని యర్థము.

రా. అందువలన, త్రైవిద్యులు "ఇంద్రాదిశరీరుం డగుపరమపురుషున కారాధనంబు లీకర్మములు ఆరాధ్యుఁ డప్పరమపురుషుఁడే" అని యెఱుంగరు. కావున వారు స్వల్పఫలము నొందువారును భ్రంశపాత్రులు నగుచున్నారు. అది చెప్పుచున్నాఁడు.—ప్రభురేవచ—ఆయాకర్మమునందు ఫలప్రదాతయు నేనే యని యర్థము.

మా. అవిధిపూర్వకం బగుటకుఁ గారణము చెప్పుచున్నాఁడు అహం హీత్యాదిగా.

యాన్తి దేవవ్రతా దేవాన్ పితౄన్యాన్తి పితృవ్రతాః
భూతాని యాన్తి భూతేజ్యా యాన్తి మద్యాజినోఽపి మామ్. ౨౫

భా. ఎవ్వ రన్యదేవతాభక్తులై యవిధిపూర్వకముగా యజించుచున్నారో వారలకును యాగఫలం బవశ్యము కలుగుచున్నది. ఎట్లు ?— దేవవ్రతాః=దేవతలయందు వ్రతము—నియమమును భక్తియును ఎవ్వరికిఁ గలదో వారు దేవవ్రతులు; దేవాన్ = దేవతలను, యాన్తి = పొందుచున్నారు. పితృవ్రతాః=శ్రాద్ధాదిక్రియాపరు లగుపితృభక్తులు, పితౄన్= పితృదేవతలను అగ్నిష్వాత్తాదులను; యాన్తి=పొందుచున్నారు. భూతేజ్యాః=భూతముల పూజించువారు; భూతాని=వినాయక మాతృగణ చతుర్భగిన్యాదులను; యాన్తి = పొందుచున్నారు. మద్యాజినోఽపి=నన్ను యజించుట స్వభావముగాఁ గలవారు వైష్ణవులును; మామ్ = నన్నే; యాన్తి=పొందుచున్నారు. ఆయాసము సమానం బైనను నన్నే భజిం

పరు, అజ్ఞానమువలన. దానిచే వారల్పఫలము నొందుచున్నారని యర్థము.

దేవతలఁ బూజించువా రాదేవతలఁ బొందుదురు, పితరులఁ బూజించువారు పితృదేవతలఁ బొందుదురు, భూతములఁ బూజించువారు భూతములఁ బొందుచున్నారు, నన్నుఁ బూజించువారు నన్నే పొందుచున్నారని తాత్పర్యము.

ఆ. అన్యదేవతాభక్తులు భగవత్తత్త్వము నెఱుంగమివలనఁ గర్మఫలము నుండి భ్రష్టులగుదురేని, అప్పుడు వారలకు దేవతాంతరారాధనము నిష్ఫలం బని యాశంకించి చెప్పుచున్నారు ఎవ్వరు ఇత్యాదిగా. దేవతాంతరయాజుల కనావృత్తి ఫలము లేకున్నను దత్తద్దేవతాయాగానురూప మయినఫల మవశ్యము సిద్ధించుట వలన నది నిష్ఫలము కాదని యర్థము. దేవతాంతరయాజుల కవశ్యము కలుగుఫలమును ఆశంకాపూర్వకముగా నుదాహరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. నియమము–బల్యుపహారప్రదక్షిణనమస్కారాదిక మని యర్థము. దేవతాంతరారాధనమున కంతవంత మగుఫలమును బ్రతిపాదించి భగవదారాధనమున కనంతఫలముఁ జెప్పుచున్నాఁడు మద్యాజినః ఇత్యాదిగా. భగవదారాధన మనంతఫలం బగునెడ దేవతాంతరారాధనము విడిచి భగవంతు నారాధించుటయే యుక్తము, ఆయాసము సమానం బగుటవలనను, ఫలం బధిక మగుటవలనను అని యాశంకించి చెప్పుచున్నారు ఆయాసము ఇత్యాదిగా. అజ్ఞానాధీను లగుటచే దేవతాంతరము నారాధించువారలకు ఫలము న్యూనం బనుటను బ్రదర్శించుచున్నారు దానిచే నిత్యాదిగా.

ప. దేవవ్రతాః = దేవతలయందు వ్రతము గలవారు; దేవాన్; యాన్తి. పితృవ్రతాః = పితరులయందు వ్రతము గలవారు; పితౄన్ = అగ్నిష్వాత్తాదులను బర్హిషదాదులను; యాన్తి. భూతేజ్యాః = భూతములయందు; ఇజ్యా = పూజ గలవారు; భూతాని = భద్రకాళీప్రభృతులను; యాన్తి. మద్యాజినో ఽపి = నన్నుఁ బరమేశ్వరుని యజించుట స్వభావముగాఁ గలవారును; మామ్; యాన్తి.

శం. అప్పుడు వారల కేమి గతి యని యాశంకింపఁగా ముఖ్యఫలము లేకున్నను దత్తద్దేవతోపాసనానురూప మగుఫలము కల దని చెప్పుచున్నాఁడు.— దేవవ్రతాః = దేవతలయందు–ఇంద్రాదులయందు వ్రతము–యజ్ఞదానాదినియమం బెవ్వరికిఁ గలదో వారు దేవవ్రతులు, లేక, శివవిష్ణ్వాదిదేవతలయందు జపపూజోపవాసాదినియమము ఎవ్వరికిఁ గలదో వారు దేవవ్రతులు, దేవయాజులు; దేవాన్=

ఇంద్రాదులను శివవిష్ణ్వాదులను; యాన్తి—తత్తత్పదమును బొందుచున్నా రని యర్థము. పితృవ్రతాః=పితరులయందు వ్రతము—శ్రాద్ధభూరిభోజనాదినియమము గల వారు; పితౄన్=అగ్నిష్వాత్తాదులను; యాన్తి. భూతేజ్యాః=వినాయకబేతాలక్షేత్ర పాలయక్షిణ్యాదిభూతములను జపహోమబల్యాదులచే నెవ్వరు యజించుచున్నారో వారు భూతేజ్యులు; భూతానియాన్తి. మద్యాజినఃఅపి = నన్ను సగుణబ్రహ్మమును «ఆదిత్యోబ్రహ్మ, మనోబ్రహ్మ, సర్వం ఖల్విదం బ్రహ్మ» ఇత్యాదిశ్రుతులచే నెవ్వరు భేదంబునను అభేదంబునను యజించుచున్నారో వారు మద్యాజులు, సగుణోపాస కులు, వారును; అర్చిరాదిక్రమంబున, మాం యాన్తి. ఇట అపిశబ్దము, నిర్గుణ మగుపరబ్రహ్మమును ఎవ్వరు స్వస్వరూపంబున నెఱుంగుచున్నారో వారలకు [illegible]గుణాభావంబును [illegible]ప్త్యభావంబును సూచించుచున్నది. లేక. మద్యాజినః = నిర్గుణోపాసకులును సగుణోపాసకులును; మామ్ = నన్నే పరబ్రహ్మమును; సాక్షాత్తుగాను క్రమముగాను, యాన్తి—మద్భావము నొందుచున్నా రని యర్థము. వివేకవైరాగ్యసన్న్యాస శమదమాది సంపత్తితో వేదాంతశ్రవణాదికంబున బ్రహ్మ జ్ఞానము సులభము, గమనాదిశ్రమశూన్యమైన తత్ఫలప్రాప్తియు సులభము. అట్లయినను, నిత్యశ్రమసాధ్యము లగు జపహోమోపవాస స్తోత్రపాఠాదులచేతను అతిదుష్కరంబు లగు శ్రాద్ధనియమములచేతను బహుధనవ్యయ ప్రధానంబులును దేహాయాససాధ్యంబులు నగు క్రతుయజ్ఞదానాదులచేతను ఉక్తములును అనుక్తములు నగు క్రియావిశేషములచే బహుశ్రమమూలము లగువానిచేఁ బొందఁదగినఫల మేదిగలదో అది యల్పకాలికమును నశ్వరమును బ్రతియోగిసహితంబును బునరావృత్తికరంబు నగుచున్నది. పండితులకుఁ గూడ దానియందే కామమును సంకల్పమును బ్రవృత్తియును గానఁబడుచున్నది. కాని జ్ఞానమునందును జ్ఞానశాస్త్రమునందును స్వల్పశ్రమంబును నిత్యఫలంబు నగుదానియందుఁ గనఁబడదు. ఆశ్చర్యము! ఇదియే జగన్మోహనం బగు పరమేశ్వరుని మాయ యని మేము తలంచుచున్నాము.

మ. దేవతాంతరయాజులకు ననావృత్తిఫలము లేకున్నను దత్తద్దేవతా యాగానురూపం బగుక్షుద్రఫలము నిశ్చితం బని చెప్పుచు భగవద్యాజులకు వారి కంటె వైలక్షణ్యముఁ జెప్పుచున్నాఁడు.—మూఁడువిధములు గదా యవిధిపూర్వక యాజులు, అంతఃకరణోపాధు లయినగుణముల మూఁడింటి భేదమువలన. అందు సాత్త్వికులు; దేవవ్రతాః=వసురుద్రాదిత్యాది దేవతలసంబంధి యగువ్రతము—బల్యుపహార ప్రదక్షిణనమస్కారాదిరూప మగుపూజనము ఎవ్వరికిఁ గలదో వారు; దేవాన్=

ఆదేవతలనే; యాన్తి, "తం యథా యథోపాసతే తదేవ భవతి" అను శ్రుతివలన, రాజసులు, పితృవ్రతాః=శ్రాద్ధాదిక్రియలచే అగ్నిష్వాత్తాదిపితరుల నారాధించువారు; పితౄన్=ఆపితరులనే; యాన్తి. అట్లు తామసులు, భూతేజ్యాః=యక్షరక్షోవినాయక మాతృగణాదిభూతములఁ బూజించువారు; భూతాని=ఆభూతములనే, యాన్తి ఇట దేవ పితృ భూతశబ్దములకుఁ దత్సంబంధిలక్షణచే సుప్తప్రముఖన్యాయంబున వ్రతశబ్దముతో సమాసము, మధ్యమపదలోపిసమాసము నంగీకరింపమివలనను ప్రకృతివికృతి భావము లేమింజేసి తాదర్థ్య చతుర్థీసమాసము సంభవింపమివలనను. అంతమునందుఁ బూజావాచకం బగు నిజ్యాశబ్దమును బ్రయోగించుటవలనఁ దత్పూర్వంబునఁ బ్రయోగింపఁబడిన రెండు వ్రతశబ్దములును బూజాపరంబులే యగును. ఇట్లు దేవతాంతరారాధనమునకు అంతవంత మగు తత్తద్దేవతారూపత్వరూపఫలమును బ్రతిపాదించి, భగవదారాధనమునకు అనంత మగు భగవద్రూపత్వరూపఫలముఁ జెప్పుచున్నాఁడు.— మద్యాజినః=నన్ను భగవంతుని యజించుట—పూజించుట స్వభావముగాఁ గలవారు, సర్వదేవతలయందును భగవద్భావముఁ జూచువారు, భగవదారాధన పరాయణులు; మామ్=నన్ను భగవంతునే; యాన్తి. ఆయాసము సమానం బైనను భగవంతు నంతర్యామి ననంతఫలదు నారాధింపక దేవతాంతరము నారాధించి యంతవత్ఫలమును బొందుచున్నారు! ఆశ్చర్యము! దౌర్భాగ్యవైభవం బజ్ఞాన మని యభిప్రాయము.

శ్రీ* దానినే యుపపాదించుచున్నాఁడు.—దేవతలయందు—ఇంద్రాదుల యందు వ్రతము—నియమముగలవారు, అంతవంతు లగు దేవతలను బొందుచున్నారు. పితరులయందు వ్రతము గలవారు శ్రాద్ధాదిక్రియాపరులు, పితౄన్ యాన్తి. భూతములయందు—వినాయక మాతృకాదులయందు ఇజ్య—పూజగలవారు, భూతాని యాన్తి. నన్ను యజించుట స్వభావముగాఁ గలవారు మద్యాజులు, వారో; మామ్=నన్నే, అక్షయుని పరమానందరూపుని నారాయణునే; యాన్తి.

ప. ఇట్లుపక్రమించినవిషయమున ఫలితార్థము చెప్పుచున్నాఁడు.— దేవతలయం దింద్రాదులయందు వ్రతము—నియమము గలవారు అంతవంతు లగు దేవతలను బొందుచున్నారు. అట్లు, పితృవ్రతాః—నియమంబున షణ్ణవతి శ్రాద్ధపరులు పితరులను బొందుచున్నారు. భూతములయందు—వినాయక మాతృకాదులయందు ఇజ్య—పూజగలవారు భూతములను బొందుచున్నారు. అట్లు, మద్యాజినః= నన్ను

సర్వాత్మకుని యజించువారు; మాం యాన్తి = మద్రూపతను బొందుచున్నారు. కావున మత్సంతర్పణముచే సర్వదేవతలును సంతర్పితు లగుచున్నారని యర్థము. అది చెప్పఁబడినది —“ లోకములయందు స్మృతిచే వర్ణాశ్రమములకు విహితమయిన యానిత్యకామ్యాదికర్మము సమస్తమును బ్రహ్మార్పణం బగు నని శ్రుతివాక్యములు చెప్పుచున్నవి. ముక్కును కన్నును నాలుకను హస్తమును పాదమును శిరస్సును శ్రోత్రమును వీని నన్నిటిని దృప్తిఁ బొందించుటచే నేమి సంతోష మగునో అట్టి సంతోషము మూలము నొక్కదాని జలములచేఁ దృప్తిఁబొందించుటచే వృక్షమునకు సమస్తమునకును కలుగును ” అని.

రా. అహా! గొప్పవైచిత్ర్యం బిది — ఒక్కటేకర్మమునం దున్నవారలు సంకల్పమాత్రభేదంబునఁ గొందఱు స్వల్పఫలమును బొందుచున్నారు చ్యుతులు నగుచున్నారు, కొందఱు నిరతిశయానంద పరమపురుషప్రాప్తిరూపఫలము నొందు చున్నారు పునరావృత్తి నొంద రని చెప్పుచున్నాఁడు.—వ్రతిశబ్దమునకు సంకల్ప మర్థము. దేవవ్రతాః=దర్శపౌర్ణమాసాదికర్మములచే ఇంద్రాదుల యజించుచున్నా మని యింద్రాదియజనసంకల్పు లగువారు ఎవ్వరో వారు, దేవాన్=ఇంద్రాది దేవతలను; యాన్తి=పొందుచున్నారు. ఎవ్వరు పితృయజ్ఞాదులచే పితరుల యజించుచున్నా మని పితృయజనసంకల్పము గలవారలో వారు పితృవ్రతులు, పితౄన్ యాన్తి. మఱియు నెవ్వరు యక్షరక్షఃపిశాచాదు లగుభూతముల యజించుచున్నా మని భూతయజన సంకల్పము గలవారో వారు భూతేజ్యులు, భూతాని యాన్తి. ఎవ్వరు మఱి ఆయజ్ఞ ములచేతనే దేవపితృభూతశరీరకుం డగుపరమాత్మను భగవంతుని వాసుదేవుని యజించుచున్నా మని నన్ను యజించుచున్నారో వారు మద్యాజులు; మాంయాన్తి= నన్నే పొందుచున్నారు. దేవాదివ్రతులు దేవాదులను బొంది వారితోఁగూడఁ బరి మితం బగుఫలము భుజించి వారికి వినాశకాలము వచ్చినపుడు వారితోడ వినష్టు లగు చున్నారు. మద్యాజులో నన్ను అనాదినిధనుని సర్వజ్ఞుని సత్యసంకల్పుని అనవధి కాతిశయాసంఖ్యేయకల్యాణగుణగణమహోదధిని నిరతిశయానందునిఁ బొంది వెండి యు నివర్తిల్ల రని యర్థము.

మా. ఫలమును వివేచించి చెప్పుచున్నాఁడు యాన్తీత్యాదిగా.

పత్రం పుష్పం ఫలం తోయం యో మే భక్త్యా ప్రయచ్ఛతి
తదహం భక్త్యుపహృత మశ్నామి ప్రయతాత్మనః. ౨౬

భా. మద్భక్తుల కనావృత్తిరూప మయిన యనంతఫలము కలుగు ననుటమాత్రమే కాదు. మ ఱే మనఁగా నన్నారాధించుటయు సుఖము. ఎట్లు ?—పత్త్రమ్=ఆకును; పుష్పమ్=పువ్వును; తోయమ్ = జలమును; యః=ఎవ్వఁడు, మే=నాకొఱకు; భక్త్యా=భక్తితో; ప్రయచ్ఛతి = ఇచ్చుచున్నాఁడో. ప్రయతాత్మనః=శుద్ధ మయినబుద్ధి గలవానియొక్క; తత్= ఆపత్త్రాదికమును; భక్త్యుపహృతమ్ = భక్తిచే నియ్యఁబడినదానిని; అహమ్=నేను; అశ్నామి=గ్రహించుచున్నాను.

ఎవ్వఁడు శుద్ధచిత్తుఁడై భక్తితో నాకుఁ బత్త్రపుష్పఫలముల నర్పించుచున్నాఁడో అతఁడు భక్తితో నర్పించినట్టి యాపత్త్రము మొదలగువానిని నేను గ్రహించుచున్నా నని తాత్పర్యము.

ఆ. అనంతఫలం బగుటవలన భగవదారాధనమే కర్తవ్య మని చెప్పఁబడినది. సుకరం బగుటవలనఁ గూడ భగవదారాధనమే కర్తవ్య మని చెప్పుచున్నారు మద్భక్తులకు నిత్యాదిగా. భగవదారాధనము సుకరం బనుటనే ప్రశ్నపూర్వముగాఁ బ్రపంచించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఎందువలనఁ బుష్పాదికమును భక్తిపూర్వకముగా నా కర్పించుచున్నాఁడో అందుచే నితఁడు శుద్ధచిత్తుఁడు తపస్వి నన్నారాధించుచున్నాఁ డని నేను గ్రహించుచున్నా నని చెప్పుచున్నాఁడు పత్త్ర మిత్యాదిగా.

హ. భక్త్యా; ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాఁడో, తత్; భక్తిచే నియ్యఁబడిన దానిని, అహమ్; అశ్నామి=భుజించుచున్నాను; ప్రయతాత్మనః=ప్రయతము—శుద్ధమైనఆత్మ—చిత్తముగల భక్తునియొక్క; అట్టివానియొక్క పత్త్రాదిద్రవ్యము నాకుఁ బ్రీతి కలిగించు నని యర్థము.

శం. ఓయీ! అధికారులగు మహాత్ములకు బ్రహ్మజ్ఞానము సులభము, తత్ఫలంబును అనావృత్తిరూపము అనంతము అఖండానందము అద్వయము మోక్షాఖ్యం బతిసులభము. అం దనధికారులకు అతిమందబుద్ధు లగుముముక్షువులకు ఏమిగతి ? అని యాశంకింపఁగా, ఆయురుక్షువు లగుసత్పురుషులకుఁ గూడ భక్తులకు నేను సులభుఁడనే యనునాశయంబునఁ జెప్పుచున్నాఁడు.—పత్త్రమ్ = ఆకును; పుష్పమ్= పువ్వునుగాని; ఫలమ్=పండును; తోయమ్=జలమునుగాని; సాలగ్రామమునందుఁ గాని, ప్రతిమయందుఁ గాని, మే=నాకొఱకు; యః=ఏముముక్షువు; భక్త్యా=భక్తిచేతను, శ్రద్ధచేతను; ప్రయచ్ఛతి=ఇచ్చుచున్నాఁడో; అట్టి, ప్రయతాత్మనః=శుద్ధమయినచిత్తవృత్తి

గల వానియొక్క: భక్త్యుపహృతమ్=సద్భక్తిచే సమర్పింపఁబడినట్టి; తత్=ఆవస్తువును; అహమ్=నేను పరమేశ్వరుఁడను; చక్కఁగా, అశ్నామి = అనుగ్రహించుచున్నాను. దానిచేతనే సంతుష్టుఁడ నగుచున్నా నని యర్థము. «ధిగసీశార్చనం జన్మ" ♦ అని యీశ్వరారాధనహీనస్య మగుజన్మము నిష్ఫలం బని చెప్పుటవలనను, ఈశ్వరారాధనము షట్కర్మాంతర్గతం బగుటవలనను, ఈశ్వరారాధనము ముముక్షువున కవశ్యకర్తవ్యం బని సూచిత మగుచున్నది. లేక. «అభ్యాగత స్స్వయం విష్ణుః» అను స్మృతివలన, కాలమునందు వచ్చినట్టి, మే=మద్రూపుఁ డగునతిథికొఱకు; పత్త్రమ్=పక్వ మగుశాకమునుగాని; ఫలమ్=పండునుగాని; పుష్పమ్ = పుష్పశబ్దముచే కలాటువు * చెప్పఁబడుచున్నది, పక్వ మగుకాయనుగాని; తోయమ్ = జలమునుగాని; తాను దేని భుజించునో దానిని, భక్తితోను శ్రద్ధతోను, యః ప్రయచ్ఛతి, «దానమేవ గృహస్థస్య» ♦♦ అను నియమమువలన; స్వధర్మనిష్ఠుండును భూతదయ గల వాఁడునగు నట్టిశుద్ధాత్మునియొక్క, శుద్ధభక్తితో బ్రాహ్మణముఖమునందు సమర్పింపఁబడినదాని పత్త్రమునుగాని తోయమునుగాని ఆద్రవ్యమును, అహమ్ = నేను పరమేశ్వరుఁడను; సాక్షాత్తన్ముఖంబున, అశ్నామి—భుజించుచున్నా నని యర్థము.

ము. ఇట్లు దేవతాంతరములను బరిత్యజించి యాంతఫలం బగుటవలన భగవంతుని సమారాధనమునే చేయవలయును, అతిసుకరం బగుటవలనఁ గూడ నని చెప్పుచున్నాఁడు.—పత్త్రం పుష్పం ఫలం తోయమ్; ఇతరములనుగాని అనాయాసలభ్య మయినవస్తువును దేనినైనను; యః = ఏమనుష్యుఁడు గాని; మే=నాకొఱకు, అనంతవిభూతిపతి యగుపరమేశ్వరునికొఱకు; భక్త్యా = «న వాసుదేవాత్పరమస్తి కించిత్» ♦ అనుబుద్ధితోఁ గూడిన ప్రీతిచేత; ప్రయచ్ఛతి = ప్రభువునకు భృత్యునివలె సర్పించుచున్నాఁడో, నాది కాని ద్రవ్యము లేమివలన సర్వంబును నాచేతనే సంపాదితం బగుటవలన. అందువలన మదీయమునే సర్వమును నా కర్పించుచున్నాఁడు మనుష్యుఁడు. అట్టి, ప్రీతితో నర్పించుచున్న, ప్రయతాత్మనః=శుద్ధచిత్తునియొక్క; తత్ = ఆపత్త్రపుష్పాదికమును తుచ్ఛమునైనను వస్తువును; అహమ్=నేను సర్వేశ్వరుఁడను; అశ్నామి=భుజించినట్లు ప్రీతితో స్వీకరించి తృప్తిఁ బొందుచున్నాను. ఇట వాచ్యా

♦ ఈశ్వరారాధనము లేనిజన్మము వ్యర్థము.

* కాయ.

♦♦ గృహస్థునకు దానమే ప్రధానము.

♦ వాసుదేవునికంటె ఇతరమేదియు లేదు.

ర్థము అత్యంతము తిరస్కృతం బగుటవలన అశనలక్షితం బగుస్వీకారవిశేషముచేఁ బ్రీత్యతిశయహేతుత్వము వ్యంజిత మగుచున్నది, “నహవై దేవా అశ్నన్తి న పిబన్త్యేతదేవా ఽమృతం దృష్ట్వా తృప్యన్తి” * అను శ్రుతివలన ఎందువలన, దుచ్ఛమునుగూడ దాని స్వీకరించుచున్నావు? ఎందువలన నది, భక్త్యుపహృతం భక్తి— ప్రీతిచే సమర్పింపఁబడినదో అందువలన. అందుచే ప్రీతిచే సమర్పించుట మత్స్వీకారనిమిత్తం బని యర్థము. ఇట భక్త్యా ప్రయచ్ఛతి యని చెప్పి రెండియు భక్త్యుపహృతమ్మని చెప్పుటచే భక్తుఁడు కాని వాని బ్రాహ్మణత్వ తపస్విత్వాదికము మత్స్వీకారనిమిత్తము కా దని పరిసంఖ్యను సూచించుచున్నాఁడు ♦. లోక. శ్రీదాముం డను బ్రాహ్మణుఁడు తెచ్చిన తండులకణములు భక్షించినట్లు ప్రీతివిశేషముచేఁ బ్రతిబద్ధ మయిన భక్ష్యాభక్ష్యబుద్ధి గలవాఁడనై మాత్రాదులచే నర్పిత మగుదాని బాలుండుంబోలె భక్తునిచే నర్పితం బగు పత్త్రపుష్పాదికమును సాక్షాత్తుగానే భక్షించుచున్నాను. అందుచే భక్తియే నాపరితోషమునకు నిమిత్తము, కాని దేవతాంతరములకుం బోలె బహువిత్తవ్యయాయాససాధ్య మయిన బల్యుపహారాదిక మేదియుఁ గాదు, కావున దేవతాంతరమును విడిచి నన్నే భజింపవలయు నని యభిప్రాయము

శ్రీ. ఇట్లు తనభక్తుల కక్షయఫలత్వము చెప్పఁబడినది. స్వభక్తియందాయాసము లే దనియుం జెప్పుచున్నాఁడు.—పత్త్రపుష్పాదిమాత్రమును గూడ నాకు భక్తిచే నెవ్వఁ డిచ్చుచున్నాఁడో, అట్టి, ప్రయతాత్మనః = శుద్ధచిత్తునియొక్క, నిష్కామభక్తునియొక్క; తత్ =ఆపత్త్రపుష్పాదికమును; వానిచే భక్తితో సమర్పింపఁబడినదానిని, అహమ్; అశ్నామి = ప్రీతిచే గ్రహించుచున్నాను. మహావిభూతిపతియైనపరమేశ్వరుఁడ నగు నాకు క్షుద్రదేవతలకుం బోలె బహువిత్తసాధ్యయాగాదులచేఁ బరితోషము సంభవింపదు, మఱేమనఁగా, భక్తిమాత్రముచేతనే పరితోషం బగును. కావున భక్తుఁడు సమర్పించినదానిఁ బత్త్రాదిమాత్రమునైనను దేనిని గాని యతని ననుగ్రహించుటకొఱకే స్వీకరించుచున్నా నని భావము.

ప. ఇట్లు దేవపిత్రాదిప్రాప్తికొఱకుఁ గాయక్లేశార్థవ్యయాదికముచే నధిక మయినయాయాసము కావలయును, మత్ప్రాప్తి యట్టిది కా దని చెప్పుచున్నాఁడు —

---

* దేవతలు భుజింపనే భుజింపరు త్రాగనే త్రాగరు, ఇదియే యమృతము, చూచి తృప్తు లగుచున్నారు.

♦ ఇతరవ్యావృత్తికొఱకుఁ జెప్పినదానినే మరలఁ జెప్పుట పరిసంఖ్య.

అట్టి, ప్రయతాత్మనః = శుద్ధచిత్తుఁ డగుపురుషునియొక్క, తత్ = ఆపత్త్రపుష్పాదిక మును; అహమ్; అశ్నామి=గ్రహించుచున్నాను, ఇతరుపబడి గ్రహింపను. ఎట్టివాని యొక్క? యః; మే=నాకొఱకు; భక్త్యా = భక్తిచే; ప్రయచ్ఛతి. దంభముచేఁ గాదో. ఎట్టిదానిని? భక్త్యుపహృతమ్=భక్తిచే—ఆర్జనముచే—తేఁబడినదానిని, కాని బలాత్కారముచేఁ గాని చౌర్యముచేఁ గాని కాదు. అందువలన, అవాప్తసకల కాముఁడ నగు నేను భక్తిచేతనే లభ్యుఁడను, ఉపచారములచే లభ్యుఁడఁ గా నని యర్థము.

రా. మద్యాజుల కీవిశేషంబును గల దని చెప్పుచున్నాఁడు.—సర్వసుల భంబగు పత్త్రమును గాని పుష్పమును గాని ఫలమును గాని తోయమును గాని యెవ్వఁడు భక్తిచే నాకొఱ కిచ్చుచున్నాఁడో—అత్యంతము నేనే ప్రియుఁడుగాఁ గల వాఁ డగుటచే నాకు దాని నిచ్చినఁగాని యాత్మధారణము పొందఁజాలక తదేక ప్రయోజనుఁడై యెవ్వఁడు నాకుఁ బత్త్రాదికము నిచ్చుచున్నాఁడో, అట్టి, ప్రయతాత్మనః = తత్త్రదానమె ప్రయోజనముగాఁ గలవాఁ డగుట యనుశుద్ధితోఁ గూడిన చిత్తము గలవానియొక్క; తత్=అట్టి. భక్త్యుపహృతమ్; అహమ్=సర్వేశ్వరుఁ డను నిఖిలజగదుదయవిభవలయంబులు లీలలుగాఁ గలవాఁడను అవాప్తసమస్తకాముఁ డను సత్యసంకల్పుఁడను అనవధిక నిరతిశయాసంఖ్యేయ కల్యాణగుణుఁడను స్వాభావిక నిరవధిక నిరతిశయానందస్వానుభవమునం దున్న వాఁడ నయ్యును; కోరఁ గందరాని ప్రియము పొందినట్లు, అశ్నామి. అట్లు చెప్పఁబడినది మోక్షధర్మమునందు.—“యాః క్రియాః స్సంప్రయుక్తా స్స్యు రేకాన్త గత బుద్ధిభిః । తా స్సర్వా శ్శిరసా దేవః ప్రతి గృహ్ణాతి వై స్వయమ్” * అని.

మా. దుర్బలులకు నిన్నుఁ బూజింప శక్యముకాదు, గొప్పవాఁడ వగుట వలన నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—పత్త్రమ్, విహితముకాని పత్త్రాదిక మును కాదు. అవిహిత పత్త్రాదిదానము అపరాధ మని వారాహపురాణమునందుఁ జెప్పుటవలన. భక్తిచేతనే నేను తృప్తిఁ బొందుచున్నా నని భావము. “భక్తప్రియం సకలలోక నమస్కృతంచ” అని భారతమునందు. “ఏతావా నేవ లోకే౽స్మిన్

* ఏకాగ్రభక్తితోఁ గూడినవారిచే నేకర్మములు చేయఁబడునో వానినన్నిటిని దేవుఁడు తానె శిరస్సుచే గ్రహించుచున్నాఁడు.

పుంసస్స్వార్థః పరస్స్మృతః। ఏకాన్త భక్తిర్గోవిన్దే యత్సర్వత్రాత్మ దర్శనమ్" *
అనియు.

యత్కరోషి యదశ్నాసి యజ్జుహోషి దదాసి యత్
యత్తపస్యసి కౌన్తేయ తత్కురుష్వ మదర్పణమ్. ౨౭

శ్రీ. అందువలన.—యత్ = దేనిని; కరోషి=చేయుచున్నావో, తన యంతఁ బ్రాప్తమయినదానిని, యత్=దేనిని; అశ్నాసి=భుజించుచున్నావో. యత్=దేనిని; జుహోషి=హవనము నెఱవేర్చుచున్నావో, శ్రౌతమును గాని స్మార్తమును గాని. యత్=దేనిని; దదాసి = ఇచ్చుచున్నావో, బ్రాహ్మణాదులకొఱకు హిరణ్యాన్నరత్నాదికమును. యత్ = దేనిని; తపస్యసి=తపస్సు చేయుచున్నావో. కౌన్తేయ=అర్జునా! తత్ = దానిని; మదర్పణమ్ = నాకు సమర్పణమునుగా; కురుష్వ=చేయుము.

అర్జునా! తనయంతనె ప్రాప్తించిన లౌకికకర్మ మేది చేయుచున్నావో, ఏభోగము భుజించుచున్నావో, శాస్త్రోక్తమయిన శ్రౌతస్మార్తకర్మ మేది చేయుచున్నావో, బ్రాహ్మణాదులకు దాన మేది చేయుచున్నావో, మఱియుఁ దప స్సేది చేయుచున్నావో అదియంతయు నాకు సమర్పింపు మని తాత్పర్యము.

శ్రీ. భగవదారాధనము సుకరం బగుటవలన నది యావశ్యకం బని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. తనయంత—శాస్త్రముచేఁ బ్రాప్తము కానిదానిని, గమనాదికము నని యర్థము. హవనము తనయంతఁ బ్రాప్తము కాదని చెప్పుచున్నారు శ్రౌతమును ఇత్యాదిగా. నాకు సమర్పణమునుగా—దాని సర్వంబును నాకు సమర్పింపు మని యర్థము.

హ. యత్ కరోషి=ఏలౌకికకర్మమును జేయుచున్నావో; యత్ అశ్నాసి= దేనిని అన్నాదికమును భక్షించుచున్నావో. యత్ జుహోషి = దేనిని ఆజ్యాదికమును వేల్చుచున్నావో దేవతలకొఱకు. యత్ దదాసి = హిరణ్యాదికమును దేనిని ఇచ్చుచున్నావో. యత్ తపస్యసి = కృచ్ఛ్ర చాంద్రాయణాదిక మగు నేతపస్సును జేయుచున్నావో. తత్ =దానినంతయు; కౌన్తేయ! మదర్పణమ్ = నాయారాధనమునుగా; కురుష్వ.

---

* గోవిందునియందు ఏకాంతభక్తి–సర్వత్రాత్మదర్శనము ఏదిగలవో, ఇంతమాత్రమే యీలోకమునందుఁ బురుషునకుఁ బరమపురుషార్థోపాయము చెప్పఁబడినది.

తా. ఎందువలన నేను సాధువులకు భక్తిచే సులభుఁడనో అందువలన నీ వేయేకర్మము చేయుచున్నావో దానినంతయు నా కర్పణముచేయు మని చెప్పుచున్నాఁడు.— యత్ = విహితమై లోకవిద్విష్టము కాని యేలౌకికకర్మమును; కరోషి. యత్ = శాస్త్రీయమై యనాయాసలబ్ధ మయిన యే యన్నమును; అశ్నాసి. యత్ = ఏచరుపురోడాశాది హోమద్రవ్యమును; అగ్న్యాదిదేవతలకొఱకు, జుహోషి. యత్ = ఓదనోదకధనధాన్యకన్యాగవాదికమును దేనిని; పాత్రభూతులకొఱకు; దదాసి. యత్ తపస్యసి = సంధ్యావందనాదికమును వేదాధ్యయనాదికమును గాని, వ్రతోపవాసాదికమును గాని యేతపస్సును జేయుచున్నావో. ఇట్లు లౌకికమును గాని వైదికమును గాని యేయేకర్మమును జేయుచున్నావో, తత్ = దానినంతయు; మదర్పణం కురుష్వ — బ్రహ్మార్పణబుద్ధిచేతనే సర్వకర్మమును జేయు మని యర్థము.

వి. ఎట్టిది నీభజనము? అనఁగా దానిఁ జెప్పుచున్నాఁడు.— యత్ కరోషి — శాస్త్రోక్తము కాకున్నను రాగప్రాప్త మయిన గమనాదికమును. యత్ అశ్నాసి — నీతృప్తికొఱకుఁ గాని కర్మసిద్ధికొఱకుఁ గాని. అట్లు. యత్ జుహోషి = శాస్త్రబలమువలన నిత్య మయిన యగ్నిహోత్రాది హోమమును దేనిని నెఱవేర్చుచున్నావో, శ్రౌతస్మార్త సర్వహోమోపలక్షణం బిది. అట్లు. యత్ దదాసి — అతిథి బ్రాహ్మణాదులకు అన్నహిరణ్యాదికమును. అట్లు. యత్ తపస్యసి = ప్రతిసంవత్సరమును అజ్ఞాతప్రమాదాదికపాపము నశించుకొఱకు చాంద్రాయణాదికమును దేనిని జేయుచున్నావో, లేక, ఉచ్ఛృంఖల మగుప్రవృత్తిని తొలఁగించుటకై దేహేంద్రియసంఘాతమును నిగ్రహించుటను దేనిని జేయుచున్నావో. ఇది సమస్తము లయిన నిత్యనైమిత్తికకర్మముల కుపలక్షణము. అందుచే, ప్రాణిస్వభావవశమువలన శాస్త్రబోధితము గాకున్నను ఆవశ్యక మగు నీయొక్క గమనాశనాదిక మేదిగలదో, మఱియు శాస్త్రవశమువలన నావశ్యక మగు హోమదానాదిక మేది గలదో, ఓకౌంతేయుఁడా! తత్ = ఆకర్మమును, లౌకికమును వైదికమును సమస్తంబును ఇతరనిమిత్తముననే చేయఁబడుదానిని; మదర్పణమ్ = నాయం దర్పింపఁబడినది యగునట్లు; కురుష్వ = చేసికొనుము. ఆత్మనేపదముచే « సమర్పకునియందే యున్నది సమర్పణఫలము, నాయం దేమియు లే » దని తెలుపుచున్నాఁడు. అవశ్యము చేయవలసినకర్మములను నాయందుఁ బరమగురునియందు సమర్పించుటయే నాభజనము, కాని తదర్థము వేఱువ్యాపార మేమియుఁ జేయవలసినది లే దని యభిప్రాయము.

శ్రీ. పత్త్రపుష్పాదికమును గూడ యజ్ఞార్థము పశుసోమాదిద్రవ్యములను వలె నాకొఱకనియే సంపాదించి సమర్పింపవలసినది లేదు. మఱేమనఁగా.—స్వభావమువలనఁ గాని శాస్త్రమువలనఁ గాని యేయేకర్మమును జేయుచున్నావో. అట్లు, యదశ్నాసి. యజ్జుహోషి. యత్, తపస్యసి = తపస్సుచేయుచున్నావో. అది యంతయు నాయం దర్పిత మగునట్లు చేయుము.

ప. ఇట్లు పత్త్రపుష్పాద్యర్పణము కొఱకును నాప్రతిమావిభూతులను వెదకుప్రయాసము గూడ వల దని చెప్పుచున్నాఁడు.—స్వభావమువలనఁ గాని శాస్త్రమువలనఁ గాని కరచరణవ్యాపారముచే నేయేకర్మముఁ జేయుచున్నావో, యత్, అశ్నాసి=భుజింపఁగోరుచున్నావో; జుహోషి=అగ్నియందు వేల్చుచున్నావో. దదాసి. తపస్యసి. దానినంతయు, మదర్పణం కురుష్వ—సంకల్పమాత్రముననే నాకర్పణ మగుచున్నది, దర్శనాదిక మపేక్షితము కా దని యర్థము.

రా. ఎందువలన మహాత్ములగుజ్ఞానుల విశేషంబిది వాఙ్మానసంబుల కగోచరమో అంటువలన నీవును జ్ఞానివై ఇట్టి భక్తిభారముచే వంపఁబడిన యాత్మయును ఆత్మసంబంధియును గలవాఁడవై కీర్తనము యతనము అర్చనము ప్రణామము మొదలగువాని నెల్లప్పుడును జేయుచు లౌకికకర్మమును వైదిక మగు నిత్యనైమిత్తిక కర్మమును ఇట్లు చేయు మని చెప్పుచున్నాఁడు.—యత్ = దేహయాత్రార్థ మయిన యేలౌకికకర్మమును; కరోషి. యత్ = దేనిని; దేహధారణముకొఱకు, అశ్నాసి. మఱియు హోమము దానము తపస్సు మొదలగు వైదికకర్మమును దేనిని జేయుచున్నావో. దానినంతయు, మదర్పణం కురుష్వ—అర్పింపఁబడుచున్నది కావున అర్పణము, సమస్త మయినలౌకిక వైదికకర్మముయొక్కయు కర్తృత్వమును భోక్తృత్వమును ఆరాధ్యత్వమును ఎట్లు నాయందు సమర్పితం బగునో అట్లు చేయుము, ఇది యభిప్రాయము.—యాగదానాదులయం దారాధ్యులుగాఁ దోఁచుచున్న దేవాదులును కర్మకర్తవు భోక్త వగునీవును మదీయులై మత్సంకల్పాయత్తములైన స్వరూప స్థితి ప్రవృత్తులు గలవా రగుటచే పరమశేషిని పరమకర్త నగు నాయందే కర్తవు భోక్తవు ఆరాధకుఁడ వగు నిన్నును ఆరాధ్యం బగు దేవజాతంబును ఆరాధనరూపం బగు క్రియాజాతంబును సర్వంబును సమర్పింపుము, నీవు మన్నియామ్యుఁడ వనియు మచ్ఛేషతైకరసుండ వనియు ఆరాధ్యాదులును ఇట్టివే యనియు నత్యంతప్రీతియుక్తుఁడవై యనుసంధింపుము.

వ్యా. అందువలన—యత్ కరోషి.

శుభాశుభఫలై రేవం మోక్ష్యసే కర్మబన్ధనైః
సన్న్యాసయోగయుక్తాత్మా విముక్తో మా ముపైష్యసి. ౨౮

భా. ఇట్లు చేయుదువేని నీ కేది కలుగునో అది వినుము—శుభాశుభఫలైః=ఇష్టానిష్టములు ఫలములుగాఁ గల; కర్మబన్ధనైః=కర్మము లను కట్టులచేత; ఏవమ్=ఇట్లు నాకుసమర్పణము చేయుచున్నవాఁడవై; మోక్ష్యసే=విడువఁబడఁగలవు. ఇదియే సన్న్యాసయోగ మనఁగా. సన్న్యాసయోగయుక్తాత్మా = మత్సమర్పణం బగుటవలన సన్న్యాసంబును కర్మ మగుటవలన యోగమును కావున సన్న్యాసయోగము, అట్టిసన్న్యాసయోగముతోఁ గూడిన యంతఃకరణము గలవాఁడవై; బ్రతికియున్నపుడే కర్మబంధనములచే, విముక్తః = విడువఁబడినవాఁడవై; ఈశరీరము పడినంతనే, మామ్=నన్ను; ఉపైష్యసి=పొందఁగలవు.

ఇట్లు సర్వకర్మముల నాకర్పించుచుందువేని యిష్టానిష్టఫలములఁ గలిగించునట్టి కర్మములచే విడువఁబడుదువు. ఇట్లు కర్మములను నాకర్పించి యనుష్ఠించుటయే సన్న్యాసయోగ మనఁబడును. ఈసన్న్యాసయోగముతోఁ గూడిన చిత్తము గలవాఁడవై జీవించియున్నపుడె కర్మబంధముల వీడి దేహపాతానంతరము నన్నుఁ బొందఁగల వని తాత్పర్యము.

ఆ. ఇందువలన నేమియగును? అనఁగా దానిఁ జెప్పుచున్నాఁడు ఇట్లు ఇత్యాదిగా. భగవదర్పణబుద్ధితో సర్వకర్మము చేయువానికి జీవన్ముక్తునకుఁ బ్రారబ్ధకర్మాంతంబున విదేహకైవల్యము తప్పదని చెప్పుచున్నారు శుభాశుభఫలై రిత్యాదిగా. భగవదర్పణము చేయుటవలనను సన్న్యాసయోగమువలనను ముక్తి యని ముక్తికి రెండుసాధనము లనుశంకను నివారించుచున్నారు ఇదియే ఇత్యాదిగా.

హ. ఏవమ్=ఇట్లు నాకర్పణముచేయఁగా; శుభాశుభఫలైః=పుణ్యపాపఫలంబులగు; కర్మబన్ధనైః=కర్మము లనుబంధనములచేత; మోక్ష్యసే = ముక్తుఁడ వగుదువు. సన్న్యాసయోగయుక్తాత్మా=సన్న్యాసం బనుయోగము సన్న్యాసయోగము, దానితో యుక్తమైయినమనస్సు గలవాఁడవై, ఫలాసక్తి విడిచినవాఁడవై యనుట; కర్మ

బంధనములచే, విముక్తః; మామ్ = నన్ను నిత్యముక్తుని వాసుదేవుని; ఉపైష్యసి = పొందఁగలవు.

౨౮. శ్రౌతమును స్మార్తమునుగాని ఇతరమునుగాని కర్మమును ఈశ్వరార్పణ బుద్ధిచేఁ జేయువానికిఁ దత్ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఏవమ్ = ఇట్టి, ఈశ్వరార్పణ బుద్ధిచే వైదికమును అవైదికము నగు యుక్త మయినకర్మమును జేయుచున్నట్టి నీవు; శుభాశుభఫలైః=సుఖదుఃఖప్రదము లగు, లేక, స్వర్గనరక హేతువు లగు; కర్మబన్ధనైః= కర్మము లనుబంధనములచేత; మోక్ష్యసే=ముక్తుఁడవు కాఁగలవు. ఓయీ! «కర్మణ్యేవా ఽధికారస్తే, నియతం కురు కర్మ త్వమ్, స్వధర్మమ్» అని విహితకర్మములే కర్తవ్యము లని విధించుటవలన, ఎట్లు విహితకర్మములవలన అశుభఫలము కలుగును? అందు వేని, అట్లు శంకింపవలదు, విహితములవలనఁ గూడ అనుష్ఠానవైకల్యంబున నశుభఫలం బుపపన్న మగుటవలన. «యస్యాగ్నిహోత్ర మదర్శ పౌర్ణమాస మ చాతుర్మాస్య మనాగ్రయణ మతిథి వర్జితంచ అహుత మవైశ్వదేవ మవిధినా హుత మా సప్తమాం తస్య లోకా హినస్తి, స వాగ్వజ్రో యజమానం హినస్తి" * ఇత్యాది శ్రుతిస్మృతులవలన మంత్రతంత్ర స్వర వర్ణద్రవ్య కాలాదినియమములు తప్పినను జాతిపడినను భిన్న మయినను విహితంబులును అశుభఫలప్రదంబు లగును. అందువలన, «నేహాభి క్రమనాశో ఽస్తి ప్రత్యవాయో నవిద్యతే" అను న్యాయంబున ఈశ్వరార్పణబుద్ధిచే శ్రద్ధాభక్తులతోఁ జేయఁబడుకర్మములకో విపర్యాసము కలిగినను ప్రత్యవాయాదులు సంభవింపవు. అట్లు, సన్న్యాసయోగయుక్తాత్మా= సన్న్యాస మనఁగా పరమేశ్వరునియందుఁ గర్మఫలత్యాగము, అదియే యోగము—కర్మబంధ మోక్షోపాయము, దానియందే—సర్వకర్మఫల సన్న్యాసమునందే, యుక్తము—సక్త మయినయాత్మ—మనస్సు గలవాఁడవై; కర్మబంధములచే, విముక్తః క్రమంబున; మామ్=నన్ను పరమాత్మను; ఉపైష్యసి—విదేహముక్తిని బొందఁ గల వని యర్థము. లేక. సిద్ధ్యసిద్ధులయందు సముఁడవై యీశ్వరార్పణబుద్ధితోను దీనిచే నీశ్వరుఁడు నాకుఁ బ్రసన్నుం డగుఁ గాక యనునది మొదలగుకామనలు లేమితోను ఇట్లు నిత్యనైమిత్తికకర్మము చేయుచున్న నీవు, చక్కఁగా ననుష్ఠించిన సత్కర్మముల

---

* ఎవ్వని యగ్నిహోత్రము దర్శపౌర్ణమాసము లేనిదో చాతుర్మాస్యము లేనిదో ఆగ్రయణము లేనిదో అతిథి లేనిదో హోమము లేనిదో వైశ్వదేవము లేనిదో అవిధిచే వేల్వఁబడినదో అది యేడు పురుషులవఱకు వానిలోకముల నశింపఁజేయుచున్నది, అది వాగ్వజ్రమై యజమానుని హింసించుచున్నది.

చేఁ బుట్టిన చిత్తశుద్ధిమూలంబున ఆత్మవిజ్ఞానముఁ బొందినవాఁడవై, సన్న్యాసయోగయుక్తాత్మా=నేను కర్తను గా నని చక్కఁగాఁ దాను కూటస్థుఁడ నని యెఱుంగుటచే తనకు సంచితాద్యశేషకర్మసంబంధము లే దని తెలియుటయే సన్న్యాసయోగము, దానియందే-సంచితాగామివర్తమాన సర్వకర్మ కర్తృత్వభోక్తృత్వాదిసంబంధము తనకు లే దని యెఱుంగుటయందే, యుక్తము—సమాహిత మయినఆత్మ—మనస్సు గలవాఁడవై; శుభాశుభఫలైః = స్వర్గనరక సుఖదుఃఖములఁ బొందించునట్టి; కర్మబన్ధనైః=కర్మములు—పుణ్యాపుణ్యమిశ్రరూపము లగు సంచితాదులు, పురుషుఁడు వీనిచే జన్మాదుల బంధింపఁబడుచున్నాఁడు కావున బంధనములు, ఆకర్మము లనుబంధనములచేత; మోక్ష్యసే. ఇట్లు, విముక్తః = సన్న్యాసయోగముచేఁ గర్మబంధనములవలన విడువఁబడినవాఁడవై; మామ్=నిర్విశేష మగు పరబ్రహ్మమును; అంతరాలము లేకయే, ఉపైష్యసి=విదేహకైవల్యము నొందఁగల వని యర్థము.

మ. ఇట్టి భజనంబునకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.——ఏవమ్=ఇట్లు అనాయాససిద్ధ మయినను సర్వకర్మసమర్పణరూప మయిన మద్భజనము చేయఁబడునేని; శుభాశుభములు—ఇష్టానిష్టములు ఫలములుగాఁ గల; కర్మబన్ధనైః = బంధరూపము లగు కర్మములచేత; మోక్ష్యసే—నాయందు సమర్పితము లగుటవలన నీకు వానితో సంబంధము సంభవింపమివలనఁ గర్మములతోను ఫలములతోను సంస్పృష్టుఁడవు కావు. అందువలన, సన్న్యాసయోగయుక్తాత్మా = సన్న్యాసముగాఁ సర్వకర్మములను భగవంతునియందు సమర్పించుట, అదియే చిత్తశోధక మగుటవలన యోగమువంటిది కావున యోగము, దానిచే యుక్తము—శోధితమైన ఆత్మ—అంతఃకరణము గలవాఁడవై, లేక, విడువఁబడిన సర్వకర్మములు గలవాఁడవై; కర్మబంధనములచే జీవించియే, విముక్తః; సమ్యగ్దర్శనంబున అజ్ఞానావరణము నివర్తిల్లుటచే, మామ్; ఉపైష్యసి=సాక్షాత్కరింతువు నేను బ్రహ్మము నని. అంతఁ బ్రారబ్ధకర్మము క్షయించినపిదప ఈ దేహము పడినపిమ్మట విదేహకైవల్యరూపుఁడ వగు నన్నుఁ బొందగలవు. ఇప్పుడును సద్రూపుఁడవై సర్వోపాధినివృత్తివలన మాయికం బగు భేదవ్యవహారమునకు విషయము కాఁ బో వని యర్థము.

శ్రీ. ఇందువలన నేఫలము నొందుదువో దాని వినుము.——ఇట్లు చేయుచు, కర్మబన్ధనైః=కర్మనిమిత్తంబు లగు; శుభాశుభఫలైః = ఇష్టానిష్టము లగుఫలములచే; ముక్తుఁడవు కాఁ గలవు, కర్మములు నాయందు సమర్పితంబు లగుటచే నీకుఁ దత్ఫల

సంబంధం బనుపపన్న మగుటవలన. వానిచే, విముక్తః; సన్న్యాసయోగయుక్తాత్మా= సన్న్యాస మనఁగా కర్మముల నాయందు నర్పించుట, అదియే యోగము, దానితో యుక్తమయినచిత్తము గలవాఁడ వగునీవు; నన్నుఁ బొందఁగలవు.

ప. తత్ఫలముఁ జెప్పుచున్నాఁడు —ఏవమ్=ఈప్రకారంబున సుదర్శన బుద్ధితో కర్మములు చేయఁబడు నేని; కర్మబన్ధనైః = కర్మనిమిత్తములగు; శుభాశుభ ఫలైః=ఇష్టానిష్టరూపము లగు ఫలములచే; మోక్ష్యసే = విముక్తుఁడవు కాఁ గలవు. ఎట్లు అగ్నియందు వేఁపఁబడిన బీజములు అంకురములఁ బుట్టింపఁజాలవో అట్లే బ్రహ్మార్పణబుద్ధిచేఁ జేయుకర్మములు ఫలజనకంబులు కాఁ జాలవని యర్థము. అందు వలన, మున్ను చెప్పిన సన్న్యాసయోగముచే యుక్తమయినచిత్తము గలవాఁడ వగు నీవు, విముక్తః=జీవన్ముక్తదశను బొందినవాఁడవై; మామ్; ఉపైష్యసి.

రా. ఇట్లు సన్న్యాసాఖ్యం బగుయోగముతో యుక్తమయినమనస్సు గల వాఁడవై ఆత్మను * మచ్ఛేషతయు మన్నియామ్యతయునే స్వభావముగాఁ గలవానిఁ గాను సమస్తకర్మమును మదారాధనమును గాను అనుసంధించుచు లౌకికకర్మమును వైదికకర్మమును జేయుచున్నవాఁడవై శుభాశుభఫలము లగు ననంతములైన ప్రాచీన కర్మాఖ్యబంధనములచే మత్ప్రాప్తివిరోధు లగువానిచే నన్నిటిచేతను విముక్తుఁడ వగుదువు. వానిచే విముక్తుఁడవై నన్నే పొందఁగలవు.

మా. *

సమోఽహం సర్వభూతేషు న మే ద్వేష్యోఽస్తి న ప్రియః
యే భజన్తి తు మాం భక్త్యా మయి తే తేషు చాప్యహమ్. ౨౯

భా. రాగద్వేషవంతుఁ డప్పుడు భగవంతుఁడు, ఎందువలన ననఁగా, భక్తుల ననుగ్రహించుచున్నాఁడు, ఇతరుల ననుగ్రహింపఁడు. అనఁగా నట్లు కాఁడు.—అహమ్ = నేను; సర్వభూతేషు = సమస్తప్రాణులందును; సమః=తుల్యుఁడను. మే=నాకు; ద్వేష్యః=ద్వేషింపఁదగినవాఁడు; నాస్తి= లేఁడు. ప్రియః = ప్రీతిపాత్రమును; న=లేఁడు. అగ్నివంటివాఁడను నేను. ఎట్లు అగ్ని దూరస్థులకు శీతముఁ దొలఁగింపఁడో, సమీపము నొందు వారికిఁ దొలఁగించునో, అట్లు నేను భక్తుల ననుగ్రహింతును, ఇతరుల

* నన్ను.

* దీనికి మాధ్వభాష్యము లేదు.

ననుగ్రహింపను. యేతు = ఎవ్వరుమాత్రము; మామ్=నన్ను ఈశ్వరుని; భక్త్యా=భక్తితో; భజన్తి=భజించుచున్నారో. తే=వారు; మయి = నా యందు; స్వభావమువలననే యున్నారు. రాగమువలనఁ గాదు. తేషుచ=వారియందును; అహం=నేను; స్వభావమువలననే యున్నాను. ఇతరులయందుండను. ఇంతమాత్రమున వారియెడ నాకు ద్వేషములేదు.

నేను సర్వభూతములయందును సముఁడనై యున్నాను. నాకు ద్వేషింపఁదగినవాఁడు గాని ప్రేమించుపఁదగినవాఁడు గాని యెవ్వఁడును లేఁడు. అయినను, ఎవ్వరు నన్ను భక్తితో భజియింతురో వారు స్వభావమువలననే నాయందున్నారు. వారియందును నేను స్వభావమువలననె యున్నాను కాని యిందుకు రాగము నిమిత్తము గాదని తాత్పర్యము.

ఆ. భగవంతుఁడు రాగద్వేషవంతుఁడగుటచే ఈశ్వరుఁడు కాఁడని యాశంకించి పరిహరించుచున్నారు రాగేత్యాదిగా. అప్పుడు భగవద్భజనము నిష్ఫలంబని యాశంకించి చెప్పుచున్నారు అగ్నివంటివాఁడ నని. దానిఁ బ్రపంచించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. భక్తుల ననుగ్రహించుచు అభక్తుల ననుగ్రహింపకున్న భగవంతునకు ఎట్లు రాగద్వేషములు లేవనవచ్చును? అని యాశంకించి చెప్పుచున్నారు యేతు ఇత్యాదిగా. ఎవ్వరు వర్ణాశ్రమాదిధర్మములచే నన్ను భజించుచున్నారో వారచింత్య మగుమాహాత్మ్యముగల యాభజనముచేతనే పరిశుద్ధమయిన బుద్ధిగలవారలై నాయందు—నాసమీపమునందున్నారు, నాయభివ్యక్తికి యోగ్యమయినచిత్తము గలవార లగుచున్నారు. తుశబ్దము ఈవిశేషమును దెలుపుచున్నది. వారియందును—వారిసమీపమునందును నేనును స్వభావమువలననే యున్నాను, వారి ననుగ్రహించువాఁడ నగుచున్నాను. ఎట్లు వ్యాపకమయినను సూర్యునితేజస్సు స్వచ్ఛమయిన దర్పణాదికమునందుఁ బ్రతిఫలించుచున్నదో, అట్లు పరమేశ్వరుఁడు అనివార్యముగా భక్తిచే శుద్ధసత్త్వు లగుపురుషులయందు సన్నిధానము చేయుచున్నాఁడు, దైవి యగుప్రకృతిని బొందినవారు నన్ను భజింతు రని చెప్పియుండుటవలన నని యర్థము.

హ. అహమ్=నేను వాసుదేవుఁడను; సర్వభూతేషు = సర్వప్రాణులయందును; సమః=తుల్యమయినచిత్తము గలవాఁడను. నాకు ద్వేష్యుఁడు లేఁడు ప్రియుఁడు లేఁడు. యేతు; మామ్=నన్ను ఈశ్వరుని; భక్త్యా=ప్రీతిచే; భజన్తి=సేవించుచున్నా

రో. తే; మయి=నాయందు, ఈశ్వరునియందు; వసించుచున్నారు. నేనును వారియందు వసించుచున్నాను.

శ్లో ౦. పరమాత్మ భక్తులకు ముక్తి నిచ్చుచున్నాఁడు కాని యభక్తుల కియ్యఁడు. కావున "నిర్దోషం హి సమం బ్రహ్మ" అని పరమాత్మ సముఁ డని యేది చెప్పఁబడినదో అది మాటమాత్రమె. వైషమ్య ముండనేయున్నది. అని యాశంకింపఁగా, అట్లు కాదు. సర్వసముఁడైనను సూర్యుఁడు శీతకాలమునందుఁ దన్ను ఆవరణము లేనిప్రదేశమునకువచ్చి యెవ్వరు సేవించుచున్నారో వారికి శీతమును నశింపఁజేయుచున్నాఁడు కాని సేవింపనివారికి నశింపఁజేయఁడు. ఆవైషమ్యము సూర్యకృతము కాదు, మఱి యే మనఁగా పురుషకృతమే యగుచున్నది. అట్లే ప్రకృతమునందు నని సూచించుటకై చెప్పుచున్నాఁడు —సర్వభూతేషు=బ్రహ్మాదిస్తంబపర్యంతములగు సర్వప్రాణులయందును; అహమ్=నేను పరమాత్మను పరిపూర్ణుఁడను నిర్విశేషుఁడను; ఘటమఠాదులయం దాకాశమువలె, సమః = తుల్యమయిన స్వభావముగలవాఁడనే యగుచున్నాను, వాయువు మొదలగువానివలె విషముఁడను గాను. అందువలననే, నాకు ఎవ్వఁడును ప్రియుఁడు లేఁడు. ద్వేష్యః=అప్రియుఁడును; లేఁడు, "అప్రాణో హ్యమనాః శుభ్రః" అను శ్రుతివలన మనస్సు లేనివానికిఁ బ్రియాప్రియత్వభావన సంభవింపమివలన. ఓయీ! ప్రియాప్రియత్వభావన లేనియెడ నెట్లు కొందఱకుమాత్రము ముక్తి కలుగును, కొందఱకుఁ గలుగదు? అని యాశంకింపఁగా నది పురుషాధీనము కాని నాయధీనము కా దని చెప్పుచున్నాఁడు.—స్వప్రయత్నముచేతను తీవ్రమోక్షేచ్ఛచేతను శుభము లగుకర్మములనే బహుజన్మముల ననుష్ఠించి తత్పరిపాకమువలన శుద్ధాత్ములై సర్వమును సన్న్యసించి సద్గురుప్రసాదమువలన శ్రవణాదికముచేఁ బరతత్త్వము నెఱింగి, యే=ఏపురుషధౌరేయులు; భక్త్యా=అఖండవృత్తిచే. మాం భజన్తి = బ్రహ్మమే నే నని తన్నే పూర్ణరూపంబున నున్నవానిఁగాఁ జూచుచున్నారో యని యర్థము. తే=అబ్రహ్మనిష్ఠు లగుయతులు; స్వచ్ఛస్వభావు లగుటవలన సర్వదా, మయి = నాయందు ఆనందస్వరూప మయినబ్రహ్మమునం దున్నారు, నాయందు మద్రూపంబున నున్నా రని యర్థము. నేనును నిర్విశేషుఁడను బరిపూర్ణుఁడనైనను, తేషు=అబ్రహ్మవిదులయందు వారివృత్తికి సర్వదా నేత్రమునకు రూపమువలె విషయము నై యున్నాను. ఎట్లు సర్వవ్యాపకము సర్వసమ మయినను ఆకాశము స్వచ్ఛము లయిన జలదర్పణాదులయందుఁ బ్రతిఫలించుచున్నది, కాని గోడ మొదలగువానియందుఁ బ్రతిఫలింపదో అట్లు నేనును సాధువులందు భాసిల్లుదును, అసాధువులందు

భాసిల్లను. « తరతి శోక మాత్మవిత్ » అను శ్రుతివలన, ఎవ్వరు నన్నెఱుంగుదురో వారు ముక్తులు, ఎవ్వ రెఱుంగరో వారు బద్ధులు. పురుషప్రయత్నలభ్య మయిన మద్వేదనమే ముక్తికిఁ గారణము, తదభావము బంధమునకుఁ గారణము, కాని నేను గారణము కాను, గురువును గాఁడు, శాస్త్రమును గాదు. అందువలన నాసర్వసమత్వమునకు బాధ లేదని భావము. ఇందుచే, ఎట్లు శీతనివృత్తి పురుషప్రయత్న సాధ్యమో అట్లు సంసారముక్తియును బురుషప్రయత్నసాధ్యము, కాని తనయంత సిద్ధింపదు, కావున ముముక్షువులు ముక్తికొఱకు యత్నింపవలయు నని సూచిత మగుచున్నది.

మ. భక్తులనే యనుగ్రహింతువేని అభక్తుల ననుగ్రహింపవేని, అప్పుడు రాగద్వేషములు గలవాఁడ వెట్లు పరమేశ్వరుఁడ వగుదువు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—సర్వప్రాణులయందును, సమః=తుల్యుఁడను, స్వాభావిక మగుసద్రూపస్ఫురణ రూపానందరూపములచేతను ఔపాధిక మగునంతర్యామిత్వముచేతను. అందువలన నాకు ద్వేషవిషయము కాని ప్రీతివిషయము కాని యెవ్వఁడును లేఁడు, ఆకాశమండలవ్యాపి యగు సూర్యప్రకాశమునకుం బోలె. అప్పుడు భక్తాభక్తులకు ఫలవైషమ్య మెట్లు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యేతు; భజన్తి=సేవించుచున్నారో, మామ్; భక్త్యా=సర్వకర్మసమర్పణరూపముచేత. అభక్తులకంటె భక్తులకు విశేషము తెలుపుచున్నది తుశబ్దము. ఏది యావిశేషము? మయితే—ఎవ్వరు మదర్పితములగునిష్కామకర్మములచే శోధిత మయినయంతఃకరణము గలవారో వారు సమస్తరజస్తమోమలము వీడినదియు సత్త్వోద్రేకముచే నతిస్వచ్ఛము నగు నంతఃకరణమునందు సదా మదాకార మయినవృత్తిని ఉపనిషత్ప్రమాణముచేఁ బుట్టించుచున్నవారలై నాయందు వర్తించుచున్నారు. నేనును అతిస్వచ్ఛ మయిన తదీయచిద్వృత్తియందుఁ బ్రతిబింబితుఁడనై వారియం దున్నాను. చకార మవధారణార్థకము, వారే నాయందున్నారు వారియందే నేనున్నా నని. స్వచ్ఛ మయినద్రవ్యమున కిదియే గదా స్వభావము—దేనితో సంబంధము నొందునో తదాకారమును గ్రహించును. స్వచ్ఛద్రవ్యముతో సంబంధించిన వస్తువునకును ఇదియే స్వభావము—ఆస్వచ్ఛద్రవ్యమునం దది ప్రతిఫలించును. అట్లు అస్వచ్ఛద్రవ్యమునకుఁ గూడ నిదియే స్వభావము—తనయందు సంబంధించినదానియొక్కయు నాకారమును గ్రహింపదు. అస్వచ్ఛద్రవ్యసంబద్ధ మయినవస్తువునకుఁ గూడ నిదియే స్వభావము—దానియం దది ప్రతిఫలింపదు. ఎట్లు సర్వత్ర వ్యాపించియున్నదయ్యు సూర్యునిప్రకాశము స్వచ్ఛ

మగుదర్పణాదికమునందే యభివ్యక్తమగునో కాని యస్వచ్ఛమయినఘటాదికమునం దభివ్యక్తము కాదో, అంతమాత్రమున నది దర్పణమునందుఁ బ్రీతి గలదియు ఘటము నందు ద్వేషముగలదియుఁ గాదో, ఇట్లు సర్వత్రసముఁడ నైనను స్వచ్ఛమయినభక్త చిత్తమునం దభివ్యక్తిఁ బొందువాఁడను అస్వచ్ఛమగు నభక్తచిత్తమునం దభివ్యక్తిఁ బొందనివాఁడ నగు నేను ఎవ్వనియందును బ్రీతిగలవాఁడఁ గాను, ఎవ్వనియందును ద్వేషముగలవాఁడనుం గాను, సామగ్రీమర్యాదచేఁ బుట్టునట్టి కార్యము నాక్షేపింప నశక్య మగుటవలన. అగ్నివలెను కల్పవృక్షమువలెను గూడ అవైషమ్యము వ్యాఖ్యేయము.

శ్రీ. భక్తులకే మోక్షము నిత్తువు, అభక్తుల కియ్యవేని, అప్పుడు నీకును నేమి రాగద్వేషాదికృత మయిన వైషమ్యము గలదా? లే దని చెప్పుచున్నాఁడు.— నేను సర్వభూతములయందును సముఁడను, కావున నాకుఁ బ్రియుఁడును ద్వేష్యుఁడును లేఁడు. ఇట్లున్నను, యే మాం భజన్తి, ఆభక్తులు నాయందు వర్తింతురు. నేనును వారియం దనుగ్రాహకుఁడనై వర్తించుచున్నాను. ఇదిభావము.—ఎట్లు తన్ను సేవించువారికే తమశ్శీతాదిదుఃఖమును బోఁగొట్టునది యైనను అగ్నికి వైషమ్యము లేదో, ఎట్లు కల్పవృక్షమునకును లేదో, అట్లే భక్తపక్షపాతి నైనను నాకు వైషమ్యము లేదు, మ త్తే మనఁగా నాభక్తిదే యీమహిమ యని.

ప. భక్తులకొఱకే మోక్షము నిచ్చుచున్నావు కాని యభక్తుల కియ్యవు, దానిచే నీకును రాగద్వేషప్రయుక్త మగువైషమ్యము కలదనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అహమ్; సర్వభూతేషు; సమః=సమస్వభావుఁడను. కావున నాకు ద్వేష్యుఁడు గాని ప్రియుఁడుగాని యెవ్వఁడును లేఁడు. మ త్తే మనఁగా. యే మాం భక్త్యా భజన్తి; వారు నాయం దనుగ్రాహ్యులై యున్నారు, నేనును వారియం దనుగ్రాహకుఁడనై యున్నాను, ఎవ్వరు మఱి భజింపరో వా రున్నవా రున్నట్లె యున్నారు, నాయందు మాత్రము రాగద్వేషవ్యవస్థ లే దని యర్థము. “యే యథా మాం ప్రపద్యన్తే” అని మున్నే చెప్పఁబడినది. ఎట్లు మార్గమునం దున్న వృక్షమును గొందఱు ఫలార్థులు కొందఱు పుష్పార్థులు కొందఱు ఛాయార్థులై యాశ్రయించుచున్నారు, వారు తమ తమ యభిమతమును బొందుదురు, వృక్షమునకో యెవ్వరియందును ఉపేక్షగాని యపేక్షగాని లేదు, అట్లు. శ్రుతియును ఋగ్వేదమునందు.—“యా తే ధామాని పరమాణి యా ఽవమా యా మధ్యమా విశ్వకర్మన్నుతేమాః । శిక్షా సఖిభ్యో

హావిషి స్వధావ స్స్వయం యజస్వ తన్వం వృధానః" అని. భాష్యము—విశ్వకర్మన్=విశ్వములు—సమస్తము లయినకర్మములు ఎవ్వనికో అకో అతఁడు విశ్వకర్ముఁడు పరమేశ్వరుఁడు, ఓపరమేశ్వరుఁడా! తే=నీయొక్క, యాః=ఏవి, పరమాణి = ఉత్కృష్టము లయిన, ధామాని=దేవశరీరములును, యాః=ఏవి, అవమాః=అధమము లయిన పశ్వాదిశరీరములును, యాః=ఏవి, మధ్యమా = మధ్యమము లయినమనుష్యశరీరములును కలవో; వాసిలో, సఖిభ్యః=అనుకూలము లయిన వానికొఱకు, శిక్షా=జ్ఞానోపదేశమును, అట్లు, హావిషి=ప్రలయకాలమునందు హోతవ్యముగా సంభవించినపుడు, ప్రతికూల మయిన జీవజాతమునందు, వః=మీరు, స్వధా = తనయందు ప్రియతే—ధరింపఁబడుచున్నది—ఆరోపింపఁబడుచున్నది కావున మాయ అజ్ఞానమును, ఇది తనయంతనే ప్రాప్తము యున్నది. నీవో, తన్వః=శరీరమును, వృధానః=వృద్ధిపొందించుచు—ప్రకటీకరించుచు, యజస్వ=భజింపుము, అనుగ్రహింపు మని యర్థము.

రా. ఉత్కృష్టమును లోకాతీతము నగు నా యీస్వభావమును వినుము:—దేవతిర్యఙ్మనుష్యస్థావరరూపంబున జాతిచేతను ఆకారముచేతను స్వభావముచేతను జ్ఞానముచేతను అత్యంతము నుత్కృష్టములును అపకృష్టములునై వర్తించుచున్న సర్వభూతములయందును సమాశ్రయణీయత్వంబున సముఁడను నేను. ఇతఁడు జాత్యాకార స్వభావజ్ఞానాదుల నికృష్టుఁ డని సమాశ్రయణమునందు నాకు ద్వేష్యుఁడు లేఁడు—జుగుప్సపడి విడువఁదగినవాఁడు లేఁడు. అట్లు, సమాశ్రితత్వాతిరేకము సంజేసి జాత్యాదుల నత్యంతోత్కృష్టుఁ డితం డని తత్సంబంధముచే సమాశ్రయణంబున నాకుఁ బ్రియుఁ డెవ్వఁడును లేఁడు—గ్రహింపఁదగినవాఁడు లేఁడు. మఱే మనఁగా, అత్యంతము నేనే ప్రియుఁడుగాఁ గలవార లగుటచే నన్ను భజించుటవలనం గాని యాత్మధారణము లభింపక మద్భజనమే ప్రయోజనముగాఁ గలవా రెవ్వరు నన్ను భజించుచున్నారో వారు జాత్యాదులచే నుత్కృష్టులు గాని యపకృష్టులు గాని మత్సమానగుణులుం బోలె సుఖముగా నాయందే వర్తించుచున్నారు. నేనును వారియందు నాకన్న నుత్కృష్టులయందుం బోలె వర్తించుచున్నాను.

మా. అప్పుడు స్నేహాదులు గలవాఁడ వగుటవలన అల్పభక్తునకును ఒకానొకనికి బహుఫల మిత్తువు, విపరీతునకుఁ గూడ నొకానొకనికి విపరీతము నిత్తువు. అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు. సమోఽహ మ్మని. అప్పుడు భక్తి ప్రయోజనము కా దనఁగాఁ జెప్పుచున్నాఁడు యేభజ న్తీత్యాదిగా. మయితే తేషుచా

ఉప్యహమ్—నాకు వారు వశులు, వారలకు నేను వశుఁడను. చెప్పఁబడినదిగూడ పైం గశిలములందు.—« యేభజన్తే పరమం పుమాంసం తేషాం వశ స్తతు తే తద్వశా”స్చ ♦ అని. అతనికి వశులే వారు సర్వదా, అయినను బుద్ధిపూర్వాబుద్ధిపూర్వభావంబున భేదము. ఉద్ధవాదులవలెను శిశుపాలాదులవలెను. అదియుఁ జెప్పఁబడిన దచ్చటనే.—« అబుద్ధిపూర్వాద్యో వశ స్తస్య ధ్యానా త్పునర్వశో భవతే బుద్ధిపూర్వమ్ ” * అని.

అపి చే త్సుదురాచారో భజతే మా మనన్యభాక్
సాధు రేవ స మన్తవ్య స్సమ్య గ్వ్యవసితో హి సః. ౩౦

భా. వినుము నాభక్తియొక్క మాహాత్మ్యమును.—సుదురాచారః అపి = మిక్కిలియు దురాచారుఁడు, నిందిత మయినయాచారము గలవాఁడయినను; అనన్యభాక్=ఇతరమును బొందనివాఁడై, అనన్యభక్తియై; మామ్=నన్ను; భజతేచేత్=భజించునేని; సః=అతఁడు; సాధురేవ=మంచియాచారము గలవాఁడుగానే; మన్తవ్యః = ఎఱుంగఁబడవలయును. హి=ఎందువలననఁగా; సః=అతఁడు; సమ్యక్ వ్యవసితః=చక్కఁగా వ్యవసితుఁడు, చక్కనినిశ్చయము గలవాఁడు.

దురాచారసంపన్నుఁడైనను అనన్యభక్తిని నన్ను భజించునేని అతఁడు సదాచారసంపన్నుఁడే యని యెఱుంగవలయును. ఏలయనఁగా, అతఁడు చక్కని నిశ్చయము గలవాఁడని తాత్పర్యము.

శ్రీ. ప్రకృత మయినభగవద్భక్తిని స్తుతించుచుఁ బాపులకుఁ గూడ నం దధికారము కల దని సూచించుచున్నారు వినుము ఇత్యాదిగా. మంచియాచారము గలవాఁడుగానే యెఱుంగఁబడవలయు ననుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన నఁగా నిత్యాదిగా.

హ. సుదురాచారోఽపి; మామ్=నన్ను ఈశ్వరుని; భజతేచేత్; అనన్యభాక్=ఇతరమును భజింపనివాఁడై. సాధురేవ = ధార్మికుఁడుగానే; సః; మన్తవ్యః= ఎఱుంగఁబడవలయును. ఎందువలన ననఁగా. పురుషార్థమునందు, సమ్యక్ వ్యవసితః=

♦ ఎవ్వరు పరమపురుషుని భజించుచున్నారో వారలకతఁడు వశుఁడు వారును అతనికి వశులు.

* అబుద్ధిపూర్వముగా నెవ్వఁడు వశుఁడో అతఁడు ఆభగవంతుని ధ్యానించుటవలన వెండియు బుద్ధిపూర్వముగా వశుఁ డగుచున్నాఁడు.

శోభన మయినవిశ్చయము గలవాఁడు. అందువలన ధార్మికుఁడే యతఁడని యెఱుంగ వలయు నని యభిప్రాయము.

శ్లో ౧. రాజవిద్యా అనువిశేషణముచే సూచింపఁబడినదానిని బ్రహ్మవిద్యావ్యతిరిక్తంబు లగు సకలవేదశాస్త్రాధ్యయనసముత్పన్నంబు లయినవిద్యలకు బంధకత్వమును « మోఘాశాః, త్రైవిద్యా మామ్ » ఇత్యాది స్థలమునందుఁ బ్రతిపాదించి, బ్రహ్మ విద్యకు మోక్షప్రదత్వంబును « మహాత్మనస్తు, యాన్తి మద్యాజినో ఽపి మామ్ » ఇత్యాదిస్థలమునం బ్రతిపాదించి యిప్పుడు « పవిత్ర మిద ముత్తమమ్ » అని జ్ఞానము నకుఁ బావనతమత్వ మేది చెప్పఁబడినదో దాని విశదీకరించుచున్నాఁడు.—ఎవ్వఁడు బ్రాహ్మణుఁడుగాని క్షత్త్రియుఁడుగాని యితరుఁడుగాని, సుదురాచారో ఽపి=జాతిచేఁ గాని వర్ణముచేఁ గాని క్రియచేఁ గాని స్వభావముచేఁ గాని మిక్కిలియు దుష్ట మయిన ఆచారము—నడవడి గలవాఁడు, పాపిష్ఠుఁడే యగునుగాక. చేత్=అట్లయినను; జన్మాంతరీయ పుణ్యాకర్షాతిశయముచే సద్గురుప్రసాదమువలనఁ బరతత్త్వము నెఱింగి తాను, అనన్యభాక్=అన్యమును—అనాత్మస్వరూపమును కర్తృత్వభోక్తృత్వాది ధర్మవిశిష్టము నగు దేహేంద్రియాదికమును ఆత్మనుగా భజించువాఁడు అన్యభాక్కు, చిత్తప్రసాదము చేఁ గలిగిన యాత్మ యాథాత్మ్యవిజ్ఞానముచే నట్టివాఁడు కాఁడు కావున అనన్యభాక్, అనన్యభాక్కై; మామ్=పరబ్రహ్మమును; భజతే=బ్రహ్మమే నే నని యవిక్రియ మగు బ్రహ్మమునుగానే సదా తన్ననుసంధించుచున్నాఁడో. సః=ఆబ్రహ్మవిదుఁడు; సమ్యగ్దార్థము నెఱింగినవాఁ డగుటవలన సదాచారవంతుఁ డగుటచే, సాధురేవ = సత్పురుషుఁడే యని; పండితులచే, మన్తవ్యః = ఇతఁడు పాపి దురాచారుఁ డను పూర్వబుద్ధిని విడిచి బ్రహ్మవిదుఁ డితఁడు పుణ్యతముఁ డని యెఱుంగఁబడవలయు నని యర్థము. అతఁడు పుణ్యతముఁ డనుటనే నిశ్చయించుచున్నాఁడు.—హి=ఏకారణమువలన; సః= ఆపురుషుఁడు; సమ్యగ్వ్యవసితః=వ్యవసీయతే—నిశ్చయింపఁబడుచున్నది దీనిచేత కావున వ్యవసిత మనఁగా తత్త్వనిశ్చయాత్మక మయినవిజ్ఞానము, సమ్యక్—సరియైన మయిన వ్యవసితము—జాతివర్ణ తద్ధర్మ తత్కర్మ సంబంధశూన్యము ఆకాశమువలె నతినిర్మలము నిష్క్రియము నిత్యముక్తస్వభావ మగుపరబ్రహ్మ మేది గలదో అదియే నే నని తత్త్వసాక్షాత్కారజనిత మయిన యాత్మస్వరూప నిశ్చయము గలవాఁడు సమ్యగ్వ్యవసితుఁడు. ఎందువలన సమ్యగ్దర్శనసంపన్నుఁడో అందువలన నతని సాధువే యని యందఱు నెఱుంగవలయును బూజింపను వలయు నని భావము. « న వాసుదేవ భక్తానామ్, న మే భక్తః ప్రణశ్యతి » ఇత్యాది వాక్యార్థము విచారింపఁగా దీని

కర్థము నిట్లునుం జెప్పవచ్చును.—అపిచేత్ సుదురాచారః=బ్రహ్మనిష్ఠుఁడు—బ్రహ్మవిదుఁ డగుయతి తాను భ్రమప్రమాదములవలన సుదురాచారుఁడు మిక్కిలి నిందితమయిన యాచారము గలవాఁ డగునేనియు, ఏకాకియు మౌనియునై భిక్షాటనము సేయుచు అభిశస్తపతితాదులయన్నము భక్షించుటచేతఁ గాని దేశకాలవైషమ్యంబున దుష్టమయినయన్నము భక్షించుటచేఁ గాని చండాలాది సంపర్కముచేఁ గాని అత్యంత దోషి యగునేనియు; అట్లయినను, అనన్యభాక్=విషయాకారమును భజించుచున్నది కావున భాక్ అనఁగా వృత్తి, అన్యము మద్వ్యతిరిక్తము విషయము దేనికి లేదో అది అనన్యము, విషయాకారశూన్య మయిన భాక్కు—వృత్తిగలవాఁడై; "అహ మన్న మహ మన్న మహ మన్నాదో ఽహ మన్నాదః" ♦ ఇత్యాదిశ్రుతిచే దాతయు దానంబును దేయంబును భోక్తయు భోజ్యమును భోజనమును సర్వంబును నేనే బ్రహ్మమే యని సర్వత్ర బ్రహ్మదృష్టి గలవాఁడై యెవ్వఁడు; మామ్—నిర్విశేష మగు పరబ్రహ్మమును; భజతే=ప్రత్యగ్దృష్టిచే నిదియంతయు నేనును బ్రహ్మమే యని యను సంధించుచున్నాఁడో. ఇట్లు సర్వంబును తానును బ్రహ్మమాత్రమే యని యనుసంధించువాఁ డగుటవలన, సః=ఆబ్రహ్మవిదుఁడు; సాధు రేవ=శుద్ధుఁడే యని; పండితులచే, మన్తవ్యః=ఎఱుంగఁబడవలయు నని యర్థము. ఓయీ! వానికిఁ దగినప్రాయశ్చిత్తము లేకయుండఁగా నెట్లు శుద్ధుఁడే యని యెఱుంగవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— సమ్యగ్వ్యవసితః = "ఆత్మ లాభాన్న పరం విద్యతే, సమ్యగ్దర్శన సంపన్నః కర్మభి ర్న నిబధ్యతే । దర్శనేన విహీనస్తు సంస్కారం ప్రతి పద్యతే॥ ప్రాయశ్చిత్తం బ్రహ్మ విదో యతేస్తు బ్రహ్మ వేదనమ్ । దోషప్రసక్తా వన్యత్ర శాస్త్రదృష్టం విధీయతే॥ అతిపాప ప్రసక్తో ఽపి ధ్యాయ న్నిమిష మచ్యుతమ్ । భూయ స్తపస్వీ భవతి పఙ్క్తి పావన పావనః॥ ప్రాయశ్చిత్తాన్య శేషాణి తపః కర్మాత్మకానివై । యాని తేషా మశేషాణాం కృష్ణాను స్మరణం పరమ్॥ యది కుర్యా త్ప్రమాదేన యోగీ కర్మ విగర్హితమ్ । యోగేనైవ దహే దంహో నాన్య త్తత్ర కదాచన॥ స్వే స్వే ఽధికారే యా నిష్ఠా సగుణః పరికీర్తితః । విపరీతస్తు దోషస్స్యా దుభయో రేష నిశ్చయః" *

---

♦ నేనే యన్నము నేనే యన్నము నేనే అన్నము దినువాఁడను నేనే యన్నము తినువాఁడను.

* ఆత్మలాభముకన్నను అధికము లేదు, సమ్యగ్దర్శనసంపన్నుఁడు కర్మములచే బంధింపఁబడఁడు, జ్ఞానము లేనివాఁడుమాత్రము సంస్కారము నొందుచున్నాఁడు. బ్రహ్మవిదుఁ డగుయతికి మాత్రము బ్రహ్మజ్ఞానమే ప్రాయశ్చిత్తము, ఇతరులయందు దోషము సంభవించినపుడు శాస్త్రోక్తము విధింపఁబడును. మిక్కిలి పాపమునందుఁ దగిలినవాఁడైనను నిమిషము అచ్యుతుని ధ్యానించినచో వెండియు తపస్సంపన్నుఁడును పంక్తిపావనుఁడును పావనుండు నగుచున్నారు. తపఃకర్మాత్మకము లయిన సర్వప్రాయ

ఇత్యాదివచనములచే జ్ఞానికి జ్ఞానమే ప్రాయశ్చిత్తమని మన్వాదుల నిశ్చయం బేది గలదో అట్టి సమీచీన మయినవ్యవసితము—నిశ్చయము గలవాఁడు, సమీచీన మయినప్రాయశ్చిత్తము గలవాఁడే యని యర్థము. “తదధిగమ ఉత్తర పూర్వాఘయో రశ్లేషవినాశౌ ♦, యథా పుష్కర పలాశ ఆపోనశ్లిష్యన్త ఏవ మేవంవిది పాపం కర్మ నశ్లిష్యతే, న లిప్యతే కర్మణా పాపకేన, ఉభే హ్యేవైష ఏతే తరతి” * ఇత్యాదిశ్రుతి ప్రసిద్ధిని దెలుపుచున్నది హిశబ్దము. అతిపాప ప్రసక్తోఽపి అను వచనమున కిది యర్థము.—అతిపాప ప్రసక్తోఽపి=బ్రహ్మవిదుఁ డగుయతి భ్రమప్రమాదముల వలనఁ గాని దేశకాల వైషమ్యమువలనఁ గాని దుష్టమయినయన్నము భక్షించుట యను నత్యంతపాపమును జేసినవాఁ డైనను, నిమిషస్ = అర్ధక్షణము, అచ్యుతస్= నిత్యకూటస్థుఁడు నసంగుఁ డగునాత్మను, ధ్యాయన్—“అకర్తా ఽహ మభోక్తా ఽహ మవికారో ఽహ మక్రియః” అని తన్నుఁ గర్తృకరణకార్యములకన్న భిన్నమై నిష్క్రియమే యగుపరబ్రహ్మమునుగాఁ జూచుచు నని యర్థము, భూయః తపస్వీ భవతి—“శుచిదీ సర్షి వ్రతినో వనస్థాశ్చ తపస్వినః” అను నిఘంటువువలన వెండియు తపస్వీ—శుచి యగుచున్నాఁడు, లేక, తపస్సంపన్నుఁ డగుచున్నాఁడు. ఓయీ! బ్రహ్మజ్ఞానముచే శుద్ధుఁడే యగుచున్నాఁడు, అయినను అతఁడు సవ్యవహారమునకు యోగ్యుఁడు కాఁడు అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—పఙ్క్తిపావనపావనః = ఎవ్వరు త్రిసుపర్ణము పఠింతురో ఎవ్వరు చతుర్వేదులో మఱియు నెవ్వరు చయనవాజపేయాది మహాక్రతువులు చేసినవారలో వారందఱు పఙ్క్తిపావనులు, వారినిగూడ నితఁడు పూజానమస్కారాదులచే పునాతి—పవిత్రులనుగాఁ జేయుచున్నాఁడు కావున పఙ్క్తి పావనపావనుఁడు, అందఱిచేతను బూజ్యుఁడు నగుచున్నాఁ డని యర్థము. ప్రాయశ్చిత్తాని అనుశ్లోకమున కిది యర్థము.—యాని=ఏ; అశేషాణి సమస్తములయిన, ప్రాయ

శ్చిత్తము లేవి గలవో వాని యన్నిటికన్నను కృష్ణానుస్మరణం బధికము. యోగి యగువాఁడు ప్రమాదంబున నిందిత మయినకర్మము చేయునేని ఆపాపమును యోగముచేతనే దహించుచున్నాఁడు, ఇతర ప్రాయశ్చిత్తము దాని కెన్నఁడును వలదు. తనతన యధికారమునందు నిష్ఠ యేదిగలదో అది గుణమని చెప్పఁబడినది, విపరీతము దోషము, ఇది గుణదోషనిశ్చయము.

♦ బ్రహ్మసూ. అ-౪. పా-౧. సూ-౧౩. తదధిగమే = బ్రహ్మజ్ఞానము కలిగినపిమ్మట, ఉత్తర పూర్వాఘయోః=ఆగామిసంచితపాపములకు, అశ్లేషవినాశౌ=అసంబంధమును వినాశమును అగును, ఆగామి పాపముతో సంబంధము కలుగదు, సంచితపాపము నశించు నని తాత్పర్యము.

* ఎట్లు తామరాకునందు నీరు అంటదో అట్లు ఇట్టిజ్ఞానియందుఁ బాపకర్మ మంటదు, పాప మగుకర్మముతో నంటఁడు, పుణ్యపాపములను రెంటిని ఇతఁడు తరించుచున్నాఁడు.

శ్చిత్తాని తపఃకర్మాత్మకాని=కృచ్ఛ్రాతికృచ్ఛ్ర మహాకృచ్ఛ్ర చాంద్రాయణాదులు తపోరూపములు వాజపేయ రాజసూయాశ్వమేధాదులు కర్మరూపములు కలవో, వై అనునది ప్రసిద్ధ్యర్థకము, శాస్త్రప్రసిద్ధము లని యర్థము, తేషామ్ అశేషాణామ్ = ఆసమస్త ప్రాయశ్చిత్తముల కన్నను, పంచమ్యర్థమున షష్ఠి, కృష్ణానుస్మరణమ్ = "కృషి ర్భూవాచక శ్శబ్దో ణశ్చ నిర్వృతి వాచకః। తయో రైక్యం పరం బ్రహ్మ కృష్ణ ఇత్యభిధీయతే" ♦ అను స్మృతివలన కృష్ణుఁ డనఁగా సదానందరూపుఁడు పరమాత్మ యగు పరబ్రహ్మము, అతని యనుస్మరణము—అవిక్రియ మగు బ్రహ్మమే నే నని గురూపదేశానుసారంబున స్వస్వరూపమున ననుభవించుటయే, పరమ్=ఉత్కృష్టతమము సుకరము నగు ప్రాయశ్చిత్తము. దీని కిది యభిప్రాయము.—ఏ పాపము నుద్దేశించి కృచ్ఛ్రాదికము చేయఁబడునో దానిచే నా పాపమే నశించుచున్నది, సంచితముగాని యాగామిగాని యితరము నశింపదు; కృష్ణానుస్మరణమో "అహం బ్రహ్మేతిమాం ధ్యాయ న్నేకాగ్ర మనసా స కృత్, సర్వం తరతి పాప్మానం కల్పకోటి శతైః కృతమ్" * అను న్యాయంబున శతకోటికల్పార్జితము లయిన భూతభవిష్యద్వర్తమానము లగు పాపములను పుణ్యములను సమస్తమును దహించి మోక్షము నిచ్చుచున్నది, కావున బ్రహ్మానుసంధానము సర్వోత్తమ మయిన ప్రాయశ్చిత్తము అని.

మ. మఱియు సమునియందును వైషమ్యముఁ గలిగించునన్నది యేది గలదో అది నాభక్తియొక్క మహిమయే. వినుము దాని మహిమను —ఎవ్వఁడైనను, సుదురాచారో ఽపిచేత్; అజామిలాదులవలె అనన్యభక్తియై నన్ను భజించుచున్నాఁడో యేదోయొక భాగ్యోదయమువలన. అతఁడు మున్ను అసాధువైనను సాధువే యని తలంపవలయును. హి=ఎందువలన ననఁగా; అతఁడు, సమ్యగ్వ్యవసితః=సాధు నిశ్చయము గలవాఁడు.

శ్రీ. మఱియు మద్భక్తిప్రభావ మచింత్యం బని తెలుపుటకై చెప్పుచున్నాఁడు.—మిక్కిలి దురాచారము గలవాఁడైనను నరుఁడు భేదంబున దేవతాంతరభక్తిని జేయక నన్నే శ్రీనారాయణుని భజించునేని, అప్పుడు అతఁడు సాధు రేవ=శ్రేష్ఠుఁడే

♦ కృషి యనఁగా భూమి యని యర్థము, ణ అనఁగా దానికి సుఖముఁగలిగించునది, ఆ రెండక్షరముల యైక్యము కృష్ణుఁ డని పరబ్రహ్మము చెప్పఁబడుచున్నది.

* నేనే బ్రహ్మ మని నన్ను ఒకమాఱు ఏకాగ్ర మగుమనంబున ధ్యానించినవాఁ డు కల్పకోటిశతంబులఁ జేయఁబడిన సర్వపాపమును తరించుచున్నాఁడు.

యని, మన్తవ్యః, ఏందువలననఁగా, అతఁడు సమ్యగ్వ్యవసితః=పరమేశ్వరుని భజిం చుటచేతనే కృతార్థుఁడ నయ్యెద నని శోభన మయినవిశ్చయము గలవాఁడు.

ప॥ మఱియు మద్భక్తిమహిమ యచింత్యం బని చెప్పుచున్నాఁడు.— అత్యంతము దురాచారుఁ డైనను నన్ను భజించునేని. ఎట్టివాఁడై? అనన్యభా —నాకన్నను ఇతర మయినదేవతాంతరమును భజింపనివాఁడై. ఎందువలన ననఁగా, తత్పాపపరిహారసమర్థుఁడ నగు నాయందు నిశ్చయము చేసినవాఁడు.

రా॥ అందును.—ఆయా జాతివిశేషమునందుఁ బుట్టినవారి కేయాచారము గ్రాహ్యమో యేది త్యాజ్యమో దాని నతిక్రమించినవాఁడైనను జెప్పినవిధంబున అనన్యభాక్—భజనమే ప్రయోజనముగాఁ గలవాఁడై నన్ను భజించునేని సాధు రేవసః—అతఁడు వైష్ణవాగ్రేసరుఁ డనియే; మన్తవ్యః=బహుమానింపఁబడవలయును, మున్ను చెప్పినవారితో సమానుఁ డని యర్థము. ఎందువలన? సమ్యగ్వ్యవసితోహి సః—వీనివ్యవసాయము మిక్కిలి సమీచీనము. భగవంతుఁడు నిఖిల జగదేకకారణ భూతుఁడు పరబ్రహ్మము నారాయణుఁడు చరాచరపతి యస్మత్స్వామి నాకు గురువు నాకు సుహృదుఁడు నాకుఁ బరమభోగ్యం బని సర్వదుష్ప్రాప మయిన యీవ్యవసా యము వానిచేఁ జేయఁబడినది. తత్కార్య మయినయనన్యప్రయోజన మగు నిరం తరభజనంబును వానికిఁ గలదు. కావున నతఁడు సాధువే, బహుమానింపవలసిన వాఁడు గూడ. ఈవ్యవసాయంబును తత్కార్య మయిన యట్టిభజనంబును గలిగినపుడు వానికి ఆచార వ్యతిక్రమము స్వల్పవైకల్యమే కావున నంతమాత్రమున అనాదర ణీయుఁడు కాఁడు. మ త్తే మనఁగా బహుమానింపవలసినవాఁడే యని యర్థము.

మా॥ ప్రాయికముగా సుదురాచారుఁడు భగవద్భక్తుఁడు కానేకాఁడు, అయి నను బహుపుణ్యమున నెట్లని భగవద్భక్తుఁ డగునేని, అప్పు డతఁడు సాధు వనియే తలంపవలయును.

క్షిప్రం భవతి ధర్మాత్మా శశ్వచ్ఛాన్తిం నిగచ్ఛతి
కౌన్తేయ ప్రతిజానీహి న మే భక్తః ప్రణశ్యతి. ౩౧

భా॥ బాహ్య మయినదురాచారతను విడిచి యంత స్సమ్యగ్వ్యవ సాయ సామర్థ్యమువలన.—క్షిప్రమ్=శీఘ్రముముగా; ధర్మాత్మా=ధర్మచిత్తుఁ డే; భవతి=అగుచున్నాఁడు. శశ్వత్=నిత్యమయిన; శాన్తిమ్ = ఉపశమ

మును; నిగచ్ఛతి=పొందుచున్నాఁడు. వినుము పరమార్థమును. కౌన్తేయ= అర్జునా! ప్రతిజానీహి = నిశ్చిత మయినప్రతిజ్ఞను జేయుము. మే=నా యొక్క; భక్తః = భక్తుఁడు, నాయందు సమర్పింపఁబడిన యంతరాత్మ గలవాఁడు నాభక్తుఁడు; నప్రణశ్యతి=నాశమునొందఁడు అని.

అట్లు అంతఃకరణంబున సమ్యగ్వ్యవసాయము గలవాఁ డగుటవలన నతఁడు శీఘ్రమున ధర్మాత్ముఁ డగును. బాహ్య మయినదురాచారమునుండి నిత్యము నుపరమించును. అర్జునా! నాభక్తుఁ డెట్టివాఁ డైనను నాశము నొందఁ డని నీవు దృఢముగాఁ బ్రతిజ్ఞ చేయు మని తాత్పర్యము.

ఆ. హేత్వర్థమునే ప్రపంచించుచున్నాడు బాహ్యము ఇత్యాదిగా. భగవంతుని భజించువాని కెట్లు దురాచారత తొలంగును? అని యాశంకించి చెప్పుచున్నారు క్షిప్ర మిత్యాదిగా. దురాచార ముండునప్పుడు ధర్మచిత్తుఁ డెట్లగును? అనఁగాఁ జెప్పుచున్నారు శశ్వత్ ఇత్యాదిగా. ఉపశమము దురాచారమునుండి యుపరతిని. ఎట్లు నీభక్తుఁడు దురాచారమునుండి యుపరమించు నని చెప్పవచ్చును? దురాచారముచే నుపహత మయినచిత్తము గలవాఁ డగుటచే నేల యతఁడు నాశము నొందఁడు? అని యాశంకించి చెప్పుచున్నారు వినుము ఇత్యాదిగా.

హ. క్షిప్రమ్=శీఘ్రముగా; ధర్మాత్మా = ధర్మస్వరూపుఁడు; భవతి=అగుచున్నాఁడు. శశ్వత్=నిత్యమయిన; శాన్తిమ్=మోక్షరూప మయినశాంతిని; నిగచ్ఛతి= పొందుచున్నాఁడు.

శం. కృచ్ఛ్రచాంద్రాయణాశ్వమేధాదు లగుతపఃకర్మాత్మకము లయిన ప్రాయశ్చిత్తములను జేయుదురుగాక. అట్లయినను, అవి యథావిధిగా దేశకాలద్రవ్యమంత్రతంత్రాదినియమంబు తప్పక యనుష్ఠించిననే శుద్ధి సిద్ధించును, అందును షడ్రాత్ర ద్వాదశరాత్ర పక్ష మాస సంవత్సరాది కాలవ్యవధానంబున దీర్ఘకాలమునకు శుద్ధి కలుగును. అదియుఁ బరోక్షము. భగవద్ధ్యానముచే నట్లు కా దని చెప్పుచున్నాఁడు.— బ్రహ్మవిదుఁ డగుయతి, క్షిప్రమ్=శీఘ్రముగనే, ఉత్తరక్షణమునందే, ప్రత్యగ్వృత్తిచేఁ దా నవిక్రియబ్రహ్మాత్ముఁ డని మెఱింగినప్పుడే; ధర్మాత్మా = పుణ్యాత్ముఁడు, శుద్ధుఁడు; భవతి—అందు నియమము దప్పకుండుటగాని దీర్ఘకాలముగాని పాపనివృత్తి కావశ్యకము కాదు, పరోక్షతయు లే దని యర్థము. ఇంతమాత్రమే కాదు, మ తే మనఁగా.— శశ్వత్=శాశ్వతమయిన; శాన్తిమ్=ముక్తిని; నిగచ్ఛతి—పునరావృత్తిరహిత మయిన

విదేహముక్తిని బొందనే పొందుచున్నాఁడు. వి అను నుపసర్గము నిశ్చయార్థకము. బ్రహ్మవిద్యలకు నడుమ వచ్చుదోషవిశేషములచే ముక్తి ప్రతిబద్ధము కానే కాదని ప్రతిజ్ఞ చేయుమని చెప్పుచున్నాఁడు — కౌన్తేయ! బ్రహ్మమే నేనని జ్ఞానయోగబలంబున బ్రహ్మభావమును భజించుచున్నాఁడు కావున భక్తుఁ డనఁగా బ్రహ్మవిదుఁడు, మే=నాయొక్క; భక్తః=బ్రహ్మనిష్ఠుఁడు బ్రహ్మవిదుఁ డగుయతి; న ప్రణశ్యతి=నడుమ సంభవించు బ్రహ్మనిష్ఠావిఘ్నదోషంబున దుర్గతినిగాని దుర్యోనినిగాని పొందఁడు, మఱేమనఁగా, విఘ్నకోటుల నెల్లను నా యనుగ్రహంబుచేతను మన్నిష్ఠతను నివారించి విదేహముక్తిని తప్పక పొందుచున్నాఁడు, ఇందు సందేహము లేదు. ఈయర్థమునందు, ప్రతిజానీహి=భగవద్భక్తుఁడు బ్రహ్మవిదుఁడు నశింపఁ డని ప్రతిజ్ఞను జేయుము. « యోగక్షేమం వహామ్యహ » మ్మని నేను బ్రతిజ్ఞ చేయుటవలన, [illegible] బ్రహ్మవిదులు బ్రహ్మనిష్ఠు లగువారికి విఘ్నములచే ముక్తి ప్రతిహతము కాదని గజఘంటాఘోషంబునఁ జాటింపుమని యర్థము.

వ్యా. ఈ సమ్యగ్వ్యవసాయమువలననే యతఁడు దురాచారమును విడిచి.— బహుకాలము అధర్మాత్ముఁ డైనను మద్భజనమహిమముచేత, క్షిప్రమ్=శీఘ్రముగనే; ధర్మాత్మా = ధర్మము ననుసరించు చిత్తము గలవాఁడు; భవతి—దురాచారమును శీఘ్రముననే విడిచి సదాచారము నవలంబించుచున్నాఁ డని యర్థము. మఱియు, శశ్వత్=ఎల్లప్పుడును; శాన్తిమ్ = విషయభోగములందు స్పృహ లేమిని; నిగచ్ఛతి = మిక్కిలి పొందుచున్నాఁడు, అతివైరాగ్యమువలన. ఒకానొకఁడు నీభక్తుఁడు మున్నభ్యసించిన దురాచారమును విడువక ధర్మాత్ముఁడు కాకపోవచ్చును, అప్పు డతఁడు నష్టుఁడే యగును. అనఁగా కాఁడని చెప్పుచున్నాఁడు భక్తానుకంపాపరవశుఁ డగుటచేఁ గోపము నొందినవాఁడపోలె భగవంతుఁడు.—ఇది యాశ్చర్యముగాఁ దలంపకుము, ఓకౌన్తేయుఁడా! నిశ్చితంబే యిది నాభక్తిమాహాత్మ్యము. కావున విరుద్ధముగాఁ దలంచువారిముందు గూడ నీవు, ప్రతిజానీహి=వారిని ధిక్కరించి గర్వముతోఁ బ్రతిజ్ఞ చేయుము. మే=నాయొక్క, వాసుదేవునియొక్క; భక్తః=భక్తుఁడు; మిక్కిలి దురాచారము గలవాఁ డైనను ప్రాణసంకటము గలవాఁ డైనను తా నయోగ్యుఁ డై యున్న భవస్థుఁడును బ్రార్థించువాఁ డైనను అతిమూఢుఁ డైనను దిక్కులేనివాఁ డైనను, న ప్రణశ్యతి. మఱే మనఁగా కృతార్థుఁడే యగునని. దృష్టాంతములు అజామిళ ప్రహ్లాద ధ్రువగజేం

ప్రాదులు ప్రసిద్ధులే గదా! శాస్త్రము గూడ "న వాసుదేవ భక్తానా మశుభం విద్యతే క్వచిత్" § అని.

శ్రీ. ఓయీ! ఎట్లు సమీచీనాధ్యవసాయమాత్రంబున సాధువనుగాఁ దలంపవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—దురాచారుఁ డైనను నన్ను భజించుచు శీఘ్రంబున ధర్మచిత్తుఁ డగుచున్నాఁడు. అంత, శశ్వచ్ఛాన్తిమ్ = శాశ్వత మయినయుపశాంతిని, పరమేశ్వరనిష్ఠను; నిగచ్ఛతి = మిక్కిలి పొందుచున్నాఁడు. కుతర్కములచేఁ గఠినముగా వాదించువారు దీని నంగీకరింపరని శంకావ్యాకులుం డగునర్జునునిఁ బ్రోత్సాహపఱచుచున్నాఁడు.—ఓకౌంతేయుఁడా! పటహకాహలాది మహాఘోషములతో నీవు వివాదముసేయువారి సభకుఁ బోయి చేయియెత్తి నిశ్శంకముగా, ప్రతిజానీహి=ప్రతిజ్ఞను జేయుము. ఏమని? మే=నాయొక్క, పరమేశ్వరుని యొక్క; భక్తః సుదురాచారుఁ డైనను, న ప్రణశ్యతి. నశించఁడు, కృతార్థుఁడే యగు నని. అంత వారు నీప్రౌఢిమవిజృంభణముచేఁ గుతర్కముల విడిచి నిస్సంశయముగా నిన్నే గురువునుగా నాశ్రయింతురు.

ప. ఇఁక దానినే సహేతుకముగాఁ జెప్పుచున్నాఁడు.—నన్ను భజించుట చేత, క్షిప్రమ్=తత్కాలముననే; ధర్మాత్మాభవతి. శుద్ధచిత్తుఁడై శాశ్వత మయినశాంతిని, నిగచ్ఛతి=పొందుచున్నాఁడు. అది చెప్పఁబడినది.—"వికర్మ యచ్చోత్పతితం కథంచి ద్ధునోతి సర్వం హృది సన్ని విష్టః" ♦ అని. ఈ యర్థమునందు సందేహపడుచున్న యర్జునునిఁ బ్రోత్సాహపఱచుటకై చెప్పుచున్నాఁడు.—నాభక్తుఁడు—నన్ను భజించుస్వభావము గలవాఁ డగుటవలన విధూతపాపుఁ డగును, నశింపఁడు. అని, ప్రతిజానీహి=ప్రతిజ్ఞ చేయుము. ఇందు కుదాహరణ ముద్ధవుఁడు, అతఁడు మునిశాపముచే సర్వ యాదవకులంబునకును నాశము సంభవించినను నాశముఁ బొందఁ డయ్యెఁ గదా. "నామ్నో౽స్తి యావతీ శక్తిః" * ఇత్యాది వచనములచే నామమాత్రముననే యింతసామర్థ్య ముండఁగా నిఁక అనన్యభజనమునకుఁ జెప్పెడి దేమి? అని తా.

---

§ వాసుదేవభక్తుల కెందును అశుభములేదు.

♦ ఎట్లో యొకవిధమున ఏనిషిద్ధకర్మము సంభవించుచున్నదో దానినిగూడ సమస్తమును హృదయంబున నున్నవాఁడై పరమేశ్వరుఁడు నశింపఁ జేయుచున్నాఁడు.

* నామమున కెంతశక్తి—పాపముఁ బోఁగొట్టుశక్తి గలదో, అంత పాపముచేయు టెవ్వానికిన్ని శక్యము గాదు.

రా. ఓయీ! "నా విరతో దుశ్చరితా న్నాశాన్తో నా సమాహితః। నా శాన్తమానసో వాపి ప్రజ్ఞానేనైన మాప్నుయాత్" ♦♦ ఇత్యాది శ్రుతి వలన ఆచార వ్యతిక్రమము ఉత్తరోత్తరముగా భజనాభివృద్ధి నిరోధించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—నేనే ప్రియుఁడుగాఁ గలవాఁ డగుటచేఁ గలిగిన యనన్యప్రయోజనం బగు మద్భజనముచే విఘాతపాపుఁ డగుటం జేసి సమూలముగా నున్మూలింపఁబడిన రజస్తమోగుణములు గలవాఁడై, క్షిప్రం భవతి ధర్మాత్మా = శీఘ్రముగనే విరోధిరహితమయి సపరికర మయిన మద్భజనమునందు నిత్యనిష్ఠ గలవాఁ డగుచున్నాఁడు. ఇట్టి భజనమే గదా "ధర్మస్యాస్య పరన్తప" అని యుపక్రమమునందు ధర్మశబ్దముచేఁ జెప్పఁబడినది. శశ్వత్ శాన్తిం నిగచ్ఛతి = శాశ్వత మయిన—అపునరావర్తి యగుమత్ప్రాప్తి విరోధ్యాచారనివృత్తిని బొందుచున్నాఁడు. కౌంతేయా! నీవే యీయర్థమునందుఁ బ్రతిజ్ఞ చేయుము—మద్భక్తియం దుపక్రమించినవాఁడు విరోధియగు నాచారము గలవాఁడైనను నశింపఁడు, మఱేమనఁగా, మద్భక్తిమాహాత్మ్యముచే సమస్త మయిన విరోధిసమూహమును నశింపఁజేసి శాశ్వత మయినవిరోధినివృత్తి నొంది శీఘ్రమునఁ బరిపూర్ణ మయినభక్తి గలవాఁ డగుచున్నాఁడు—అని.

మా. ఎందువలన?—క్షిప్రం భవతి ధర్మాత్మా. దేవదేనాంశాంకులయందే యిది యగుచున్నది. చెప్పఁబడినది శాండిల్యశాఖయందు.—"నా విరతో దుశ్చరితా న్నాభక్తో నా సమాహితః। సమ్యగ్భక్తో భవేత్కశ్చి ద్వాసుదేవే [illegible]॥ దేవర్షయ స్తదంశాశ్చ భవన్తి క్వచ జ్ఞానతః" ♦ అని. ఇతరుఁ [illegible] సమ్యగ్భక్తునివలెఁ గనఁబడినయెడ నతఁడు దాంభికుం డని యూహింపవలయును. అల్పమయినపాపము గలవారలకు సత్సంగమువలన నెట్లో యొకయట్లు మహాభక్తిగూడఁ గలుగుచున్నది. ఇతరులకు అల్పభక్తి కావచ్చును. "స శతమతి సుపయాతి యో

♦♦ దురాచారమునుండి విరతి పొందనివాఁడును కామక్రోధశాంతి లేనివాఁడును సమాధి లేనివాఁడును మనోనిగ్రహము లేనివాఁడును ప్రజ్ఞానముచే-ఉపాసనముచే నీపరమాత్మను బొందఁజాలఁడు.

♦ దురాచారమునుండి విరతిఁ బొందనివాఁడుగాని శ్రవణకీర్తనాది భక్తిలింగము లేనివాఁడుగాని సమాధి లేనివాఁడుగాని యెవ్వఁడును నిర్మల మయినచిత్తము గలవాఁడై వాసుదేవునియందు సమ్యగ్భక్తుఁడు కాఁజాలఁడు. దేవతలును ఋషులును తదంశజాతులును ఒకానొకప్పుడు జ్ఞానమునఁన సమ్యగ్భక్త లగుదురు.

ఽర్థతృష్ణాం తమధమచేష్ట మవేహి నాఽస్య భక్తిః" * అని విష్ణుపురాణమునందును. "సా శ్రద్దధానస్య వివర్ధమానా విరక్తిమన్యత్ర కరోతి పుంసః" ♦♦ అనియు. "వేదాః స్వధీతా మమ లోకనాథ తప్తం తపో నానృతముక్తపూర్వమ్ । పూజాం గురూణాం సతతం కరోమి పరస్య గుహ్యం నచ భిన్నపూర్వమ్॥ గుప్తాని చత్వారి యథాయథం మే శత్రౌ చ మిత్రే చ సమోఽస్మి నిత్యమ్ । తంచాపి దేవం శరణం ప్రపన్న మేకాన్తభావేన భజామ్యజస్రమ్॥ ఏతైరుపాయైః పరిశుద్ధసత్త్వః కస్మాన్న పశ్యేయ మనన్తమీశమ్" ♦ అని మోక్షధర్మమునందు. ఆచారము జ్ఞానమునకు సాధనం బని చెప్పుటవలనను. జ్ఞానము లేనియెడ సమ్యగ్భక్తి సిద్ధింపమివలన. అట్లు గౌతమఖిలములయందు.—"వినా జ్ఞానం కుతో భక్తిః కుతో భక్తిం వినాచ తత్" § అని. "భక్తిః పరేశేఽనుభవో విరక్తిరన్యత్ర చైష త్రిక మేకకాలమ్" ¶ అనియు భాగవతమునందు.

మాం హి పార్థ వ్యపాశ్రిత్య యేఽపి స్యుః పాపయోనయః
స్త్రియో వైశ్యాస్తథా శూద్రాస్తేఽపి యాన్తి పరాం గతిమ్. ౩౨

భా. పత్రియును.—హి=ఎందువలన ననఁగా; యేఽపి=ఎవ్వరు; పాపయోనయః = పాపమయినయోని గలవారు, పాపమయినజన్మము గలవారు; స్యుః = అగుదురో; తేఽపి=వారుగూడ; వా రెవ్వరు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు — స్త్రియః=స్త్రీలును; వైశ్యాః=వైశ్యులును; తథా=అట్లు; శూద్రాః = శూద్రులును; మామ్=నన్ను; పార్థ=అర్జునా! వ్యపా

* ఎవ్వఁడర్థమునందుఁ దృష్ణఁ బొందుచున్నాఁడో అతఁడు వంచకబుద్ధి గలవాఁడు. అతని నధమచేష్టునిఁగా నెఱుంగుము. అతనికి భక్తి లేదు.

♦♦ శ్రద్ధగల పురుషున కది వృద్ధిఁబొంది యితరమునందు విరక్తిని కలిగించుచున్నది.

♦ లోకనాయకుఁడా! వేదముల నధ్యయనించితిని, తపస్సుచేసితిని, అసత్యము చెప్పినవాఁడఁ గాను, ఎల్లప్పుడును గురువులపూజ చేయుచున్నాను, పరునిరహస్యము వెల్లడిచేసినవాఁడఁ గాను, ఉపస్థము ఉదరము పాణి వాక్కు—ఈనాలుగును యథావిధిగా దాఁచితిని, నిత్యంబును శత్రువునందును మిత్రునియందును సముఁడనై యున్నాను, ఆదేవునిఁగూడ శరణుపొంది యనవరతంబును ఏకాగ్రమనంబున భజించుచున్నాను, ఈయుపాయములచేఁ బరిశుద్ధమయినచిత్తము గలవాఁడనై యెందువలన యనంతుం డగు నద్దేవునిఁ జూడకున్నాను?

§ జ్ఞానములేక భక్తియెక్కడిది? భక్తిలేక జ్ఞానమెక్కడిది?

¶ పరమేశ్వరునియందు భక్తియును ఆత్మయాందనుభవమును ఇతరమునందు విరక్తియును—ఈమూఁడును ఏకకాలమునఁ గలుగును.

ప్రశ్రిత్య=ఆశ్రయముగాఁబొంది; పరామ్ = ప్రకృష్టమయిన; గతిమ్ = గతిని; యాన్తి=పొందుచున్నారు.

అర్జునా! పాపయోనులైనట్టియు గలవారలు స్త్రీలు వైశ్యులు శూద్రులు మొదలగువారుగూడ నన్నాశ్రయించి పరమగతిని బొందుచున్నారని తాత్పర్యము.

అ॰ ఇందువలనఁ గూడ భగవద్భక్తి చేయవలయు నని చెప్పుచున్నారు మఱియును అని. నమే భక్తః ప్రణశ్యతి అనుటకు హేతువుఁ జెప్పుచు భక్త్యధికారమునందు జాతినియమము లేదని చెప్పుచున్నారు హి ఇత్యాదిగా.

హి॰ హి-ఎందువలననఁగా. పార్థ! మామ్; వ్యపాశ్రిత్య; యేఽపి; పాపయోనయః=పాపిష్ఠమయినజన్మము గలవారు; స్యుః. తేఽపి; పరాంగతిమ్=మోక్షమును; యాన్తి.

శ్రీ॰ ఇట్లుపక్రమించిన జ్ఞానము యొక్క మాహాత్మ్యమును తత్ఫలమును ప్రతిపాదించి యిప్పుడు «సుసుఖం కర్తుమ్» అని యేది చెప్పఁబడినదో దాని వివరించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— స్త్రియః; వైశ్యాః; తథా; శూద్రాః; యేఽపి=ఇతరులును ఎవ్వరు; పాపయోనయః=నీచజన్మము గలవారును నీచమయినకర్మము గలవారును మ్లేచ్ఛపుల్కసాదులు; స్యుః=కలరో; తేఽపి = వారును; మామ్=నన్ను పరమాత్మను, సోపాధికునిఁ గాని నిరుపాధికునిఁ గాని; సద్గురూపదేశజనిత జ్ఞానముచే, వ్యపాశ్రిత్య = చక్కఁగా నుపాసించి; క్రమముగానఁ గాని సాక్షాత్తుగాఁ గాని, పరాంగతిమ్=పరమపురుషార్థమును కైవల్యమును; యాన్తి = పొందుచున్నారు. శాస్త్రమును «కిరాత హూణాన్ధ్ర పులింద పుల్కసా ఆభీర కంకా యవనా ఖసాదయః । యేఽన్యేచ పాపా యదుపాశ్రయాశ్రయాః శుధ్యన్తి తస్మై ప్రభవిష్ణవే నమః» ◆ ఇత్యాది శాస్త్రప్రసిద్ధిని సూచించుచున్నది. ఇందుచే స్త్రీశూద్రాదులకుఁ గూడ శాస్త్రప్రజ్ఞాశూన్యులకు జ్ఞానతత్ఫలప్రాప్తిని ప్రతిపాదించుటం జేసి జ్ఞానం బతిసులభం బని సూచితమగుచున్నది.

మ॰ ఇట్లాగంతుకదోషంబున దుష్టులగువారికి భగవద్భక్తి ప్రభావమువలన నిస్తారముఁ బ్రతిపాదించి స్వాభావికదోషముచే దుష్టులయినవారికిని అట్టి నిస్తారముఁ జెప్పుచున్నాఁడు —హి=నిశ్చితము. హే పార్థ! మామ్; వ్యపాశ్రిత్య=శరణు

◆ కిరాతులు మొదలగువారును మఱియును నితరులగు పాపులును ఎవ్వని నాశ్రయించినవారలై శుద్ధులగుదురో అట్టి ప్రభువునకు నమస్కారము.

పొంది; యేఽపి = ఎవ్వరు; పాపయోనయః—అంత్యజులుగాని తిర్యగ్జంతువులుగాని జాతిదోషముచే దుష్టు లయినవారు; అట్లు వేదాధ్యయనాదిశూన్య లగుటచే నికృష్ట లయిన స్త్రీలును; వైశ్యాః—కృష్యాదులయందుమాత్రమె యుండువారు; అట్లు, శూద్రాః—జాతిచేతను అధ్యయనాద్యభావముచేతను బరమగతికి అయోగ్యులును; స్యుఃకలరో; తేఽపివారును; పరాంగతిం యాన్తి. అపిశబ్దమువలన మున్ను చెప్పిన దురాచారులుగూడ.

శ్రీ. ఆచారభ్రష్టుని మద్భక్తి పవిత్రునిఁగాఁ జేయుననుట యేమి చిత్రము? మద్భక్తి దుష్కులజాతులను అనధికారులనుగూడ సంసారమునుండి ముక్తులనుగాఁ జేయుచున్న దని చెప్పుచున్నాడు — యేఽపి; పాపయోనయస్స్యుః=నికృష్ట మయిన జన్మము గలవారు అంత్యజాదులు కలరో; ఎవ్వరు మఱి, వైశ్యాః—కేవలము కృష్యాదులు చేసికొనువారు; స్త్రీలును శూద్రులును అధ్యయనాదిరహితులు; కలరో; తేఽపి; మామ్; వ్యపాశ్రిత్య=చక్కఁగా సేవించి; పరాంగతిం యాన్తి. హి=నిశ్చయము.

ప. ఇఁక మద్భక్తి కులాచారాదికము నపేక్షింప దని తెలుపుటకై చెప్పుచున్నాఁడు.—ఓపార్థుఁడా! హి=నిశ్చయము. మామ్; వ్యపాశ్రిత్య = అనన్యులై పొంది; ఎవ్వరు, పాపయోనయః=పాపము—అనధికారి యగుయోని—ఉత్పత్తిగలవారు; స్యుః=అగుదురో; తేఽపి = అట్టివారుగూడ; పరాంగతిం యాన్తి. ఈయర్థమునందు నమ్మకముఁ బుట్టించుచున్నాఁడు.—స్త్రియః = «అనృతం సాహసం మాయా మూర్ఖత్వ మతిలుబ్ధతా» ఇత్యాది స్వాభావికదోషములచే నుపహత లయిన స్త్రీలు గోపికలు, అందును జారబుద్ధిచేఁ జేరినవారు; అట్లు, వైశ్యాః = కృష్యాదికముచే గోరక్షణము చేయువారు నందగోపప్రముఖులు; అట్లు, శూద్రాః = తత్పరిచారకులును; న న్నాశ్రయించి పరమగతిని బొందుచున్నా రని వస్తుమహిమం బలౌకిక మని మున్నే దృష్టాంత సహితముగాఁ జెప్పఁబడినది «స్వర్యాత్వా ఉపశ్మసారమ్» అని. శ్రుతియును తైత్తిరీయకమునందు.—«త్వా మగ్నే యజమానా అనుద్యూన్విశ్వా వసూని దధిరే వార్యాణి । త్వయా సహ ద్రవిణ మిచ్ఛమానా వ్రజం గోమన్త ముశిజో వివవ్రుః» అని. భాష్యము.—అగ్నే = ఓవైశ్వానరుఁడా! విశ్వరూపుఁడా! «వైశ్వానరో విరాట్» అను పరిభాషవలన; త్వామ్=నిన్ను; అనుద్యూన్=ప్రతిదినమును; యజమానాః=పూజించుచు; వార్యాణి=వారింపఁదగినవానిని, ఇయ్యఁగూడనివాని నైనను; విశ్వా=సమస్తములయిన; వసూని=ధనములను; దధిరే=అర్పించిరి. ఎందువలన ననఁగా,

ఉశిజః=మేధావులు, మోక్షార్థులు, లేక, వసతిని గోరువారు. గోమన్తమ్=అధికధనము గల; వ్రజమ్=గోకులమను గొల్లపల్లెను; వివవ్రుః=వరించిరి. దేని నుద్దేశించినవారై ? త్వాయాసహా=నీసన్నిధానమున; ద్రవిణమ్=విషయభోగమును; ఇచ్ఛమానాః=కోరిన వారై, అంతమాత్రమునసే కృతార్థులై. ఋగ్వేదమునందును —“ తా వాం వాస్తూన్యుశ్మసి గమధ్యై యత్ర గావో భూరిశృంగా అయాసః । అత్రాహ తదురుగాయస్య కృష్ణః పరమం పదమవభాతి భూరి ” అని. భాష్యము.—అవాన్=మీకు; ఉష్మసి=తాపత్రయము బాధింపఁగా; తా=ఆ; వాస్తూని = గృహములను; గమధ్యై= పొందుటకొఱకు; అయాసః=పోవువారము. ఎట్టిగృహములను ? యత్ర=ఏగృహముల యందు; భూరిశృంగాః=పెద్దకొమ్ములుగల; గావః=గోవులుగలవో, శృంగము లుపలక్షణార్థము, మిక్కిలి యున్నతములును పెద్దపొదుగులు గలవియు నగుగోవులు గలవో అని యర్థము. అహ అనునవ్యయము ఏవకారార్థకము, అత్రాహ = ఆగృహముల యందే; తత్=అట్టి; ఉరుగాయస్య = వేదములచే గీయమానుఁ డగువిష్ణువుయొక్క; భూరి=మహత్తరమయిన, సంపూర్ణశక్తిగల; పరమంపదమ్=పారమార్థికరూప మయిన; కృష్ణః=కృష్ణుఁడు; అవభాతి—కలఁ డని వేదములచేఁ జెప్పఁబడుచున్న దని యర్థము. సామసంహితలయందును.—“ ప్రసో అగ్నే తవో తిభి స్సువీరాభి స్తరతి వాజకర్మభిః యస్య త్వ మవితథః ” అని భాష్యము.—అగ్నే=ఓవిశ్వరూపుఁడా! సః=ఆపురుషుఁడు; తవ=నీయొక్క; ఊతిభిః=రక్షణముల చేత; సంసారమును, ప్రతరతి=దాఁటుచున్నాఁడు. ఎట్టిరక్షణములచేత ? సువీరాభిః=మిక్కిలి సమర్థము లగువానిచేత, కావునసే, వాజకర్మభిః = వాజమునకు—బలమునకుఁ గరణభూతము లగువానిచేత, ఎట్టివానిచే సకల విఘ్నముల జయించునో అట్టివానిచేత నని యర్థము. ఆపురుషుఁ డెవ్వఁడు ? యస్య త్వమవితథః=ఎవ్వనికి నీవు వ్యర్థముకానిసఖ్యమును బొందినవాఁడ వగుదువో అతఁడు. ఈయర్థమునందు రైవతసామయును.—“ రేవతీ న్న స్సధమాద ఇన్ద్రే సన్తు తువివాజాః క్షుమన్తో యాభి ర్మదేమ ” అని. భాష్యము.—ఇన్ద్రే=పరమాత్మ యగుభగవంతుఁడు; సధమాదే=మాతోఁ గూడ హర్షమునొందినవాఁ డగుచుండఁగా; క్షుమన్తః= నడపుచు, మేపుచు; మేము, యాభిః=ఏగోవులచే; మదేమ = సంతోషింతుమో; ఆ గోవులు, రేవతీః = ఆజ్యాదిధనము గలవై; తువివాజాః = అధిక మయిన బలముగలవి యగుఁ గాక.

ధా॰ స్త్రీలును వైశ్యులును శూద్రులును పాపయోను లైనను నన్నాశ్రయించి పరమగతిని బొందుచున్నారు.

మూ, *

కిం పున ర్బ్రాహ్మణాః పుణ్యా భక్తా రాజర్షయ స్తథా
అనిత్య మసుఖం లోక మిమం ప్రాప్య భజస్వ మామ్. 33

భా. కిం పునః=ఇఁకఁ జెప్పెడి దేమి? పుణ్యాః=పుణ్యయోను లయిన; బ్రాహ్మణాః = బ్రాహ్మణులును; తథా=అట్లు; రాజర్షయః = రాజులును ఋషులు నగువారును; భక్తాః=భక్తులై; న న్నాశ్రయించి పరమగతి నొందుదు రని. అందువలన. అనిత్యమ్=క్షణభంగురమును; అసుఖమ్= సుఖము లేనిదియు నగు; ఇమం లోకమ్=ఈమనుష్యలోకమును; ప్రాప్య= పొంది, పురుషార్థసాధన మగు దుర్లభ మయిన మనుష్యత్వము నొంది; మామ్=నన్ను; భజస్వ=సేవింపుము.

ఇఁకఁ బుణ్యయోను లగు బ్రాహ్మణులును రాజర్షులును భక్తులై న న్నాశ్రయించి పరమగతిఁ బొందుదు రని చెప్పెడి దేమి? అందువలన నీవు క్షణ భంగురమై సుఖహీనమై పురుషార్థసాధన మగు మనుష్యత్వము నొందుట సఫలం బగునట్లు నన్ను భజింపు మని తాత్పర్యము.

అ. పాపయోనియుఁ బాపాచారుఁడును నీభక్తిచేఁ బరమగతి నొందు నేని, అప్పుడు ఉత్తమజాతినిమిత్త మయినసన్న్యాసాదికముచేతఁ గాని సదాచారము చేఁ గాని యేమి ప్రయోజనము? అని యాశంకించి చెప్పుచున్నారు కిం పునః అని. ఉత్తమజాతిబ్రాహ్మణాదులకు అతిశయంబునఁ బరమగతి సిద్ధించుటవలన వా రవ శ్యము భగవద్భజనము చేయవలయు నని చెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. మనుష్యదేహాతిరిక్తము లయిన పశ్వాదిదేహములయందు భగవద్భజనయోగ్యత లేమివలన మనుష్యత్వము సిద్ధించినపుడు భగవద్భజనమునం దవశ్యము యత్నింప వలయు నని చెప్పుచున్నారు దుర్లభము అని.

హ. బ్రాహ్మణాః; పుణ్యాః=ధర్మాత్ములు; భక్తాః=ఈశ్వరుని శరణు పొందిన వారు; రాజర్షయః; పరమగతిని బొందుదు రని, కిం పునః = చెప్పవలయునా? అని యభిప్రాయము ♦.

---

* ఇది మొదలు అధ్యాయము కడవఱకు మాధ్వభాష్యము లేదు.

♦ తక్కినది శంకరభాష్యముతో సమానము.

౩౦. శ్రవణమననాదుల కయోగ్యులై యక్షరరహితులైన స్త్రీశూద్రాదులకుఁ గూడ జ్ఞానమును దత్ఫలంబును సిద్ధించుచుండఁగా వేదశాస్త్రాధ్యయననిపుణులై సద్ధర్మనిష్ఠు లగుబ్రాహ్మణాదులకు జ్ఞానంబును దత్ఫలంబును సిద్ధించు నని చెప్పెడి దేమి యని కైముతికన్యాయంబున జ్ఞానం బతిసులభం బని సూచించుచు శుద్ధాత్ములును సదసద్వివేకులు నగు బ్రాహ్మణాదిముముక్షువులను జ్ఞానతత్ఫలసంపాదనమునందుఁ బ్రవర్తింపఁజేయుటకై చెప్పుచున్నాఁడు.—పుణ్యాః=ఉత్తమజాతులు, లేక, పుణ్యకర్ములు శుద్ధాత్ములు, అగు; బ్రాహ్మణాః=శ్రోత్రియులు; మఱియు, తథా = అట్టివార లగు; రాజర్షయః=రాజశ్రేష్ఠులు; భక్తాః=శ్రవణాదులచే నొందిన జ్ఞానసంపత్తిచే మన్నిష్ఠ గలవారలై; పరాంగతిమ్=నిరతిశయానందరూప మగుటవలన నుత్తమమయిన గతిని, విదేహముక్తిని, పొందుచున్నా రని, కిం పునః—చెప్పవలసిన దేమి? అని యర్థము. అట్టి ముక్తిని మనుష్యత్వప్రాప్తి సఫలం బగునట్లు సదసద్వివేకవంతుఁడు ముముక్షు వగుపురుషుండు ప్రయత్నంబున సంపాదింపవలయు నని చెప్పుచున్నాఁడు.—అనిత్యమ్=నిత్యము కానిది యనిత్యము, "మఘవన్మర్త్యం వా ఇదం శరీర మాత్తం మృత్యునా" * అని దేహము మృత్యుగ్రస్తం బని శ్రుతి చెప్పుటవలన అనిత్యము—అనిశ్చిత మయినస్వభావము గలది, రేపు ఉండఁగల దని నమ్ముట కయోగ్య మని యర్థము, అట్టి యనిత్యమును. ఇందుచే "శ్వః కార్య మద్య కుర్వీత" ♦ అను న్యాయంబునఁ గాలవిలంబము సేయక పురుషార్థసిద్ధికొఱకు బుద్ధిమంతుఁడు శీఘ్రంబున యత్నింపవలయు నని సూచింపఁబడినది; మఱియును, అసుఖమ్ = దుఃఖాత్మకమును, ఆధ్యాత్మికాద్యుపద్రవకోటిగల దగుటవలన దుఃఖస్వరూపమును; ఇందుచే నెప్పుడు దేహము స్వస్థ మగునో అప్పుడే యత్నింపవలయు నని సూచితము; లోకమ్=లోక్యతే—చూడఁబడుచున్నది కావున లోకమును, లేక, ఆత్మస్వరూపమును లోకయతి—చూపుచున్నది కావున లోకమును, మనుష్యదేహమును; ఇమమ్=ముక్తిసాధనమయిన దీనిని; ప్రాప్య = దేహము క్షణభంగురము మానుషము దుర్లభం బని యెఱింగి; తీవ్రమోక్షేచ్ఛావైరాగ్యములచే, మామ్ = నన్ను పరమాత్మను మోక్షప్రదాతను, నిరుపాధికునిఁ గాని సోపాధికునిఁ గాని; భజస్వ = శ్రద్ధాభక్తులతో ననుసంధింపుము. నీకు నిర్విశేషవిషయం బగుజ్ఞాన ముపదేశింపఁబడునేని అప్పుడు నిర్వి

* ఇంద్రా! ఈశరీరము మర్త్యము, మృత్యువుచేఁ బొందఁబడినది.

♦ ఱేపు చేయుదానిని నేఁడే చేయవలయును.

శేషునే నన్ను మహాత్మనస్తు అని చెప్పినరీతిని నీ వభేదంబున భజింపుము, అటు కానిచో సోపాధికునే నన్ను భేదంబున భజింపు మని యభిప్రాయము.

మ. ఇట్లయినప్పుడు.—పుణ్యాః=సదాచారులును ఉత్తమయోనిస్థులు నగు; బ్రాహ్మణాః; తథా; రాజర్షయః=సూక్ష్మవస్తువివేకము గల క్షత్రియులును; భక్తాః=నాభక్తులై; పరమగతిఁ బొందుదు రని, కిం పునః=చెప్పెడి దేమి ? ఎవ్వనికిని సందేహము లేమివలన నని యర్థము. మద్భక్తి యిట్టి మహిమము కలది కావున మహాప్రయత్నంబున, ఇమం లోకమ్=సకలపురుషార్థసాధనయోగ్యమై యతిదుర్లభ మైన యీమనుష్యదేహమును; అనిత్యమ్ = శీఘ్రముగా నశించుస్వభావము గలదానిని; అసుఖమ్=గర్భవాసా ద్యనేకదుఃఖభూయిష్ఠ మయినదానిని; ప్రాప్య = పొంది; ఇది నశింపక యుండు నంతలోపల నతిశీఘ్రమునునే, మామ్; భజస్వ=శరణముగా నాశ్రయింపుము. ఇది యనిత్య మగుటవలనను అసుఖం బగుటవలనను విలంబమును గాని సుఖార్థము ప్రయత్నమును గాని చేయకుము, నీవును రాజర్షివి, కావున, మద్భజనంబున నీదేహమును సఫలమునుగాఁ జేయుము, చేయవేని యిట్టిజన్మము నీకు నిష్ఫలమే యగు నని యర్థము.

శ్రీ. ఇట్లుండఁగా, సత్కులసంభూతులును సదాచారులు నగు మద్భక్తులు పరమగతిఁ బొందుదు రని చెప్పవలయునా ? అని చెప్పుచున్నాఁడు —పుణ్యాః=సుకృతు లగు; బ్రాహ్మణాః; తథా; రాజర్షయః = రాజులును ఋషులు నగు క్షత్రియులు; ఇట్టివారలు పరమగతిఁ బొందుదు రని, కిం పునః=చెప్పవలయునా యేమి ? అందువలన నీవు, ఇమం లోకమ్=ఈరాజర్షిరూప మయినదేహమును; ప్రాప్య=పొంది; మాం భజస్వ. మఱియును, అనిత్యమ్=అస్థిరమును; అసుఖమ్=సుఖరహితము నగు; లోకమ్ = దేహమును; ప్రాప్య. అనిత్య మగుటవలన విలంబము చేయక అసుఖం బగుటవలన సుఖార్థప్రయత్నమును విడిచి నన్నే భజింపు మని యర్థము.

ప. ఇట్లుండఁగా సత్కులాచారవంతులకుఁ జెప్పెడి దేమి ? అని చెప్పుచున్నాఁడు.—బ్రాహ్మణాః=వేదవిదులు; పుణ్యాః = సదాచారవంతులు; అందును, భక్తాః=నన్ను భజించువారు; తథా; రాజర్షయః = రాజులును ఋషులు నైనవారు, జనకాదులు; లేక, రాజులును ఋషులును; పరమగతిఁ బొందుదు రని యేమి చిత్రము ? ఇట్లు నీవును రాజర్షివి కావున నన్ను భజింపు మని యర్థము. అది చెప్పఁబడినది బోధసుధాకరమునందు:—“ అయ ముత్తమో య మధమో జాత్యా రూపేణ

సంపదా వయసా । శ్లాఘ్యో ఽశ్లాఘ్యో వేత్థం న వేత్తి భగవా ననుగ్రహావసరే॥ అన్తస్థ భావ భోక్తా యతో ఽన్తరాత్మా యథా మహామేఘః । ఖదిర శ్చూత ఇతి వా ప్రవర్షణే కిం విచారయతి » * అని. శతపథశ్రుతియును.—« త ద్యో యో దేవానాం ప్రత్యబుధ్యత స ఏవ త దభవ త్తథా ఋషీణాం తథా మనుష్యాణామ్ » అని. భాష్యము.—తత్ = ఆయాత్మవస్తువును, దేవానామ్ = దేవతలలో, యః యః ప్రత్యబుధ్యత=ఎవ్వఁ డెవ్వఁ డెఱింగెనో, స ఏవ తత్ అభవత్=అతఁడే బ్రహ్మరూపుఁ డయ్యెను. తథా ఋషీణామ్=అట్లె ఋషులలోను. తథా మనుష్యాణామ్ = అట్లె మనుష్యులలోను. కావున ఆత్మప్రాప్తియందు జాత్యాదితారతమ్యము లేదని యర్థము. ఋక్శాఖయందును.—« సర్వే నన్దన్తి యశసా గతేన సభా సాహేన సఖ్యా సఖాయః » అని. భాష్యము.—« న తస్య ప్రతిమా అస్తి తస్య నామ మహ ద్యశః » అనుశ్రుతివలన, యశసా=పరమాత్మచే, గతేన = పొందఁబడినవానిచే, సర్వే నన్దన్తి= సర్వదేహులును బరమానందరూపు లగుచున్నారు. ఎట్టివానిచేత ? సభాసాహేన= సభను--ఇంద్రియసభను, లేక, లౌకికవ్యవహారమును సహించువానిచేత—ఆక్రమించు వానిచేత. మఱియు నెట్టివానిచేత ? సఖ్యా = ఉపకరించువానిచేత. ఎట్టివారలై ? సఖాయః = సర్వభూతసుహృత్తములై. అందువలన సర్వభూతసుహృత్తమత్వమే యాత్మప్రాప్తికిఁ గారణము, కాని జాత్యాదులు కావు. అని రావణభాష్యము. బ్రాహ్మణమో యీశ్రుతిని అధిదైవికస్థితిచే వివరించుచున్నది « యశో వై సోమో రాజా » ఇత్యాదిగా. ఇంకఁ బ్రకృత మనుసరింతము. ఈయర్థమునందు విలంబము చేయకు మని చెప్పుచున్నాఁడు.—ఇమమ్; అనిత్యమ్=క్షణభంగురమును; అసుఖమ్= దుఃఖమునకే కారణ మయినగాని; లోకమ్=మర్త్యలోకమును, మనుష్యదేహమును; ప్రాప్య; మామ్=నన్నుఁ బరమాత్మను; భజస్వ. నిత్యమును న న్ననుసంధించుటయే మద్భజనము, ఇందు విలంబము కారా దని యనిత్యాదిపదములు సూచించుచున్నవి. ముందు ఇంతకన్నను అధమయోని సంభవించునేని ఏమియు లభింప దని యర్థము. శ్రుతియును సామసంహితలయందు.—« అహో రాజాన మధ్వరస్య రుద్రం హోతారం సత్యయజం రోదస్యోః । అగ్నిం పురా తనయిత్నో రచిత్తా ద్ధిరణ్యరూప మవసే కృణు

* జాలిచేఁ గాని రూపముచేఁ గాని సంపదచేఁ గాని వయస్సుచేఁ గాని యితఁడు స్తుతుఁ డితం డధముఁడు ఇతఁడు శ్లాఘ్యుఁ డితం డశ్లాఘ్యుం డని భగవంతుఁ డనుగ్రహించునప్పు డెఱుంగఁడు, ఎందువలన ననఁగా నంతరాత్మ యంతరంగమునందలి భావమును భుజించువాఁడు, మహామేఘము వర్షించునప్పుడు ఇది చండ్రచెట్టు ఇది మంచిచెట్టని విచారించునా ?

ధ్వమ్" అని. భాష్యము.—ఓయజమానులారా! అచిత్తాత్=సర్వేంద్రియోపరమరూపమరణమునకంటెను; తనయిత్నోః=ఆకస్మికమయిన పిడుగుపంటిదానికంటెను; పురా=మున్నె, జీవద్దశయందే; అగ్నిమ్=ప్రకాశమానుండగు; హిరణ్యరూపమ్ = హిరణ్యగర్భుని ఈశ్వరుని; రాజానమ్ = స్వామినిగా; కృణుధ్వమ్ = చేసికొనుఁడు. ఎందుకొఱకు? అవసే = రక్షణముకొఱకు. మరణము కలిగినపిమ్మట నేమియు జరుగదని యర్థము. ఇంకనతఁడు స్వామియైనచో నేమి యతిశయము? అనఁగాఁ జెప్పుచున్నది.—ఎట్టివాని? రోదస్యోః=మాయావిలాసరూపము లయిన ద్యావాపృథివుల యొక్క, హోతారమ్ = వేల్చువాని, "య ఇమా విశ్వా భువనాని జుహ్వత్" అనుశ్రుతివలన. కావుననే, రుద్రమ్=క్రూరుని. క్రూరుఁడు మాత్రమే కాఁడు, సత్యయజమ్=సత్యమును—ఆనందరూపమును పొందించువాని. ఇట్లు, అధ్వరస్య = ద్వితీయార్థమున షష్ఠి, తన్నుఁ బొందుకొఱకు యాగాదిక మనుష్ఠించినపురుషుని; అవః= రక్షించినవాఁడు.

రా. చెప్పెడి దేమి? పుణ్యయోను లగుబ్రాహ్మణులును రాజర్షులును నాయందు భక్తి నొందినవారలై పరమగతి నొందుదు రని. అందువలన నీవు రాజర్షివి అస్థిరంబును తాపత్రయాభిహతం బగుటచే అసుఖంబు నగు నీలోకము నొంది యున్న వాఁడవు నన్ను భజింపుము.

మన్మనా భవ మద్భక్తో మద్యాజీ మాం నమస్కురు
మామే వైష్యసి యుక్త్వైవ మాత్మానం మత్పరాయణః. ౩౪

భా. ఎట్లు?—నీవు, మన్మనాః = నాయందు మనస్సు గలవాఁడవు; భవ = అగుము. అట్లు, మద్భక్తః = నాయందు భక్తుఁడ వగుము. మద్యాజీ = నన్ను యజించుస్వభావము గలవాఁడ వగుము. మామ్ = నన్నే; నమస్కురు = నమస్కరింపుము. యుక్త్వా = చిత్తమును సమాహితము చేసి; మత్పరాయణః = నేనే పరమగతిగాఁ గలవాఁడవై; ఏవమ్= ఇట్టి; ఆత్మానమ్ = ఆత్మను; మామేవ = నన్నే; నేను గదా సర్వభూతంబులకును ఆత్మను బరమగతిని; ఏష్యసి = పొందఁగలవు. ఇట్టివానిని సర్వభూతంబులకును ఆత్మను బరమగతి నగు నన్నే పొందఁగల వని సంబంధము.

నీవు నాయందు మనస్సు గలవాఁడవై నాకు భక్తుఁడవై నన్నే పూజించుచు నమస్కరించుచుండుము. ఇట్లు నన్నే పరమగతిగా నెఱింగి సమాహితుఁడ వగుదువేని సర్వభూతములకును ఆత్మ నగు నన్నే పొందఁగల వని తాత్పర్యము.

ఆ. భగవద్భక్తి యొక్క దని యడుగుచున్నాఁడు ఎట్లు అని. ఈశ్వరభ జనమునందుఁ జేయవలసినదానిఁ దెలుపుచున్నారు మన్మనా ఇత్యాదిగా. ఇట్లు భ గవంతుని భజించినచో నాకేమి యగును ? అని యాశంకించి చెప్పుచున్నారు యుక్త్వా ఇత్యాదిగా. సమాహితము చేసి—భగవంతునందే యని శేషము. ఏవ మాత్మా నమ్ అనుదాని వివరించుచున్నారు. నేను గదా ఇత్యాదిగా. ఇట్లు మధ్యమా ధికారులకు ధ్యేయమును నిరూపించి యధమాధికారుల కారాధ్యమును నిరూపిం చ్చాద్వారంబున నిజమయి పారమార్థిక మైనరూపంబునఁ బ్రత్యక్త్వంబున నెఱుంగుటచే పరమేశ్వరుని పరమారాధనం బని ప్రతిపాదించుటం జేసి నవమాధ్యాయంబున సో పాధికం బగు తత్పదవాచ్యంబును నిరుపాధికం బగు తత్పదలక్ష్యంబును వ్యాఖ్యాత మయ్యెను.

హ. మన్మనాః = నాయందు మనస్సు గలవాఁడవు; మద్భక్తః = నాయందు భక్తి గలవాఁడవు; మద్యాజీ = నన్ను యజించుస్వభావము గలవాఁడవు; భవ అగుము. ఏవమ్ = చెప్పినవిధంబున; ఆత్మానమ్; యుక్త్వా = సమాహితము చేసి మత్పరాయణః = నేనే వాసుదేవుఁడనే పరమ మయినయాశ్రయము గలవాఁడవై ఇట్లు మనస్సును సమాహితముచేసి మత్పరాయణుండవునై; మామేవ=నన్నే; ఏష్యసి పొందఁగలవు.

శ్రీ. నిర్విశేషజ్ఞానమునం దనధికారి నగు నేను సోపాధికుఁడ వగుని న్నెట్లు భజింపవలయును ? అందువేని చెప్పెద వినుము.—మన్మనాః = భూతాని విష్ణుః అను న్యాయంబున సర్వాత్మకుండ నగు నాయందు లగ్న మయినమనస్సు గలవాఁడవు అగుము; వాసుదేవ స్సర్వ మ్మని జగత్తు సర్వమును నన్నుఁగానే సదా భావింపుము లేక. « మనో మోక్షే నివేశయేత్ » అనుస్మృతివలన ఆనందాత్ముఁడను మోక్షస్వ రూపుండ నగు నాయందు స్థాపిత మయినమనస్సు గలవాఁడవు, మోక్షము అను పురుషార్థము ఒక్కదానియందే యాసక్త మయినమనస్సు గలవాఁడ వగుము, కాని ధర్మఫల మయిన యర్థకామములయందు ఆసక్తుఁడవు గావల దని యర్థము. ముముక్షు విట్లు మోక్షైకకాముఁడు గావలయు నని చెప్పి వానికిఁ గర్తవ్యముఁ జెప్పుచున్నాఁడు.— మద్యాజీ = నన్నే పరమేశ్వరునే శ్రౌతస్మార్తకర్మములచే యజించువాఁడ వగుము నన్నే కర్మములచే యజింపు మని యర్థము. కర్మము చేయునపుడు అగ్న్యాదిదేవ తలయందు భేదబుద్ధి చేయ వలదు, మ ఱేమనఁగా మద్బుద్ధినే చేయువలయు నను

నాశయముచేఁ జెప్పుచున్నాఁడు —మద్భక్తః = బ్రహ్మార్పణం బ్రహ్మహవిః అనున్యాయముచేఁ బున ఇజ్యంబును యజనంబును యజమానుఁడును యాగమును సర్వంబును బ్రహ్మమే యని సర్వత్ర మద్బుద్ధితో నన్ను భజించువాఁడ వగుము, సర్వత్ర బ్రహ్మబుద్ధిని జేయు మని యర్థము, అట్లే, మాం నమస్కురు = వాసుదేవ స్సర్వ మ్మని సర్వంబును నన్నుఁ గానే తలఁచి నమస్కరింపుము, « ఆశ్వ చణ్డాల గో ఖరమ్ » * అనుస్మృతివలనఁ లేక. తల్లిదండ్రులు గురుదేవతలు మొదలగువారికి మద్బుద్ధిచే నమస్కారము చేయుము. మఱియును. మత్పరాయణః = నేనే పరమగతిగాఁ గలవాఁడవు, సర్వావస్థల యందును సర్వదా పరమేశ్వరుఁడే నాకు గతి యని నన్ను శరణు పొందినవాఁడ వగుము. లేక. మత్ప్రీతికొఱకే లౌకికవైదికము లగుసర్వకర్మములఁ జేయువాఁడవు మత్పరాయణుఁడవై; ఏవమ్ = చెప్పినవిధంబున; యుక్త్వా = యోగమును జేసి, కర్మయోగమున న న్నుపాసించి; అంతమున, ఆత్మానమ్ = పరమాత్మ నగు; మా మేవ= నన్నే పరబ్రహ్మమునే; ఏష్యసి=క్రమమునఁ బొందఁగలవు, విదేహకైవల్యసుఖమును బొందఁగల వని యర్థము.

మ. భజనప్రకారమును బ్రదర్శించుచు నుపసంహరించు చున్నాఁడు.— రాజభక్తుఁడైనను రాజభృత్యునకుఁ బుత్త్రాదులయందు మన స్సుండును, అట్లు తన్మనుండైనను తద్భక్తుఁడు కాఁడు కావునఁ జెప్పుచున్నాఁడు మన్మనా భవ మద్భక్తః అని. అట్లు, మద్యాజీ = నన్ను యజించుస్వభావము గలవాఁడవు; మాం నమస్కురు; మనోవాక్కాయములచేత. ఏవమ్ = ఈవిధములను; మత్పరాయణః = నేనే శరణముగాఁ గలవాఁడవై; ఆత్మానమ్ = అంతఃకరణమును; యుక్త్వా = నాయందు సమాహితము చేసి; మా మేవ = పరమానందఘనుని స్వప్రకాశుని సర్వోపద్రవశూన్యుని అభయుని నన్నే; ఏష్యసి = పొందఁగలవు.

అల గోవిందపదారవిందమకరందాస్వాదశుద్ధాశయుల్
జలధిన్ సంసృతి నుత్తరింత్రు మహముల్ శాంతంబుఁ గాం త్రారయం
గల రాత్రేయము వేదవాక్యముల లోఁగన్ జేయుదుర్ భ్రాంతియున్
గలగాఁ జూతురు ద్వైతమున్ గనుదు రానందైకరూపత్వమున్.

శ్రీ. భజనప్రకారమును దెలుపుచు నుపసంహరించు చున్నాఁడు.—నా యందే మనస్సు గలవాఁడ వగుము. అట్లు, మద్భక్తః = నన్ను సేవించువాఁడ వగుము.

* శునకయును జండాలుఁడును గోవును గాడిదయును మొదలుగా.

మద్యాజీ = నన్నుఁ బూజించువాఁడ వగుము. నన్నే నమస్కరింపుము. ఏవమ్ = ఈప్రకారములచే; మత్పరాయణుండవై, ఆత్మానమ్=మనస్సును; నాయందు, యుక్త్వా= సమాహితము చేసి; మామేవ = పరమానందరూపుని నన్నే; ఏష్యసి = పొందఁగలవు.

తనయైశ్వర్యము నమ్మభ
మురు భక్త్యాశ్చర్యవిభవమును గారుణ్యం
బున రాజగుహ్యనామం
బున శ్రీకృష్ణుండు నవమమున బోధించెన్.

వ. ఇఁక భజనవిధమును జెప్పుచున్నాఁడు.—మన్మనాః = నాయందు మనస్సు గలవాఁడవు, మదాకారమే యగుసంకల్పము గలవాఁడ వగుము. నాకు భక్తుఁడ వగుము, ఇతరునకు క్షుద్రునకుఁ గావలదు. మద్యాజీ—నాకొఱకే యజింపుము. అట్లు తారతమ్యము విడిచి సర్వత్ర వ్యాపించి యున్న, మామ్ = నన్ను; నమస్కురు. అది చెప్పఁబడినది.—“విసృజ్య స్మయమానాన్ స్వాన్ దృశం వ్రీడాంచ దైహికీమ్। ప్రణమేద్దండవద్భూమా వాశ్వచండాలగోఖరమ్” ♦ అని. యుక్త్వా= యోగయుక్తుఁడవై; మామేవ; ఆత్మానమ్—పరమానందరూపుని; ఏష్యసి=పొందఁగలవు. అది చెప్పఁబడినది.—“విలిఖిత మివ రూపం చిత్తభిత్తౌ మురారే స్సుమన ఇవ మనోమై రర్పితం తత్పదాబ్జే। ప్రతిపద ముదయద్భిస్సాత్త్వికై రఞ్చితాఙ్గా స్త ఇహ భవపయోధేః పార ముల్లఙ్ఘయన్తి” * అని.

అధ్యాయతాత్పర్యము.—ఈప్రపంచాభాసమునకు నేనే యధిష్ఠానము, నాయజ్ఞానముయొక్క కార్యమే యిది, ఏది మిథ్యయో అది సత్యాశ్రితమే యగునని నియమము, సత్యము మిథ్యాశ్రితము కాదు, భ్రమాంతంబున సత్యమునం దసత్యం బవస్థానము పొందఁజాలదు కావున అసంగుఁడ నగు నాయందు ఎప్పుడును అసత్యస్పర్శము లేదు, అని నవమాధ్యాయంబున నీరహస్యము చెప్పఁబడినది.

---

♦ తనగర్వమానముల విడిచి దేహసంబంధి యయినదృష్టిని సిగ్గును విడిచి కుక్క చండాలుఁడు గోవు గాడిద మొదలుగా సర్వజంతువులకును నేలమీఁద దండమువలె నమస్కరింపవలయును.

* ఎవ్వరిచిత్తమనుగోడయందు విష్ణునిరూపము చిత్రలిఖితమువలె స్థిరముగా నుండునో యెవ్వరిచేఁ బుష్పమువలె మనస్సు అతనిపాదపద్మమునం దర్పింపఁబడునో ప్రతిక్షణమును పొడముచున్న పులకలు మొదలగుసాత్త్వికభావములచే గుఱుతుపడినదేహము గలవార లగునట్టివారు ఈలోకమునందు సంసారసముద్రముయొక్క పారమును దాఁటుచున్నారు.

రా॥ భక్తిస్వరూపముఁ జెప్పుచున్నాఁడు — మన్మనా భవ — సర్వేశ్వరేశ్వరుఁడను నిఖిలహేయప్రత్యనీకకల్యాణైకతానుండను సర్వజ్ఞుఁడను సత్యసంకల్పుఁడను నిఖిలజగదేకకారణుండను బరబ్రహ్మమను బురుషోత్తముఁడను బుండరీకదళామలాక్షుఁడను స్వచ్ఛనీలమేఘసంకాశుఁడను ఏకకాలోదితసూర్యసహస్రసదృశతేజుండను లావణ్యామృతసముద్రుండను ఉన్నతపీవరచతుర్బాహుండను అత్యుజ్జ్వలపీతాంబరుండను నిర్మలకిరీటమకరకుండలహారకేయూరకటకభూషితుండను అపారకారుణ్యసౌశీల్య సౌందర్య మాధుర్య గాంభీర్యౌదార్య వాత్సల్యసాగరుండను అనాలోచితవిశేషాశేషలోకశరణ్యుండను † సర్వస్వామి నగు నాయందు తైలధారవలె నవిచ్ఛిన్నముగా నుంపఁబడినమనస్సు గలవాఁడ వగుము. దానికే విశేషణము చేయుచున్నాఁడు.— మద్భక్తః=మిక్కిలియు నేనే ప్రియుఁడుగాఁ గలవాఁడవై మన్మనుఁడ వగు మని యర్థము. మఱియు విశేషణము చేయుచున్నాఁడు.— మద్యాజీ = నిరతిశయప్రియ మయిన మదనుభవముచేఁ గలుగు మద్యజనమునం దాసక్తుఁడ వగుము, యజన మనఁగా పరిపూర్ణశేషవృత్తి. ♦ ఔపచారికములు సాంస్పర్శికములు ఆభ్యవహారికములు * మొదలగు భోగముల నిచ్చుట గదా యాగము, ఎట్లు మదనుభవజనిత మయిన నిరతిశయప్రీతిచేఁ గలుగు మద్యజనమునందు ఆసక్తుఁడవగుదువో అట్లు మన్మనుండ వగు మని ప్రతిపాదిత మగుచున్నది. మఱియు దానికే విశేషణము చేయుచున్నాఁడు.— మాం నమస్కురు— నిరతిశయప్రియ మయిన మదనుభవముచేఁ గలుగునట్టి యత్యంతప్రియ మయిన యశేషశేషవృత్తితో నిలువక యంతరాత్మ నగు నాయందు అత్యంతప్రహ్వీభావబుద్ధిని జేయుము. మత్పరాయణః=నేనే పరమ మయిన అయనముగాఁ గలవాఁడవు, నాచేతనే గాని యాత్మధారణము లభింప దని నన్నే యాశ్రయించినవాఁడవని యర్థము. ఏవ మాత్మానం యుక్త్వా— మత్పరాయణుండవు నీవు ఇట్లు నిరతిశయప్రీతిచే మదనుభవసమర్థ మయిన మనస్సు నొంది; మామేవ ఏష్యసి. ఆత్మశబ్దం బిట మనోవిషయము. ఇట్టిమనస్సుచే నన్ను ధ్యానించి నన్ననుభవించి నన్ను యజించి నన్ను నమస్కరించి మత్పరాయణుండవై నన్నే పొందఁగల వని యర్థము. ఇట్లు లౌకికంబు లగు శరీరధారణార్థకర్మములను వైదికంబు లగు నిత్యనైమిత్తికకర్మము

† విశేషము నాలోచింపక సమస్తలోకముల రక్షించువాఁడను.

♦ పరిపూర్ణకైంకర్యము.

* ఔపచారికములు—నీరాజనాదులు, సాంస్పర్శికములు—ప్రక్షాళనాదులు, ఆభ్యవహారికములు—అన్నాదులు.

లను మత్ప్రీతికొఱకు మచ్ఛేషత్వైకరసుండనై నేనే చేయించుచున్నా నని చేయుచు సంతతంబును మత్కీర్తనయతననమస్కారాదులను ప్రీతితోఁ జేయుచు మన్నియామ్యం బగు నశేషజగంబును మచ్ఛేషత్వైకరసం బనియు ననుసంధించుచు నత్యంత ప్రియ మయినమద్గుణగుణంబుల ననుసంధించి పూఁటపూఁటయు నిట్టియుపాసనముఁ జేయుచున్నవాఁడవై నన్నే పొందఁగలవు.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయా
సిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం
యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే రాజవిద్యారాజగుహ్యయోగో
నామ నవమోఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు రాజవిద్యారాజగుహ్యయోగం బనం బరఁగు నవమాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్శ్రీవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందు
నవమాధ్యాయ టీక.



అధ్యాయనవక మిద మిప కృత్స్న గీతార్థవివృతి రఘులేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన.
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యాఽపిచ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



శ్రీ ర స్తు.
శ్రీ కృష్ణ పరబ్రహ్మణే నమః.

పరమార్థ చంద్రికా సహిత

# శ్రీభగవద్గీత, దశమాధ్యాయము.

బాహ్యాన్తర్యాగవిధిప్రశోధితస్వచ్ఛచిత్తలభ్యా యా
నిగమాన్తవాక్యసిద్ధా తాం విద్యా మమ్బికాం వన్దే.
సోపాధికం చ తత్త్వం నిరుపాధిక మపి నిజం తదో వాచ్యమ్
లక్ష్యం చా ఽభిదధే యః కృష్ణం వన్దే త మాత్మానమ్.

శ్రీభగవానువాచ.—

భూయఏవ మహాబాహో శృణు మే పరమం వచః
యత్తే ఽహం ప్రీయమాణాయ వక్ష్యామి హితకామ్యయా. ౧

శంకరభాష్యము.—

సప్తమాధ్యాయంబున భగవంతునితత్త్వంబును విభూతులును ప్రతిపాదింపఁబడినవి. నవమమునందును. ఇఁక నిప్పుడు ఏయేభావము లందు భగవంతుఁ జింతింపవలయునో ఆయాభావంబులు వక్తవ్యములు; భగవంతుని తత్త్వము గూడ వక్తవ్యము, చెప్పఁబడినను దుర్విజ్ఞేయం బగుటవలన. కావున శ్రీభగవంతుం డిట్లనియె.—భూయఏవ=వెండియును; మహాబాహో = పెద్దచేతులు గలవాఁడా! శృణు=వినుము; మే=నాయొక్క; పరమమ్=ఉత్తమ మయిన, నిరతిశయవస్తువును బోధించునట్టి; వచః=వాక్యమును. యత్ = ఏయుత్తమవాక్యమును; తే=నీకొఱకు; ప్రీయమాణాయ = ప్రీతిఁ బొందువానికొఱకు, నావాక్యమువలన నీవు మిక్కిలి ప్రీతిఁ బొందుచున్నావు అమృతపానము చేసినట్లు; కావున, వక్ష్యామి=చెప్పఁబోవుచున్నానో; హితకామ్యయా=హితేచ్ఛచేత.

శ్రీభగవంతుఁ డిట్లనియె —అర్జునా! వెండియు నుత్తమ మయిన నావాక్యము వినుము. నీవు నావాక్యముచేఁ నమృతము ద్రాగినట్లు పరమప్రీతిఁ బొందుచున్నావు కావున నీహితము గోరి నీకుఁ వెండియుఁ జెప్పెద నని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

అధ్యాయములు రెంటియందును సిద్ధమయినయర్థమును సంక్షేపమున ననువదించుచున్నారు సప్తమాధ్యాయంబున నిత్యాదిగా. తత్త్వంబును—సోపాధికంబును నిరుపాధికంబును. విభూతులును—సవిశేషనిర్విశేషరూపంబుల నెఱుంగుట కుపయోగించునవి. మీఁదియధ్యాయమునకు అధ్యాయద్వయముతో సంబంధముఁ జెప్పుచు మీఁదియధ్యాయమును దించుచున్నారు ఇఁక నిత్యాదిగా. వక్తవ్యములు—సవిశేషధ్యానమునందును నిర్విశేషజ్ఞానమునందును ఉపయోగించుటకై యని శేషము. ఓయీ! భగవంతునితత్త్వము సవిశేషంబును నిర్విశేషంబును మున్నే యచ్చటచ్చటఁ జెప్పఁబడినది, వెండియు నెందుకుఁ జెప్పవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు చెప్పఁబడినను ఇత్యాదిగా. అచ్చటచ్చటఁ దత్త్వము చెప్పఁబడినది వాస్తవమే, అయినను వెండియుఁ జెప్పవలయును దుర్విజ్ఞేయం బగుటవలన నని యర్థము. వాక్యమునకు ఉత్తమత్వమును స్పష్టీకరించుచున్నారు నిరతిశ యేత్యాదిగా. ఆ వాక్యమునకే విశేషణము చేయుచున్నారు యత్ ఇత్యాదిగా. ఒక్కమాఱు చెప్పిననే కార్యము సిద్ధించుచుండఁగా పలుమాఱు తేల చెప్పవలయును? అని యాశంకించి చెప్పుచున్నారు ప్రీయమాణాయ అని. హితము—దుర్విజ్ఞేయమగుతత్త్వజ్ఞానము.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

ఇట్లర్జునునకు విజ్ఞానసహిత మగుజ్ఞానమును సాక్షాన్మోక్షసాధనము నుపదేశించి యిప్పు డేయేభావములయందు భగవంతుఁడు చింతనీయుఁడో ఆభావములను, భగవత్తత్త్వము మున్ను చెప్పినను దుర్విజ్ఞేయం బగుటవలన వెండియుఁ జెప్పవలయు నని దానిని భగవంతుఁ డిట్లనియె.—భూయఏవ=వెండియును; మహాబాహో=; మే=నాయొక్క; పరమమ్=శ్రేష్ఠ మయిన; వచః=వచనమును; శృణు=వినుము. యత్=ఏ వచనమును; ప్రీయమాణాయ = తృప్తిఁ బొందింపఁబడుచున్న; తే=నీకొఱకు; హితకామ్యయా=హితేచ్ఛచే; వక్ష్యామి = చెప్పఁబోయెదనో.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.—

పూర్వాధ్యాయాంతమున "మన్మనా భవ మద్భక్తః" అని యర్జునునకు ముముక్షుఁడ వగునీవు చిత్తశుద్ధికొఱకును తజ్జన్యజ్ఞానద్వారంబునఁ గైవల్యసిద్ధికొఱకును నన్ను సవిశేషబ్రహ్మము నుపాసింపు మని చెప్పఁబడినది. ఇప్పుడు మందప్రజ్ఞాం డగుముముక్షువునకుఁ దీవ్రమోక్షేచ్ఛచేఁ ద న్నుపాసించుటయందు శీఘ్రంబునఁ

ప్రవృత్తి సిద్ధించుటకై తన్నుపాసించుటయొక్క ఫలంబును తనయొక్క-ఉపాస్యుం డగుపరమాత్మయొక్క సర్వజ్ఞత్వంబును సర్వేశ్వరత్వంబును సర్వార్థప్రదాతృత్వంబును భక్తానుగ్రాహకత్వంబును విభూతివిశేషంబును ప్రతిపాదించుటకై దశమాధ్యాయం బారంభింపఁబడుచున్నది. అందు మొదల శ్రోత యగునర్జునున కుపాసనమునందు రుచి పుట్టించుటకై మనస్సు రంజింప శ్రీభగవంతుఁ డిట్లనియె.—ఓమహాబాహూఁడా! జ్ఞాతవ్యం బగువస్తువు పరమసూక్ష్మం బగుటవలనను దుర్విజ్ఞేయం బగుటవలనను, భూయఏవ=వెండియును; దానినే బోధించుటకై చెప్పఁబడుచున్న, మే=నాయొక్క; పరమమ్ = పరమార్థవిషయ మగు, తన్నిష్ఠాసిద్ధికారణం బగు; వచః = వచనమును, శృణు=వినుము. దాని విని తదర్థము నెఱింగి తరించెద నని తచ్ఛ్రవణమునందు, ప్రీయమాణాయ = ప్రీతిని జేయుచున్న, శ్రవణోత్సుకుఁడ వగు నని యర్థము; తే=నీ కొఱకు; హితకామ్యయా = హితము-నిత్యనిరతిశయం బగుసుఖము, దాని సంపాదించు నిచ్ఛచేత; యత్=దేనిని; వక్ష్యామి=చెప్పఁగలనో, దాని విను మని సంబంధము. ఇందుచే, దాని విని మననము చేసి తత్త్వము నెఱింగి తరించెదనని మోక్షైకకాముఁడై శ్రద్ధావంతుఁ డగువానికే తత్త్వోపదేశము చేయువలయు నని సూచితం బగుచున్నది.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

ఇట్లు సప్తమాష్టమనవమాధ్యాయంబులచే తత్పదార్థం బగుభగవంతుని తత్త్వము సోపాధికంబును నిరుపాధికంబును ప్రదర్శింపఁబడినది. సోపాధికధ్యానంబునందును నిరుపాధికజ్ఞానంబునందును ఉపాయభూతము లగు నాభగవంతునివిభూతులును, « రసోఽహ మప్సు కౌన్తేయ » ఇత్యాదిగా సప్తమమునందును « అహం క్రతు రహం యజ్ఞః" ఇత్యాదిగా నవమమునందును సంక్షేపంబునఁ జెప్పఁబడినవి. ఇఁక నిప్పుడు వానివిస్తరము వక్తవ్యము భగవంతునిధ్యానముకొఱకు. తత్తత్త్వంబును జ్ఞానముకొఱకు వెండియు వక్తవ్యము, దుర్విజ్ఞేయం బగుటవలన. కావున దశమాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట నర్జునునిఁ బ్రోత్సాహపఱచుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.—భూయఏవ = వెండియును; ఓమహాబాహూఁడా! మే=నాయొక్క; పరమమ్=ప్రకృష్ట మగు; వచః; శృణు. యత్; తే=నీకొఱకు; ప్రీయమాణాయ = నావచనమువలన అమృతపానమువలనం బోలె ప్రీతి ననుభవించుచున్నవానికొఱకు; అహమ్-నీకుఁ బరమాప్తుఁడను; హితకామ్యయా=ఇష్టప్రాప్తియందలి యిచ్ఛచే; వక్ష్యామి,

శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.—

సప్తమాదులయందును సంగ్రహమున
బలుకఁబడియె విభూతులు పరఁగ దశమ
మునను సర్వత్ర విభుదృష్టిపొంటె నింకఁ
బ్రస్తుతింపఁగఁబడెడుఁ దద్విస్తరంబు.

ఇట్లు సప్తమాదు లగు మూఁడధ్యాయములచే భజనీయం బగు పరమేశ్వరరూపము నిరూపింపఁబడినది. తద్విభూతులును సప్తమమున “రసో ఽహ మప్సు కౌన్తేయ” ఇత్యాదిగాఁ బ్రదర్శింపఁబడినవి. అష్టమమునందు “కిం తద్బ్రహ్మ కిమధ్యాత్మమ్” ఇత్యాదిగ్రంథముచే నర్జునునకు ఏడుపదార్థము లుపన్యసింపఁబడినవి. అవియుఁ బరమేశ్వరునివిభూతులే, సాధిభూతాధిదైవ మ్మని చెప్పుటవలన. నవమమునందును “అహం క్రతు రహం యజ్ఞః” ఇత్యాదిగాఁ దద్విభూతులు ప్రదర్శింపఁబడినవి. ఇఁక నిప్పుడు ఆవిభూతులనే ప్రపంచించుటకును స్వభక్తి యవశ్యకర్తవ్యం బని వర్ణించుటకును శ్రీ భగవంతుఁ డిట్లనియె —మహాత్—యుద్ధాదిస్వధర్మానుష్ఠానమునందును మహాజనపరిచర్యయందును సమర్థము లయిన బాహువులు—చేతులు గలవాఁడా! భూయఏవ=వెండియును; మే; వచః; శృణు. ఎట్టిదానిని? పరమమ్=పరమార్థనిష్ఠమును మద్వచనముచే అమృతముచేతంబోలె ప్రీతిని బొందుచున్న నీకొఱకు, హితకామ్యయా=హితేచ్ఛచే; యత్=దేని; అహం వక్ష్యామి. దానిని.

పరమార్థప్రప, దైవజ్ఞసూర్యపండిత ప్రణీతము.—

ఇట్లు ద్వితీయాధ్యాయము మొదలుకొని యధ్యాయషట్కమునందుఁ గ్రమంబున దేహాదివ్యతిరిక్తాత్మస్వరూపప్రదర్శనపూర్వకంబుగాఁ దత్ప్రాప్త్యుపాయభూతము లయినకర్మనైష్కర్మ్యాభ్యాసభక్తియోగములను దదధికారులను నిరూపించి స్థూలసూక్ష్మప్రపంచము మిథ్య యని ప్రదర్శించుప్రసఁగంబున స్వసత్యత్వంబును బ్రకటించుచు ముఖ్యప్రాణం బనునామాంతరము గల యపంచీకృతభూతవిగ్రహహిరణ్యగర్భాత్మకం బగు స్వస్వరూపము నిరూపించెను. ఇప్పుడు మధ్యమప్రాణం బనునామాంతరము గల పంచీకృతభూతవిగ్రహం బగు స్థూలవ్యష్టిసమష్ట్యాకార విరాడాత్మకస్వరూపంబును బ్రదర్శించుటకై దశమైకాదశాధ్యాయముల యారంభము. అందు దశమమున వ్యష్టి యనునామాంతరము గల విభూతి నిరూపింపఁబడుచున్నది. అందు అలౌకిక సామర్థ్యము గల వ్యష్టియే విభూతి యనఁబడును, అదియు విశ్వ

రూపాంగోద్భూతము లైన దేవ దేవర్షి గంధర్వ సిద్ధావతార పక్షిసమూహ పశ్వాదిః పశు మనుష్యోరగవృక్షాదిరూపంబుల ననంతమై యున్నది. అందు శ్రుతిస్మృతిప్రసిద్ధంబులఁ గొన్నిటిని బ్రదర్శించుటకై భగవంతుఁ డుపక్రమించుచున్నాఁడు.—మహాబాహో అని సంబోధనముచే అర్జునునకు స్వాజ్ఞానోద్భూత మగు ప్రపంచము జయించుట యందుఁ బరమపురుషార్థం బవలంబ మని సూచింపఁబడినది. భూయః అనుపదముచే సప్తమనవమాధ్యాయంబులఁ గొన్నివిభూతులు చెప్పఁబడిన వని సూచింపఁబడినది. ఎట్టివచస్సును? పరమమ్=పరమార్థము నిరూపించుదానిని. యత్=అమృతోపమమైన దేనిని. ప్రీయమాణాయ=ప్రీతిని బొందుచున్న; తే=నీకొఱకు; హితకామ్యయా=హితేచ్ఛచే; వక్ష్యామి.

రామానుజభాష్యము.—

భక్తియోగము సపరికరముగాఁ బ్రతిపాదింపఁబడినది. ఇప్పుడు భక్తి పుట్టుటకును అది వృద్ధిఁ బొందుటకునై భగవంతుని నిరంకుశైశ్వర్యాదికల్యాణగుణగణంబు లనంతంబు లనుటయు, సమస్తజగంబును తచ్ఛరీరంబై తదాత్మకం బగుటచే భగవన్నియామ్యం బనుటయుఁ బ్రపంచింపఁబడుచున్నది.—నామాహాత్మ్యమును విని ప్రీతిఁ బొందుచున్న నీకు నాయందు భక్తి పుట్టి యభివృద్ధిఁ బొందవలయు నను హితంబుఁ గోరి వెండియు మన్మాహాత్మ్యప్రపంచవిషయమే యగు నేపరమవాక్యమును జెప్పఁబోవుచున్నానో దాని సావధానముగా వినుము.

మాధ్వభాష్యము.—

ఉపాసనార్థము విభూతులను గొన్నిటినిగుఱించి విశేషకారణత్వమును * ఈయధ్యాయముచే జెప్పుచున్నాఁడు.—ప్రీయమాణాయ=విని సంతోషము నొందుచున్నవానికొఱకు.

న మే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః
అహ మాదిర్హి దేవానాం మహర్షీణాం చ సర్వశః. ౨

భా. ఎందుకు నేను జెప్పుచున్నానో వినుము.—సురగణాః=ఇంద్రాదులు; నవిదుః = ఎఱుంగరు. దేనిని వా రెఱుంగరు? మే=నాయొక్క; ప్రభవమ్=ప్రభావమును, ప్రభుశక్త్యతిశయమును, లేక, ప్రభవనమును,

* కొన్నిటిని భగవంతుఁడు సామర్థ్యాతిశయము గలుగునట్లు నిర్మించె ననుటను.

ఉత్పత్తిని. మహర్షయః = భృగువు మొదలగువారును; నః ఎఱుంగరు. ఎందువలన వా రెఱుంగరు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి = ఎందు వలన ననఁగా; అహమ్=నేను; దేవానామ్=దేవతలకును; మహర్షీణాంచ= మహర్షులకును; సర్వశః=సర్వప్రకారములచేతను; ఆదిః=కారణమును.

దేవతలు గాని మహర్షులు గాని నాప్రభావమును, విభూతిరూపంబున నాయావిర్భావమును ఎఱుంగరు. ఎందువలన ననఁగా, ఆదేవతలకును మహర్షులకును అన్నివిధంబులను నేను కారణమనై యున్నా నని తాత్పర్యము.

ఆ. ఇతరుఁ డెవ్వఁ డైనను నాకుఁ బరమవాక్యము చెప్పఁగలఁడు, దాని చేఁ దత్త్వజ్ఞానము కాఁ గలదు, భగవంతుఁ డేల చెప్పవలయును? అని శంకించి పరిహరించుచున్నారు —ఎందుకు ఇత్యాదిగా. ఇంద్రాదులును భృగ్వాదులును భగవత్ప్రభావము నెఱుంగ రనుటకుఁ బ్రశ్నపూర్వకముగా హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. నిమిత్తత్వంబునను ఉపాదానత్వంబునను దేవాదులకు భగ వంతుఁడే హేతు వగుటవలనఁ దద్వికారభూతు లయినయాదేవాదులు తత్ప్రభావము నెఱుంగ రని యర్థము.

హ. మే; ప్రభవమ్=ఉత్పత్తిని; సురగణాః; నవిదుః=ఎఱుంగరు. న మహ ర్షయః. నాయుత్పత్తిని; సురగణంబులును మహర్షులును ఎఱుంగ రని యర్థము. హి=ఎందువలన ననఁగా. అహమ్=నేను; ఆదిః=కారణమను; దేవానామ్; మహర్షీ ణాంచ; సర్వశః=అందఱకును. ఎందువలన దేవతలకును మహర్షులకును అందఱకును నేను గారణమనో అందువలన దేవతలును మహర్షులును నాయుత్పత్తి నెఱుంగ రని యర్థము.

శం. ఓయీ ! నాకుఁ దత్త్వము నుపదేశించువారు పెద్దలు వ్యాసాదులు కలరు, వారిపరమవాక్యము వినుదునేని నాకు జ్ఞానము కాఁగలదు, ఎందుకు నీవే చెప్ప వలయును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సురగణాః = ఇంద్రాదిదేవతలును; మహ ర్షయః=భృగ్వాదులును వ్యాసాదులును; మే=నాయొక్క—మహదాదిప్రపంచమును సృజించినపరమేశ్వరునియొక్క; ప్రభవమ్=ప్రభావమును, సృష్టిస్థితిప్రలయప్రవేశనియ మన నిగ్రహానుగ్రహాదిసామర్థ్యమును; సర్వశః = సర్వవిధములచేత; నవిదుః = ఎఱుంగరు. ఓయీ ! దేవతలును భృగ్వాదులును ఆదిమునులు, దివ్యజ్ఞాన సంపన్ను లును, ఎట్లు నీప్రభావము నెఱుంగరు ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి=ఎందువలన

నన:గా; దేవానామ్; మహర్షీణామ్; అందఱకును, ఉత్పత్తికిని వైభవసిద్ధికిని తపస్సిద్ధికిని యోగసిద్ధికిని దివ్యజ్ఞానసిద్ధికిని, అహమ్= నేనే; ఆదిః=కారణము. «తస్మాచ్చ దేవా బహుధా సంప్రసూతాః, యస్మిన్యుక్తా మహర్షయో దేవతాశ్చ" అను శ్రుతివలన నావలననే వారి కుత్పత్తియు సర్వార్థసిద్ధియు. కావున నాకు వెనుకటివారు వారు నామహత్త్వము నెఱుంగరు, ఎట్లు తండ్రిమహత్త్వమును శిశు వెఱుంగదో అట్లు; అందువలన నామహత్త్వము నేనే యుపదేశింపవలయు నని భావము.

మ. మున్ను బహువిధములం జెప్పినదానినే యొదుకు వెండియుఁ జెప్పెదవు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—మే = నాయొక్క; ప్రభవమ్=ప్రభుశక్త్యతిశయమును, లేక, ప్రభవనమును—ఉత్పత్తిని—అనేకవిభూతుల నావిర్భవించుటను; సురగణాః=ఇంద్రాదులును; మహర్షయః=భృగ్వాదులును; సర్వజ్ఞులైనను, నవిదుః=ఎఱుంగరు. వా రెఱుంగమికి హేతువుఁ జెప్పుచున్నాఁడు.—హి=ఎందువలన ననఁగాః అహమ్; దేవానాం మహర్షీణాంచ—అందఱకును; సర్వశః=సర్వప్రకారములచేతను—ఉత్పాదకుండ నగుటచేతను బుద్ధ్యాదిప్రవర్తకుఁడ నగుటచేతను, లేక, నిమిత్త మగుటచేతను ఉపాదాన మగుటచేతను; ఆదిః = కారణము. కావున మద్వికారభూతులు వారు మత్ప్రభావము నెఱుంగ రని యర్థము.

శ్రీ. చెప్పియున్నను వెండియుఁ జెప్పుటకు దుర్జ్ఞేయత్వము హేతు వని చెప్పుచున్నాఁడు.—మే=నాయొక్క; ప్రభవమ్ = ప్రకృష్ట మయినభవమును—జన్మరహితుఁడనైనను నానావిభూతుల నావిర్భవించుటను, సురగణంబులుగూడ భృగ్వాదిమహర్షులు గూడ, నవిదుః=ఎఱుంగరు. అందుకు హేతువు—అహం హి=నేను గదా! దేవానాం మహర్షీణాంచ; ఆదిః = కారణము; సర్వశః = సర్వప్రకారములచేతను—ఉత్పాదకుఁడ నగుటచేతను బుద్ధ్యాదిప్రవర్తకుఁడ నగుటచేతను. అందువలన నా యనుగ్రహము లేక న న్నెవ్వరు నెఱుంగ రని యర్థము.

ప. ఇఁకఁ దనవచన మతిరహస్యం బగుటచే దుర్విజ్ఞేయం బని చెప్పుచున్నాఁడు.—మే; ప్రభవమ్=లీలచేఁ బ్రాదుర్భావమును; సురగణంబులును భృగ్వాదిమహర్షులును, న విదుః=తెలియరు. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి=ఏకారణమువలన; అహమ్; సర్వశః = అందఱకును; దేవానాం మహర్షీణాంచ; ఆదిః=కారణము. అనాదిసిద్ధుఁడ నగుటచేఁ బ్రాచీనుఁడ నగు నావలననుండి దేవర్షులు

పుట్టిరి. శ్రుతియును.—« ముఖా దిన్ద్రశ్చాగ్నిశ్చ ప్రాణా ద్వాయు రజాయత "
అని. అట్లు « సప్తర్షయః ప్రవిహితాశ్శరీరే " అని. మఱియు.—« తస్యా సప్తర్షయ
స్సప్తతీరే వా గస్త్యమీ » అని. భాష్యము...తీరే—ముఖసమీపమునందు, నేత్ర
శ్రోత్రనాసాజిహ్వారూపసప్తేంద్రియరూపులు సప్తర్షు లని యర్థము.

రా. సురగణంబులును మహర్షులును అతీంద్రియ మయినయర్థము నెఱిం
గినవారై మిక్కిలి యధిక మయినజ్ఞానము గలవార లయ్యు, మే; ప్రభవమ్=ప్రభావ
మును; నవిదుః—నా నామకర్మస్వరూపస్వభావాదికము నెఱుంగరు. ఎందువలన
ననఁగా. ఆదేవతలకును మహర్షులకును, సర్వశః; అహమ్ ఆదిః—వారిస్వరూపమున
కును జ్ఞానశక్త్యాదులకును నేను గారణమును. వారికి దేవత్వదేవర్షిత్వాదులకు హేతు
భూత మైనపుణ్యమున కనుగుణముగా నాచేఁ బరిమితం బగుజ్ఞాన మియ్యఁబడినది.
కావునఁ బరిమితజ్ఞాను లగుదేవాదులు మత్స్వరూపాదికము యథాయథముగా
నెఱుంగరు.

మా. ప్రభవమ్=ప్రభావమును, లేక, మదీయ మయినజగదుత్పత్తిని, జగ
దుత్పత్తి భగవంతునివశ మగుటవలన భగవంతుని దని చెప్పఁబడినది. భగవదుత్పత్తి
కలదేని అప్పుడు దేవాదులు నెఱుంగుదురు, సర్వజ్ఞు లగుటవలన; కావున లే దని
భావము. అహ మాదిర్హి అనుటయో ఉత్పత్తియు నెవ్వనివశమో వానికి దేనివలన
నుత్పత్తి యగు నని తెలుపుటకొఱకు. « అహం సర్వస్య జగతః ప్రభవః ప్రలయః »
అనియుఁ జెప్పఁబడినది. చెప్పఁబడినది గూడ నిది యంతయు నితరస్థలమునందును.—
« కో అద్ధా వేదక ఇహ ప్రవోచత్, కుత ఆజాతా కుత ఇయం విసృష్టిః, అర్వా
గ్దేవా అస్య విసర్జనాయ, అథా కో వేద యత ఆబభూవ " ♦ అని. « నత త్వ
భావ మృషయశ్చ దేవా విదుః కుతో ఽన్యే ఽల్పధృతి ప్రమాణాః » * అని ఋగ్వే
దఖిలములయందు. ఇతర మయినయర్థము ♦♦ యో మా మజ మ్మనువాక్యమువలననే
తెలియుచున్నది.

---

♦ ఈవివిధ మయిన జగత్సృష్టి ఏకారణమువలనఁ బుట్టినదో అని యెవ్వఁ డెఱుంగును ?
ఎవ్వఁ డిందుఁ జెప్పెను ? ఈజగత్తును సృజించుటకు దేవతలుగూడ వెనుకటివారు. ఇఁక నెవ్వనివలనఁ
గలిగెనో బ్రహ్మదేవుఁ డెఱుంగును.

* వానిప్రభావమును ఋషులును దేవతలు నెఱుంగరు, ఇఁక అల్ప మయినధృతియును జ్ఞాన
మును గల యితరు లెట్లెఱుంగుదురు ?

♦♦ భగవంతునకు జన్మము లే దనుట.

యో మా మజ మనాదించ వేత్తి లోకమహేశ్వరమ్
అసమ్మూఢ స్స మర్త్యేషు సర్వపాపైః ప్రముచ్యతే. 3

భా. మఱియును —యః=ఎవ్వఁడు; మామ్=నన్ను; అజమ్ అనాదించ=ఎందువలన నేను దేవతలకును మహర్షులకును ఆదినో, నా కితరుఁడు ఆది లేఁడో అందువలన నేను అజుఁడను అనాదిని, అనాదిత్వము అజత్వమునకు హేతువు, అట్టి అజునిఁగాను అనాదినిగాను; లోకమహేశ్వరమ్=లోకములకు పరముఁడైన యీశ్వరునిఁగాను, తురీయునిఁగాను—అజ్ఞానతత్కార్యవివర్జితునిఁగాను; వేత్తి = ఎఱుంగుచున్నాఁడో; అసమ్మూఢః= సమ్మోహము లేనట్టి; సః=అతఁడు; మర్త్యేషు = మనుష్యులయందు; సర్వపాపైః = సమస్తపాపములచేతను, అబుద్ధిపూర్వకృతములచేతను, బుద్ధిపూర్వకృతములచేతను; ప్రముచ్యతే=విడువఁబడుచున్నాఁడు.

నేను అజుఁడను అనాదిని తురీయరూపుఁడై యజ్ఞానతత్కార్యవివర్జితుఁడగుమహేశ్వరుఁడ నని యెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు సమ్మోహము లేనివాఁడగుటవలన సమస్తపాపములచేతను విడువఁబడుచున్నాఁ డని తాత్పర్యము.

ఆ. ఇందువలనఁగూడ నొకానొకఁడే భగవత్ప్రభావము నెఱుంగు నని చెప్పుచున్నారు మఱియును అని. దేనిఁ బెక్కం డ్రెఱుంగరో ఆభగవంతుని ప్రభావమేది? అనఁగాఁ బారమార్థిక మగుప్రభావమును తద్జ్ఞానఫలంబును జెప్పుచున్నారు యః ఇత్యాదిగా. రెండుపదములపౌనరుక్త్యమును బరిహరించుచున్నారు అనాదిత్వము ఇత్యాదిగా.

హ. యః; మామ్=నన్ను పరమేశ్వరుని; అనాదినిగానిగాను జన్మరహితునిఁగాను, లోకమహేశ్వరమ్=లోకములకు గొప్పయీశ్వరునిఁగాను; వేత్తి = ఎఱుంగుచున్నాఁడో. అసమ్మూఢః=సమ్మోహరహితుఁ డగు; సః=అతఁడు; మర్త్యేషు = మనుష్యులయందు; సర్వపాపైః ప్రముచ్యతే.

శ్రీ౦. ఓయీ! నీవే నీమహత్త్వము నుపదేశింతువు గాక, దాని వినుటవలన నా కేమి యగును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—మర్త్యేషు = మరణశీలురగు శతకోటిసంఖ్యాకు లయినపండితులయందు; యః=ఎవ్వఁడు; ముముక్షుచేత సదసద్వివేకవైరాగ్యములవలన, అసంమూఢః=విషయములయం దిష్టతాబుద్ధి సంమో

హాము, అది లేనివాఁడై, విషయాశాపిశాచికి అవశుండై; సుఖసాధన మగు సర్వంబును సన్న్యసించి మత్ప్రసాదము నొందినవాఁడై శ్రవణమననాదిసముత్పన్నజ్ఞానముచే, అజమ్ = జన్మాదిరహితుని; జన్మాదులు సంభవింప దనుటకుఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—అనాదిమ్=« న తస్య కశ్చి జ్జనితా నచా ఒధిపః » అనుశ్రుతివలన, ఆది—జన్మాదికారణము నిమిత్తము గాని యుపాదానము గాని యెవ్వనికి లేదో ఆతఁడు అనాది, అట్టివానిని, కావుననే అజుని నిత్యుని; ఓయీ! అనాదిత్వాజత్వములు శశవిషాణమునకుఁ గూడ సంభవించుటవలన దానికిని నిత్యత్వము కలదు కావున నతివ్యాప్తి యగును, అనఁగా తనకు భావత్వంబును అదృశ్యత్వంబును బరమమహత్త్వంబును శ్రుత్యనుమానగమ్యత్వంబును సూచించుటకై చెప్పుచున్నాఁడు.—లోకమహేశ్వరమ్ = ఎవ్వనిసన్నిధిమాత్రంబున లోకము—జగత్తు సర్వంబును చేష్టించుచున్నదో అతఁడు ఈశ్వరుఁడు, ఎట్లు జడ మయినరథము రథికునిచేఁ జేష్టించుచున్నదో అట్లు జడ మయినజగత్తు సర్వంబును జేతనునిచేతనే చేష్టించుచున్నది కావున జగచ్చేష్టాక్రియచే తద్ధేతు వగుచేతనునిసత్త్వమును భావత్వంబును బరమమహత్త్వంబును అనుమానింపఁబడుచున్నది, « య ఈశే ఽస్య జగతో నిత్య మేవ" అని శ్రుతిప్రమాణంబును గలదు, అందువలన అనాదిని అజుని లోకమునకు మహేశ్వరుని—సర్వప్రపంచప్రవర్తకుని; చకారమువలన కూటస్థాసంగచిద్రూపుని; మామ్=నన్ను, నిర్విశేష మగుపరబ్రహ్మమును; వేత్తి=సాక్షాత్తుగా నిదియే నే నని స్వస్వరూపముననెఱుంగుచున్నాఁడో; సః=అట్టిబ్రహ్మవిదుఁ డగుయతి; సర్వపాపైః = సమస్తము లయిన—బుద్ధిపూర్వకములును అబుద్ధిపూర్వకములు నగు పాపములచేతను; పాపకార్యము లగు దుఃఖదుర్యోనిదుర్గతులచేతను; ప్రముచ్యతే—పాపములతోను బాపకార్యములతోను కొంచెమేనియు సంబంధింపఁ డని యర్థము. సర్వాత్మదర్శి యగు బ్రహ్మవిదునకుఁ బాపాచరణము సంభవింపదు, అది కలదేని బ్రహ్మవిత్త్వము సంభవింపమివలన. పాపపుణ్యకర్మాచరణము దేహజాతివర్ణాశ్రమాద్యభిమానైకమూలకంబగుటవలన నది కలదేని వీనికి బ్రహ్మవిత్త్వమే సంభవింపదు. బ్రహ్మవిత్త్వం బనఁగా సర్వదృశ్యవిలక్షణ మయినబ్రహ్మమునందే ఆత్మత్వబుద్ధి, అది యుండునపుడు దేహాదులయం దహంభావము కలుగదు, అది కలదేని బ్రహ్మమునం దాత్మత్వబుద్ధి సంభవింపనే సంభవింపదు. ఈవిపరీతప్రత్యయములు రెండును దేజస్తిమిరంబులుంబోలె నేకకాలంబున నొక్కచో నుండఁజాలవు. క్రమంబునఁ గూడ నొక్కచో నుండఁజాలవు. అనాత్మయం దహంభావంబును దదాశ్రితజాత్యాద్యభిమానంబును లేకయే యుండు

నపుడు విద్వాంసునకుఁ గర్మాచరణము సంభవింపదు. అందువలన విద్వాంసునకు బుద్ధిపూర్వక మయినపాపాచరణము సంభవింపదు. ఓయీ! దేహాత్మభావంబునఁ బాపము చేసి « నేను బాపము చేసితి ” నని యొకానొకప్పుడు కర్తృత్వబుద్ధియును వెండియు అధిక్రియబ్రహ్మభావంబున « నేను గర్తను గా ” నని యకర్తృత్వబుద్ధియును ఒక్కనికిఁ గ్రమంబున నుపపన్నములే యగును అందువేని; కావు. అట్లగునప్పుడు సర్వాత్మభావదర్శనవిచ్ఛిత్తి ప్రసక్తించుటవలన. కావున సర్వాత్మభావదర్శనంబును దేహాద్యాత్మత్వబుద్ధియుఁ బాపాచరణంబును విద్వాంసునకు సంభవింపవు. « నేను బ్రహ్మవిదుఁడను నాకు దోషము లేదు ” అని ప్రాణిహింసనుగాని యథేష్టాచరణమును గాని యెవ్వఁడు చేయుచున్నాఁడో అతఁడు బ్రహ్మవిదుఁడే కాఁడు, « సర్వభూతసుహృచ్ఛాన్తః » అను బ్రహ్మవిదునిలక్షణము లేమివలన. కావున విద్వాంసునకు బుద్ధిపూర్వకపాపాచరణము సంభవింపదు. మ తేమనఁగా, అబుద్ధిపూర్వకముమాత్ర మొకానొకప్పుడు సంభవింపవచ్చును. జ్ఞానముచే దానినివృత్తి యగును. అయినను జ్ఞానమాహాత్మ్యము స్తుతింపఁబడుచున్నది—ద్వివిధము లగుపాపములచేతను విడువఁబడుచున్నాఁ డని. లేక. అనాదిమ్=జన్మాదికారణవర్జితుని; కావుననే, అజమ్ = జన్మాదిసర్వవికారశూన్యుని; లోకమహేశ్వరమ్ = సర్వలోకములకును పెద్దయీశ్వరుని, నిరతిశయైశ్వర్యసంపన్నుని నిగ్రహానుగ్రహకర్తను మోక్షప్రదాతను; మామ్=నన్ను, పరమాత్మను; యః=ఎవ్వఁడు; వేత్తి=శాస్త్రాచార్యోపదేశమువలన నెఱింగి మోక్షేచ్ఛచే నన్నుపాసించుచున్నాఁడో; సః మర్త్యేషు=మృత్యుగ్రస్తులయం దతఁడే, అసమ్మూఢః=కామాగ్నిచే నందఱును దందహ్యమాను లగుచుండఁగా నతఁడు తాను దానికి లోనుగాక మోక్షమునే యపేక్షించి శ్రద్ధాభక్తులతో నన్నుపాసించుచుండుటవలన అసంమూఢుఁడు నాభక్తుఁడు; సర్వపాపైః=జన్మాంతరకృతంబులును ఏతజ్జన్మకృతంబులు నగు మనోవాక్కాయకృతపాపము లేవి గలవో వాని యన్నిటిచేతను, జ్ఞానోత్పత్తికిఁ బ్రతిబంధకము లగువానిచేత; నన్నుపాసించుటవలన, ప్రముచ్యతే = ప్రకర్షంబున—నిశ్శేషముగా విడువఁబడుచున్నాఁడు. « జ్ఞాన ముత్పద్యతే పుంసాం క్షయాత్పాపస్య కర్మణః » అనుస్మృతివలన సత్త్వప్రధాన మయిన మదుపాసనముచే సర్వపాపవినిర్ముక్తుఁడై జ్ఞానము నొంది ముక్తుఁ డగుచున్నాఁ డని యర్థము.

మ. మహాఫలం బగుటవలనఁ గూడ నొకానొకఁడే భగవంతునిప్రభావము నెఱుంగు నని చెప్పుచున్నాఁడు.—అనాదిమ్=సర్వకారణంబ నగుటవలన ఆది—కార

ణము లేనివాఁడను; అనాది నగుటవలన, అజమ్ = జన్మశూన్యుఁడను; లోకములకు మహేశ్వరుఁడ నగు; మామ్=నన్ను; యః వేత్తి; సః; మర్త్యేషు=మనుష్యులనడుమ; అసంమూఢః=సమ్మోహవర్జితుఁడై; సర్వపాపైః=సమస్తపాపములచేతను, బుద్ధిపూర్వకృతము లగువానిచేతను గూడ; ప్రముచ్యతే = ప్రకర్షంబున—కారణోచ్ఛేదమువలన తత్సంస్కారము లేమిచే విడువఁబడుచున్నాఁడు.

శ్రీ. ఇట్టి యాత్మజ్ఞానమునకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—♦.

ప. ఇఁక తన్నెఱుంగుటకు ఫలము చెప్పుచున్నాఁడు.—సర్వకారణంబ నగుటవలననే అనాదిని, కావుననే అజుని—జన్మరహితుని, సర్వలోకంబులకును భూర్భువస్స్వ ర్మహ ర్జన తపః ప్రభృతులకు మహేశ్వరుని—చేష్టింపఁ జేయువానిని, ఇట్టి నన్నెవ్వఁ డెఱుంగుచున్నాఁడో అతఁడు మర్త్యులయందు అసమ్మోఢుఁడై—మోహరహితుఁడై సర్వపాపములచేతను విడువఁబడుచున్నాఁడు.

రా. దేవాదులకును అచింత్య మయిన మాస్వరూపముయొక్క యాథాత్మ్యవిషయజ్ఞానమునే భక్త్యుత్పత్తివిరోధిపాపవిమోచనోపాయమునుగాఁ జెప్పుచున్నాఁడు.—అజమ్ = పుట్టను గావున అజుఁడను, ఇందుచే వికారిద్రవ్య మగు నచేతనము కన్నను తత్సంసృష్టుఁ డగు సంసారిచేతనునికన్నను వైలక్షణ్యము చెప్పఁబడినది; సంసారి చేతనునకుఁ గర్మకృత మయిన యచిత్సంసర్గముగదా జన్మము; అనాదిమ్ అనుటచే ఆదిమంతుఁ డగు నజునికన్నను—ముక్తాత్మకన్నను వైలక్షణ్యము చెప్పఁబడినది; ముక్తాత్మకు అజత్వము ఆదిమంతము గదా! వానికి హేయసంబంధము పూర్వవృత్తం బగుటవలన తదర్హత కలదు, కావున అనాది మ్మనుటచే హేయసంబంధమున కనర్హతచే తత్ప్రత్యనీకత చెప్పఁబడుచున్నది. నిరవద్యమ్ ఇత్యాదిశ్రుతిచేతఁగూడ;
ఇట్టివాఁడను ఏవమ్ = హేయసంబంధప్రత్యనీకస్వరూపుఁడ నగుటచే తదనర్హుండ నగు; మామ్= నన్ను; లోకమహేశ్వరమ్ = లోకేశ్వరులకును ఈశ్వరుని; మర్త్యేషు; అసమ్మూఢః= ఇతరముతోసమానత్వమున నేకముగాఁ జేసి మోహపడుట సంమోహము, అది లేనివాఁడై; యః వేత్తి=ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో. సః=అతఁడు; సర్వపాపైః=మద్భక్తివిరోధు లగు సమస్తపాపములచేతను; ప్రముచ్యతే = విడువఁబడుచున్నాఁడు. ఇది యభిప్రాయము—లోకమున మనుష్యులకు రాజయినవాఁడు ఇతరమనుష్యసజాతీయుఁడు, ఒకానొకకర్మముచే మనుష్యాధిపత్యము నొందెను, అట్లు దేవాధిపతియు,

♦ తక్కినది మధుసూదనీయముతో సమానము.

అట్లే అండాధిపతియు నితరసంసారిసజాతీయుఁడే, అతఁడును భావనాత్రయాంతర్గతుఁ డగుటవలన ♦♦; "యో బ్రహ్మాణం విదధాతి" అనుశ్రుతివలనఁ గూడ; ఇతరులు గూడ అణిమాద్యైశ్వర్యము నొందినవా రెవ్వరు గలరో వారును అట్టివారలే; ఇతఁడో లోకమహేశ్వరుఁడు—కార్యకారణావస్థ మగు నచేతనముకన్నను బద్ధముక్తలగుచేతనులకన్నను ఈశితవ్య మగు సమస్తముకన్నను నిఖిలహేయప్రత్యనీకానవధికాతిశయకల్యాణైకతానుం డగుటచేతను నియమనైకస్వభావుఁ డగుటచేతను విలక్షణుఁ డని యితరసజాతీయుఁ డనుమోహము లేనివాఁడై యెవ్వఁడు న న్నెఱుంగుచున్నాఁడో అతఁడు సర్వపాపంబులచేతను విముక్తుం డగుచున్నాఁడు అని.

వ్యా. అనాదిమ్ = అనుఁడును—చేష్టింపఁజేయువాఁడును ఆదియును గావున అనాదిని. ఇతర మయిన యనాదిశబ్దార్థము అజపదముచే సిద్ధించుటవలన,

బుద్ధి ర్జ్ఞాన మసమ్మోహః క్షమా సత్యం దమ శ్శమః
సుఖం దుఃఖం భవో ఽభావో భయం చా ఽభయ మేవచ. ౪
అహింసా సమతా తుష్టి స్తపో దానం యశో ఽయశః
భవన్తి భావా భూతానాం మత్త ఏవ పృథగ్విధాః. ౫

భా. ఇందువలనఁ గూడ నేను మహేశ్వరుఁ డనులోకములకు.—బుద్ధిః=అంతఃకరణముయొక్క సూక్ష్మార్థగ్రహణసామర్థ్యము, అది కలవానిని గదా బుద్ధిమంతుఁ డని చెప్పుచున్నారు; జ్ఞానమ్ = ఆత్మాదిపదార్థముల నెఱుంగుట; అసమ్మోహః=ప్రత్యుత్పన్నము లయిన బోద్ధవ్యములయందు ♦ వివేకపూర్వక మగునప్రవృత్తి; క్షమా = ఆకర్షింపఁబడినను కొట్టఁబడినను జిత్తమున వికారము నొందకుండుట; సత్యమ్=తాను కన్నదియు విన్నదియు నగు తనయనుభవమును బరునికిఁ దెలుపుటకై యట్లె చెప్పఁబడువాక్యము సత్య మనఁబడును; దమః = బాహ్యేంద్రియముల యుపశమము; శమః = అంతఃకరణముయొక్క యుపశమము; సుఖమ్= ఆహ్లాదము; దుఃఖమ్ = సంతాపము; భవః=ఉత్పత్తి; అభావః = తద్విపరీతము *; భయంచ=వెఱపును; అభయ మేవచ = తద్విపరీత మయిన

♦♦ కర్మభావన బ్రహ్మభావన ఉభయభావన అని భావనలు మూఁడు.

♦ తత్కాలమున సంభవించినట్టి యెఱుంగవలసినవానియందు.

* నాశ మనుట.

దియు ♦♦. అహింసా=ప్రాణులఁ బీడింప కుండుట; సమతా = సమచిత్తుం డగుట; తుష్టిః=సంతోషము, లాభములయందు చాలు నట్టిబుద్ధి; తపః= ఇంద్రియముల సంయమించి శరీరమును బీడించుట; దానమ్=యథాశక్తి ఇచ్చుట; యశః=ధర్మమువలనఁ గలుగుకీర్తి ♦; అయశః=అధర్మమువలనఁ గలుగునపకీర్తి; భావాః=ఈబుద్ధ్యాదులు; భూతానామ్=ప్రాణులకు; పృథగ్విధాః=నానావిధములై, స్వకర్మానురూపముగా; మత్త ఏవ=నావలననే-యీశ్వరునివలననే; భవన్తి=కలుగుచున్నవి.

బుద్ధి జ్ఞానము అసమ్మోహము క్షమ సత్యము దమము శమము సుఖము దుఃఖము భవము అభావము భయము అభయము అహింస సమత తుష్టి తపస్సు దానము యశము అయశము-ఈభావము లన్నియుఁ బ్రాణులకుఁ దత్తత్కర్మానురూపముగా నానావిధములై నావలననే కలుగుచున్నవి యని తాత్పర్యము.

రా. భగవంతుఁడు లోకమహేశ్వరుఁ డనుటకు హేత్వంతరముఁ జెప్పు చున్నాఁడు.—ఇందువలనఁ గూడ నిత్యాదిగా. ముముక్షువు లారాధించుటకై బంధ మోక్షసాధనములఁ బురస్కరించి యశేషజగత్ప్రవృత్త్యధిష్ఠాతృత్వరూప మయిన సోపాధికం బగు భగవత్ప్రభావముఁ జెప్పుచున్నారు బుద్ధిః ఇత్యాదిగా. సూక్ష్మాది అనుచోటి యాదిశబ్దముచే సూక్ష్మతరసూక్ష్మతమార్థములు గ్రహింపఁబడుచున్నవి. చెప్పినసామర్థ్యము బుద్ధి యనుటకుఁ బ్రసిద్ధిని బ్రమాణీకరించుచున్నారు అది గల వాని నిత్యాదిగా. ఆత్మాదిపదార్థముల నెఱుంగుట—వాని నెఱింగినవానిని గదా జ్ఞాని యని చెప్పుచున్నారు. ఉపశమము—విషయములనుండి వ్యావృత్తి. యథాశక్తి ఇచ్చుట—పాత్రభూతునకు శ్రద్ధతోఁ దనశక్తి నతిక్రమింపక యర్థములను దేశకాలాను గుణముగాఁ బొందించుట యని యర్థము. చెప్పినబుద్ధ్యాదులకు ఆశ్రయసహితము లకు ఈశ్వరునివలన నుత్పత్తి యని ప్రతిజ్ఞఁ జేయుచున్నారు భావాః ఇత్యాదిగా. నానావిధంబు లగుటకు హేతువుఁ జెప్పుచున్నారు స్వకర్మానురూపముగా నని. ఏ విధంబునను అవి యాత్మాతిరిక్తముగా లేని వగుటవలన నావలననే యని చెప్పఁబడినది.

హ. బుద్ధిః=సూక్ష్మము నెఱుంగుసామర్థ్యము; జ్ఞానమ్=పదార్థముల నెఱుం గుట; అసంమోహః=తత్కాలమున సంభవించినదాని నెఱుంగుసామర్థ్యము; సత్యమ్=

♦♦ భయము లేమియు ననుట.

♦ ప్రసిద్ధి.

కన్నట్లుగాను విన్నట్లుగాను విషయమును జెప్పుట; దమః=కర్మేంద్రియములయుపరతి; శమః=అంతఃకరణోపరతి; మత్తఏవ=పరమేశ్వరునివలననే, ఏవకార మవధారణార్థకము, ఇతరులవలనఁ గలుగునవి కా వని యర్థము ♦.

౪౦. తన్నుపాసించి సర్వపాపవినిర్ముక్తులైనముముక్షువులకుఁ దనవలననే జ్ఞానసాధనము గూడ సిద్ధించు నని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—జ్ఞానమ్=బ్రహ్మాత్మైకత్వవిషయము, పరోక్షమును అపరోక్షమును; బుద్ధిః=అదియే నే నని జ్ఞానికి బ్రహ్మమాత్రమే తా నను నిశ్చయము; అసమ్మోహః=రెండియు విపరీతభావన యుదయింప కుండుట. క్షమా=ఆధ్యాత్మికాద్యుపద్రవముల సహించుట; సత్యమ్=యథార్థవచనము; సత్య మ్మనునది బ్రహ్మచర్యాదులకు నుపలక్షణము; దమః=బాహ్యేంద్రియనిగ్రహము; శమః=అంతఃకరణము విషయములయందుఁ బ్రవర్తింప కుండుట; అహింసా=బ్రహ్మనిష్ఠచేఁ దన్ను హింసింప కుండుట; సమతా = సర్వత్ర సమదర్శనము; తుష్టిః=ఆత్మానందానుభవము; తపః=చిత్తమున కేకాగ్రత; దానమ్=దండన్యాసము *, మనోవాక్కాయకర్మములచేఁ బ్రాణుల దండింప కుండుట—పీడింప కుండుట యని యర్థము; “దణ్డన్యాసః పరందానమ్” అనుస్మృతివలన; యశః=బ్రహ్మవిదుం డితఁడని సర్వత్ర కీర్తి; అయశః = అపకీర్తి; అయశః అనుటచే అబుద్ధి అజ్ఞానము సమ్మోహము అక్షమ అసత్యము అదమము అశమము హింస ఇత్యాదులకు ఉక్తవిపరీతముల కుపలక్షణము; సుఖమ్—విషయములవలనఁ గలుగునది; దుఃఖమ్—ఆధ్యాత్మికాద్యుపద్రవములవలనఁ గలుగునది; భవః=ఉత్పత్తి; అభావః = వినాశము; భయమ్=భూతములవలన వెఱచుట; అభయమ్—అది లేకుండుట; ఇట్లు, పృథగ్విధాః=నానాప్రకారములు, చెప్పినవియుఁ జెప్పనవియుఁ గామక్రోధలోభమోహదంభదర్పాసూయాహంకారాదులు; భావాః=వికారములు, రాజసములును దామసములును అబుద్ధి మొదలుగా అయశముపఱకుఁ జెప్పినవి బంధహేతువులు; మద్భజనశూన్యు లగు, భూతానామ్=ప్రాణులకు; మత్తఏవ=ఈశ్వరునివలననే; భవన్తి=కలుగుచున్నవి. బుద్ధి మొదలుగా యశస్సుపఱకుఁ జెప్పినట్టి ముక్తిసాధనములు మద్భజనము చేయువారికి నావలననే—ఈశ్వరునివలననే కలుగుచున్నవి. అందువలన ముముక్షువు నాయుపాసనము నవశ్యము చేయవలయును, నన్నుపాసించుటచే సర్వపాపనివృత్తియు సాధనసహిత మగుజ్ఞానంబును సిద్ధించు నని భావము. ఇందుచే సంసారబంధమోక్షకార

♦ తక్కినదంతయు శంకరభాష్యముతో సమానము.

* దండనమును విడుచుట.

నను తానే యనుట "సంసారమోక్షస్థితి బన్ధహేతుః" ఇత్యాది శ్రుతిప్రసిద్ధము ప్రతిపాదింపఁబడినది. అందుచే ముముక్షువులకు భజనీయుం డని సిద్ధము. ఇట్లు రెండుశ్లోకములకు నర్థము.

మ. తాను లోకమహేశ్వరుం డనుటను బ్రపంచించుచున్నాఁడు.—బుద్ధిః= అంతఃకరణముయొక్క సూక్ష్మార్థవివేక సామర్థ్యము; జ్ఞానమ్= ఆత్మానాత్మరూప మయిన సర్వపదార్థముల నెఱుఁగుట; అసమ్మోహః=తత్కాలమున సంభవించువానియందు ఎఱుంగవలసినవానియందుఁ గాని చేయవలసినవానియందుఁ గాని వ్యాకులత్వము లేక వివేకంబునఁ బ్రవృత్తి; క్షమా=ఆక్షేపింపఁబడినను కొట్టఁబడినను వికారము లేని చిత్తము గలుగుట; సత్యమ్=ప్రమాణముచే నెఱింగినయర్థము నట్లే చెప్పుట; దమః= బాహ్యేంద్రియములకుఁ దమవిషయములనుండి నివృత్తి; శమః = అంతఃకరణమున కట్టినివృత్తి; సుఖమ్ = ధర్మమే యసాధారణకారణముగాఁ గల యనుకూలవేద నీయము; దుఃఖమ్ = అధర్మమే యసాధారణకారణముగాఁ బ్రతికూలవేదనీయము; భవః=ఉత్పత్తి; భావః=సత్త ♦; లేక, అభావః = అసత్త; భయంచ=త్రాసము; అభ యమ్—తద్విపరీతము; ఏవచ—ఒకచకారమునకు చెప్పినవానిసముచ్చయ మర్థము, రెండవచకారమునకు అనుక్తము లయిన యబుద్ధ్యజ్ఞానాదులసముచ్చయమర్థము; ఏవ—ఇవి సర్వలోకప్రసిద్ధములే యని యర్థము. అహింసా=ప్రాణిపీడనము విడుచుట; సమతా=చిత్తమునకు రాగద్వేషాదులు లేనియవస్థ; తుష్టిః = భోగ్యములయం దింత మాత్రము చాలు ననుబుద్ధి; తపః = శాస్త్రోక్తమార్గమునఁ గాయేంద్రియశోష ణము; దానమ్ = యుక్తదేశమునందు యుక్తకాలమునందు శ్రద్ధతో యథాశక్తిగా అర్థములను సత్పాత్రమునకు సమర్పించుట; యశః = ధర్మనిమిత్త మగు లోకశ్లాఘా రూప మయినప్రసిద్ధి; అయశః=అధర్మనిమిత్త మయిన లోకనిందారూప మగు ప్రసిద్ధి; ఈబుద్ధ్యాదు లగు; భావాః=కార్యవిశేషములు—కారణసహితము లు; పృథగ్విధాః= ధర్మాధర్మాదు లగుసాధనములవిచిత్రతచే నానావిధములు; భూతానామ్=సర్వప్రాణుల కును; మత్తఏవ=నావలననే, పరమేశ్వరునివలననే; భవన్తి=కలుగుచున్నవి, ఇతరుని వలనఁ గలుగునవి కావు. అందువలన నాలోకమహేశ్వరత్వము చెప్పెడి దేమి? అని యర్థము.

శ్రీ. లోకమహేశ్వరత్వమునే స్ఫుటీకరించుచున్నాఁడు మూఁడుశ్లోకముల చేత —బుద్ధిః=సారాసారవివేకనిపుణత; జ్ఞానమ్—ఆత్మవిషయము; అసమ్మోహః=వ్యా

♦ ఈపక్షమున భవః భావః అని పదవిభాగము.

కులత లేమి; క్షమా-ఓర్పు; సత్యమ్=యథార్థము చెప్పుట; దమః=బాహ్యేంద్రియసంయమము; శమః=అంతఃకరణసంయమము; సుఖమ్=అనుకూలవేదనీయము; దుఃఖమ్—తద్విపరీతము; భవః=ఉత్పత్తి; అభావః = తద్విపరీతము; భయమ్ = త్రాసము; అభయమ్=తద్విపరీతము; అహింసా=పరపీడానివృత్తి; సమతా = రాగద్వేషాదులు లేకుండుట; తుష్టిః=దైవవశమునఁ బొందినదానికి సంతోషించుట; తపః—శారీరాదికము, చెప్పఁబోవునది; దానమ్=న్యాయార్జిత మగుధనాదికమును సత్పాత్రమున కర్పించుట; యశః=సత్కీర్తి; అయశః=దుష్కీర్తి; ఈబుద్ధి మొదలగునవియు తద్విపరీతము లగునబుద్ధి మొదలగునవియు నగు నానావిధము లయినభావములు ప్రాణులకు నావలననే కలుగుచున్నవి.

ప. భావాః=స్వభావములు; మత్తఏవ=మనఃకోశరూపుఁడ నగు నావలననే; భవన్తి = ఉద్భవిల్లుచున్నవి. శ్రుతియును.—“ కామ స్సంకల్పో విచికిత్సా శ్రద్ధాఽశ్రద్ధా ధృతి రధృతి ర్హ్రీ ర్ధీ ర్భీ రిత్యే తత్సర్వం మన ఏవ ” అని *.

రా. ఇట్లు తనస్వభావము ననుసంధించుటచే భక్త్యుత్పత్తికి విరోధు లగు పాపములు తొలంగుననియు విరోధులు తొలంగుటవలననే యార్థికముగా భక్త్యుత్పత్తి యగు ననియుఁ బ్రతిపాదించి తనయైశ్వర్యకల్యాణగుణగణప్రపంచము ననుసంధించుటచే భక్తివృద్ధిఁ బొందువిధముఁ జెప్పుచున్నాఁడు.—బుద్ధిః=మనస్సుయొక్క నిరూపణసామర్థ్యము; జ్ఞానమ్=చిదచిద్వస్తువిశేషవిషయ మయినవిశ్చయము; అసమ్మోహః=మున్ను గ్రహించిన రజతాదికముకంటె విసజాతీయ మయిన శుక్తికాది వస్తువునందు తత్సజాతీయతాబుద్ధినివృత్తి; క్షమా = మనస్సునకు వికారహేతువు కలిగినను వికారము లేకయుండుట; సత్యమ్ = చూచినవిషయమును జూచినట్లుగా భూతహితార్థము చెప్పుట; తదనుగుణ మయినమనోవృత్తి యిట నభిప్రేతము, మనోవృత్తిప్రకరణమువలన; దమః=బాహ్యేంద్రియములను అనర్థవిషయములనుండి నిగ్రహించుట; శమః=అన్తఃకరణము నిగ్రహించుట; సుఖమ్=ఆత్మానుకూలానుభవము; దుఃఖమ్=ఆత్మప్రతికూలానుభవము; భవః=భవనము, అనుకూలానుభవముచేఁ గలుగు మనస్సుయొక్క భవనము ♦♦; అభావః = ప్రతికూలానుభవముచేఁ గలుగుమనస్సుయొక్క అవసాదము ‡; భయమ్=రాఁబోవుదుఃఖముయొక్క హేతువును జూచుటచేఁ

* తక్కినదంతయు శ్రీధరీయముతో సమానము.

♦♦ వికాసము.

‡ కుగ్గుట.

గలుగుదుఃఖము; అభయమ్=తన్నివృత్తి; అహింసా=పరునకు దుఃఖహేతువు కాకుండుట; సమతా=తనయందును సుహృదులయందును శత్రువులయందును అర్థానర్థముల విషయమును సమబుద్ధి గలిగి యుండుట; తుష్టిః=సమాప్తార్థములను జూచినపుడు సంతోషించుస్వభావము; తపః = శాస్త్రోక్త మగుభోగసంకోచరూప మయినకాయక్లేశము; దానమ్=తనభోగ్యములను బరున కిచ్చుట; యశః=గుణవంతుఁ డనుప్రసిద్ధి; అయశః=గుణహీనుఁ డనుప్రసిద్ధి; ఇవి రెండును తదనుగుణమనోవృత్తులుగాఁ దలంపవలయును, తత్ప్రకరణమువలన; అట్లు తపోదానములును గూడ; ఇవి మొదలయిన సర్వభూతములయొక్కయు, భావాః=ప్రవృత్తినివృత్తిహేతువు లగుమనోవృత్తులు; మత్తఏవ—నాసంకల్పమున కాయత్తములయి; భవన్తి.

వ్యా. దానిఁ బ్రపంచించుచున్నాఁడు.—బుద్ధిః = కార్యాకారవినిశ్చయము, «జ్ఞానం ప్రతీతి ర్బుద్ధి స్తు కార్యాకార్యవినిశ్చయః» అని గదా నిఘంటువు. దమః=ఇంద్రియనిగ్రహము. శమః=పరమాత్మయందు నిష్ఠ, «శమో మన్నిష్ఠతా బుద్ధే ర్దమ ఇన్ద్రియనిగ్రహః» అని భాగవతమునందు. తుష్టిః = చాలు ననుబుద్ధి, «అలం బుద్ధి స్తథా తుష్టిః» అనునిఘంటువువలన.

మహర్షయ స్సప్త పూర్వే చత్వారో మనవ స్తథా
మద్భావా మానసా జాతా యేషాం లోక ఇమాః ప్రజాః. ౬

భా. మఱియును.—మహర్షయః=భృగ్వాదిమహర్షులు; సప్త=ఏడుగురును; పూర్వే=పూర్వకాలమున నున్నవారు; తథా=అట్లు; మనవః=మనువులు; చత్వారః=నలువురును, సావర్ణు లని ప్రసిద్ధులు; వారు, మద్భావాః=మద్గత మయినభావన గలవారు, వైష్ణవం బగుసామర్థ్యముతోఁ గూడినవారు; మానసాః=మనస్సుచేతనే పుట్టింపఁబడినవారు నాచేత, జాతాః=పుట్టిరి. యేషామ్=ఏమనువులయొక్కయు మహర్షులయొక్కయు; సృష్టి, లోకే=లోకమునందు; ఇమాః=ఈ; ప్రజాః = స్థావరజంగమరూపప్రజలో.

ఈలోకమునందు సర్వప్రజలును ఎవ్వరిసృష్టియో అట్టిపూర్వు లగు సప్తమహర్షులును నలువురు మనువులును మద్గతభావన గలవారలై నాచేతనే మనస్సుచేఁ బుట్టింపఁబడి జనియించి రని తాత్పర్యము.

అ. సర్వప్రకృతిత్వముమాత్రమే కాదు భగవంతునకు, మఱే మనఁగా, సర్వజ్ఞత్వ సర్వేశ్వరత్వరూప మయినయధిష్ఠాతృత్వముగూడ నని చెప్పుచున్నాఁడు

మఱియును అని. ఆద్యులు భృగువు మొదలుగా వసిష్ఠాంతులు సర్వజ్ఞులు విద్యాసంప్రదాయప్రవర్తకులు. తథా అనుటచే మనువులకుఁ గూడ పూర్వత్వము—ఆద్యత్వ మనువర్తించుచున్నది. ఎవ్వ రామనువు లనఁగాఁ జెప్పుచున్నారు సావర్ణు లని యని, ప్రసిద్ధులు—పురాణములయందుఁ బ్రజలకుఁ బాలకు లనియుఁ దాము నీశ్వరు లనియు నని శేషము. మహర్షులకును మనువులకును తుల్యవిశేషణము వారు ఇత్యాదిగా. నాయందు—సర్వజ్ఞునియందు సర్వేశ్వరునియందు గత మయినభావన గలవారు. భావనాఫలముఁ జెప్పుచున్నారు వైష్ణవంబు ఇత్యాదిగా. వైష్ణవశక్తిచే నధిష్ఠితు లగుటంజేసి జ్ఞానైశ్వర్యవంతు లని యర్థము. వారిజన్మముయొక్క విశేషముఁ జెప్పుచున్నారు మానసాః ఇత్యాదిగా. మన్వాదులకే విశేషణము చేయుచున్నారు యేషా మిత్యాదిగా. విద్యచేతను జన్మముచేతను మన్వాదులకు సంతతిభూతులు ఈ లోకమునందు సర్వప్రజలు నని యర్థము.

పా. మద్భావాః = నావలన సద్భావము గలవారు, మచ్ఛక్త్యాత్ములు. మానసాః=మనస్సునందుఁ బుట్టినవారు ♦.

శం. "భవన్తి భావా భూతానామ్" అని తాను ముముక్షువులచే నుపాస్యుం డగుటకుఁ గారణము దుష్టనిగ్రహ శిష్టానుగ్రహసామర్థ్యంబును బంధమోక్షహేతుత్వంబును సర్వతంత్రస్వతంత్రత్వంబును సర్వజ్ఞత్వంబును సర్వేశ్వరత్వంబును సూచించి యిప్పుడు సామాన్యంబున స్వవిభూతిని మందప్రజ్ఞుల కుపాసనీయవస్తువును నిర్దేశించుచున్నాఁడు.—పూర్వే = అందఱికన్నను బురాతను లగు; సప్త=భృగువు మొదలు వసిష్ఠునివఱకు ఏడుగురు; మహర్షయః=మహర్షులును; తథా=అట్లు ప్రాచీను లగు; చత్వారోమనవః=స్వాయంభువాదు లగు నలువురు మనువులును; మానసాః=జగత్సృష్టి నగు నాయొక్క సంకల్పాత్మక మయినమనస్సువలనఁ బుట్టినవారు; కావుననే; మద్భావాః=నాయొక్క పరమేశ్వరునియొక్క స్వరూపముగా భావింపఁబడుచున్నారు కావున మద్భావులు, నాయొక్క విభూతు లని యర్థము; లోకే = లోకత్రయమునందును; యేషామ్=ఏభృగ్వాదులయు స్వాయంభువాదులయు సంబంధులు; ఇమాః=సర్వత్ర కనఁబడుచున్న; ప్రజాః = స్థావరజంగమప్రజలో, ఇవి యన్నియు నావిభూతులే యని యభిప్రాయము. ఇందుచేఁ జరాచరాత్మకం బగుజగత్తు సర్వంబును నాయొక్క—బ్రహ్మముయొక్క విభూతియే యని సూచిత మగుచున్నది.

♦ తక్కినది శంకరభాష్యముతో సమానము.

వ్యా. ఇందువలనఁ గూడ నిది యిట్లు.—మహర్షయః = వేదమును వేదార్థమును జూచినవారు సర్వజ్ఞులు విద్యాసంప్రదాయప్రవర్తకులు భృగువు మొదలగువారు; సప్త=ఏడుగురు; పూర్వే = సర్గాదియం దావిర్భవించినవారు; అట్లు పురాణము.—“భృగుం మరీచి మత్రించ పులస్త్యం పులహం క్రతుమ్ । వసిష్ఠంచ మహాతేజా స్సోఽసృజ న్మనసా సుతాన్ ॥ సప్తబ్రహ్మాణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః” ♦ అని. తథా; చత్వారో మనవః—సావర్ణ్య లని ప్రసిద్ధులు; లేక; మహర్షయః సప్త—భృగ్వాదులు; వారలకన్నను, పూర్వే=మొదటివారు; చత్వారః=నలువురు సనకాదిమహర్షులు; తథా; మనవః = స్వాయంభువాదులు పదునలువురు; మద్భావాః=నాయందు—పరమేశ్వరునియందు—భావము—భావన గలవారు, మద్భావనావశమువలన ఆవిర్భవించిన మదీయజ్ఞానైశ్వర్యశక్తులు గలవార లని యర్థము; మానసాః = మనస్సువలననే—సంకల్పమువలననే యుత్పన్నులు, కాని యోనిజులు కారు; కావున విశుద్ధ మయినజన్మము గలవా రగుటచే సర్వప్రాణిశ్రేష్ఠులు; హిరణ్యగర్భాత్ముండ నగు నావలననే, జాతాః = సర్గాదికాలమునందుఁ బ్రాదుర్భవించిరి. యేషామ్=ఏభృగ్వాదిసప్తమహర్షులయొక్కయు సనకాదులునలువురియొక్కయుఁ బదునలుగురు మనువులయొక్కయు; లోకే=ఈలోకమునందు; ఇమాః ప్రజాః = ఈబ్రాహ్మణాదిసర్వప్రజలును జన్మముచేతను విద్యచేతను సంతతిభూతులో.

శ్రీ. మఱియును.—సప్త; మహర్షయః—భృగ్వాదులు, “సప్తబ్రహ్మాణ ఇత్యేతే పురాణే నిశ్చయం గతాః” ఇత్యాదిపురాణప్రసిద్ధులు; పూర్వే=వారికన్న పూర్వులు; చత్వారః = ఇతరులు నలువురుమహర్షులు సనకాదులు; తథా; మనవః= స్వాయంభువాదులు; మద్భావాః=నాదైనప్రభావము గలవారు; మానసాః=హిరణ్యగర్భాత్ముఁడ నగు నామనస్సువలననే సంకల్పమాత్రమువలనఁ బుట్టినవారు. ప్రభావమునే చెప్పుచున్నాఁడు.—యేషామ్=ఏభృగ్వాదులయొక్కయు సనకాదులయొక్కయు మనువులయొక్కయు; ఇమాః=ఈబ్రాహ్మణాదులు; లోకే = లోకమునందు; వృద్ధిఁ బొందుచున్నట్టి పుత్త్రపౌత్త్రాదిరూపులును శిష్యప్రశిష్యాదిరూపులు నగు; ప్రజాః= సంతతులు; జాతాః=పుట్టినవారై ప్రవర్తించుచున్నారో.

ప. ఇఁక సృష్టికర్తలును నావలననే యుద్భవిల్లి రని చెప్పుచున్నాఁడు.— ......ఇందుచే “బ్రహ్మాదిస్తంబపర్యంత మగు నేసృష్టి గలదో అది సాంకల్పికము

♦ భృగువును మరీచిని అత్రిని పులస్త్యుని పులహుని క్రతువును వసిష్ఠుని—ఈపుత్త్రులను అమ్మహాతేజుఁడు మనస్సుచే సృజించెను. వీరు సప్తబ్రహ్మ లని పురాణమునందుఁ బ్రసిద్ధి నొందిరి.

కాల్పనికము, కార్యకరణసంభూతరూపము గాదు, « యథాపూర్వ మకల్పయత్ » అను శ్రుతివలన » అని సూచితము *.

రా. సమస్తభూతజాతముయొక్క సృష్టిస్థితులను బ్రవర్తింపఁజేయువారు గూడ నా సంకల్పమునకధీన మయినప్రవృత్తి గలవార లని చెప్పుచున్నాఁడు — పూర్వే సప్తమహర్షయః = అతీతమన్వంతరమునందు ఎవ్వరు భృగ్వాదిసప్తమహర్షులు నిత్యసృష్టిప్రవర్తనముకొఱకు బ్రహ్మమనస్సంభవులు గలరో, మఱియు నెవ్వరు నిత్యస్థితిప్రవర్తనముకొఱకు సావర్ణికు లను నలువురుమనువులు కలరో, ఎవ్వరియొక్క సంతానమయి యుఁ ఁయీలోకమునందు జాతు లయిన యీసర్వప్రజలు ప్రతిక్షణము ప్రలయము వఱకు అపత్యములఁ బుట్టించువారును బాలించువారును అగుచున్నారో, ఆభృగ్వాదులును మనువులును; మద్భావాః — నా కేది భావమో అదియే భావముగాఁ గలవారు మద్భావులు, నామతమునందున్నవారు, నాసంకల్పము ననువర్తించువా రని యర్థము.

మా. పూర్వులు సప్తర్షులు « మరీచి ర త్ర్యంగిరసౌ పులస్త్యః పులహః క్రతుః । వసిష్ఠశ్చ మహాతేజాః '' అని మోక్షధర్మమునందుఁ జెప్పఁబడినవారు. వారు గదా సర్వపురాణములయందుఁ జెప్పఁబడుచున్నారు. చత్వారః = మొదటివారు స్వాయంభువాదులు. వారలప్రజలు గదా యీప్రజలు. రాఁబోవువారికి వీరు ప్రజలు కారు గదా! కావున యుక్తము. విభాగంబును ప్రాధాన్యంబును ప్రాథమికు లగుట వలననే యగుచున్నది. గాతముఖలములయందును జెప్పఁబడినది.—« స్వాయమ్భువం రోచిషంచ రైవతంచ తథోత్తమమ్ । వేద యస్స ప్రజావాన్ » ♦ అని. పూర్వుల వలనఁ గదా వెనుకటివారు పుట్టుచున్నారు, కావున వీరికిఁ బ్రాధాన్యము. జనియింపనివారియందు జ్యైష్ఠ్యముగూడ. తాపసుఁడు భగవదవతార మగుటవలనఁ జెప్పఁబడఁడయ్యె. అదియు భాగవతమునందుఁ బ్రసిద్ధము. మానసత్వము గూడ అందఱ మనువులకును జెప్పఁబడినది భాగవతమునందు—« తతో మనూన్ ససర్జాన్తే మనసా లోకసంభవాన్ » అని. ఇతరునకుఁ బుత్త్రుఁడగుటయో శరీరమును విడువకయు నగుచున్నది. ప్రమాణమో రెండువాక్యములయన్యథానుపపత్తియె. పూర్వే అనువిశే

---

* తక్కినది శ్రీధరీయమతో సమానము.

♦ స్వాయంభువుని రోచిని రైవతుని ఉత్తముని ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో—ఉపాసించుచున్నాఁడో అతఁడు సంతానవంతుఁ డగును.

షణ్ముఖులను గూడ నిది సిద్ధించుచున్నది. నావలన భావము గలవారు మద్భావులు, ఎవ్వరు బ్రహ్మయొక్క మానసులై పుట్టిరో వారు నావలననే పుట్టి రని భావము.

ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః
సో ఽవికమ్పేన యోగేన యుజ్యతే నా ఽత్ర సంశయః. ౭

భా. మమ=నాయొక్క; ఏతామ్=ఈ చెప్పఁబడిన; విభూతిమ్=విస్తారమును; యోగంచ=యుక్తిని, నాఘటనమును; లేక, యోగజన్యం బగు యోగైశ్వర్యసామర్థ్యము సర్వజ్ఞత్వము యోగ మని చెప్పఁబడుచున్నది, దానిని; యః=ఎవ్వఁడు; తత్త్వతః = తత్త్వముచేత, యథాస్థితముగా ననుట; వేత్తి=ఎఱుంగుచున్నాఁడో; సః=అతఁడు; అవికమ్పేన = నిశ్చలమగు; యోగేన—సమ్యగ్దర్శనస్థైర్యముతో ననుట; యుజ్యతే = కూడుచున్నాఁడు. అత్ర=ఈయర్థమునందు; సంశయః=సందేహము; న=లేదు.

నా యీవిభూతిని ఐశ్వర్యమును ఎవ్వఁడు చక్కఁగా నెఱుంగుచున్నాఁడో అతఁడు నిశ్చల మగు సమ్యగ్దర్శనముఁ బొందుచున్నాఁడు. ఇందు సందేహము లేదని తాత్పర్యము.

ఆ. భగవంతునిసోపాధికప్రభావమును బ్రదర్శించి తత్ఫలముఁ జెప్పుచున్నారు ఏతా మిత్యాదిగా. విభూతి యనఁగా బుద్ధ్యాద్యుపాదానం బగుటచే వివిధ మయినభూతి—భవనము వైభవము సర్వాత్మకత్వంబు ననుట, దానిఁ జెప్పుచునారు విస్తారము నని. యోగ మనఁగా ఈశ్వరునియొక్క తత్తదర్థసంపాదనసామర్థ్యము, దానిఁ జెప్పుచున్నారు నాఘటనము నని. మఱియు, యోగ మనఁగా తత్ఫల మయిన యైశ్వర్యము—సర్వజ్ఞత్వంబును సర్వేశ్వరత్వంబును, నాదైన శక్తిజ్ఞానలేశము నాశ్రయించి మన్వాదులును భృగ్వాదులును ఐశ్వర్యజ్ఞానవంతు లగుచున్నారు—దానిఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. ఎట్లు ఆవిభూతియోగములు నిరంకుశములో అట్లు తద్వేదనంబును నిరంకుశం బని తెలుపుచున్నారు యథాస్థితముగా నని. సోపాధికజ్ఞానము నిరుపాధికజ్ఞానమునందు ద్వార మని చెప్పుచున్నారు సః ఇత్యాదిగా. ఈ యర్థమునందుఁ బ్రతిబంధము లే దని చెప్పుచున్నారు అత్ర ఇత్యాదిగా.

హ. ఏతామ్; విభూతిమ్=విస్తారమును; యోగంచ=విభూతికి హేతు వగు యోగమును గూడ; మమ=నాదానిని; యః వేత్తి; తత్త్వతః = చక్కఁగా. సః; అవికమ్పేన; యోగేన=సమాధితో; యుజ్యతే.

శం. ఇట్లు తనయోగజన్య మయినయైశ్వర్యంబును విభూతినిం బ్రతిపాదించి యీరెంటిని జక్కఁగా నెఱింగినవానికిఁ దత్ఫలముఁ జెప్పుచున్నాఁడు —మమ=నిర్విశేష మే యగు పరబ్రహ్మముయొక్క; ఏతామ్=చెప్పఁబడినట్టి; విభూతిమ్=మాయచే వివిధాకారంబున భవనము విభూతి, దానిని--సర్వాత్మత్వమును; యోగంచ=మాయాయోగజ మయినయైశ్వర్యమును గూడ, సృష్టిస్థిత్యాదనప్రవేశనియమననిగ్రహానుగ్రహాదిసామర్థ్యమును గూడ, దానిసమస్తమును; తత్త్వతః=యథార్థముగా; యః=ఏపండితుఁడు; శాస్త్రాచార్యోపదేశజన్యవివేకజ్ఞానముచే, వేత్తి=ఇది జగత్తుకాదు, మఱే మనఁగా పరమాత్మయొక్క స్వరూపమే యని సర్వంబును నాస్వరూపముగాను నన్నే బంధమోక్షములకును సర్వంబునకును గారణముగాను జక్కఁగా నెఱుంగుచున్నాఁడో; సః=ఆముముక్షువు; అవికమ్పేన=వికంప మనఁగా వికల్పము, తద్రహిత మయిన; యోగేన=మదుపాస్తియోగముతో; యుజ్యతే = యుక్తుఁ డగుచున్నాఁడు, మోక్షేచ్ఛచే సర్వమునందును విరక్తుఁడై శ్రద్ధాభక్తులతో వాసుదేవుఁడే సర్వమ్మని సర్వత్ర మద్బుద్ధితో నన్నే యుపాసించుచున్నాఁడు. నాత్రసంశయః = ముముక్షువై సర్వంబును సన్న్యసించి శ్రవణాదినిష్ఠచే నన్నే యుపాసించుచున్నాఁ డనుటయందు సంశయము చేయవల దని యర్థము.

మ. ఇట్లు సోపాధికుం డగు భగవంతుని ప్రభావమును బ్రతిపాదించి తద్జ్ఞానఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఏతామ్ = ఈబుద్ధ్యాదిరూపమును మహదాద్యాదిరూపము నగు; విభూతిమ్=వివిధభావమును, తత్తద్రూపంబున నవస్థానమును; యోగంచ=తత్తదర్థ నిర్మాణసామర్థ్యమును, పరమైశ్వర్యము ననుట; మమ = నాదానిని; యః; తత్త్వతః=చక్కఁగా; వేత్తి; సః; అవికమ్పేన=నిశ్చలముగు; యోగేన = సమ్యగ్దర్శనస్థైర్యరూప మగు సమాధితో; యుజ్యతే. అత్ర; సంశయః=ప్రతిబంధము ఏదియు; న=లేదు.

శ్రీ. యథోక్తవిభూత్యాదితత్త్వము నెఱుంగుటకు ఫలముఁ జెప్పుచున్నాఁడు —మమ; ఏతాంవిభూతిమ్=ఈభృగ్వాదిలక్షణ మయిన విభూతిని; యోగంచ=ఐశ్వర్యలక్షణ మయిన యోగమును; తత్త్వతః; యో వేత్తి; సః; అవికమ్పేన=నిస్సంశయ మగు; యోగేన=సమ్యగ్దర్శనముతో; యుక్తుఁ డగుచున్నాఁడు. లేదిందు సంశయము.

ప. ఈపరంపరయొక్క తత్త్వజ్ఞానమునకు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఈభృగ్వాదిరూప మయిన నావిభూతిని ఐశ్వర్యరూప మయిన యోగమును తత్త్వ

బునె నెవ్వఁడెఱుంగుచున్నాఁడో, సః=అతఁడు; అవికమ్పేన=స్థిరమయిన; యోగేన= నామైశ్వర్యముతో; యుజ్యతే = యుక్తుఁడగుచున్నాఁడు. నాత్రసంశయః—ఇది యథార్థవాదము కాదని యర్థము.

రా. విభూతియనఁగా ఐశ్వర్యము. ఏతామ్—సర్వమునకును ఉత్పత్తిస్థితి ప్రవృత్తులు నాయధీనము లనునట్టి; విభూతిమ్=నాయైశ్వర్యమును; మమ=నాయొక్క; యోగంచ=హేయప్రత్యనీక కల్యాణగుణగణరూప మయిన యోగమును; యః; తత్త్వతః; వేత్తి; సః=అతఁడు; అవికమ్ప్యేన•=చలింపఁజేయరానియట్టి; యోగేన=భక్తి యోగముతో; యుజ్యతే. నాత్రసంశయః—మద్విభూతిని కల్యాణగుణంబులను జక్కఁగా నెఱుంగుట భక్తియోగమును వృద్ధిఁబొందించునది యని నేనే యెఱుంగఁ గల వని యర్థము.

మూ. *

అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే
ఇతి మత్వా భజన్తే మాం బుధా భావసమన్వితాః. ౮

భా. ఎట్టి యవికంప మయిన యోగముతోఁ గూడుచున్నాఁడు? అనఁగాఁ జెప్పెదను.—అహమ్= నేను, పరబ్రహ్మమును వాసుదేవుఁడను; సర్వస్య=సమస్తజగత్తునకును; ప్రభవః=ఉత్పత్తిని. మత్తః=నావలననే; స్థితి వినాశక్రియాఫలోపభోగలక్షణ మగువికారరూప మయిన, సర్వమ్= సమస్తజగత్తును; ప్రవర్తతే = ప్రవర్తించుచున్నది. ఇతి=ఇట్లు; మత్వా= ఎఱింగి; మామ్=నన్ను; భజన్తే=సేవించుచున్నారు; బుధాః=తత్త్వార్థము తెలిసినవారు; భావసమన్వితాః = భావమనఁగా భావన, పరమార్థతత్త్వాభినివేశము, దానితో సమన్వితులు—సంయుక్తులై యని యర్థము.

నేను పరబ్రహ్మమును సర్వజగత్తునకును గారణభూతుఁడను నావలననే వికారరూప మయిన సర్వజగత్తును ప్రవర్తించుచున్నది యని యెఱింగి తత్త్వజ్ఞులు పరమార్థతత్త్వమునం దభినివేశము గలవారై నన్ను సేవింతు రని తాత్పర్యము.

రా. ఎట్లు నీవిభూత్యైశ్వర్యముల జ్ఞాన మీయోగమునకు హేతువగును? అని తలంచి యడుగుచున్నాఁడు ఎట్టి ఇత్యాదిగా. ఈజ్ఞానముయొక్క మాహాత్మ్యము

• వీరిమతమునందు అవికమ్ప్యేన అని పాఠము.

* దీనికి మూలభాష్యము లేదు.

వలన స్థిరమగు భగవన్నిష్ఠ సిద్ధించుచున్నది యని చెప్పుచున్నారు చెప్పెదను అని. దీనివలనఁ బ్రభవించును గావున బ్రభవ మనఁగా సర్వప్రకృతి ◊ సర్వాత్మ యని చెప్పుచున్నారు ఉత్పత్తిని అని. సర్వజ్ఞుఁడను సర్వేశ్వరుఁడ నగు నావలన నిమిత్త కారణమువలన స్థితివినాశాదికము సమస్తమును అగుచున్నది, అంతర్యామి నగు నాచేతఁ బ్రేరింపఁబడుచున్నదై సర్వంబును మర్యాద నతిక్రమింపక చేష్టించుచున్నది యని చెప్పుచున్నారు మత్తః ఇత్యాదిగా. ఇట్లు నాసర్వాత్మత్వంబును సర్వప్రకృతిత్వంబును సర్వేశ్వరత్వంబును సర్వజ్ఞత్వంబును—ఈమహిమ నెఱింగి నాయందే నిష్ఠావంతు లగుచున్నా రని చెప్పుచున్నారు ఇతి ఇత్యాదిగా. సంసారం బసార మని యెఱింగినవారికి భగవద్భజనమునం దధికార మని సూచించుచున్నారు తత్త్వార్థము దెలిసినవారు అని. పరమార్థతత్త్వమును బూర్వోక్తరీతిచే నెఱుంగుటచే అభినివేశం బను పేరుగల ప్రేమాదరంబులు గలుగుచున్నవి, తత్సంయుక్తత భగవద్భజనంబునందు హేతు వని చెప్పుచున్నారు భావసమన్వితాః ఇత్యాదిగా.

హ॰ ప్రభవః=ఉత్పత్తికారణమును; మత్తః = పరమేశ్వరునివలన; సర్వమ్= క్రియాకారకఫలరూప మగు జగత్తు; ప్రవర్తతే *.

శం॰ వానికి వస్తుతత్త్వనిశ్చయప్రకారంబును ఉపాసనంబును స్పష్టీకరించుచున్నాఁడు.—అహమ్ = నిర్విశేషుండ నగు పరమాత్మనే; మాయాశబలితుండనై, సర్వస్య=సమస్త ప్రపంచమునకును; ప్రభవః=ఉపాదానకారణమును, కార్యము సర్వంబును కారణమాత్రమే యనున్యాయంబున సర్వమును బరమాత్మస్వరూపమే. మత్తః=పరమాత్మ వలననే;బుద్ధిర్జ్ఞాన మిత్యాదిగాఁ జెప్పినరీతిని మోక్షమును మోక్షసాధనంబును బంధమును సంసారంబును స్వర్గమును అభ్యుదయమును, సర్వం ప్రవర్తతే—ప్రాణుల ప్రవృత్తియు నివృత్తియు సిద్ధించుచున్నది. కావున సర్వకారణము ఈశ్వరుఁడే. ఇతి=అని; మత్వా=శ్రుతియుక్తిగురువచనములచే నిశ్చయించి; బుధాః=పరోక్షజ్ఞాను లగుముముక్షువులు; భావసమన్వితాః=భావ మనఁగా సర్వంబును బ్రహ్మమే యనువృత్తి, దానితోఁ గూడినవారలై; సర్వత్ర మద్భావనతోఁ గూడినవారై; సదా, మామ్=సర్వాత్మకునిఁ బరమాత్మను; భజన్తే = శ్రవణము చేయుచున్నారు మననము చేయుచున్నారు ధ్యానించుచున్నారు, ఇట్లుపాసించుచున్నా రని యర్థము.

◊ సర్వకారణము.

* తక్కినది శంకరభాష్యముతో సమానము.

మ. ఎట్టి విభూతియోగజ్ఞానముచేత నవికంపయోగము సిద్ధించునో దానిఁ దెలుపుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.—అహమ్ = వాసుదేవుఁడను పరబ్రహ్మమును; సర్వస్య=సమస్త జగంబునకును; ప్రభవః=ఉత్పత్తికారణము, ఉపాదానమును నిమిత్తమును. సర్వమ్=స్థితివినాశాదికము సర్వంబును; మత్తః=నావలననే; ప్రవర్తతే= అగుచున్నది. లేక. నాచేతనే యంతర్యామిని సర్వజ్ఞుఁడను సర్వశక్తి నగు నాచేఁ బ్రేరింపఁబడుచున్నదై తనతనమర్యాద నతిక్రమింపక సమస్తజగమును బ్రవర్తించుచున్నది—చేష్టించుచున్నది. ఇతి=ఇట్లు; మత్వా = తెలిసి; బుధాః = వివేకముచేఁ దత్త్వము నెఱింగినవారు; భావసమన్వితాః=భావనముతో—పరమార్థతత్త్వగ్రహణరూప మయిన ప్రేమముతోఁ గూడినవారలై; మామ్; భజన్తే.

శ్రీ. ఎట్లు విభూతియోగముల నెఱుంగుటచే సమ్యగ్దర్శనము లభించును? దానిఁ దెలుపుచున్నాఁడు నాలుగింటిచేత.—అహమ్; సర్వస్య; ప్రభవః=భృగ్వాదిరూప విభూతిద్వారంబున నుత్పత్తికారణము. మత్తఏవ=నావలననే; ఈసమస్తంబునకును; సర్వమ్=బుద్ధిజ్ఞానాసమ్మోహాదికము సమస్తమును; ప్రవర్తతే. ఇతి; మత్వా= తెలిసి; బుధాః=వివేకులు; భావసమన్వితాః=ప్రీతియుక్తులై; మాం భజన్తే.

ప. ఎట్లు విభూతియోగముల జ్ఞానముచేఁ దత్త్వజ్ఞానం బగునో దానిఁ దెలుపుచున్నాఁడు నాలుగింటిచేత.—అహమ్; సర్వస్య=భృగ్వాది ప్రపంచమునకు; ప్రభవః=కారణము. అట్లు, మత్తః = నావలన; సర్వమ్; ప్రవర్తతే—వ్యవహారము జరుగుచున్నది. ఇతి; మత్వా=అనుభవముచే నెఱిఁగి; భావసమన్వితాః=ప్రీతియుక్తులై; బుధాః=జ్ఞానులు, మాం భజన్తే.

రా. విభూతిజ్ఞానపరిపాకరూప మయిన భక్తి వృద్ధిని జూపుచున్నాఁడు — అహమ్; సర్వస్య = విచిత్రచిదచిత్ప్రపంచమునకు; ప్రభవః = ఉత్పత్తికారణము. సర్వమ్; మత్తః = నావలననే; ప్రవర్తతే. ఇతి—ఈనాస్వాభావిక మయిన నిరంకుశైశ్వర్యమును సౌశీల్య సౌందర్య వాత్సల్యాది కల్యాణగుణగణయోగమును; మత్వా; బుధాః=జ్ఞానులు; భావసమన్వితాః; మామ్=సర్వకల్యాణగుణయుక్తుఁడ నగునన్ను; భజన్తే. భావ మనఁగా మనోవృత్తివిశేషము, నాయందు ఆశగలవారలై నన్ను భజించుచున్నా రని యర్థము.

మా. కలరుగాఁడ భజించువారు కొందఱ అని చెప్పుచున్నాఁడు అహ మి త్యాదిగా.

మచ్చిత్తా మద్గతప్రాణా బోధయన్తః పరస్పరమ్
కథయన్తశ్చ మాం నిత్యం తుష్యన్తి చ రమన్తి చ. ౯

భా. మఱియును.—మచ్చిత్తాః=నాయందుఁ జిత్తముగలవారు; మద్గతప్రాణాః = నన్నుఁ బొందిన చక్షురాదిప్రాణములు గలవారు, నాయందుపసంహరింపఁబడిన కరణములు గలవారని యర్థము; లేక, మద్గతమయిన జీవనము గలవారు; పరస్పరమ్=ఒండొరులను; బోధయన్తః=తెలుపుచు; మామ్ = జ్ఞానబలవీర్యాదిషడ్గుణములతోఁ గూడిన నన్ను; కథయన్తశ్చ=చెప్పుచును; నిత్యమ్ = ఎల్లప్పుడును; తుష్యన్తిచ = పరితోషముఁ బొందుచున్నారు. రమన్తిచ=రతినిగూడఁ బొందుచున్నారు, ప్రియసమాగమముఁ బొందినట్లు.

నాయందే మనస్సునుంచి సర్వేంద్రియములను నాయందు నిలిపి మద్గతమయిన జీవనము గలవారలై నన్నే యొండొరులకు బోధించుచుఁ దమశిష్యులకుపదేశించుచు నిరంతరమును సంతోషమునొంది సుఖముఁ జెందుచున్నారని తా.

శ్రీ. చెప్పినదిమాత్రమే కాదు భగవద్భజనమందు సాధనము, సాధనాంతరముగూడఁ గలదని చెప్పుచున్నాఁడు.—మఱియును అని. మున్ను చెప్పిన ప్రత్యగాత్మ యగు నీశ్వరునికంటె నితరమునందుఁ జిత్తప్రచారము లేకుండుట భగవద్భజనోపాయ మని చెప్పుచున్నారు మచ్చిత్తాః అని. చక్షురాదులకు భగవంతునియెడఁ బ్రాప్తి సంభవింపదు, అతఁడు వానికగోచరుం డగుటవలన, అని యాశంకించి చెప్పుచున్నారు నాయం దుపసంహరింపఁబడిన ఇత్యాదిగా. భక్తులకు భగవంతునివిడిచి జీవనమందును ఆదరము లేదు, అది వారలకు వానియందే యర్పిత మని చెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. ఆచార్యులవలన శ్రవణముచేసి వాదకథచే సబ్రహ్మచారులు ♦ పరస్పరము భగవంతుని బోధించుకొందురు, అదియు భగవద్భజనసాధనం బని చెప్పుచున్నారు బోధయన్తః అని. శ్రుతులచేతను ఉపనిషత్తులచేతను భగవంతుని శిష్యులకు గురువు లుపదేశింతురు, అదియు భగవద్భజన మని చెప్పుచున్నారు కథయన్తశ్చ అని. భక్తులకు తుష్టియు రతియుఁ దనయంతనె కలుగునని చెప్పుచున్నారు తుష్యన్తీత్యాదిగా. మనోరథపూర్తిచే రతి సిద్ధించుననుటకుఁ గాముకసమ్మత మయిన యుదాహరణముఁ జెప్పుచున్నారు ప్రియేత్యాదిగా.

♦ సహాధ్యాయులు.

హ॰ ఇట్లు—మద్గతప్రాణాః=నాయందు వ్యవస్థిత మయిన ప్రాణము గలవారలు, మద్గతమైన జీవనము గలవారు *.

శం॰ ఆయుపాసనప్రకారమునే చెప్పుచున్నాఁడు.—మచ్చిత్తాః = నాయందు—సర్వభూతాత్మకమైన సవిశేషబ్రహ్మమునందు చిత్తము—సర్వమును బ్రహ్మమే యని వాసననొందినది యెవ్వరికో వారు మచ్చిత్తులు; మద్గతప్రాణాః=మద్గతములు—నాతత్త్వమును ప్రతిపాదించువాక్యముల నుచ్చరించుటయందును తదర్థశ్రవణమునందును తన్నిశ్చితార్థదర్శనమునందును తత్పరము లయిన ప్రాణములు—వాగాదీంద్రియములు గలవారలై; బుధులు, పరస్పరమ్, తమతమప్రజ్ఞ ననుసరించి, బోధయన్తః=వాక్యార్థమును బోధించుచు; అట్లు తమ యనుభవమును, కథయన్తశ్చ= చెప్పుకొనుచు, తమ యనుభవమున కనురూపముగా, తుష్యన్తిచ = ఆనందించుచున్నారు. ఎల్లప్పుడు నిట్లు వేదాంతములయందు, రమన్తిచ—సర్వంబును నన్నుఁగానే చూచుచును వినుచును భావించుచును కాలము గడపుచుందు రని యర్థము.

మ॰ ప్రేమపూర్వక మయిన భజనమునే వివరించుచున్నాఁడు.—మచ్చిత్తాః=నాయందు—భగవంతునియందుఁ జిత్తము గలవారు; అట్లు, మద్గతప్రాణాః=మద్గతములు—నన్నుఁ బొందినవగు ప్రాణములు—చక్షురాదులు గలవారు, నన్ను భజించుటకొఱ కైన చక్షురాదివ్యాపారములు గలవారు, లేక, నాయం దుపసంహరింపఁబడిన సర్వకరణములును గలవారు; లేక, మద్గతప్రాణాః = మద్భజనార్థ మయినజీవనము గలవారు, మద్భజనముదక్క నితరప్రయోజనము లేని జీవనము గలవారని యర్థము; విద్వద్గోష్ఠులయందు, పరస్పరమ్ = ఒండొరులను; మామ్=నన్నే; బోధయన్తః=తత్త్వజిజ్ఞాసాకథచేఁ దెలుపుచు; అట్లు తమశిష్యులకు నన్నే, కథయన్తశ్చ= ఉపదేశించుచును; నాయందుఁ జిత్తము నర్పించుటయు బాహ్యకరణంబుల నర్పించుటయు జీవనము నర్పించుటయు సమానులకుఁ బరస్పరము నన్ను బోధించుటయు శిష్యులకు నన్నుపదేశించుటయు అను నీమద్భజన మేదిగలదో దానిచేతనే, తుష్యన్తిచ = ఇంతమాత్రముచేతనే మేము సర్వార్థములఁ బొందినవారము, ఇఁక మాకుఁ బొందవలసినది లేదు.—ఏతత్ప్రత్యయరూప మయిన సంతోషమును బొందుచున్నారు. ఆసంతోషముచే, రమన్తిచ—ప్రియసంగముచేతం బోలె నుత్తమసుఖము ననుభవించుచున్నారు. అది చెప్పఁబడినది పతంజలిచేత.—“సంతోషా దనుత్తమ స్సుఖ

* తక్కినది శంకరభాష్యముతో సమానము.

లాభః" అని. పురాణమునందును జెప్పఁబడినది.—"యచ్చ కామ సుఖం లోకే యచ్చ దివ్యం మహత్సుఖమ్ । తృష్ణాక్షయ సుఖస్యైతే నార్హత ష్షోడశీం కలామ్" * అని. తృష్ణాక్షయ మనఁగా సంతోషము.

శ్రీ. ప్రీతిపూర్వక మగు భజనమునే చెప్పుచున్నాఁడు.—నాయందే చిత్తము గలవారు మచ్చిత్తులు; నన్నే పొందిన ప్రాణములు—ఇంద్రియములు గలవారు మద్గతప్రాణులు; లేక, మద్గత మయిన జీవనము గలవారు; ఇట్టి యాబుధులు ఒండొరులకు నన్ను న్యాయసహితంబు లగు శ్రుత్యాది ప్రమాణములచే బోధించుచు నెఱింగినవారై నన్ను, కథయన్తశ్చ=కీర్తించుచు; నిత్యమ్; తుష్యన్తి=అనుమోదనముచే సంతోషము నొందుచున్నారు. రమన్తిచ=నిర్వృతిఁ బొందుచున్నారు.

ప. ప్రీతిపూర్వక మగు భజనమునే చెప్పుచున్నాఁడు.—నాయందే చిత్తము గలవారు మచ్చిత్తులు, అంతర్నిష్ఠగలవారు; నాయందు గతము లయిన ప్రాణములు—ఇంద్రియములు గలవారు మద్గతప్రాణులు, వెలుపలఁగూడ మద్రూప మయిన జగత్తును జూచుచున్నవారు; ఇట్లు తా మనుభవించిన యర్థమును పరస్పరము శ్రుతివాక్యములచే బోధించుచు, అట్లు భక్తితో నన్ను, కథయన్తశ్చ = కీర్తించుచును; తుష్యన్తిచ. దానిచే, రమన్తిచ=నిర్వృతిఁ బొందుచున్నారు.

రా. ఎట్లు?.—మచ్చిత్తాః = నాయం దుంపఁబడిన మనస్సు గలవారు; మద్గతప్రాణాః = మద్గత మయిన జీవితము గలవారు, నాచేత నేతక్క నాత్మధారణము పొందనివా రని యర్థము; తమతమచే ననుభవింపఁబడిన మదీయ గుణములను బరస్పరము బోధించుచు మదీయము లయిన దివ్యములు రమణీయము లగుకర్మములను గీర్తించుచు, తుష్యన్తిచ రమన్తిచ—చెప్పువారలు అనన్యప్రయోజన మగు తద్వచనముచే సంతోషించుచున్నారు, వినువారును నిరతిశయప్రియం బగు తచ్ఛ్రవణముచే రమించుచున్నారు.

మా. *

తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్
దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే. ౧౦

* లోకమునందుఁ గామసుఖ మేదిగలదో మఱియు గొప్పదియగు స్వర్గసుఖ మేదిగలదో— ఇవి రెండును తృష్ణాక్షయసుఖమునకుఁ బదునాఱవపాలు పోలవు.

* ఇది మొదలు పదునొకండవశ్లోకమువఱకు మాధ్వభాష్యము లేదు.

భా. ఎవ్వరు భక్తులై చెప్పినవిధంబుల నన్ను భజించుచున్నారో.— తేషామ్=వారికి; సతతయుక్తానామ్ = నిత్యమును అభియుక్తులైనవారికి; భజతామ్ = సేవించువారికి; ఏమి అర్థిత్వాదికారణముచేతనా? కా దని చెప్పుచున్నాఁడు.—ప్రీతిపూర్వకమ్—ప్రీతియనఁగా స్నేహము, తత్పూర్వకముగా నన్ను భజించువారి కని యర్థము; దదామి = ఇచ్చుచున్నాను; తమ్=అట్టి; బుద్ధియోగమ్=బుద్ధి—సమ్యగ్దర్శనము, దానితో సంబంధము బుద్ధియోగము, దానిని. యేన=ఏబుద్ధియోగముచే, సమ్యగ్దర్శనలక్షణముచే; మామ్=నన్ను పరమేశ్వరుని ఆత్మభూతుని; ఆత్మనుగా, ఉపయాన్తి= ఎఱుంగుదురో. ఎవ్వరు? ఎవ్వరు మచ్చిత్తత్వాది ప్రకారములచే నన్ను భజించుచున్నారో, తే=వారు.

అట్లు సంతతము ను ఏకాగ్రత గలవారై పరమప్రీతితో నన్ను భజించువారికి నేను, న న్నెఱుంగుటకు సాధన మయిన బుద్ధియోగము నిచ్చుచున్నా నని తాత్పర్యము.

ఆ. సోఽవికంపే నేత్యాదిగా నేది చెప్పఁబడినదో తదర్థము భూమికఁ జేసి దానిని విప్పు దుదాహరించుచున్నారు ఎవ్వరు ఇత్యాదిగా. నిత్యమును అభియుక్తులు—ఎల్లప్పుడును భగవంతునియం దేకాగ్రతతోఁ గూడినవా రని యర్థము. పుత్రాదిలోకత్రయార్థులై కాని గర్భదాసులై కాని ప్రతిదినమును జీవనోపాయసిద్ధికిఁ గాని భజింతు రని శంకించి నిరాకరించుచున్నారు ఏమి ఇత్యాదిగా. మున్ను చెప్పిన జ్ఞానాఖ్యభక్తిని స్నేహంబునఁ జేయువారి కని యర్థము. వారికి నేను తత్త్వజ్ఞానము నిచ్చుచున్నా నని చెప్పుచున్నారు దదా మీత్యాదిగా. చెప్పిన బుద్ధిసంబంధమునకు ఫలముఁ జెప్పుచున్నారు యే నేత్యాదిగా. ధ్యానజన్యపరమ ప్రకర్షమును బొందిన యంతఃకరణముయొక్క పరిణామమై నిరస్తాశేషవిశేష భగవత్ప్రాప్తిహేతు వగు బుద్ధియోగమునందుఁ జెప్పిన యధికారులను ప్రశ్నపూర్వకముగాఁ జెప్పుచున్నారు ఎవ్వరు ఇత్యాదిగా.

హ. ♦

శం. ఇట్లు ముముక్షువులకు శ్రవణ శ్రావణాదిభేదముచే * భజనప్రకారమును బ్రతిపాదించి యిప్పుడు తా ననుగ్రహించుప్రకారమును జెప్పుచున్నాఁడు

♦ పదయోజన శంకరభాష్యముతో సమానము.

* శ్రావణము—ఇతరులకు వినిపించుట.

రెండు శ్లోకములచేత.—సతతయుక్తానామ్=ఎల్లప్పుడును వేదాంతశ్రవణాదులయందే నిష్ఠ గలవారలై; ప్రీతిపూర్వకమ్=స్వస్వరూప సాక్షాత్కారసిద్ధికొఱకు ఆసక్తివిశేషము ప్రీతి, తత్పూర్వకముగా; శ్రవణాదిజన్య జ్ఞానానురూపముగా నన్ను, భజతామ్—ధ్యానించుచుండువారికి; తేషామ్=వారికి; అహమ్=నేను పరమాత్మను; తమ్=అట్టి; బుద్ధియోగమ్ = బుద్ధి యనఁగా స్వరూపజ్ఞానము, అదియే యోగము బుద్ధియోగము, దానిని; దదామి = ఇచ్చుచున్నాను. నిత్యనిరంతర శ్రవణాదినిష్ఠు లగువారికి అత్యంత ప్రీతిపూర్వకమయిన మదుపాసనముచేఁ బ్రీతుఁడనయ్యె నేను సమ్యగ్దర్శనరూపమును ఇదియు నేనును బ్రహ్మమే యని సర్వంబును చిదేకరస బ్రహ్మమాత్రం బనుట దోఁపించునట్టి జ్ఞానయోగమును మత్ప్రాప్తి ప్రతిబంధనివర్తకము నిచ్చుచున్నా నని యర్థము. శ్రవణాదులచే మద్భజననిష్ఠులును మదనుగ్రహపాత్రభూతులు నగు, తే=ఆమద్భక్తులు; యేన=ఎట్టి బుద్ధియోగముచే; మామ్=నన్ను; నిర్విశేషుని ఆకాశమువలె నిరాకారుని నిత్యకూటస్థాసంగ చిద్రూపుని సదానందైకరసుని అద్వితీయుని పరబ్రహ్మమును; ఉపయాన్తి=ఇదియే నే నని యనాత్మయం దాత్మభావమును విడిచి నన్నే స్వాత్మనుగా నెఱుంగుదురో. అట్టి మత్సాక్షాత్కారము నిచ్చుచున్నా నని యర్థము. ఇందుచే, ఎట్లు దివ్యరత్నలక్షణమును లక్షణజ్ఞుని వలన విని తద్వచనములచే లక్షణమును గ్రహించి లక్ష్యమునందు సూక్ష్మబుద్ధితోను యుక్తితోను లక్షణమును వెదకుచు లక్ష్యలక్షణంబుల సాంగత్యము నాలోచించుచు సమ్యగ్దృష్టి గలవారికే యీశ్వరానుగ్రహము వలన మణితత్త్వము తెలియవచ్చుంగాని రత్నము వెలుపలఁ గీర్తించుచు అతత్త్వజ్ఞుని వలన వినుచు ఆలోచనమును సూక్ష్మబుద్ధియును యుక్తికౌశలమును సమ్యగ్దృష్టియును ఈశ్వరప్రసాదమును లేకయుండువారికి దివ్యమణితత్త్వము దెలియ శక్యము గాదో, అట్లే బ్రహ్మతత్త్వంబు నని సూచిత మగుచున్నది.

లేక. « మమ యో వేత్తి తత్త్వతః » అను నీవాక్యముయొక్క యర్థము విచారింపఁగా ఏతాం విభూతిమ్ అనునది మొదలు నాలుగుశ్లోకములకు నర్థం బిట్లు.— ఏతాం విభూతిం......సంశయః. శ్లో. ౭. ఏతాంవిభూతిమ్ = ఈచెప్పిన విభూతిని—మహత్త్వవిస్తారమును; యోగంచ=సృష్టిస్థితిలయప్రవేశ నియమనాది క్రియాసామర్థ్యమును; సమస్తమును, మమ=నాకు నిర్విశేషమును అవిక్రియము నగుపరబ్రహ్మమునకు; మాయచేతనే గాని వాస్తవంబున లే దని; తత్త్వతః = యథార్థదర్శనముచే; యః=ఏ బ్రహ్మవిదుఁ డగుయతి; సద్గురుప్రసాదలబ్ధ మయిన యాత్మవిజ్ఞానము గలవాఁడై;

వేత్తి = ఇదియంతయు మాయికము మిథ్యయే యని యెఱుఁగుచున్నాఁడో; సః=ఆ బ్రహ్మవిదుఁడు; అవికమ్పేన=వికంప మనఁగా విక్షేపము, తద్రహితము. బ్రహ్మాత్మైకత్వ విజ్ఞానదార్ఢ్యమువలన వికల్పరహిత మగు; యోగేన=సమ్యగ్దర్శనరూప యోగము తో; యుజ్యతే—దేహాదికమునం దాత్మభావమును విడిచి బ్రహ్మమే నేనని బ్రహ్మము నందే యాత్మబుద్ధిచే నిశ్చలుం డగుచున్నాఁడు, వెండియు నేను ఇది నాది యను వికల్పము నొందఁడు. ఇందు సంశయము సేయవలదు ౭. “మయ్యేవ సకలం జాతం మయి సర్వం ప్రతిష్ఠితమ్” ఇత్యాదిశ్రుతి ప్రసిద్ధ మగు బ్రహ్మాత్మైకత్వ విజ్ఞాన నిష్ఠావంతుల యనుభవముఁ జెప్పుచున్నాఁడు.—అహం సర్వస్య ప్రభవః......భావ సమన్వితాః. ౮. ప్రతీయమాన మయిన యీ, సర్వస్య=సమస్తజగత్తునకు; అహమ్= నేనే, పరబ్రహ్మమే; ప్రభవః = కారణమును, నాయందే సర్వంబును బ్రతీత మని యర్థము. మత్తః=నాసన్నిధానమువలననే; సర్వమ్=జగత్తు; ప్రవర్తతే. ఇతి=ఇట్లు, జగత్ప్రతీతికిని తత్ప్రవృత్తికిని తన్నే పరబ్రహ్మమును కారణమునుగా; మత్వా; బుధాః=బ్రహ్మవిదులు; భావసమన్వితాః=భావ మనఁగా బ్రహ్మమునందే ఆత్మభావము, దానితోఁ గూడినవారలై; మామ్=నన్ను పరబ్రహ్మమును; భజన్తే—బ్రహ్మమే నేను నేనే బ్రహ్మము నని యనుసంధించుచున్నా రని యర్థము. ౮. తద్భజనప్రకారము నే చెప్పుచున్నాఁడు.—మచ్చిత్తాః......రమన్తి చ. ౯. శాస్త్రార్థమును శిష్యులకు బోధించుచుఁ దమతమ యనుభవమును బరస్పరము చెప్పుకొనుచు అబుధులు, మచ్చిత్తాః=నాయందే—ప్రత్యగభిన్న పరబ్రహ్మమునందే చిత్తము - మదాకారము నొందింపఁబడినదిగాఁ గలవారలును; మద్గతప్రాణాః=మద్గతములు—మద్ధ్యానము నొందింపఁ బడినవి, ప్రత్యగ్వృత్తిచే మద్రూపంబునఁ బ్రవిలాపితంబు లగుప్రాణములు—ఇంద్రి యాదులు గలవారలునై; వృత్త్యారూఢుండ నగు నన్ను ఆనందైకరసుని అనుభ వించి, తుష్యన్తి చ=సంతోషము నొందుచున్నారు. ఎల్లప్పుడు నిట్లు, రమన్తి చ=నా యందు సదా రమించుచున్నారు. నన్నే నిత్యమును బోధించుచు వర్ణించుచు ధ్యా నించుచు బుధులు కాలము గడపుదు రని యర్థము. ౯. ఇట్లు బ్రహ్మవిదు లగు యతులు స్వభక్తు లయినవారి స్వభజనప్రకారముఁ జెప్పి యిప్పుడు తనయనుగ్రహ ప్రకారముఁ జెప్పుచున్నాఁడు.—తేషాం సతత......మాముపయాన్తి తే. ౧౦. సతత యుక్తానామ్=ఎల్లప్పుడు యుక్తులు—నాయందు పరబ్రహ్మమునందు సమాహిత చిత్తులై; భజతామ్ = భక్తులైన యాబుధులకు—బ్రహ్మవిదులకు; ప్రీతిపూర్వకమ్= “భక్తాస్తే ఽతీవ మే ప్రియాః” అను వచనమువలన ఐహికాముష్మికసుఖమును త

త్పాదనజాతమును సర్వంబును సన్న్యసించి తమదేహయాత్రాదికమునందుఁ గూడ ఆశనువిడిచి మోక్షైకవాంఛచే సచ్చిదానందఘనం బగు మదీయపరతత్త్వమునే యితరదుర్లభం బగు దాని నెల్లప్పుడు తదేకప్రీతిచే భజించుచున్న యా యుత్తమ భక్తులయందు ప్రీతి—వీరు నాభక్తవర్యులు మత్ప్రాప్తికొఱకు నిరంతరము శ్రమముఁ పడుచున్నా రని దయార్ద్రస్వాంతఃకరణవృత్తివిశేషము ఏదికలదో తత్పూర్వకము గానే; నేను, బుద్ధియోగమ్ = బుద్ధి యనఁగా నిశ్శేషనిరస్తవిపరీతప్రత్యయమును సన్మాత్రైకవిషయము నగు సమ్యగ్దర్శనము, దానితో యోగమును—వృత్తికి సంయోగమును; దదామి—నేను ఇది అది ఇత్యాదిభేదప్రత్యయములు లేనిదియు బ్రహ్మైకగోచరంబు నగు నఖండాకారవృత్తి నిచ్చుచున్నా నని యర్థము. యేన=ఎట్టిమత్ప్రసాదలబ్ధ మయిన బుద్ధియోగముచే; తే=ఆబుధులు; మామ్=నన్ను నిర్విశేషుని అద్వితీయుని సచ్చిదానందఘనుని పరబ్రహ్మమును; ఉపయాన్తి=స్వాత్మనుగా నెఱింగి తద్భావము నొందుచున్నారో. అట్టిదాని నిచ్చుచున్నా నని యర్థము. ఇందుచే నూఱుమాఱులు శ్రవణశ్రావణములు చేసినవార లైనను సతతయుక్తు లగుయతులకే యీశ్వరుఁడు ప్రసన్నుం డగును, ప్రసన్నుఁడై సమ్యగ్దర్శనము నిచ్చును, ఇతరులకుఁ బ్రసన్నుఁడుగాఁడు ఇయ్యఁడు, కావున ముముక్షువులై యాత్మతత్త్వము నెఱింగినయతులు నిరంతరబ్రహ్మనిష్ఠయం దుండవలయు నని సూచితము.

మ. ఎవ్వరు చెప్పినవిధంబున నన్ను భజించుచున్నారో.—సతతము—సదా యుక్తులు—భగవంతునియందే యేకాగ్ర మయినబుద్ధి గలవారలకు; కావుననే, ఆత్మపూజ ఖ్యాతి మొదలగువానినపేక్షింపక ప్రీతిపూర్వకముగనే, భజతామ్=సేవించువారలకు; తేషామ్=అట్టివారికి; అవికమ్పేన యోగేన అని ము న్నేది చెప్పఁబడినదో, తమ్=అట్టి; బుద్ధియోగమ్=మత్తత్త్వవిషయ మయిన సమ్యగ్దర్శనమును; దదామి=పుట్టించుచున్నాను. యేన = ఏబుద్ధియోగముచే; మామ్—ఈశ్వరుని; ఆత్మనుగా, ఉపయాన్తి; తే = ఎవ్వరు మచ్చిత్తత్వాదిప్రకారములచే నన్ను భజించుచున్నారో వారు.

శ్రీ. ఇట్టివారలకు సమ్యగ్జ్ఞానమును నే నిచ్చుచున్నా నని చెప్పుచున్నాఁడు.—ఇట్లు, సతతయుక్తానామ్ = నాయందు ఆసక్తులై; ప్రీతిపూర్వకం భజతామ్; తేషామ్; తమ్; బుద్ధియోగమ్=బుద్ధిరూప మయిన యుపాయమును; దదామి. ఎట్టి

దానిని ? యేన = ఏయుపాయముచే; తేఃఅభక్తులు; నన్నుఁ బొందుదురో, అట్టి దానిని.

ప. ఇట్టివారలకు జ్ఞానము కలిగించువాఁడను నేనే యని చెప్పుచున్నాఁడు.—తేషామ్=మున్ను చెప్పినట్టి; సతతయుక్తానామ్; ప్రీతిపూర్వకమ్; భజతామ్; తం బుద్ధియోగమ్=అట్టి జ్ఞానయోగమును; దదామి. యేన = ఏజ్ఞానయోగముచే; తే; మామ్; ఉపయాన్తి.

రా. తేషామ్; సతతయుక్తానామ్=నాయందు సతతయోగముఁ గోరుచుండు వారలై; మామ్=నన్ను; భజతామ్=భజించుచున్న వారలకు; తం బుద్ధియోగమ్= ఆబుద్ధియోగమునే, పరిపాకదశను బొందినదానినిగా; దదామి. యేన; తే; మామ్; ఉపయాన్తి.

తేషా మేవా ఽనుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః
నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా. ౧౧

భా. ఎందుకొఱకు నీభక్తులకు భక్తియోగము నిచ్చుచున్నావు ? అది త్వత్ప్రాప్తిప్రతిబంధహేతువును దేనిని నశింపఁజేయును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— తేషా మేవ = వారలకే; ఎట్లు మఱి శ్రేయస్సు కలుగు నని, అనుకమ్పార్థమ్=అనుగ్రహించు నిమిత్తము; అహమ్=నేను; అజ్ఞానజమ్=అవివేకమువలనఁ బుట్టిన; తమః=మిథ్యాప్రత్యయరూప మయిన మోహాంధకారమును; నాశయామి=నశింపఁ జేయుచున్నాను; ఆత్మభావస్థః = ఆత్మభావమునందు—అంతఃకరణాశయమునందే యున్నవాఁడనై; జ్ఞానదీపేన = వివేకప్రత్యయరూప మగు దీపముచేత, భక్తిప్రసాదం బను తైలముచేఁ దడుపఁబడినదియు మద్భావనాభినివేశం బను వాయువుచేఁ బ్రేరితంబును బ్రహ్మచర్యాది సాధనసంస్కారముతోఁ గూడిన ప్రజ్ఞయే వత్తిగాఁ గలదియు విరక్త మగు నంతఃకరణమే యాధారముగాఁ గలదియు విషయవ్యావృత్తమయి రాగద్వేషములచే నకలుషితం బగు చిత్తమను నివాతాపవరకమునం♦ దున్నదియునై, భాస్వతా=నిత్యప్రవృత్త మయిన యేకాగ్రతగల ధ్యానముచేఁ గలిగిన సమ్యగ్దర్శనం బనుప్రకాశము గల దగు; జ్ఞానదీపముచేత నని యర్థము.

♦ గాలిలేని యంతర్గృహమునందు.

వారికే యనుగ్రహించుటకై నేను వారి యంతఃకరణవృత్తియం దున్నవాఁడనై ప్రకాశమానం బగు జ్ఞానదీపముచే వారి యవివేకజన్య మగు మిథ్యాజ్ఞానం బను నంధకారమును నశింపఁజేయుదు నని తాత్పర్యము.

టీ. భగవత్ప్రాప్తి బుద్ధిసాధ్యం బైనచో ననిత్యం బని యేర్పడుటవలన నీవుకూడ భక్తులకట్టి బుద్ధియోగము నిచ్చుచున్నా వనుట యనుచిత మని శంకించుచున్నాఁడు ఎందుకొఱకు ఇత్యాదిగా. భగవత్ప్రాప్తికిఁ బ్రతిబంధకమును నశింపఁజేయునది బుద్ధియోగము, అందుచే తత్ప్రాప్తి యనిత్యముగాదు అను నభిప్రాయముతోఁ జెప్పుచున్నారు అది ఇత్యాదిగా. భక్తులకుఁ దత్ప్రాప్తి ప్రతిబంధకమును వివేచించి చూపుచున్నారు అనఁగా ఇత్యాదిగా. అవివేక మనఁగా అనాద్యజ్ఞానము, దానివలనఁ బుట్టినది మిథ్యాజ్ఞానము, ఆరెంటిని నేకీకరించి తమస్సని వివక్షింపఁబడుచున్నది. తన్నాశకత్వము తదంతర్భూత మయిన జడమునకు దేనికిని సంభవింపదు కావున అహం నాశయామి--నేను నశింపఁజేయుచున్నా నని చెప్పఁబడినది. కేవల చైతన్యము జడ బుద్ధివృత్తివలెనే యజ్ఞానాదినాశకము కా దని యాశంకించి విశేషణము చేయుచున్నారు ఆత్మభావస్థః అని. అంతఃకరణాశయము—తన్నిష్ఠ మయిన వృత్తివిశేషము. వాక్యజన్యబుద్ధివృత్త్యభివ్యక్తచిదాత్మ సహాయసామగ్ర్యమువలన అజ్ఞానాది నివృత్తి హేతు వని యర్థము. బుద్ధిబోధము ♦ అజ్ఞానాది నివర్తకం బని చెప్పి బోధస్థబుద్ధి * అజ్ఞానాదినివర్తకం బను పక్షాంతరముఁ జెప్పుచున్నారు జ్ఞానదీపేన ఇత్యాదిగా. దేహాద్యవ్యక్తాంతానాత్మవర్గముకంటె నతిరిక్త మయినవస్తువు విషయముగాఁ గల దని చెప్పుచున్నారు వివేకేత్యాదిగా. భగవంతునందు సదా చేయఁబడు భక్తిచేఁ గలుగు వాని ప్రసాదము—అనుగ్రహము, అది యనుతైలముచేఁ దడుపుటవలన నీదీపమున కుత్పత్తి యని చెప్పుచున్నారు భక్తీత్యాదిగా. నాయందే భావన చేయుటయం దేయభినివేశము గలదో అదియే వాయువు, దానిచేఁ బ్రేరిత మయి యిది పుట్టుచున్నది, వాతప్రేరణము లేక మొదట దీపమున కుత్పత్తి సిద్ధింపదుగదా యని చెప్పుచున్నారు మద్భావన నేత్యాదిగా. బ్రహ్మచర్యము అష్టాంగము, ఆదిశబ్దముచే శమాదులు గ్రహింపఁబడుచున్నవి, తత్సాధనముచేఁ బుట్టిన సంస్కారముగల ప్రజ్ఞ యేదిగలదో అట్టి ప్రజ్ఞ యనువర్తియం దున్నది యాదీపము, వర్తి లేక దీప మేర్పడదుగదా యని చెప్పుచున్నారు బ్రహ్మచర్యేత్యాదిగా. ఆధారము

♦ బుద్ధియందుఁ బ్రకాశించు జ్ఞానము.

* జ్ఞానముచేఁ బ్రకాశించు బుద్ధి.

లేక దీపోత్పత్తి సంభవింపదు, అస్పృష్టం బగుటవలన నని చెప్పుచున్నారు విరక్తేత్యాదిగా. విషయంబులనుండి వ్యావృత్తము రాగాద్యకలుషిత మయినచిత్త మేదిగలదో అదియే నివాతాపవరకము, దానిలోనున్నది యీదీప మని చెప్పుచున్నారు విషయేత్యాదిగా. భాస్వతా యనువిశేషణమును వివరించుచున్నారు నిత్యేత్యాదిగా. ఎల్లప్పుడును గల చిత్తైకాగ్రతతోఁ గూడిన ధ్యానముచేఁ గలుగుఫలము సమ్యగ్దర్శనము, అదియే ప్రకాశము, అట్టిప్రకాశముగలది, తత్పర్యంత మని యర్థము. అందుచే సకార్య మగు నజ్ఞానము నివృత్తముకాఁగా భగవద్భావము తనయంతనే ప్రకాశీభవించుచున్న దను నభిప్రాయముతో వ్యాఖ్యాత మయినపదమునే యనువదించుచున్నారు జ్ఞానేత్యాదిగా.

హా. అజ్ఞానజమ్=అవివేకమువలనఁ బుట్టిన; తమః—మిథ్యాప్రత్యయరూపమును; ఆత్మభావస్థః; భాస్వతా; జ్ఞానదీపేన = జ్ఞానమను దీపముచేత; నాశయామి—భక్తుల యంతఃకరణమున నున్నవాఁడనై ప్రకాశమానం బగుజ్ఞానదీపముచే నవివేకజమిథ్యాప్రత్యయరూప మయిన తమస్సును నశింపఁజేయుచున్నాను.

శం. ఓయీ! "సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ" అను శ్రుతివలన అనంతుఁడవు పరిపూర్ణుఁడవు బ్రహ్మమువగు నీప్రాప్తి వారల కుండనేయున్నది, "దదామి బుద్ధియోగంతం యేనమా ముపయాన్తి తే" అనుట యయుక్తము, అందువేని; సత్యము, సర్వాత్మకుఁడ నగు నన్నుఁ బరబ్రహ్మమును అందఱును బొందియేయున్నారు. ఐనను అజ్ఞానంబున నన్నుఁ బ్రాప్తుని అప్రాప్తునిఁగానే తలఁచుచున్నారు మూఢులు. ఎట్లు ప్రాప్తమునైనను సూర్యప్రకాశమును జాత్యంధు లప్రాప్తమునుగానే తలంచుచున్నారో అట్లు. అందువలననే మద్భజనపరు లెవ్వరో వారలకు మత్ప్రాప్తిప్రతిబంధకాజ్ఞానావరణ మయిన యజ్ఞానమును నేను నశింపఁజేయుచున్నా నని చెప్పుచున్నాఁడు.— మచ్చిత్తత్వాదులచేతను సతతయుక్తత్వాదులచేతను జ్ఞానపరిపాక సాధనములచే నెవ్వరు నన్ను సంసారముక్తికొఱకు భజించుచున్నారో, తేషామ్=వారలకు, మద్భజనైకనిష్ఠు లగుబ్రహ్మవిదులకు; అనుకమ్పార్థమేవ = వీరు నిరంతర సమాధినిష్ఠాలక్షణ మయిన మద్భజనమునందుఁ బరిశ్రమపడుచున్నారు, వీరికి శ్రమనివృత్తి యెట్లగు నని కలిగినట్టి యేదయగలదో తన్నిమిత్తమయ్యె; అహమ్=నేను పరమాత్మను; ఆత్మభావస్థః=ప్రత్యగాత్మ నగు నాయొక్క భావము—భావన ధ్యానాత్మకవృత్తి, దానియందున్నవాఁడనై, మద్ధ్యానవృత్తికి నేత్రమునకు సూర్యునివలెఁ జక్కఁగా విషయమైన

వాఁడనై యుని యర్థము. లేక, ఆత్మ యనఁగా అంతఃకరణము, దానియొక్క భావము— వృత్తి, దానియందుఁ బ్రత్యగ్రూపంబున నున్నవాఁడనై, ప్రత్యగ్వృత్తిరూపం బావిర్భవించినవాఁడనై; జ్ఞానదీపేన = ఎఱుఁగఁబడుచున్నది వస్తుతత్త్వము దీనిచేతఁ గావున జ్ఞాన మనఁగా ఆత్మస్వరూపప్రకాశక మయిన బుద్ధివృత్తివిశేషము, అదియును దీపము చేత; భాస్వతా = నిత్యనిరంతరసమాధినిష్ఠచే అప్రతిబద్ధమయి నిరంకుశప్రకాశము గలదానిచేత; అజ్ఞానజమ్ = అనాద్యవిద్యాలక్షణ మయిన యజ్ఞానమువలనఁ బుట్టిన; తమః—ఆవరణాత్మకమును; నాశయామి—ఘటాదుల నావరించునట్టి తమస్సును ఉదయాచలారూఢుఁ డగు సూర్యుఁ డెట్లు నశింపఁజేయుచున్నాఁడో అట్లు నన్నె నిరంతరము ధ్యానించుచుండు సత్పురుషుల బుద్ధివృత్తి నారోహించి నేను మత్ప్రకాశవ్యాప్తబుద్ధివృత్తివిశేషముచేత మత్స్వరూపము నావరించునట్టి యవిద్యాంధకారమును నిశ్శేషముగా నశింపఁజేసి, అవిద్యాతత్కార్య తద్ధర్మ తత్కర్మ తల్లక్షణ తదవస్థా తదాభాససంబంధ లేశశూన్యుండును ఆకాశమువలె నిత్యనిరంతరుండును నిర్వికల్పుండును నిరాకారుండును నిర్వికారుండును నిరంజనుండును నిష్క్రియుండును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావుండును అనాదియు ననంతుండును అఖండానందైకరసుండును పరిపూర్ణుండు నగు స్వాత్మను, ఇదియే నేనని నాయందే—పరబ్రహ్మమునందే విస్పష్టతరముగా ఆత్మతత్త్వప్రతీతి యెట్లగునో అట్లు ప్రకాశింపఁజేయుచున్నా నని యర్థము. ఇందుచే "యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్" * అను శ్రుతిచొప్పున తీవ్రమోక్షేచ్ఛా తీవ్రవైరాగ్యములచే నిదిధ్యాసనసమాధులు నిరంతరము చేయుచున్న యతికే యీశ్వరప్రసాదము లభించు ననియు, దానిచేతనె సమ్యగ్దర్శనమ్ము కలుగు ననియు, దానివలననే యవిద్యాధ్వాంతనిశ్శేషనివృత్తి యగు ననియు, దానిచేతనే విదేహకైవల్యసుఖము సిద్ధించు ననియు సూచితము.

వ. భగవంతుఁ డొసంగు బుద్ధియోగమునకు ఆత్మప్రాప్తిరూప తత్ఫలంబునకు మధ్యవర్తియగు వ్యాపారముఁ జెప్పుచున్నాఁడు — తేషామేవ; ఎట్లు శ్రేయస్సు కలుగు నని యనుగ్రహించుటనిమిత్తము, ఆత్మభావస్థః = ఆత్మాకారాంతఃకరణవృత్తియందు విషయంబనై యున్నట్టి; అహమ్ = నేను స్వప్రకాశచైతన్యానందాద్వయలక్షణుండను ఆత్మను; ఆమద్విషయాంతఃకరణ పరిణామరూపమే యగు, జ్ఞాన

* ఈయాత్మ యెవ్వని ప్రేమించుచున్నాఁడో అతనిచేతనే లభ్యుఁడు, అతని కీయాత్మ తన స్వరూపమును వెల్లడిచేయుచున్నాఁడు.

దీపేన=దీపసదృశం బగు జ్ఞానముచేత; భాస్వతా = చిదాభాసయుక్తమై యప్రతిబద్ధ మగు దానిచేత; అజ్ఞానజమ్=అజ్ఞానమే యుపాదానకారణముగాఁ గల; తమః=మిథ్యా ప్రత్యయరూప మయిన స్వవిషయావరణం బగునంధకారమును; తదుపాదాన మగు నజ్ఞానము నశింపఁజేయుటచే, నాశయామి—సర్వభ్రమములకును ఉపాదానమయిన యజ్ఞానము జ్ఞానముచేత నాశ్యం బగుటవలనను ఉపాదేయము ఉపాదాననాశముచే నాశ్యం బగుటవలనను. ఎట్లు దీపముచే నంధకారము నివర్తింపవలసినపుడు దీపోత్పత్తి దక్క కర్మముగాని యభ్యాసముగాని యితర మేమియు నపేక్షింపఁబడదో, ఉన్నవస్తువునకే యభివ్యక్తి యగునో కావున ఉత్పన్నముకాని దేదియు నుత్పన్నము కాదో, అట్లు జ్ఞానముచే నజ్ఞానము నివర్తింపవలసినపుడు జ్ఞానోత్పత్తిదక్క నితరము కర్మముగాని యభ్యాసముగాని యేదియు నపేక్షితము కాదు, విద్యమానం బగు బ్రహ్మభావరూపమోక్షమునకే యభివ్యక్తి యగును, కావున ఉత్పన్నము కానిదాని కుత్పత్తి లేదు, ఉత్పన్నము కానిదాని కుత్పత్తియున్నం గదా క్షయిత్వమును కర్మాది సాపేక్షత్వంబును సంభవించును. అని రూపకాలంకారముచే సూచిత మయిన యర్థము. భాస్వతా అనుటచే తీవ్రవాయువు మొదలగువానికిం బోలె అసంభావనాది ప్రతిబంధముల కభావము సూచితము. జ్ఞానమునకు స్వవిషయావరణ నివర్తకత్వంబును స్వవ్యవహారమునందు సజాతీయ మగు మఱియొకదాని నపేక్షింపకుండుటయు స్వోత్పత్తి దక్క నితరసహకారి నపేక్షింపకుండుటయు—ఇత్యాది దీపసాధర్మ్యము రూపకబీజ మని యెఱుంగవలయును.

శ్రీ. బుద్ధియోగము నొసంగియు దాని ననుభవపర్యంతముఁ గావించి యవిద్యాకృతం బగు సంసారము నశింపఁజేయుచున్నా నని చెప్పుచున్నాఁడు.— తేషామ్; అనుకమ్పార్థమేవ=అనుగ్రహార్థమే; అజ్ఞానమువలనఁ బుట్టిన, తమః=సంసారాఖ్యమును; నాశయామి. ఎం దున్నవాఁడనై యేసాధనముచేఁ దమస్సు నశింపఁజేయుచున్నావు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —ఆత్మభావస్థః=బుద్ధివృత్తియం దున్నవాఁడనై. భాస్వతా=ప్రకాశించుచున్న; జ్ఞానదీపేన=జ్ఞానరూప దీపముచేత; నశింపఁజేయుచున్నాను.

ప. ఓయీ! జ్ఞానదాన ముపదేశమువలనఁ గదా కావలయును, నీదర్శనము లేనియప్పుడు ఎట్లుపదేశింతువు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— తేషామ్=అట్లు ప్రీతిపూర్వకముగ్గా భజించువారలకు; అనుకమ్పార్థమ్=కృపచేత; అజ్ఞానమువలనఁ బుట్టిన, తమః—సంసారమును; నేనే నశింపఁజేయుచున్నాను. ఎందున్నవాఁడనై? ఆత్మ

భానస్థః=బుద్ధియం దున్నవాఁడనై. దేనిచేత? భాస్వతా = ప్రకాశముగల; జ్ఞాన దీపేన. ఇట శ్రుతియును అథర్వవల్లులయందు.—« నాయమాత్మా ప్రవచనేన లభ్యో నమేధయా న బహునా శ్రుతేన। యమేవైష వృణుతే తేనలభ్య స్తస్యైషఆత్మా వివృణుతే తనూం స్వామ్ '' అని. భాష్యము.—అయమాత్మా = ఈయాత్మ; ప్రవచనేన = ప్రకృష్ట మయినవచనము ప్రవచనము—ఉపదేశము, దానిచేత; నలభ్యః= లభ్యుఁడు కాఁడు. మేధయా=యుక్తిచే; న=కాఁడు. బహునాశ్రుతేన=అధిక మయిన శాస్త్రశ్రవణముచేతనుగూడ; న = కాఁడు. మ తే మనఁగా. ఏషః = ఈయాత్మ; యమ్=ఏపురుషుని; వృణుతే = అనుగ్రహింపఁ దగినవానిఁగాఁ దలంచుచున్నాఁడో; తేనలభ్యః = వానిచేతనే లభ్యుఁ డగును. తస్య=వానికే; ఏషఆత్మా = ఈయాత్మ; స్వాంతనూమ్=స్వస్వరూపమును; వివృణుతే = సత్త్వాంతఃకరణవృత్తిస్థితుఁడై ప్రకాశింపఁ జేయుచున్నాఁడు. అది చెప్పఁబడినది వాసిష్ఠమునందు.—« న శాస్త్రై ర్నాపి గురుణా దృశ్యతే పరమేశ్వరః । దృశ్యతే స్వాత్మ నైవాత్మా స్వయా సత్త్వస్థయాధియా '' ♦ అని. టిప్పణికలయందును.—« ఆదర్శే ప్రతిరూపదర్శకమయీ శక్తి ర్నిసర్గ స్థితా ద్రష్టా ర్త్రి మలాపకర్షణ విధి స్సంపాద్యతే కేవలమ్ । తద్వచ్చి త్పరిణామరూపమనస శ్శాబల్యసంశోధనే సత్కర్మేశ్వర భక్తిత స్స్వత ఇహైవాఽఽత్మప్రకాశో భవేత్ » * అని. ఋగ్వేదంబునందును.—« య స్తి త్యాజ సచివిదం సఖాయం న తస్యవాచ్యపి భాగో అస్తి । య దీం శృణోత్యలకం శృణోతి నహి ప్రవేద సుకృతస్య పన్థామ్ » అని. రావణభాష్యము.—ఇట సచిశబ్దము సఖవాచకము, సచివిదమ్ = సఖులను బరమప్రేమాస్పదములనుగా నెఱుంగువానిని; కావుననే, సఖాయమ్=ఉపకారకుఁ డగు పరమాత్మను; యః=ఏపురుషుఁడు; తిత్యాజ= విడిచెనో, ఆత్మబహిర్ముఖుఁ డయ్యెనో అని యర్థము. తస్య=వానియొక్క; వాచ్యపి= పఠనాత్మక మయిన వాక్కునందుఁగూడ; భాగః = సత్యత్వభాగము; నాస్తి=లేదు. ఇఁక వదరుకూఁతలకుఁ జెప్పెడి దేమి? ఈమ్ అనునది యవ్యయము, బహిర్ముఖముగా నని యర్థము; యత్ = దేనిని; శృణోతి—శాస్త్రశ్రవణము చేయుచున్నాఁడో, దానిని, అలకమ్ = అలీకమును, అసత్యమును; శృణోతి. హి=ఎందువలననఁగా.

♦ శాస్త్రములచేతఁ గాని గురువుచేతఁ గాని పరమేశ్వరుఁడు కనఁబడఁడు, లేనసత్త్వస్థ మయిన బుద్ధిచే స్వాత్మచేతనే యాత్మ చూడఁబడును.

* అద్దమునందుఁ బ్రతిబింబమును కనఁబఱచు శక్తి స్వభావముననే యున్నది, చూచువాఁడు మలమును దుడుచుటమాత్రమే చేయవలయును, అట్లు చిత్పరిణామరూప మయిన మనస్సుయొక్క మలమును సత్కర్మేశ్వరభక్తుల వలనఁ దొలఁగింపఁగా ఇంకే తనయంతనే యాత్మప్రకాశం బగును.

సుకృతస్య=సత్య మగు బ్రహ్మముయొక్క; పన్థామ్ = మార్గమును; సః=అతఁడు; నప్రవేద=ఎఱుంగఁడు. మఱియు. “ముహ్యన్త్వన్యే అభితో జనాస ఇహాస్మాకం మఘవా సూరిరస్తు” అనియు. భాష్యము.—జనాసః=జనులు; అన్యే=ఇతరులు; అభితః=సర్వప్రకారములచేతను; ముహ్యన్తు=మోహమునుఁ బొందుదురుగాక. మఱే మనఁగా. ఇహ=ఈశరీరమునందు; అస్మాకమ్=ముముక్షువులగు మాకు; మఘవా = ఇంద్రుఁడను పేరుగల పరమాత్మ; సూరిః=ఉపదేశించువాఁడు; అస్తు=అగుఁ గాక,

రా॰ మఱియును.—తేషామేవ; అనుగ్రహించుకొఱకై నేను, ఆత్మభావస్థః=వారి మనోవృత్తియందు విషయముగా నున్నవాఁడనై; మదీయంబు లగు కల్యాణగుణగణంబుల నావిష్కరించుచు మత్స్వవిషయజ్ఞానం బను భాస్వంతమగు దీపముచేత జ్ఞాన రోధియుఁ బ్రాచీనకర్మరూపాజ్ఞానమువలనఁ బుట్టినదియు నగు పూర్వాభ్యస్త మద్వ్యతిరిక్త విషయపరత్వరూప మగు తమస్సును నశింపఁజేయుచున్నాను.

అర్జున ఉవాచ.—

పరం బ్రహ్మ పరం ధామ పవిత్రం పరమం భవాన్
పురుషం శాశ్వతం దివ్య మాదిదేవ మజం విభుమ్. ౧౨
ఆహు స్త్వా మృషయ స్సర్వే దేవర్షి ర్నారద స్తథా
అసితో దేవలో వ్యాస స్స్వయం చైవ బ్రవీషి మే. ౧౩

భా॰ యథోక్త మగు భగవంతుని విభూతిని యోగమును విని యర్జునుం డిట్లనియె.—పరం బ్రహ్మ=పరమాత్మవు; పరం ధామ = పరమమగు తేజస్సవు; పరమం పవిత్రమ్ = ప్రకృష్టమగు పావనమవు; భవాన్=నీవు. శాశ్వతమ్=నిత్యుఁడును; దివ్యమ్=దివియం దున్నవాఁడును; ఆదిదేవమ్=సర్వదేవతలకును ఆదియం దున్నవాఁడును; అజమ్=జన్మరహితుఁడును; విభుమ్=విభవనస్వభావుండును * అగు; పురుషమ్=పురుషునిఁగా; ఇట్టివానినిగా, త్వామ్=నిన్ను; సర్వేఋషయః=ఎల్ల ఋషులును వసిష్ఠాదులు; ఆహుః=చెప్పుచున్నారు. దేవర్షిః=దేవఋషియగు; నారదః=నారదుఁడును; తథా=అట్లు; అసితః=అసితుఁడును; వ్యాసః=వ్యాసుఁడును;

* వ్యాపనస్వభావుండును.

చెప్పుచున్నారు. స్వయంచైవ=నీవుగూడ; మే=నాకొఱకు; బ్రవీషి=చెప్పుచున్నావు

నీవే పరబ్రహ్మవు, పరమతేజోరూపుఁడవు, పరమపావనభూతుఁడవు. నీవు నిత్యుఁడును దివ్యుండును ఆదిదేవుఁడును అజుండును సర్వవ్యాపకుండు నగు మహాపురుషుఁడ వని వసిష్ఠాదిమహర్షు లందఱును దేవర్షి యగు నారదుఁడును అసితుండును దేవలుండును వ్యాసుఁడును జెప్పుచున్నారు. నీవును నాకుఁ జెప్పుచున్నా వని తాత్పర్యము.

ఆ॥ నిరస్తాశేషవిశేషం బగు భగవంతుని నిరుపాధికరూపంబును సర్వాత్మత్వాది సోపాధిక రూపంబును తద్జ్ఞానఫలంబును విని నిరుపాధికరూపము ప్రాకృతబుద్ధులకు గ్రహింప నశక్యం బని చెప్పుచు మందానుగ్రహార్థము సర్వదా సర్వబుద్ధిగ్రాహ్య మయిన సోపాధికరూపమును విస్తరంబున వినఁగోరి యడుగుచున్నాఁ డని చెప్పుచున్నారు యథోక్తము ఇత్యాదిగా. పరంబ్రహ్మభవాన్ అని లక్ష్యనిర్దేశము. తల్లక్షణార్థము పరంధామ అనునది మొదలగు మూఁడువిశేషణములు ధామశబ్దము స్థానవాచకము కా దని చెప్పుచున్నారు తేజస్స వని. అది చైతన్యము పరమ మనఁగా జన్మాదిరహితం బగుటచే కూటస్థ మని యర్థము. ప్రకృష్ట మయిన పావన మగుటచే అత్యంతశుద్ధత్వము చెప్పఁబడుచున్నది. ఇట్టిలక్షణముగల పరబ్రహ్మ మేదిగలదో అది నీవే యితరుఁడు కాఁ డని యర్థము. దేనివలన నీ విది తెలిసికొంటివి? అని యాశంకించి యాప్తవాక్యమువలన నని చెప్పుచున్నాఁడు పురుష మిత్యాదిగా. దివియందు—పరమవ్యోమమునం దున్నవాఁడు కావున దివ్యుఁడు సర్వప్రపంచాతీతుఁడు. దీవ్యతి—ప్రకాశించుచున్నాఁడు కావున దేవుఁడు, సర్వమూల మగుటవలన ఆది. కావుననే అజుఁడు. విభవనస్వభావుఁడు—సర్వగతుం డని యర్థము. ఇట్టి విశేషణములు గలవానినిగా నిన్ను ఋషులందఱును జెప్పుటవలన నీవు బ్రహ్మము వనుట యుక్త మని చెప్పుచున్నాఁడు ఇట్టి వానినిగా నని. ఋషిశబ్దముచేతనే గ్రహింపఁబడినను నారదాదులు ఉత్తము లగుటచే వేఱుగా గ్రహింపఁబడిరి. అసితుఁడు—దేవలునితండ్రి. ఇతరులఁ జెప్పనేల? నీవే యిట్టివాఁడను నేనని నాకుఁ జెప్పియున్నా వని చెప్పుచున్నాఁడు స్వయంచైవ ఇత్యాదిగా.

హా॥ పరబ్రహ్మము నీవు. పరంధామ=పరమతేజంబవు నీవు. పరమంపవిత్రమ్=పరమపావనమవు నీవు.

శ౦. ఇట్లు మందప్రజ్ఞుం డగుముముక్షువునకుఁ దన్నుపాసించుటకై సామాన్యంబున విభూతియోగముఁ బ్రతిపాదించి తదుపాసనములచే విశుద్ధాత్ముఁడై యాత్మత్త్వము నెఱింగినట్టి యతికి నిర్విశేషోపాసనంబును తత్ఫలంబును భగవంతుఁడు చక్కఁగాఁ బ్రతిపాదించెను. అది విని తాను నిర్విశేషస్వరూపమును మూఢు లుపాసింపనేర రని నిశ్చయించి యతిమందబుద్ధి యగుముముక్షువునకు సవిశేషముగూడ సర్వాత్మక మగు నీశ్వరస్వరూప ముపాసింప శక్యముగా దని తలంచుచు వారి నను గ్రహింపఁగోరినవాఁడై వారిబుద్ధి కనురూప మగుసోపాధిక పరమేశ్వరస్వరూప విశేషమును విస్తరించి పృచ్ఛింపఁగోరి యర్జునుఁడు పరమేశ్వరుని స్తుతించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— పరమ్=సవిశేషముకంటె విలక్షణము అప్రాకృతము అతిసూక్ష్మము అతీంద్రియము ఉదయాస్తమయవృద్ధి క్షయరహితము అనాది అనంతము అప్రమేయ మగు; ధామ=కేవలకూటస్థాసంగ చిత్తు; ఒక్కమాఱు స్మరించినమాత్రనే శతకోటికల్పార్జిత పాప విధ్వంసకం బగుటవలన, పరమ్ = ఉత్కృష్టతమము, వాయుసూర్యాగ్నులకును పావకం బగుటవలన వానికన్నను ఉత్తమమగు; పవిత్రమ్=పావనము; ఏది, « సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, పవిత్రాణాం పవిత్రం యో మఙ్గలానాంచ మఙ్గలమ్ » ఇత్యాది శ్రుతిస్మృతి ప్రసిద్ధమయిన నిర్విశేషబ్రహ్మము గలదో అది నీవే యితరుఁడు కాఁ డని యర్థము. ఓయీ! నీవే పరబ్రహ్మమ వని సిద్ధాంతించుచున్నావు, ఎట్లు నీ విది యెఱింగితివి? అనఁగా, ఆప్తవాక్యమువలన నెఱింగితి నని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—దేవర్షి యగునారదుఁడు అసితుఁడు దేవలుఁడు వ్యాసుఁడు—వీరు మొదలగు సమస్తఋషులును నిన్ను, శాశ్వతమ్ = నిత్యుఁడును; దివ్యమ్=దివియందు స్వమహిమయందు నిలిచియుండువాఁడును, లేక, దివియందు—అవ్యాకృతాకాశమునందు బుద్ధిగుహయందు సత్తను బొందువాఁడును; ఆదిదేవమ్=సర్వకారణం బగుటవలన ఆదియును ద్యోతనశీలుఁ డగుటవలన దేవుఁడును; అజమ్=జన్మాదివికార వర్జితుఁడును; విభుమ్ = వ్యాపకుండును పరిపూర్ణుఁడు నగు; పురుషమ్=పరమాత్మునిగా; ఆహుః=చెప్పుచున్నా రని యర్థము. ఇందుచే నెఱుంగవలసిన వస్తువును పెక్కండ్రవలన వినవలయు నని సూచితము. మఱియును. స్వయంచైవ బ్రవీషి మే—నీవును « భోక్తారం యజ్ఞ తపసాం ’’ అనియు « సర్వభూతస్థితం యోమాం ’’ అనియు నిన్ను పరమాత్మునుగా నాకుఁ జెప్పుచున్నావు. అందువలన నీవే పరబ్రహ్మ వని యర్థము.

మ. ఇట్లు భగవంతునివిభూతిని యోగంబును విని మిక్కిలి యుత్కంఠ గలవాఁడై యర్జునుం డిట్లనియె —పరంబ్రహ్మ; పరంధామ=పరమమైన ఆశ్రయము,

లేక, ప్రకాశము; పరమమయిన, పవిత్రమ్=పావనంబును; భవాన్=నీవే. ఎందువలన ననఁగా, పురుషమ్=పరమాత్మను; శాశ్వతమ్=సర్వదా యేకరూపుని; దివ్యమ్=పరమ వ్యోమమునందు స్వస్వరూపమునను దున్నవానిని, సర్వప్రపంచాతీతుని; ఆదిదేవమ్=ఆదిని—సర్వకారణమును దేవుని—ద్యోతనాత్మకుని—స్వప్రకాశుని; కావుననే, అజమ్; విభుమ్=సర్వగతునిఁగా; త్వామ్ = అనంతమహిమాఢ్యుఁడవగు నిన్ను; ఆహుః = చెప్పుచున్నారు; ఋషయః = తత్త్వజ్ఞానసిద్ధులు, భృగువసిష్ఠాదులు. తథా; దేవర్షిః; నారదః; అసితః; దేవలః—ధౌమ్యుని జ్యేష్ఠభ్రాత; వ్యాసః = భగవంతుఁ డగు కృష్ణ ద్వైపాయనుఁడును; వీరుగూడ నిన్ను అట్టివానినిగా, మే=నాకు; చెప్పుచున్నారు సమక్షముగా. ఇతరులు చెప్పనేల? స్వయమేవచ = నీవునుగూడ; నాకుఁ జెప్పుచున్నావు. ఇట ఋషులైనను నాప్తోద్వక్తలును ఉత్తములు నగుటవలన నారదాదులు వేఱుగాఁ జెప్పఁబడిరి.

శ్రీ. సంక్షేపమునను జెప్పినవిభూతిని విస్తరంబునఁ దెలియఁ గోరినవాఁడై భగవంతుని స్తుతించుచు నర్జునుం డిట్లనియె నేడుశ్లోకములచేత —పరబ్రహ్మమును, పరమ మయినధామమును—ఆశ్రయమును, పరమ మయినపవిత్రంబును నీవే. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు —శాశ్వతమ్ = నిత్యుని; పురుషమ్; అట్లు, దివ్యమ్=ద్యోతనాత్మకుని స్వప్రకాశునిగా; ఆదియు దేవుఁడు నగువానిని, దేవతల కాదిభుతుని గా నని యర్థము; అట్లు, అజమ్=జన్మరహితునిఁగా; విభుమ్ = వ్యాపకునిఁగా; నిన్నే చెప్పుచున్నారు. ఎవ్వరు? ఋషయః=భృగ్వాదులు; సర్వే. దేవర్షి యగునారదుఁడును అసితుఁడును దేవలుఁడును వ్యాసుఁడును. తానే నీవును నాకొత్తుగా నాకుఁ జెప్పుచున్నావు.

ప. ఇట్లు భగవంతుఁడు చెప్పినదాని విని యర్జునుఁ డిట్లనియె నేడుశ్లోకములచేత.—పరం బ్రహ్మ అనునది మొదలగు తొమ్మిదివిశేషణములతోఁ గూడిన వానినిగా నిన్ను ఋషులందఱును చెప్పుచున్నారు. అందు విశేషించి దేవర్షి యగు నారదుఁడు చెప్పుచున్నాఁడు. అసితుఁడును దేవలుఁడును జెప్పుచున్నారు. అంతకన్నను విశేషముగా వ్యాసుఁడు చెప్పుచున్నాఁడు. అట్లు నమే విమ న్నురిగా ఇత్యాదిగా నాకు నీవును జెప్పుచున్నావు.

రా. ఇట్లు శ్రోతలకు నిరతిశయానందజనకంబును సమస్తేతర విసజాతీయంబును భగవంతునియం దసాధారణంబు నగు కల్యాణగుణగణయోగమును దైశ్వర్య

విభూతిని విని తద్విస్తారమును వినఁగోరినవాఁడై యర్జునుం డిట్లనియె.—పరం బ్రహ్మ
పరం ధామ పరమం పవిత్రమ్ అని యెవ్వని శ్రుతులు చెప్పుచున్నవో అతఁడు గదా
నీవు—« యతో వా ఇమాని భూతాని జాయన్తే యేన జాతాని జీవన్తి యత్ప్రయ
న్త్యభిసంవిశన్తి తద్విజ్ఞాసస్వ తద్బ్రహ్మేతి, బ్రహ్మవిదాప్నోతిపరమ్, సయోహవై త
త్పరమం బ్రహ్మవేద బ్రహ్మైవభవతి » అని. అట్లు, పరంధామ—ధామశబ్దము జ్యోతి
ర్వాచకము, పరమయినజ్యోతిస్సు, « అథయ దతః పరోదివో జ్యోతి ర్దీప్యతే, పరం
జ్యోతి రుపసంపద్య స్వేన రూపేణాభి నిష్పద్యతే, తం దేవా జ్యోతిషాం జ్యోతిః "
అని. అట్లు, పరమం పవిత్రమ్ = పరమపావనము, స్మరించువానికి సమస్తపాపముల
తోను సంబంధము లేమిని జేయునది, వినాశముచేయునదియు, « యథా పుష్కర
పలాశ ఆపో నశ్లిష్యన్త ఏవమేవం విది పాపం కర్మ నశ్లిష్యతే, తద్యథేషీక తూల
మగ్నౌ ప్రోతం ప్రదూయేతైవం హాస్య సర్వే పాప్మానః ప్రదూయన్తే, నారాయణ
పరం బ్రహ్మ తత్త్వం నారాయణః పరః » అని గదా శ్రుతులు చెప్పుచున్నవి. ఋషు
లును అంజలులను బరావరతత్త్వజ్ఞులు నిన్నే శాశ్వతుని దివ్యుని పురుషుని ఆదిదేవుని
అజుని విభువునుగాఁ జెప్పుచున్నారు. అట్లె, దేవర్షి యగునారదుఁడును. « యేచ
వేదవిదో విప్రా యేచాధ్యాత్మవిదో జనాః । తేవదన్తి మహాత్మానం కృష్ణం ధర్మం
సనాతనమ్॥ పవిత్రాణాం హి గోవిన్దః పవిత్రం పర ముచ్యతే । పుణ్యానా మపి
పుణ్యోఽసౌ మఙ్గలానాంచ మఙ్గలమ్ । త్రైలోక్యం పుణ్డరీకాక్షో దేవదేవ స్సనాతనః ।
ఆస్తే హరి రచిన్త్యాత్మా తత్రైవ మధుసూదనః॥ ఏష నారాయణశ్శ్రీమాన్ క్షీరా
ర్ణవ నికేతనః । నాగపర్యఙ్క ముత్సృజ్య హ్యాగతో మధురాం పురీమ్॥ పుణ్యా
ద్వారవతీ తత్ర యత్రాస్తే మధుసూదనః । సాక్షాద్దేవః పురాణోఽసౌ సహి
ధర్మ స్సనాతనః " మఱియు, « యత్ర నారాయణో దేవః పరమాత్మా సనాతనః ।
తత్ర కృత్స్నం జగత్పార్థ తీర్థాన్యాయతనానిచ । తత్పుణ్యం తత్పరం బ్రహ్మ తత్తీర్థం
తత్తపోవనమ్॥ తత్ర దేవర్షయ స్సిద్ధా స్సర్వేచైవ తపోధనాః । ఆదిదేవో మహా
యోగీ యత్రాస్తే మధుసూదనః॥ పుణ్యానా మపి తత్పుణ్యం మాభూత్తే సంశయో
ఽత్ర వై । కృష్ణ ఏవహి లోకానా ముత్పత్తి రపిచాఽప్యయః॥ కృష్ణస్యహి కృతే
భూత మిదం విశ్వం చరాచరమ్ » అని. అట్లు, స్వయమేవ బ్రవీషిచ—« భూమిరాపో
ఽనలో వాయుః ఖం మనో బుద్ధిరేవచ । అహంకార ఇతీయం మే భిన్నా ప్రకృతి
రష్టధా » ఇత్యాదిగా « అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే " ఇత్యంత
గ్రంథముచేత,

మూ. బ్రహ్మ = పరిపూర్ణము, « అథకస్మాదుచ్యతే.....బృంహతి బృంహయతి » అని శ్రుతి. బృహబృహివృద్ధౌ అని పఠించెదరు. పరమం యో మహద్బ్రహ్మ అనియును. వివిధముగా నయ్యెను గావున విభువు. అట్లు వారుణశాఖయందు « విభుః ప్రభుః ప్రథమం మేహనావతః ” ♦ అని. « సహ్యేవ ప్రాభన ద్వేధా౽భవత్ ” అని. « సో౽కామయత బహుస్యాం ప్రజాయేయేతి ” ఇత్యాదికము వలనను.

సర్వ మేత దృతం మన్యే య న్మాం వదసి కేశవ
నహి తే భగవన్ వ్యక్తిం విదు ర్దేవా న దానవాః. ౧౪

భా. ఏతత్ =దీనిని; సర్వమ్ = సమస్తమును, ఋషులును నీవును జెప్పినదానిని; ఋతమ్=సత్యమే యని; మన్యే=తలంచుచున్నాను. యత్= దేనిని; మామ్=నన్ను గూర్చి; వదసి=చెప్పుచున్నావో, దానిని. కేశవ= కృష్ణా! భగవన్=భగవంతుఁడా! తే=నీయొక్క; వ్యక్తిమ్=ప్రభవమును, దేవాః=దేవతలును; నవిదుఃహి=ఎఱుఁగరుగదా! దానవాః=దానవులును; న=ఎఱుంగరుగదా!

భగవంతుఁడా! నీవు నాకేది చెప్పుచున్నావో అది యంతయు సత్యమే యని తలంచుచున్నాను. నీ నిరుపాధికస్వభావమును దేవతలును దానవులును ఎఱుంగ రని తాత్పర్యము.

ఆ. ఋషులును నీవును జెప్పుటవలనఁ జెప్పినదంతయు సత్యమే యని నా యభిప్రాయ మని చెప్పుచున్నాఁడు సర్వమిత్యాదిగా! అదియేది? అని యాశంకించి యాత్మరూప మని చెప్పుచున్నాఁడు యన్మా మిత్యాదిగా. దేవాదు లందఱును జెప్పుచుండఁగా నారూపమును నన్నేల యడుగుచున్నావు? అని యాశంకించి చెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత. ప్రభవమనఁగా ప్రభావము, నిరూపాధికస్వభావ మని యర్థము. నీరూపము దేవాదులకును దుర్విజ్ఞేయ మగునపుడు మనుష్యులకు దుర్విజ్ఞేయ మని చెప్పెడిదేమి యని యర్థము.

హ. ఋషివాక్యమువలనను నీ వాక్యమువలనను చెప్పినదంతయు, ఋతమ్= సత్యమునుగా; మన్యే. వ్యక్తిమ్=ఉత్పత్తిని.

♦ మేహనావతః—తడువునట్టి యాశ్వరునకు మొదటిరూపము విభువు ప్రభువు.

శ్లో. ఓయీ! నేను నూఱువిధంబులఁ జెప్పితిని ఋషులును వేయివిధంబుల నుడివిరి, సత్యమే, నీనిశ్చయమేమి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఓకేశవా! బహూని మేవ్యతీతాని అనియు మత్తః పరతరం నాన్యత్ అనియు నమేవిదు స్సురగణాః అనియు మహర్షయ స్సప్తపూర్వే అనియు, మామ్ = నన్నుగూర్చి; యత్ = దేనిని; వదసి = చెప్పుచున్నావో; అట్టి, ఏతత్ సర్వమ్ = ఇదియంతయు; ఋతమ్ = సత్యమే యని; మన్యే—పరమాప్తుఁడ వగుటవలనను నిన్నెఱుంగుటకుఁ గారణ మగుటవలనను నీవాక్యము యథార్థ మనియే నిశ్చయించుచున్నా నని యర్థము. హి = ఎందువలన; దేవతలును దానవులును వెనుకటివారో అందువలన, తే = నీయొక్క; వ్యక్తిమ్ = దీనివలన సర్వంబును వ్యక్తమగును, లేక, సర్వంబును వ్యక్తము చేయుచున్నది కావున వ్యక్తిని—స్వరూపమును; ఐశ్వర్యమును అచింత్యమును అనంతవైభవమును అప్రమేయప్రభావమును అనాదిని అనంతమును; దేవాః = సర్వజ్ఞులైనను ఇంద్రాదులును; నవిదుః = ఎఱుంగరు. దానవాః = మధువు మొదలగువారును; న = ఎఱుంగరు. వారికన్నను వెనుకటివారు కించిద్జ్ఞులునగు మనుష్యు లెఱుంగ రని చెప్పవలయునా? అని యర్థము.

మ. సర్వమేతత్ = ఋషులును నీవును జెప్పినదాని సమస్తమును; ఋతమ్ = సత్యమునుగానే; నేను దలంచుచున్నాను. యత్ మాంవదసి కేశవ—నీవాక్యమునందు నా కెందును అప్రామాణ్యశంక లేదుగదా! దానినిగూడ సర్వజ్ఞుండ వగుటవలన నీ వెఱుంగుదు వని, కేశవ—బ్రహ్మరుద్రులను సర్వేశ్వరులనుగూడ అనుకంప్యులనుగా ♦ వాతి—ఎఱుంగుచున్నాఁడు అను వ్యుత్పత్తి నాశ్రయించి నిరతిశయైశ్వర్య ప్రతిపాదకం బగు కేశవపదముచే సూచితము. అందువలన నేమిచెప్పితివో « నమే విదు స్సురగణాః ప్రభవం న మహర్షయః » ఇత్యాదిగా, అది సత్యమే. హి = ఎందువలన ననఁగా. ఓభగవంతుఁడా—సమగ్రైశ్వర్యాదిసంపన్నుఁడా! తే = నీయొక్క; వ్యక్తిమ్ = ప్రభావమును; జ్ఞానాతిశయము గలవారలైనను, దేవాః; నవిదుః. దానవాః; న. మహర్షులును ఎఱుంగ రని గ్రహింపవలయును.

శ్రీ. అందువలన నాకిప్పుడు నీయైశ్వర్యము విషయమై యసంభావన తొలఁగిన దని చెప్పుచున్నాఁడు.—ఏతత్—నీవే పరబ్రహ్మమవు ఇత్యాదికము; సర్వమ్ = సమస్తమును; ఋతమ్ = సత్యమునుగా; మన్యే. యత్; మామ్ = నన్నుగూర్చి;

♦ కరుణింపఁ దగినవారినిగా.

నీవు, వదసి=చెప్పుచున్నావో నమేవికు స్సురగణాః ఇత్యాదిగా; దానినిగూడ సత్యమునుగానే తలంచుచున్నా నని చెప్పుచున్నాఁడు.—ఓభగవంతుఁడా! తే=నీయొక్క; వ్యక్తిమ్; దేవాః; నవిదుః—మ మ్మనుగ్రహించుకొఱ కీయభివ్యక్తి యని యెఱుంగరు; దానవులును మమ్ము నిగ్రహించుకొఱ కని యెఱుంగనే యెఱుంగరు.

ప. ఇట్లు ఏది నీవుచెప్పుచున్నావో, అదియంతయు, ఋతమ్=సత్యమని. మన్యే. అదియేది? ఓభగవంతుఁడా! తే; వ్యక్తిమ్ = స్వరూపమును; దేవతలును దానవులును, హి=నిశ్చయబుద్ధిచే; నవిదుః=ఎఱుంగ రని.

రా. అందువలన.—సర్వమేతత్; ఋతమ్=యథావస్థితవస్తువును జెప్పుటగా; మన్యే. యత్; మామ్=నన్నుగూర్చి; అనన్యసాధారణంబును అనవధికాతిశయంబును స్వాభావికంబు నగు నీ యైశ్వర్యమును అనంతకల్యాణగుణగణంబును, వదసి. కావున భగవన్ = నిరతిశయ జ్ఞానశక్తిబలైశ్వర్యవీర్య తేజస్సులకు నిధియైనవాఁడా! తే; వ్యక్తిమ్=వ్యంజనప్రకారమును §; పరిమితజ్ఞాను లగుదేవతలును దానవులును ఎఱుంగరు గదా!

మా. *

స్వయమేవా ఽఽత్మనా ఽఽత్మానం వేత్థ త్వం పురుషోత్తమ
భూతభావన భూతేశ దేవదేవ జగత్పతే. ౧౫

భా. ఎందువలన నీవు దేవతలకును ఆదివో అందువలన.—స్వయమేవ=నీయంతనే; ఆత్మనా ♦; ఆత్మానమ్=ఆత్మను, నిరతిశయజ్ఞానైశ్వర్యబలాదిశక్తిమంతుఁ డయిన యీశ్వరుని; వేత్థ=ఎఱుంగుచున్నావు; త్వమ్=నీవు. పురుషోత్తమ=పురుషోత్తమా! భూతభావన=భూతములను బుట్టించువాఁడా! భూతేశ=భూతములకు నీశ్వరుఁడా! దేవదేవ = దేవతలకును దేవుఁడా! జగత్పతే=జగంబునకుఁ బాలకుఁడా!

నీయంతనే నీవు నీస్వరూపము నెఱుంగుదువు. నీవు పురుషోత్తముఁడవు, భూతములఁ బుట్టించువాఁడవు, భూతముల కీశ్వరుఁడవు, దేవతలకును దేవుఁడవు, జగత్తును బాలించువాఁడ వని తాత్పర్యము.

§ తెలుపువిధమును.
* దీనికిని మీఁదిశ్లోకమునకును మాధ్వభాష్యము లేదు.
♦ స్వరూపముచేత.

ఆం. ఒకానొకఁడే మహాకష్టంబున అనేకజన్మ సంసిద్ధుఁడై నీయనుగ్రహంబున నీస్వరూపము నెఱుఁగు నను నభిప్రాయంబునఁ జెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. నీయంతనే—ఉపదేశము లేక యని యర్థము. ఆత్మనా—ప్రత్యగ్రూపంబున అవిషయముగా నని యర్థము. ఆత్మను—నిరుపాధిక మగురూపమును. నీసోపాధికరూపముఁగూడ నితరులకు గోచరము కాదని చెప్పుచున్నారు నిరతిశ యేత్యాదిగా. పురుషులను ఉత్తములను పురుషోత్తముఁడు, ఈసంబోధనముచే క్షరాక్షరాతీత [illegible] బోధింపఁబడుచున్నది. సర్వప్రకృతిత్వమును సర్వకర్తృత్వమును జెప్పుచున్నారు భూతములను ఇత్యాదిగా. సర్వేశ్వరత్వముఁ జెప్పుచున్నారు భూతములకు ఇత్యాదిగా. ఈచెప్పిన నీసోపాధికరూపము దేవాదుల కాబాధ్య మని చెప్పుచున్నారు దేవతలకును ఇత్యాదిగా. జగత్తునకు సర్వంబునకును స్వామి యగుటచేఁ బాలకుం డని చెప్పుచున్నారు జగంబునకు ఇత్యాదిగా.

హా. *

శ్లో. ఎందువలన నీవు దేహబుష్యాదుల కాదివో అందువలన నీవే నిన్నెఱుంగుదు వని చెప్పుచున్నాఁడు.—భూతములను ఆకాశాదిస్తంబపర్యంతములను దనవలననే భావయతి—సంభవింపఁజేయువాఁడవు, కావున, భూతభావనుఁడా! భూతేశ—ఆభూతములనే ఈష్టే—అంతర్యామిరూపంబునఁ బ్రవర్తింపఁజేయువాఁడవు కావున భూతేశుఁడా! అగ్న్యాదులుగదా వాగాదీంద్రియముల నధిష్ఠించి జగత్తును బ్రవర్తింపఁ జేయుచున్నారు, అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు.—దేవతలను—అగ్న్యాదులఁ గూడ దేవయతి—చేష్టింపఁ జేయువాఁడవు, కావున, దేవదేవుఁడా! «య అగ్నౌతిష్ఠన్» ఇత్యాదిశ్రుతివలన. లేక, దేవతలకునుగూడ దేవుఁడా—పూజ్యుఁడా! తాను సృజించిన జగత్తును సర్వంబును అన్నోదకాదిరూపంబునను నియామకరూపంబునను పాతి—పాలించువాఁడవు, కావున, జగత్పతీ! పూర్ణుఁడు కావున పురుషుఁడు, అందఱికన్నను గొప్ప కావున ఉత్తముఁడు, పురుషుఁడవును ఉత్తముఁడవును అయిన వాఁడా! స్వయమేవ; త్వమ్; ఆత్మనా=తనచేతనే; ఆత్మానమ్ = తన్ను; వేత్థ—పురుషుఁడు బలపుష్టిజవారోగ్యానారోగ్యాంగగుణవైకల్యావైకల్యధైర్యాదిరూప మయిన తనస్వరూపమును ఎట్లు తానే యెఱుంగుచున్నాఁడో అట్లు మాయాయోగవిశేషవిశిష్ట మయిన నీవైభవమును నీవే యెఱుంగుదువు, కాని పరిచ్ఛిన్నుఁడు కించిద్జ్ఞుఁడగు నితరుఁ డెఱుంగఁ డని భావము.

---

* విశేషము లేదు.

ప. ఎందువలన నీవు అందఱకును ఆదివో దుర్విజ్ఞేయుఁడవో అందువలన — స్వయమేవ—ఇతరుని యుపదేశాదికము లేకయే; త్వమ్=నీవే; ఆత్మనా=స్వరూపము చేత; ఆత్మానమ్—నిరుపాధికుని సోపాధికునిఁ గూడ; నిరుపాధికుని ప్రత్యగ్రూపంబున అవిషయమునుగాను సోపాధికుని నిరతిశయ జ్ఞానైశ్వర్యాది శక్తిమంతునిఁగాను, వేత్థ=ఎఱుంగుచున్నావు, ఇతరుఁ డెవ్వఁడు నెఱుంగఁడు. ఇతరులకుఁ దెలియ నశక్య మయినదాని నే నెట్లెఱుంగుదును? అను నాశంకను బరిహరించుచుఁ బ్రేమాత్కంఠుఁడై బహువిధంబుల సంబోధించుచున్నాఁడు —పురుషోత్తమ—నీకంటె సర్వ పురుషులును అపకృష్టులే, కావున వారి కశక్య మయినది సర్వోత్తముఁడ వగు నీకు శక్యమే యని యభిప్రాయము. పురుషోత్తమత్వమునే వివరించుచున్నాఁడు వెండియు నాలుగు సంబోధనముల చేత.—భూతములను సర్వంబులను భావయతి—పుట్టించువాఁడవు కావున ఓభూతభావనుఁడా—సర్వభూతములకును దండ్రివైనవాఁడా! తండ్రియు నొకానొకఁడు నియామకుఁడు కాకపోవచ్చును అనఁగా చెప్పుచున్నాఁడు.—భూతేశ= సర్వభూత నియామకుఁడా! నియామకుఁ డయినను ఒకానొకఁడు ఆరాధ్యుఁడు కాఁడు, అనఁగాఁ జెప్పుచున్నాఁడు —దేవదేవ=అందఱకును ఆరాధ్యు లయిన దేవతలకును ఆరాధ్యుఁడ వైనవాఁడా! ఆరాధ్యుఁడును ఒకానొకఁడు పాలకుఁడు—పతి కాకయుండును, అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—జగత్పతే-హితాహితోపదేశకము లగు వేదముల రచించుటచే సర్వజగత్తునకును బాలకుఁడా! ఇట్టి సర్వవిశేషణములతో విశిష్టుఁడవు నీవు సర్వపితవు సర్వగురుండవు సర్వరాజవు కావున సర్వప్రకారముల చేతను సర్వారాధ్యుండవు, నీవు పురుషోత్తముఁడ వని చెప్పవలయునా? అని భావము.

శ్రీ. ఏమనుటి?—స్వయమేవ; త్వమ్=నీవే; ఆత్మానమ్; వేత్థ=ఎఱుంగుదువు. ఇతరుఁ డెఱుఁగఁడు. అదియు, ఆత్మనా=తనచేతనే, ఎఱుంగుచున్నావు, సాధనాంతరముచేఁ గాదు. అత్యాదరముచే బహువిధంబుల సంబోధించుచున్నాఁడు — పురుషోత్తమ = పురుషులయందు త్తముఁడా! పురుషోత్తముఁ డనుటకు హేతుగర్భ విశేషణములు తక్కిన సంబోధనములు.—భూతభావన=భూతములఁ బుట్టించువాఁడా! భూతేశ = భూతములకు నియామకుఁడా! దేవదేవ = ఆదిత్యాదిదేవతలకు ప్రకాశకుఁడా! జగత్పతే=ప్రపంచమునకుఁ బాలకుఁడా!

ప. మ తే మనఁగా.—స్వయమేవ; ఆత్మనా = స్వరూపముచేత ఇతర ప్రమాణమున కగోచరుండైన; ఆత్మానమ్; వేత్థ=ఎఱుంగుదువు. అందువలనన పురు

షోత్తమ యని సంబోధనము. శ్రుతియును.—“ఏతావా నస్య మహిమా । అతో జ్యాయాంశ్చ పురుషః” అని. భూతములు భావ్యన్తే—కల్పింపఁబడుచున్నవి వీని యందు, కావున భూతభావనుఁడా! భూతేశ=పృథివ్యాది మహాభూతములకు స్వామి వైనవాఁడా!

రా. ఓ పురుషోత్తమా! ఆత్మనా; ఆత్మానమ్=నిన్ను; స్వయమేవ=నీదైన జ్ఞానముచేతనే; వేత్థ. భూతభావన=సర్వభూతంబులను బుట్టించువాఁడా! దేవదేవ=దేవతలకును బరమదైవతమా.—ఎట్లు మనుష్య మృగ పక్షి సరీసృపాదులను సౌందర్య సౌశీల్యాది కల్యాణగుణగణంబులచే దేవత లతిశయించియున్నారో అట్లు ఆ దేవతల నందఱనుగూడ అతిశయించి యున్నవాఁడా! జగత్పతే=జగన్నాథా!

వక్తుమర్హస్యశేషేణ దివ్యా హ్యాత్మవిభూతయః
యాభిర్విభూతిభిర్లోకానిమాంస్త్వం వ్యాప్య తిష్ఠసి. ౧౬

భా. అశేషేణ=సాకల్యముగా; వక్తుమ్=చెప్పుటకు; అర్హసి=తగుదువు. ఆత్మవిభూతయః = నీయొక్క విభూతులు; దివ్యాహి = అప్రాకృతములు గదా! అవియేవో వానిని జెప్పఁదగుదువు. యాభిః=ఏ; విభూతిభిః=నీ మాహాత్మ్యవిస్తారములచే; త్వమ్=నీవు; ఇమాన్ లోకాన్=ఈలోకములను; వ్యాప్య=వ్యాపించి; తిష్ఠసి=ఉన్నావో.

నీ వేవిభూతులచే నీలోకములను వ్యాపించియున్నావో అట్టి నీవిభూతులు అప్రాకృతము లగుటవలన నితరుల కెఱుంగ శక్యముగావు, కావున నీవే చెప్పవలయు నని తాత్పర్యము.

ఆ. ఎందువలన మావంటివారికి నీస్వరూపము అగోచరమో, దాని నెఱుంగుటకును గోరుచున్నామో, అందువలన నీవే నీస్వరూపమును జెప్పవలయు నని చెప్పుచున్నాఁడు అశేషేణేత్యాదిగా. చెప్పవలసిన విభూతులకు విశేషణము చేయుచున్నాఁడు యాభిః ఇత్యాదిగా. ఏవిభూతుల ద్వారంబున లోకముల నిండియున్నావో, ఆవిభూతులను అశేషముగాఁ జెప్పు మని సంబంధము.

హ. ఆత్మవిభూతయః; దివ్యాః=అప్రాకృతములు. అందువలన నీవే చెప్పవలయును.

శం. ఎందువలన నీవొక్కఁడవే నీమహిమ నెఱుంగుదువో అందువలన నీవే దీని నా కుపదేశింపు మని చెప్పుచున్నాఁడు.—దివ్యాః=తేజోబలపౌరుషశక్తిప్రకా

శాది గుణములచే అప్రాకృతములగు; ఆత్మవిభూతయః = నీయొక్క — పరమేశ్వరుని యొక్క విభూతులు — మహాత్త్వవిస్తారము లేవి గలవో; వానిని; అశేషేణ=సాకల్యముగా; నీమహాత్త్వసారము నెఱింగినట్టి నీవే నాకు, వక్తుమ్; అర్హసి. యాభిః; విభూతిభిః=నీయొక్క వివిధములగు భావములచే; ఇమాన్ — పరిదృశ్యమానములగు; లోకాన్=స్వర్గమర్త్యాదిలోకములను; వ్యాప్య=నిండి; తిష్ఠసి=ఉన్నావో.

మ. నీవిభూతులు ఇతరుల కెవ్వరికిని దెలియ శక్యములుగావు. అవశ్యము ను ఎఱుంగవలసినవి, అందువలన.—యాభిః; విభూతిభిః; ఇమాన్ లోకాన్=ఈసర్వలోకములను; వ్యాప్య, త్వమ్; తిష్ఠసి. అట్టి, ఆత్మవిభూతయః=నీయొక్క అసాధారణములయిన విభూతులు; దివ్యాః=సర్వజ్ఞులు కానివారి కెఱుంగ శక్యములు గావు; హి=ఎందువలననో; అందువలన సర్వజ్ఞుఁడవగు నీవే వానిని, అశేషేణ; వక్తుమ్; అర్హసి.

శ్రీ. ఎందువలన నీయభివ్యక్తిని నీవే యెఱుంగుదువో, దేవాదులుకూడ నెఱుంగరో, అందువలన.—ఏవి, ఆత్మవిభూతయః=నీయొక్క విభూతులు; దివ్యాః= అత్యద్భుతములు; కలవో వానినన్నిటిని; వక్తుమ్; నీవే, అర్హసి = యోగ్యుఁడ వగుచున్నావు. యాభిరిత్యాదికము విభూతులకు విశేషణము. అర్థము స్పష్టము.

ప. దివ్యాః=దేవరూపములు; ఆత్మవిభూతయః. వాని, అశేషేణ=విస్తరమున; వక్తుమర్హసి. యాభిర్విభూతిభిః; ఇమాన్ లోకాన్=భూర్భువస్స్వరాదులను; వ్యాప్యతిష్ఠసి.

రా. దివ్యాః; ఆత్మవిభూతయః=నీయసాధారణము లయిన విభూతులు; ఏవి గలవో వానిని నీవే, అశేషేణ; వక్తుమర్హసి-నీవే తెలుపుము అని యర్థము. యాభిః= ఏ; విభూతిభిః=అనంతము లయిన నియమనవిశేషములతో; కూడినవాఁడవై, ఇమాన్ లోకాన్; త్వమ్; నియామకుఁడగుటచే, వ్యాప్యతిష్ఠసి.

మా. విభూతయః=వివిధము లయిన భూతులు *.

కథం విద్యామహం యోగిన్ త్వాం సదా పరిచిన్తయన్
కేషు కేషుచ భావేషు చిన్త్యోఽసి భగవన్మయా. ౧౭

భా. యోగిన్=యోగీ! అహమ్=నేను; కథమ్ = ఎట్లు; సదా=ఎల్లప్పుడు; పరిచిన్తయన్=ధ్యానించుచు; త్వామ్=నిన్ను; విద్యామ్=ఎఱుంగు

* రూపములు.

దును? భగవన్=భగవంతుఁడా! కేషు కేషు చ భావేషు=ఏయేవస్తువుల యందును; మయా=నాచేత; చిన్త్యః = ధ్యానింపఁ దగినవాఁడవు; అసి= అగుచున్నావు?

ఈశ్వరా! నేను ని న్నేవిధంబున ధ్యానించుచుండినచో ని న్నెఱుంగుదును? భగవంతుఁడా! ఏయేవస్తువులయందు నిన్ను నేను ధ్యానింపవలయును? అని తాత్పర్యము.

ఆ. ఎందుకొఱకు విభూతులను వినఁగోరుచున్నావు? అని యాశంకించి ధ్యానసౌకర్యప్రకారము నడుగుటచేఁ దత్ఫలముఁ జెప్పుచున్నాఁడు.—యోగ మనఁగా ఐశ్వర్యము, అది గలవాఁడు కావున యోగి, ఓయోగీ! నేను స్థూలబుద్ధిని ని న్నేవిధంబున నెల్లప్పు డనుసంధించుచున్నవాఁడనై, బుద్ధిశుద్ధినొంది నిరుపాధికుఁడ నగు ని న్నెఱుంగుదును? అని ప్రశ్నము. ప్రశ్నాంతరమును బ్రస్తావించుచున్నాఁడు.—చేతనాఽచేతనభేదమువలనను ఉపాధు లనేకము లగుటవలనను కేషు కేషు అని బహువచనము.

హ. భావేషు=పదార్థములయందు.

శం. మఱియును.—యోగిన్=మాయాయోగజం బగునైశ్వర్యము యోగ మని చెప్పఁబడుచున్నది, అది కలవాఁడు యోగి, ఓయోగీ! నిన్ను సవిశేషుని, పరిచిన్తయన్ సదా సర్వత్ర ధ్యానించుచు స్తుతించుచు నమస్కరించుచు; అహమ్= నేను; శుద్ధాత్ముఁడనై; త్వామ్ = అవాఙ్మనసగోచరుని నిర్విశేషుని పరబ్రహ్మమును నిన్ను; కథమ్ విద్యామ్ = ఏవిధంబున నెఱుంగుదును? అట్టి మహత్త్వముగల నీ విభూతివిశేషమును నాకుఁ జెప్పవలయు నని పూర్వముతో నన్వయము. లేక ని న్నేవిధంబున నెఱుంగుదునో ఆవిధముఁ జెప్పు మని ప్రశ్నము. ఓభగవంతుఁడా! జడాజడభేదంబునను దేవదానవమర్త్యాదిభేదంబునను బహువిధములయిన, భావేషు= పదార్థములయందు; కేషు కేషు = వేనివేనియందు; నీవు, మయా=ముముక్షుఁడ నగు నాచేత; చిన్త్యఃఅసి = ధ్యానింపవలసినవాఁడ వగుచున్నావు? సర్వం విష్ణుమయం జగత్ అనున్యాయంబున త్వదాత్మకం బగుజగత్తునందు ఎచ్చటెచ్చట విశేషస్ఫూర్తి కలిగియుండును? ఎచ్చటెచ్చట నిన్ను నేను విశేషించి ధ్యానింపవలయును? అని యర్థము.

మ. దానిఁ జెప్పుటచే నేమిప్రయోజనము? అనఁగాఁ బ్రయోజనముఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—యోగ మనఁగా నిరతిశయైశ్వర్యాదిశక్తి,

అది గలవాఁడా! అహమ్=మిక్కిలి స్థూలబుద్ధిని నేను; త్వామ్=దేవాదులకుఁగూడ నెఱుంగ శక్యముగాని నిన్ను; కథమ్=ఎట్లు; విద్యామ్=ఎఱుంగుదును? సదాపరిచిన్తయన్= ఎల్లప్పుడును ధ్యానించుచు. ఓయీ! నావిభూతులయందు నన్ను ధ్యానించుచు నెఱుంగఁగలవు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు — కేషు కేషు చ భావేషు=చేతనాచేతనాత్మకము లయిన యేయేవస్తువులయందు నీవిభూతిభూతము లయిన వానియందు; మయా; చిన్త్యోఽసి? ఓభగవంతుఁడా!

శ్రీ. కథనప్రయోజనముఁ దెలుపుచుఁ బ్రార్థించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఓయోగీ! కథమ్ = ఏవిభూతివిశేషములచే; సదాపరిచిన్తయన్; అహమ్=నేను; త్వామ్=నిన్ను; విద్యామ్ = ఎఱుంగుదును? విభూతివిశేషముల ధ్యానింపఁదగినవాఁడవైనను నీవు, కేషు కేషు; భావేషు=పదార్థములయందు; మయా=నాచేత; చిన్త్యః=ధ్యానింపవలసినవాఁడవు; అసి?

ప. యోగిన్ = అచింత్యమగు నైశ్వర్యముగలవాఁడా! త్వామ్=వ్యష్టిరూపంబున నున్న నిన్ను; నేను, కథమ్=ఏవిధంబున; విద్యామ్=ఎఱుంగుదును? కేషు కేషు భావేషు=ఏయే నీయావాసస్థలములయందు; మయా; చిన్త్యోఽసి? ఆయాభావములఁ జూచుటచే నీస్మరణము సిద్ధించు నని యర్థము.

రా. అహమ్ = నేను; యోగీ* = భక్తియోగనిష్ఠుఁడనై; భక్తిచే నిన్ను, సదాపరిచిన్తయన్ = ఎల్లప్పుడును ధ్యానించుటకుఁ బ్రవృత్తుఁడను; ధ్యానింపవలసినవాఁడ వగు, త్వామ్=నిన్ను పరిపూర్ణైశ్వర్యాది కల్యాణగుణగణుని; కథంవిద్యామ్=ఎట్లెఱుంగుదును? మున్ను చెప్పినబుద్ధి జ్ఞానాదులకంటె వ్యతిరిక్తములై యనుక్తములగు, కేషు కేషు చ భావేషు=ఏయేవస్తువులయందు; మయా=నాచేత; నియామకుఁడవై యున్నావని, చిన్త్యోఽసి?

మా. *

విస్తరేణాఽఽత్మనో యోగం విభూతించ జనార్దన
భూయః కథయ తృప్తిర్హి శృణ్వతో నాఽస్తి మేఽమృతమ్. ౧౮

భా. విస్తరేణ=విరివిగా; ఆత్మనః=నీయొక్క; యోగమ్ = యోగైశ్వర్యశక్తివిశేషమును; విభూతించ = ధ్యేయపదార్థముల విస్తారమును;

* పెరిమతమునందు "కథం విద్యామహం యోగిన్" అని పాఠము.

* దీనికి మాధ్వభాష్యము లేదు.

జనార్దన=గత్యర్థక మయిన అర్దధాతువుయొక్క- రూపము, దేవప్రతిపక్షభూతు లయిన యసురు లనుజనులను నరకాదిదుర్గతి నొందించువాఁడగుటవలన జనార్దనుఁడు; లేక, అభ్యుదయ నిశ్శ్రేయసరూప పురుషార్థప్రయోజనమును సర్వజనులచేత యాచింపఁబడుచున్నాఁడు * కావున జనార్దనుఁడు, ఓజనార్దనా! భూయః=వెండియు, మున్ను చెప్పియున్నను; కథయ=చెప్పుము. హి=ఎందువలన ననఁగా; అమృతమ్ = నీముఖమునుండి వెడలిన వాక్యామృతమును; శృణ్వతః=వినుచున్న; మే=నాకు; తృప్తిః= తనివి; నాఽస్తి=లేదు.

ఓజనార్దనా! నీయోగమును విభూతిని వెండియు విరివిగాఁ జెప్పుము, నీ వాక్యామృతమును ఎంతవిన్నను నాకుఁ దృప్తి లే దని తాత్పర్యము.

ఆ. ప్రకృతమయిన ప్రశ్నము నుపసంహరించుచున్నాఁడు.—గతికర్మకమయినయర్దధాతువునుండి జనార్దనరూపమును వ్యుత్పాదించుచున్నారు దేవేత్యాదిగా. ప్రకారాంతరంబున శబ్దార్థమును వ్యుత్పాదించుచున్నారు అభ్యుద యేత్యాదిగా. ఓయీ! మున్నే సప్తమనవమాధ్యాయములందు ఈశ్వరునివిభూత్యైశ్వర్యములు ప్రతిపాదింపఁబడినవి, ఏల వెండియు వినఁగోరుచున్నావు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు భూయఇత్యాదిగా. వాక్యామృతమును—అమృతమువంటి వాక్యము నని యర్థము.

మ. విభూతిమ్=విస్తారమును.

శం. ప్రకృతప్రశ్నము నుపసంహరించుచున్నాఁడు.—జాయతే—పుట్టుచున్నది, కావున జన మనఁగా దృశ్యవర్గము, దానిని లోపలను వెలుపలను అంతటను అర్దతి—వ్యాపించుచున్నాఁడు కావున జనార్దనుఁడు, ఓజనార్దనా—సర్వవ్యాపకుఁడా! ఆత్మనః=పరమాత్మవు ఈశ్వరుఁడ వగు నీయొక్క-; యోగమ్=మాయాకృతమైన యైశ్వర్యవిశేషమును; విభూతించ; భూయః=వెండియును; విస్తరేణ = నామరూపాదిభేదముల విశేషించి; కథయ=చెప్పుము. ఓయీ! అక్షరం బ్రహ్మ పరమమ్ అనియు, అహం క్రతు రహం యజ్ఞః అనియు, మహర్షయ స్సప్తపూర్వే అనియు అష్టమమునందును నవమమునందును దశమమునందును సంక్షేపవిస్తరంబుల విభూతి ప్రతిపాదింపఁబడినది, పిష్టపేషణన్యాయంబున వెండియు నేల చెప్పవలయును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—హి=ఏకారణమువలన; పరమేశ్వరుఁడ వగు నీయొక్క-,

* ఈయర్థమునందు అర్దధాతువు యాచనార్థము.

అమృతమ్=వాక్యామృతమును; శృణ్వతః=శ్రోత్రములచేఁ ద్రాగుచున్న; మే=నాకు; తృప్తిః=తనివి; నాస్తి=లేదో. అందువలనఁ జెప్పుమని. ఇట నిది యభిప్రాయము.— అష్టమాధ్యాయమునందు అధ్యాత్మాదిభేదభిన్న మగు సర్వంబును బ్రహ్మమని యుపాసింపు మని చెప్పఁబడినది. అందు, సర్వాత్మునియందు నామరూపజాత్యాదిభేదవాసనా దోషముచే దూషిత మయిన యంతఃకరణముగల మూఢబుద్ధికి భేదబుద్ధియే కాని యభేదబుద్ధి యుదయింపమిచలన నుపాసనము సంభవింపదు. నవమమునందు అహం క్రతు రిత్యాదిగా సర్వాత్మతయే ప్రతిపాదింపఁబడినది. అందును విశేషాలంబనము లేమివలన మనస్సు ప్రవేశింపదు. దశమమునందును సామాన్యంబుననే చెప్పఁబడినది. అందును మనస్సునకు విశేషాలంబనము కనఁబడదు. అందువలన మూఢబుద్ధికిఁ దదుపాసనమునందు బుద్ధిస్థైర్యముకొఱకు విభూతివిశేషము విస్తరించి చెప్పవలయునని.

మ. అందువలన.—ఆత్మనః=నీయొక్క; యోగమ్=సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదిలక్షణ మగు నైశ్వర్యాతిశయమును; విభూతించ=ధ్యానాలంబనమును; విస్తరేణ; సంక్షేపమున సప్తమనవమంబులఁ జెప్పియున్నను, భూయః=వెండియు; కథయ. జనార్దన = సర్వజనులచే అభ్యుదయ నిశ్శ్రేయసప్రయోజనములను యాచింపఁబడుచున్నావు కావున ఓజనార్దనా! కావున నేనును నిన్ను యాచించుట యుచితము. చెప్పినదానిని వెండియుఁ జెప్పుమని యేల యాచించుచున్నావు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు—హి=ఎందువలన; అమృతమ్ = నీవాక్యము అను అమృతమును, అమృతమువలె పదపదంబునను మధురంబైనదానిని; శృణ్వతః=శ్రవణముచేఁ ద్రాగుచున్న; మే=నాకు; తృప్తిః=చాలు నని తోఁచుటచే ఇచ్ఛావిచ్ఛిత్తి; నాస్తి=లేదు. ఇట నీ వాక్యము నని చెప్పుటవలన ఈ యపహ్నవాతిశయోక్తిరూపకసంకరము, మాధుర్యాతిశయము ననుభవించుటచేఁ గల్గు నుత్కంఠాతిశయమును సూచించుచున్నది,

శ్రీ. దానినే చిత్తము బహిర్ముఖ మయినప్పుడు అచ్చటచ్చట విభూతిభేదంబున నీచింతయే యెట్లు సిద్ధించునో అట్లు విస్తరంబుగఁ జెప్పుమని చెప్పుచున్నాఁడు.—ఆత్మనః = నీయొక్క; యోగమ్ = సర్వజ్ఞత్వ సర్వశక్తిత్వాదిలక్షణమయిన యోగైశ్వర్యమును; విభూతించ; విస్తరేణ; వెండియు, కథయ. హి= ఎందువలన ననఁగా. అమృతమ్ = అమృతరూప మయిన నీవాక్యమును; శృణ్వతః; మే = నాకు; తృప్తిః=అలంబుద్ధి; నాస్తి.

ప. మున్ను సప్తమాదులయందు సామాన్యముగఁ జెప్పఁబడియే యున్నది, అయినను, భూయః; విస్తరేణ; చెప్పుచున్న నీవచనామృతమును, శృణ్వతో మే; తృప్తిః నాస్తి.

రా. «అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే" అని సంక్షేపముగఁ జెప్పఁబడినట్టి నీయొక్క (స్రష్టృ)త్వాది యోగమును, విభూతించ = నియమనమును; భూయః; విస్తరేణ కథయ. నీవు చెప్పుచున్న నీమాహాత్మ్యామృతమును వినుచున్న నాకు తృప్తి లేదుగదా! నా యతృప్తి నీవే యెఱింగియున్నావని యభిప్రాయము.

మా. జాయతే—పుట్టువాఁడు. అర్దయతి—నశింపఁజేయును సంసారమును, కావున జనార్దనుఁడు ♦. అట్లు బాహ్వృచ్యశాఖయందు —«సభూతస్స జనార్దనః» అని. «సజ్యాసీ త్సనా ఉఽసీ త్సోర్దయాత్" * అని.

శ్రీభగవానువాచ.—

హన్త తే కథయిష్యామి దివ్యా హ్యాత్మవిభూతయః
ప్రాధాన్యతః కురుశ్రేష్ఠ నాస్త్యన్తో విస్తరస్య మే. ౧౯

భా. శ్రీభగవంతుఁ డిట్లనియె.—హన్త = ఇప్పుడు; తే=నీకొఱకు; దివ్యాః = దివియందుఁ బుట్టినవి §; ఆత్మవిభూతయః = నాయొక్క విభూతులు; ఏవి గలవో వానిని; ప్రాధాన్యతః=ప్రాధాన్యముచేత, ఎచ్చటెచ్చట నేయేవిభూతి ప్రధానమో ఆయాప్రధానమయిన విభూతిని; కథయిష్యామి=చెప్పెదను. కురుశ్రేష్ఠ=అర్జునా! అశేషముగా వర్ణితంబునను జెప్ప శక్యముకాదు. ఎందువలన ననఁగా, మే=నాయొక్క, నావిభూతులయొక్క యని యర్థము; విస్తరస్య=విరివికి, అన్తః=పారము; న=లేదు.

శ్రీభగవంతుఁ డిట్లనియె. అర్జునా! దివ్యములయిన నావిభూతులను ప్రధానము లయినవానిని ఇప్పుడే నీకుఁ జెప్పెదను. నావిభూతులకుఁ బారము లేదు కావున సాకల్యముగఁ జెప్ప శక్యము గాదని తాత్పర్యము.

---

♦ జః—పుట్టినవాఁడు, నః—పోఁడు కావున జనుఁడు, జనుఁడును అర్దనుఁడును ఐనవాఁడు జనార్దనుఁ డని విగ్రహము.

* అతఁ డుండినవాఁడుగదా! అతఁడు పుట్టలేదు, అతఁడు నశింపఁ జేయుచున్నాఁడు.

§ అప్రాకృతము లనుట.

ఆ. పృచ్ఛకునికి విశ్వాసము గలిగించుటకై భగవంతుఁడు చెప్పె నని చెప్పుచున్నారు శ్రీభగవంతుఁడు ఇత్యాదిగా. హన్త అనుట కనుమతి యర్థము గాదని జిజ్ఞాస చేయుకాలం బర్థ మని చెప్పుచున్నారు ఇప్పుడు అని. దివియందుఁ బుట్టినవి—అప్రాకృతములు, మనకు గోచరములు కానివని యర్థము. వాక్యాన్వయముఁ జూపుచున్నారు ఏవి గలవో వానిని అని. సర్వవిభూతులును జెప్పవలయు నని ప్రార్థింపఁగాఁ జెప్పుచున్నారు ఎచ్చటెచ్చట నిత్యాదిగా. ఎందువలన అశేషముగా విభూతులఁ జెప్పవు? అనఁగాఁ జెప్పుచున్నారు అశేషముగా నిత్యాదిగా. అందుకు హేతువు. ఎందువలన ననఁగా నిత్యాదిగా.

హ. ప్రాధాన్యతః=ప్రాధాన్యమువలన.

శం. హన్త=అయ్యో! ఇట్టిదా మూఢబుద్ధియొక్క ప్రజ్ఞ? ఓకురుశ్రేష్ఠుఁడా! తదనురూపముగా, దివ్యాః=అప్రాకృతము లయిన; ఆత్మవిభూతయః = నాస్వరూపవిశేషము లేవి గలవో, వానిని; తే=నీకొఱకు, ప్రాధాన్యతః కథయిష్యామి—ఏయే నావిభూతిభేదములయందు తేజశ్శక్తిబలపౌరుషవిద్యామహత్త్వ గుణవిశేషములచే నేయేవిభూతి ప్రధానమో—శ్రేష్ఠమో ఆయావిభూతిని మూఢులకుఁ బ్రీత్యుత్సాహ శ్రద్ధాభక్తులు గలుగుటకై చెప్పెద నని యర్థము. ఓయీ! ప్రధానములును అప్రధానములు నగు సర్వవిభూతులను జెప్పుము, అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—మే=నాయొక్క; మాయయొక్క అపరిమితశక్తిచే విజృంభితములయిన విభూతుల యొక్క; విస్తరస్య=బహుత్వమునకు; అన్తః; నాస్తి. గంగానదియిసుకను సముద్రమునందలి జలబిందువులను నక్షత్రములను లెక్కింపవచ్చుఁ గాని నాదు విభూతివిస్తరమును లెక్కింప శక్యము గా దని యర్థము.

మ. అందు కుత్తరము శ్రీభగవంతుఁ డిట్లనియె.—హన్త—దీని కనుమతి యర్థము, నీవు దేనిఁ బ్రార్థించితివో దానిఁ జేసెదను, వ్యాకులుఁడవు కావల దని యర్జును నాశ్వాసించి దానినే చేయ నారంభించుచున్నాఁడు.—ప్రాధాన్యతః; కథయిష్యామి; ఆవిభూతులను. ఏవి, దివ్యాః; హి=ప్రసిద్ధములయిన; ఆత్మవిభూతయః= నాయొక్క యసాధారణము లయిన విభూతులు గలవో వానిని. ఓకురుశ్రేష్ఠుఁడా! విస్తరించి చెప్పుట యశక్యము. ఎందువలన ననఁగా, మే=నాయొక్క విభూతులకు; అన్తః నాస్తి. అందువలన ప్రధానభూతములయిన విభూతులను గొన్నిటిని మాత్రమే చెప్పెద నని యర్థము.

శ్రీ॰ ఇట్లు ప్రార్థింపఁబడినవాఁడై శ్రీభగవంతుఁ డిట్లనియె —హన్త— దీనికి దయతోడిసంబోధన మర్థము. దివ్యములయిన నావిభూతు లేవిగలవో వానిని ప్రాధాన్యమున నీకుఁ జెప్పెదను. ఎందువలన ననఁగా, నాయవాంతర విభూతుల విస్తరమునకు అంతము లేదు, కావునఁ బ్రధానములయినవానిఁ గొన్నిటిని ప్రతిపాదించెదను.

[illegible] శ్రీభగవంతుఁడు చెప్ప నారంభించుచున్నాఁడు —హన్త— దీనికి [illegible] తే [illegible]కు; ఆత్మవిభూతయః; ప్రాధాన్యతః=ముఖ్యము లైన వానిని; కథయిష్యామి. హి—ఎందువలన ననఁగా. ఓకురుశ్రేష్ఠుఁడా! మే; విస్తరస్య; అన్తః; నాస్తి.

రా॰ ఓకురుశ్రేష్ఠా! ఆత్మనః=నాయొక్క; శుభాః=కల్యాణములయిన; ♦ విభూతయః = విభూతులను; ప్రాధాన్యతః; తే; కథయిష్యామి. ప్రాధాన్యశబ్దముచే నుత్క[illegible]క్షి పఁబడిన "పురోధసాంచ ముఖ్యం మామ్" అని గదా చెప్పఁబోవుచున్నాఁడు జగమునందు ఉత్కృష్టము లయిన కొన్ని విభూతులఁ జెప్పెదను. విస్తరించి చెప్పుటకును వినుటకును శక్యము కాదు, అవి యనంతము లగుట వలన. విభూతి యనఁగా నియామ్యము, సర్వభూతంబులకు బుద్ధ్యాదు లగు పృథగ్విధములయిన భావములు నావలనే కలుగుచున్న వని పలికి "ఏతాం విభూతిం యోగంచ మమ యో వేత్తి తత్త్వతః" అని ప్రతిపాదించుటవలన. అట్లు యోగ శబ్దనిర్దిష్టము స్రష్టృత్వాదిక మని విభూతిశబ్దనిర్దిష్టము తన్నియామ్యత్వ మని గదా చెప్పఁబడినది, వెండియు "అహం సర్వస్య ప్రభవో మత్తస్సర్వం ప్రవర్తతే । ఇతి మత్వా భజన్తే మాం బుధాభావ సమన్వితాః" అనుటవలన.

మూ॰ *

అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః

అహ మాదిశ్చ మధ్యంచ భూతానా మన్త ఏవచ. ౨౦

భా॰ అందు మొదటనే యిప్పుడు వినుము.—గుడాకేశ = గుడాక యనఁగా నిద్ర, దానికి ఈశుఁడా! నిద్రను జయించినవాఁడా యని యర్థము. సర్వభూతాశయస్థితః=సర్వభూతములయొక్కయు ఆశయము నందు—అంతర్హృదయమునందు న్నట్టి; ఆత్మా=ప్రత్యగాత్మ; అహమ్=నేను.

* దీనికిని మీఁదిశ్లోకములకును మాధ్వభాష్యము లేదు.

♦ "కథయిష్యామి విభూతీ రాత్మనశ్శుభాః" అని వీరరాఘవీయమున పాఠము.

అని నిత్యమును ధ్యానింపవలయును. అందశక్తుఁ డగువాఁడు చెప్పఁ బోవుభావములందు నన్ను ధ్యానింపవచ్చును. ఎందువలన ననఁగా. అహమ్=నేనే; భూతానామ్=భూతములకు; ఆదిశ్చ=కారణమును. అట్లు, మధ్యంచ=స్థితిని. అన్తఏవచ=ప్రలయమును గూడ.

నిద్రను జయించినట్టి యర్జునుఁడా! సర్వభూతంబుల హృదయంబున నుండు ప్రత్యగాత్మ నేనే యని ధ్యానింపవలయును, అట్లు ధ్యానింపనశక్తుఁ డగువాఁడు మీఁదఁ జెప్పంబోవుభావంబుల నన్ను ధ్యానింపవచ్చును, సర్వభూతంబులకును ఆదియు మధ్యంబును అంతంబును నేనే గదా యని తాత్పర్యము.

టీ. విభూతిప్రదర్శనము ప్రస్తుతమయి యుండఁగా మొదటనే పరమేశ్వరుని పారమార్థికరూపముఁ బ్రదర్శించుటకై శ్రోతయగు నర్జునుని మనస్సు నెచ్చరికఁజేయఁ బ్రయత్నించుచున్నారు అందు ఇత్యాదిగా. కాల్పనికం బగు సోపాధికరూపమును గూడ వెనుకఁ జెప్పఁబోవుదానిని వినుటకును జిత్తసమాధానము చేయవలసినదే యని చెప్పుచున్నారు ఇప్పుడు అని. దీనియందు విద్యాకర్మపూర్వప్రజ్ఞలు ఆశేరతే-శయనించియున్నది యని ఆశయ మనఁగా హృదయము, సర్వభూతములయు హృదయంబు లోపలనున్న ప్రత్యగాత్మ యెవ్వఁడు గలఁడో అతఁడు నేనే యని వాక్యార్థముఁ జెప్పుచున్నారు సర్వేత్యాదిగా. ఎవ్వఁడు మందుఁడుగాని మధ్యముఁడుగాని పరమాత్మను బ్రత్యగాత్మనుగా ధ్యానింప శక్తుఁడుగాఁడో వానిగూర్చి చెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. చెప్పఁబోవునట్టి యాదిత్యాదులయందుఁ బరమాత్మ ధ్యేయుఁడు గాఁడు, అచ్చటచ్చట నేదో యితం మే కారణము ధ్యేయం బని యాశంకించి చెప్పుచున్నారు ఎందువలన ననఁగా ఇత్యాదిగా. సర్వకారణత్వంబును సర్వజ్ఞత్వంబును సర్వేశ్వరత్వంబును బరమాత్మయే ధ్యేయుం డనుట యిట వివక్షితము, ఇతర కారణ మేదియు నాదిత్యాదులయందు ధ్యేయము గా దని యర్థము.

హ. గుడాకేశ=గుడములు-చుట్టఁబడిన నగు వెండ్రుకలుగలవాఁడా! సర్వభూతాశయః=సర్వభూతములును ఆశయము-స్థానముగాఁ గలవాఁడై; స్థితః=ఉన్నట్టి; ఆత్మ నేను ♦.

శ౦. ముముక్షువులకుఁ జిత్తశుద్ధికై యుపాస్యంబు లగు విభూతివిశేషంబులఁ జెప్పెద నని యారంభించుటచే, ముఖ్యాధికారులకుఁ గూడ ఏతదుపాసనమే కర్తవ్య

♦ పీఠిపక్షమునందు సర్వభూతాశయః స్థితః అని పాఠము.

మని ప్రార్థింపఁగా, వారలకు నిర్విశేషరూపమే యుపాస్యము కాని సవిశేషము కాదని తెలుపుటకై మొదట బ్రహ్మాదుల కుపాస్య మయినవస్తువు నుపదేశించుచున్నాఁడు.—గుడాకేశ=గుడాక యనఁగా నిద్ర, దాని కీశుఁడు, నిద్రను వశీకరించినవాఁ డని యర్థము, ఓగుడాకేశుఁడా! సర్వభూతాశయస్థితః=బ్రహ్మాది స్తంబపర్యంతులగు సర్వప్రాణుల యాశయమునందు ఆ—అంతటను శేతే—పరుండియున్నవాఁడు పోలె నిశ్చలుఁడై యాత్మ యున్నాఁడు దేనియందో అట్టి బుద్ధిగుహ ఆశయము, దానియందు, స్వరూపత్వంబునను సర్వప్రకాశత్వంబునను సాక్షిత్వంబునను ఉన్నవాఁడు సర్వభూతాశయస్థితుఁడు, సర్వభూతాధివాసుఁడు కూటస్థాసంగచిద్రూపుఁడగు; ఆత్మా = ప్రత్యగాత్మ, అహమ్=నేను, బ్రహ్మాదుల కుపాస్యుఁడ నని యర్థము, "అన్తశ్శరీరే జ్యోతిర్మయోహి శుభ్రో యం పశ్యన్తి యతయః క్షీణదోషాః" ♦ ఇత్యాది శ్రుతివలన. ఇట్లు ముఖ్యాధికారుల కుపాస్యమును నిరూపించి మధ్యమాధికారుల కుపాస్య మగు దానిఁ జెప్పుచున్నాఁడు.—భూతానామ్=ఆకాశాదులయొక్క; ఆదిశ్చ=ఉపాదానము అవ్యక్తము, తద్రూపుఁడను; భూతములయొక్క, మధ్యంచ=స్థితి, వ్యక్తస్వరూపుఁడను; భూతములయొక్క, అన్తఏవచ=ప్రలయరూపుఁడను; అట్టి, అహమ్=నేను; ఉపాస్యుఁడను. ప్రపంచకారణరూపంబునను ప్రపంచరూపంబునను ప్రపంచప్రలయరూపంబునను ఉన్నట్టి నేను—సగుణపరమాత్మను మధ్యముల కుపాస్యుఁడ నని యర్థము.

౨౦. అందు మొదట ముఖ్యమయినధ్యేయమును వినుము.—సర్వభూతాశయస్థితః=సర్వభూతంబులయు నాశయమునందు—హృదయదేశమునందు అంతర్యామిరూపంబునను ప్రత్యగాత్మరూపంబునను ఉన్నట్టి; ఆత్మా = చైతన్యానందఘనుఁడు; అహమ్=నేనే వాసుదేవుఁడనే యని, నీవు నన్ను ధ్యానింపవలయును. గుడాకేశ—నిద్రను జయించినవాఁడా యని సంబోధనము ధ్యానసామర్థ్యమును సూచించుచున్నది. అట్లు ధ్యానింప సామర్థ్యము లేనియెడఁ జెప్పఁబోవునట్టి ధ్యానములు చేయవలయును. అందును మొదట ధ్యేయముఁ జెప్పుచున్నాఁడు.—అహమ్=నేనే. భూతానామ్=ప్రాణులకు, చేతనులని లోకంబున వ్యవహరింపఁబడు వారలకు; ఆదిశ్చ=ఉత్పత్తిని. మధ్యంచ=స్థితిని. అన్తఏవచ = నాశంబును. సర్వచేతనవర్గంబులకును ఉత్పత్తిస్థితినాశంబునను తత్కారణరూపంబునను నేనే ధ్యేయుఁడ నని యర్థము.

---

♦ శరీరములో జ్యోతిర్మయుఁడై శుభ్రుఁడై యున్నాఁడు గదా! ఎవ్వని శుద్ధచిత్తులగుయతులు చూతురో.

శ్రీ. అందు మొదట ఐశ్వర్యం బగు రూపమును జెప్పుచున్నాఁడు.—ఓ గుడాకేశుఁడా! సర్వభూతంబులయు నాశయములయందు—అంతఃకరణములయందు సర్వజ్ఞత్వాదిగుణములతో నియంతగా నున్న పరమాత్మ నేను. ఆదిః = జన్మము. మధ్యమ్=స్థితి. అన్తః=సంహారము. సర్వభూతంబులకును జన్మాదిహేతువు కూడ నేనే యని యర్థము.

ప. ఇఁక విభూతుల నిరూపించుచు మొదట తనమూలభూతస్వరూపముఁ జెప్పుచున్నాఁడు సపాదశ్లోకముచేత.—గుడాకేశ—నిద్రను జయించినవాఁడా! అహమ్=నేను; ఆత్మా=అతతి—వ్యాపించువాఁడు అనువ్యుత్పత్తిచే హిరణ్యగర్భుఁడను. ఎట్టి హిరణ్యగర్భుఁడను? సర్వభూతాశయస్థితః = సర్వంబులగు మహాభూతంబులు వీనియం దున్నవి గావున సర్వభూతుఁ డనఁగా విరాట్టు, వానియందు ఆశయత్వంబున—లింగరూపంబున నున్న వాఁడను. “అజస్య నాభా వధ్యేక మర్పితమ్” ఇత్యాది శ్రుతులు పూర్వము నిరూపింపఁబడియే యున్నవి. ఇఁక దానినే చెప్పుచున్నాఁడు.—అహమ్=నేనే; భూతానామ్; ఆదిశ్చ; మధ్యంచ; అన్తఏవచ—నాయందే భూతంబులకు జన్మస్థితిలయములు జలమునందుఁ దరంగములకుం బోలెఁ గలుగుచున్నవి.

రా. అట్లు సర్వభూతంబులకును బ్రవర్తనరూపమయిన నియమనమును ఆత్మనై యుండి చేయుచున్నా ననునీయర్థము యోగశబ్దముచేఁ జెప్పఁబడినది, అది సర్వస్రష్టృత్వమును పాలయితృత్వమును సంహర్తృత్వము నని సుస్పష్టముగాఁ జెప్పుచున్నాఁడు.—నాకు శరీరభూతమయిన సర్వభూతములయు ఆశయమునందు—హృదయమునందు నేను ఆత్మనై యున్నవాఁడను, ఆత్మగదా శరీరమునకు సర్వవిధంబున నాధారమును నియంతయు శేషియు నగుచున్నాఁడు. అట్లు చెప్పఁబోవుచున్నాఁడు.—“సర్వస్య చాహం హృది సన్నివిష్టో మత్తస్స్మృతి ర్జ్ఞాన మపోహనంచ, ఈశ్వర స్సర్వభూతానాం హృద్దేశే ఽర్జున తిష్ఠతి। భ్రామయన్ సర్వ భూతాని యన్త్రారూఢాని మాయయా” అని. శ్రుతియును.—“య స్సర్వేషు భూతేషు తిష్ఠన్ సర్వేభ్యో భూతేభ్యో ఽన్తరో యం సర్వాని భూతాని నవిదుః యస్య సర్వాణి భూతాని శరీరం య స్సర్వాణి భూతాన్యన్తరో యమయతి ఏషత ఆత్మా ఽన్తర్యా మ్యమృతః” అనియు, “య ఆత్మని తిష్ఠ న్నాత్మనో ఽన్తరో య మాత్మా నవేద యస్యాత్మా శరీరం య ఆత్మాన మన్తరో యమయతి సతఆత్మా ఽన్తర్యా మ్యమృతః” అని

యును. ఇట్లు సర్వభూతంబులకును ఆత్మనై యున్న నేను వానికి ఆదియును మధ్యమును అంతమును. ఆభూతముల కుత్పత్తిస్థితిప్రలయహేతు వని యర్థము.

ఆదిత్యానా మహం విష్ణు ర్జ్యోతిషాం రవి రంశుమాన్
మరీచి ర్మరుతా మస్మి నక్షత్రాణా మహం శశీ. ౨౧

భా. ఇట్లును నన్ను ధ్యానింపవచ్చును — ఆదిత్యానామ్=ద్వాదశాదిత్యులలో; విష్ణుః=విష్ణువను నాదిత్యుఁడు; అహమ్=నేను. జ్యోతిషామ్=ప్రకాశము కలిగించువానిలో, అంశుమాన్=కిరణములుగల; రవిః=సూర్యుఁడు; నేను. మరుతామ్=మరుత్తులను దేవతావిశేషములలో; మరీచిః=మరీచి యనువాఁడు; అస్మి=అగుచున్నాను. నక్షత్రాణామ్=నక్షత్రములలో; శశీ=చంద్రుఁడు; అహమ్=నేను.

ద్వాదశాదిత్యులలో విష్ణు వను నాదిత్యుఁడు నేను, ప్రకాశవస్తువులలో సహస్రకరుం డగు సూర్యుఁడు నేను, మరుద్దేవతలలో మరీచి యనువాఁడు నేను, నక్షత్రములలోఁ జంద్రుఁడు నే నని తాత్పర్యము.

ఆ. చెప్పినధ్యానమునం దశక్తు లయినవారలకు వ్యస్త మగు విభూతియోగము నుపదేశించుచున్నారు ఇట్లును ఇత్యాదిగా. అచ్చటచ్చటఁ బ్రధానుం డగుటచేఁ బరమాత్మ ధ్యేయుఁడు. ఇట్లు అనుదాని యర్థమునే చూపుచున్నారు ఆదిత్యానా మిత్యాదిగా.

హ. ద్వాదశాదిత్యులలో విష్ణువు నేను, తేజస్సులలో సూర్యుఁడును నేను, మరుద్దేవతలలో మరీచి నేను, నక్షత్రములలోఁ జంద్రుఁడు నేను. ఓయీ! నక్షత్రములలోఁ జంద్రునకు నిర్ధారణ ముపపన్నము కాదు, చంద్రుఁడు నక్షత్రము కామి వలన. అందువేని అట్లు కాదు, చంద్రుఁడును నక్షత్రమే. ఎట్లు? ఈలోకమునందుఁ బుణ్యముచేసి ఫలభోగార్థము ఆలోకమును నక్షన్తే—పొందుచున్నారు కావున నక్షత్రమనఁబడును. అట్లు శ్రుతి « యోవా ఇహ యజమానో ఽముం లోకం నక్షతే త న్నక్షత్రాణాం నక్షత్రత్వమ్ » అని.

శ౦. ఇట్లుత్తమమధ్యములకు నుపాస్యభేదమును నిరూపించి యిప్పు డధములకుపాసనార్థము తనవే యగు విభూతివిశేషములను నిరూపించుచున్నాఁడు.— ద్వాదశాదిత్యు లందఱును నావిభూతి యే యగును, నామరూపాదులచే విశేషము

కొఱకు అగుచున్నది కావున విభూతి యనఁబడును, ఆదిత్యానాం — ఆదిత్యులలో, విష్ణురహమ్ — విష్ణు వను నాదిత్యుఁడు ప్రభావాతిశయంబున నాయొక్క విభూతివిశేషము, అతఁడు పరమేశ్వరుఁడే యని మద్బుద్ధితో నుపాసింపవలయు నని యర్థము. జ్యోతిషాం — ప్రకాశము సందున్న జ్యోతులన్నియు నావిభూతియే, వానిలో, అంశుమాన్ రవిః — తేజోతిశయముచే సూర్యుఁడు నావిభూతివిశేషము, అతఁడు పరమేశ్వరుఁడే యని మద్బుద్ధితో నుపాస్యుఁ డని యర్థము. మరుత్తు లనువారు దేవతావిశేషములు, వారిలో, మరీచిరస్మి — మరీచి యనుదేవత నావిభూతివిశేషము, అతఁడు నేనే యని యుపాస్యుఁ డని యర్థము. అశ్విన్యాది నక్షత్రము లన్నియు నావిభూతియే, వానిలో, శశీ అహమ్ — శోభాతిశయముచే చంద్రుఁడు నావిభూతివిశేషము, అతని మద్బుద్ధితో నుపాసింపవలయు నని యర్థము. ఇట్లు అంతటను షష్ఠ్యంతవాచ్యములు విభూతులనియు, ప్రథమాంతవాచ్యములు తద్విశేషంబులనియు ఈశ్వరబుద్ధితో నుపాస్యంబులనియు నెఱుంగవలయును.

మ. దీని కర్తృత్వం డగువాఁడు బాహ్యాను లగుధ్యానములు చేయవలయు నని చెప్పుచున్నాఁడు అధ్యాయము కడవఱకు.— ఆదిత్యానామ్ = పండ్రెండు గురాదిత్యులలోపల; విష్ణుః=విష్ణు వను నాదిత్యుఁడు; లేక, వామనావతారము; అహమ్= నేను. జ్యోతిషామ్ = ప్రకాశములలోపల; అంశుమాన్ = ప్రపంచవ్యాపక మయిన ప్రకాశముగల; రవిః=సూర్యుఁడు నేను. మరుతామ్ = సప్తమరుత్తులలో; మరీచిః= మరీచి యనుమరుత్తు నేను. నక్షత్రాణామ్=నక్షత్రములలో, అధిపతియయిన; శశీ= చంద్రుఁడు నేను. నిర్ధారణమునందు షష్ఠి. ఇట ప్రాయికముగా నిర్ధారణమునందు షష్ఠి. ఒకానొకచో సంబంధమునందును, భూతానా మస్మి చేతనా ఇత్యాదికము నందు. వామనరామాద్యవతారములుగూడ సర్వైశ్వర్యశాలు లగుటచే తత్త్రద్రూపంబున ధ్యానము విధించుటకై విభూతులయందుఁ బఠింపఁబడుచున్నవి, వృష్ణీనాం వాసుదేవో౽స్మి యని తద్రూపంబున ధ్యానముఁ జెప్పుటకై తన్నుఁ గూడ విభూతులలోఁ బఠించినట్లు. ఇటమీఁదఁ బ్రాయికముగా నధ్యాయము స్పష్టార్థ మగుటచే నొకానొకచో నించుక వ్యాఖ్యానము చేసెదము.

శ్రీ. ఇప్పుడు విభూతులను జెప్పుచున్నాఁడు అధ్యాయసమాప్తివఱకు — ఆదిత్యానామ్=ద్వాదశాదిత్యులలోపల; విష్ణుః=వామనుఁడు; అహమ్=నేను. జ్యోతిషామ్=ప్రకాశకంబులలోపల; అంశుమాన్=విశ్వవ్యాపకములయిన కిరణములుగల; రవిః=సూర్యుఁడు; నేను. మరుతామ్=మరుత్తు లను దేవవిశేషములలోపల; మరీచిః=

మరీచి యనువాఁడు; నేను. లేక, సప్తవాయువులలోపల మరీచి యనువాయువు నేను. నక్షత్రములలోఁ జంద్రుఁడు నేను. ఇట ఆదిత్యానా మహం విష్ణు రిత్యాది స్థలములను [illegible] ప్రాయికముగా నిర్ధారణమునందు షష్ఠి. ఒకానొకచో భూతానా మస్మి చేతనా ఇత్యాదిస్థలములయందు సంబంధమునందు షష్ఠి. అవిశేషము నచ్చ టచ్చటఁ బ్రదర్శించెదము. విష్ణు రిత్యాదికము అవతారములయందును ప్రభావాతి శయము వివక్షించి విభూతిగా నిర్దేశింపఁబడినది. ఇటమీఁద నధ్యాయార్థము స్పష్ట మయినను ఒక్కొకచో నించుక వ్యాఖ్యానము చేయఁబడును.

ప. ఆదిత్యానామ్ = దేవతలలోపల, "ఆదిత్యా ఋభవో ఽన్వపాన్నః" అని యజురుక్తి చెప్పుటవలన; విష్ణుః=వ్యాపనశీలుఁడు నేను. సమష్టిరూపుఁడ నగు వాఁడే. [illegible] వ్యవహారము నొందుచున్నా రని యర్థము. లేక. సర్వా కులయందు త్యశబ్దము అమూర్తవాచకము శ్రుతిసిద్ధము, కావున, సర్వంబులకును అధిభూతము లయినత్యములు—అమూర్తము లగు మహదాదులు, అట్టి యాదిత్యముల లో; విష్ణుః = వైకుంఠవాసి యగువిష్ణువు; అహమ్=నేనే, యని తనసగుణ మగు రూపాంతరము ప్రదర్శింపఁబడినది. శ్రుతియును.—"అహం రుద్రేభి ర్వసుభి శ్చరా మ్యహ మాదిత్యై రుత విశ్వదేవైః । అహం మిత్రా వరుణో భా బిభర్మ్యహ మగ్ని మహ మశ్వినోభా" అని భాష్యము.—అహ మిత్యాది యేకఋచ మగు సూక్తము. అంభృణుఁ డనుమహర్షి కూఁతురు వాక్కనునది బ్రహ్మవిదుషి స్వాత్మను స్తుతించెను. ఆయమ దీనికి ఋషి. సచ్చిత్సుఖాత్మకుఁడు సర్వగతుఁ డగుపరమాత్మ దేవత. ఈ పరమాత్మతోఁ గదా యామె తాదాత్మ్యము ననుభవించుచు సర్వంబున కధిష్ఠాన మునుగా స్వాత్మను స్తుతించుచున్నది. అందు మొదటిది అహం రుద్రేభిః అనునది. అహమ్=బ్రహ్మరూపురాల నగు నేను; రుద్రేభిః=ఏకాదశరుద్రులచే; చరామి=చరించు చున్నాను. ఇత్థం భూతార్థమునఁ దృతీయ, తద్రూపంబునఁ జరించుచున్నా నని యర్థము. అట్లు, ఆదిత్యైః=ద్వాదశాదిత్యరూపమునను; ఉత=మఱియు, విశ్వదేవైః= విశ్వదేవరూపంబునను; చరించుచున్నాను. అంతర్యామిత్వంబునను జరించుచున్నా నని చెప్పుచు [illegible] అహమ్=నేను; మిత్రావరుణా = మిత్రుని వరుణుని, ద్వివచనము నకు ఆ [illegible] నుటచే ద్వితీయకు ఆకారము, వరిభాషలయందును.—"పుం స్యాకారో ద్వివచనే క్లీబే భూమ్ని యథా ద్వా విత్యత్ర ద్వా విశ్వా నీత్యత్ర విశ్వా" ♦.

♦ పుంలింగంబున ద్వివచనమునం దాకారము, నపుంసకలింగంబున బహువచనమునం దాకా రము—ద్వౌ అను దానికి ద్వా అనియు, విశ్వాని అను దానికి విశ్వా అనియు వచ్చును.

" యో ఽసావాదిత్యే పురుషస్సో ఽసావహమ్ " * అను శ్రుతివలన; ఉభౌ = ఇద్దఱను; బిభర్మి=భరించుచున్నాను. అహమ్=నేను; అశ్వినౌ=అశ్విదేవతలను; ఉభౌ=ఇద్దఱను; భరించుచున్నాను. ఇఁక విభూతులను వర్ణించుచుఁ బ్రత్యక్షదేవతారూపిణి యగు విభూతిని బ్రదర్శించుచున్నాఁడు.—జ్యోతిషామ్=అగ్న్యాదులగు తైజసపదార్థములలోపల; అంశుమాన్ = స్వకిరణప్రసారముచే ముల్లోకములను బ్రకాశింపఁజేయునట్టి; రవిః=సూర్యుఁడు; నేను. మరుతామ్=దేవసైన్యులగు మరుద్గణములలోపల; మరీచి నేను. అట్లు, నక్షత్రాణామ్=నక్షత్రములలోపల; శశీ=చంద్రుఁడు నేను.

రా. ఇట్లు భగవంతుఁడు స్వవిభూతిభూతము లయిన సర్వంబులయందును ఆత్మయై యుండుటను అతని తచ్ఛబ్ద సామానాధికరణ్యంబున నిర్దేశించుటకు హేతువును బ్రతిపాదించి విభూతివిశేషంబులను సామానాధికరణ్యంబున నిర్దేశించుచున్నాఁడు. భగవంతుఁ డాత్మయై యుండుటవలన సర్వశబ్దంబులును అతనియందే గదా పర్యవసించుచున్నవి. ఎట్లు, దేవత మనుష్యుఁడు పక్షి వృక్షము ఇత్యాదిశబ్దములు శరీరవాచకములై తత్తదాత్మయందుఁ బర్యవసించుచున్నవో, అట్లు. భగవంతుఁడు తత్తదాత్మయై యుండుటయే తచ్ఛబ్ద సామానాధికరణ్యహేతు వని విభూత్యుపసంహారమునఁ జెప్పఁబోవుచున్నాఁడు, " న తదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరాఽచరమ్ " అని సర్వంబులకుఁ దనతో అవినాభావముఁ జెప్పుటవలన. అవినాభావంబును నియామ్యతచే నని మత్తస్సర్వం ప్రవర్తతే అని యుపక్రమమునఁ జెప్పఁబడినది.—ద్వాదశసంఖ్యులగు నాదిత్యులలో పంద్రెండవవాఁడు ఉత్కృష్టుండు విష్ణు వనునాదిత్యుఁ డెవ్వఁడు గలఁడో అతఁడు నేను. జ్యోతిషామ్ = లోకంబునఁ బ్రకాశము గలిగించువానిలో, అంశుమాన్; రవిః=ఆదిత్యగణ మేదిగలదో, అది నేను. మరుతామ్=మరుత్తులలో; మరీచిః=ఉత్కృష్టుఁ డగు మరీచియనువాఁ డెవ్వఁడు గలఁడో, అతఁడు నేను. నక్షత్రాణా మహం శశీ—ఇది నిర్ధారణషష్ఠి కాదు, భూతానామస్మి చేతనా అనునట్లు, నక్షత్రముల యధిపతియగు చంద్రుఁ డెవ్వఁడు గలఁడో అతఁడు నేను.

మా. విష్ణుః, సర్వమును వ్యాపించినవాఁడును బ్రవేశించినవాఁడు నగుటవలన. " విషు వ్యాప్తౌ, విశ ప్రవేశనే " అని ధాతుపాఠము. " గతిశ్చ సర్వభూతానాం ప్రజానాం చాఽపి భారత ! వ్యాప్తా మే రోదసీ పార్థ కాన్తిశ్చా భ్యధి

* ఆదిత్యునియందు పురుషుఁ డున్నాఁడో అతఁడు నేను.

కామను॥ అధిభూతే నివిష్టశ్చ తదిచ్ఛ శ్చాస్మి భారత । క్రమణా చ్చాప్యహం పార్థ విష్ణు రిత్యభి సంజ్ఞితః" ♦ అని మోక్షధర్మమునందు.

వేదానాం సామవేదో ఽస్మి దేవానా మస్మి వాసవః
ఇన్ద్రియాణాం మనశ్చాస్మి భూతానా మస్మి చేతనా. ౨౨

శా. వేదానామ్=వేదములలో; సామవేదః=సామవేదము; అస్మి=నే నగుచున్నాను. దేవానామ్=రుద్రాదిత్యులు మొదలగు దేవతలలో; వాసవః=ఇంద్రుండును; అస్మి=అగుచున్నాను. ఇన్ద్రియాణామ్=చక్షురాదులగు పదునొకం డింద్రియములలో; మనశ్చ = సంకల్ప వికల్పాత్మక మయిన మనస్సు; అస్మి=అగుచున్నాను. భూతానామ్=ప్రాణులయొక్క; చేతనా= కార్యకరణ సంఘాతమునందు నిత్యాభివ్యక్త మయిన బుద్ధివృత్తి చేతన యనంబడును, అది; అస్మి అగుచున్నాను.

వేదములలో సామవేదము నేను, దేవతలలో నింద్రుండు నేను, ఇంద్రియములలో మనస్సు నేను, ప్రాణులచైతన్యము నే నని తాత్పర్యము.

ఆ. మంత్రబ్రాహ్మణ సముదాయాత్మకము లగు ఋగాదివేదములలో సామవేదము నే నని ధ్యానాంతర ముపదేశించుచున్నారు వేదానా మిత్యాదిగా. జీవాధిష్ఠిత మయిన సంఘాతమునందు వ్యక్తిఁ బొందువఱకు సర్వత్ర వ్యాపకమగు చైతన్యాభివ్యంజక మయిన బుద్ధివృత్తి యని యర్థము.

హ. భూతానామ్ = కార్యకరణ సంఘాతముల సంబంధి యగు; చేతన; నేను.

శ్రీ౦. భవన్తి—పుట్టుచున్నవి కావున భూతములనఁగా జీవాధిష్ఠితము లగు శరీరములు, వానిలోపల; చేతనా=బుద్ధ్యాది స్థూలాంతమును సర్వమును, చేతయతి= ఎఱుంగుచున్నది, కావున చేతన యనఁగా ఆభాససహిత మయిన బుద్ధివృత్తి. అది నే నని యర్థము.

మ. వేదానామ్=నాలుగు వేదములలోపల; సామవేదః=గానమాధుర్యముచే మిక్కిలి రమణీయ మగు సామవేదము; నేను. సర్వదేవాధిపతి యగు, వాసవః=ఇం

పార్థా! నేను సర్వభూతములకును బ్రజలకును గతిని, భూమ్యాకాశంబులు నాచే వ్యాపింపఁ బడినవి, నా కాంతి యధికము, అధిభూతమును బ్రవేశించిన వాఁడను, దానిఁ గోరువాఁడును గూడ, క్రమణము—త్రివిక్రమరూపంబునఁ బాదవిక్షేపము చేయుటవలనఁ గూడ విష్ణు వని పేరు పొందితిని.

ద్రుడు; నేను. ఇన్ద్రియాణామ్ = పదునొకం డింద్రియములలో; ప్రవర్తకమయిన; మనః=మనస్సు నేను. భూతానామ్ = సర్వప్రాణిసంబంధు లగు పరిణామములలో. చేతనా=చిదభివ్యక్త మయిన బుద్ధివృత్తి; నేను.

శ్రీ. వాసవః=ఇంద్రుడు. భూతముల సంబంధి యయిన, చేతనా = జ్ఞానశక్తి; నేను.

ప. ఋగాదు లగు నాలుగు వేదములలో సామవేదము నేను. సామాత్మకమయిన వేదము సామవేదము. సాచ అమశ్చ అని విగ్రహము. సా అనగా ఋక్కు, అమము—గీతరూప మయినస్వరము, ఆరెంటి మిథునము సామము. అట్లు బ్రాహ్మణము.—“ సైవ నామ ఋగాసీ దమోనామ సామ సావా ఋక్సామో పావద న్మిథునం సంభవావ ప్రజాత్యా ఇతి నేత్య బ్రవీత్సాను జ్యాయాన్వా అతో మమ మహిమా” అని. భాష్యము —సా అమః అని రెండుపదార్థములు, అందు సా అని తచ్ఛబ్దముచే ఋక్కు చెప్పబడుచున్నది, అమ అనగా గీతిరూప మయినస్వరము. అట్లు కణ్వశాఖయును.—“ తస్యహైతస్య సామ్నో యస్స్వంవేద భవతి హాస్యస్వం తస్యవై స్వరఏవస్వమ్ ” అని. సా=ఋక్కు; సామ=సామమును; ఉప = సమీపము నొంది; అవదత్=పలికెను. ఏమని? మనము, ప్రజాత్యై=సంతతికొఱకు; మిథునమ్=దాంపత్యమును; సంభవావ=పొందుదమని. అంత సామము, నేత్యబ్రవీత్ నిషేధించెను. ఎందువలన ననగా. సామ=సామము; జ్యాయాన్వై = అధికుండగుదునుగదా! అతః=దీనికంటెను; మమ మహిమా = నాసామర్థ్యము అధికము; ఒక్కఋక్కు ఏమి సేయఁగలదు? అని. ఇట్లు ఋగాదులకంటె సామము ఉజ్జీవ్య మగుటవలన నధికమని చెప్పబడినది. లేక. సామసంబంధు లగు ఋక్కు లెవిగలవో అవియన్నియు ఈశ్వరస్తావకంబు లగుటచే పావమాను లగుచున్నవి. కావున నవి పఠనమాత్రంబున పాపనాశకము లగును, “ తత్పావమానీభి రహంపునామి” అనువాక్యమువలన; అందుచే గూడ సామవేదమునకు విభూతిత్వము. అట్లు, దేవతలలోపల వాసవుఁడు—ఇంద్రుఁడు నేను. అట్లు ఇంద్రియములలో పదునొకటిలో మనస్సు నేను. భూతసంబంధియగు చేతన—జ్ఞానశక్తి నేను.

రా. వేదానామ్=ఋగ్యజుస్సామాథర్వములలో; సామవేదః = ఉత్కృష్టమగు సామవేద మేదిగలదో అది; నేను. దేవతలలో నింద్రుఁడు నేను. పదునొకండింద్రియములలో నుత్కృష్ట మగుమన స్సేదిగలదో అది నేను. ఇదియు నిర్ధారణ షష్ఠి కాదు—భూతానామ్=చేతనావంతులయొక్క; చేతన యేదిగలదో అది నేను.

మూ. ♮

రుద్రాణాం శఙ్కరశ్చాఽస్మి విత్తేశో యక్షరక్షసామ్
వసూనాం పావకశ్చాఽస్మి మేరుః శిఖరిణామహమ్. ౨౩

భా. రుద్రాణామ్=ఏకాదశరుద్రులలో; శఙ్కరశ్చ=శంకరుఁడు; అస్మి=అగుచున్నాను. యక్షరక్షసామ్ = యక్షులలోను రాక్షసులలోను; విత్తేశః=కుబేరుఁడు; అగుచున్నాను. వసూనామ్=అష్టవసులలో; పావకశ్చ=అగ్ని; అస్మి=అగుచున్నాను. శిఖరిణామ్=పర్వతములలో; మేరుః=మేరుపర్వతము; అహమ్=నేను.

ఏకాదశరుద్రులలో శంకరుఁడు నేను, యక్షరాక్షసులలోఁ గుబేరుఁడు నేను, అష్టవసువులలో నగ్ని నేను, పర్వతములలో మేరుపర్వతము నే నని తా.

ఆ. ♦

హ. *

శం. రుద్రాణామ్=ఏకాదశరుద్రులలోపల; శఙ్కరః=శంకరుఁ డనుపేరుగల రుద్రుఁ డెవ్వఁడుగలఁడో అతఁడు; నేను. విత్తేశః=కుబేరుఁడు. వసూనామ్ = వసువులలో; పావకః=అగ్ని నేను. శిఖరిణామ్=శిఖరములుగలవానిలోపల, మిక్కిలి యున్నతములయినవానిలోపల; మేరుః=మేరుపర్వతము నేను.

మ. ♦♦

శ్రీ. యక్షరక్షసామ్ = రాక్షసులును క్రూరత్వాదులచే సమానులగుటచే యక్షులతోఁ గలపి నిర్దేశింపఁబడిరి, వారిలోపల; విత్తేశః=కుబేరుఁడు నేను. పావకః=అగ్ని. శిఖరిణామ్=శిఖరములుగలిగి యున్నతములైనవానిలోపల; మేరువు నేను.

వ. యక్షరక్షసామ్—అతిక్రూరు లయిన యక్షరాక్షసులలో; విత్తేశః=కుబేరుఁడు నేను §.

---

♮ ౨౨, ౨౩, ౨౪, ౨౫, శ్లోకములకు మాధ్వభాష్యము లేదు.

♦ దీని కానన్దగిరీయము లేదు.

* శంకరభాష్యముతో సమానము.

♦♦ శంకరానందీయ భాష్యములతో సమానము.

§ తక్కినది శంకరభాష్యముతో సమానము.

రా. రుద్రాణామ్=ఏకాదశరుద్రులలోపల; శంకరుఁడు నేను. యక్షరాక్షసులలో కుబేరుఁడు నేను. అష్టవసువులలోఁ బావకుఁడు నేను. శిఖరిణామ్ = శిఖరములచే నొప్పునట్టి పర్వతములలో; మేరుపర్వతము నేను.

పురోధసాంచ ముఖ్యం మాం విద్ధి పార్థ బృహస్పతిమ్
సేనానీనామహం స్కన్దస్సరసామస్మి సాగరః. ౨౪

భా. పార్థ=అర్జునా! పురోధసాంచ=రాజపురోహితులలో; ముఖ్యమ్=ప్రధానుఁడైన; బృహస్పతిమ్=బృహస్పతిని; మామ్ = నన్నుఁగా; విద్ధి=ఎఱుంగుము. అతఁడుగదా యింద్రునిపురోహితుఁ డగుటచే ముఖ్యుఁ డగుపురోహితుఁ డగును. సేనానీనామ్ = సేనాపతులలో; స్కన్దః=దేవసేనాపతి; అహమ్=నేను. సరసామ్=ఏవి దేవఖాతము ♦ లగు సరస్సులు గలవో వానిలో; సాగరః=సముద్రుఁడు; అస్మి=అగుచున్నాను.

అర్జునా! పురోహితులలో ముఖ్యుఁడైనబృహస్పతి నేనని యెఱుంగుము, సేనాపతులలో దేవసేనాపతి యగు కుమారస్వామి నేను, సరస్సులో సముద్రుఁడు నేనని తాత్పర్యము.

ఆ. పురోహితులయందు బృహస్పతి ముఖ్యుఁ డనుటకు హేతువుఁ జెప్పుచున్నారు అతఁడుగదా ఇత్యాదిగా.

హ. బృహస్పతిమ్=సురగురువును.

శం. సరసామ్ = సరస్సు లనఁగా పుణ్యతీర్థములు, వానిలో; సముద్రుఁడు నేను.

మ. ఇంద్రుఁడు సర్వరాజులలోను శ్రేష్ఠుఁ డగుటవలనఁ దత్పురోహితుఁడైన, బృహస్పతిమ్=బృహస్పతిని; పురోధసామ్=ఎల్లరాజపురోహితులలోను; ముఖ్యమ్=శ్రేష్ఠుఁడైనవానిని; మామ్=నన్నుఁగా నే; ఓపార్థా! విద్ధి=ఎఱుంగుము. సేనానీనామ్=సేనాపతులలోపల; దేవసేనాపతి యగు, స్కన్దః=కుమారుఁడు; నేను. సరసామ్=దేవఖాతజలాశయములలోపల; సాగరః = సగరపుత్త్రులచేఁ ద్రవ్వఁబడినజలాశయము; నేను.

♦ దేవతలచేఁ ద్రవ్వఁబడినవి.

శ్రీ. పురోహితులలోపల, దేవపురోహితుం డగుటవలన, ముఖ్యమ్; బృహస్పతిమ్; మాం; విద్ధి. సేనానీనామ్=సేనాపతులలోపల; దేవసేనాపతి యగు, స్కన్దః అహమ్. సరసామ్=స్థిరము లయినజలాశయములలోఁ; సముద్రుండు నేను.

ప. పురోధసామ్ = దేవపురోహితులలోపల; ముఖ్యమ్; బృహస్పతిమ్; మామ్; విద్ధి. సేనానీనామ్=దేవసేనాపతులలోఁ; స్కన్దో ఽహమ్. అస్మి, సరసామ్= జలాశయములలోఁ; సాగరము నేను.

రా. పురోహితులలో నుత్కృష్టుఁ డగుబృహస్పతి యెవ్వఁడు గలఁడో అతఁడు నేను. సేనానీనామ్=సేనాపతులలోఁ; స్కందుఁడు నేను. సరస్సులలో సాగరము నేను.

మహర్షీణాం భృగు రహం గిరా మ స్మ్యేక మక్షరమ్
యజ్ఞానాం జపయజ్ఞో ఽస్మి స్థావరాణాం హిమాలయః. ౨౫

భా. మహర్షీణామ్=మహర్షులలోఁ; భృగుః=భృగువు; అహమ్=నేను. గిరామ్=పదరూపము లయినవాక్కులలోఁ; ఏకమ్ అక్షరమ్=ఓంకారము; అస్మి=అగుచున్నాను. యజ్ఞానామ్=యజ్ఞములలోఁ; జపయజ్ఞః=జపరూపమయినయజ్ఞము; అస్మి = అగుచున్నాను. స్థావరాణామ్ = నిలుకడ గలవానిలోఁ; హిమాలయః=హిమవత్పర్వతము; అగుచున్నాను.

మహర్షులలో భృగుమహర్షి నేను, అర్థవంతము లగువాక్కులలో నోంకారము నేను, యజ్ఞములలో జపయజ్ఞము నేను, స్థావరంబులలో హిమాలయపర్వతము నే నని తాత్పర్యము.

శ్రీ. ఏకమ్ అనుటచే నోంకారము బ్రహ్మప్రతీకమును తదభిధానము నగుటవలనఁ బ్రధాన మని చెప్పఁబడుచున్నది. జపయజ్ఞము ఇతరయజ్ఞములకంటె హింసాదిరహితం బగుటచేఁ బ్రధాన మని తలఁచి చెప్పుచున్నారు యజ్ఞానా మిత్యాదిగా. శిఖరవంతములు—ఉన్నతము లగుపర్వతములలో మేరువు నే నని చెప్పి యున్నను, స్థైర్యశాలు లగు నాపర్వతములలోనే పర్వతరాజగుహిమవంతుఁడు నే నని యర్థభేదము గ్రహించి చెప్పుచున్నారు నిలుకడగలవానిలో నని.

హ. గిరామ్=వాక్కులలోఁ; ఏకమక్షరమ్=ప్రణవము నేను.

శం. గిరామ్=అర్థవాచకము లగుపదములలో; ఏకమక్షరమ్=ఒక్కయక్షర మగుప్రణవము నేను. స్థావరాణామ్=అచలములలోపల; హిమాలయము నేను.

మ. మహర్షీణామ్ = సప్తబ్రహ్మలలో; అతితేజస్వి యగుటవలన భృగువు నేను. గిరామ్=పదలక్షణము లయినవాక్కులలో; ఏకమక్షరమ్=ఏకాక్షర మయిన పద మగు నోంకారము; నేను. యజ్ఞానామ్; జపయజ్ఞః—హింసాదిదోషరహిత మగుటవలన నత్యంతశుద్ధి కలిగించునది; నేను. స్థావరాణామ్=స్థైర్యము గలవానిలో; హిమాలయము నేను. శిఖరవంతములలో మేరువు నేనని చెప్పఁబడినది. కావున స్థావరత్వంబునను శిఖరిత్వంబునను అర్థభేదము కలిమివలన దోషము లేదు,

శ్రీ. గిరామ్=పదాత్మకము లయినవాక్కులలో; ఏకమక్షరమ్ = ఓంకార మను పదము నేను. శ్రౌతస్మార్తయజ్ఞములలో జపరూప మయినయజ్ఞము నేను.

ప. అట్లు, మహర్షు లేడుగురిలో భృగువు నేను. గిరామ్ = చతుర్విధ వాక్కులలో; ఏకమక్షరమ్=ఓంకారము నేను. యజ్ఞానామ్=జ్యోతిష్టోమాదులలో; జపయజ్ఞము నేను. స్థావరంబులలో హిమాలయము నేను.

రా. మహర్షీణామ్ = మరీచి మొదలగువారిలో; భృగువు నేను. గిరామ్= అర్థవాచకము లగు శబ్దములలోపల; ఏకమక్షరమ్=ప్రణవము; నేను. యజ్ఞములలో నుత్కృష్ట మయిన జపయజ్ఞము నేను. స్థావరాణామ్=పర్వతమాత్రంబులలో; హిమాలయము నేను.

అశ్వత్థ స్సర్వవృక్షాణాం దేవర్షీణాంచ నారదః
గన్ధర్వాణాం చిత్రరథ స్సిద్ధానాం కపిలో మునిః. ౨౬
ఉచ్చైశ్శ్రవస మశ్వానాం విద్ధి మా మమృతోద్భవమ్
ఐరావతం గజేన్ద్రాణాం నరాణాంచ నరాధిపమ్. ౨౭

శా. సర్వవృక్షాణామ్=ఎల్లవృక్షములలోను; అశ్వత్థః = అశ్వత్థవృక్షము; నేను. దేవర్షీణాంచ = దేవత లయినవారలే మంత్రదర్శు లగుటవలన ఋషిత్వముఁ బొందిరి, వారు దేవర్షులు, వారిలో; నారదః = నారదుఁడు నేను. గన్ధర్వాణామ్=గంధర్వులలో; చిత్రరథః=చిత్రరథుఁ డను పేరు గలగంధర్వుఁడు నేను. సిద్ధానామ్=జన్మముచేతనే ధర్మజ్ఞాన వైరాగ్యైశ్వర్యాతిశయము నొందినవారలలో; కపిలోమునిః=కపిలమహాముని

నేను. అశ్వానామ్=గుఱ్ఱములలోపల; అమృతోద్భవమ్=అమృతనిమిత్తమయిన సముద్రమథనమునందుఁ బుట్టినట్టి; ఉచ్చైశ్శ్రవసమ్=ఉచ్చైశ్శ్రవమను గుఱ్ఱమును; మామ్=నన్నుఁగా; విద్ధి=ఎఱుంగుము. గజేన్ద్రాణామ్=గజశ్రేష్ఠములలో; ఐరావతమ్ = ఇరావతికిఁ బుట్టినదాని, ఐరావతమును; నన్నుఁగా నెఱుంగుము. నరాణాంచ=మనుష్యులలోను; నరాధిపమ్=రాజును; నన్నుఁగా నెఱుంగుము.

సమస్తవృక్షములలోను అశ్వత్థము నేను, దేవర్షులలో నారదుఁడు నేను, గంధర్వులలోఁ జిత్రరథుఁడు నేను, సిద్ధులలోఁ గపిలమహాముని నేను. అశ్వములలో నమృతమథనసమయమునందుఁ బుట్టిన యుచ్చైశ్శ్రవము నేను, గజేంద్రములలో నైరావతము నేను, మనుష్యులలో రాజు నే నని యెఱుంగు మని తాత్పర్యము.

**ఆ.** సర్వవృక్షాణా మ్మనుచో సర్వశబ్దముచే వనస్పతులు గ్రహింపఁబడుచున్నవి.

**హ.** **శం.** *

**మ.** సర్వవృక్షాణామ్ = సమస్తవృక్షములలోను, వనస్పతులలోను ♦ ఇతరములలోను; అశ్వత్థము నేను. దేవతలే యైనవారలై యెవరు మంత్రదర్శులగుటచే ఋషిత్వము నొందిరో వారు దేవర్షులు, వారిలో నారదుఁడు నేను. గన్ధర్వాణామ్=గానధర్ములగు దేవగాయకులలోపల; చిత్రరథుఁడు నేను. సిద్ధానామ్=జన్మముచేతనే-ప్రయత్నములేక యే ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యాతిశయము నొంది పరమార్థము నెఱింగిన వారిలోపల; కపిలమహాముని నేను. అశ్వములలోపల అమృతమథనమునందుఁ బుట్టిన యుచ్చైశ్శ్రవ మనునశ్వమును నన్నుఁగా నెఱుంగుము. గజేంద్రములలోపల; అమృతమథనమునం బుట్టిన యైరావతం బనుగజమును నన్నుఁగా నెఱుంగుము. నరులలోను, నరాధిపమ్=రాజును; నన్నుఁగా నెఱుంగుము.

**శ్రీ.** దేవత లెవ్వరు మంత్రదర్శులగుటచే ఋషిత్వము నొందిరో వారిలోపల నారదుఁడు నేను. సిద్ధానామ్=పుట్టువువలననే పరమార్థము నెఱింగినట్టివారిలోపల; కపిలోమునిః=కపిలుం డనుముని నేను, అమృతముకొఱకు క్షీరసముద్రము మథించునప్పుడు పుట్టిన యుచ్చైశ్శ్రవ మనునశ్వమును నావిభూతినిగా నెఱుంగుము.

---

* ఈ రెండుశ్లోకములకు నీ వ్యాఖ్యానములు లేవు.

♦ పుష్పింపక ఫలించునవి వనస్పతు లనఁబడును.

అమృతోద్భవ మ్మనునది ఐరావతమునందును సంబంధించుచున్నది. నరాధిపమ్= రాజును; నావిభూతినిగా నెఱుంగుము.

ప. సర్వవృక్షంబులలోను అశ్వత్థము నావిభూతి. ఎవ్వరు దేవతలై ఋషు లగుచున్నారో వారియందు నారదుఁడు నేను. గంధర్వులలోఁ జిత్రరథుఁడు నేను. జన్మమువలననే పరమార్థవేదు లగు సిద్ధులలోపలఁ గపిలుఁడు నేను. అమృతోద్భవమ్ = క్షీరసముద్రమథనంబునందుఁ బుట్టిన; ఉచ్చైశ్శ్రవసమ్—ఏడుముఖములుగల యశ్వమును; నావిభూతినిగా నెఱుంగుము. గజేంద్రములలోఁ జతుర్దంతమగు నైరావతమును నావిభూతినిగా నెఱుంగుము.

రా. వృక్షములలోఁ బూజ్య మయిన యశ్వత్థము నేను. దేవర్షులలో నారదుఁడు నేను.

మ. సుఖరూపుఁడును వీనిచేత జగత్తు పాలింపఁబడుచున్నదియు లయము నొందుచున్నదియు, కావున కపిలుఁడు, « ప్రీతి స్సుఖం క మానన్దః » అను నిఘంటువువలన. « ప్రాణో బ్రహ్మ కం బ్రహ్మ ఖం బ్రహ్మ" అనియు. « ఋషిం ప్రసూతం కపిలం య స్త మగ్రే జ్ఞానై ర్బిభ ర్తి జాయమానం చ పశ్యేత్ । సుఖాదనన్తాత్పాలనా ల్లీయనాచ్చ యం వై దేవం కపిల ముదాహర న్తి » ♦ అని బాభ్రవ్యశాఖయందు.

ఆయుధానా మహం వజ్రం ధేనూనా మస్మి కామధుక్
ప్రజనశ్చాస్మి కన్దర్ప స్సర్పాణా మస్మి వాసుకిః. ౨౭.
అనన్త శ్చాస్మి నాగానాం వరుణో యాదసా మహమ్
పితౄణా మర్యమా చాస్మి యమ స్సంయమతా మహమ్. ౨౮.

భా. ఆయుధానామ్ = ఆయుధములలో; వజ్రమ్=దధీచియస్థివలనఁ బుట్టిన వజ్రాయుధము; అహమ్=నేను. ధేనూనామ్=పాఁడియావులలో; కామధుక్=కామధేనువు; అస్మి=అగుచున్నాను. ప్రజనః=పుట్టించునట్టి; కన్దర్పశ్చ=మన్మథుఁడును; అస్మి=అగుచున్నాను. సర్పాణామ్=సర్పవిశేష

♦ ఎవ్వఁడు మున్ను జరిగినదానిని జరుగుచున్నదానిని జ్ఞానములచే నెఱుంగుచున్నాఁడో ఏ దేవుని అనంతసుఖమువలనను పాలనమువలనను లయము నొందించుటవలనను కపిలుండని చెప్పుచున్నారో అట్టి కపిలమునిని జూచును.

ములలో; వాసుకిః=సర్పరాజు; అస్మి = అగుచున్నాను. నాగానామ్=సర్పవిశేషములలో; అనన్తశ్చ = నాగరాజును; అస్మి = అగుచున్నాను. యాదసామ్=జలదేవతలలో; వరుణః=రాజయిన వరుణుఁడు; అహమ్=నేను. పితౄణామ్=పితృదేవతలలో; అర్యమాచ = అర్యమ యను పేరుగల పితృరాజు; అస్మి=అగుచున్నాను. సంయమతామ్=సంయమనమును ♦ చేయువారిలో; యమః=యముఁడు; అహమ్=నేను.

ఆయుధములలో వజ్రాయుధము నేను, ధేనువులలోఁ గామధేనువు నేను, ప్రజలఁ బుట్టించునట్టి మన్మథుఁడు నేను, సర్పములలో వాసుకి నేను, నాగములలో ఆదిశేషుఁడు నేను, జలదేవతలలో వరుణుఁడు నేను, పితృదేవతలలో నర్యముఁడు నేను, నిగ్రహము చేయువారిలో యముఁడు నే నని తాత్పర్యము.

ఆ. ప్రజనయతి—పుట్టించుచున్నాఁడు అనువ్యుత్పత్తి నాశ్రయించి చెప్పుచున్నారు పుట్టించునట్టి యని. సర్పములు నాగములు అని జాతిభేదముచే భిన్నములు.

హ. యాదసామ్=జలనివాసులలో. *

శ్రీ. సంయమతామ్=దుష్టనిగ్రహము చేయువారిలోపల. ♦♦

మ. ఆయుధానామ్=ఆయుధములలో; వజ్రమ్ = దధీచిమహాముని యస్థి వలనఁ బుట్టినయస్త్రము; అహమ్=నేను. ధేనూనామ్=పాఁడియావులలోపల; కామధుక్=కామమును బితుకునది, సముద్రమథనంబునం బుట్టిన వసిష్ఠుని కామధేనువు; నేను. కామములలోపల, ప్రజనః=పుట్టించునట్టి, పుత్రోత్పత్త్యర్థ మయిన; కన్దర్పః=కామ మేదిగలదో, అది నేను. చకారము తు అనుదాని యర్థముగలది, రతిమాత్ర హేతు వగుకామమును వ్యావర్తించుచున్నది. సర్పములనియు నాగములనియు జాతిభేదమున భిన్నములు, అందు, సర్పాణామ్=విషముగల సర్పములలోపల; వాసుకిః=సర్పములకు రాజయిన వాసుకి నేను. జాతిభేదములయిన, నాగానామ్ = నాగములలో; అనన్తశ్చ=నాగరాజయిన శేషుఁడు; నేను. యాదసామ్ = జలచరముల లోపల; వరుణః=వానికి రాజయిన వరుణుఁడు నేను. పితౄణామ్=పితృదేవతలలో; అర్యమా=పితృరాజయిన యర్యముఁడు నేను. సంయమతామ్ = సంయమమును—

♦ నిగ్రహమును.

* తక్కినది సమానము.

♦♦ తక్కినది సమానము.

ధర్మాధర్మములకు ఫలము నిచ్చుటచే అనుగ్రహమును నిగ్రహమును జేయువారిలో; యముఁడు నేను.

**శ్రీ.** ఆయుధములలోపల వజ్రము నేను. కామములను బితుకునది కావున కామధుక్కు. ప్రజనః=ప్రజోత్పత్తి హేతువైన; కన్దర్పః=కాముఁడు నేను. కేవలము సంభోగప్రధాన మయినకామము నావిభూతి కాదు, అశాస్త్రీయ మగుటవలన. సర్పాణామ్—విషముగలవానిలో; రాజయిన వాసుకి నేను. నాగానామ్—విషము లేనివానిలో; రాజయిన యనంతుఁడు—శేషుఁడు నేను. యాదసామ్ = జలచరముల లో; వానికి రాజయిన వరుణుఁడు నేను. పితౄణామ్ = పితరులలోపల; అర్యమా= అర్యముఁ డనుపేరుగల పితృరాజు నేను సంయమతామ్ = నియమనము చేయువారి లో; యముఁడు నేను.

**ప.** ♦

**రా.** కామధుక్=దేవతల కామధేనువు. ప్రజనః=జనన హేతు వగు; కందర్పుఁడు నేను. సర్పములు—ఒక్కశిరస్సు గలవి. నాగములు—పెక్కుశిరస్సులు గలవి. యాదసామ్ = జలములందు వసించుజంతువులలో; వరుణుఁడు నేను. సంయమతామ్= దండించువారిలో; యముఁడు నేను.

**మా.** *

ప్రహ్లాదశ్చాస్మి దైత్యానాం కాలః కలయతా మహమ్
మృగాణాంచ మృగేన్ద్రోఽహం వైనతేయశ్చ పక్షిణామ్. 30
పవనః పవతా మస్మి రామ శ్శస్త్రభృతా మహమ్
ఝషాణాం మకరశ్చాస్మి స్రోతసా మస్మి జాహ్నవీ. 31

**భా.** దైత్యానామ్=దితివంశమునఁ బుట్టినవారిలోపల; ప్రహ్లాదశ్చ= ప్రహ్లాదుఁడు; అస్మి = అగుచున్నాను. కలయతామ్ = కలనమును—గణనమును జేయువారిలో; కాలః=కాలము; అహమ్=నేను. మృగాణాంచ= మృగములలో; మృగేన్ద్రః=సింహము, లేక, వ్యాఘ్రము; అహమ్=నేను. పక్షిణామ్=పక్షులలో; వైనతేయశ్చ =వినతకొడుకైన గరుత్మంతుఁడు; నేను. పవతామ్=పావనము చేయువానిలో; పవనః=వాయువు; అస్మి=

♦ శ్రీధరీయముతో సమానము.

* ౨౮, ౨౯, ౩౦ శ్లోకములకు మాధ్వభాష్యము లేదు.

అగుచున్నాను. శస్త్రభృతామ్=ఆయుధముల ధరించువారిలో; రామః= దశరథపుత్త్రుఁ డగు రాముఁడు; అహమ్=నేను; ఝషాణామ్=మత్స్యములు మొదలగువానిలో; మకరశ్చ=మత్స్యజాతి విశేషము ♦♦; అస్మి= అగుచున్నాను. స్రోతసామ్ = ప్రవహించువానిలో; జాహ్నవీ = గంగ; అస్మి=అగుచున్నాను.

దైత్యులలోఁ బ్రహ్లాదుఁడు నేను, గణియించువారిలోఁ గాలము నేను, మృగములలో సింహము నేను, పక్షులలో గరుత్మంతుఁడు నేను. పవిత్రము చేయువానిలో వాయువు నేను, ఆయుధము ధరించినవారిలో దశరథపుత్త్రుఁ డగురాముఁడు నేను, మత్స్యములలో మకరము నేను, నదులలో గంగానది నే నని తాత్పర్యము.

ఆ. ♦

హ. కలయతామ్ = ఎడఁబాపునట్టివారిలో. పవతామ్ = నడచువారిలో, రామః=దశరథపుత్త్రుఁడు. ఝషాణామ్ = హింసించునట్టి జలచరములలో.

శ్రీ. కలయతామ్ = శుభాశుభములను వృద్ధిక్షయములను జేయువారిలో; కాలము నేను. పవతామ్=పావనము చేయువానిలో; పవనః=వాయువు నేను. శస్త్రభృత్తులలో, రామః=దాశరథి నేను. స్రోతసామ్=ప్రవాహము గలనదులలో; జాహ్నవీ=గంగ నేను.

మ. దైత్యానామ్=దితివంశజులలోపల; ప్రహ్లాదశ్చ=మిక్కిలి హ్లాదయతి— ఆనందింపఁ జేయుచున్నాఁడు పరమసాత్త్వికుఁ డగుటచే నందఱను, కావున ప్రహ్లాదుఁడు; నేను. కలయతామ్=సంఖ్యానమును—లెక్కించుటను జేయువారిలో; కాలము నేను. మృగాణాంచ=పశువులలో; మృగేన్ద్రః=సింహము నేను. పక్షిణామ్; వైనతేయశ్చ=వినతాపుత్త్రుఁ డైన గరుత్మంతుఁడు నేను. పవతామ్ = పావనము చేయువారిలో, లేక, వేగవంతులలో; పవనః=వాయువు నేను. శస్త్రభృతామ్=ఆయుధధరులై యుద్ధకుశలు లగువారిలో; రామః = దశరథపుత్త్రుఁడు అఖిలరాక్షసుల సంహరించినవాఁడు పరమవీరుఁ డగు రాముఁడు నేను. సాత్త్వికస్వరూపమునుగూడ ఈరూపంబున ధ్యానించుటకై « వృష్ణీనాం వాసుదేవో ఽస్మి » యనునట్లు ఇది పఠింపఁబడిన దని మున్నుచెప్పియున్నారము. ఝషాణామ్=మత్స్యములలో; మకరః=మకరమను

♦♦ మొసలి.

♦ దీనికి ఆనందగిరీయము లేదు.

మత్స్యజాతివిశేషము నేను. స్రోతసామ్=వేగమునఁ బ్రవహించు జలముగల నదుల లో; జాహ్నవీ=సర్వనదీశ్రేష్ఠ యగుగంగ నేను.

శ్రీ. దైత్యానామ్; రాజయిన ప్రహ్లాదుఁడు నేను. కలయతామ్ = వశీక రించువారిలో; లేక, లెక్కించువారిలో; కాలము నేను. మృగేన్ద్రః = సింహము. పక్షులలో వైనతేయుఁడు–గరుడుఁడు నేను. పవతామ్ = పావనము చేయువారిలో, లేక, వేగము గలవారిలో, వాయువు నేను. శస్త్రభృతామ్=వీరులలో; రామః=దశ రథపుత్త్రుఁడు, లేక, పరశురాముఁడు నేను. ఝషాణామ్=మత్స్యములలో; మకరః– మత్స్యవిశేషము నేను. స్రోతసామ్=ప్రవాహములలో; గంగ నేను.

ప. దైత్యులలోఁ బ్రహ్లాదుఁడు నావిభూతి. కలయతామ్ = ఆక్రమించు వస్తువులలో; కాలము నేను. మృగాణామ్=హింసించుపశువులలో; మృగేన్ద్రః=సింహ ము నేను. పక్షులలో వైనతేయుఁడు–వినతాపుత్త్రుఁ డగు గరుడుఁడు నేను. పవ తామ్=వేగవంతులలో; వాయువు నేను. శస్త్రభృతామ్ = వీరులలో; రామః–దాశ రథి నేను. ఝషాణామ్=మత్స్యములలో; మకరః–జలజంతువిశేషము నేను. స్రోత సామ్=ప్రవాహములలో; గంగానది నావిభూతి.

రా. కలయతామ్ = అనర్థము పొందఁగోరి గణియించువారిలో; కాలః= మృత్యువు నేను. పవతామ్=గమనస్వభావములలో; పవనః= వాయువు నేను. శస్త్ర భృత్తులలో రాముఁడు నేను. ఇట శస్త్రభృత్త్వము విభూతి, అర్థాంతరము లేమివలన. ఆదిత్యాదు లగుక్షేత్రజ్ఞులు ఆత్మయై యున్న భగవంతునకు శరీర మగుటచే ధర్మ భూతులు కావున శస్త్రభృత్త్వస్థానీయులు.

మా. ఆనందరూపుఁ డగుటవలనను బూర్ణుఁ డగుటవలనను లోకరమణుం డగుటవలనను రాముఁడు. "ఆనన్ద రూపో నిష్పరిమాణ ఏష లోక శ్చైత స్మాద్రమతే తేన రామః" అని శాండిల్యశాఖయందు. రశ్చ అమశ్చ అని వ్యుత్పత్తి *.

సర్గాణా మాది రన్తశ్చ మధ్యంచైవా ఽహ మర్జున
అధ్యాత్మవిద్యా విద్యానాం వాదః ప్రవదతా మహమ్. 32

భా. సర్గాణామ్=సృష్టులయొక్క; ఆదిః = ఉత్పత్తియును; అన్తశ్చ= లయమును; మధ్యంచైవ=స్థితియు; ఉత్పత్తిస్థితిలయములు; అహమ్=నేను.

* రశ్చ ఆనందరూపుఁడును అమశ్చ–పరిమాణము లేనివాఁడును.

అర్జున = అర్జునా! జీవాధిష్ఠితము లయిన భూతములకే యుత్పత్తి స్థితి లయములు నే నని చెప్పఁబడినది యుపక్రమమునందు. ఇటనో సమస్త మయిన సర్గమాత్రమునకును అని విశేషము. విద్యానామ్=విద్యలలో; మోక్షార్థ మగుటవలనఁ బ్రధానమయిన, అధ్యాత్మవిద్యా = ఆత్మవిద్య; నేను. ప్రవదతామ్ = వాదించువారియొక్క; అర్థనిర్ణయ హేతు వగుట వలనఁ బ్రధానమయిన; వాదః=వాదము *; అహమ్=నేను. లేక. వాదించు వారియొక్క వదన † భేదములయిన వాద జల్పవితండ లిచట గ్రహింపఁ బడుచున్నవి ♦♦, వానిలో వాదము నే నని యర్థము.

సృష్టుల యుత్పత్తిస్థితిలయములు నేను, విద్యలలో నధ్యాత్మవిద్య నేను. వాదించువారి నానావిధప్రసంగములలో వాదము నే నని తాత్పర్యము.

ఆ. అహమాదిశ్చ అనుస్థలమునఁ జెప్పినదే యిట వెండియుఁ జెప్పఁబడు చున్నది కావునఁ బునరుక్తి యని యాశంకించి చెప్పుచున్నారు జీవాధిష్ఠితములు ఇత్యాదిగా. సర్గశబ్దముచే సృజ్యన్తే—సృజింపఁబడుచున్నవి యనువ్యుత్పత్తిచే సర్వ కార్యములును గ్రహింపఁబడుచున్నవి. అధ్యాత్మవిద్యా అనుటచే ఆత్మయం దంతః కరణపరిణామము అవిద్యానివర్తకము గ్రహింపఁబడినది. ప్రవదతామ్—వాదించు వారి సంబంధియగు, వాదము—తత్త్వనిర్ణయపర్యంత మగు వీతరాగకథ ♦. ప్రవద తామ్ అనుటకు లక్షణచేఁ గథాభేదము అర్థ మని చెప్పుపక్షమున అప్పుడు నిర్ధా రణమునందుఁ షష్ఠి యని చెప్పుచున్నారు లేక ఇత్యాదిగా.

హ. సర్గాణామ్=సృజింపఁబడువానియొక్క; ఆదిః మధ్యంచైవ అన్తశ్చ= సృష్టిస్థితిసంహారములు; నేను. ప్రవదతామ్=వాదించువారియొక్క; వాదము నేను. అది చెప్పఁబడినది “ప్రమాణతర్కసాధనో పాలమ్భ స్సిద్ధాన్తా విరుద్ధః పఞ్చావ యవో త్పన్నః పక్ష ప్రతిపక్ష పరిగ్రహో వాదః” అని.

---

* తత్త్వజిజ్ఞాసచేఁ బక్షప్రతిపక్ష పరిగ్రహపూర్వకముగా నిద్దఱు చేయువిచారము.

† విచార.

♦♦ జల్పము—స్వపక్షస్థాపనపూర్వకముగాఁ బరపక్షదూషణము, వితండ—స్వపక్షము స్థాపింపక పరపక్షము దూషించుట.

♦ రాగములేనివారి విచారము.

తా. ఆదిత్యాదివిభూతులును విష్ణ్వాదివిభూతివిశేషములును దానే యని సూచించుటకై సర్వవికారంబులయు నాదియు మధ్యంబును అంతంబును నేనే సర్వాత్మను బరిపూర్ణుఁడ నని చెప్పుచున్నాఁడు.—సర్గాణామ్=సృజింపఁబడుచున్నవి కావున సర్గము లనఁగా మహదాదిస్థూలాంతము లగు వికారములు, వానియొక్క.; ఆదిః=ఉపాదానకారణము; నేనే ఘటకరకాదులకు మృత్తికవలె. నావలననె సర్వంబును బుట్టిన దని యర్థము, «తస్మాత్సర్వ మభవత్» అను శ్రుతివలన. ఓయీ! సర్వవికారకారణంబ వగుటచే నీకు ఆదియందు సద్భావ మున్నను కార్యదశయందు సద్భావము కనఁబడమివలన సర్వాత్మతయుఁ బూర్ణతయు సంభవింప దని యాశంకించి చెప్పుచున్నాఁడు.—మధ్యంచైవ—మృత్కార్యమైన ఘటాదికమునందు గంధవత్త్వాది మృద్ధర్మము కనఁబడుటవలన మృత్తే సమన్వితమయియున్నది, అందుచే నెట్లు ఘటాదికము సర్వంబును మృత్తే యగునో అట్లు మహదాదివికారములయందు సత్తాస్ఫూర్త్యాదికము నాధర్మము కనఁబడుటచే నేనే సమన్వితుఁడ నని సిద్ధించుటవలన సర్వంబును నేనే, అందువలనఁ బ్రపంచముయొక్క మధ్యంబును నేనే, నేనే వికారరూపంబున నున్నవాఁడ నని సిద్ధము. ఓయీ! నీవు వికారరూపంబున నున్నవాఁడవేని వికారము నశించునపుడు నీకును నాశము సంభవించుటచే సద్భావము లేకపోవుటవలన అనిత్యత్వంబును అసర్వాత్మతయును అపూర్ణత్వంబును సంభవించు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—అన్తశ్చ=కార్యముయొక్క అంతము అదర్శనరూపము ఏదిగలదో అదియు నేనే, కల్పితరూపం బగుఘటము నశించినను దానికిఁ గారణమయి దానియం దనువృత్తమయిన మృత్తునకు నాశము లేమివలనఁ గపాలచూర్ణాదులయం దనువృత్తమృత్తునకు సత్త యుండనేయున్నది, అట్లు మహదాదిసర్వవికారంబులును నశించినను తత్కారణభూతుఁడనయి తదనువృత్తుఁడ నయిన నాకు నాశము లేమివలన నాకు సద్భావంబును నిత్యత్వంబును సర్వాత్మతయుఁ బూర్ణత్వంబును ఉండనేయున్నది. అట్లు వికారంబుల యాదియు మధ్యంబును అంతంబును నేనే, నాకంటె నతిరిక్తం బయినవస్తువు ప్రమాణమువలన నిరూపింప నశక్యం బగుటవలన. అందువలన నాదిత్యాదివిభూతులును విష్ణ్వాదివిభూతివిశేషములును సర్వంబును నేనే యని సిద్ధము. లేక. «సృష్టిస్థిత్యన్తకరణీం బ్రహ్మవిష్ణుశివాత్మికామ్ । స సంజ్ఞాం యాతి భగవా నేక ఏవ జనార్దనః» ♦ అను వచనంబువలన,

♦ ఆభగవంతుఁ డగుజనార్దనుఁ డొక్కఁడే సృష్టిస్థితిప్రలయములఁ జేయునట్టి బ్రహ్మవిష్ణుశివాత్మక మయిన పేరును బొందుచున్నాఁడు.

సృజింపఁబడుచున్నారు కావున సర్గము లనఁగా ప్రాణులు, వారియొక్క; ఆదిః=సృష్టికారణ మగుబ్రహ్మదేవుఁడు నేనే. అన్తశ్చ = అంతము చేయువాఁడు, సంహారకర్త యగుశివుఁడును నేనే. అట్లు, మధ్యంచ = ఇట మధ్యశబ్దముచే సృష్టిప్రలయముల నడుమనుండు స్థితిని జేయునట్టి విష్ణువు లక్షింపఁబడుచున్నాఁడు, అతఁడును నేనే యని యర్థము. విద్యానామ్=జ్ఞానహేతువు లగు సర్వవేదశాస్త్రములలోను; మోక్షహేతు వగుటవలన, అధ్యాత్మవిద్యా=ఉపనిషత్తులు; నేనే. ప్రవదతామ్ = వివాదము చేయువారిలో, ఇట ప్రవదతా మ్మనుటచే వాదజల్ప వితండాదులు లక్షింపఁబడుచున్నవి, వానిలో; అర్థనిర్ణయహేతు వగుటవలన వాదము నేనని యర్థము.

మ. సర్గాణామ్=అచేతనసృష్టులయొక్క; ఆదిః అన్తశ్చ మధ్యంచ—ఉత్పత్తిస్థితిలయములు; అహమేవ = నేనే. ఓయర్జునా! ఉపక్రమమునందు జీవావిష్టము లయిన భూతములకుఁ జేతనంబు లని ప్రసిద్ధము లైనవానికే ఆదియు నంతమును మధ్యంబును నే నని చెప్పఁబడినది, ఇటనో అచేతనసర్గములకు. అందుచే పునరుక్తి లేదు. విద్యానామ్ = విద్యలలో; అధ్యాత్మవిద్యా = మోక్షహేతు వగు ఆత్మతత్త్వవిద్య; నేను. ప్రవదతామ్ = వాదించువారియొక్క వాదజల్ప వితండాత్మకము లగు కథాభేదములలో; వాదము నేను. భూతానా మస్మి చేతనా యనుచోట నెట్లు భూతశబ్దముచే తత్సంబంధు లగుపరిణామములు లక్షింపఁబడినవో అట్లిచట ప్రవదచ్ఛబ్దముచేఁ దత్సంబంధు లగుకథాభేదములు లక్షితము లగుచున్నవి. అందువలన సిద్ధారణ మూపపన్నము. యథాశ్రుతముగా గ్రహించినచో రెండుస్థలములయందును సంబంధషష్ఠి. తత్త్వజిజ్ఞాసువులై వీతరాగులైన సబ్రహ్మచారులుగాని గురుశిష్యులుగాని ప్రమాణముచేతను తర్కముచేతను జేయునట్టి సాధనదూషణాత్మకమయిన సపక్ష ప్రతిపక్ష పరిగ్రహము తత్త్వనిర్ణయపర్యంత మగునది వాద మనఁబడును. అది చెప్పఁబడినది «ప్రమాణ తర్కసాధనో పాలమ్భ స్సిద్ధాన్తావిరుద్ధః పఞ్చావ యవోత్పన్నః పక్ష ప్రతిపక్ష పరిగ్రహో వాదః» అని. వాదఫలమయిన తత్త్వనిర్ణయమును దుర్వాదినిరాకరణముచే సంరక్షించుటకై జల్పవితండ లనువిజిగీషుకథలు జయపరాజయ మాత్రపర్యంతములు. అది చెప్పఁబడినది «తత్త్వాధ్యవసాయ సంరక్షణార్థం జల్పవితణ్డే బీజప్రరోహ సంరక్షణార్థం కణ్టక శాఖాప్రావరణవత్" * అని.

* తత్త్వనిర్ణయమును సంరక్షించుటకై జల్పవితండలు, విత్తనపు మొలకలను సంరక్షించుటకై ముండ్లకంప కప్పునట్లు.

ఛలజాతి నిగ్రహస్థానములచే ♦♦ బరపక్షమును దూషించుట జల్పమునందును వితండ యందును సమానము. అందు వితండయందు ఒకఁడు స్వపక్షస్థాపనమును మాత్రమే చేయును, ఇతరుఁడు తద్దూషణమును మాత్రమే చేయును. అది చెప్పఁబడినది “యథోక్తోపపన్నచ్ఛల జాతినిగ్రహస్థాన సాధనో పాలమ్భో జల్పః సప్రతిపక్షస్థాపనాహీనో వితణ్డా” అని. కావున వితండాద్వయరూపం బగుటవలన జల్ప మనునది యొకకథ కాదు, మతే మనఁగా శక్త్యతిశయముఁ దెలుపుటకై సమయబంధ మాత్రంబునఁ బ్రవర్తించుచున్నది యని ఖండనకారులు చెప్పుచున్నారు. తత్త్వనిర్ణయపర్యవసాయి యగుటచే వాదమునకు శ్రేష్ఠత యని చెప్పియే యున్నారము.

శ్రీ. సృజింపఁబడుచున్నవి కావున సర్గములు—ఆకాశాదులు, వానియొక్క; ఆదియును అంతంబును మధ్యంబును నేను. అహమాదిశ్చ మధ్యంచ అనుచోట స్రష్ట్రాదికర్తృత్వరూప మయిన పారమైశ్వర్యము చెప్పఁబడినది. ఇచటనో యుత్పత్తి స్థితిలయములు భగవద్విభూతులు ధ్యానింపవలయు నని చెప్పఁబడుచున్న దని విశేషము. అధ్యాత్మవిద్యా=ఆత్మవిద్య. ప్రవదతామ్=వాదిసంబంధులు వాద జల్పవితండలనుమూఁడుకథలు ప్రసిద్ధములు, వానిలోపల; వాదము నేను. దేనియందు వాదిప్రతివాదులు ప్రమాణముచేతను తర్కముచేతను స్వపక్షము స్థాపించుచుఁ బరపక్షమును ఛలజాతినిగ్రహస్థానములచే దూషింతురో అది జల్పము. దేనియందు ఒకఁడు స్వపక్షము సాధించునో ఇతరుఁడు తత్పక్షమును ఛలజాతినిగ్రహస్థానములచే దూషించుం గాని స్వపక్షమును సాధింపఁడో అది వితండాకథ. అందు జల్పవితండలు విజిగీషువు లగువాదుల శక్తిని బరీక్షించుకొఱకు. వాదమో వీతరాగు లగుశిష్యాచార్యులకుఁ గాని యితరులకుఁ గాని తత్త్వనిర్ణయమే ఫలముగాఁ గలది. కావున నది శ్రేష్ఠం బగుటవలన నావిభూతి యని యర్థము.

ప. సర్గాణామ్ = ఆకాశాదులయొక్క; ఆదిః=మూలంబును; అన్తః=తుది యును; మధ్యంచ=స్థితియును; నేనే. విద్యానామ్ = చతుర్దశవిద్యలలో; అధ్యాత్మవిద్యా=ఆత్మప్రతిపాదక మయినవిద్య; నేను, ఇతరవిద్యలు స్వస్వమతాభినివేశముచే మత్సరాదిజనకము లగుటవలన. చెప్పఁబడినదిగూడ —“ శేశే మత్సర జీవ వత్సర శతం యేన త్వయానిర్జితం శాస్త్రాణా మిద మూర్జితం ప్రయతతాం త్వద్వంశ విచ్ఛి

ప్రతివాదివాక్యమున కర్థాంతరము కల్పించి దూషించుట ఛలము. వ్యాప్తినిరపేక్షము లయిన సాధర్మ్య వైధర్మ్యములచే బ్రతివాదివాక్యమును దూషించుట జాతి. ప్రతివాది పరాజయమునకు హేతువు నిగ్రహస్థానము.

త్తయే । యస్మాత్తద్గురుతామపాస్య చక్రృషే స్వాన్యాయుధాన్యన్యథా స్వీయం స్థాపయితుం మతం పరమతచ్ఛేదం కథం కుర్వతే" ♦ అని. అందువలననే చెప్పుచున్నాఁడు.—ప్రవదతామ్=ఒకరితో నొకరు వాద జల్పవితండారూపము లగునకథలు చేయువారిలోపల; తత్త్వజిజ్ఞాసువుల కథయైన వాదము నేను.

రా॰ సృజింపఁబడుచున్నవి కావున సర్గములు, వానికి; ఆదిః = కారణము, సదా సృజింపఁబడుచున్న సర్వప్రాణులను అప్పుడప్పుడు సృజించువారు నేనే యని యర్థము. అట్లు, అన్తః—సదా సంహరింపఁబడుచున్నవారిని అప్పుడప్పుడు సంహరించువారు నేనే యని యర్థము. అట్లు, మధ్యన్=పాలనము, సదా పాలింపఁబడుచున్నవారిని పాలించువారు నేనే యని యర్థము. జల్పవితండాదులు చేయువారి యొక్క తత్త్వనిర్ణయముకొఱకుఁ బ్రవృత్తమైనవాద మేది గలదో అది నేను.

మూ. *

అక్షరాణా మకారో ఽస్మి ద్వన్ద్వ స్సామాసికస్య చ
అహ మేవా ఽక్షయః కాలో ధాతా ఽహం విశ్వతోముఖః. 33

మృత్యు స్సర్వ హరశ్చా ఽహ ముద్భవశ్చ భవిష్యతామ్
కీర్తి శ్శ్రీ ర్వాక్చ నారీణాం స్మృతి ర్మేధా ధృతిః క్షమా. ౩౪

భా. అక్షరాణామ్=వర్ణములలో; అకారః = అ అనువర్ణము; అస్మి= అగుచున్నాను. సామాసికస్య చ = సమాససమూహములో; ద్వన్ద్వః= ద్వంద్వసమాసము; అగుచున్నాను. మఱియు; అక్షయః=క్షయరహిత మగు; కాలః=క్షణాదినామకమయి ప్రసిద్ధ మగుకాలము; లేక, కాలము నకును కాలమయిన పరమేశ్వరుండు; అహమేవ=నేనే. విశ్వతోముఖః= సర్వతోముఖుఁ డగు; ధాతా=సర్వజగత్తునకును కర్మఫలవిధాత; అహమ్= నేను. సర్వహరః=సమస్తమును హరించునట్టి; మృత్యుశ్చ = మృత్యువు; అహమ్=నేను. ధనాదులహరించువాఁడును బ్రాణమును హరించువాఁడు

♦ ఓరీ మత్సరమా! నీవు నూఱేండ్లు జీవింపుము, నీవంశమును ఛేదించుటకై శాస్త్రము లధికముగా యత్నించుచుండఁగా నీవే జయించితివి. అవి నీవు ఆగురుత్వమును విడిపించి వానియాయుధములను వేఱువిధముగా నుపయోగింపఁజేసితివి. కానిచో, తమమతమును స్థాపించుటకై పరమతఖండనము నేల చేయుచున్నవి!

* ౩౨, ౩౩, ౩౪, ౩౫, ౩౬ శ్లోకములకు మాధ్వభాష్యము లేదు.

నని ద్వివిధుం డగుమృత్యువు సర్వహరుం డని చెప్పఁబడుచున్నాఁడు, అట్టి మృత్యువు నే నని యర్థము. లేక. పరమేశ్వరుఁడు సర్వహరుఁడు, ప్రలయమునందు సర్వమును హరించుటవలన; అతఁడు నేను. ఉద్భవశ్చ= ఉత్కర్షము, అభ్యుదయము, తత్ప్రాప్తిహేతువును; నేను. వేనికి? భవిష్యతామ్ = భవిష్యత్కల్యాణంబులకు; ఉత్కర్షప్రాప్తియోగ్యంబుల కని యర్థము. కీర్తిః=కీర్తి; శ్రీః=లక్ష్మి; వాక్చ = సరస్వతియు; స్మృతిః= స్మృతి; మేధా=గ్రంథధారణశక్తి; ధృతిః=ధైర్యము; క్షమా = ఓర్పు; నేను; నారీణామ్ = స్త్రీలలో. ఎవ్వరితో ఆభాసమాత్రసంబంధము కలిగిన లోకము తన్నుఁ గృతార్థముగాఁ దలంచుచున్నదో అట్టి స్త్రీలలో కీర్త్యాదులు నేను.

అక్షరములలో అకారము నేను, సమాసంబులలో ద్వంద్వసమాసము నేను, అక్షయం బగు కాలము నేను, సర్వతోముఖుండై కర్మఫలము నిచ్చువాఁడు నేను. సర్వహరుం డగుమృత్యువు నేను, కలుగఁబోవు కల్యాణంబులలో ఉత్కర్షము నేను, స్త్రీలలో కీర్తియు లక్ష్మియు సరస్వతియు స్మృతియు మేధయు ధృతియు క్షమయు నే నని తాత్పర్యము.

ఆ. సర్వహరశబ్దమునకు ముఖ్యార్థముఁ జెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. భవిష్యత్కల్యాణముల కని చెప్పినదానినే స్పష్టీకరించుచున్నారు. ఉత్కర్షప్రాప్తీత్యాదిగా. కీర్తి—ధార్మికత్వముచేఁ గలుగుఖ్యాతి. లక్ష్మి—కాంతి, శోభ. సరస్వతి—సర్వార్థములను వెల్లడిచేయునది. స్మృతి—బహుకాలమున కనుభవించినదాని స్మరించుశక్తి. ఓర్పు—మానావమానములయందు చిత్తము వికారము నొందకుండుట. స్త్రీలలోఁ గీర్త్యాదులఁ జెప్పుట నుపపాదించుచున్నారు వేనితో నిత్యాదిగా.

హ. ధాతా=కర్మఫలమునిచ్చువాఁడు, ఈశ్వరుండు; విశ్వతోముఖః=విశ్వరూపుఁడు. పరమేశ్వరుఁడే సర్వహరుం డగుమృత్యు వని చెప్పఁబడుచున్నాఁడు ప్రలయమునందు సర్వమును హరించుటవలన. భవిష్యతామ్=ఉద్భవిల్లఁబోవువానిలో; ఉద్భవః=అభ్యుదయము నేను. కీర్తిః = స్వరూపముచేఁ జెప్పుట; శ్రీః=లక్ష్మి; వాక్= సరస్వతి; స్మృతిః=స్మరణశక్తి. మేధా=ధారణశక్తి; ధృతిః=ధీరత; క్షమా=క్షుత్పిపాసాది సహనము, «ఆక్రుష్టో ఽభిహతో వాఽపి నాక్రోశే న్నైవ తాడయేత్!

అదుష్టో వాఙ్మనః కాయైః స్సా క్షమా పరికీర్తితా" ♦ అని ప్రతిపాదింపఁబడినది;— ఎవ్వరితో నాభాసమాత్ర సంబంధము కల్గినను లోకము తన్నుఁ గృతార్థముగాఁ దలఁచుచున్నదో అట్టి యీ యుత్తమస్త్రీలు నేను.

శ౦. అక్షరాణామ్ = వర్ణములలో; అకారము నేను. సామాసికస్యచ= సమాస సమూహము సామాసికము, అందులో; ద్వంద్వసమాసము నేను. విశ్వతో ముఖః; ధాతా=కర్మఫలప్రదాత; నేను. సర్వహరః = సర్వమును హరించునట్టి; మృత్యువు నేను. భవిష్యతామ్ = రాఁబోవువానిలో; ఉద్భవః = అభ్యుదయము నేను. నారీణామ్=స్త్రీలలో; కీర్తి మొదలగు దేవతలు నేను.

మ. అక్షరాణామ్=సర్వవర్ణములలోను; అకారఃఅస్మి = అకార మగుచున్నాను. "అకారో వై సర్వా వాక్" అను శ్రుతివలన అకారము శ్రేష్ఠం బనుట ప్రసిద్ధము. సామాసికస్యచ=సమాససమూహములోపల; ద్వన్ద్వః = ఉభయపదార్థప్రధానమగుద్వంద్వసమాస మగుచున్నాను. పూర్వపదార్థప్రధానం బవ్యయీభావము, ఉత్తరపదార్థప్రధానము తత్పురుషము, అన్యపదార్థప్రధానము బహువ్రీహి, కావున నవి యుభయపదార్థసామ్యము లేమిచే నపకృష్టంబు లగుటవలన. క్షయవంత మగు కాలమున కభిమానియగు, అక్షయః=క్షయము లేని; కాలః=పరమేశ్వరాఖ్య మగు కాలము, "జ్ఞః కాలకాలో గుణీ సర్వవిద్యః" ఇత్యాదిశ్రుతి ప్రసిద్ధము; నేనే. కాలః కలయతా మహ మ్మనుచోట క్షయవంత మగు కాలము చెప్పఁబడిన దని భేదము. కర్మఫలవిధాతల లోపల; విశ్వతోముఖః=సర్వతోముఖుం డగు; ధాతా=సర్వకర్మఫలదాత యయిన యీశ్వరుఁడు; నే నని యర్థము. సంహారకర్తలలోపల, సర్వహరః=సర్వసంహారకర్త యగు; మృత్యువు నేను. భవిష్యతామ్=భావిశుభములలో; ఉద్భవశ్చ=ఉత్కర్ష మేది గలదో అది నేను. నారీణామ్ = స్త్రీలలోపల; కీర్తిః శ్రీః వాక్స్మృతిః మేధా ధృతిః క్షమా—ఈ యేడుగురు—ధర్మపత్నులు నేనే. అందు, కీర్తి—ధార్మికత్వముచే నుత్తముఁ డని నానా దేశముల లోకజ్ఞానవిషయ మయినఖ్యాతి. శ్రీ—ధర్మార్థకామసంపద, లేక, శరీరశోభ, కాంతి. వాక్కు—సరస్వతి, సర్వార్థప్రకాశక మయినసంస్కృతవాణి. చకారమునలన మూర్త్యాదిధర్మపత్నులును గ్రహింపఁబడుచున్నారు. స్మృతిః= బహుకాలమునకు మున్ననుభవించినయర్థమును స్మరించుశక్తి. మేధ—అనేకగ్రంథార్థ ధారణశక్తి. ధృతి—కష్టమువచ్చినను శరీరేంద్రియసంఘాతమును నిర్వికారముగా

♦ ఆకర్షింపఁబడినను కొట్టఁబడినను వాఙ్మనఃకాయంబుల దోషము లేనివాఁడై దేనిచే ఆక్రోశింపఁడో కొట్టఁడో అది క్షమ యని చెప్పఁబడినది.

నిలుపుశక్తి, లేక, ఉచ్ఛృంఖలముగాఁ బ్రవర్తించుటకుఁ గలిగినచాపలమును నివర్తించుశక్తి. క్షమ—హర్షవిషాదములయందుఁ జిత్తము వికారము నొందకుండుట. ఎవ్వరి యాభాసమాత్రసంబంధమునఁ గూడఁ బురుషుఁడు సర్వలోకాదరణీయుఁ డగునో అట్టి కీర్తిప్రభృతులకు సర్వస్త్రీలయందును ఉత్తమత్వ మతిప్రసిద్ధమే గదా!

శ్రీ. అక్షరాణామ్=వర్ణములలో; అకారము నేను, అది సర్వవాఙ్మయ మగుటచే శ్రేష్ఠం బగుటవలన. అట్లు శ్రుతి.—« అకారో వై సర్వా వాక్సైషా స్పర్శోష్మభిర్వ్యజ్యమానా బహ్వీ నానారూపా భవతి » ♦ అని. సామాసికస్య=సమాససమూహములో; ద్వన్ద్వః = రామకృష్ణులు ఇత్యాది సమాసము నేను, అది యుభయపదప్రధానం బగుటచే శ్రేష్ఠం బగుటవలన. అక్షయః=ప్రవాహరూప మగు; కాలము నేనే. కాలఃకలయతా మనుచోట ఆయుర్గణనాత్మక మయిన సంవత్సర శతాద్యాయుస్స్వరూప మగుకాలము చెప్పఁబడినది, అది యాయాయువు క్షయింపఁగా క్షయించుచున్నది, ఇచటనో ప్రవాహాత్మకమై యక్షయ మగుకాలము చెప్పఁబడిన దని విశేషము. కర్మఫలవిధాతలలో విశ్వతోముఖుం డగుధాత—సర్వకర్మఫల విధాత నే నని యర్థము. సంహారకారులలో సర్వహరుం డగుమృత్యువు నేను. భవిష్యతామ్ = రాఁబోవు కల్యాణములలో; ప్రాణులకు, ఉద్భవః = అభ్యుదయము నేను. నారీణామ్ = స్త్రీలలో; కీర్తిప్రభృతులు ఏడుగురు దేవతారూపిణులు స్త్రీలు నేను. ఎవ్వరి యాభాసమాత్రసంబంధము నొందినను బ్రాణులు శ్లాఘ్యు లగుచున్నారో అట్టి కీర్త్యాదిస్త్రీలు మద్విభూతులు.

ప. అక్షరాణామ్=సర్వవర్ణములలో; అకారః = మొదటిస్వరము, అది యంతటను అనుస్యూత మగుటవలన నేను. సామాసికస్య = తత్పురుషాది సమాస సమూహములో; ద్వన్ద్వః=రామకృష్ణులు ఇత్యాదిగా నుభయపదప్రధాన మగుసమాసము నేను. అక్షయము—అనాద్యనంత మగుకాలము నేనే. ధాతా=కర్మఫలప్రదాత యగు; విశ్వతోముఖః = విరాట్టు నేను. సర్వహరః = సర్వమును సంహరించునట్టి; మృత్యువు నేను. భవిష్యతామ్=పుట్టఁబోవు ప్రాణులకు; ఉద్భవః=వర్తమానకల్పానంతరము రాఁబోవు కల్పమునందుఁ బ్రాణులఁ బుట్టించువాఁడు నేనే. నారీణామ్=స్త్రీలింగవాచకములలో; కీర్త్యాదులు ఏడుగురు దేవతలు, వేనిసంపాదించి పురుషుఁడు శ్లాఘ్యుఁ డగునో అవి మద్విభూతులు. అందు, కీర్తియనఁగా నేది సత్పురుషులచే

♦ అకారమే సర్వవాక్కును, అది స్పర్శోష్మములచే వ్యజ్యమానమై యనేకమును నానారూపమును అగుచున్నది.

గానము చేయఁబడుచున్నదో అది, నటవిటాదులచేఁ జెప్పఁబడునది కాదు. శ్రీ—శోభ. వాక్కు—వాణి, దేనిచే సర్వప్రాణులవ్యవహారము నడుచుచున్నదో అది, అది నాలుగువిధములు పర పశ్యంతి మధ్యమ వైఖరి అని, «చత్వారి వాక్పరిమితా పదాని» అను శ్రుతివలన. వాని వేఱువేఱుస్వరూపము «బృహస్పతేః ప్రథమం వాచో అగ్రమ్» అను శ్రుతిచేఁ బ్రదర్శింపఁబడినది. మండలబ్రాహ్మణమునందును.—«సైషా త్రయ్యేవ విద్యాతపతి వాగ్వై తత్సర్వస్త్రీ వదతి» అని. అట్లు తాల్వోష్ఠపుటసంయోగమువలనఁ బుట్టినది వైఖరి. అది చెప్పఁబడినది శతశ్లోకియందు.—«యో వర్ణోచ్చారహేతోర్ఘటయతి రసనామ్" అని. అది రెండువిధములు రాష్ట్రి యనియు మంద్రయనియు. అందు రాష్ట్రసంబంధమువలనఁ బుట్టినది రాష్ట్రి, దేశభాష యని యర్థము. మంద్ర యనఁగా మననగమ్యము వేదవాణి, అట్లు మన్నిశ్వస్వరూపం బగుటవలన నావిభూతి యని యర్థము. ఈశ్రుతులకు శతశ్లోకీభాష్యమునందు మేము చక్కఁగా వ్యాఖ్యానము చేసియున్నారము, విస్తరభయంబున నిట వ్రాయలేదు.

తా. అక్షరంబులలో «అకారో వై సర్వావాక్» అని శ్రుతిసిద్ధముగు సర్వవర్ణంబులకును బ్రకృతియయిన అకారము నేను. సామాసికం బనఁగా సమాససమూహము, అందులో ద్వంద్వసమాసము నేను, అదిగదా యుభయపదార్థప్రధానం బగుటచే నుత్కృష్టము. కలాముహూర్తాదిమయమై యక్షయం బగు కాలము నేనే. సర్వంబునకును స్రష్ట యగుహిరణ్యగర్భుఁడు చతుర్ముఖుఁడు నేను. సర్వప్రాణహరుఁ డగుమృత్యువు నేను. పుట్టఁబోవువారిలో ఉద్భవాఖ్య మగు ♦ కర్మము నేను. కీర్తి నేను, శ్రీయు నేను, వాక్కును నేను, స్మృతియు నేను, మేధయు నేను, ధృతియు నేను, క్షమయు నేను.

బృహత్సామ తథా సామ్నాం గాయత్రీ ఛన్దసామహమ్
మాసానాం మార్గశీర్షోఽహ మృతూనాం కుసుమాకరః. ౩౫

ప్ర. తథా=అట్లు; సామ్నామ్=సామములలో; బృహత్సామ=బృహత్సామ మను పేరుగల సామము; నేను. ఛన్దసామ్=ఛందస్సులలో, గాయత్ర్యాదిచ్ఛందోవిశిష్టము లగుఋక్కులలో; గాయత్రీ = గాయత్రి యను ఋక్కు; అహమ్ = నేను. మాసానామ్ = మాసములలో; మార్గశీర్షః=

♦ పుట్టుట యను పేరుగలది యగు.

మార్గశీర్షమాసము; అహమ్=నేను. ఋతూనామ్=ఋతువులలో; కుసుమాకరః=వసంతఋతువు; నేను.

సామములలో బృహత్సామము నేను, ఛందోవిశిష్టఋక్కులలో గాయత్త్రి యనుఋక్కు నేను, మాసములలో మార్గశీర్షమాసము నేను, ఋతువులలో వసంతఋతువు నే నని తాత్పర్యము.

ఆ. వేదానాం సామవేదో౽స్మి యని చెప్పఁబడినది, అందవాంతర విశేషముఁ జెప్పుచున్నారు తథేత్యాదిగా. ఛందస్సులలో గాయత్త్రి యనుఛందస్సేదిగలదో అది నే ననుట యుక్తముగాదు, ఛందస్సులకు ఋక్కులకంటె వేఱు స్వరూపము లేమివలన, అని యాశంకించి చెప్పుచున్నారు గాయత్త్ర్యదిత్యాదిగా. ద్విజునకు ద్వితీయజన్మజనని యగుటవలన నని యర్థము. మార్గశీర్షః—మృగశీర్ష నక్షత్రముతోఁ గూడిన పూర్ణిమగలమాసము, అది నేను, పండినపైరులు గలదగుట వలన నని చెప్పుచున్నారు మాసానా మిత్యాదిగా. వసంతఋతువు నేను—రమణీయం బగుటవలన నని యర్థము.

హ. బృహత్సామ మనఁగా సామములలోఁ బ్రధాన మయినసామము. ఛన్దసామ్=ఛందోవిశిష్టము లయినఋక్కులలో; గాయత్త్రీ=గాయత్త్రి యనుఋక్కు నేను. కుసుమాకరః=వసంతర్తువు.

శం. సామవేదంబునందు రథంతరాది సామము లేవిగలవో వానిలో బృహత్సామము నేను. ఛన్దసామ్ = గాయత్త్ర్యాది చ్ఛందోవిశిష్టము లగుమంత్రములలో; గాయత్త్రీ=ఇరువదినాలు గక్షరములుగల గాయత్త్రి నేను. మాసానామ్=చైత్రాది మాసములలో; మార్గశీర్షము నేను. ఋతూనామ్=శిశిరాది ఋతువులలో; కుసుమాకరః=వసంతము నేను.

మ. వేదానాం సామవేదో౽స్మి యని చెప్పఁబడినది, అందిది మఱియొక విశేషము.—సామ్నామ్=ఋక్కుల యక్షరములతో నేర్పడు గీతవిశేషములలోపల; బృహత్సామః=“ త్వామిద్ధి హవామహే ” అను ఋక్కునందలి గీతివిశేషము బృహత్సామము; అది యతిరాత్రమునందుఁ బృష్ఠస్తోత్రము, సర్వేశ్వరునిఁగా నింద్రుని స్తుతించునది, ఇతరములకంటె శ్రేష్ఠ మగుటవలన నది నేను. ఛన్దసామ్=నియతాక్షర పాదత్వం బనుఛందస్సుతోఁ గూడిన ఋక్కులలోపల; గాయత్త్రీ=గాయత్త్రి యను ఋక్కు; ద్విజునకు ద్వితీయజన్మహేతు వగుటచేతను, ప్రాతస్సవనాది సవనత్రయ

వ్యాపి యగుటచేతను, త్రిష్టుబ్జగతులు సోమాహరణార్థము పోయి సోమమును బొందఁజాలక జగతి మూఁడక్షరములను త్రిష్టుప్పు ఒకయక్షరమును గోలుపోయి రాఁగా ఆనాలుగక్షరములతోఁ గూడ సోమమును దెచ్చుటచేతను సర్వశ్రేష్ఠమయిన గాయత్త్రి నేను. "చతురక్షరాణి హ వా అగ్రే ఛన్దాంస్యాసు స్తతో జగతీ సోమమచ్ఛాపతత్సా త్రీణ్యక్షరాణి హిత్వా జగామ తతస్త్రిష్టు ప్సోమమచ్ఛా పతత్సైకమక్షరం హిత్వా ఉపతత్తతో గాయత్త్రీ సోమమచ్ఛా పత త్సాతానిచా ఽక్షరాణి హరన్త్యాగచ్ఛ త్సోమంచ తస్మా దష్టాక్షరా గాయత్త్రీ" ♦ అని యుపక్రమించి "తదాహుర్గాయత్త్రాణి వై సర్వాణి సవనాని" అని శతపథశ్రుతి. "గాయత్త్రీ వా ఇదం సర్వమ్" ఇత్యాది చ్ఛాందోగ్యశ్రుతియును. మాసానామ్ = పంన్రెండు మాసములలోపల; క్రొత్తవరియును వాస్తూకశాకమును * మొదలగునవి కలదై శీతాతపశూన్యం బగుటచే సుఖహేతువగు, మార్గశీర్షః = మార్గశీర్షమాసము నేను. ఋతూనామ్ = ఆఱుఋతువులలోపల; కుసుమాకరః = సర్వసుగంధిపుష్పముల కాకరమై యతిరమణీయమైనవసంతము, "వసన్తే బ్రాహ్మణ ముపనయీత, వసన్తే బ్రాహ్మణోఽగ్ని నాదధీత, వసన్తే వసన్తే జ్యోతిషా యజేత, తద్వై వసన్త ఏవా భ్యారభేత। వసన్తో వై బ్రాహ్మణ స్యర్తుః" ఇత్యాదిప్రసిద్ధము; నేను.

శ్రీ. త్వామిద్ధిహవామహే అను ఋక్కునందు గానము చేయఁబడునది బృహత్సామము, దానిచే నింద్రుఁడు సర్వేశ్వరుఁడుగా స్తుతింపఁబడుచున్నాఁడు కావున నది శ్రేష్ఠము. ఛందోవిశిష్టము లగుమంత్రములలో గాయత్త్రీమంత్రము నేను, ద్విజత్వప్రయోజకం బగుటవలనను సోమము దెచ్చుటచేతను అది శ్రేష్ఠము. కుసుమాకరః = వసంతర్తువు.

ప. సామ్నామ్ = ఎనిమిదివేల పదునాలుగుసామములలో; ఈశ్వరస్తావకములు కొన్ని పావమాన్యములు రథంతరాదులు కలవు, వానిలో, బృహత్సామ = బృహత్సామ మనునది నావిభూతి. దీని మీఁదియధ్యాయమునందు స్పష్టముగా నిరూపించెదము అట్లు, ఛన్దసామ్ = ఉష్ణిగాదులలో; గాయత్త్రీ = గాయత్త్రం త్రా

♦ మున్ను నాలుగక్షరములు గలవై గదా ఛందస్సు లుండెను, అంత జగతి సోమమునొద్దకుఁ బోయెను, అది మూఁడక్షరములను విడిచివచ్చెను, అంత త్రిష్టుప్పు సోమమునొద్దకుఁ బోయెను, అది యొకయక్షరమును విడిచి వచ్చెను, అంత గాయత్త్రి సోమమునొద్దకుఁ బోయెను, అది యానాలుగక్షరములను సోమమును గొనివచ్చెను, అందువలన గాయత్త్రి యెనిమిదియక్షరములు గల దయ్యెను.

* ఒకదినుసు కూరాకు.

యతే—గానము చేయువాని రక్షించుచున్నది కావున గాయత్త్రి, ఇరువదినాలు గక్షరములు గలది, అటనుండి నాలుగక్షరములఁ బెంచుటచే నుష్ణిగాది చ్ఛందస్సులకు నిష్పత్తి యగును, అది పరమేశ్వరస్తావక మగుటచే నావిభూతి. ఎట్లనఁగా. “తత్సవితు ర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి । ధియో యోనః ప్రచోదయాత్”.— ఇందుకుఁ గణ్వసంహితాభాష్యము.—సవితుః=సర్వమునకును ప్రసవమును—ఉత్పత్తి నిచ్చునట్టి ఆదిత్యాంతర్గతపురుషునియొక్క, “యోసా వాదిత్యే” అను శ్రుతివలన; దేవస్య=ద్యోతమానునియొక్క, హిరణ్యగర్భోపాధ్యవచ్ఛిన్నము విజ్ఞానానందస్వభావ మగు బ్రహ్మముయొక్క; వరేణ్యమ్=సర్వోత్కృష్ట మగు; భర్గః=తేజస్సును; ధీమహి= ధ్యానించుచున్నాము. లేక. ఎట్టి తేజస్సును? సవితుః = సూర్యునకుఁ గూడ; వరేణ్యమ్=ఉపజీవ్య మయినదానిని, “య దాదిత్యగతం తేజః” అని చెప్పుటవలన. ఎట్టి పురుషునియొక్క? యః=ఎవ్వఁడు; నః=మాయొక్క; ధియః=బుద్ధులను; ప్రచోదయాత్=చక్కఁగాఁ బ్రేరించునో, అట్టి సవితృనివరేణ్యం బగు తేజస్సును ధ్యానించుచున్నా మని సంబంధము. ఇట నిది యభిప్రాయము —సత్యజ్ఞానానందాత్మకుం డగుసవిత—సర్వజగ దుపాదానాశ్రయుఁడు జగత్కర్త సర్వోపాధులచేఁ గ్రీడింపను ఆయాయుపాధిధర్మముల నుల్లసిల్లఁ జేయను స్వాకమనీయత్వాది మహిమలను బ్రదర్శింపను గోరి తాను వశీకృతమాయుఁడై సర్వాత్మలకు నాత్మభూతుఁడై యంతర్యామియై యేదేవుఁడు మాబుద్ధులను బ్రేరించునో “దదామి బుద్ధి యోగం తమ్” అని భగవద్వాక్యమువలన, అట్టి సవిత యగు దేవునియొక్క యాత్మభూతము వరేణ్యము— ధ్యానించువారి సంసారక్లేశములను దహించునది యగుభర్గమును—తేజస్సును పరమం బగుజ్యోతిని ఎల్లప్పుడును ధ్యానించుచున్నా మని యర్థము. అట్లు, మాసానామ్= పండ్రెంటిలో; మార్గశీర్షమాసము నేను. మాసములు చాంద్రమానముచే నగుచున్నది, చంద్రనక్షత్రములే వానికి నామములు, ఎట్లనఁగా, దేని పూర్ణిమయందుఁ జిత్తానక్షత్రము వచ్చునో అది చైత్రమాసము, అట్లు విశాఖాదినక్షత్రములచే వైశాఖాదిమాసము లగుచున్నవి, ప్రకృతమునందు మృగశిరస్సంబంధముచే మార్గశీర్షమాస మగుచున్నది, మృగశిరోనక్షత్రమునకు నాథుఁడు చంద్రుఁడు, అట్లు “స్వనామ నక్షత్ర సమాననాథా మాసాః” అని చెప్పుటవలన మాసనాథుఁడును అతఁడే, పూర్ణిమానాథుఁడును అతఁడే, ఇట్లు మాసనక్షత్రతిథు లేక దైవతంబు లగుటచేఁ బుణ్యతమంబులు, కావున నావిభూతి యని యర్థము. లేక. మృగశిరఃపూర్ణిమాసంబంధముచే వర్షాది చెప్పఁబడినది, దానియందే ఆగ్రహాయణి యని యభిధానము

కలుగుటవలన; అగ్రహాయణము ♦ దేనియందో అది ఆగ్రహాయణి యని యర్థము, అందువలననే ఆగ్రహాయణికం బని మార్గశీర్షమునకుఁ బేరు, కావున నీమాసము ముఖ్యం బగుటవలన విభూతి. అట్లు శిశిరాదు లగునాఱుఋతువులలో; కుసుమాకరః=వసంతము, నేను, సర్వానందకరం బగుటవలనను విషువాశ్రయం బగుటవలనను.

రా. సామములలో బృహత్సామము నేను, ఛందస్సులలో గాయత్రి నేను, కుసుమాకరః=వసంతర్తువు.

ద్యూతం ఛలయతా మస్మి తేజ స్తేజస్వినా మహమ్
జయో ఽస్మి వ్యవసాయో ఽస్మి సత్త్వం సత్త్వవతా మహమ్. ౩౬

భా. ఛలయతామ్ = ఛలమును * జేయువారియొక్క; ద్యూతమ్= పాచికలాడుట మొదలయిన జూదము; అస్మి =అగుచున్నాను. తేజస్వినామ్= తేజస్సుగల వారియొక్క; తేజః= తేజస్సు; అహమ్=నేను. జయః= జయించువారియొక్క జయము; అస్మి = అగుచున్నాను. వ్యవసాయః= ప్రయత్నము గలవారియొక్క ప్రయత్నము; అస్మి = అగుచున్నాను. సత్త్వవతామ్=సాత్త్వికులయొక్క; సత్త్వమ్=సత్త్వము; అహమ్=నేను.

పరవంచనము చేయువారి జూదము నేను, తేజస్సుగలవారి తేజస్సు నేను, జయించువారిజయము నేను, యత్నవంతులయత్నము నేను, సాత్త్వికులసత్త్వము నే నని తాత్పర్యము.

ఆ. అన్యాపదేశంబునఁ బరాభిమతమును జెడఁగొట్టుచు స్వాభిమతమును సాధించువారు చేయుసర్వస్వాపహారకారణ మయినద్యూతము నే నని చెప్పుచున్నారు ఛలమును ఇత్యాదిగా. తేజస్సు—అప్రతిహత మయినయాజ్ఞ. జయము—ఉత్కర్షము. వ్యవసాయము—ఫలహేతు వయినప్రయత్నము. సత్త్వము—సత్త్వకార్య మయిన ధర్మజ్ఞాన వైరాగ్యాదికము.

హ. ♦♦

శం. ఛలయతామ్=ఛలమును—కపటమును జేయువారిలో, మోసముచేఁ బరద్రవ్యము హరించువారిలో; ద్యూతమ్=సారెలతో నాడుట, సర్వస్వము హరించు

♦ మొదటి హాయనము—వర్షము.

* వంచనను.

♦♦ శంకరభాష్యముతో సమానము.

టకు సాధనము; నేను. తేజస్వినామ్=ప్రగల్భత గలవారిలో; తేజః=ప్రగల్భత నేను. జయించువారిలో, జయము నేను. వ్యవసాయః=ఉద్యోగము; అది గలవారిలో నేను.

మ. ఛలయతామ్=ఛలమును—పరవంచనమును జేయువారియొక్క; ద్యూతమ్=అక్షక్రీడాదిరూపము, సర్వస్వాపహరణకారణము; అస్మి=నేనగుచున్నాను. తేజస్వినామ్=మిక్కిలి యుగ్రమయినప్రభావము గలవారియొక్క; తేజః = అప్రతిహతమగునాజ్ఞ నేను. జయించువారియొక్క, జయః = పరాజితులకంటె నుత్కర్షము; నేను. వ్యవసాయము కలవారియొక్క, వ్యవసాయః = తప్పక ఫలముగలిగించునట్టి ప్రయత్నము నేను. సత్త్వవతామ్=సాత్త్వికులయొక్క; సత్త్వమ్—ధర్మజ్ఞానవైరాగ్యైశ్వర్యాదిలక్షణ మగుసత్త్వకార్య మిట సత్త్వ మని చెప్పఁబడినది, అది నేను.

శ్రీ. ఛలయతామ్=ఒండొరులను వంచించువారియొక్క; ద్యూతము నేను. తేజస్వినామ్ = ప్రభావము గలవారియొక్క; తేజః=ప్రభావము నేను. జయశీలుర జయము నేను. ఉద్యోగవంతులయొక్క; వ్యవసాయః = ఉద్యోగము నేను. సత్త్వవతామ్=సాత్త్వికులయొక్క; సత్త్వము నేను.

ప. ఛలయతామ్ = అన్యోన్యవంచనపరులయొక్క; ద్యూతమ్ = అధికమయినమోహము గలిగించునట్టి జూదము, దేనిచే ధర్మరాజప్రభృతులుగూడ మోహితులై యేమియు నెఱుంగరైరో అది; నావిభూతి. సత్త్వవతామ్ = సాత్త్వికులయొక్క; సత్త్వగుణము నేను.

రా. ఛలము ♦ చేయువారియొక్క ఛలసాధనములలో అక్షక్రీడాదిలక్షణమయినద్యూతము నేను. జయించువారియొక్క జయము నేను; వ్యవసాయవంతులయొక్క వ్యవసాయము నేను; సత్త్వవంతులసత్త్వము—గొప్పమనస్సుగలుగుట నేను.

వృష్ణీనాం వాసుదేవో ఽస్మి పాణ్డవానాం ధనఞ్జయః
మునీనా మప్యహం వ్యాసః కవీనా ముశనా కవిః. ౩౭
దణ్డో దమయతా మస్మి నీతి రస్మి జిగీషతామ్
మౌనం చైవా ఽస్మి గుహ్యానాం జ్ఞానం జ్ఞానవతా మహమ్. ౩౮

భా. వృష్ణీనామ్=వృష్ణివంశమునఁ బుట్టినవారలలో; వాసుదేవః=వసుదేవపుత్త్రుఁడు; అస్మి=అగుచున్నాను. నీయీచెలికాఁడే నేను. పాణ్డవా

♦ మోసము.

నామ్=పాండుపుత్త్రులలో; ధనఞ్జయః=అర్జునుఁడు, నీవే; అగుచున్నాను. మునీనామపి = మననశీలురలోఁ గూడ, సర్వపదార్థజ్ఞానము గలవారిలోఁ గూడ; వ్యాసః=వ్యాసుఁడు; అహమ్=నేను. కవీనామ్ = క్రాంతదర్శులలో *; కవిః=కవియగు; ఉశనాః=శుక్రుఁడు; నేను. దమయతామ్=దమించువారియొక్క; దణ్డః=అదాంతులను దమకారణ మయినదండము; అస్మి= అగుచున్నాను. జిగీషతామ్ = జయింపఁ గోరువారియొక్క; నీతిః=నీతి; అస్మి=అగుచున్నాను. గుహ్యానామ్=దాఁచఁదగిన వానికి; మౌనంచైవ= మౌనము; అస్మి=అగుచున్నాను. జ్ఞానవతామ్=జ్ఞానము గలవారియొక్క; జ్ఞానమ్=జ్ఞానము; అహమ్=నేను.

యాదవులలో నీకుఁ దెలియుగు నీవాసుదేవుఁడు నేను, పాండవులలో నర్జునుఁడవు నీవు నేను, మునులలో వ్యాసుఁడు నేను, కవులలో శుక్రుఁడు నేను, ఉత్పథమునఁ బ్రవర్తించువారిని నిగ్రహించువారు చేయునిగ్రహము నేను. జయింపఁగోరువారు చేయు జయోపాయ మయిననీతి నేను, రహస్యములలో మౌనము నేను, జ్ఞానవంతుల జ్ఞానము నే నని తాత్పర్యము.

రా. ఇట రెండవకవిశబ్దము యౌగికము, రూఢముకాదు, పునరుక్తివలన. అదాంతులను—ఉత్పథప్రవృత్తులను సన్మార్గమునందుఁ బ్రవర్తింపఁ జేయువారియొక్క దండము—ఉత్పథప్రవృత్తినుండి నిగ్రహహేతువు నే నని యర్థము. నీతి—న్యాయము, జయోపాయధర్మమును బ్రకాశింపఁజేయునది. మౌనమ్=మాటలాడకుండుట. లేక, ఉత్తమమయిన చతుర్థాశ్రమప్రవృత్తి. జ్ఞానము—శ్రవణాదిద్వారమునఁ బరిపక్వసమాధివలనఁ బుట్టినది.

హ. మునీనామ్ = మననశీలురలో, సకలపదార్థ తత్త్వజ్ఞానులలో. కవీనామ్=క్రాంతదర్శులలో. దమయతామ్ = దమించువారియొక్క; దణ్డః=అదాంతుల దమించుటకు హేతు వగుదండము నేను. నీతిః=షాడ్గుణ్యము. గుహ్యానామ్=గోప్యములయొక్క; గోపనహేతు వగుమౌనము నేను.

శ్రీ. కవీనామ్=తత్త్వజ్ఞులలో; ఉశనాః=శుక్రుఁడు, నేను. దమయతామ్= దుష్టులశిక్షను జేయువారియొక్క; దణ్డః=దండనక్రియ నేను. జిగీషతామ్=జయింపఁ గోరువారియొక్క; నీతిః=న్యాయము, శాస్త్రీయ మగుధర్మమార్గ మేదిగలదో అది;

* కడచినదాని నెఱింగినవారిలో.

నేను. గుహ్యానామ్=గోపనీయములలో; మౌనమ్ = మననశీలత్వ మేదిగలదో అది; నేను. జ్ఞానవతామ్; జ్ఞానమ్=ముక్తిసాధన మగు బ్రహ్మాత్మైక్యవిషయజ్ఞాన మేదిగలదో అది; నేను.

మ. సాక్షాదీశ్వరునిఁ గూడ విభూతులలోఁ బఠించుట తద్రూపంబున ధ్యానార్థం బని మున్నే చెప్పఁబడినది. వృష్ణీనామ్=వృష్ణులలో; వాసుదేవః=వసుదేవ పుత్త్రుఁ డని ప్రసిద్ధుఁడు, నీ కుపదేశించువాఁడు వీఁడు; నేను. అట్లు పాండవులలో, ధనఞ్జయః—నీవే; నేను. మునీనామపి=మననశీలురలోఁ గూడ; వేదవ్యాసుఁడు నేను. కవీనామ్=క్రాంతదర్శులలో—సూక్ష్మార్థవివేకులలో; కవిః=కవియని ప్రసిద్ధుఁడయిన; ఉశనా=శుక్రుఁడు నేను. దమయతామ్ = దుర్మార్గులను సన్మార్గమునందు నిలుపువారి యొక్క; దుర్మార్గప్రవృత్తి గలిగినపుడు నిగ్రహహేతు వగుదండము నేను. జిగీష తామ్=జయింపఁ గోరినవారియొక్క; నీతిః=జయోపాయప్రకాశక మగున్యాయము; నేను. గుహ్యానామ్=గోప్యములయొక్క; గోపనహేతు వగు; మౌనమ్ = నోరుమూయుట, నేను. ఊరకయున్నవాని యభిప్రాయము తెలియరాదుగదా! లేక, గుహ్యానామ్=గోప్యములలో; మౌనమ్=సన్న్యాసశ్రవణమననపూర్వక మగు ఆత్మనిదిధ్యాసనము; నేను. జ్ఞానవతామ్=జ్ఞానులయొక్క; జ్ఞానమ్ = శ్రవణమనన నిదిధ్యాసనముల వలనఁ బుట్టినదై యద్వితీయాత్మ సాక్షాత్కారరూపమై సర్వాజ్ఞానవిరోధి యగుజ్ఞాన మేదిగలదో అది; నేను.

శ్రీ. వాసుదేవః = వసుదేవపుత్త్రుఁడు; ఎవ్వఁడు నీ కిప్పు డుపదేశించుచున్నాఁడో అతఁడు; నేను. ధనఞ్జయః—నీవే; నావిభూతి. మునీనామ్ = వేదార్థ మననశీలురలో; వేదవ్యాసుఁడు నేను. కవీనామ్=క్రాంతదర్శులలో; ఉశనా=ఉశనుఁ డనుపేరుగల; కవిః=శుక్రుఁడు; నేను. దమయతామ్=దమనము చేయువారియొక్క; దండము నేను, దేనిచేఁ గట్టు లేనివారుగూడ కట్టు నొందుదురో ఆదండము నా విభూతి. జయింపఁగోరువారియొక్క సామాద్యుపాయరూప మయిననీతి నేను. గుహ్యానామ్=గోప్యములయొక్క; గోపనహేతువగు, మౌనమ్=పలుకకుండుట; నేను. ఊరకయున్నవానియభిప్రాయ మెఱుఁగ శక్యము గాదు కదా! జ్ఞానవతామ్=తత్త్వ జ్ఞానము గలవారియొక్క; జ్ఞాన మేది గలదో అది నేను.

ప. యాదవులలోపల, వాసుదేవః = వసుదేవునికొడుకైన బలభద్రుఁడు, నేను. అట్లు గానిచో ఒక్కనికే ముఖ్యత్వంబును విభూతిత్వంబును ఉపపన్నము కాదు. పాండవులలో, ధనఞ్జయః—నీవు నా విభూతి. ♦.

♦ తక్కినది శ్రీధరీయముతో సమానము.

రా. వసుదేవపుత్త్రత్వము విభూతి, అనన్యార్థము లేమివలననే. పాండవులలో ధనంజయుఁడు—అర్జునుఁడు నేను. మునులనఁగా మననముచే అర్థతత్త్వము నెఱుంగువారు, వారిలో వ్యాసుఁడు నేను. కవులనఁగా విపశ్చితులు. నియమము నతిక్రమించినప్పుడు దండించువారియొక్క దండము నేను. విజిగీషువులయొక్క జయోపాయభూతమయిన నీతి నేను. గుహ్యములయొక్క గోపనములలో మౌనము నేను. జ్ఞానవంతుల జ్ఞానము నేను.

మ. వాసయతి—ఆచ్ఛాదించుచున్నాఁడు సర్వమును, వసతి—వసించుచున్నాఁడు సర్వత్ర, కావున వాసువు. దేవశబ్దార్థము చెప్పఁబడినది మున్ను. "ఛాదయామి జగద్విశ్వం భూత్వా సూర్య ఇవాంశుభిః । సర్వభూతాధివాసశ్చ వాసుదేవస్తతో ఽస్మ్యహమ్" ♦ అని మోక్షధర్మమునందు. సర్వముకన్నను విశిష్టుఁడు—అధికుఁడు, ఆ—అంతటను, సః—అతఁడే, కావున వ్యాసుఁడు. అట్లు అగ్నివేశ్యశాఖయందు.—"సవ్యాసో వీతి తమప్ వై విః సో ఽధస్తాత్స ఉత్తరత స్సపశ్చాత్సపూర్వస్తాత్సదక్షిణతస్స ఉత్తరత ఇతి" అని * "యచ్చకించిజ్జగత్యస్మిన్ దృశ్యతే శ్రూయతే ఽపివా । అన్తర్బహిశ్చ తత్సర్వం వ్యాప్య నారాయణస్స్థితః" ♦♦ అనియు.

యచ్చాఽపి సర్వభూతానాం బీజం తదహ మర్జున
న తదస్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్. ౩౯

భా. యచ్చాపి = ఏది; సర్వభూతానామ్ = సమస్తభూతములకును; బీజమ్ = ప్రరోహకారణము; కలదో; తత్ = అదియు; అహమ్ = నేను. అర్జున=అర్జునా! ప్రకరణము నుపసంహరించుకొనుచు విభూతిసంక్షేపము చెప్పుచున్నాఁడు.—మయావినా = నాచేతఁగాక; యత్ = ఏది; స్యాత్ = ఉండునో; తత్ = అట్టి; భూతమ్ = భూతము; చరాచరమ్ = చరముగాని అచ

♦ కిరణములచేత సూర్యునివలె సమస్తమయినజగత్తును బొంది యాచ్ఛాదించుచున్నాను, సర్వభూతాధివాసుఁడను గూడ, అందువలన వాసుదేవుఁ డని చెప్పఁబడితిని.

* అతఁడు వ్యాసుఁడు, వి—ఉత్తముఁడు కావున, వి అనుదానికి ఉత్తమమనిగదా యర్థము, సః—అతఁడు క్రిందను అతఁడు మీఁదను అతఁడు పడమరను అతఁడు తూర్పునను అతఁడు దక్షిణమునను అతఁడు ఉత్తరమునను—అందువలన.

♦♦ ఏది యేది యీజగత్తునందుఁ గనఁబడుచున్నదో వినఁబడుచున్నదో దాని సర్వంబును లోపలను వెలుపలను వ్యాపించి నారాయణుం డున్నవాఁడు.

రముగాని; నాస్తి = లేదు. నాచేత నపకృష్టము ♦ పరిత్యక్తమై నిరాత్మకంబై శూన్యముగదా యని యగును. అందువలన సర్వంబును మదాత్మకం బని యర్థము.

అర్జునా! సర్వభూతంబులకును బ్రరోహకారణ మేది గలదో అది నేను. చరముగాని స్థావరముగాని యేవస్తువును నన్ను విడిచియుండునది లేదని తాత్పర్యము.

**ఆ.** జాడ్యమాత్రప్రతిబింబిత మయినచైతన్యము బీజము. ఏమి స్థావరముగాని జంగమము గాని నిన్ను విడిచి యుండునది లేదా? అనఁగాఁ జెప్పుచున్నారు మయా వినా ఇత్యాదిగా. దానికిని స్వరూపముచే సత్త్వము నాశంకించి చెప్పుచున్నారు శూన్యము గదా అని. ఆత్మహీనం బగుటవలన నని యర్థము. అందువలన—సచ్చిదానందస్వరూపుఁడ నగు నాచేతనే సర్వమును సిద్ధించుటవలన.

**హ.** *

**శం.** యచ్చ=ఏది; సర్వభూతానా మపి = ఆకాశాదిసమస్తభూతములకును; బీజమ్ = సంభవకారణము అవ్యాకృతాఖ్య మగు జగద్యోని కలదో; తత్ = అది; అహమ్ = నేను. ఇందుచే, కార్యము కారణమాత్రం బగుటవలన సర్వంబును నేనే యని సూచింపఁబడినది. సిద్ధ మయినయర్థమునే వ్యతిరేకముఖంబునఁ జెప్పుచున్నాఁడు.—మయా వినా = సచ్చిదానందస్వరూపము అనంత మగు బ్రహ్మముచేతఁ గాక, మత్సత్తచే అవ్యాప్తమై మద్భిన్న మైనట్టి; చరాచరం భూతమ్ = జంగమము గాని స్థావరము గాని వస్తువు; యత్ = ఏది; స్యాత్ = అగునో; తత్ = అది; జగత్త్రియమునందును, నాస్తి—లేదు. మద్వ్యతిరిక్తము సత్తుగాని యసత్తుగాని యేదియు నెందును ఎవ్వనిచేతను సంభావింప శక్యము గా దని యర్థము. ఇందుచే సర్వంబును నేనే యని సిద్ధము, « బ్రహ్మైవేదం సర్వమ్ » అను శ్రుతివలన.

**మ.** మఱియు నేది సర్వభూతంబులకును బ్రరోహకారణ మగు బీజము గలదో అట్టి మాయోపాధిక మయినచైతన్యము నేనే. ఓయర్జునా! మయా వినా; యత్; స్యాత్ = అగునో; చరము గాని యచరము గాని, భూతమ్ = వస్తువు; అది యుండనే యుండదు, సర్వంబును మత్కార్యం బగుటవలన నని యర్థము.

**శ్రీ.** ఏది సర్వభూతములకును బ్రరోహకారణ మగుబీజము గలదో అది

♦ హీనము.

* శంకరభాష్యముతో సమానము.

నేను. అందుకు హేతువు.—మయా వినా; యత్స్యాత్; అట్టి చరము గాని యచరము గాని భూతము కలుగనే కలుగదు.

ప. బీజమ్ = ప్రరోహకారణము. అది నేను. దానినే దృఢీకరించుచున్నాఁడు.—యత్; మయా వినా స్యాత్ = మద్వ్యతిరేకంబున నుండునో; అట్టిది లేదు. ఎందువలన ననఁగా, అన్నరూపుఁడను నేను; అన్నమువలన రేతస్సు, రేతస్సువలన సర్వంబును.

రా. సర్వభూతములకును సర్వావస్థావస్థితంబులకును తత్తదవస్థాబీజభూతము తెలియవచ్చునది గాని తెలియ రానిది గాని యేది గలదో అది నేనే. భూతజాతము అన్యమై యున్న నన్ను విడిచి యేది యుండునో అది లేదు, "అహ మాత్మా గుడాకేశ సర్వభూతాశయస్థితః" అని ప్రక్రమమువలన "నతదస్తి వినా యత్స్యాన్మయా భూతం చరా ఽచరమ్" అను నిచ్చటఁ గూడ ఆత్మభావంబున నవస్థానమే వివక్షితము. సమస్తవస్తుజాతంబును సర్వావస్థంబును ఆత్మభూతుఁడ నగు నాతో యుక్తమై యుండు నని యర్థము. ఇందుచే, ఈసామానాధికరణ్యనిర్దేశమున కంతటను ఆత్మభావంబున నవస్థానమే హేతు వని ప్రకటించుచున్నాఁడు.

మా. మయా వినా యత్ భూతం స్యాత్, తన్నాస్తి. "విశ్వరూప అనన్తగతి రనన్తభాగ అనన్తగ అనన్తః" * ఇత్యాదిగా మోక్షధర్మమునందు.

నాన్తోఽస్తి మమ దివ్యానాం విభూతీనాం పరన్తప
ఏష తూద్దేశతః ప్రోక్తో విభూతే ర్విస్తరో మయా. ౪౦

భా. మమ = నాయొక్క; దివ్యానామ్ = అప్రాకృతము లయిన; విభూతీనామ్ = విస్తారములకు; అన్తః= తుది; నాస్తి = లేదు. పరన్తప = శత్రువులఁ దపింపఁజేయువాఁడా! సర్వాత్మకుఁ డగునీశ్వరుని దివ్యవిభూతుల యియత్తను జెప్పుటకుఁ గాని యెఱుఁగుటకుఁ గాని యెవ్వనికిని శక్యము గాదు గదా! ఏషః = ఈ; విభూతేః = విభూతియొక్క; విస్తరస్తు = విరివియో; ఉద్దేశతః= ఏకదేశమున; మయా= నాచేత; ప్రోక్తః= చెప్పఁబడినది.

---

* విశ్వము రూపము — ప్రతిమ గాఁ గలవాఁడు, అనంతములగు గతి — ఆశ్రయ మయినవాఁడు, అనంతము లయినభాగములు—అవతారములు గలవాఁడు, అనంతపదార్థములను బొందినవాఁడు, కాలాద్యపరిచ్ఛిన్నుఁడు.

అర్జునా! నాదు దివ్యవిభూతుల కంతము లేదు. నాయనంతవిభూతులలో నేకదేశ భూత మయిన విభూతివిస్తరము మాత్రమే నీ కిప్పుడు చెప్పితి నని తా.

ఆ. దివ్యవిభూతులు పరిమితంబు లనుశంకను వారించుచున్నాఁడు పూర్వార్ధముచేత. దానినే యుపపాదించుచున్నారు సర్వాత్ముఁడు ఇత్యాదిగా. అప్పు డెట్లు విభూతివిస్తరము చెప్పితివి? అనఁగాఁ జెప్పుచున్నాఁ డుత్తరార్ధముచేత.

హ. *

శం. ఎందువలన జగత్తు సమస్తంబును నావిభూతియే యగుచున్నదో అందువలన నావిభూతుల కంతము లే దని చెప్పుచున్నాఁడు.—నిర్విశేష మగుపర బ్రహ్మమునందు స్వవికారంబు లగు మహదాదులతోఁ గూడ ఆవిర్భావతిరోభావముల చే దీవ్యతి—క్రీడించుచున్నది కావున దివ్య యనఁగా త్రిగుణాత్మక మగుమాయ, దానివలనఁ బుట్టినవి దివ్యములు, అట్టి; మమ=నాయొక్క, బ్రహ్మముయొక్క; విభూతీనామ్=విభూతులకు; అంతము లేదు. నామాయాశక్తులును తద్వికారములును అనంతము లగుటవలన నావిభూతు లనంతములు, అందువలన వానికి అంతము—ఇయత్త లే దని యర్థము. ఓయీ! "ఆదిత్యానా మహం విష్ణుః" ఇత్యాదిగా నెట్లు చెప్పితివి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఏది యిప్పుడు నీకు, విభూతేః విస్తరః మయా ప్రోక్తః. ఏషతు=ఇదియో; ఉద్దేశతః=ని న్నుద్దేశించి సంక్షేపంబునఁ జెప్పఁ బడినది కాని విస్తరంబునఁ గాదు. బ్రహ్మము నగు నావిభూతి సాకల్యంబున శతకోటి కల్పంబులకును చెప్పను ఎఱుంగను శక్యము గా దని యర్థము.

మ. ప్రకరణార్థ ముపసంహరించుచు విభూతిని సంక్షేపించుచున్నాఁడు.—పరన్తప = పరులను—శత్రువులను కామక్రోధలోభాదులను తపింపఁ జేయువాఁడా! మమ; దివ్యానామ్; విభూతీనామ్; అన్తః=ఇయత్త ♦; నాస్తి. కావున సర్వజ్ఞుఁడు గూడ దాని నెఱుంగను జెప్పను శక్తుండు కాఁడు, సర్వజ్ఞత సన్మాత్రవిషయం బగుట వలన. ఏషతు; నీకు, ఉద్దేశతః=ఏకదేశంబున; విభూతే ర్విస్తరః; మయా; ప్రోక్తః.

శ్రీ. ప్రకరణార్థము నుపసంహరించుచున్నాఁడు.—విభూతు లనంతము లగుటవలన నవి సాకల్యంబునఁ జెప్ప శక్యము గావు. ఏషతు; విభూతే ర్విస్తరః; ఉద్దేశతః=సంక్షేపంబున; ప్రోక్తః.

---

* దీనికి హనుమద్వ్యాఖ్యానము లేదు.

♦ ఇంతమాత్ర మనుకొలఁది.

ప. *

రా. మమ; దివ్యానామ్ = కల్యాణము లయిన; విభూతీనామ్; అన్తః; నాస్తి. ఏషతు విభూతే ర్విస్తరః మయా; కొన్నియుపాధులను బట్టి సంక్షేపంబునఁ జెప్పఁబడినది.

మా. **

యద్య ద్విభూతిమ త్సత్త్వం శ్రీమ దూర్జిత మేవవా
తత్త దేవా ఽవగచ్ఛ త్వం మమ తేజోంఽశసంభవమ్. ४౧

భా. యద్యత్=ఏదేది; లోకమునందు, విభూతిమత్=విభూతి † గలదియు; శ్రీమత్ = శ్రీ యనఁగా లక్ష్మి, అది గలదియు; ఊర్జితమేవవా= ఉత్సాహముతోఁ గూడినదియుఁ గాని; సత్త్వమ్=వస్తువు; కలదో, తత్త దేవ=అద్దానినే; మమ = నాయొక్క, ఈశ్వరునియొక్క; తేజోంశసమ్భవమ్=తేజస్సుయొక్క అంశము—ఏకదేశము సంభవము ‡ గాఁ గలదానిఁగా; త్వమ్=నీవు; అవగచ్ఛ=ఎఱుంగుము.

లోకంబున నేయేవస్తువు ఐశ్వర్యవంతమై గాని, శ్రీమంత మయి బలాద్యతిశయము గలదై గాని యుండునో, ఆయావస్తువును నా తేజస్సుయొక్క యంశమునఁ బుట్టినదానిఁగా నీ వెఱుంగు మని తాత్పర్యము.

శ్రీ. పరమేశ్వరునివిభూతులను జెప్పనివానిని గూడ సంగ్రహించుటకై లక్షణముఁ జెప్పుచున్నాఁడు.—వస్తువు—ప్రాణిజాతము. శ్రీమత్ = సమృద్ధి గలది, లేక కాంతి గలది. ఊర్జిత మనఁగా సప్రాణము బలవంత మని యర్థము, దానిఁ జెప్పుచున్నారు ఉత్సాహముతో నిత్యాదిగా. సంభవించుచున్నది దీనివలనఁ గావున సంభవము, తేజస్సుయొక్క—చైతన్యముయొక్క, లేక, ఈశ్వరశక్తియొక్క అంశము తేజోంశము, అది సంభవముగాఁ గలది కావున తేజోంశసంభవము. దానిఁ జెప్పుచున్నారు తేజస్సుయొక్క ఇత్యాదిగా.

---

* శ్రీధరీయముతో సమానము.

** ఇందుకు మాధ్వభాష్యము లేదు.

† ఐశ్వర్యము.

‡ ఉత్పత్తికారణము.

హ. తేజస్సుయొక్క అంశము తేజోంశము, అది సంభవము—కారణము గాఁ గలది తేజోంశసంభవము.

శం. ఓయీ! ఇట్లయినయెడ నీవిభూతివిశేషమును లోకంబున నెట్లె ఱుంగవలయును? అనఁగా, ఈచెప్పఁబోవులక్షణములచే నెఱుంగవలయు ననునభిప్రాయముచేఁ జెప్పుచున్నాఁడు.—ఈలోకమునందుఁ గాని పరలోకమునందుఁ గాని, యద్యత్ సత్త్వమ్=ఏయేవస్తువు, చేతనము గాని యచేతనము గాని; విభూతిమత్=విభూతి—ప్రాజాపత్యముయొక్క ♦♦ గాని ప్రధానముయొక్క గాని ధనముయొక్క గాని పుణ్యముయొక్క గాని విద్యయొక్క గాని తపస్సుయొక్క గాని శౌర్యధైర్యౌదార్యశమదమాదిసద్గుణములయొక్క గాని జ్ఞానముయొక్క గాని సమృద్ధి, అది గలది విభూతిమంతము, అట్టిదై కనఁబడుచున్నదో; అట్లు, ఊర్జితమ్ = ఓజస్సుచేఁ గాని తేజస్సుచేఁ గాని వేగముచేఁ గాని బలముచేఁ గాని పౌరుషముచేఁ గాని సారముచేఁ గాని యాకారముచేఁ గాని దార్ఢ్యముచేఁ గాని యుత్సాహముచేఁ గాని మిక్కిలి గొప్పదియై కనఁబడుచున్నదో; అట్లు, శ్రీమత్=శ్రీ—శోభ గాని లక్ష్మి గాని కాంతి గాని సరస్వతి గాని బుద్ధి గాని కీర్తి గాని స్ఫూర్తి గాని కలది శ్రీమంతము, అట్టిదై యేదేది కనఁబడుచున్నదో; తత్తత్=ఆయావస్తువును; మమ—పరమేశ్వరునియొక్క; తేజోంశసంభవమ్ = సద్గుణములచే నాయొక్క ప్రభావమును తేజయతి—ప్రకాశింపఁజేయుచున్నది కావున తేజస్సనఁగా నాశక్తి, దానియొక్క అంశము—కల, అదియే సంభవము—ఉత్పత్తికారణముగాఁ గలదానిఁగా; అవగచ్ఛ. ఇది పరమేశ్వరుని విభూతివిశేషం బని నీవెఱుంగు మని యర్థము.

మ. చెప్పనివానిని గూడ భగవద్విభూతులను సంగ్రహించుటకై యుపలక్షణ మిది చెప్పుచున్నాఁడు.—యద్యత్; సత్త్వమ్=ప్రాణి; విభూతిమత్=ఐశ్వర్యయుక్తమును; అట్లు, శ్రీమత్=శ్రీ—లక్ష్మి సంపత్తు శోభ, లేక కాంతి, అది గలదియును; అట్లు, ఊర్జితమ్=బలాద్యతిశయము గలదియును, అగునో, తత్తదేవ; మమ=నాయొక్క; తేజస్సుయొక్క—శక్తియొక్క యంశముచేఁ బుట్టినదానిఁగా; త్వమ్; అవగచ్ఛ=ఎఱుంగుము.

శ్రీ. వెండియు నాకాంక్షించుచున్నయర్జునునకు ఎన్నో యొకవిధమున సాకల్యమునఁ జెప్పుచున్నాఁడు.—విభూతిమత్=ఐశ్వర్యయుక్తము; శ్రీమత్ = సంప

♦♦ జనపతిత్వముయొక్క.

ద్యుక్తము; ఊర్జితమ్=ఒకానొక ప్రభావబలాదిగుణముచే గొప్పది; యద్యత్ సత్త్వమ్=ఏదేని వస్తుమాత్రము గలదో; తత్తదేవ; మమ; తేజస్సుయొక్క—ప్రభావముయొక్క యంశముచేఁ బుట్టినదానినిగా నెఱుంగుము.

ప. ఇఁక విభూతులకు సాధారణలక్షణముఁ జెప్పుచున్నాఁడు —యద్యత్; విభూతిమత్=ఐశ్వర్యయుక్తము; శ్రీమత్=శోభాతిశయము గలది; ఊర్జితమ్=ఒకానొకగుణముచే గొప్పతనముగలది; సత్త్వమ్=ప్రాణివిశేషము గలదో. అద్దాని నా తేజోంశసంభవమునుగా నెఱుంగుము.

రా. యద్యత్; విభూతిమత్=ఈశితవ్యసంపన్న మగు; సత్త్వమ్ = భూతజాతము; శ్రీమత్ = కాంతిమంతము, లేక, ధనధాన్యసమృద్ధము; ఊర్జితమ్=కల్యాణారంభములయం దుద్యుక్తము; అగునో, తత్తత్; మమ; తేజోంశసంభవం బని యెఱుంగుము. తేజ స్సనఁగా పరాభిభవనసామర్థ్యము, అచింత్యశక్తి యగు నా యొక్క నియమనశక్త్యేకదేశమునఁ బుట్టినదానిఁగా నని యర్థము.

మా. యద్యద్విభూతిమత్ అని విస్తరము ప్రతిపాదింపఁబడినది. విష్ణ్వాదులు తత్స్వరూపములే. ఇతరములు తేజోయుక్తములు. అట్లు పైంగఖిలముల యందు.—« విశేషకా రుద్రవై స్త్వన్ద్రిదేవా రాజన్యాద్యా అంశయుతాన్య జీవాః ।
కృష్ణ వ్యాసౌ రామకృష్ణౌ చ రామ కపిల యజ్ఞప్రముఖా స్స్వయం సః » ♦ అని. « సఏవ వైకో భార్గవ దాశరథి కృష్ణా ద్యా స్త్వంశయుతాన్య జీవాః » * అని గాత ఖిలములయందు. « ఋషయో మనవో దేవ మనుపుత్త్రా మహౌజసః । కలా స్సర్వే హరే రేవ సప్రజాపతయః స్మృతాః । ఏతే స్వాంశకలాః పుంసః కృష్ణస్తు భగవాన్ స్వయమ్ » ♦♦ అని భాగవతమునందు ఋష్యాదులు అంశయుతు లని చెప్పి వరాహాదులను స్వరూపముగాఁ జెప్పుచున్నది. తుశబ్ద మేవార్థకము. ఇతర విశేష మెందును గానరాదు. అంశత్వము కృష్ణునందును దెలియవచ్చుచున్నది « ఉద్బబర్హాత్మనః కేశౌ » అని. మృడయన్తి యని బహువచనంబు గూడ అయు

♦ గరుడానంతచతుర్ముఖులును రుద్రుఁడును భృగువును ఇంద్రుఁడును దేవతలును ఇతరరాజులును అంశయుతులైనయితరజీవులు. కృష్ణుఁడును—ధర్మపుత్త్రుఁడును వ్యాసుఁడును రామకృష్ణులును పరశురాముఁడును కపిలుఁడును యజ్ఞుఁడు మొదలగువారు పరమేశ్వరుఁడే యగుదురు.

* అతఁడే యొక్కఁడు, భార్గవదాశరథికృష్ణాదులు అంశయుతులు అన్యజీవులు.

♦♦ ఋషులును మనువులును మహాప్రభావు లగు మనుపుత్త్రులును ప్రజాపతులును హరియొక్క కల లని చెప్పఁబడిరి, వీరు పరమపురుషుని స్వాంశకలలు. కృష్ణుఁడే సాక్షాద్భగవంతుఁడు.

స్తేము. నడుమ నితరమును జెప్పి పూర్వమును బరామర్శింపక మున్ను చెప్పినదాని వ్యాపారము చెప్పుట యెచటనుం గానరాదుగదా!

అథవా బహునైతేన కిం జ్ఞాతేన తవా ఽర్జున
విష్టభ్యా ఽహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్. ౪౨

భా. అథవా= లేక. బహునా= విస్తీర్ణ మగు; ఏతేన= ఏవమాదికము చేత *; జ్ఞాతేన = తెలియఁబడినదానిచేత; తవ = నీకు; కింస్యాత్ = ఏమి యగును, సావశేషముచేత ♦? అర్జున = అర్జునా! అశేషముగనో, ఈ చెప్పఁబడు నర్థమును వినుము.—ఇదమ్ = ఈ; కృత్స్నమ్ = సమస్త మయిన; జగత్ =జగత్తును; ఏకాంశేన = ఒక్కయవయవముచేత, ఒకపాదముచేత సర్వభూతస్వరూప మయినదానిచేత ననుట; అట్లు మంత్రవర్ణము.—“పాదో ఽస్య విశ్వాభూతాని” అని; విష్టభ్య = విశేషించి—దృఢముగా స్తంభించి; అహమ్=నేను; స్థితః = ఉన్నాను.

అర్జునా! లేక.—ఇప్పుడు చెప్పిన నిశ్శేషము కాని యీవిభూతివిస్తారము నెఱుంగుటచే నీ కేమి ప్రయోజనము? నిశ్శేషముగా నెఱుంగువిధముఁ జెప్పెదను వినుము. ఈ సర్వప్రపంచమును నే నొకపాదముచే ధరించి యున్నా నని తా.

ఆ. అందఱకును సుబోధం బగుటకై యవయవంబులవిభూతిం జెప్పి సమర్థుల ననుగ్రహించుకొఱకై సాకల్యంబున దానిం జెప్పుచున్నాఁడు.—పక్షాంతరపరిగ్రహార్థము అథవా అని చెప్పఁబడినది. విస్తీర్ణ మయిన సావశేష మగు నీగ్రంథము నెఱుంగుటచే సమర్థుండ వగు నీకు ఫల మేమియు లే దని చెప్పుచున్నారు బహునేత్యాదిగా. చెప్పినవిభూతుల నెఱుంగుటచే సర్వంబు నెఱింగినట్లు కాదు గదా! కొన్నివిభూతులను మాత్రమే చెప్పుటవలన నని యర్థము. అప్పుడు, అల్పాక్షరం బగు నేయుపదేశముచే సర్వార్థంబు నెఱుంగ శక్య మగును? అనఁగాఁ జెప్పుచున్నారు అశేషముగనో ఇత్యాదిగా. విశేషించి స్తంభనము—విధరణము. సర్వభూతస్వరూపంబును సర్వప్రపంచోపాదానశక్త్యుపాధికంబు నగు నొక్కపాదముచే కృత్స్నం బగు జగత్తును విధరించి యున్నా నని సంబంధము. అందే శ్రుతిని ప్రమాణీకరించుచున్నారు అట్లు ఇత్యాదిగా. అట్లీయధ్యాయముచే భగవంతుని నానావిధ

* ఇది మొదలగుదానిచేత.

♦ నిశ్శేషము కానిదానిచేత ననుట.

మము లగు విభూతులను ధ్యేయములుగాను జ్ఞేయములుగాను నుపదేశించి యంతంబున సర్వప్రపంచాత్మక మయిన ధ్యేయరూపము ప్రదర్శించి "త్రిపాదస్యామృతం దివి" ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మయిన ప్రపంచాతీతము నిరుపాధిక మగు తత్త్వము నుపదేశించుటఁ జేసి పరిపూర్ణసచ్చిదానందైకతానం బగు తత్పదలక్ష్యార్థము నిర్ధారింపఁబడినది.

హ. లేక. విస్తీర్ణంబగు నీయర్థము నెఱింగినను నీ కేమి యగును? అశేషముగనో, నీ విది వినుము. నేను ఒక్కసూక్ష్మాంశముచేత నీకృత్స్న జగత్తును విష్టభ్య—వ్యాపించి యున్నా నని యెఱుంగుము.

శం. ఇట్లు అతిమందబుద్ధు లగు ముముక్షువులకు నుపాసనార్థమును "ఇతఁడు పరమాత్ముని విభూతివిశేషం బగుటవలనఁ బరమేశ్వరుఁడే" యని జ్ఞానముకొఱకును "ఆదిత్యానా మహం విష్ణుః" అని యారంభించి "జ్ఞానం జ్ఞానవతా మహమ్" అనువఱకుఁ గల గ్రంథముచేఁ దనవిభూతివిశేషంబులను బ్రతిపాదించి యిప్పుడు విభూతివిశేషజ్ఞానంబును దదుపాసనంబును అకించిత్కరం బని సూచించు ద్వారఁబునఁ బ్రజ్ఞావంతు లగు నధికారుల కుపాసనీయం బైనసవిశేషమే యగు పరమేశ్వరరూపము నుపదేశించుచు నధ్యాయము నుపసంహరించుచున్నాఁడు.—నావిభూతు లనంతములు, అవి చెప్పను నెఱుంగను శక్యము గావు. అథవా = అటుగాక; ఇది యిది నావిభూతివిశేషం బని పెక్కులు నావిభూతివిశేషంబులు చెప్పఁబడినను శుద్ధాత్ముఁడవు ముఖ్యాధికారి వగు నీకు, బహునా = బహుప్రకార మయిన; ఏతేన = ఈమద్విషయకం బయిన; జ్ఞానేన * = జ్ఞానముచేత; కిమ్ = ఏమిఫలము; స్యాత్ = అగును? తద్జ్ఞానముచేతను దదుపాసనముచేతను జిత్తశుద్ధి గాని మోక్షము గాని యేఫలంబును సిద్ధింపదని యర్థము. ఓయీ! విష్ణ్వాదివ్యక్తివిశేషంబులు గూడఁ దత్స్వరూపం బగుటవలనఁ దదుపాసనముచేతను దద్జ్ఞానముచేతను ముఖ్యఫలము కలుగనే కలుగును. అందువేని, కలుగదు. విభూతివిశేషంబు లనంతము లగుటవలన వానియం దీశ్వరత్వబుద్ధి కలుగునేని అనేకేశ్వరత్వజ్ఞానము సంభవించును, అది మోక్షహేతువు గాదు. విభూతు లనంతము లయినప్పుడు తదుపాసన మొక్కనిచేఁ జేయ శక్యము గాదు. మఱియు వానికి గుణవిశేషతారతమ్యము కలుగుటవలనఁ జిత్తమునకు రాగాదికాలుష్యము సంభవించుం గాని ప్రసాదము సిద్ధింపదు. అందువలన ముఖ్యాధికారి వగు ముముక్షుఁడవు నీవు నన్నొక్కనినే సర్వాత్మకునిఁ బరమేశ్వరుని భవముక్తికొఱకు

* పీఠపక్షమునందు "కిం జ్ఞానేన తవార్జున" అని పాఠము.

భజింపు మని సూచించుటకై చెప్పుచున్నాఁడు—అహమ్ = నిర్విశేషుఁడనే యగు పరమాత్మను నేను; ఇదమ్ = పరిదృశ్యమాన మగు మాయాకార్యము స్థావరజంగమాత్మక మయిన; కృత్స్నం జగత్; ఏకాంశేన = ఎట్లు నిరవయవ మయినను ఆకాశమునకు మేఘావచ్ఛేదముచే మేఘాకాశ మని భాగకల్పన మగునో అట్లు నిరంశ మయినను బరబ్రహ్మమునకు మాయాతత్కార్యావచ్ఛేదముచేఁ దదుపహితచైతన్యమున కంశత్వము కల్పింపఁబడుచున్నది, అట్టికల్పిత మయిన యంశముచేత—« పాదో ఽస్య విశ్వా భూతాని " అనుశ్రుతివలన మాయోపాధిక మయినపాదముచే; విష్టభ్య= అంతటను వ్యాపించి; స్థితః— ప్రపంచరూపంబున నేనే యున్నాను. « సహస్రశీర్షా పురుషః, సహస్రశీర్షం దేవమ్ " ఇత్యాదిశ్రుతిప్రసిద్ధుండ నగు విశ్వరూపుని నన్నొక్కనినే యీశ్వరుని భజింపుము, మద్భజనంబునఁ గృతార్థుఁడ వగుదు వని యర్థము.

**మ.** ఇట్లవయవంబులవిభూతిం జెప్పి దాని సాకల్యంబునఁ జెప్పుచున్నాఁడు.—అథవా—దీనికిఁ బక్షాంతర మర్థము. బహునా; ఏతేన=సావశేష మగుదీనిచే; జ్ఞాతేన; కిమ్; తవ; స్యాత్. ఓయర్జునా! ఇదమ్; కృత్స్నమ్ = సమస్త మయిన; జగత్; ఏకాంశేన = ఏకదేశమాత్రముచేత; విష్టభ్య = విధరించి, లేక, వ్యాపించి; అహమ్=నేనే; స్థితః=ఉన్నాను. మద్వ్యతిరిక్త మేదియు లేదు, « పాదో ఽస్య విశ్వా భూతాని త్రిపాదస్యా ఽమృతం దివి » అను శ్రుతివలన. అందువలన నీపరిచ్ఛిన్నదర్శనముచే నేమి లాభము? సర్వత్ర మద్దృష్టినే చేయు మని యభిప్రాయము.

ఎవరో కొందఱు పుణ్యవంతు లగువా రెందే ననంతాత్మునం
దు వడిం జేర్చి చిత్త మన్యవిషయోద్యోగంబునే మాన్చి త్వ
ద్దివిషద్వంద్యపదారవిందగతమాధ్వీబిందువుల్ గ్రోలి యా
దవనాథా హృదయాళి నాది కడు మత్తం బౌచు నొప్పారెడున్.

**శ్రీ.** అటు గాదేని, ఈపరిచ్ఛిన్నదర్శన మేల? సర్వత్ర మద్దృష్టినే చేయు మని చెప్పుచున్నాఁడు.—బహునా—వేలువేలుగా; జ్ఞాతేన; నీ కేమి కార్యము? ఎందువలన ననఁగా. ఈసమస్త మయినజగత్తును, ఏకాంశేన=ఏకదేశమాత్రముచేత; విష్టభ్య=ధరించి, లేక, వ్యాపించి; నేనే యున్నాను. మద్వ్యతిరిక్త మేదియు లేదు, « పాదో ఽస్య విశ్వా భూతాని " అను శ్రుతివలన.

ఇంద్రియద్వారమునను బాహిరముగాఁగ
మనము పరువిడుచున్నను దనర నీకె

దృష్టివిధిపొంటె నాలోకదేశికుండు
తనవిభూతుల నుడివెను దశమమునను. ౪౨

ప. ఇంక, ఈపరిచ్ఛిన్నదర్శన మేల? వృక్షన్యాయంబున సమష్టి వ్యష్ట్యాత్మకుఁడ నేనే యని చెప్పుచున్నాఁడు —అటు గాక, బహునా-భేదంబున నెఱుంగఁబడినదానిచే నీ కేమి కార్యము? మ త్తే మనఁగా. ఇదమ్; కృత్స్నమ్= సమగ్ర మయిన; జగత్ = చరాచరమును; ఏకాంశేన = ఏకదేశమాత్రము చేత; విష్టభ్య=అంతటను వ్యాపించి; స్థితః=ఉన్నవాఁడను; అహమ్ = నేనే యగుచున్నాను, "పాదో ఽస్య విశ్వా భూతాని" అను శ్రుతివలన. ఋగ్వేదమునందును.—"కిం స్విద్వనం క ఉ స వృక్ష ఆస యతో ద్యావాపృథివీ నిష్టతక్షుః। మనీషిణో మనసా పృచ్ఛతేవ తద్యదధ్యతిష్ఠ ద్భువనాని ధారయన్" అని. భాష్యము.— బ్రహ్మమే భూమ్యాదికారణం బని పూర్వబుక్కునందుఁ జెప్పఁబడినది, అదియే యిటఁ బ్రశ్నకథనవ్యాజంబునఁ జెప్పఁబడుచున్నది. లోకమునందు గొప్పమేడను నిర్మించువాఁడొకానొకగొప్పవనంబునం దొకానొకగొప్పవృక్షమును ఛేదించి చెక్కి గదా స్తంభాదికమును జేయుచున్నాఁడు. ఇటనో పరమేశ్వరుఁడు ప్రేరకుఁడు. జగత్స్రష్టలు, యతః = ఏవనమునుండి యేవృక్షమును గ్రహించి; ద్యావాపృథివీ= ద్యావాపృథివులను; నిష్టతక్షుః=నెఱవేర్చిరో. అట్టి, వనమ్=వనము; కిం స్విత్ =ఏమి పేరుగల దగును? అట్లు, ఉ—నిర్ధారణార్థకము. సః వృక్షః=ఆగొప్పవృక్షము; క ఆస= ఏది యయ్యెను? మనీషిణః=మనస్సున కీశ్వరులైనవారలారా! మనసా = జిజ్ఞాసాయుక్త మయినమనస్సుతో, పృచ్ఛతేవ=అవశ్యము అడుగుఁడు. మఱియును. ఈశ్వరుఁడు, భువనాని=లోకములను; ధారయన్=ధరించుచు; యత్=ఏస్థానమును; అధ్యతిష్ఠత్ =అధిష్ఠించెనో; తత్=దానినిగూడ; పృచ్ఛత=అడుగుఁడు దీని కంతకు నుత్తరము—బ్రహ్మవనము బ్రహ్మవృక్షము, సమష్టివ్యష్టిరూపంబున బ్రహ్మమే యున్నది. అని. ఇందుచే నుత్తరాధ్యాయసంగతియుఁ బ్రదర్శింపఁబడినది.

అధ్యాయతాత్పర్యము.—ఈలోకమునందును బరలోకమునందును ఎల్లప్పుడును అత్యంతోత్కర్షశాలి యగు సర్వోత్తముఁడు నేనే, ఒకానొకయుత్కర్షము గలవి దేవమునిమనుజశ్వాపదాదులు ఏవి గలవో అవి వ్యష్టిరూపము లయిన నా యంశములు, నీవు వానిని గ్రమంబునఁ బూజింపవలయును, అందుచే నీవు నన్ను నాయందుఁ జూడఁగలవు. అని పరమాత్మ దశమాధ్యాయంబున నర్జునకుఁ జెప్పెను.

రా. బహునా; ఏతేన=ఈచెప్పఁబడుచున్న; జ్ఞానేన = జ్ఞానముచే ♦; కిమ్= ఏమి ప్రయోజనము ? ఇదమ్=ఈ చిదచిదాత్మక మయిన; కృత్స్నం జగత్=కార్యావస్థంబును కారణావస్థంబును స్థూలమును సూక్ష్మము నగు సర్వజగత్తును; స్వరూపసద్భావమునందును స్థితియందును ప్రవృత్తిభేదమునందును ఎట్లు నాసంకల్పము నతిక్రమింపదో అట్లు నామహిమముయొక్క-యయుతాయుతాంశముచేత * విష్టంభించి స్థితుఁడనై యున్నాను. అట్లు చెప్పఁబడినది భగవంతుఁ డగుపరాశరునిచేత—« యస్యాఽయుతాయుతాంశాంశే విశ్వశక్తి రియం స్థితా » అని.

మూ. కిమ్ అనునది వక్ష్యమాణము ప్రధానం బని తెలుపుటకొఱకు. కాని చెప్పినది నిష్ఫలం బని తెలియుకొఱకుఁ గాదు. అట్లయినయెడ చెప్పక యే యుండును. « అజ్ఞాత్వైనం సర్వవిశేషయుక్తం దేవం వరం కో విముచ్యేత బన్ధాత్ » ⁋ అని ఋగ్వేదఖిలములయందు. నీవో అధికఫలప్రాప్తికి యోగ్యుఁడ వని తవ అనఘ విశేషణము. ఇతరమును స్తుతించుకొఱకు ఒకచో కింశబ్దప్రయోగము ప్రసిద్ధము, « రాగద్వేషౌ యది స్యాతాం తపసా కిం ప్రయోజనమ్ । తావుభౌ యది న స్యాతాం తపసా కిం ప్రయోజనమ్ » ♦♦ ఇత్యాదికమునందు. ఒకచో భగవద్దర్శనము కన్నను సర్వత్ర భగవద్దర్శనమునకుఁ బ్రాధాన్యమో ప్రసిద్ధము, « యో మాం పశ్యతి సర్వత్ర « ఇత్యాదికమునందు.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విభూతియోగో నామ దశమోఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రం

♦ వీరిమతమునందును జ్ఞానేన అని పాఠము.

* నూఱువేలలో నొకభాగముచేత.

⁋ సర్వవిశేషయుక్తుం డగు నీదేవోత్తమునిఁ దెలియక యెవ్వఁడు బంధమునుండి విముక్తుఁ డగును ?

♦♦ రాగద్వేషము లున్నయెడ తపస్సుచే నేమిప్రయోజనము ? అవిరెండును లేనియెడ తపస్సుచే నేమిప్రయోజనము ?

బునను బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు శ్రీకృష్ణార్జున సంవాదం బునం బరఁగు దశమాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్త్వవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మ సంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందు
దశమాధ్యాయటీక.



అధ్యాయదశక మిద మివ కృత్వాస్య గీతార్థవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన.
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్య ఽపిచ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



శ్రీరస్తు.

శ్రీకృష్ణ పరబ్రహ్మణే నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, ఏకాదశాధ్యాయము.

యదనుభవయోగసిద్ధ్యై సర్వాత్మోపాసనం హరిః ప్రోచే
భవబన్ధముక్తిహేతుం తాం విద్యామమ్బికాం వన్దే.
వ్యష్టిక్రమతో దేవ స్సమష్టిభక్తిం వ్యధత్త పార్థాయ
సకలప్రాణిగురుర్యః కృష్ణం వన్దే తమాత్మానమ్.

అర్జున ఉవాచ.—

మదనుగ్రహాయ పరమం గుహ్య మధ్యాత్మసంజ్ఞితమ్
యత్త్వయోక్తం వచస్తేన మోహోఽయం విగతో మమ. ౧

శంకరభాష్యము.—

భగవంతునివిభూతులు ప్రతిపాదింపఁబడినవి. అందును "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అని భగవంతునిచేఁ జెప్పఁబడినదాని విని యీశ్వరునియాద్యం బగు జగదాత్మరూపం బేది గలదో దాని సాక్షాత్కరింపఁ గోరినవాఁడై యర్జునుం డిట్లనియె.—
మదనుగ్రహాయ= నన్ను అనుగ్రహించుకొఱకు; పరమమ్= నిరతిశయంబును; గుహ్యమ్ = గోప్యంబును; అధ్యాత్మసంజ్ఞితమ్ = ఆత్మానాత్మవివేకవిషయంబు నగు; వచః = వాక్యము; యత్ = ఏది; త్వయా = నీచేత; ఉక్తమ్ = చెప్పఁబడినదో; తేన = ఆ నీవాక్యముచేత; మమ = నాయొక్క; అయమ్=ఈ; మోహః=అవివేకబుద్ధి; విగతః—తొలంగినది యని యర్థము.

అర్జునుం డిట్లనియె —నన్ననుగ్రహించుటకై పరమంబును రహస్యంబును ఆత్మవిషయంబు నగు నేవాక్యము చెప్పితివో ఆవాక్యముచే నాయవివేకము నశించె నని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

తత్త్రద్రూపంబున భగవంతు ననుసంధించుకొనుటకుఁ జెప్పినవిభూతుల ననువదించుచున్నారు భగవంతుని ఇత్యాదిగా. పరమాత్మయొక్క సోపాధికంబును నిరుపాధికంబు నగుచిద్రూపము ధ్యేయముగాను జ్ఞేయముగాను జెప్పఁబడిన దని యర్థము. అశేషజగదాత్మకము విశ్వరూపాఖ్య మగు సోపాధికేశ్వరరూపము నధికరించి మీఁదియధ్యాయము నవతరింపఁజేయువారై మీఁదిప్రశ్నమునకు ననుకూలముగాఁ గడచినయర్థమును గీర్తించుచున్నారు అందును ఇత్యాదిగా. అశేషప్రపంచాత్మకంబును ఈజగత్తునకు సమస్తంబునకును గారణంబును సర్వజ్ఞంబును సర్వైశ్వర్యయుక్తంబు నగు నేరూపము చెప్పఁబడినదో దాని విని తత్సాక్షాత్కారమును యాచింపఁ గోరినవాఁడై మొదట నడిగె నని చెప్పుచున్నారు విని ఇత్యాదిగా. నాయందలి కరుణను నిమిత్తీకరించి యుపకారము అనుగ్రహము, దానికొఱకని వచస్సునకు విశేషణము. నిరతిశయము — పరమపురుషార్థసాధన మని యర్థము. వాక్యము— త్వంపదార్థప్రధాన మయిన అశోచ్యా నిత్యాదికము. అయమ్ అనుటచే మోహం బాత్మసాక్షికం బని తెలుపుచున్నాఁడు. అవివేకబుద్ధి — అజ్ఞానవిపర్యాసాత్మకము.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

ఇట్లు భగవన్ముఖంబున సంక్షేపవిస్తరంబుల విభూతుల నాకర్ణించి పరరూపముఁ జూడఁ గోరినవాఁడై యర్జునుం డిట్లనియె.—అధ్యాత్మసంజ్ఞితమ్—అధ్యాత్మ ప్రతిపాదకం బగువచనముగూడ నుపచారముచే నధ్యాత్మసంజ్ఞిత మని చెప్పఁబడుచున్నది.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.—

దశమాధ్యాయంబున మందప్రజ్ఞులకుఁ జిత్తశుద్ధిద్వారంబున మోక్షసిద్ధికొఱకుఁ దనవిభూతివిశేషంబుల నుపాసనార్థము ప్రతిపాదించి యమందప్రజ్ఞులకు మాత్రము విష్టభ్యాహ మిత్యాదిగా విశ్వాత్మక మగుసోపాధికేశ్వరస్వరూపమునే యుపాస్యముగా సూచించి యిప్పు డర్జునునిప్రార్థనంబుచే మాయావిలాసవిజృంభితము నత్యద్భుతము నగు విశ్వరూపస్వరూపమును బ్రదర్శించుటకును, తనవలననే సృష్ట్యాదులు కలుగుచున్న వని వెల్లడి చేయుటకును, తనసాక్షాత్కారం బతిదుర్లభ మనియు భక్త్యేకగమ్య మనియుఁ బ్రతిపాదించుటకును నేకాదశాధ్యాయ మారంభింపఁబడుచున్నది. అందు మొదట, సర్వజగత్కారణంబును సర్వాత్మకంబును సర్వైశ్వర్యసంపన్నంబు నగు స్వరూపముఁ దన కుపాస్యముగా బోధింపఁబడినదాని విని దాని

సాక్షాత్కరింపఁ గోరినవాఁడై భగవంతుఁడు గావించినయనుగ్రహము ననువదించుచు భగవంతు నభిముఖుం జేసికొనుటకై యర్జునుం డిట్లనియె.—మదనుగ్రహాయ=నా భ్రాతృపుత్రాదులు వీరు చచ్చుచున్నారు నేను వీరి వధించువాఁడ నని శోకమోహ సాగరమునందు మగ్నుండ నగు న న్ననుగ్రహించుకొఱకు, మోహముచే శోకించుచున్న నన్నుఁ గృపచే ననుగ్రహించుటకై యని యర్థము; అధ్యాత్మసంజ్ఞితమ్=ఆత్మ యాథాత్మ్యమును వెల్లడించునది, « అశోచ్యా నన్వశోచస్త్వమ్, నాయం హన్తి నహన్యతే, నజాయతే మ్రియతే వా కదాచిత్, వేదా వినాశినం నిత్యమ్, అచ్ఛేద్యో యమ్» ఇత్యాదికము; పరమమ్=పరమార్థవిషయంబు, ఆత్మకుఁ గర్తృత్వభోక్తృత్వాదిభ్రమను బోఁగొట్టునది; కావుననే, గుహ్యమ్ = గోపనీయము, అయోగ్యులకు అసద్ధర్ములకు శ్రద్ధ లేనివారికిఁ జెప్పఁదగనిది; యత్ వచః=ఏవాక్యము; త్వయా=నీచేత; ఉక్తమ్=ఉపదేశింపఁబడినదో; తేన = ఆత్మస్వరూపప్రకాశకంబును మిథ్యాజ్ఞాననివర్తకంబు నగు నావాక్యముచేత, అయమ్—మును చెప్పినట్టి; మోహః=చిత్తభ్రమము, విగతః=విశేషించి పోయినది. నీకృపచే విగతమోహుఁడ నైతి నని యర్థము.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

పూర్వాధ్యాయంబున నానావిభూతులం జెప్పి « విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్ » అని విశ్వాత్మకం బగు పారమేశ్వరరూపము నంతంబున భగవంతుఁడు ప్రతిపాదించినదాని విని పరమోత్కంఠితుండై దాని సాక్షాత్కరింపఁ గోరినవాఁడై పూర్వోక్తము నభినందించుచు నర్జునుం డిట్లనియె.—మదనుగ్రహాయ = నాకు శోకనివృత్త్యుపకారముకొఱకు; పరమమ్=నిరతిశయపురుషార్థపర్యవసాయియు; గుహ్యమ్=గోప్యంబును, ఎవ్వనికిని జెప్పఁ దగనిది యైనను; అధ్యాత్మసంజ్ఞితమ్ = అధ్యాత్మ మనుపేరు గలది, ఆత్మానాత్మవివేకవిషయము, అశోచ్యానన్వశోచస్త్వ మిత్యాదిగా షష్ఠాధ్యాయపర్యంతము త్వంపదార్థప్రధానం బగు; యత్; పరమకారుణికుండవు సర్వజ్ఞుండ వగు; త్వయా=నీచేత; ఉక్తమ్=చెప్పఁబడిన; వచః=వాక్యము గలదో; తేన=ఆవాక్యముచేత; నేను వీరి వధించువాఁడను నాచే వీరు వధింపఁబడుచున్నారు—ఇత్యాది వివిధవిపర్యాసరూప మయిన; మోహః=మోహము; అయమ్—అనుభవసాక్షికము; విగతః = నష్ట మయ్యెను; మమ = నాకు, అందుఁ బలుమాఱు ఆత్మ సర్వవిక్రియాశూన్యుం డని చెప్పుటవలన.

శ్రీధరస్వామి-ప్రణీత సుబోధిని.—

తనవిభూతివిభవ మొనరంగ బోధించి
వీక్షణేచ్ఛ నైన యింద్రజునకుఁ
బరమకరుణచేతఁ బరమాత్మ శ్రీహరి
విశ్వరూప మంత వెలయఁ జూపె.

పూర్వాధ్యాయాంతమున "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అని విశ్వాత్మక మగు పారమేశ్వరరూప ముపక్షేపింపఁబడియె. దానిఁ జూడఁ గోరినవాఁడై పూర్వోక్తార్థము నభినందించుచు నర్జునుం డిట్లనియె నాలుగు శ్లోకములచేత.—మదనుగ్రహాయ = నాకు శోకనివృత్తి చేయుకొఱకు; పరమమ్ = పరమార్థనిష్ఠంబును; గుహ్యమ్= గోప్య మైనదియును; అధ్యాత్మసంజ్ఞితమ్= అధ్యాత్మ మను పేరు గలది, ఆత్మానాత్మవివేకవిషయము; త్వయా; ఉక్తమ్; యత్ వచః=అశోచ్యానన్వశోచ స్త్వ మిత్యాదిగా షష్ఠాధ్యాయపర్యంత మగువాక్య మేది గలదో; తేన; మమ; అయమ్; మోహః = నేను వధించువాఁడను వీరు వధింపఁబడువారు— ఇత్యాదిరూప మయినభ్రమ; విగతః=వినష్టము, ఆత్మ కర్తృత్వాదులు లేనివాఁ డని చెప్పుట వలన.

పరమార్థప్రపా, దైవజ్ఞసూర్యపండితప్రణీతము.—

కడచిన యధ్యాయంబుతుదను "విష్టభ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అని చెప్పఁబడినది. అట్టియినయెడ నట్టిరూప మెట్లుండు నన్ని దానిఁ జూడఁ గోరినవాఁడై యర్జునుండు ప్రార్థించుచు నడుగుచున్నాఁడు నాలుగు శ్లోకములచేత.—నాకు అనుగ్రహముకొఱకు—శోకనివృత్తికొఱకు, పరమమ్ = రహస్యమును; గుహ్యమ్ = గోప్యమును; అధ్యాత్మసంజ్ఞితమ్ = ఆత్మానాత్మవివేకరూపంబు నగు, "దేహీ నిత్య మవధ్యో ఽయమ్, అవ్యక్తం వ్యక్తి మాపన్నమ్, మయా తత మిదం విశ్వమ్, సమో ఽహం సర్వభూతేషు" ఇత్యాదిక మగు; యద్వచః; ఉక్తమ్. తేన; మమ; మోహః; విగతః = విశేషించి పోయినది.

రామానుజభాష్యము.—

ఇట్లు భక్తియోగనిష్పత్తికొఱకును దదభివృద్ధికొఱకును సకలేతరవిలక్షణంబును స్వాభావికంబును భగవదసాధారణంబు నగు కల్యాణగుణగణంబుతోఁ గూడ భగవంతుఁడు సర్వాత్ముఁ డనియు నందువలననే తద్వ్యతిరిక్తం బగు సమస్తచిదచిదాత్మకవస్తుజాతంబును భగవచ్ఛరీరం బగుటచే భగవంతున కధీనము లయిన స్వ

రూపస్థితిప్రవృత్తులు గలదనియుఁ జెప్పఁబడినది. ఇట్టి భగవదసాధారణం బగు స్వభావంబును, సమస్తమును తదాయత్తము లయిన స్వరూపస్థితిప్రవృత్తులు గలదనుటయు భగవంతునివలన విని యిది యిట్లే యని నిశ్చయించి యట్టిభగవంతుని సాక్షాత్కరింపఁ గోరినవాఁడై యర్జునుం డిట్లనియె. అట్లే భగవత్ప్రసాదము పొందినపిమ్మటఁ జూడఁ బోవుచున్నాఁడు. « సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్ । తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్తమనేకధా » అని గదా వక్ష్యమాణగ్రంథము.— దేహాత్మాభిమానరూపమోహముచే మోహితుండ నగు న న్ననుగ్రహించుటయే ప్రయోజనముగా, పరమం గుహ్యమ్ = పరమరహస్య మగు; అధ్యాత్మసంజ్ఞితమ్ = ఆత్మవిషయంబునఁ జెప్పవలసినట్టి; వచః = వాక్యము, « న త్వేవాహం జాతు నాసమ్ » ఇత్యాదిగా « తస్మాద్యోగీ భవార్జున » అనువఱకుఁ గలది; యత్ త్వయా ఉక్తమ్= ఏది నీచేఁ జెప్పఁబడినదో; తేన = దానిచే; మమ = నాయొక్క; అయం మోహః = ఈయాత్మవిషయ మయినమోహము సర్వంబును; విగతః= దూరముగాఁ దొలఁగినది.

మాధ్వభాష్యము.—

ఎట్లు విన్నయెడ ధ్యానము శక్య మగునో అట్లు స్వరూపస్థితి యీ యధ్యాయముచేఁ జెప్పఁబడుచున్నది.

భవాప్యయౌ హి భూతానాం శ్రుతౌ విస్తరశో మయా
త్వత్తః కమలపత్రాక్ష మాహాత్మ్యమపి చావ్యయమ్. ౨

భా. మఱియును.—కమలపత్రాక్ష = తామరరేకులవంటి కన్నులు గలవాఁడా! త్వత్తః = నీవలన; భూతానామ్ = భూతములయొక్క; భవాప్యయౌ= ఉత్పత్తియును ప్రలయమును; మయా=నాచేత; విస్తరశః = విస్తరంబున, సంక్షేపమునఁ గాదు; శ్రుతౌ హి=వినఁబడినవి గదా! అవ్యయమ్ = అక్షయ మగు; మాహాత్మ్యమపిచ = మాహాత్మ్యమును గూడ; శ్రుతమ్—అని యనువర్తించుచున్నది, వినఁబడినది యని యర్థము.

కమలపత్రాక్షుఁడా! భూతంబుల యుత్పత్తిప్రలయములను నీవలన విస్తరించి వింటిని. మఱియు నక్షయం బగు నీమాహాత్మ్యమును గూడ వింటి నని తా

టీ. సప్తమాధ్యాయము మొదలుగా భగవంతుఁడు చెప్పిన తత్త్వార్థనిర్ణయార్థ మగువాక్యము గూడ నాచే వినఁబడిన దని చెప్పుచున్నాఁడు మఱియును అని. మహాత్ముండ వగు నీభావము మాహాత్మ్యము, పారమార్థికరూపము, లేక

సోపాధిక మగు సర్వాత్మత్వాదిరూపము. శ్రుతమ్ అని పరిణామముచే ననుస్మృతిని దెలుపుటకై అపిచ అని చెప్పఁబడినది.

హ. భవాప్యయౌ = ఉత్పత్తిప్రలయములు.

శ్రీ ౦. ఇట్లు భగవంతుఁడు చేసినయుపకారము ననువదించుటచే భగవంతుని స్తుతించి తత్స్వరూపముఁ జూడఁ గోరినవాఁడై తన్మాహాత్మ్యమును బ్రస్తుతించుచున్నాఁడు.—కమలపత్త్రాక్ష = కమ్—బ్రహ్మ సుఖము. దాని అలతి—ప్రకాశింపఁజేయుచున్నది కావున కమల మనఁగా ఆత్మజ్ఞానము, అదియే పతనాత్ త్రాయతే— పతనమునుండి రక్షించుచున్నది కావున పత్త్రము, కమలమును పత్త్రమునైనది కమలపత్త్రము, దానిచే అక్ష్యతే—పొందఁబడుచున్నాఁడు కావున కమలపత్త్రాక్షుఁడు, ఓకమలపత్త్రాక్షుఁడా! జ్ఞానైకగమ్యుఁడ వగు పరమాత్ముఁడా! హి=ఏకారణమువలన; «అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా, ప్రకృతిం స్వా మవష్టభ్య, అహం సర్వస్య ప్రభవః» అని, త్వత్తః—ఈశ్వరునివలననే; భూతానామ్ = ఆకాశాదులకును తత్కార్యములకును సమస్తములకును; భవాప్యయౌ = ఉత్పత్తిప్రలయములు; విస్తరశః=బహువిధములను; మయా=నాచేత; నీవలన, శ్రుతౌ=వినఁబడినవి. మఱియును. « అహం హి సర్వయజ్ఞానాం భోక్తాచ ప్రభు రేవచ, సర్వభూతమహేశ్వరమ్, మత్తస్సర్వం ప్రవర్తతే'' అని, మాహాత్మ్య మపి=మహాత్—సర్వవ్యాపక మయిన ఆత్మ—స్వరూపము గలవాఁడవు మహాత్ముఁడవు, అట్టి నీయొక్క భావము మాహాత్మ్యము, సర్వాత్మత గూడ; చకారమువలన సర్వేశ్వరత్వము గూడ; బహువిధముల నాచే నీవలన వినఁబడినది యని యర్థము.

మ. అట్లు సప్తమాధ్యాయము మొదలు దశమమువఱకుఁ దత్పదార్థనిర్ణయప్రధాన మయినభగవద్వాక్యమును నేను వింటి నని చెప్పుచున్నాఁడు.—భూతానామ్; భవాప్యయౌ=ఉత్పత్తిప్రలయములు, నీవలననే; కలుగునవి; త్వత్తః=నీవలననే; విస్తరశో మయా శ్రుతౌ—సంక్షేపమునఁ గాదు; పలుమాఱు వినఁబడినవి యని యర్థము. కమలపత్త్రాక్ష = కమలముయొక్క పత్త్రములవంటివి దీర్ఘములు రక్తాంతములు పరమమనోజ్ఞము లగు నేత్రములు గలవాఁడా! ఈయతిసౌందర్యాతిశయోల్లేఖము ప్రేమాతిశయమువలన. నీవలన వినఁబడినవి భవాప్యయములు మాత్రమే కావు, మఱే మనఁగా. మహాత్ముఁడ వగు నీభావము మాహాత్మ్యము—నిరతిశయైశ్వర్యము, విశ్వసృష్ట్యాదికర్తవైనను అవికారి వగుటయు, శుభాశుభకర్మములు

చేయించువాఁడ వైనను వైషమ్య లేనివాఁడ వగుటయు, బంధమోక్షాదివిచిత్రఫలదాత వైనను అసంగోదాసీనుఁడ వగుటయు, ఇతరము గూడ సర్వాత్మత్వాదికము సోపాధికంబును నిరుపాధికంబును; అవ్యయమ్ = అక్షయము; మయా శ్రుతమ్ అని పరిణామముచే ననువర్తించుచున్నది చకారమువలన.

శ్రీ. మఱియును —భూతానామ్; భవాప్యయౌ=సృష్టిప్రలయములు; త్వత్తః=నీవలననే అగుచున్న వని; మయా శ్రుతౌ, "అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయ స్తథా" ఇత్యాదిగా; విస్తరశః=పలుమాఱు. కమలపత్త్రములవలె సుప్రసన్నములును విశాలములు నగు నేత్రములు గలవాఁడా! మాహాత్మ్య మపిచ; అవ్యయమ్ = అక్షయము; వినఁబడినది—విశ్వసృష్ట్యాదికర్త వైనను సర్వనియంత వైనను శుభాశుభకర్మకారయిత వైనను బంధమోక్షాదివిచిత్రఫలదాతవైనను నిర్వికారతయు అవైషమ్యంబును అసంగౌదాసీన్యంబును అను నీమహత్త్వము గూడ వినఁబడినది, "అవ్యక్తం వ్యక్తి మాపన్నం మన్యన్తే, మయా తత మిదం సర్వమ్, నచ మాం తాని కర్మాణి నిబధ్నన్తి, సమో ఽహం సర్వభూతేషు" ఇత్యాదిగా. అందువలన జీవులు నీకుఁ బరతంత్రు లగుటవలనఁ గూడ "నేను కర్తను" ఇత్యాదిక మగు నా మోహము విగతం బని భావము.

ప. త్వత్తః = నీవలన; భూతానామ్; భవాప్యయౌ = ఉత్పత్తిప్రలయములు; "అహం కృత్స్నస్య జగతః ప్రభవః ప్రలయః" ఇత్యాదివాక్యములచే, విస్తరశః = విస్తరంబున; మయా శ్రుతౌ. అవ్యయమ్=అవినాశి యగు; మాహాత్మ్య మపి = సామర్థ్యము గూడ; వినఁబడినది. విశ్వసృష్ట్యాదికర్త వైనను అకర్తవు సర్వనియంత వైనను అసంగుఁడవు విచిత్రఫలదాత వైనను ఉదాసీనుఁడవు అగుట యను నీమాహాత్మ్య మని యర్థము.

రా. మఱియును.—అట్లు సప్తమాధ్యాయము మొదలు దశమమువఱకు, నీకంటె వ్యతిరిక్తము లయిన సర్వభూతములకును, త్వత్తః=నీవలన, పరమాత్మవలన; భవాప్యయౌ = ఉత్పత్తిప్రలయములు; విస్తరశః; మయా; శ్రుతౌ హి. కమలపత్రాక్ష! నీయొక్క, అవ్యయమ్ = నిత్య మగు; మాహాత్మ్య మపి = సర్వచేతనాచేతనవస్తుశేషి వగుటయు జ్ఞానబలాదికల్యాణగుణగణంబుల నీవే పరతరుఁడవు సర్వాధారుండ వగుటయు చింతితసమిషితాది * సర్వప్రవృత్తులయందును నీవే ప్రవర్తయిత

* తలఁచుట చెప్పపాటు మొదలగు.

వగుటయు మొదలగు నీయపరిమితమాహాత్మ్యము గూడ; శ్రుతమ్ = వినఁబడినది. హేశబ్దము చెప్పఁబోవు దర్శనేచ్ఛను సూచించుచున్నది.

మూ. *

ఏవ మేత ద్యథాత్థ త్వ మాత్మానం పరమేశ్వర
ద్రష్టు మిచ్ఛామి తే రూప మైశ్వరం పురుషోత్తమ. 3

భా. పరమేశ్వర = పరమేశ్వరా! యథా= ఏప్రకారముచే; త్వమ్= నీవు; ఆత్మానమ్ = నిన్ను; ఆత్థ = చెప్పుచున్నావో. ఏతత్ = ఇది; ఏవమ్= ఇట్లే, వేఱువిధము గాదు. అట్లయినను, తే = నీయొక్క; జ్ఞానైశ్వర్య శక్తిబలవీర్య తేజస్సులతో సంపన్న మగు; ఐశ్వరమ్ = వైష్ణవం బగు; రూపమ్ = రూపమును; ద్రష్టుమ్ = చూచుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. పురుషోత్తమ = పురుషోత్తముఁడా!

పరమేశ్వరుఁడా! నీస్వరూపమును నీ వెట్లు చెప్పితివో అది యట్లే కాని వేఱు గాదు, అయినను నీపారమేశ్వరరూపమును జూడఁ గోరెద నని తాత్పర్యము.

ఆ. నీవు చెప్పినయర్థమునందు నమ్మకము లేమివలనఁ గాదు నేను జూడఁ గోరుట; మ తే మనఁగా, కృతార్థుఁడ నగుటకై యని చెప్పుచున్నాఁడు ఏవ మేత దిత్యాదిగా. ఏప్రకారముచే—సోపాధికముచేతను నిరుపాధికముచేతను అని యర్థము. నేను ఆప్తుఁడ నను నిశ్చయముచే నావాక్యము నీకుఁ బ్రమాణ మగునేని, అప్పుడు నేను జెప్పినదాని నేల చూడఁ గోరుచున్నావు? అనఁగా కృతార్థుండ నగుటకై యని చెప్పినదాని సూచించుచున్నారు అట్లయినను అని. చతుర్భుజాదిరూపవ్యావృత్తి కొఱకుఁ జెప్పుచున్నారు ఐశ్వర మ్మని. దాని వివరించుచున్నారు జ్ఞానేత్యాదిగా.

హ. ఐశ్వరమ్ = ఈశ్వరునిది యగుదానిని.

శం. అందువలన నదియంతయు సత్యమే యని చెప్పుచున్నాఁడు.— సర్వాతిశాయి యగుమహత్త్వము గలవాఁ డగుటవలన పరముఁడవు, సర్వవ్యాపార హేతువ వగుటవలన ఈశ్వరుఁడవు, ఓపరమేశ్వరుఁడా! సర్వజ్ఞుఁడ వగు నీవు; మహ భూత మహేశ్వర మ్మని, ఆత్మానమ్ = ఆత్మస్వరూపమును; యథా ఆత్థ = ఏప్రకారము నను నున్నదానిఁగాఁ జెప్పుచున్నావో. ఏతత్ ఏవమ్ = ఇది యథార్థమే, నీయైశ్వర

* ౨, ౩ వ శ్లోకములకు మాధ్వభాష్యము లేదు.

రూపము సర్వకారణంబును సర్వవ్యాపకంబును సర్వనియంతయు నయ్యే యున్నది, ఈశ్వరునివచనము వేఱువిధము గాదు, అందుఁ బరీక్ష చేయవలసినది లేదు. మ తే మనఁగా నీయనుగ్రహమునకుఁ బాత్రభూతుఁడ నగు నా కీయాశ కలుగుచున్న దని చెప్పుచున్నాఁడు—వ్యాకృతావ్యాకృతపురుషులకంటె స్వమహిమముచే నుత్తముఁడ వగుటవలన ఓపురుషోత్తముఁడా! నాకు జన్మసాఫల్యముకొఱకు, తే = నీ యొక్క; ఐశ్వరమ్ = సమగ్రైశ్వర్యజ్ఞానతేజశ్శక్తిసంపన్నము సర్వాత్మక మగు; రూపమ్ = స్వరూపమును; ద్రష్టు మిచ్ఛామి—అట్లు నా కిచ్ఛ గల దని యర్థము.

మ. ఓపరమేశ్వరుఁడా! యథా = ఏప్రకారముచేత, సోపాధికమును నిరుపాధికము నగు నిరతిశయైశ్వర్యముచే; ఆత్మానమ్; త్వమ్; ఆత్థ = చెప్పుచున్నావో. ఏవ మేతత్— అది వేఱువిధము గాదు, నీవాక్యమున నొకింతను నా కవిశ్వాసశంకయే లే దని యర్థము. అట్లయినను కృతార్థుఁడఁగాఁ గోరి, ద్రష్టు మిచ్ఛామి; తే= నీయొక్క; రూపమ్; ఐశ్వరమ్ = జ్ఞానైశ్వర్యశక్తివీర్యబలతేజస్సులచే సంపన్నమై యద్భుత మయినదానిని. ఓ పురుషోత్తమా! సంబోధనముచే, ఒ నీవాక్యమునందు నా కవిశ్వాసము లేదు దర్శనేచ్ఛయు నుత్కటముగా నున్న దని సర్వజ్ఞుండవు సర్వాంతర్యామి వగుటవలన నీ వెఱుంగుదు » వని సూచించుచున్నాఁడు.

శ్రీ. మఱియును.—భవాప్యయౌ హి భూతానా మిత్యాదికము నేను వింటిని. మఱియు నిప్పుడు నీస్వరూపమును, యథా = ఎట్లిదానిఁగా; త్వ మాత్థ= విష్టభ్యాహ మిదం కృత్స్న మిత్యాదిగాఁ జెప్పుచున్నావో. ఓ పరమేశ్వరా! ఏవ మేతత్— దీనియందును అవిశ్వాసము నాకు లే దని యర్థము. అట్లయినను ఓ పురుషోత్తముఁడా! తే ఐశ్వరం రూపమ్ = జ్ఞానైశ్వర్యశక్తి బలవీర్య తేజస్సంపన్న మగు నీరూపమును; కౌతూహలమువలనను, ద్రష్టు మిచ్ఛామి.

ప. విష్టభ్యాహ మిదం కృత్స్న మ్మని యిప్పుడు, ఆత్మానం త్వమ్; యత్ ఆత్థ = * ఏది చెప్పుచున్నావో. ఏతత్; తే; ఐశ్వరమ్ = జ్ఞానైశ్వర్యశక్తిబలవీర్యతేజస్సంపన్న మైన; రూపం ద్రష్టు మిచ్ఛామి. పురుషోత్తమ యనుసంబోధనము అలౌకికరూపముఁ జూడవలయు నను కుతూహలమువలన దర్శనేచ్ఛ కలిగిన దని సూచింపఁబడినది. శ్రుతియును వామదేవ్యసామముచే నుపదేశించుచున్నది.—« కయా నశ్చిత్ర ఆభువ దూతీ సదా వృధ స్సఖా । కయా శచిష్ఠయా వృతా » అని. భాష్యము.—

* వీరిపక్షమునందు యదాత్థ అని పాఠము.

సదావృధః = ఎల్లప్పుడును వర్ధమానుఁడగు, సమష్టిరూపుఁడగు పరమాత్మ; చిత్రః = పూజనీయుఁడు, లేక, విచిత్రాకృతులు గలవాఁడు; సఖా = మిత్రభూతుఁడు, అట్టి పరమాత్మ; కయా = ఏ; ఊతీ = సంతర్పణముచేత, లేక, కర్మముచేత; నః = మమ్ముఁ గూర్చి; ఆభువత్ = అభిముఖుం డగును, అనుభవగోచరుం డగును? ఇత్యాదివాక్యములచే నిట్టిరూపముఁ జూచుటయందు వేదము గూడ వామదేవుని మనోరథమును బ్రకటించుచున్నది, ఇఁక నా కట్టిమనోరథము కలుగుట యేమియాశ్చర్య మని యర్థము. అది చెప్పఁబడినది హరివంశమునందు.—"మాణ్డీరే సుఖ మాసీనం విహరన్తం జనార్దనమ్ । వామదేవభరద్వాజౌ ద్రష్టుం ప్రాప్తౌ జగన్మయమ్॥ తథా యాన్తౌ సమాలోక్య విజ్ఞాయచ తదీప్సితమ్ । ఉభయో ర్దర్శయామాస విశ్వరూపం స్వవర్ష్మణి॥ తతస్తౌ వూచతుః కృష్ణం సర్వదేహాలకం విభుమ్ । త్వ మాది స్సర్వభూతానాం మధ్య మన్త స్తదా భవాన్॥ యా న్యేవ వస్తుజాతాని లోకజాతాని మాధవ। తవ గాత్రేషు పశ్యామ స్త్రిమూర్తీ స్సర్వదేవతాః॥ జిత షడ్వైరిణ శ్శాన్తా దాన్తా యోగేశ్వ రేశ్వరాః। త్వా మీదృశం తే పశ్యన్తి నాన్య ఇత్యేవ విద్మహే"* అని. అందే భరద్వాజుండును.—"కర్మణాం ఫలదాతాచ ఫలదః కర్మ కుర్వతామ్ । నిషేద్ధా దుష్టసత్త్వానాం గ్రహదైత్యోగ్రరక్షసామ్" † అని. శ్రుతియును.—"రక్షోహణమ్" ఇత్యాదిగా. ఇదియు ముందు నిరూపింపఁబడును.

౩. ఓపరమేశ్వరుఁడా! ఏవ మేతత్ = ఇది యిట్లే యని నిశ్చయించితిని, యథా త్వ మాత్మాన మాత్థ = ఏవిధముగా నీవు నీస్వరూపమును జెప్పుచున్నావో. పురుషోత్తమ = ఆశ్రితవాత్సల్యసముద్రుఁడా! తే ఐశ్వరమ్ = నీయొక్క అసాధారణమయిన, సర్వమును శాసించుచుఁ బాలించుచు సృజించుచు సంహరించుచు భరించుచుఁ గల్యాణగుణాకరంబై పరతరంబై సకలేతరవిజాతీయంబై యున్న; రూపమ్ = రూపమును; ద్రష్టుమ్ = సాక్షాత్కరించుటకు; ఇచ్ఛామి.

---

* మాండీరమునందు సుఖముగాఁ గూర్చుండి విహరించుచున్న కృష్ణుని జగన్మయునిఁ జూచుటకై వామదేవభరద్వాజులు వచ్చిరి. అట్లు వచ్చుచున్నవారిం జూచి వారిమనోరథము నెఱింగి వారియద్దటికేఁ దనదేహమునందు విశ్వరూపముఁ జూపెను. అంత వారు కృష్ణునితో నిట్లనిరి. సర్వభూతములకును ఆదిమధ్యాంతములు నీవే. లోకమునందుఁ బుట్టినవస్తువు లేవి గలవో వాని నన్నిటిని త్రిమూర్తులను సర్వదేవతలను నీదేహమునందు జూచుచున్నాము. అరిషడ్వర్గము జయించి శాంతులై దాంతులైనట్టి మహాయోగులు ఇట్టి నిన్నుఁ జూతురు, ఇతరులు చూడఁజాల రని యెఱుంగుదుము.

† కర్మములకు ఫలప్రదాతయుఁ గర్మము చేయువారికి ఫలము నిచ్చువాఁడును దుష్టమృగములను గ్రహదైత్యరాక్షసులను సంహరించువాఁడును.

మన్యసే యది త చ్ఛక్యం మయా ద్రష్టు మితి ప్రభో
యోగేశ్వర తతో మే త్వం దర్శయా ఽఽత్మాన మవ్యయమ్. ౪

భా. ప్రభో=స్వామీ! తత్=అది; మయా—అర్జునునిచేత; ద్రష్టుమ్=చూచుటకు; శక్యమ్=అలవి యగును; ఇతి=అని; మన్యసే యది=తలంతు వేని; యోగేశ్వర = యోగము గలవారు యోగులు, వారి కీశ్వరుఁడు యోగేశ్వరుఁడు, ఓ యోగేశ్వరుఁడా! ఎందువలన నేను చూచుటకు మిక్కిలి కోరుచున్నానో, తతః = అందువలన; మే=నాకొఱకు; త్వమ్=నీవు; అవ్యయమ్ = అక్షయుఁడ వగు; ఆత్మానమ్ = నిన్ను; దర్శయ=చూపుము.

స్వామీ! ఆరూపము నాకుఁ జూడ శక్య మగు నని నీవు తలంతువేని, ఓ యోగేశ్వరుఁడా! నేను మిక్కిలి యాశపడుటవలన అవ్యయం బగు నీరూపము నాకుఁ జూపు మని తాత్పర్యము.

ఆ. చూడ శక్యముకాని దాని నేల చూడఁ గోరుచున్నావు? అని యాశంకించి చెప్పుచున్నాఁడు మన్యస ఇత్యాదిగా. సృష్టికిని స్థితికిని సంహారమున కును ప్రవేశమునకును ప్రశాసనంబునకును ప్రభవతి—సమర్థుఁ డగుచున్నాఁడు కావున ప్రభువు. లక్షణచే యోగశబ్దార్థము చెప్పుచున్నారు యోగము గలవారు అని. తత ఇత్యాదికమునకు వ్యాఖ్య చేయుచున్నారు ఎందువలన ఇత్యాదిగా.

హ. సమాధివాచక మయిన యోగశబ్దమునకు అర్శ ఆదియగుటవలన అచ్ప్రత్యయము, యోగము కలదు ఎవ్వరికో వారు యోగులు, యోగానా మీశ్వరః—యోగుల కీశ్వరుఁడు యోగేశ్వరుఁడు, ఓ యోగేశ్వరుఁడా!

శం. దానినే ప్రార్థించుచున్నాఁడు.—ప్రభో = సృష్టిస్థితిలయప్రవేశనియమనసమర్థుఁడా! తత్ = అట్టి నీస్వరూపము; మయా ద్రష్టుం శక్య మితి; మన్యసే యది = ఎఱుంగుదువేని, లేక, కోరుదువేని; యోగేశ్వర = యోగ మనఁగా బ్రహ్మాత్మైకత్వలక్షణ మయినజ్ఞానయోగము, దానికి ఈశ్వరుఁడా! తతః; మే; త్వమ్; ఆత్మానమ్ = స్వరూపమును; అవ్యయమ్ = అవ్యయమున కుపాధి యగుటవలన, లేక, అవ్యయఫలహేతు వగుటవలన అవ్యయ మైనదానిని, దేని నుపాసించుటచేఁ బురుషుఁడు శుద్ధాత్ముఁడై ముక్తుఁ డగునో అట్టిదానిని. దర్శయ.

మ. చూడరానిదానిని ఏల చూడఁ గోరుచున్నావు? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—సృష్టిస్థితిసంహారప్రవేశప్రశాసనములయందు ప్రభవతి—సమర్థుఁ డగుచున్నాఁడు కావునఁ బ్రభువు, ఓ ప్రభూ! సర్వస్వామీ! తత్ = నీయైశ్వరరూపము; మయా—అర్జునునిచేత; ద్రష్టుం శక్య మితి; యది మన్యసే = ఎఱుంగుదువేని, లేక, ఇచ్ఛింతువేని; యోగేశ్వర = అణిమాదిసిద్ధిశాలు లగు యోగులకందఱకును ఈశ్వరుఁడా! తతః = నీయిచ్ఛావశమువలననే; మే = మిక్కిలి ప్రార్థించుచున్న నాకొఱకు; త్వమ్ = పరమకారుణికుఁడ వగు నీవు; దర్శయ = చాక్షుషప్రత్యక్షమునకు విషయముగాఁ జేయుము. ఆత్మానమ్= ఐశ్వరరూపవిశిష్టుఁడ వగు నిన్ను; అవ్యయమ్= అక్షయుని.

శ్రీ. నేను జూడఁ గోరుచున్నా నన్నమాత్రమున నీ వారూపము నాకుఁ జూప వలదు, మ తే మనఁగా.—యోగేశ్వర = యోగుల కీశ్వరుఁడా! మయా—అర్జునునిచేత; తద్రూపం ద్రష్టుం శక్య మితి యది మన్యసే. తతః = అప్పుడు; ఆత్మానమ్ = తద్రూపవంతుఁ డగునిన్ను; అవ్యయమ్ = నిన్ను; మే; దర్శయ.

ప. ఇఁక నేతద్రూపదర్శనము కేవల మనుగ్రహైకలభ్య మని చెప్పుచున్నాఁడు.—యోగేశ్వర= యోగుల కీశ్వరుఁడా! తతః= అప్పుడు; ఆత్మానం దర్శయ.

రా. తత్ =సమస్తమును సృజించునదియుఁ బ్రశాసించునదియు సమస్తమునకు నాధారభూతమైనదియు నగు నీరూపము; మయా ద్రష్టుం శక్య మితి యదిమన్యసే; తతః; యోగేశ్వర = యోగ మనఁగా జ్ఞానాదికల్యాణగుణయోగము, « పశ్య మే యోగ మైశ్వరమ్ » అని గదా చెప్పఁబోవుచున్నాఁడు; నీకంటె నితరునియం దెవ్వనియందును అసంభావితము లయిన జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజస్సులకు నిధియైనవాఁడా! ఆత్మానమ్=నిన్ను; మే; అవ్యయందర్శయ—అవ్యయ మ్మనునది క్రియావిశేషణము, నిన్ను సమగ్రముగా ♦ నాకుఁ జూపు మని యర్థము.

మా. ప్రభో = సమర్థుఁడా! « నాస్తి తస్మాత్పరంభూతం పురుషాద్వై సనాతనాత్ » * అని మోక్షధర్మమునందు. « ప్రభురీశ స్సమర్థశ్చ" అను నిఘంటువు వలనను.

♦ కొఱఁత లేనియట్లు.

* ఆసనాతనుం డగు పురుషునికన్న గొప్పభూతము లేదు.

శ్రీభగవానువాచ.—

పశ్య మే పార్థ రూపాణి శతశో౽థ సహస్రశః
నానావిధాని దివ్యాని నానావర్ణాకృతీని చ. ౫

భా. ఇట్లర్జునునిచేఁ బ్రార్థితుండై శ్రీభగవంతుం డిట్లనియె.— పార్థ = అర్జునా! మే = నాయొక్క; రూపాణి = రూపములను; శతశః = నూఱులకొలఁది యైనవానిని; అథ = మఱియు; సహస్రశః = వేలకొలఁది యైనవానిని, అనేకముల నని యర్థము; నానావిధాని = అనేకప్రకారము లయినవానిని; దివ్యానిచ = అప్రాకృతములను; నానావర్ణాకృతీని చ = విలక్షణము లయిన నీలపీతాదివర్ణములును అట్లు ఆకృతులును—అవయవ సంస్థానవిశేషములును ఏరూపములకుఁ గలవో అట్టివానిని; పశ్య = చూడుము.

అర్జునా! అనేకములును అనేకవిధంబులును అప్రాకృతములును నానావిధము లగువర్ణములును ఆకారములును గలవియు నగు నారూపములం జూడు మని తాత్పర్యము.

ఆ. అతిభక్తుండును సఖుండు నగు నర్జునునిఁ బ్రార్థనాంగీకారముచే నాశ్వాసించుటకై శ్రీభగవంతుఁడు చెప్పుచున్నాఁ డని చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా.

హ. ఇట్లర్జునుండు స్వరూపదర్శనముఁ బ్రార్థింపఁగా దానిఁ బ్రదర్శింపఁ గోరినవాఁడై శ్రీభగవంతుం డిట్లనియె.—శతశః = నూఱులను. సహస్రశః = వేలను. నానావర్ణాకృతీని = నానావిధము లగువర్ణములును సంస్థానములును గలవానిని.

శం. ఇట్లు లర్జునునిచేఁ బ్రార్థితుండై శ్రీభగవంతుం డిట్లనియె.—దివః— మాయవలనఁ బుట్టినవి దివ్యములు, అట్టివానిని; నానావర్ణములును నానాఽఽకారంబులును నానాప్రకారంబులు నగువానిని; శతశః సహస్రశః = అనేకములను; మే రూపాణి; అథ = వెంటనే; కాలాంతరమునఁ గాదు; పశ్య. ఓయీ! "ద్రష్టుమిచ్ఛామి తే రూపమ్, దర్శయాత్మానమ్" అని యర్జునుఁడు నీయైశ్వరరూపముఁ జూపుమని చెప్పఁగాఁ ద్రివిక్రమాకారమువంటి తనవైష్ణవరూపముఁ జూపక "పశ్య మే పార్థ రూపాణి" అని యనేకము లయిన యాదిత్యాదిరూపములఁ జూపుట భగవంతున కయుక్తమే, ఔషధము తెమ్మనఁగాఁ బర్వతము తెచ్చినట్లు. అని శంకింపఁ జనదు; అవ్యక్తాదిస్తంబపర్యంతము స్థూలసూక్ష్మకారణప్రపంచరూపంబునను సమష్టి

వ్యష్టిరూపంబునను ఉన్నదియు « అగ్ని ర్మూర్ధా చక్షుషీ చన్ద్రసూర్యౌ దిశ శ్శ్రోత్రే వా గ్వివృతా శ్చ వేదాః । వాయుః ప్రాణో హృదయం విశ్వ మస్య పద్భ్యాం పృథివీ హ్యేష సర్వభూతా న్తరాత్మా । సహస్రశీర్షం దేవమ్" ఇత్యాద్యుశ్రుతిప్రసిద్ధమును ప్రకృతంబును ప్రాకృతంబు నగు సమస్తంబును కారణబ్రహ్మ మగు నీశ్వరుని స్వరూపమే, « బహుధా విశ్వతో ముఖమ్ » అని భగవంతుఁడే చెప్పుటవలన. కాని కేవల శంఖచక్రాదిచిహ్నితముమాత్రమే కాదు, అదియుఁ బ్రాకృతం బగుటచే దీనియందే యంతర్భవించుటవలన. అందువలన సర్వాత్మకంబును సర్వకారణంబును సర్వోత్తమంబు నగు నైశ్వరరూప మేది గలదో దానినే యర్జునుఁడు చూడఁ గోరుటవలన నదియే భగవంతునిచేఁ జూపఁబడినది. ఇట నేదియు ననుపయుక్తము లేదు.

మ. ఇట్లు పరమభక్తుం డగు నర్జునునిచేఁ బ్రార్థితుండై శ్రీభగవంతుం డిట్లనియె.—ఇటఁ గ్రమంబున నాలుగుశ్లోకములయందును పశ్య అని యావృత్తి చేయుటచే « అత్యద్భుతరూపంబులఁ జూపెదను, నీవు సావధానుఁడ వగు" మని యర్జునుని అభిముఖునిఁగాఁ జేసికొనుచున్నాఁడు భగవంతుఁడు. శతశో ఽథ సహస్రశః = అపరిమితంబులను; నానావిధాని = అనేకప్రకారములను; దివ్యాని = అత్యద్భుతములను; నానావర్ణాకృతీనిచ = నానా—విలక్షణము లయినవర్ణములును—నీలపీతాదిప్రకారములును అట్లు ఆకృతులును—అవయవసంస్థానవిశేషంబులును గలవానిని; మే=నాయొక్క; రూపాణి; పశ్య—అన్వార్థమునందు లోట్టు, చూచుట కర్హుఁడ వగుదువు. ఓపార్థుఁడా !

శ్రీ. ఇట్లు ప్రార్థింపఁబడినవాఁడై యత్యద్భుతం బగురూపము చూపఁబోవుచు సావధానుండవు గ మ్మని యర్జును నభిముఖీకరించుచున్నాఁడు శ్రీభగవంతుఁడు. నాలుగుశ్లోకములచేత.—రూపం బొక్కటియే యయినను నానావిధం బగుటవలన రూపాణి యని బహువచనము. అపరిమితంబులును అనేకవిధంబులును దివ్యంబులు—అలౌకికంబులు నగు నాయొక్క—రూపంబులం జూడుము. వర్ణము లనఁగా శుక్లకృష్ణాదులు, ఆకృతు లనఁగా అవయవసన్నివేశవిశేషములు, నానా—అనేకము లయినవర్ణములును ఆకృతులును గలరూపములను.

ప. ఇఁక భగవంతుఁడును అలౌకికం బగురూపమును జూడఁ గోరుచున్న యర్జును నభిముఖీకరించుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత.—ఓపార్థా; మే శతశః సహస్రశః రూపాణి పశ్య. శతశః—నూఱులైన ముఖ్యవిభూతిరూపములను; సహ

స్రశః = వేలకొలఁదియైన యవాంతరవిభూతిరూపములను. లేక, సహస్రశబ్దము అనంతసంఖ్యావాచకము. నానావిధాని = నానాప్రకారములను. దానినే చెప్పుచున్నాఁడు.—నానావర్ణాకృతీనిచ= నానావిధము లయిన శుక్లాదివర్ణములును నానావిధము లయిన ఆకారములును గలవానిని.

రా. ఇట్లు కౌతూహలాన్వితుండై హర్షగద్గదకంఠుం డగునర్జునునిచేఁ బ్రార్థితుండై భగవంతుం డిట్లనియె.—మే; సర్వాశ్రయము లయిన, రూపాణి పశ్య, అథ = అంత; శతశః సహస్రశః, నానావిధాని = నానాప్రకారము లయినవానిని; దివ్యాని = అప్రాకృతములను; నానావర్ణాకృతీనిచ = శుక్లకృష్ణాదినానావర్ణము లగు నానాకారములను గూడ; పశ్య.

మూ. ♦

పశ్యాదిత్యా న్వసూ న్రుద్రా నశ్వినౌ మరుత స్తథా
బహూ న్యదృష్టపూర్వాణి పశ్యాశ్చర్యాణి భారత. ౬

భా. ఆదిత్యాన్ = ద్వాదశాదిత్యులను; వసూన్ = అష్టవసువులను; రుద్రాన్= ఏకాదశరుద్రులను; అశ్వినౌ=అశ్వీదేవతలనిద్దఱను; మరుతః= సప్తసప్తమరుద్గణంబు లెవ్వరు గలరో వారలను *; పశ్య = చూడుము. తథా = అట్లు; బహూని = ఇతరములనుగూడ పెక్కులను; అదృష్టపూర్వాణి = మనుష్యలోకమునందు నీచేతఁ గాని మఱి యితరునిచేతఁ గాని యెవ్వనిచేతను మున్ను చూడఁబడనివానిని; ఆశ్చర్యాణి = అద్భుతములను; పశ్య = చూడుము. భారత = అర్జునా!

అర్జునా! ద్వాదశాదిత్యులను అష్టవసువులను ఏకాదశరుద్రులను ఇద్దఱు అశ్వీదేవతలను నలుబదితొమ్మండ్రుమరుత్తులను జూడుము. మఱియు ఇదివఱ కెన్నఁడును ఎవ్వరును జూడని యాశ్చర్యముల ననేకములం జూడు మని తాత్పర్యము.

రా. దివ్యము లగురూపంబులఁ జూడు మని చెప్పఁబడినది, వానికే సంగ్రహంబున నానుపూర్వి చెప్పుచున్నాఁడు పశ్యాదిత్యా నిత్యాదిగా. నానావిధములైనవాని నని చెప్పఁబడినది, దానినే స్ఫుటీకరించుచున్నాఁడు బహూని అని. నానావర్ణాకృతుల నని చెప్పినదానిని వ్యక్తీకరించుచున్నాఁడు ఆశ్చర్యాణి అని.

♦ ౫-౬-౭-౮ ఈశ్లోకములకు మాధ్వభాష్యము లేదు.

* నలుబదితొమ్మిదిమంది యనుట.

హ. *

శం. మఱియును.—అదృష్టపూర్వాణి = మున్ను ఎవ్వనిచేతనుం జూడఁ బడనివియు; బహూని = అసంఖ్యములును; ఆశ్చర్యాణి = అద్భుతములు నగురూపములను; పశ్య = చూడుము.

మ. దివ్యంబు లగురూపములం జూడు మని చెప్పి వానికే లేశంబున నాను పూర్వి చెప్పుచున్నాఁడు.—ఆదిత్యాన్ = పండ్రెండుగురను; వసూన్ = ఎనమండ్రను; రుద్రాన్ = పదునొకండుగురను; అశ్వినౌ = ఇద్దఱను; మరుతః = సప్తసప్తసంఖ్య గల వారిని, నలువదితొమ్మండుగుర ననుట; తథా — ఇతర దేవతలను గూడ నని యర్థము; పశ్య = చూడుము. బహూని = ఇతరములను గూడ అనేకములను; అదృష్టపూర్వాణి = మనుష్యలోకమునందు నీచేతఁ గాని మఱి యితరునిచేతఁ గాని యెవ్వనిచేతను మున్ను చూడఁబడనివానిని; ఆశ్చర్యాణి = అద్భుతములను; పశ్య. ఓభారతుఁడా! ఇట, శతశోఽథ సహస్రశః నానావిధాని అనుదానికి బహూని అనియు ఆదిత్యానిత్యాదికమును వివరణము, దివ్యాని అనుదానికి అదృష్టపూర్వాణి అనియు, నానావర్ణాకృతీని అనుటకు ఆశ్చర్యాణి అనియు వివరణం బని యెఱుంగునది.

శ్రీ. వానినే చెప్పుచున్నాఁడు —ఆదిత్యాదులను నాదేహమునందుఁ జూడుము. మరుతః = నలువదితొమ్మిది దేవవిశేషములను. అదృష్టపూర్వాణి = నీచేతఁ గాని యితరునిచేతఁ గాని మున్ను చూడఁబడనివానిని; ఆశ్చర్యాణి= అద్భుతములను.

ప. ఇఁక వానినే చెప్పుచున్నాఁడు.—ద్వాదశాదిత్యులను అష్టవసువులను ఇద్దఱ నశ్విదేవతలను నలువదితొమ్మిదిమంది మరుత్తులను, తథా—ఇతరములనుగూడ; అదృష్టపూర్వాణి = మున్ను చూడఁబడనివానిని; కావుననే, ఆశ్చర్యాణి = ఆశ్చర్య జనకములను; పశ్య.

రా. నాయొక్కయైనరూపమునందు, పశ్య = చూడుము; ఆదిత్యాన్—పండ్రెండుగురను; వసూన్— ఎనమండ్రను; రుద్రాన్— పదునొకండుగురను; అశ్వినౌ — ఇద్దఱను; మరుతః— నలువదితొమ్మిదిమందిని. నిదర్శనార్థం బిది. ఈలోకమునందుఁ బ్రత్యక్షదృష్టంబులును శాస్త్రదృష్టంబులును ఏవస్తువులు గలవో వానిసర్వంబులను, ఇతరములను గూడ సర్వలోకంబులయందును సర్వశాస్త్రంబులయందును అదృష్టపూర్వము లయిన యాశ్చర్యములను బెక్కింటిని జూడుము.

* దీనికి హనుమద్వ్యాఖ్యానము లేదు.

ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్
మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి. ౭

**భా.** ఇంతమాత్రమే కాదు — ఇహ = ఇట; మమ = నాయొక్క; దేహే = దేహమునందు; ఏకస్థమ్ = ఒక్కచానియందున్న; జగత్ = జగత్తును; సచరాచరమ్ = చరముతోను అచరముతోను గూడినదానిని; అద్య = ఇప్పుడు; పశ్య = చూడుము. గుడాకేశ = అర్జునా! యచ్చ = మఱియు దేనిని; అన్యత్ = ఇతరమును, జయపరాజయాదికమును శంకించుచున్నావో «యద్వాజయేమ యదివానో జయేయుః» అని; దానిని గూడ. ద్రష్టుమ్ = చూచుటకు; ఇచ్ఛసి = కోరుదువేని.

అర్జునా! ఈ నాదేహమునందు ఒక్కచోటనే యుండునట్టి జంగమస్థావర సహితమయిన సమస్తజగత్తును ఇప్పుడే చూడుము; మఱియు మనము జయింతుమో లేక వారే మమ్ము జయింతురో అని శంకించితివి గదా! దానిని గూడఁ జూడఁ గోరుదువేని నాదేహమునందే చూడు మని తాత్పర్యము.

**ఆ.** ఆదిత్యవస్వాదులను మాత్రమే కాదు, మఱేమనఁగా సమస్తజగత్తునుగూడ నాదేహమునందుఁ జూడవచ్చు నని చెప్పుచున్నారు ఇంతమాత్రమే కాదు అని. రెండుసప్తములును * పరస్పరము అన్వయించుచున్నవి. సమాసాంతర్గతమయిన సప్తమియు † నందే యన్వయించును. కోరుదువేని— అప్పుడిటనే చూడు మని సంబంధము.

**హ.** ఇహ మమ దేహే = ఈ నాదేహమునందు. గుడాక యనఁగా నిద్ర; దానికి ఈశుఁడు స్వామి కావున గుడాకేశుఁడు, నిద్రను జయించినవాఁడా యని యర్థము.

**శ్రీ.** ఎందుఁ జూడవలయు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—గుడాకేశ = గుడములు—వర్తులాకారము లగు, అ = అంతటను, కేశములు గలవాఁడా! సచరాచరమ్ = జంగమస్థావరసహిత మగు; ఏకస్థమ్ = ఒకచోటనే యున్నట్టి; కృత్స్నమ్ = సమస్తమయిన; జగత్ = జగత్తును; ఇహ = ఈ; మమ = నాయొక్క; దేహే = విశ్వాత్మకమయినశరీరమునందు; అద్య = ఇప్పుడు; పశ్య = చూడుము. యచ్చ

* ఇహ దేహే అనునవి.

† ఏకస్థమ్ అనుచో ఏకశబ్దమున నుండునది.

అన్యత్ = మఱియు నితరము దేనిని, శత్రువులపరాజయమును గాని నాశమును గాని; ద్రష్టు మిచ్ఛసి; దానిని గూడ నాదేహమునందే చూడు మని యర్థము.

మ. ఇంతమాత్రమునే కాదు, సమస్త మయినజగమును గూడ నాదేహమునందుఁ జూడఁ గల వని చెప్పుచున్నాఁడు.—ఇహ = ఈ; మమ దేహే; ఏకస్థమ్ = ఒకదానియందే యవయవరూపంబున నున్నదానిని; జగత్; కృత్స్నమ్ = సమస్తమును; సచరాచరమ్ = జంగమస్థావరసహితమును, అంతటను దిరిగినను వేయికోట్ల సంవత్సరములకును జూడ నశక్య మయినదానిని; అద్య = ఇప్పుడే; పశ్య = చూడుము. ఓ గుడాకేశుఁడా! యచ్చ; అన్యత్ = జయపరాజయాదికమును; ద్రష్టు మిచ్ఛసి; దానిని గూడ సందేహనివృత్తికొఱకుఁ జూడుము.

శ్రీ. మఱియును.—అచ్చటచ్చటఁ దిరిగిచూచినను కోట్లకొలఁదిసంవత్సరములకును జూడ నశక్య మైనచరాచరసహితం బగు సమస్తజగత్తును గూడ, ఈ నాదేహమునం దవయవరూపంబున నొక్కచోటనే యున్నదానిని, ఇప్పుడే చూడుము. యచ్చ అన్యత్ = మఱియు నితరము దేనిని—జగదాశ్రయభూత మయిన కారణస్వరూపమును జగత్తుయొక్క యవస్థావిశేషాదికమును జయపరాజయాదికమును; ద్రష్టు మిచ్ఛసి. దాని నంతయుఁ జూడుము.

ప. ఇహ = పురోవర్తియగు, బీజం మాం సర్వభూతానా మ్మని చెప్పుట వలన సకలబీజభూతము మనుష్యాకృతిక మగు; మమ దేహే; కృత్స్నమ్ = సమస్త మయిన; జగత్; ఏకస్థమ్ = ఒకచోట నున్నదానిని; అద్య = ఇప్పుడే; పశ్య = చూడుము. అది చెప్పఁబడినది.—"పార్థో రథస్థే ద్విభుజస్వరూపే దదర్శ దేహే ఖలు విశ్వరూపమ్। న విశ్వరూపే దదృశే రథస్థం య ద్విశ్వరూపస్య నిదాన మేతత్"* అని. మున్ను తనశరీరము లోపల మార్కండేయమునికిని బిమ్మట శరీరైకదేశమునందుఁ దల్లికిని విశ్వరూపముఁ జూపినాఁడు. అట్లు చెప్పఁబడినది యారణ్యపర్వమునందుఁ గామ్యకవనంబునఁ గృష్ణసహితుండై యున్నయుధిష్ఠిరునితో మార్కండేయునిచేత.— "తతః కదాచి త్పశ్యామి తస్మి న్సలిలవిప్లవే। న్యగ్రోధం సుమహా న్తం వై తచ్ఛాఖాయాం నరాధిప॥ ఉపవిష్టంతు పర్యఙ్కే పూర్ణేన్దుసదృశాననమ్। ఫుల్లపద్మవిశాలాక్షం

* పార్థుఁడు రథమునం దున్న ద్విభుజస్వరూప మయినదేహమునందుఁ గదా విశ్వరూపముఁ జూచెను. విశ్వరూపమునందు రథస్థితరూపముఁ జూడఁ డయ్యెను. ఏల యనఁగా, రథస్థితరూపము విశ్వరూపమునకు మూలభూతము.

బాలం శ్రీవత్సలాఞ్ఛనమ్॥ తతో బాలేన తేన స్వం సహసా వివృతం ముఖమ్। తస్యాఽహ మవశో వక్త్రం దైవయోగా త్ప్రవేశితః॥ తత్ర ప్రవిష్ట స్తస్యాఽహ మపశ్యం నిఖిలం జగత్। య స్స దేవో మయా దృష్టః పురా పద్మనిభేక్షణః॥ స ఏవ పురుషవ్యాఘ్ర సంబన్ధీ తే జనార్దనః। అ స్యైవ వరదానేన స్మృతి ర్న ప్రజహాతి మామ్॥ దీర్ఘ మాయుశ్చ కౌన్తేయ స్వచ్ఛన్దమరణంచ మే। స ఏష కృష్ణో వార్ష్ణేయః పురాణః పురుషోత్తమః॥ ఆస్తే హరి రచిన్త్యాత్మా క్రీడ న్నివ మహాభుజః" * అని. భాగవతమునందును.—"సా తత్ర దదృశే విశ్వం జగత్స్థాస్నుచ ఖం దిశః। సాద్రి ద్వీపాబ్ధి భూగోలం స వా య్వగ్నీన్దుతారకమ్" ♦ అని. ఇట్లుండఁగా సకల దేహమునందుఁ జూచుట యేమి యాశ్చర్యము.? అని యర్థము. ఇఁక భూతంబున నేమి యయ్యెను? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యచ్చాన్యత్ = ఇతరమును దేనికి కారణీభూత మయిన బ్రహ్మాదిదేవతావిశేషాదికమును; ద్రష్టు మిచ్ఛసి. దానిని గూడఁ జూడు మని యర్థము. ఇఁక శతశో ఽథ సహస్రశః అనునర్థమునందు శ్రుతియును.— "సహస్రశీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్। స భూమిం విశ్వతో వృత్వా అత్యతిష్ఠ ద్దశాఙ్గులమ్" అని. భాష్యము.—సహస్రశీర్షేత్యాదికము పదునాఱుఋక్కులు గల సూక్తము. నారాయణుండు ఋషి, కడపటిది త్రిష్టుప్పు, తక్కినవి యనుష్టుప్పులు. అవ్యక్తాదిమహదాదిచేతనుఁ డేపురుషుఁడు గలఁడో అతఁడు దేవత. ఇట్లు సర్వంబునకును అనుక్రమము. అందు మొదటిది సహస్రశీర్షా యనునది. సర్వప్రాణిసమష్టిరూపుఁడు బ్రహ్మాండదేహుఁడు విరాడాఖ్యుఁ డగుపురుషుఁ డెవ్వఁడు.

* అంత నొకప్పుడు జలప్రళయమునందు గొప్పమఱ్ఱిచెట్టును దానికొమ్మయందుఁ బాన్పుమీఁదఁ గూర్చుండియున్న వానిని పూర్ణచంద్రసమానముఖుండును వికసించిన తామరపూరేకులవలె విశాలంబు లగు నయనంబులు గలవాఁడును శ్రీవత్సలాంఛనుండు నగు బాలునిఁ జూచితిని. అంత నబ్బాలుండు తననోరు దెఱచెను. నే నవశుండనై యతనినోటిలోపలికి దైవయోగంబున త్రోయఁబడితిని. అందుఁ బ్రవేశించి యతనియుదరమునందు సమస్తజగత్తును జూచితిని. మున్ను కమలసదృశనేత్రుం డగు నే దేవుండు నాచేఁ జూడఁబడియెనో ఆజనార్దనుఁడే నీకు బంధువై యున్నాఁడు. ఇద్దేవునివరముచేత నే నాకు స్మృతి తొలంగకున్నది. దీర్ఘాయువును స్వచ్ఛందమరణంబును సిద్ధించెను. ఆపురాణపురుషోత్తముఁడే యీవృష్ణివంశజుం డగుకృష్ణుఁడు. అచింత్యరూపుం డగు నాహరియే యిట్లు క్రీడించువాఁడువలె ఇమ్మహాభుజరూపంబున నున్నాఁడు.

♦ ఆయశోద అందు సర్వప్రపంచమును—జంగమస్థావరములను ఆకాశమును దిక్కులను బర్వతంబులను ద్వీపంబులను సముద్రములను భూగోళములను వాయువును అగ్నిని చంద్రుని నక్షత్రములను జూచెను.

గలఁడో అతఁడు, సహస్రశీర్షా—సహస్రశబ్దము ఉపలక్షణం బగుటవలన, అనంతము లగుశీర్షములు—శిరస్సులు గలవాఁ డని యర్థము. సర్వప్రాణులకును శిరస్సులు ఏవి గలవో అవి యున్నియు తద్దేహాంతర్భూతము లగుటవలన వానివే కావున సహస్రశీర్షుఁడు. ఇట్లు సహస్రాక్షుఁడును సహస్రపాదుఁడును. సః = ఆపురుషుఁడు; భూమిమ్ = బ్రహ్మాండగోలరూప మయినభూమిని; విశ్వతః = అంతటను; వృత్వా = పరివేష్టించి; దశాఙ్గులమ్ = పదియంగులములపరిమితిగల ప్రదేశమును; అత్యతిష్ఠత్ = అతిక్రమించి యున్నాఁడు. దశాంగుల మ్మనునది యుపలక్షణము, కావున బ్రహ్మాండమునకు వెలుపలఁ గూడ నంతటను వ్యాపించి యున్నాఁ డని యర్థము. లేక, ఓం భూః ఓం భువః ఓం సువః ఓం మహః ఓం జనః ఓం తపః ఓం సత్యమ్ ఓం తత్స వితుర్వరేణ్యం భర్గో దేవస్య ధీమహి। ధియో యో నః ప్రచోదయాత్॥ ఓ మాపో జ్యోతీ రసో ఽమృతం బ్రహ్మ భూర్భువ స్సువ రోమ్ అను దశప్రణవగాయత్రిచేఁ జెప్పఁబడినప్రదేశమును దశాంగులము నతిక్రమించి యున్నాఁ డని కొందఱు.

టీ. ఇహ= ఇందు; మమ దేహే= నాయొక్క దేహమునందు; అందును, ఏకస్థమ్ = ఏకదేశమున నున్నదానిని; సచరాచరం కృత్స్నం జగత్ పశ్య. యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి — మఱియు నితరము దేనిని జూడఁ గోరుచున్నావో; దానిని గూడ ఈయొక్క దేహమునందలి యేకదేశమునందే చూడుము.

నతు మాం శక్యసే ద్రష్టు మనేనైవ స్వచక్షుషా
దివ్యం దదామి తే చక్షుః పశ్య మే యోగ మైశ్వరమ్. ౮

భా. అయినను.—మామ్= విశ్వరూపధరుఁడ నగు నన్ను; అనేన = ఈప్రాకృత మయిన; స్వచక్షుషా ఏవ = నీనేత్రముచేతనే; ద్రష్టుమ్ = చూచుటకు; నతు శక్యసే = చాలనే చాలవు. మఱి, దేనిచే దివ్య మగుదానిచేఁ జూడఁ జాలుదువో అట్టి, దివ్యమ్ = అప్రాకృత మగు; చక్షుః = నేత్రమును; తే = నీకొఱకు; దదామి = ఇచ్చుచున్నాను. దానిచే, మే = నాయొక్క; ఐశ్వరమ్ = ఈశ్వరుండ నగు నాదైన; యోగమ్— యోగశక్త్యతిశయము నని యర్థము; పశ్య = చూడుము.

ఆయినను, ప్రాకృతమయిన నీనేత్రముచేతనే నన్నుఁ జూడ నలవి గాదు, నీకు దివ్యదృష్టి నిచ్చెదను, దానిచే నీశ్వరుండ వగు నాయోగమహిమను జూడుమని తాత్పర్యము.

ఆ. మన్యసే యది యని చెప్పినదాని ననువదించుచున్నారు అయినను అని. అనవచ్ఛిన్నుండ నగుననున్న నీదృష్టిచే సాకల్యంబునఁ జూడఁ జాల వని చెప్పుచున్నారు మామ్ ఇత్యాదిగా. ఎట్లు మఱి నిన్నుఁ జూడఁ జాలుదు నని యాశంకించి చెప్పుచున్నారు మఱి దేనిచే నిత్యాదిగా. దివ్యనేత్రమునకుఁ జెప్పఁబోవు యోగశక్త్యతిశయముఁ జూచుటయందు వినియోగముఁ జూపుచున్నారు దానిచే నని.

హ. *

శం. మఱియును.—ఎట్లు మున్నింద్రాదులఁ జూచితివో అట్లు, మాం-తు = నన్ను అప్రాకృతుని దివ్యుని తేజోరాశిని విశ్వరూపధరుని అప్రమేయుని మాత్రము; అనేన = ఈప్రాకృతము చర్మమయ మయిన; స్వచక్షుషైవ = నీనేత్రముచేతనే; నీవు, ద్రష్టుమ్ = చూచుటకు; నశక్యసే = శక్తుఁడవు కావు. అప్పుడు నా కేమి గతి యని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—తే = నీకొఱకు; నన్నుఁ జూచుటకు సమర్థ మయిన, దివ్యమ్ = తేజోమయ మగు; చక్షుః = నేత్రమును; దదామి. దానిచే నీవు నన్నుఁ జూడఁ జాలుదువు. కావున; ఆనేత్రముచే, మే = నాయొక్క; ఐశ్వరమ్ = ఈశ్వరత్వమునకుఁ గారణ మయిన; యోగమ్ = యోగమాయావిజృంభిత మగుస్వరూపమును; పశ్య = చూడుము. అని యర్థము.

మ. « మన్యసే యది తచ్ఛక్యం మయా ద్రష్టుమ్ '' అని యేది చెప్పఁబడినదో అందు విశేషముఁ జెప్పుచున్నాఁడు.—అనేన = ఈప్రాకృత మగు; స్వచక్షుషైవ = స్వభావసిద్ధ మయిననేత్రముచేతనే; మామ్ = నన్ను దివ్యరూపుని; ద్రష్టుమ్ = చూచుటకు; నతు శక్యసే = చాలనే చాలవు. శక్ష్యసే అనుపాఠమునందు—శక్తుఁడవు కాఁబోవు అని యర్థము. సౌవాదిక మయినను శక్నోతికి ఛందస్సునఁ దైవాదికం బగుశ్యన్ప్రత్యయము రావచ్చును, లేక, దీనికి దివాదియందుఁ బాఠము గల దని సాంప్రదాయికము. అప్పుడు, ఎట్లు నిన్నుఁ జూడఁ జాలుదును ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—దివ్యమ్ = అప్రాకృత మయిన, నాదివ్యరూపముఁ జూడ సమర్థ మయిన; చక్షుః; తే = నీకొఱకు; దదామి. ఆదివ్యనేత్రముచే, మే = నాయొక్క; యోగమ్ = అఘటనఘటనాసామర్థ్యాతిశయమును; ఐశ్వరమ్ = ఈశ్వరుఁడ నగు నా కసాధారణ మయిన దానిని; పశ్య.

శ్రీ. అర్జుననిచే « మన్యసే యది తచ్ఛక్యమ్ » అన యేది చెప్పఁబడినదో దానికిఁ జెప్పుచున్నాఁడు.—ఈ నీచర్మచక్షుస్సుచే నేమో నన్నుఁ జూడ శక్తుఁడవు

* దీనికి హనుమద్వ్యాఖ్యానము లేదు.

కావు. అందువలన నేను దివ్యము—అలౌకికము జ్ఞానాత్మక మగు చక్షుస్సు నీ కిచ్చెదను. నాయొక్క నైశ్వరము—అసాధారణ మగు యోగమును—యుక్తిని—అఘటిత ఘటనాసామర్థ్యమును జూడుము.

వ. ఇట్టి నిట్టి యద్భుతరూపముఁ జూచుట చర్మచక్షుస్సుచే నెట్లు శక్యమగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అనే నైవ స్వచక్షుషా = ఇప్పు డున్న నీ నేత్రము చేతనే; మే; ఐశ్వరం యోగమ్=అలౌకిక మగుయోగమును; ద్రష్టుం నశక్యసే. కావున, నీకొఱకు అంతర్యామి నగు నేను, దివ్యమ్ = సత్త్వాకారాంతఃకరణవృత్తిసహితమయిన జ్ఞానాత్మక మగు; చక్షుః; దదామి. దానిచేఁ జూడుము. ఎట్లు అంజనసంస్కారముచే నతీంద్రియ మయినను నిధానము చూడఁబడునో అట్లే యని యర్థము. దైవాత్మ కృష్ణాఙ్గన దివ్యదృష్టిః అని మున్నే చెప్పఁబడినది. టిప్పణికలయందును.— "దేవకీతనయ సేవకీకృతం యైర్మనా గపి మనో వినోదతః । అఞ్జసీ భవతి కఞ్జలోచన స్తాదృశాం గతి నిధాన సాధనే" ✦ అని. ఇట్లే యితరులు గూడ దివ్యదృష్టిని బొందియే కృష్ణుని దేహావయవములయందు విశ్వరూపము చూచిరని యుద్యోగపర్వమునందుఁ బాండవదూతయై కౌరవసభకు భగవంతుఁడు పోయిన ప్రకరణమునందుఁ జెప్పఁబడినది.—"విదురేణైవ ముక్తేతు కేశవః పరవీరహా । దుర్యోధనం ధార్తరాష్ట్ర మభ్యభాషత వీర్యవాన్॥ ఏకో உహ మితి య న్మోహా న్మన్యసే మాం సుయోధన । పరిభూయ తు దుర్బుద్ధే గృహీతుం మాం చికీర్షసి॥ ఇహైవ పాణ్డవా స్సర్వే తథైవా உన్ధకవృష్ణయః । ఇహా దిత్యాశ్చ రుద్రాశ్చ తథైవచ మహర్షయః॥ ఏవ ముక్త్వా జహా సోచ్చైః కేశవః పరవీరహా॥ తస్య ஃ உస్య త్స్మయత శ్శౌరే ర్విద్యుద్రూపా మహాత్మనః । అఙ్గుష్ఠమాత్రా స్త్రిదశా ముముచుః పావకార్చిషః॥ తస్య బ్రహ్మా లలాటస్థో రుద్రో వక్షసి చా உభవత్ । ప్రాదురాస్తాం తథా దోర్భ్యాం సఙ్కర్షణ ధనఞ్జయౌ॥ భీమో యుధిష్ఠిర శ్చైవ మాద్రీపుత్రౌచ పృష్ఠతః । అన్ధకా వృష్ణయ శ్చైవ ప్రద్యుమ్న ప్రముఖా స్తథా॥ ఆవిర్బభూవుః కృష్ణాఙ్గా త్సముద్యత మహాయుధాః । శఙ్ఖ చక్ర గదా శక్తి శార్ఙ్గ లాఙ్గల నన్దకమ్॥ అదృశ్యా న్యద్భుతా న్యేవ సర్వ ప్రహరణాని చ । నానా బాహుషు కృష్ణస్య దీప్యమానాని సర్వశః॥ నేత్రాభ్యాం నస్త శ్చైవ శ్రోత్రాభ్యాం చ సమన్తతః । ప్రాదురాస న్మహారౌద్రా స్సధూమాః పావకార్చిషః॥ రోమకూపేషుచ తథా సూర్య స్యేవ

✦ ఎవ్వరిచేఁ గొంచెమైనను మనస్సు వినోదంబున కృష్ణునకు సేవకముగాఁ జేయఁబడినదో అట్టివారికిఁ గృష్ణుఁడు ఘస్గతి యను నిధానమును సాధించుటయందు కొట్టుకన్నతె నగుచున్నాఁడు.

మురీచయః । తద్దృష్ట్వా మహదాశ్చర్యం కేశవస్య మహాత్మనః॥ న్యమీలయన్త నేత్రాణి రాజానస్త్రస్తచేతసః। ఋతే భీష్మంచ ద్రోణంచ విదురం సఞ్జయం తథా॥ ప్రాదాత్తేషాం స భగవాన్దివ్యం చక్షుర్జనార్దనః । తద్దృష్ట్వా మహదాశ్చర్యం మాధవస్య సభాతలే॥ దేవదున్దుభయో నేదుః పుష్పవర్షం పపాతచ ॥ * అని.

రా. నేను నాదేహముసందలి యేకదేశమునందు సర్వజగంబును జూపెదను. నీవో నియతంబును బరిమితంబు నగువస్తువును గ్రహించునట్టి యీ నీప్రాకృత చక్షుస్సుచే, మామ్ = అట్టివాని సకలేతరవిజాతీయుని అప్రమేయుని నన్ను; ద్రష్టుం నశక్యసే. నీకు, దివ్యమ్ = అప్రాకృత మగు, నన్నుఁ జూచుటకు సాధన మయిన; చక్షుః; దదామి. పశ్య మే యోగమైశ్వరమ్=నాయసాధారణ మయినయోగమును జూడుము, నాయొక్కయనంతజ్ఞానాదియోగంబును అనంతవిభూతియోగంబునుం జూడు మని యర్థము.

సఞ్జయ ఉవాచ.—

ఏవ ముక్త్వా తతో రాజన్ మహాయోగేశ్వరో హరిః
దర్శయామాస పార్థాయ పరమం రూప మైశ్వరమ్. ౯.

---

* ఇట్లు విదురుండు చెప్పఁగా శత్రువీరుల వధించునట్టి కృష్ణుఁడు ధృతరాష్ట్రకుమారుఁ డైన దుర్యోధనునితో నిట్లనియె. దుర్బుద్ధి వగు దుర్యోధనా! నే నొక్కఁడ నని తలఁచి నన్నవమానించి బంధింపఁ గోరుచున్నావు! నాయందే పాండవులును అంధకవృష్ణు లందఱు నున్నారు. నాయందే యాదిత్యులును రుద్రులును మహర్షులు నున్నారు. ఇట్లు పలికి పెద్దనవ్వు నవ్వెను. అట్లు నవ్వుచున్న యతనిముఖమునుండి యంగుష్ఠపరిమాణులై మెఱపులవలె దేవతలు వెడలి యగ్నిజ్వాలలు గ్రక్కిరి. అతనిలలాటంబున బ్రహ్మయు వక్షంబున రుద్రుండును నిలిచిరి. బాహువులనుండి బలరాముఁడును అర్జునుండును బ్రాదుర్భవించిరి. భీముండును ధర్మరాజును నకులసహదేవులును బృష్ఠమునుండి ప్రాదుర్భవించిరి. అంధకులును వృష్ణులును బ్రద్యుమ్నుఁడు మున్నగువారును గృష్ణునిదేహమునుండి మహాయుధధారులై వెడలిరి. శంఖచక్రగదాశక్తిశార్ఙ్గలాంగలనందకములు మొదలగు నానావిధాయుధములు అంతట ను న్నదృశ్యము లయి యుండినవి యతని యనంతబాహువులందు వెలుంగుచుండెను. నేత్రములనుండియు వక్షమునుండియు శ్రోత్రములనుండియు అంతటను మహాభయంకరములై ధూమసహితంబులగు నగ్నిజ్వాలలు పొడమెను. రోమకూపంబులయందును సూర్యునికిరణంబులవంటి యగ్నిజ్వాలలు వెడలెను. మహాత్ముం డగు కృష్ణుని యయ్యాశ్చర్యముం జూచి భీష్మద్రోణులును విదురసంజయులుం దక్కఁ దక్కినరాజులు వెఱచి కన్నులు మూసికొనిరి. ఆభగవంతుఁడు భీష్మాదులకు దివ్యచక్షుస్సు నిచ్చెను. సభాతలంబున నయ్యాశ్చర్యమ్ముం జూచి దేవదుందుభులు మ్రోగెను. పుష్పవర్షము గురిసెను.

భా. సంజయుఁ డి ట్లనియె.—ఏవమ్=యథోక్తప్రకారమున; ఉక్త్వా=చెప్పి; తతః=అనంతరము; రాజన్=ధృతరాష్ట్రుఁడా! మహాయోగేశ్వరః=గొప్పవాఁడును యోగుల కీశ్వరుఁడు నగు; హరిః = నారాయణుఁడు; పార్థాయ = పృథాపుత్త్రుఁ డైనయర్జునునికొఱకు; పరమమ్ = ఉత్కృష్ట మయిన; ఐశ్వరమ్=ఈశ్వరుని దగు; రూపమ్=విశ్వరూపమును; దర్శయామాస=చూపెను.

సంజయుఁడు ధృతరాష్ట్రున కి ట్లనియె. రాజా! ఇట్లు చెప్పి దివ్యదృష్టి యిచ్చిన పిమ్మట మహాయోగేశ్వరుఁ డగుకృష్ణుఁడు పార్థునకుఁ బరమం బగు తనవిశ్వరూపముఁ జూపె నని తాత్పర్యము.

ఆ. ఈవృత్తాంతమును ధృతరాష్ట్రునకు సంజయుఁడు విన్నవించె నని చెప్పుచున్నారు సంజయుఁడు ఇత్యాదిగా. నావిశ్వరూపము ప్రాకృతదృష్టితోఁ జూడ నలవి కాదు, దివ్యదృష్టిచేతనే చూడ నలవి యగును—ఇత్యాదికము యథోక్తప్రకారము. అనంతరము—దివ్యచక్షుస్సు నిచ్చిన పిమ్మట నని యర్థము. కార్యసహిత మయినయవిద్యను హరించుచున్నాఁడు కావున హరి. మాయాసహితుం డగు నీశ్వరుని యుత్కృష్టరూప మేది గలదో దానిఁ జూపె నని చెప్పుచున్నారు పరమ మిత్యాదిగా.

హ. సంజయుఁ డి ట్లనియె.—రాజన్—ఇది ధృతరాష్ట్రునిసంబోధనము. యోగము గలవారు యోగులు, మహాయోగుల కీశ్వరుఁడు మహాయోగేశ్వరుఁడు; హరి.

శ్రీ. యోగ మనఁగా కార్యసహిత మయిన యోగమాయ, దానికి ప్రవృత్తికిఁ గారణ మగుటవలన ఈశ్వరుఁడు, గొప్పవాఁడును యోగేశ్వరుఁడును గావున మహాయోగేశ్వరుఁడు; తనసాక్షాత్కారము గలవారి యవిద్యను కార్యసహితమును హరించుచున్నాఁడు కావున హరి—పరమాత్మ; ఐశ్వరమ్ = ఈశ్వరసంబంధి యగు; పరమమ్=నిరతిశయ మయిన; రూపమ్; దర్శయామాస.

మ. ఏవమ్=ఈనేత్రముతో నన్నుఁ జూడనే లేవు, కావున నీకు దివ్యనేత్రము నిచ్చెదను అని; ఉక్త్వా=చెప్పి; తతః=దివ్యనేత్రము నిచ్చిన పిమ్మట; రాజన్=ఓధృతరాష్ట్రా! వినుటకు స్థిరుండ వగుము. మహాయోగేశ్వరః=సర్వోత్కృష్టుఁడును యోగే

శ్వరుఁడు నగు; హరిః=భక్తుల సర్వక్లేశములను హరించునట్టి భగవంతుఁడు; మాకు టుకుఁ దగనిదాని నైనను, పరమమ్ ఐశ్వరం రూపమ్; పార్థాయ=ఏకాంతభక్తుఁ డయిన యర్జునునికొఱకు; దర్శయామాస=చూపెను.

శ్రీ. ఇట్లు చెప్పి భగవంతుఁ డర్జునునకు విశ్వరూపముఁ జూపెను, దానిఁ జూచి యర్జునుండు శ్రీకృష్ణునితో విన్నవించెను—అను నీయర్థము నాలుశ్లోకములచే ధృతరాష్ట్రునకు సంజయుఁ డిట్లనియె.— రాజన్=ఓధృతరాష్ట్రా! గొప్పవాఁడును యోగేశ్వరుఁడు నగు హరి, పరముంబును ఐశ్వరంబు నగు రూపమును జూపెను.

ప. ఇఁకఁ బ్రకృత మనుసరింతము. ఇట్లు పలికి భగవంతుం డర్జునునకు రూపముఁ బ్రదర్శించెను, అర్జునుండును దానిం జూచి భగవంతునితో విన్నవించెను— అను నీవృత్తాంతమును సంజయుఁడు ధృతరాష్ట్రున కాలుశ్లోకములచేఁ జెప్పెను.— రాజన్=ధృతరాష్ట్రా! మహాయోగేశ్వరేశ్వరః ♦=గొప్పవారును యోగేశ్వరులును మహాయోగేశ్వరులు, యోగ మనఁగా జీవబ్రహ్మైక్యము గదా! దానియందు ఈశ్వరులు—సమర్థులు శుకవామదేవయాజ్ఞవల్క్యప్రభృతులు, వారలకును ఈశ్వరుఁ డైన కృష్ణుఁడు; పార్థాయ; పరమమ్=పారమార్థిక మయిన; ఐశ్వరమ్ = అఘటితఘటనాసమర్థ మగు; రూపం దర్శయామాస.

రా. ఏవ ముక్త్వా; సారథ్యమునం దున్నవాఁడును పార్థుని మేనమామకుమారుఁడు నగు, మహాయోగేశ్వరో హరిః=మహైశ్వర్యయోగముల కీశ్వరుఁడు పరబ్రహ్మభూతుఁ డగు నారాయణుఁడు; పరమమ్; ఐశ్వరమ్ = తనయసాధారణ మయిన; రూపమ్; పార్థాయ = తనమేనయత్త యగు పృథయొక్కపుత్త్రుఁ డైన యర్జునునికొఱకు; దర్శయామాస; అట్టి వివిధవిచిత్రజగదాశ్రయంబును సర్వప్రపంచమును బ్రకాశించునదియు నగు రూపమును.

మా. హరిః = సర్వయజ్ఞభాగములను హరించుటవలన. "ఇడోపహూతం గేహేషు హరే భాగం క్రతుష్వహమ్ । వర్ణో మే హరిత శ్శ్రేష్ఠ స్తస్మా ద్ధరి రితి స్మృతః" * అని గదా మోక్షధర్మమునందు.

అనేకవక్త్రనయన మనేకాద్భుతదర్శనమ్
అనేకదివ్యాభరణం దివ్యా నేకోద్యతాయుధమ్. ౧౦

♦ వీరిపత్తుమునందు మహాయోగేశ్వరేశ్వరః అని పాఠము.

* గృహములయందును యజ్ఞములయందును వేదమంత్రముచే వేల్వఁబడినభాగమును నేను హరించుచున్నాను; నాకు శ్రేష్ఠ మయిన హరితవర్ణంబు గలదు కావున హరి యని చెప్పఁబడితిని.

దివ్యమాల్యామ్బరధరం దివ్యగన్ధానులేపనమ్
సర్వాశ్చర్యమయం దేవ మనన్తం విశ్వతోముఖమ్. ౧౧

భా. అనేకవక్త్రనయనమ్ = అనేకము లయినముఖములును నేత్రములును గలదియును; అనేకాద్భుతదర్శనమ్ = అనేకము లయిన అద్భుతములు—ఆశ్చర్యకరము లగు దర్శనములు ♦ దేనియందో అట్టిదియు; అట్లు, అనేకదివ్యాభరణమ్ = అనేకము లయిన దివ్యము లగుభూషణములు గలదియు; అట్లు, దివ్యానేకోద్యతాయుధమ్ = దివ్యములును అనేకములు ఉద్యతములును— ఎత్తఁబడినవియు నగు నాయుధములు గలదియు నగు; రూపమును జూపె నని పూర్వశ్లోకముతో సంబంధము. మఱియును.—— దివ్యమాల్యామ్బరధరమ్ = దివ్యము లయిన పుష్పములును వస్త్రములును ధరించినవాఁడును; దివ్యగన్ధానులేపనమ్ = దివ్య మయిన గంధపుపూఁత గలవాఁడును; సర్వాశ్చర్యమయమ్=సర్వాశ్చర్యప్రాయుండును; అనన్తమ్= అంతము లేనివాఁడును; విశ్వతోముఖమ్ = సర్వభూతాత్ముఁ డగుటవలన సర్వతోముఖుండు నగు; దేవమ్ = దేవుని; దర్శయామాస— చూపెను. లేక, అర్జునో దదర్శ—అర్జునుఁడు చూచె నని యధ్యాహారము.

లెక్కకు మీఱినముఖములును కన్నులును గలదియును లెక్కకు మీఱిన యాశ్చర్యదర్శనములకుఁ జోటయినదియు లెక్కకుమీఱిన దివ్యాభరణములు గలదియు దివ్యములై లెక్కకుమీఱిన వగు నాయుధముల ధరించినదియు నగురూపమును భగవంతుఁ డర్జునునకుఁ జూపెను. దివ్యము లయినపుష్పములను వస్త్రములను ధరించినవాఁడును దివ్య మయినగంధము పూసి యున్నవాఁడును సర్వాశ్చర్యమయుండును అనంతుండును సర్వతోముఖుండు నగు నీశ్వరుని—అర్జునునకుఁ జూపెను. లే, అర్జునుఁడు చూచె నని తాత్పర్యము.

ఆ. ఆరూపముననే విశేషణము చేయుచున్నారు.—దివ్యము లయిన భూషణములు—హారకేయూరాదులు. అట్టిరూపము గల భగవంతునకుఁ బ్రకారాంతరంబున విశేషణము చేయుచున్నారు మఱియును అని. లేక...అధ్యాహారము— అధ్యాహారమునందును పదసంఘటనము సంభవించుటవలన.

♦ చూచుటలు.

హ. అనేకవక్త్రనయనమ్ = అనేకము లయిన ముఖములును కన్నులును గలదానిని. అనేకాద్భుతదర్శనమ్ = అనేకము లయిన యద్భుతములయొక్క దర్శనము—ఉపలబ్ధి * దేనియందుఁ గలదో అట్టిదానిని.

శం. ఆరూపమునే వర్ణించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—అనేకాద్భుతదర్శనమ్ = దర్శనములు—ఊర్ధ్వాధస్తిర్యక్పార్శ్వములయందుఁ జూచునట్టి వికృతములును సౌమ్యములును సాధారణములును భయంకరములును చిత్రములు నగు చూపులు గలదానిని. దివ్యానేకోద్యతాయుధమ్ = దివ్యములు — అధికప్రకాశము గలవియు అనేకములును ఎత్తఁబడినవియు నగు చక్రగదాద్యాయుధములు గలదానిని. మఱియును—సర్వాశ్చర్యమయమ్ = తేజోబలవీర్యశక్తిరూపగుణావయవసంస్థానవిశేషములయన్నిటిచేతను అధికాశ్చర్యము కలిగించుదానిని; దేవమ్ = అంతటను తనయంతనే దీవ్యతే—ప్రకాశించుచున్నది కావున దేవమును. విశ్వతోముఖమ్ = సర్వాకారమైనదానిని; కావుననే, అనన్తమ్= అపరిచ్ఛిన్నమును. అట్టి స్వరూపమును జూపె నని పూర్వముతో నన్వయము.

మ. ఆరూపమునకే విశేషణము చేయుచున్నాఁడు.—అనేకము లయిన వక్త్రములును నయనములును గలదానిని. అనేకము లయినయద్భుతములయొక్క—ఆశ్చర్యహేతువులయొక్క దర్శనము దేనియందో అట్టిదానిని. అనేకము లయినదివ్యము లయినయాభరణములు—భూషణములు గలదానిని. దివ్యములును అనేకములును ఉద్యతములు నగు నాయుధములు—అస్త్రములు గలదానిని. దివ్యము లయిన పుష్పమయంబులును రత్నమయంబులు నగు మాల్యములను దివ్యము లయినవస్త్రములను ధరించినదానిని. దివ్య మయినగంధము గలది దివ్యగంధము, అది మైపూఁతగాఁ గలదానిని. సర్వాశ్చర్యమయమ్ = అనేకము లయినయాశ్చర్యము లధికముగాఁ గలదానిని. దేవమ్ = ద్యోతనాత్మక మయినదానిని. అనన్తమ్ = అపరిచ్ఛిన్నమును. విశ్వతోముఖమ్ = అంతటను ముఖములుఁ గలదానిని. అట్టిరూపమును జూపె నని పూర్వముతో సంబంధము. లేక యర్జునుఁడు చూచె నని యధ్యాహారము.

శ్రీ. ఆరూప మెట్టిది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—♦.

ప. ఇఁక నీరెండుశ్లోకములు రూపవర్ణనపరములు స్పష్టార్థములు.

---

* కనఁబడుట.

♦ మధుసూదనీయము లో సమానము.

రా. ఇట్టిరూపమును జూపెను.—దేవమ్=ప్రకాశించుచున్న దానిని. అనన్తమ్=కాలత్రయమునందును ఉండునట్టి నిఖిలజగంబులకును ఆశ్రయ మగుటం జేసి దేశకాలంబులచేఁ బరిచ్ఛేదింప శక్యము కానిదానిని. విశ్వతోముఖమ్=సర్వదిక్కులయందును ఉండునట్టి ముఖములు గలదానిని. తనకుఁ దగిన దివ్యవస్త్రగంధమాల్యభూషణాయుధములతోఁ గూడినదానిని.

మూ. సర్వాశ్చర్యమయమ్=సర్వాశ్చర్యాత్మకమును.

దివి సూర్యసహస్రస్య భవేద్యుగప దుత్థితా
యది భాః సదృశీ సా స్యా ద్భాస స్తస్య మహాత్మనః. ౧౨

భా. ఏది మఱి భగవంతుని విశ్వరూపముయొక్క ప్రకాశము గలదో దాని కుపమ చెప్పఁబడుచున్నది.—దివి=అంతరిక్షమునందు, లేక, మూఁడవదివియందు; సూర్యసహస్రస్య = సూర్యులవేయింటియొక్క; ఏకకాలమున నుదయించినవానియొక్క; యుగపత్ = ఏకకాలమునం దుదయించినట్టి; భాః=ప్రకాశ మేది; భవేత్ = అగునో; సా=ఆప్రకాశము; తస్య=ఆ; మహాత్మనః= విశ్వరూపముయొక్క; భాసః= ప్రకాశమునకు; సదృశీ= సమానము; యది స్యాత్=ఐనం గావలయును. కాకున్నను గాక పోవలయును. దాని కన్నను విశ్వరూపముయొక్క ప్రకాశమే యధిక మని యభిప్రాయము.

ఆకాశమునం దేకకాలమున వేయిసూర్యుల ప్రకాశ ముదయించినయెడ ఆప్రకాశ మొకవేళ విశ్వరూపముయొక్క ప్రకాశమునకు సమాన మైనం గావచ్చు నని తాత్పర్యము.

శ్రీ. ఓయీ! ఈభగవంతుని విశ్వరూపంబునకుఁ బ్రకాశము కలదా? లేదా? లేదేని యది కాష్ఠాదిసమం బగును; కలదేని యది యెట్టిది? అని యాశంకించి చెప్పుచున్నారు ఏది మఱి ఇత్యాదిగా. అది యైనను దాని ప్రకాశమునకు సమానము కావలయు నని యోజన. యదిశబ్దము అసంభావితాభ్యుగమార్థము. స్యాత్ అనునది నిశ్చయార్థకము. అదియుఁ గష్టంబున సమాన మని చెప్పఁబడును. సమాన మేమో కా దని వివక్షించి చెప్పుచున్నారు కాకున్నను ఇత్యాదిగా.

హ. *

* దీనికి హనుమద్వ్యాఖ్యానము లేదు.

శం. విశ్వరూపముయొక్క దేవత్వ మేది చెప్పఁబడినదో దాని విశదీకరించుచున్నాఁడు.—దివి=ఆకాశమునందు; ఏకకాలముననే యుత్థిత మయిన, సూర్యసహస్రస్య=సూర్యుల వేయిరియొక్క; యుగపత్ ఉత్థితా = ఏకకాలమునం దుదయించినట్లు, మేఘాద్యావరణము లేనియట్టి; భాః= ప్రకాశము; భవేత్ = కలుగునో; సా=అది; తస్య మహాత్మనః=ఆవిశ్వరూపముయొక్క; భాసః=ప్రకాశమునకు; స్ఫురణసంపదచేఁ దాను, యది సదృశీ స్యాత్=సమానకక్ష మగునేని; అప్పుడు విశ్వరూపప్రకాశమునకు సమానము కల దని చెప్పవచ్చును. రెంటియొక్క స్ఫురణసంపదను బర్యాలోచింపఁగా సూర్యసహస్రప్రకాశముకంటె విశ్వరూపప్రకాశమే యధిక మగు నని తలంచుచున్నా నని భావము.

మ. దేవ మ్మని చెప్పినదానిని వివరించుచున్నాఁడు.—దివి = అంతరిక్షమునందు; సూర్యసహస్రస్య=అపరిమితసూర్యసమూహముయొక్క; ఏకకాలమున నుదయించినదానియొక్క; యుగపత్ ఉత్థితా = ఏకకాలమున నుదయించినట్టి; భాః=ప్రకాశము; భవేత్=కలుగునేని; అప్పుడు, సా=అది; తస్య, మహాత్మనః = విశ్వరూపముయొక్క; భాసః=దీప్తికి; సదృశీ=సమానము; యది స్యాత్=అయినను గావచ్చును, కాకున్నను గాకపోవచ్చును. దానికన్నను నిశ్చయముగా విశ్వరూపదీప్తియే యధిక మగు నని నేను దలంచుచున్నాను, వేఱుసాటి సంభవింపనే సంభవింప దని యర్థము. ఇట్లసంభావితము నధ్యవసించుటవలన నది సంభవింపమిచే సదృశాభావము సూచితం బగుటంజేసి యభూతోపమారూప మయిన యీయతిశయోక్తి యుత్ప్రేక్షను వ్యంజించుచు సర్వవిధంబుల నిరుపమత్వమునే వ్యక్తీకరించుచున్నది, ఉభౌ యదివ్యోమ్ని పృథక్ప్రవాహౌ ఇత్యాదికమునందువలె.

శ్రీ. విశ్వరూపదీప్తి నిరుపమ మని చెప్పుచున్నాఁడు.—దివి=ఆకాశమునందు; ఏకకాలమున నుత్థిత మయిన సూర్యసహస్రముయొక్క, యుగప దుత్థితా= ఏకకాలమున నుదయించినట్టి; భాః=ప్రభ; యది భవేత్ =కలుగునేని; అప్పుడు, సా=అది; మహాత్మనః=విశ్వరూపముయొక్క; భాసః=ప్రభకు; కష్టంబున, సదృశీ స్యాత్. ఇతర మయినసాటి లే దని యర్థము. అట్టిరూపమును జూపె నని పూర్వముతో నన్వయము.

ప. తస్య; మహాత్మనః=విశ్వరూపముయొక్క; భాసః = దీప్తికి; సదృశీ= సమాన మయినదీప్తి; అప్పుడే, స్యాత్ = అగును. ఎప్పుడు? దివి=ఆకాశమునందు;

సూర్యసహస్రస్య; యుగపత్ = ఏకకాలమునందు; ఉత్థితా = ఉదయించిన; భాః = దీప్తి, యది భవేత్ = కలుగునేని. అని యభూతోపమాలంకారము.

రా. తేజశ్శబ్దనిర్దిష్ట మయిన ప్రకాశమునకే విశేషణము చేయుచున్నాఁడు.— తేజస్సు అపరిమిత మని తెలుపుటకొఱకిది. అక్షయతేజస్స్వరూప మని యర్థము.

మా. సహస్రశబ్దము అనంతవాచకము. అదియును "పాకశాసనవిక్రమః" ♦ ఇత్యాదికమువలె ప్రత్యాయనము * కొఱకే. అట్లు ఋగ్వేదఖిలములయందు.— "అనన్తశక్తిః పరమోఽనన్తవీర్యస్సోఽనన్త తేజాశ్చ తత స్తతోఽపి" † అని. మహాతాత్పర్యమువలనఁ గూడ గీతావచనముకంటెఁ శ్రుతికిఁ బ్రాబల్యము. పరిమాణము చెప్పుటచేఁ బ్రయోజనంబునుం గానరాదు.

తత్రైకస్థం జగత్కృత్స్నం ప్రవిభక్త మనేకధా
అపశ్య ద్దేవదేవస్య శరీరే పాణ్డవ స్తదా. ౧౩

శ్రీ. మఱియును.— తత్ర = ఆవిశ్వరూపమునందు; దేవదేవస్య = ఈశ్వరునియొక్క; శరీరే = దేహమునందు; తదా = అప్పుడు; పాణ్డవః = అర్జునుఁడు; ఏకస్థమ్ = ఒక్కచోట నున్నదియు; అనేకధా = నానావిధములచే; ప్రవిభక్తమ్ = విభజింపఁబడినదియు నగు; కృత్స్నమ్ = సమస్త మయిన; జగత్ = ప్రపంచమును; అపశ్యత్ = చూచెను.

అర్జునుఁ డప్పుడు పరమేశ్వరునిశరీర మయినవిశ్వరూపమునందు నానావిధభేదములతోఁ గూడిన సమస్తప్రపంచమును ఒక్కచోటఁ జూచె నని తాత్పర్యము.

ఆ. చెప్పినంతమాత్రమే కా దర్జునుఁడు చూచినది, మఱే మనఁగా, ఆ విశ్వరూపమునందే సమస్తజగంబును ఒక్కచో నున్నదానిని జూచె నని చెప్పుచున్నారు మఱియును అని. అప్పుడు—భగవద్రూప మయిన విశ్వరూపమును జూచు నప్పు డని యర్థము.

హ. §

---

♦ ఇంద్రునిపరాక్రమమువంటిపరాక్రమము గలవాఁడు.

* బుద్ధిలోఁ జొప్పించుట.

† అతఁడు అనంత మయినశక్తి గలవాఁడు, ఉత్తముఁడు, అనంతమగువీర్యము గలవాఁడు, అనంత మయిన తేజస్సు గలవాఁడు, ఆయా సూర్యాదులకన్నను విలక్షణుఁడు.

‡ శంకరభాష్యముతో సమానము.

శం. "ఇహైకస్థం జగత్కృత్స్నమ్" అని భగవంతుం డెట్లు చెప్పెనో అట్లే యర్జునుండును జూచెనని చెప్పుచున్నాఁడు.—ఎప్పుడు—ఏక్షణమునందు దివ్యచక్షు స్సియ్యఁబడినదో, తదా=అప్పుడే; పాణ్డవః; దేవదేవస్య; తత్రశరీరే=ఆవిశ్వాత్మక మయినశరీరమునందే; ఏకస్థమ్=ఒకచో నున్న దైనను; అనేకధా=దేవగంధర్వాద్యనేకభేదములచే; ప్రవిభక్తమ్; కృత్స్నమ్; జగత్; అపశ్యత్.

మ. "ఇహైకస్థం జగత్కృత్స్నం పశ్యాద్య సచరాచరమ్" అని భగవంతుం డానతిచ్చినదానిని గూడ నర్జునుఁ డనుభవించె నని చెప్పుచున్నాఁడు.—ఏకస్థమ్=ఒక్కచోట నున్నదానిని; జగత్; కృత్స్నమ్; అనేకధా=దేవపితృమనుష్యాది నానాప్రకారములచే; ప్రవిభక్తమ్=భిన్న మయినదానిని; దేవదేవస్య = భగవంతుని యొక్క; తత్రశరీరే=ఆవిశ్వరూపమునందు; పాణ్డవః=అర్జునుఁడు; తదా=విశ్వరూపాశ్చర్యమును జూచునపుడు; అపశ్యత్=చూచెను.

శ్రీ. పిమ్మట నేమి జరిగెను? అనఁగాఁ జెప్పుచున్నాఁడు —అనేకధా ప్రవిభక్తమ్ = నానావిధవిభాగములతోఁ గూడినదానిని; కృత్స్నం జగత్, దేవదేవస్య శరీరే; దానియవయవమై, ఏకస్థమ్ = ఒకచోటనే వేఱువేఱ ఉన్నదానిని; తదా; పాణ్డవః=అర్జునుఁడు; అపశ్యత్.

ప. తత్ర; దేవదేవస్యశరీరే; అనేకధా ప్రవిభక్తమ్ = భిన్నభిన్న నామరూపకర్మాత్మకమును; కృత్స్నమ్= సమగ్ర మయిన; జగత్; ఏకస్థమ్=ఏకాశ్రయమును; తదా=ఆయవసరమునందు; పాణ్డవః=అర్జునుఁడు; అపశ్యత్.

రా. తత్ర = అట్టి—అనంతము లయిన యాయామవిస్తారములు గలదియు అనంతము లయిన బాహూదరవక్త్రనేత్రములు గలదియు అపరిమిత మయిన తేజస్సు గలదియు అపరిమితము లయిన దివ్యాయుధములతోఁ గూడినదియు తన కుచితము లయినయట్టి యపరిమితము లగుదివ్యభూషణములు గలదియు దివ్యమాల్యాంబరధరంబును దివ్యగంధానులేపనంబును అనంతాశ్చర్యమయంబు నగు; దేవదేవస్యశరీరే= భగవంతునిదివ్యశరీరమునందు; అనేకధా ప్రవిభక్తమ్ = బ్రహ్మాదివివిధవిచిత్రదేవతిర్యఙ్మనుష్యస్థావరాదిభోక్తృవర్గంబును పృథివ్యంతరిక్షస్వర్గపాతాలాతలసుతలాదిభోగస్థానభోగ్యభోగోపకరణంబులును అనుభేదములచే భిన్నమై ప్రకృతిపురుషాత్మక మయిన; కృత్స్నం జగత్=సమస్తజగత్తును, "అహం సర్వస్య ప్రభవో మత్తః సర్వం ప్రవర్తతే, హన్త తే కథయిష్యామి విభూతీ రాత్మన శ్శుభాః, అహ మాత్మా గుడాకేశ

స్సర్వభూతాశయ స్థితః, ఆదిత్యానా మహం విష్ణుః" ఇత్యాదిగా, "నత ద స్తి వినా యత్స్యా న్మయా భూతం చరాచరమ్, విష్ట భ్యాహ మిదం కృత్స్న మేకాంశేన స్థితో జగత్" అనువాఱకుఁ జెప్పఁబడినదానిని; ఏకస్థమ్=ఏకదేశమునం దున్నదానిని; పాణ్డవః=అర్జునుఁడు, భగవత్ప్రసాదలబ్ధ మయిన తద్దర్శనానుగుణ మగు దివ్యచక్షుస్సు గలవాఁడు; అపశ్యత్.

మా. ♦

తత స్స విస్మయావిష్టో హృష్టరోమా ధనఞ్జయః
ప్రణమ్య శిరసా దేవం కృతాఞ్జలి రభాషత. ౧౪

భా. తతః=అంత, ఆవిశ్వరూపునిఁ జూచి; సః=ఆ; ధనఞ్జయః = అర్జునుఁడు; విస్మయావిష్టః = విస్మయముచేఁ బొందఁబడినవాఁడును; హృష్టరోమా = గగుర్పాటు పొందిన వెండ్రుకలు గలవాఁడును అయ్యెను. దేవమ్=విశ్వరూపధరుఁ డైన భగవంతుని; శిరసా = శిరస్సుచే; ప్రణమ్య= ప్రకర్షమున నమస్కారము చేసి, నమ్రుండై; కృతాఞ్జలిః=నమస్కారము కొఱకు మోడ్వఁబడిన చేతులు గలవాఁడై; అభాషత=పలికెను.

అంత నావిశ్వరూపముఁ జూచి యర్జునుం డాశ్చర్యము నొంది పులకిత శరీరుండై యమ్మహాత్మునకు నమస్కరించి చేతులు మోడ్చి యి ట్లనియె నని తా.

ఆ. విశ్వరూపధరుం డగు భగవంతుని అతనియందుఁ జెప్పఁ జొప్పున సమస్తజగత్తును జూచిన పిమ్మట నర్జునుం డేమి చేసె ననఁగాఁ జెప్పుచున్నారు.— విస్మయము—ఆశ్చర్యబుద్ధి. ప్రకర్షము—భక్తిశ్రద్ధలయతిశయము.

హ. *

శం. చూచి యేమి చేసె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అర్థము స్పష్టము.

మ. ఇట్లద్భుతముఁ జూచినను అర్జునుఁడు భయపడినవాఁడు కాఁడు, కన్నుల మూసికొన్నవాఁడును గాఁడు, సంభ్రమమువలనఁ జేయునది మఱచినవాఁడును గాఁడు, ఆచోటనుండి తొలఁగి పోయినవాఁడును గాఁడు. అతిధీరుఁ డగుట వలన నధికచిత్తక్షోభము గలిగినను తత్కాలోచితముగనే వ్యవహరించె నని చెప్పుచున్నాఁడు.—తతః=తద్దర్శనానంతరము; విస్మయావిష్టః=విస్మయముచే - అద్భుతముఁ

♦ ౧౪, ౧౫, ౧౬ శ్లోకములకు మాధ్వభాష్యము లేదు.

* దీనికి హనుమద్వ్యాఖ్యానము లేదు.

జూచుటవలనం గలిగిన యలౌకికచిత్తచమత్కారవిశేషముచే వ్యాపింపఁబడినవాఁడై; కావుననే, హృష్టరోమా=పులకితుఁడై; సః=అట్టి, శివునితో యుద్ధముచేయుట మొదలగు ప్రసిద్ధప్రభావము గల; ధనఞ్జయః = ధర్మరాజు రాజసూయమునందును ఉత్తరగోగ్రహణమునందును సర్వరాజులను జయించి ధనము తెచ్చె నని ప్రసిద్ధ మయిన మహాపరాక్రమము గలవాఁడు అతిధీరుఁ డగునర్జునుఁడు; లేక, సాక్షా దగ్నియైన వాఁడు, మహాతేజస్వి యగుటవలన; దేవమ్=విశ్వరూపధరుం డగు నారాయణుని; శిరసా=భూమియం దుంపఁబడినశిరస్సుతో; ప్రణమ్య = ప్రకర్షంబున—భక్తిశ్రద్ధాతిశయంబున నమస్కరించి; కృతాఞ్జలిః = మోడ్వఁబడినచేతులజంట గలవాఁడై; అభాషత = పలికెను. ఇట, అర్జునగతం బగు విస్మయాఖ్యస్థాయిభావము విశ్వరూపభగవద్రూప మయిన యాలంబనవిభావముచేతను పలుమాఱు తద్దర్శనం బను నుద్దీపనవిభావముచేతను సాత్త్వికరోమహర్షనమస్కారాంజలికరణరూపం బగు ననుభావముచేతను ధృతిమతిహర్షవితర్కాదికం బగు వ్యభిచారిభావముచేతను, లేక అనుభావాక్షిప్తంబు * లగు ధృతిమతిహర్షాదులచేతను బరిపోషితం బగుటవలన, తాదృశవాసనాసహితు లగు శ్రోతలయొక్క అట్టి చిత్తచమత్కారము గూడ తద్భేదానధ్యవసాయమువలనఁ బరిపోషితంబై పరమానందాస్వాదరూపంబున నద్భుతరసం బగు నని సూచింపఁబడినది.

శ్రీ. ఇట్లు చూచి యేమి చేసె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—తతః=చూచిన పిమ్మట; విస్మయముచే ఆవిష్టుండై—వ్యాపింపఁబడినవాఁడై; హృష్టరోమా=పులకితము లగు వెండ్రుకలు గలవాఁ డగు; ధనఞ్జయః = అర్జునుఁడు; దేవమ్ = ఆదేవునే; శిరసా; ప్రణమ్య; కృతాఞ్జలిః = సంపుటీకరింపఁబడినచేతులు గలవాఁడై; అభాషత= పలికెను.

ప. పిమ్మట నే మయ్యె ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—తతః = దర్శనానంతరము; ధనఞ్జయః = అర్జునుఁడు; అద్భుతదర్శనముచేఁ గలిగినవిస్మయముచే వ్యాపింపఁబడినవాఁడై; ఇట్లద్భుతరసావిర్భావమువలన రోమాంచముతోఁ గూడినవాఁడై; దేవమ్ = కృష్ణుని; శిరసా ప్రణమ్య; కృతాంజలియై పలికెను.

రా. అంత ధనంజయుఁడు మహైశ్వర్య మగు సర్వజగంబునకును స్వదేహైకదేశంబున నాశ్రయభూతుఁడును సర్వంబునకుఁ బ్రవర్తకుండును ఆశ్చర్యతమము లగు

* అనుభావములచే సూచింపఁబడినవి.

సనంతజ్ఞానాదికల్యాణగుణగణములు గలవాఁడు నగు దేవునిం జూచి విస్మయావిష్టుఁడై హృష్టరోముఁడై శిరస్సుతో దండాకారంబునఁ బ్రణమిల్లి కృతాంజలియై పలికెను.

అర్జున ఉవాచ.—

పశ్యామి దేవాం స్తవ దేవ దేహే
సర్వాం స్తథా భూతవిశేషసఙ్ఘాన్
బ్రహ్మాణ మీశం కమలాసనస్థ
మృషీం శ్చ సర్వా నురగాంశ్చ దివ్యాన్. ౧౫

భా. ఏమని? ఏది నీచేఁ జూపఁబడినదో ఆవిశ్వరూపమును నేను జూచుచున్నా నని స్వానుభవమును దెలుపుచు నర్జునుం డిట్లనియె.— దేవ=ఓభగవంతుఁడా! తవ=నీయొక్క; దేహే=శరీరమునందు; దేవాన్= దేవతలను; సర్వాన్=అందఱను; తథా=అట్లు; భూతవిశేషసఙ్ఘాన్=నానా నాసంస్థానవిశిష్టము లయిన స్థావరజంగమములయొక్కసమూహములను; మఱియును, ఈశమ్= ప్రజల కీశ్వరుండును; కమలాసనస్థమ్= భూమధ్యం బున మేరుకర్ణికాసనంబున నున్నవాఁడు నగు; బ్రహ్మాణమ్ = చతుర్ముఖుని; దివ్యాన్= దివియందుఁ బుట్టినట్టి; ఋషీన్ చ = వసిష్ఠాదు లగుఋషులను; సర్వాన్= సమస్తము లయిన; ఉరగాంశ్చ= వాసుకిప్రభృతు లగుసర్పము లను; పశ్యామి = చూచుచున్నాను.

పరమేశ్వరా! నీదేహమునందు సర్వదేవతలను సర్వభూతసమూహములను భూమధ్యంబున మేరుకర్ణికాసనాసీనుం డగు ప్రజాపతి యయిన బ్రహ్మదేవుని దివ్యు లగుమహర్షులను ఉరగులను జూచుచున్నా నని తాత్పర్యము.

ఆ. భగవంతుని గూర్చి యర్జునుం డేమని పలికె నని యడుగుచున్నాఁడు ఏమని యని. అపేక్షితమును బూరించుచు ఆప్రశ్నమును దించుచున్నారు ఏది ఇత్యాదిగా. భూతవిశేషసంఘములయందు అంతర్భవించినను దేవతల వేఱుగాఁ జెప్పుట యుత్కర్షమువలన. బ్రహ్మదేవుఁడు సర్వదేవతాత్ముఁడైనను అతని వారికన్న భిన్నునిఁగాఁ జెప్పుట తదుత్పాదకుం డగుటవలన నని తలఁచి చెప్పుచున్నారు మఱి యును అని. కొంతవైషమ్యము కలుగుటవలన ఋషులును ఉరగులును వేఱుగాఁ జెప్పఁబడిరి. దివ్యాన్ అన్నది యిద్దఱకును విశేషణము.

హ. *

శం. «పశ్య మే పార్థ రూపాణి, పశ్యాదిత్యాన్వసూన్ » అని నీవు చెప్పితివో అట్టే చూచుచున్నానని యర్జునుఁడు చెప్పుచున్నాఁడు.—దేవ = ఓ దేవా! తవ దేహే; భూతవిశేషసఙ్ఘాన్ = భూతవిశేషము లనఁగా దేవతిర్యగాదిప్రభేదభిన్నము లైనప్రాణివిశేషములు, వానియొక్క సమూహములను; వానికే విశేషణము చేయుచున్నాఁడు—దేవాన్ = దేవతలను; అరయును విశేషము చెప్పుచున్నాఁడు—ఈశమ్ = సర్వప్రాణులకును నియంత యైన; కమలాసనస్థమ్; బ్రహ్మాణమ్ = చతుర్ముఖుని; ఋషీన్ = నారదసనకాదులను; దివ్యాన్ ఉరగాన్ = శేషవాసుకిప్రభృతులను; పశ్యామి = చూచుచున్నాను.

మ. ఏది భగవంతునిచేఁ జూపఁబడినదో ఆవిశ్వరూపమును సర్వలోకంబులకును జూడ నలవి గాని దానిని గూడ భగవద్దత్త మైనదివ్యచక్షుస్సుచేఁ జూచుచున్నాను. హా! నాభాగ్య మేమని చెప్పవచ్చును స్వానుభవముఁ దెలుపుచు నర్జునుం డిట్లనియె.—పశ్యామి= చాక్షుషజ్ఞానమునకు విషయముగాఁ జేయుచున్నాను; దేవ = ఓదేవా! తవ = నీయొక్క; దేహే = విశ్వరూపమునందు; దేవాన్ సర్వాన్= వస్వాదిదేవతలనందఱను; తథా; భూతవిశేషసఙ్ఘాన్ = నానాసంస్థానము లగు స్థావరజంగమములయొక్క సమూహములను; అట్లు, బ్రహ్మాణమ్ = బ్రహ్మదేవుని; ఈశమ్ = సర్వలోకముల కీశ్వరుఁ డైనవానిని; కమలాసనస్థమ్ = భూపద్మమధ్యమునందు మేరుకర్ణికాసనంబునం దున్నవానిని, లేక, భగవంతునినాభికమలం బనునాసనంబున నున్నవానిని; అట్లు, ఋషీంశ్చ సర్వాన్ = బ్రహ్మపుత్రు లగువసిష్ఠాదిమహర్షులనందఱను; దివ్యాన్ ఉరగాంశ్చ= అప్రాకృతు లగువాసుకిప్రభృతులను; పశ్యామి అని యంతటను అన్వయము.

శ్రీ. భాషణమునే చెప్పుచున్నాఁడు పదునేడుశ్లోకములచేత.—ఓదేవా! తవ దేహే; దేవాన్=ఆదిత్యాదులను; పశ్యామి=చూచుచున్నాను. అట్లు, సర్వాన్; భూతవిశేషసఙ్ఘాన్ = జరాయుజాండజాదులసమూహములను; చూచుచున్నాను. అట్లు, దివ్యాన్ ఋషీన్= వసిష్ఠాదులను; ఉరగాంశ్చ = తక్షకాదులను; చూచుచున్నాను. అట్లు, ఆదేవతలు మొదలగువారికి, ఈశమ్ = స్వామి యగు; బ్రహ్మాణమ్; ఎట్టివానిని? కమలాసనస్థమ్ = పృథివీపద్మకర్ణికలో మేరువునం దున్నవానిని, లేక, నీనాభికమలం బను నాసనంబున నున్నవానిని; చూచుచున్నాను.

* ఇది మొదలు ౨౧గవ శ్లోకమువఱ కీవ్యాఖ్యానము లేదు.

ప. ఏ మని పలికె ననఁగాఁ జెప్పుచున్నాఁడు పదునేడుశ్లోకములచేత.—

దేవ = ఓ ప్రకాశస్వరూపుఁడా! తవ దేహే; స్వర్గవాసు లగు దేవతలఁ జూచుచున్నాను. అట్లు భూమి నుండునట్టి భూతవిశేషములయొక్క—జరాయుజాండజాదులయొక్క—సమూహముల నన్నిటిని జూచుచున్నాను. అట్లు, దివ్యులు—అంతరిక్షమున నుండునట్టివార లగుఋషులను బులస్త్యక్రతుప్రభృతులను జూచుచున్నాను. అట్లు పాతాళంబుననుండు నురగులను జూచుచున్నాను. మఱియును. సత్యలోకవాసి యగు బ్రహ్మదేవుని, కైలాసవాసి యగు ఈశుని—ఈశ్వరుని జూచుచున్నాను. మఱియును. కమలాసనస్థమ్ = కమలతోఁ—లక్ష్మితోఁ గూడ ఆసనమునందు—గరుడాసనమునం దున్నట్టి విష్ణువును, వైకుంఠవాసిని గూడ; చూచుచున్నాను. అని దివ్యదృష్టిదానఫలము చెప్పఁబడినది.

రా. దేవ! తవ దేహే; సర్వదేవతలను జూచుచున్నాను. అట్లు సమస్తము లయిన ప్రాణివిశేషములసమూహములనుం జూచుచున్నాను. అట్లు, బ్రహ్మాణమ్ = చతుర్ముఖుని, అండాధిపతిని; కమలాసనస్థమ్ = బ్రహ్మదేవునం దున్నట్టి, తన్మతమునం దున్నట్టి; ఈశమ్ = శివుని; చూచుచున్నాను. అట్లు, సర్వాన్ ఋషీన్ = దేవర్షిప్రముఖు లగు ఋషులనందఱను; దివ్యాన్ = ప్రకాశించుచున్న; ఉరగాంశ్చ = వాసుకితక్షకాదులను గూడ; చూచుచున్నాను.

అనేకబాహూదరవక్త్రనేత్రం
పశ్యామి త్వా సర్వతో ౽నన్తరూపమ్
నా న్తం న మధ్యం న పున స్తవాదిం
పశ్యామి విశ్వేశ్వర విశ్వరూప. ౧౬

భా. అనేకబాహూదరవక్త్రనేత్రమ్ = అనేకము లయిన చేతులును కడుపులును ముఖములును కన్నులును గలవానిని; సర్వతః = అంతటను; అనన్తరూపమ్ = అనంతము లయినరూపములు గలవానిని; త్వా = నిన్ను; పశ్యామి = చూచుచున్నాను. తవ = నీయొక్క; అన్తమ్ = తుదను; నపశ్యామి = చూడను. మధ్యమ్ = మధ్యమనఁగా రెండుతుదలకును నడిమిప్రదేశము, దానిని; న = చూడను. ఆదిం పునః = మొదలును గూడ; నచూడను. విశ్వేశ్వర = ఓవిశ్వనాథా! విశ్వరూప = ఓవిశ్వరూపుఁడా!

ఓ విశ్వేశ్వరుఁడా! ఓ విశ్వరూపుఁడా! లెక్కకుమీఱిన బాహువులును ఉదరంబులును ముఖములును నేత్రంబులును గలవాఁడవు అనంతము లయినరూపములు గలవాఁడ వగు నిన్ను అంతటను జూచుచున్నాను. నీరూపమునకు అంతమును మధ్యంబును ఆదియుఁ గనఁబడ కున్న వని తాత్పర్యము.

ఆ. ఏభగవద్దేహమునందు సర్వప్రపంచమును జూడఁబడినదో దానికే విశేషణము చేయుచున్నాఁడు అనే కేత్యాదిగా. ఆదిశబ్దముచే మూలము చెప్పఁబడుచున్నది.

శ్రీ౦. మఱియును.— అనేకబాహూదరవక్త్రనేత్రమ్; అనన్తరూపమ్ = అనంతములైన రూపములు గలవాఁడ వగు; త్వా = నిన్ను; సర్వతః = అంతటను; పశ్యామి. ఓవిశ్వేశ్వరుఁడా! విశ్వరూపుఁడా! నీయొక్క ఆదిమధ్యాంతములను జూడకున్నాను.

మ. ఏభగవద్దేహమునందు సర్వజగంబునుం జూచెనో దానినే విశేషించుచున్నాఁడు.—అనేకబాహూదరవక్త్రనేత్రమ్=బాహువులును ఉదరములును వక్త్రములును నేత్రములును అనేకములు గలవాఁడవును; అనన్తరూపమ్=అనంతము లగు రూపములు గలవాఁడవు నగు; త్వా = నిన్ను; సర్వతః = అంతటను; పశ్యామి = చూచుచున్నాను. తవపునః = నీకో; అన్తమ్ = తుదను; మధ్యమ్ = మధ్యమును; ఆదిమ్ = మొదలును; నపశ్యామి = చూడను, సర్వగతుఁడ వగుటవలన. ఓవిశ్వేశ్వరుఁడా! ఓవిశ్వరూపుఁడా! సంబోధనద్వయము సంభ్రమాతిశయమువలన.

శ్రీ. మఱియును.—అనేకము లయినబాహువులు మొదలగునవి గల నిన్నుఁ జూచుచున్నాను. అనంతము లయినరూపములు గల నిన్ను అంతటను జూచుచున్నాను. నీకో అంతమును మధ్యమును ఆదిని జూడకున్నాను, సర్వగతుండ వగుటవలన.

ప. ఇఁక విశ్వరూపమును వర్ణించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— ఓ విశ్వేశ్వరుఁడా! విశ్వరూపమ్ ♦=నీయొక్క విశ్వాత్మక మయినరూపమును, లేక, "విశ్వం విష్ణు ర్వషట్కారః" ఇత్యాదిప్రమాణముచే విశ్వ మ్మనఁగా విష్ణువు, విష్ణుస్వరూపము రూపమునందు—శరీరమునందుఁ గల; త్వా= నిన్ను; పశ్యామి = చూచుచున్నాను. ఎట్టివానిని? అనేకబాహూదరవక్త్రనేత్రమ్ = అనేకులయొక్క బాహూ

♦ పరిపక్షమునందు విశ్వేశ్వర విశ్వరూపమ్ అని పాఠము.

దరవక్త్రనేత్రములే బాహూదరవక్త్రనేత్రములుగాఁ గలవానిని; సర్వతః=అంతటను; అనన్తరూపమ్ = అసంఖ్యాతము లయినరూపములు గలవానిని. అట్టివానినిగానే నిన్నుఁ జూచుచున్నాను. మఱి యీమూఁడుమాత్రము చూడకున్నాను. అవి యేవి? నీయొక్క, అన్తమ్ = పర్యవసానమును; మధ్యమ్ = స్థితిని; ఆదిమ్ = ఆవిర్భావమును.

రా. అనేకబాహూదరవక్త్రనేత్రమ్; అనన్తరూపమ్; త్వాం; సర్వతః; పశ్యామి. విశ్వేశ్వర = విశ్వమునకు నియామకుఁడా! విశ్వరూప = విశ్వము శరీరముగాఁ గలవాఁడా! ఎందువలన నీ వనంతుఁడవో అందువలన నీయొక్క యంతమును మధ్యమును ఆదిని జూడకున్నాను.

మా. అనేకశబ్దము అనంతవాచకము. అనన్తబాహు మ్మని చెప్పఁబోవుచున్నాఁడు. "సర్వతః పాణిపాదం తత్" ఇత్యాదికము గూడ. "విశ్వతశ్చక్షురుత విశ్వతోముఖో విశ్వతోబాహు రుత విశ్వతస్పాత్। సంబాహుభ్యాం ధమతి సంపతత్రైర్ద్యావా పృథివీ జనయన్ దేవ ఏకః" అని ఋగ్వేదఖిలమూలయందు. "విశ్వతశ్చక్షు రుత విశ్వతోముఖో విశ్వతోబాహు రుత విశ్వతస్పాత్। సంబాహుభ్యాం నమతి సంపతత్రైర్ద్యావా భూమీ జనయ న్దేవ ఏకః" అని యజుర్వేదమునందును. విశ్వశబ్దము గూడ అనంతవాచకము, "సర్వం సమస్తం విశ్వంచ అనన్తం పూర్ణమేవచ" అను నిఘంటువువలన. "అనన్తబాహు మనన్తపాద మనన్తరూపం పురువక్త్రమేకమ్" అని బాభ్రవ్యశాఖయందు. మహత్త్వాదివచనమో మహత్పరిమాణాదికము పరమమహత్పరిమాణాదికమునం దంతర్భవించుటవలనఁ గూడ నుపపన్నము. కాదేని "అనాది మత్పరం బ్రహ్మ" ఇత్యాదిక మయుక్తము కావలసి వచ్చును. ఒక్కచో అనంతము లయినరూపములు గలవాఁడు అనంతరూపుఁ డని యర్థము. ఇతరస్థలంబున అనంత మనఁగా అపరిమాణం బని యర్థము. రెండును జెప్పఁబడినవిగదా "పరాత్పరం య న్మహతో మహాన్తం, యదేక మవ్యక్త మనన్తరూపమ్" అని యజుర్వేదమునందు. అవ్యక్త మనంత మగుటవలననే మహత్త్వము చెప్పుటచే అపరిమితత్వము సిద్ధించుచున్నది*. "మహాన్తం చ సమావృత్య ప్రధానం సమవస్థితమ్। అనన్తస్య సత స్యాన్త స్సంస్థానం చాపి విద్యతే" అని యవ్యక్త మనంత మని చెప్పఁబడినది యాదిత్యపురాణమునందు. అవియు నొక్కొక్కరూపంబును అపరిచ్ఛి

---

* మహతో మహాన్తమ్—అవ్యక్తముకన్నను గొప్పవాఁ డని అనంత మయిన యవ్యక్తముకన్నను గొప్పతనము చెప్పుటవలన మహత్త్వ మనఁగా అపరిమితత్వ మని రూఢపడుచున్న దని భావము.

న్నము అనియు నొకస్థలంబున నర్థము గానచ్చును *. "అసంఖ్యాతా జ్ఞానకా స్తస్య దేహా స్సర్వే పరిమాణవర్జితాశ్చ"♦ అని ఋగ్వేదఖిలములయందు. "యావా న్వా అయ మాకాశ స్తావా నేషో ఽన్తర్హృదయ ఆకాశ ఉభే అస్మిన్ద్యావా పృథివీ అన్తరేవ సమాహితే । ఉభా వగ్నిశ్చ వాయుశ్చ సూర్యాచన్ద్రమసా వుభౌ" అనియు. "కృష్ణస్య గర్భజగతో ఽతిభరావసన్న పార్ష్ణిప్రహార పరిరుగ్ణ ఫణాతపత్రమ్"❦ అనియు భాగవతమునందు. ఇదియు నయుక్తము గాదు, ఈశ్వరుం డచింత్యశక్తి యగుటవలన. "అచిన్త్యాః ఖలు యే భావా నతాం స్తర్కేణ యోజయేత్"** అనియు విష్ణుపురాణమునందు. "నైషా తర్కేణ మతి రాపనేయా"♦♦ అని శ్రుతి. అతిప్రసంగమో మహాతాత్పర్యమువలనను వాక్యబలమువలనను తొలఁగింపవలయును. ఘటము వంటి యొకానొకపదార్థము కనఁబడ లే దని ప్రమాణదృష్ట మగునది నిరాకరింప శక్యము గాదు గదా! కొన్నిపదార్థములయందు వాక్యవ్యవస్థ యచింత్యశక్తి లేమివలన నంగీకరింపఁబడును. "గుణా శ్శ్రుతా స్సువిరుద్ధాశ్చ దేవే సన్త్య శ్రుతా అపి నైవాత్ర శఙ్కా । చిన్త్యా అచిన్త్యా శ్చ తథైవదోషా శ్శ్రుతాశ్చ నాజ్ఞై ర్హి తథా ప్రతీతాః । ఏవం పరే న్యత్ర శ్రుతాశ్రుతానాం గుణాగుణానాం చ క్రమా ద్వ్యవస్థా"§ అని జాబాలఖిలశ్రుతివలనను. ఉపచారత్వపరిహారముకొఱకు న మధ్య మ్మని. కాని చో ఆద్యంతములు లేమివలననే మధ్యము లేమియు సిద్ధించుటవలన. విశ్వరూపుఁ డనఁగా పూర్ణరూపుఁ డని యర్థము. "స విశ్వరూపో అనూనరూపో అతో ఽయం సో ఽనన్తరూపో నహి నాశో ఽస్తి తస్య" అని శాణ్డిల్యశాఖయందు.

---

* అనన్తరూపశబ్దములు రెండు వచ్చినపుడు ఒకదానికి అసంఖ్యము లయినరూపములు గలవాఁ డనియు మఱియొకదానిచే అపరిచ్ఛిన్నము లయిన యాయనంతరూపములు గలవాఁ డనియు నర్థ మని భావము.

♦ జ్ఞానకాః — జ్ఞానానందాత్మకములు.

❦ గర్భమునందు జగత్తు గల కృష్ణునియొక్క యతిభారముచే వంగినపాదముయొక్క దెబ్బచే వొచ్చిన గొడుగువంటిపడగ గలవానిని.

** అచింత్యము లయినభావము లేవి గలవో వానియందు తర్కము ప్రయోగింప రాదు.

♦♦ ఈ జ్ఞానము తర్కముచేఁ బొంద శక్యము గాదు.

§ వినఁబడినవియు వినఁబడనివియును బరస్పరవిరుద్ధములు నగుగుణములు దేవునియందుఁ గలవు, ఇందు సందేహము లేదు, అట్లె చింత్యములును, అచింత్యములును వినఁబడినవియు వినఁబడనివియు నగు దోషములు లేవు. అజ్ఞులు గదా యట్లు తలంచుచున్నారు. అట్లు పరమేశ్వరునియందు, ఇతరస్థలమునందు శ్రుతాశ్రుతంబు లగు గుణాగుణంబులకుఁ గ్రమంబున వ్యవస్థ యగును.

కిరీటినం గదినం చక్రిణం చ
తేజోరాశిం సర్వతో దీప్తిమన్తమ్
పశ్యామి త్వాం దుర్నిరీక్షం సమన్తా
ద్దీప్తానలార్కద్యుతి మప్రమేయమ్. ౧౭

భా. మఱియును.—కిరీటినమ్=కిరీట మనఁగా శిరోభూషణవిశేషము, అది గలవానిని; గదినమ్=గద యను నాయుధము గలవానిని; చక్రిణంచ=చక్రము గలవానిని; తేజోరాశిమ్ = తేజస్సులసమూహ మయినవానిని; సర్వతో దీప్తిమన్తమ్ = అంతటను బ్రకాశము గలవానిని; దీప్తానలార్కద్యుతిమ్ = ప్రకాశించుచున్నయగ్నియొక్కయు సూర్యునియొక్కయుఁ గాంతివంటికాంతి గలవానిని; అప్రమేయమ్=పరిచ్ఛేదము చేయ నశక్యమయినవానిని. దుర్నిరీక్షమ్ = దుఃఖముచే •ఁ జూడఁ దగినవానిని; త్వామ్=నిన్ను; సమన్తాత్=అంతటను; పశ్యామి=చూచుచున్నాను.

కిరీటశోభితుండవు గదాధరుండవు చక్రహస్తుండవు తేజోరాశివి సర్వత్ర ప్రకాశమానుండవు దీప్తాగ్నిసూర్యులవలె వెలుంగుచున్నవాఁడవు అపరిచ్ఛిన్నుండవు దుర్నిరీక్షుండ వగు నిన్ను సర్వదేశములయందును జూచుచున్నా నని తాత్పర్యము.

ఆ. విశ్వరూపవంతుఁ డగుభగవంతునినే ప్రకారాంతరంబునఁ బ్రపంచించుచున్నారు మఱియును అని. పరిచ్ఛిన్నత్వమును వ్యావర్తించుచున్నారు సర్వతః అని. దుర్నిరీక్షం పశ్యామి అనుట అధికారిభేదమువలన అవిరుద్ధము. ఎదుటఁగాని వెనుకఁగాని పార్శ్వంబునఁగాని కాదు దర్శనము, మ జే మనఁగా, అంతటను అని చెప్పుచున్నారు సమన్తాత్ అని. దీప్తిమత్త్వమును దృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు దీప్తాన లేత్యాదిగా.

శం. మఱియును.—తేజోరాశిమ్=తేజఃపుంజ మయినవానిని; కావుననే, సర్వతః దీప్తిమన్తమ్=ప్రకాశయుక్తుని; కావుననే; దీప్తానలార్కద్యుతిమ్ = జాజ్వల్యమాను లయిన సూర్యాగ్నులతో సమానుని; కావుననే, అప్రమేయమ్ = అపరిచ్ఛిన్నుని, చక్షుఃప్రమాణమునకు అగోచరుని; కావుననే, సమన్తాత్=అంతటను; దుర్నిరీక్షమ్=దుఃఖమునఁ జూడ శక్య మయినవానిని; త్వాం పశ్యామి. తక్కినది స్పష్టము.

• కష్టముచే.

మ. ఆవిశ్వరూపుఁ డగుభగవంతునే ప్రకారాంతరంబున వర్ణించుచున్నాఁడు.—కిరీటగదాచక్రధరుని, సర్వతో దీప్తిమన్తం తేజోరాశిమ్. కావుననే, దుర్ని రీక్షమ్ = దివ్యచక్షువు చేతనే గాని నిరీక్షింప నశక్య మయినవాని; దుర్నిరీక్ష్యమ్ అనుపాఠమునందు దుశ్శబ్దము అపహ్నవార్థకము, అనిరీక్ష్యుని అని యర్థము. దీప్తులైన యనలార్కులద్యుతివంటిద్యుతి గలవానిని; అప్రమేయమ్ = ఇట్టివాఁ డితఁ డని పరిచ్ఛేదింప శక్యము గానివానిని; త్వామ్; సమన్తాత్ = సర్వదేశములయందును; పశ్యామి=చూచుచున్నాను దివ్యచక్షుస్సుచేత. అందువలన అధికారిభేదమువలన దుర్నిరీక్షం పశ్యామి యనుట విరుద్ధము కాదు.

శ్రీ. మఱియును.—కిరీటినమ్=ముకుటము గలవానిని; గదినమ్ = గద గలవానిని; చక్రిణంచ=చక్రము గలవానిని; సర్వతోదీప్తిమన్తమ్; తేజోరాశిమ్; అట్లు; దుర్నిరీక్ష్యమ్=చూడ నలవి గానివానిని; అందుకు హేతువు.—దీప్తులయిన యనలార్కులద్యుతివంటి ద్యుతి—తేజస్సు గలవానిని; కావుననే, అప్రమేయమ్=ఇట్టివాఁ డని నిశ్చయింప శక్యము కానివానిని; త్వామ్; సమన్తాత్; పశ్యామి.

ప. కిరీటినమ్=ముకుటము గలవాని; గదినమ్=గదాహస్తుని; చక్రిణమ్=సుదర్శనము గలవానిని; పశ్యామి. ఇందుచే నూర్ధ్వహస్తములరెంటను గ్రమంబున గదాచక్రములను అట్లు అధరహస్తములరెంటను పద్మశంఖములను ధరించుచున్నచతుర్భుజుం డగు త్రివిక్రమస్వరూపునిఁ జూచుచున్నా నని చెప్పఁబడినది. అట్లు, సర్వతః; తేజోరాశిమ్=తేజస్సమూహరూపుని; దీప్తిమన్తమ్=వ్యాపించుచున్న ప్రకాశము గలవానిని; సమన్తాత్; దుర్నిరీక్షమ్ = చూడ శక్యము గానివానిని; దీప్తానలార్కద్యుతిమ్ = జ్వలించుచున్నయగ్నిసూర్యులయొక్కదీప్తివంటిదీప్తి గలవానిని; అప్రమేయమ్ = మనస్సుచేఁ గూడ తర్కింప నలవి గానివానిని. ఇది యభిప్రాయము.—త్రివిక్రమస్వరూపము స్వరూపముననే చరణవిక్షేపమాత్రమున బ్రహ్మాండకటాహము వ్యాపించినది. అట్టిదానిఁగూడ నీదేహమునందుఁ జూచుచున్నాను. ఇఁక నితరముఁ జెప్ప నేల ? దీనినే మనస్సున నుంచికొని మహాపురాణమునందును జెప్పఁబడినది.— « త్వాహం తమో మహ దహం ఖచ రాగ్ని వా ర్భూ స్సంవేష్టి తాణ్డ ఘట సప్త వితస్తికాయః » ఇత్యాదిగా.

రా. తేజోరాశిమ్; సర్వతో దీప్తిమన్తమ్; సమన్తాత్ దుర్నిరీక్షమ్; దీప్తానలార్కద్యుతిమ్; అప్రమేయమ్; త్వామ్; కిరీటినం గదినం చక్రిణం చ; పశ్యామి.

మా. అనలార్కచ్యుత్యాదులని చెప్పుటచే గలుగు మితత్వాశంకను నిరాకరించు చున్నాఁడు అప్రమేయ మ్మని.

త్వ మక్షరం పరమం వేదితవ్యం
త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్
త్వ మవ్యయ శ్శాశ్వతధర్మగోప్తా
సనాతన స్త్వం పురుషో మతో మే. ౧౮

భా. నీ యీ యోగశక్తిని జూచుటవలననే యనుమానము చేయు చున్నాను.—త్వమ్=నీవు; అక్షరమ్=నక్షరతి—చలనము లేనిదియు; వేది తవ్యమ్=ముముక్షువులచే ఎఱుంగవలసినదియు నగు; పరమమ్=పరబ్రహ్మ మవు. త్వమ్=నీవు; అస్య=ఈ; విశ్వస్య = ఈసమస్తజగత్తునకు; పరమ్= ప్రకృష్ట మయిన; నిధానమ్ = నిధీయతే—ఉంపఁబడుచున్నది దీనియందు, కావున నిధానము, పరమాశ్రయభూతుఁడ వని యర్థము. మఱియును.— త్వమ్=నీవు; అవ్యయః=వ్యయము లేనివాఁడవు; శాశ్వతధర్మగోప్తా=శశ్వ ద్భవము *—శాశ్వతము నిత్యము, అట్టి ధర్మమునకు రక్షకుఁడవు. త్వమ్= నీవు; సనాతనః=చిరంతనుఁడవు; పురుషః=పరమపురుషుఁడవు. అని, మే= నాకు; మతః=అభిప్రాయము.

నీవు ముముక్షువు లెఱుంగవలసినయక్షర మయినపరబ్రహ్మమవు, నీవే యీసర్వజగత్తునకును బరమాశ్రయ మయినవాఁడవు, నీ వవ్యయుఁడవు, నిత్య మయిన ధర్మమును రక్షించువాఁడవు, నీవే సనాతనపరమపురుషుండ వని నేను దలంచుచున్నా నని తాత్పర్యము.

ఆ. సప్రపంచ మగు భగవద్రూపము ప్రకృతమై యుండఁగా త్వ మక్షర మిత్యాదిగా నిరుపాధికరూపముఁ జెప్పుట ప్రకరణవిరుద్ధ మని యాశంకించి చెప్పు చున్నారు నీయీ ఇత్యాదిగా. యోగశక్తి యనఁగా నైశ్వర్యాతిశయము. నక్షరతి యనుటచే నిష్ప్రపంచత్వము చెప్పఁబడుచున్నది. పరమపురుషార్థం బగుటవలనను బరమార్థ మగుటవలనను వేదితవ్యము. « యస్మిన్ ద్యౌః పృథివీత్యాదిశ్రుతియందుఁ బ్రపంచాయతనమే యాప్రపంచమునుండి నిష్కృష్టం బగునది జ్ఞాతవ్య మని చెప్పఁ బడుటవలన బ్రహ్మం బెట్లు జ్ఞాతవ్య మగు ననఁగాఁ జెప్పుచున్నారు త్వ మస్యేత్యా

* ఎల్లప్పుడు నుండునది.

దిగా. నిష్ప్రపంచ మగు బ్రహ్మము జ్ఞేయం బనుటకు హేత్వంతరము చెప్పుచున్నాఁడు మఱియును అని. అవినాశి వగుటవలన నీవే జ్ఞాతవ్యుఁడవు, త్వ దతిరిక్తము నాశవంత మగుటచే హేయం బని యర్థము. జ్ఞానకర్మరూప మగుధర్మము వేదప్రమాణకం బగుటచే నిత్యము. ధర్మసంస్థాపనార్థాయ సంభవామి యని చెప్పుటవలన ధర్మరక్షకుఁడవు.

శ౦. నీ యీ మహామాయాయోగసంభావిత మయిన మహాద్భుతస్వరూపముఁ జూచుటచేతనే ని న్నిట్టివానిఁగా నేను దలంచుచున్నా నని చెప్పుచున్నాఁడు.—అక్షరమ్=నిరవయవం బగుటవలనను నిరాశ్రయ మగుటవలనను క్రియకు ఆశ్రయము గాని దగుటవలనను క్రియకు విషయము గాని దగుటవలనను అనంత మగుటవలనను నక్షరతి—చలింపదు కావున అక్షరము—నిత్యకూటస్థము, «ఏత ద్వై త దక్షరం గార్గి» అనుశ్రుతివలన; కావుననే, పరమమ్=ఉత్తమోత్తమము, «అవ్యక్తాత్తు పరః పురుషః" అనుశ్రుతివలన; కావుననే పరమార్థ మగుటవలనను బరమపురుషార్థసాధనం బగుటవలనను, వేదితవ్యమ్=ముముక్షువులచే నెఱుంగవలసినది, «స ఆత్మా స విజ్ఞేయః" అనుశ్రుతివలన; వేదితవ్యంబును బరమంబును అక్షరంబు నగు నిర్విశేష బ్రహ్మ మేది గలదో అది, త్వమ్=నీవే. అయినను జగత్కారణము నాకంటె నితరము కల దనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అస్య=ఈమహదాదిస్థూలపర్యంత మయిన; విశ్వస్య=సమస్తవికారజాతమునకు; నిధానమ్=నిధీయతే—ఉంపఁబడుచున్నది సర్వంబును దీనియందు, కావున నిధానము—అవ్యాకృతాఖ్య మగు జగత్కారణ మేది గలదో అదియు; త్వమ్=నీవే, «ప్రకృతిశ్చ ప్రతిజ్ఞా దృష్టాన్తానుపరోధాత్" అనున్యాయమువలనను, «న స న్నాస న్న సదసదితి ఆత్మన ఏవ త్రైవిధ్యం సర్వాతి యోనిత్వమ్" అనుశ్రుతివలనను, «మత్తః పరతరమ్» అను గీతావాక్యమువలనను. ఓయీ! సరే! నేనే నిర్విశేష మగు పరబ్రహ్మమను, జగత్కారణము గూడ నేనే, అయినను నాకంటె మఱియొకఁ డీశ్వరుఁడు జ్ఞాతవ్యుఁడును ఉపాసితవ్యుఁడును గలఁడు, అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—అవ్యయః=జ్ఞానాజ్ఞానములచేఁ గాని యితరములచేఁ గాని వ్యయము—నాశము ఎవ్వనికి లేదో అతఁ డవ్యయుఁడు—నిత్యుఁడు; శాశ్వతధర్మగోప్తా= శశ్వత్ భవతి—ఎల్లప్పుడు నుండునది కావున శాశ్వతము వేదము, దానిచేఁ జెప్పఁబడిన యేధర్మములు జ్ఞానకర్మాదులు గలవో వాని రక్షించువాఁడు; వర్ణాశ్రమధర్మరక్షకుఁడును సృష్ట్యాదికర్తయు నగు నీశ్వరుఁడును, త్వమ్=నీవే, «ఏష భూతాధిపతి రేష భూతపాల ఏష సేతు ర్విధరణ ఏషాం లోకానా మసంభేదాయ»

అనుశ్రుతివలన. ఓయీ! నిర్విశేషం బగు పరబ్రహ్మమును సవిశేష మగు నపరబ్రహ్మమును నేనే, అయినను నాకంటె నితరుఁడు జీవుఁడు గలఁడు భేదముకొఱకు, అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సనాతనః = "న జీవో మ్రియతే" అనుశ్రుతివలన సనాతనుఁడు—నిత్యుఁ డగు; పురుషః = పురి—దేహమునందు శయనించుటవలనఁ బురుషుఁడు—ఆత్మయును; త్వమ్=నీవే, "అయమాత్మా బ్రహ్మ" అనుశ్రుతివలన.

మ. ఇట్లు నీ యతర్క్యం బగు నిరతిశయైశ్వర్యముఁ జూచుటవలన నూహించుచున్నాను.—త్వమ్=నీవే; అక్షరం పరమం బ్రహ్మ; వేదితవ్యమ్ = ముముక్షువులచే వేదాంతశ్రవణాదుల నెఱుంగవలసినది. నీవే, అస్య విశ్వస్య; పరమమ్ = ప్రకృష్ట మయిన; నిధానమ్ = నిధీయతే అస్మిన్ అనువ్యుత్పత్తిచే నిధానమవు, ఆశ్రయమవు. కావుననే నీవు, అవ్యయః=నిత్యుఁడవు. శాశ్వతధర్మగోప్తా = నిత్యవేదప్రతిపాద్య మగుటచే నిత్య మయినధర్మము పాలించువాఁడవు. శాశ్వత—ఓనిత్యుఁడా! అని సంబోధనమైనను గావచ్చును. ఆపక్షమున, అవ్యయః = వినాశరహితుఁడ వని యర్థము. అందువలననే, సనాతనః=చిరంతనుఁ డగు; పురుషః=పరమాత్మ యెవ్వఁడు గలఁడో అతఁడే; త్వమ్ = నీవు అని; మే మతః = నాకుఁ దెలియఁబడితివి.

శ్రీ. ఎందువలన నిట్లు నీయైశ్వర్యం బచింత్యమో అందువలన.—త్వమ్=నీవే; అక్షరం పరమమ్—బ్రహ్మము. ఎట్టి బ్రహ్మము? వేదితవ్యమ్ = ముముక్షువులచే జ్ఞాతవ్యము. నీవే, అస్య విశ్వస్య; పరం నిధానమ్=ఉత్తమ మయిన యాశ్రయము. కావుననే, త్వమ్; అవ్యయః=నిత్యుఁడవు; శాశ్వతము—నిత్య మగుధర్మమును బాలించువాఁడవు. సనాతనః=చిరంతనుఁ డగు; పురుషః=పురుషుఁడ వని; నాకు సమ్మతుఁడవగుచున్నావు.

ప. ఇఁక సప్రమేయత్వముఁ జెప్పుచున్నాఁడు.—అక్షరమ్ = పరబ్రహ్మము; త్వమ్=నీవే; పరమమ్=ఆత్యంతిక మయిన; వేదితవ్యమ్=ముముక్షువులచే నెఱుంగవలసినది, దేని నెఱింగినచో నిదియంతయు నెఱుంగఁబడినది యగునో అట్టిది యని యభిప్రాయము. త్వమ్; అస్య=ఈకనఁబడుచున్న; విశ్వస్య=ప్రపంచమునకు; పరమ్=ఉత్కృష్ట మయిన, నిధానమ్=ఆశ్రయమవు. అవ్యయః = నిత్యుఁడవు. శాశ్వతధర్మగోప్తా = శాశ్వతములు—మోక్షము గలిగించునవి యగుధర్మము లేవి గలవో వానికి రక్షకుఁడవు—నిర్వాహకుఁడవు. సనాతనః=పురాణుఁడవు. ఇట్టి నీవు, పురుషః = పురుషోత్తముఁడ వని; మే మతః.

రా. ఉపనిషత్తులయందు « ద్వే విద్యే వేదితవ్యే '' ఇత్యాదిస్థలంబుల వేదితవ్యముగాఁ జెప్పఁబడిన పరమ మయినయక్షరము నీవే. అస్య విశ్వస్య పరం నిధానమ్=ఈప్రపంచమునకుఁ బరమాధారభూతుఁడవు నీవే. త్వమ్; అవ్యయః = వ్యయరహితుఁడవు, నీ వెట్టిస్వరూపము ఎట్టిగుణములు ఎట్టివిభవము గలవాఁడవో అట్టిరూపముతోనే సదా యుందువు. శాశ్వతధర్మగోప్తా=నిత్య మయిన వైదికధర్మమును ఇది మొదలగు నవతారములచే నీవే రక్షించువాఁడవు. సనాతన స్త్వం పురుషోమతో మే—« వే దాహ మే తం పురుషం మహా న్తమ్, పరాత్పరం పురుషమ్ » ఇత్యాదిస్థలంబులం జెప్పఁబడిన సనాతనపురుషుఁడవు నీవే యని నాకుఁ దెలియ వచ్చినది, యదుకులతిలకుఁడవే యగు నీ విట్టివాఁడ వని యిప్పుడు సాక్షాత్కరించితిని నేఁ నని యర్థము.

మూ. ♦

అనాదిమధ్యా న్త మన న్తవీర్య
మన న్తబాహుం శశిసూర్యనేత్రమ్
పశ్యామి త్వాం దీ ప్తహుతాశవ క్త్రం
స్వతేజసా విశ్వ మిదం తప న్తమ్.

భా. మఱియును.—అనాదిమధ్యా న్తమ్=ఆదియు మధ్యంబును అంతమును లేనివాఁడవును; అన న్తవీర్యమ్=అంతములేని వీర్యము గలవాఁడవును; అన న్తబాహుమ్=అనంతము లైనబాహువులు గలవాఁడవును; శశిసూర్యనేత్రమ్ = చంద్రుఁడును సూర్యుఁడును నేత్రములుగాఁ గలవాఁడవును; దీ ప్తహుతాశవ క్త్రమ్=జ్వలించుచున్న యగ్ని ముఖముగాఁ గలవాఁడవును; స్వ తేజసా = నీ తేజస్సుచే; ఇదమ్ విశ్వమ్=ఈప్రపంచమును; తప న్తమ్=తపింపఁజేయుచున్నవాఁడవు నగు; త్వామ్= నిన్ను; పశ్యామి= చూచుచున్నాను.

ఆదిమధ్యాంతములు లేనివాఁడవు అనంతవీర్యుఁడవు లెక్కకుమీఱిన చేతులు గలవాఁడవు చంద్రసూర్యనేత్రుండవు జ్వలించుచున్నయగ్నియే ముఖముగాఁ గలవాఁడవు నిజతేజస్సుచే నీప్రపంచ మంతయు సంతాపము నొందఁ జేయుచున్నవాఁడ వగు నిన్నుఁ జూచుచున్నా నని తాత్పర్యము.

---

♦ దీనికి మాధ్వభాష్యము లేదు.

ఆ. భగవంతుని విశ్వరూపాఖ్య మగురూపమునే వెండియు వివరించు చున్నారు మఱియును అని. హుతమ్ అశ్నాతి-వేల్వఁబడినహవిస్సును భుజించుచున్నాఁడు కావున హుతాశుఁ డనఁగా అగ్ని.

శం. అయ్యా! “సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ, యతో వా ఇమాని భూతాని, ఏష పరమేశ్వరః, ప్రజ్ఞానం బ్రహ్మ” ఇత్యాది శ్రుత్యర్థము నీ వేది చెప్పితివో అది సత్యమే, అయినను నాకన్న భిన్న మయినజగత్తు కల దని యూశంకించి “సర్వం ఖల్విదం బ్రహ్మ” ఇత్యాదిశ్రుత్యర్థము నవలంబించి యదియు నీవే యని చెప్పుచున్నాఁడు.—అనాదిమధ్యాన్తమ్=ఆదిమధ్యాంతరహితుఁడవును; అనన్తవీర్యమ్ = వీరులకర్మము వీర్యము, అపార మైనవీర్యము గలవాఁడవును; అనన్తబాహుమ్=సంఖ్య నతిక్రమించినబాహువులు గలవాఁడవును; శశిసూర్యనేత్రమ్=చంద్రసూర్యులు నేత్రములుగాఁ గలవాఁడవును; దీప్తహుతాశవక్త్రమ్=జ్వాలలచే జాజ్వల్యమాన మగు నగ్ని యే ముఖముగాఁ గలవాఁడవును; స్వతేజసా; సూర్యునివలె, తపన్తమ్=ప్రజ్వలించుచున్నవాఁడవు నగు; త్వామ్=నిన్ను; ఇదం విశ్వమ్=ఈప్రపంచమునుగా; పశ్యామి = చూచుచున్నాను, ఈప్రపంచము నీవే యని నీకన్న అభిన్నమునుగా విశ్వమును జూచుచున్నాను, విశ్వరూపంబుననున్న నిన్నుఁ జూచుచున్నా నని యర్థము.

మ. మఱియును.—అనాదిమధ్యాన్తమ్=ఉత్పత్తిస్థితివినాశములు లేనివాఁడవు; అనన్తవీర్యమ్ = అనంత మయినప్రభావము గలవాఁడవు; అనంతము లయిన బాహువులు గలవాఁడవు; ఇది ముఖాదులకును నుపలక్షణము; చంద్రసూర్యులు నేత్రములుగాఁ గలవాఁడవు; జ్వలించుచున్నహుతాశము ముఖముగాఁ గలవాఁడవు, లేక, జ్వలించుచున్నహుతాశము ముఖములయందుఁ గలవాఁడవు; స్వతేజసా; ఇదం విశ్వమ్; తపన్తమ్ = సంతాపము నొందఁజేయుచున్నవాఁడ వగు; త్వాం=నిన్ను; పశ్యామి.

శ్రీ. మఱియును.—అనాదిమధ్యాన్తమ్=ఉత్పత్తిస్థితిప్రలయములు లేనివానిని; అనంత మయినవీర్యము-ప్రభావము గలవానిని; అనన్తబాహుమ్ = అనంతము లయినవీర్యవంతము లగు బాహువులు గలవానిని; శశిసూర్యనేత్రమ్=చంద్రసూర్యులు నేత్రములుగాఁ గలవానిని; అట్టి, త్వామ్=నిన్ను; పశ్యామి. అట్లు, దీప్త మయినహుతాశము-అగ్ని వక్త్రములయందుఁ గలవానిని; స్వతేజసా; ఇదం విశ్వమ్; తపన్తమ్=సంతాపము పొందించుచున్నవానిని; నిన్నుఁ జూచుచున్నాను.

ప. మఱియును స్వజనులనే హింసింప నోడి యుద్ధమునుండి నివృత్తుఁడ నగు నేను కాలరూపపరమేశ్వరునిఁ జూడ వేఁడుటచే ముల్లోకములను హింసింపించిన వాఁడ నయితి నని తలంచుచుఁ బశ్చాత్తాపముతోఁ జెప్పుచున్నాఁడు.—ఆదిమధ్యాంతములు లేనివానిని; అనన్తవీర్యమ్=అనంత మైనశక్తి గలవానిని; అనంతము లయిన బాహువులు గలవానిని; శశిసూర్యనేత్రమ్=సమ్ముఖులై వర్తించుచున్న పూర్ణచంద్రసూర్యులు కన్నులుగాఁ గలవానిని; లేక, చంద్రసూర్యులకుఁ గూడ నేత్ర మయినవానిని; దీప్తహుతాశము—జ్వలించుచున్నయగ్ని ముఖముగాఁ గలవానిని; స్వతేజసా; ఇదం విశ్వమ్; తపన్తమ్=సంతపింపఁజేయు చున్నవానిని, జగత్సంహారము చేయఁ బోవువానియు ట్లున్నవానిని; పశ్యామి.

రా. అనాదిమధ్యాన్తరహితమ్ = ఆదిమధ్యాంతరహితుని; అనన్తవీర్యమ్= అవధిలేనియతిశయము గల వీర్యము గలవానిని; వీర్యశబ్దము ప్రదర్శనార్థము, అవధిలేనియతిశయము గల జ్ఞానబలైశ్వర్యవీర్యశక్తితేజస్సులకు నిధి యైనవాని నని యర్థము; అనన్తబాహుమ్=అసంఖ్యేయము లైనబాహువులు గలవానిని; ఇదియుఁ బ్రదర్శనార్థము, అనంతము లైన బాహూదరపాదవక్త్రాదికము గలవానిని; శశిసూర్యనేత్రమ్ = చంద్రునివలెను సూర్యునివలెను బ్రసాదప్రతాపములతోఁ గూడిన సర్వనేత్రములును గలవానిని; అనుకూలురై నమస్కారాదికము చేయుచున్న దేవాదులయెడఁ బ్రసాదము, తద్విపరీతు లగు నసురరాక్షసాదులయెడఁ బ్రతాపము, "రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి, సర్వే నమస్యన్తిచ సిద్ధసఙ్ఘాః" అని గదా చెప్పఁ బోవుచున్నాఁడు; దీప్తహుతాశవక్త్రమ్=జ్వలించుచున్నకాలాగ్నివలె సంహారమున కనుగుణ మయినవక్త్రము గలవానిని; స్వతేజసా విశ్వ మిదం తపన్తమ్ = తేజస్సనఁగా పరాభిభవనసామర్థ్యము, తన దైన తేజస్సుచే నీవిశ్వమును తపింపఁజేయు చున్నవానిని; త్వాం పశ్యామి—ఇట్టివానిని సర్వంబునకును స్రష్టను సర్వంబునకును ఆధారభూతుని సర్వంబునకును బ్రశాసితను సర్వంబునకును సంహర్తను జ్ఞానాద్యపరిమితగుణసముద్రుని ఆదిమధ్యాంతరహితుని ఇట్టిదివ్యదేహము గలవానిని నిన్ను యథోపదేశముగా సాక్షాత్కరించుచున్నా నని యర్థము. ఒకదివ్యదేహమునందు అనేకోదరాదు లెట్లు సంభవించును? ఇట్లుపపన్న మగుచున్నది—అనంతపరిమాణ మయినయొక్కకటిప్రదేశమునుండి యూర్ధ్వముగా వెడలినవి యథోక్తముగా ననంతోదరాదులు, క్రిందుగా వెడలినవి యథోక్తానంతదివ్యపాదములు, అంత దొక్కొకముఖమునందు రెండుకన్నులు. ఇట్లు విరోధము లేదు.

వ్యా॰ శశిసూర్యనేత్రమ్—దీనికిని « అహం క్రతుః " ఇత్యాదికమునకుం బోలె వ్యాఖ్యానము చేయవలయును ♦. « తదగ్నిజా స్సర్వసురాద యోపి తస్మాత్త దగ్నే త్ర్యృషిభి స్సుతాస్తే » * అని ఋగ్వేదఖిలములయందు. « చన్ద్రమా మనసో జాతః చక్షో స్సూర్యో అజాయత » అనియును. అవి బహురూపము లగుటవలన బహ్వాశ్రయములు గావచ్చును.

ద్యావాపృథివ్యో రిద మన్తరం హి
వ్యాప్తం త్వ యైకేన దిశశ్చ సర్వాః
దృష్ట్వా ఽద్భుతం రూప ముగ్రం త వేదం
లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్. ౨౦

భా॰ ద్యావాపృథివ్యోః=ఆకాశభూములయొక్క; ఇదమ్=ఈ; అన్తరమ్=అంతరిక్షము; త్వయా=నీచే; ఏకేన=ఒక్కనిచే; వ్యాప్తం హి=వ్యాపింపఁబడినది గదా! దిశశ్చ=దిక్కులును; సర్వాః=అన్నియు; వ్యాప్తాః=వ్యాపింపఁబడినవి. తవ=నీయొక్క; ఇదమ్=ఈ; అద్భుతమ్ = ఆశ్చర్యకరమును; ఉగ్రమ్=క్రూరము నగు; రూపమ్=రూపమును; దృష్ట్వా=చూచి; లోకత్రయమ్ = లోకములమూఁడును; ప్రవ్యథితమ్ = భయపడెను, లేక, మిక్కిలిచలనము నొందెను. మహాత్మన్ = అక్షుద్ర మయినస్వభావము గలవాఁడా!

మహాత్మా! భూమ్యాకాశములయవకాశంబును సర్వదిక్కులను నీ వొక్కఁడవే వ్యాపించి యున్నాఁడవు. అద్భుతంబును భయంకరంబు నగు నీరూపముఁ జూచి ముల్లోకములును భయము నొందె నని తాత్పర్యము.

అ॰ ప్రకృతం బగు భగవద్రూపముయొక్క వ్యాపకత్వముఁ జెప్పుచున్నారు ద్యావాపృథివ్యో రిత్యాదిగా. దానిభయంకరత్వమును జెప్పుచున్నారు త్తరార్ధముచేత.

శ్రీ॰ దానినే స్పష్టీకరించుచున్నాఁడు.—హి=ఏకారణమువలన; ద్యావాపృథివ్యోః=భూమ్యంతరిక్షములయొక్క; ఇదమ్; అన్తరమ్ = అంతరాలము సమస్త

♦ జన్యజనకభావముచేతఁ గాని ఆశ్రయాశ్రయిభావముచేఁ గాని చంద్రసూర్యులకును నేత్రములకును అభేదోక్తి యని యర్థము.

* ఎల్లదేవతలు మొదలగువారును అతనియంగములం బుట్టినవారు. అందువలన వారు అతనియంగము లని ఋషులచే స్తుతింపఁబడిరి.

మును; త్వయా ఏకేన=విశ్వరూపంబునను న్న నీయొక్కనిచే; వ్యాప్తమ్=పూర్ణము. అట్లు, దిశశ్చ సర్వాః=తూర్పు మొదలగుదిక్కు లన్నియు, వ్యాప్తాః=పూర్ణములు. ఉపలక్షణం బిది, చరాచరాత్మక మగువిశ్వము సమస్తమును నీచేత వ్యాప్తము. "ఏది దేనిచే వ్యాప్తమో తన్మాత్రమే యది" అనున్యాయముచే నీచే వ్యాప్త మగువిశ్వము త్వన్మాత్రమే కావున విశ్వము సర్వంబును నీవే యని యర్థము, "బ్రహ్మైవేదం సర్వమ్" అను శ్రుతివలన. ఇట్లు సర్వాత్మతను బ్రతిపాదించి ప్రకృతివిశ్వరూపమును స్తుతించుచున్నాఁడు.—మహాత్మన్=మహత్తర మయిన విశ్వమయ మగు ఆత్మ-దేహము గలవాఁడా! అద్భుతమ్=ఆశ్చర్యకరంబును; ఉగ్రమ్ = అతిభయంకరము నగు; తవ=నీయొక్క; ఇదం రూపమ్ = ఈరూపమును; దృష్ట్వా=చూచి; లోకత్రయమ్ = ముల్లోకములయం దుండు ప్రాణిసమూహము సమస్తమును; ప్రవ్యథితమ్—క్షోభము నొంది వ్యాకుల మగుచున్న దని యర్థము.

మ. ప్రకృత మగు భగవద్రూపముయొక్క వ్యాప్తిని జెప్పుచున్నాఁడు.—ద్యావాపృథివ్యోః; ఇదమ్; అన్తరమ్=అంతరిక్షము; త్వయా ఏకేనహి=నీయొక్కనిచేతనే; వ్యాప్తమ్. దిశశ్చ సర్వాః; వ్యాప్తములు. అద్భుతమ్ = అత్యంతము విస్మయము గలిగించునదియు; ఉగ్రమ్=మహాతేజస్వి యగుటవలన చూడ నలవిగానిదియు నగు; ఇదమ్; తవ; రూపమ్; దృష్ట్వా=చూచి; లోకత్రయమ్; ప్రవ్యథితమ్=మిక్కిలి భయము నొందెను. మహాత్మన్ = సాధువుల కభయము నిచ్చువాఁడా! ఇఁక దీని నుపసంహరింపు మని యభిప్రాయము.

శ్రీ. మఱియును.—ద్యావా పృథివ్యోః ఇద మన్తరమ్—అంతరిక్షము; త్వయా ఏకేన; వ్యాప్తమ్. దిశశ్చ సర్వాః; వ్యాప్తములు. అద్భుతమ్ = అదృష్టపూర్వమును; ఉగ్రమ్=ఘోరము నగు; ఇదమ్; తవరూపమ్=నీరూపమును; దృష్ట్వా=చూచి; లోకత్రయమ్; ప్రవ్యథితమ్=మిక్కిలి భయము నొందినది. చూచుచున్నా నని యనుషంగము.

ప. ద్యావా పృథివ్యోః; అన్తరమ్=అంతరిక్షము; నీయొక్కనిచేతనే వ్యాపింపఁబడినది. అట్లు, దిశశ్చ సర్వాః; వ్యాపింపఁబడినవి. మహాత్మన్=ఓవిశ్వరూపుఁడా! ఇట్టి యుగ్ర మయిన; తవరూపమ్; దృష్ట్వా; లోకత్రయమ్; ప్రవ్యథితమ్=మిక్కిలి సంహారము నొందినదాని యట్లు కనఁబడుచున్నది. శ్రుతియును వాజసనేయసంహితయందు.—"పరీత్య భూతాని పరీత్య లోకాన్ పరీత్య సర్వాః ప్రదిశో

దిశశ్చ । ఉపస్థాయ ప్రథమజా మృతస్యాత్మ నాత్మాన మభిసంవివేశ " అని. భాష్యము.—ఋతస్య=సత్య మగుపరబ్రహ్మముయొక్క; ప్రథమజామ్ = మొదటఁ గలిగినట్టి దాని, శబ్దత్వంబున నుపస్థిత మయినతనువును; ఉపస్థాయ = అధిష్ఠించి; ఆత్మనా= స్వరూపంబున; ఆత్మానమ్=తన్ను; అభిసంవివేశ=అంతటను బ్రవేశించెను. ఏమిచేసి? భూతాని=పృథివ్యాదులను; పరీత్య=అభివ్యాపించి; లోకాన్=భూర్భువస్సువరాదిలోకములను; పరీత్య; సర్వాః ప్రదిశః దిశశ్చ=సమస్తములయినవిదిక్కులను దిక్కులను; పరీత్య.

రా. ఇట్టి నిన్నుఁ జూచి దేవాదులును నేనును బ్రవ్యథితుల మగుచున్నాము ని చెప్పుచున్నాఁడు.—ద్యుశబ్దమును పృథివీశబ్దమును రెండును ఊర్ధ్వలోకములకును అధోలోకములకును ఉపలక్షణార్థములు; ద్యావా పృథివ్యోః; అన్తరమ్=అవకాశము; ఏయవకాశమునందు సర్వలోకములు నిలిచి యున్నవో ఆయవకాశము సర్వంబును సర్వదిక్కులును నీయొక్కనిచే వ్యాపింపఁబడినవి. అద్భుతమ్ఉగ్రమ్ ఇదం తవరూపం దృష్ట్వా = అనంతాయామవిస్తారంబై అత్యద్భుతంబును అత్యుగ్రంబు నగు నీయీ రూపమును జూచి; లోకత్రయమ్=యుద్ధము చూడఁ గోరి వచ్చినట్టి బ్రహ్మాదిదేవాసుర పితృగణ సిద్ధ గన్ధర్వ యక్ష రాక్షసులయందు ప్రతికూలానుకూలమధ్యస్థరూపములయినలోకములుమూఁడును; ప్రవ్యథితమ్=మిక్కిలి భయము నొందెను. మహాత్మన్= అపరిచ్ఛేద్య మగు మనోవృత్తి గలవాఁడా! వీరికిని అర్జునునకుం బోలె విశ్వరూప సాక్షాత్కారసాధన మయిన దివ్యచక్షువు భగవంతుఁ డొసంగెను. ఎందుకొఱకు? అర్జునునకుఁ దనమైశ్వర్యంబు సర్వంబును బ్రదర్శించుకొఱకు. అందువలన నిది చెప్పఁబడుచున్నది.—« దృష్ట్వాద్భుతం రూప ముగ్రం త వేదం లోకత్రయం ప్రవ్యథితం మహాత్మన్ » అని.

మా. « మాతా పితరో రన్తరజ్ఞ స్స ఏకో రూపేణ చా ఽన్యై స్సర్వగత స్స ఏకః " అనువారుణశ్రుతివలన ఒక్కరూపము చేతనే ద్యావాపృథివులయంతరము వ్యాపించి యున్నాఁడు. « పశ్య మే పార్థ రూపాణి " అని బహురూపములు ప్రతిజ్ఞాతములు. మాతాపితరు లనఁగా ద్యావాపృథివులు, « మానో మాతా పృథివీ దుర్మతౌ ధాత్, మధు ద్యౌ రస్తు నః పితా » ఇత్యాదిప్రయోగమువలన. నియమంబున నేమో భయప్రదము గాదు తత్స్వరూపము, నారదునకు భయము లేమి వలన. కొందఱి కట్లు చూపుచున్నాఁడు భగవంతుఁడు. « ప్రియా న్తి కేచి త్తస్య

రూపస్య దృష్ట్వా బిభేతి కశ్చి దభ్యాసే సర్వాన్ప్రీతిః” ♦ అని వారుణశాఖయందును. అందఱును అతనిఁ జూడ లేరు, చూడకయే దానిఁ దలఁచి భయము నొంది యున్న వారల నిరూపించి భయంబునఁ జూచువాని కట్లు తోఁచుచున్నది. అట్లు గౌతమశాఖయందు.—“దృష్ట్వా దేవం మోదమానా అదృష్ట్వా ఉద్విజత ద్భయా ద్బిభ్యతో దృష్టవత్తే । పశ్యన్తి తే స్వాన్త చక్షుర్ముఖాం స్తు తస్మిన్ స్నిగ్ధైస్తే మనసో గతత్వాత్” * అని.

అమీ హి త్వా సురసఙ్ఘా విశన్తి
కేచి ద్భీతాః ప్రాఞ్జలయో గృణన్తి
స్వస్తీ త్యుక్త్వా మహర్షిసిద్ధసఙ్ఘాః
స్తువన్తి త్వాం స్తుతిభిః పుష్కలాభిః.

భా. ఇఁక నిప్పుడు, మున్ను “యద్వా జయేమ యది వా నో జయేయుః” అని యర్జునున కేసంశయము కలిగెనో యది నిర్ణయించుటకై పాండవులకే జయము నిశ్చితం బని చూపెద నని భగవంతుఁడు ప్రవర్తించెను, అట్టి భగవంతుం జూచి యర్జునుండు చెప్పుచున్నాఁడు. మఱియును.—అమీ = ఈ పోరుటకు వచ్చిన యోధు లయిన; సురసఙ్ఘాః = ఎవ్వరిచ్చట భూభారావతారముకొఱకవతరించినవారలై మనుష్యశరీరు లగు వస్వాదిదేవతలు గలరో వారిసమూహములు; త్వా = నిన్ను; విశన్తి హి = ప్రవేశించునవిగాఁ గనఁబడుచున్నవి గదా! అందు, కేచిత్ = కొందఱు. ఇతరులు; భీతాః = భయపడినవారలై; ప్రాఞ్జలయః = చేకఱగా చేమోడ్పు గలవార లగుచు; గృణన్తి = నిన్ను స్తుతించుచున్నారు, పరు గెత్తుటకును అశక్తులై. యుద్ధము సమీపించుటచే నుత్పాతాదినిమిత్తములం చూచి, స్వస్తి = మంగళ మగుఁగాక లోకమునకు; ఇతి = అని; ఉక్త్వా = పలికి; మహర్షిసిద్ధసఙ్ఘాః = మహర్షులయు సిద్ధులయు సమూహములు;

♦ కొందఱు రూపముఁ జూచి యానందించుచున్నారు, ఒకానొకఁడు భయపడుచున్నాఁడు, అభ్యాసము కలిగినచో అందఱకును ఆనంద మగును.

* దేవునిఁ జూచి సంతోషించుచుండు నర్జునాదులు, ఆదేవునే ధ్యానించుచు వానియందే మనస్సు నుంచి వానివైపుననే దృష్టిని ముఖమును బరఁగించి యతనిఁ జూడకున్నను జూచినట్లు భయమువలన వెఱచుచున్నవారలం జూచుచున్నారు.

త్వామ్=నిన్ను; పుష్కలాభిః=సంపూర్ణము లైన; స్తుతిభిః=స్తోత్రములచే; స్తువన్తి=పొగడుచున్నవి.

భూభారమును హరించుటకై మనుష్యలోకంబున నవతరించినట్టి వస్వాది దేవతలు నిన్నుఁ బ్రవేశించుచున్నారు, కొందఱు భయపడి చేమోడ్పులు గలవారై నిన్ను స్తుతించు చున్నారు, మహర్షులును సిద్ధులును దుశ్శకునములం జూచి లోకమునకు మంగళ మగుఁగాక యని పలికి సమగ్రము లగు స్తోత్రములచే నిన్ను సంస్తుతించుచున్నా రని తాత్పర్యము.

రా. అమీ హీత్యాదిక మగు మీఁదిగ్రంథమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు ఇఁక నిత్యాదిగా. విశ్వరూపప్రదర్శనార్థమే యనంతరగ్రంథజాత మని తెలుపుచున్నారు మఱియును అని. ఇట అసురసఙ్ఘాః అని పదమును విభజించి భూభారభూతు లైన దుర్యోధనాద్యసురులసమూహములు నిన్నుఁ బ్రవేశించుచున్నవి యనియుఁ జెప్పవచ్చును. ఉభయసేనలయందును యోద్ధుకాము లై నిలిచియున్న వీరుల యందు అవాంతరవిశేషముఁ జెప్పుచున్నారు అందు ఇత్యాదిగా. సమరభూమికి దర్శనార్థులై వచ్చినట్టి నారదప్రభృతులు లోకవినాశము నాశంకించి దానిఁ బరిహరింపఁ గోరినవారలై భగవద్విషయంబు లగు స్తుతిపఠనములయందుఁ బ్రవర్తించువిధముఁ దెలుపుచున్నారు యుద్ధము ఇత్యాదిగా.

శం. మఱియును—హి=ఎందువలన నీవు శాశ్వతధర్మగోప్తవో అందువలన; ఉగ్రుఁడవైనను అత్యద్భుతస్వరూపుఁడ వైన నిన్నుఁ జూచుటకుఁ గొందఱు బలాధికు లైన, సురసఙ్ఘాః=దేవతలసమూహములు; త్వా=నీసమీపమును; విశన్తి=చేరుచున్నవి. కేచిత్=కొందఱు బలహీనులు; భీతులై దూరమునుండియే ప్రాంజలులై, గృణన్తి=స్తుతించుచున్నారు. అంతు, మహర్షిసిద్ధసఙ్ఘాః=భృగ్వాదిమహర్షులయు కపిలాదిసిద్ధులయు సమూహములు; స్వస్తి ఇతి ఉక్త్వా; పుష్కలాభిః = శబ్దార్థపుష్టియుక్తము లైన; స్తుతిభిః; త్వామ్; స్తువన్తి.

మ. ఇప్పుడు తాను భూభారసంహారకర్త యగుటను వెల్లడించుచున్న భగవంతుం జూచి చెప్పుచున్నాఁడు.—అమీ హి సురసఙ్ఘాః=వస్వాదిదేవతలసమూహములు; భూభారావతారముకొఱకు మనుష్యరూపంబున నవతరించి యుద్ధము సేయుచున్నవై, త్వా = నిన్ను, విశన్తి = ప్రవేశించునవిగాఁ గనఁబడుచున్నవి. ఇట్లు, అసురసఙ్ఘాః అని పదచ్ఛేదము చేసి భూభారభూతు లైన దుర్యోధనాదులు

నిన్నుఁ బ్రవేశించుచున్నా రనియుఁ జెప్పవలయును. ఇట్లుభయసేనలయందును; కేచిత్=కొందఱు; భీతాః—పలాయనమునందును అశక్తులై; ప్రాఞ్జలయః; గృణన్తి= నిన్ను స్తుతించుచున్నారు. ఇట్లు యుద్ధ ముపస్థిత మగుటచే సుత్పాతాదినిమిత్తములం గని, స్వస్తి = సమస్తజగంబునకును స్వస్తి యగుఁ గాక; ఇతి ఉక్త్వా; మహర్షిసిద్ధ సఙ్ఘాః=నారదప్రభృతులు; యుద్ధముఁ జూడ వచ్చినవారలై లోకవినాశముఁ బరిహ రించుకొఱకు, త్వామ్=నిన్ను; పుష్కలాభిః=పరిపూర్ణ మయినయర్థము గల; స్తుతిభిః= గుణోత్కర్షముఁ బ్రతిపాదించువాక్యములచే; స్తువన్తి.

శ్రీ. మఱియును.—అమీ సురసఙ్ఘాః; భీతులై; త్వా=నిన్ను; విశన్తి= శరణు పొందుచున్నారు. వారిలో, కేచిత్ = కొందఱు; అతిభీతులై దూరముననే నిలిచి చేతులు మోడ్చినవారలై, గృణన్తి=జయ జయ రక్ష రక్ష యని ప్రార్థించు చున్నారు. ఇతరము స్పష్టము.

ప. దానినే చెప్పుచున్నాఁడు—సురసఙ్ఘాః=దేవసమూహములు; అతి భయంకరుఁడ వైన నిన్నుఁ జూచి యిఁకమీఁద నెటకుఁ బోవలవి యగు నని వ్యా కులచిత్తులై, త్వా విశన్తి=నిన్నే ప్రవేశించుచున్నవి. అట్లు, మహర్షులును గంధర్వ చారణాదులును నిన్ను త్రిలోకప్రభువునుగా నెఱింగి స్వస్తి యని యాశీర్వచనముఁ బలికి నిన్ను, పుష్కలాభిః=దీర్ఘము లైన; స్తుతిభిః; స్తువన్తి.

రా. అమీ; సురసఙ్ఘాః = ఉత్కృష్టము లయినదేవతలసమూహములు; విశ్వాశ్రయభూతుఁడ వైననిన్నుఁ జూచి సంతుష్టహృదయములై, త్వాం విశన్తి=నీ సమీపమును బొందుచున్నవి. వారిలోనే, కేచిత్ = కొందఱు; అత్యుగ్రంబును అత్యద్భుతంబు నగు నీయాకారము నవలోకించి భీతులై ప్రాంజలులై తమజ్ఞానమున కనుగుణముగా స్తుతిరూపంబు లగువాక్యములను, గృణన్తి = ఉచ్చరించుచున్నారు. ఇతరములు మహర్షిసంఘములును సిద్ధసంఘంబులును పరావరతత్త్వయాథాత్మ్యము నెఱింగినవి స్వస్తి యని పలికి, పుష్కలాభిః=భగవంతున కనురూపము లయిన; స్తుతిభిః; స్తువన్తి.

మూ. ✦

రుద్రాదిత్యా వసవో యేచ సాధ్యా
విశ్వే ఽశ్వినౌ మరుత శ్చోష్మపాశ్చ

✦ ఇది మొదలు కొన్ని శ్లోకము లకు శ్రీభాష్యము లేదు.

గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘా
వీక్షన్తే త్వా విస్మితాశ్చైవ సర్వే. ౨౨

భా. మఱియు నొకటి — రుద్రాదిత్యాః=రుద్రులును ఆదిత్యులును; వసవః=వసువులును; యేచసాధ్యాః=సాధ్యులు ఎవ్వరు గలరో వారును; విశ్వే=విశ్వదేవులును; అశ్వినౌ=అశ్విదేవతలును; మరుతశ్చ=వాయువులును; ఊష్మపాశ్చ = పితృదేవతలును; గన్ధర్వయక్షాసురసిద్ధసఙ్ఘాః=గంధర్వులు హాహాహూహూప్రభృతులు, యక్షులు కుబేరప్రభృతులు, అసురులు విరోచనప్రభృతులు, సిద్ధులు కపిలాదులు, వారిసమూహములు; సర్వే చైవ=అందఱును; విస్మితాః = విస్మయము నొందినవారలై; త్వా= నిన్ను; వీక్షన్తే=చూచుచున్నారు.

రుద్రులును ఆదిత్యులును వసువులును సాధ్యులును విశ్వదేవులును అశ్విదేవతలును మరుద్గణంబులును బితరులును గంధర్వులును యక్షులును అసురులును సిద్ధులును ఆశ్చర్యము నొంది నిన్నుఁ జూచుచున్నా రని తాత్పర్యము.

ఆ. కనఁబడుచున్న భగవద్రూపము విస్మయకరం బనుటకు హేత్వంతరముఁ జెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా.

హ. విశ్వే=విశ్వదేవులు. ఊష్మపాః=పితృదేవతలు.

శం. ఇట్లు సామాన్యంబునం జెప్పి విశేషముఁ జెప్పుచున్నాఁడు.—రుద్రాదిత్యాః; వసవః; యేచసాధ్యాః=సాధ్య లను దేవతావిశేషము లెవ్వరు గలరో వారును; విశ్వే=విశ్వదేవులును; మరుతః—దేవవిశేషములును; ఊష్మపాః = పితృదేవతలును, "ఊష్మభాగా హి పితరః" అనుశ్రుతివలన. గంధర్వులయు యక్షులయు అసురులయు సిద్ధులయు సంఘములును; సర్వే=అందఱును; విస్మితాః = ఆశ్చర్యము గలవారై; త్వా; వీక్షన్తే.

మ. మఱియు నొకటి.—రుద్రులును ఆదిత్యులును వసువులును, యేచ సాధ్యాః—సాధ్యులను దేవగణంబు లెవ్వరు గలరో వారును; విశ్వే=తుల్యవిభక్తికములగు విశ్వదేవశబ్దముల రెంటిచేఁ జెప్పఁబడుదేవగణంబులును; అశ్వినౌ=నాసత్యదస్రులు అను ఇద్దఱును; మరుతః=మరుత్తు లను ఏకోనపంచాశద్దేవగణంబులును, ఊష్మపాశ్చ=పితరులును; గంధర్వులయు యక్షులయు అసురులయు సిద్ధు లనుజాతిభేదంబు

లయు సంఘములును; త్వాం=నిన్ను; వీక్షన్తే = చూచుచున్నారు. అట్టి యద్భుత మును జూచుటవలన వారు, సర్వఏవ=అందఱునే; విస్మితాశ్చ=విస్మయమును—అలౌకిక చమత్కారవిశేషమును పొందుచున్నారు గూడ.

శ్రీ. మఱియును.—రుద్రులును ఆదిత్యులును, వసువులును యేచసాధ్యాః—సాధ్యు లను దేవతలును; విశ్వేదేవులును, అశ్వినౌ=ఇద్దఱు అశ్విదేవతలును; మరుతః= మరుద్గణంబులును; ఊష్మపాః=ఊష్మమును—ఉష్ణమును పిబన్తి—త్రాగుచున్నారు కావున ఉష్మపులు అనఁగా పితరులును, « ఊష్మభాగా హి పితరః ” ఇత్యాదిశ్రుతివలన, స్మృతియును « యావ దుష్ణం భవే దన్నం యావ దశ్నన్తి వాగ్యతాః । పితర స్తావ దశ్నన్తి యావ న్నోక్తా హవి ర్గుణాః » ♦ అని; గంధర్వులును యక్షులును విరోచ నాదు లగునసురులును సిద్ధులసమూహములును; సర్వఏవ=వారందఱుఁ గూడ; విస్మితాః; త్వాం; వీక్షన్తే.

ప. ఇఁకఁ గొందఱు మిక్కిలి భీతు లగుటచే స్తుతింప నశక్తులై యూరక యుండి రని చెప్పుచున్నాఁడు.—రుద్రులు పదునొకండుగురు, ఆదిత్యులు పన్రెండు గురు, వసువు లెనమండ్రు, సాధ్యు లనువారు, విశ్వేదేవులు, అశ్విదేవతలు, మరుద్గణం బులు, ఊష్మపాః=పితృదేవతలు, గంధర్వులును యక్షులును అసురులును సిద్ధసంఘంబు లును, అద్భుతదర్శనమువలన విస్మితులై, త్వా వీక్షన్తే=నిన్నుఊరక చూచుచున్నారు.

రా. ఊష్మపాః=పితృదేవతలు, « ఊష్మభాగా హి పితరః ” అనుశ్రుతివలన. వీర లందఱును విస్మయము నొందినవారై నిన్నుఁ జూచుచున్నారు.

> రూపం మహ త్తే బహువక్త్రనేత్రం
> మహాబాహో బహుబాహూరుపాదమ్
> బహూదరం బహుదంష్ట్రాకరాలం
> దృష్ట్వా లోకాః ప్రవ్యథితా స్తథా ౭హమ్. ౨౩

భా. ఎందువలన ననఁగా.—మహాబాహో=ఓమహాబాహుఁడా! మహత్=అతిప్రమాణంబును; బహువక్త్రనేత్రమ్=అనేకము లయినముఖ ములును కన్నులును గలదియు; బహుబాహూరుపాదమ్=అనేకము లయిన

♦ ఎంతవఱకు అన్నము వేడిగా నుండునో ఎంతవఱకు మౌనము గలవారై భుజింతురో అన్న గుణము లెంతవఱకుఁ జెప్పఁబడవో అంతవఱకే పితరులు భుజింతురు.

చేతులును తొడలును పాదములును గలదియు; మఱియును, బహూ
దరమ్ = అనేకము లయినకడుపులు గలదియు; బహుదంష్ట్రాకరాలమ్ =
అనేకములయిన కోఱలచే వికృతము నగు; తే=నీయొక్క; రూపమ్=రూప
మును; దృష్ట్వా = చూచి; లోకాః=లౌకికు లగుప్రాణులు; ప్రవ్యథితాః=
భయముచే ప్రచలితు లైరి. తథా=అట్లు; అహమ్=నేనును; ప్రచలితుఁడ
నైతిని.

మహాబాహూఁడా! అతిప్రమాణంబై లెక్కకుమిాఱినముఖములును నేత్రములును చేతులును తొడలును పాదములును కడుపులును కోఱలును గలిగి భయంకరమై యున్ననీరూపముం జూచి లోకమునందలిప్రాణులు భయంబు నొంది యున్నారు, నేనును భయంబు నొంది యున్నా నని తాత్పర్యము.

ఆ. లోకత్రయం ప్రవ్యథిత మ్మని చెప్పినదాని నుపసంహరించుచున్నారు ఎందువలన నిత్యాదిగా. భయముచే లౌకికులవలె నేనును ప్రవ్యథితుఁడను—వ్యథను—పీడను దేహేంద్రియప్రచలనమును బొందితి నని చెప్పుచున్నాఁడు త థేత్యాదిగా.

హ. *

శం. ఇట్లు దేవాదులప్రవేశంబును స్తుతియును విస్మయదర్శనంబునుం బ్రతిపాదించి యిప్పుడు భయంకరాకారదర్శనంబున లోకంబులకును దనకును భయము కలుగుటం జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—బహువక్త్రనేత్రమ్=అనేకములును అనేకవిధములు నగు ముఖంబులును నేత్రములును గలదియు; బహుబాహూరుపాదమ్ = అనేకము లయినచేతులును తొడలును చరణంబులును గలదియు; బహుదంష్ట్రాకరాలమ్=పెక్కు లైనకోఱలచే వికృతంబును; మహత్ = అతిప్రమాణంబు నగు; తే రూపమ్=నీస్వరూపమును; దృష్ట్వా=చూచి; లోకాః = ప్రాణులందఱును; ప్రవ్యథితాః=మహావ్యథను బొందిరి. తథా; అహమ్=నేనును; మహావ్యథను పొందితిని.

మ. లోకత్రయం ప్రవ్యథిత మ్మని చెప్పినదాని నుపసంహరించుచున్నాఁడు.—ఓమహాబాహూఁడా! తే=నీయొక్క; రూపమ్; దృష్ట్వా = చూచి; లోకాః=సర్వప్రాణులును; ప్రవ్యథితాః = భయముచే మిక్కిలివ్యథితు లైరి తథా; అహమ్=నేను; ప్రవ్యథితుఁడ నైతిని. ఎట్టి నీరూపమును? అనేకము లయినవక్త్రములును నేత్రములును గలదానిని. పెక్కు లైనబాహువులును ఊరువులును పాదములును

* దీని కీవ్యాఖ్యానము లేదు.

గలదానిని; అనేకము లయినయుదరములు గలదానిని; పెక్కుదంష్ట్రలచే నతిభయంకర మైనదానిని. ఇట్టి నీరూపముఁ జూచి నంతనే సర్వలోకంబులును నేనును భయంబుచేఁ బీడింపఁబడుచున్నా మని యర్థము.

శ్రీ. మఱియును — ఓమహాబాహువుఁడా! మహత్ = మిక్కిలిగొప్పది యగు; నీరూపమును జూచి లోకము లన్నియు ప్రవ్యథితములు — అతిభీతము లైనవి. తథా, అహమ్ — నేనును ప్రవ్యథితుఁడ నైతిని. ఎట్టిరూపమును జూచి? బహువక్త్రనేత్రమ్, బహుబాహూరుపాదమ్, బహూదరమ్; బహుదంష్ట్రలచే కరాలమును — వికృత మైనదానిని, రౌద్ర మయినదాని నని యర్థము.

ప. ఇట్లు స్థితిరూపంబున విశ్వరూపముం జూచి యిప్పుడు సంహారరూపంబునఁ జూచుచు నతిభయంకరంబగురూపముఁ జూచుటచే భగవంతునుదరమునందు లోకంబులకును దనకును గలిగినభయమును దెలుపుచున్నాఁడు — నీయొక్కరూపమును అతిభయంకర మయినదానిని జూచి, లోకాః = కౌరవసైనికులు; «మూర్ఖైత్తరుత్తమాఙ్గైః» అని చెప్పఁబోవురీతిని, ప్రవ్యథితాః = నాశమునకు సమీపించిరి. దీనిని జూచి నేనును, «వీరు నైనమువలననే నష్టు లైరి, నేను తౌ త్రిధర్మ ప్రతిష్ఠాపకుఁడైనజగద్గురునివాక్యమును గణియింపక యుద్ధమునుండి యుపరమించితి» నని ప్రవ్యథితుఁడ నైతి నని యర్థము.

రా. బహుదంష్ట్రాకరాలమ్ = అనేకము లయినదంష్ట్రలచే నతిభయంకరా, కారమును. లోకాః = మున్ను చెప్పినప్రతికూలానుకూలమధ్యస్థులు త్రివిధు లందఱును; నేనును ఇట్టి నీరూపమును చూచి మిక్కిలి వ్యథితుల మగుచున్నాము.

నభస్స్పృశం దీప్త మనేకవర్ణం
వ్యాత్తాననం దీప్తవిశాలనేత్రమ్
దృష్ట్వా హి త్వాం ప్రవ్యథితాన్తరాత్మా
ధృతిం న విన్దామి శమం చ విష్ణో. ౨౪

భా. అందు కిది కారణము, — నభః స్పృశమ్ = ఆకాశమును తాఁకుచున్నవాఁడవు; దీప్తమ్ = జ్వలించుచున్నవాఁడవు; అనేకవర్ణమ్ = భయంకరములై నానావిధము లగు సంస్థానములు గలవాఁడవు; వ్యాత్తాననమ్ = తెఱవఁబడిననోరులు గలవాఁడవు; దీప్తవిశాలనేత్రమ్ = జ్వలించుచున్నవిస్తీ

ర్ణము లయినకన్నులు గలవాఁడ వగు; త్వా=నిన్ను; దృష్ట్వాహి=చూచి నంతనె; ప్రవ్యథితాన్తరాత్మా = మిక్కిలి భయపడినమనస్సు గలవాఁడనై; ధృతిమ్=ధైర్యమును; శమంచ=ఉపశమమును—మనస్తుష్టిని; నవిన్దామి= పొందకున్నాను. విష్ణో=ఓవిష్ణూ!

ఓవిష్ణూ! ఆకాశమునంటి జ్వలించుచు భయంకరము లయినయనేకవిధము లగు నవయవసన్నివేశములు గలవాఁడవై నోళ్లు తెఱచికొని జాజ్వల్యమానము లయిన విశాలనేత్రంబులతో నున్న నిన్నుఁ జూచినంతనె మిక్కిలి భయము నొంది ధైర్యమును సంతోషమును బొందఁజాల కున్నా నని తాత్పర్యము.

ఆ. అర్జునుఁడు విశ్వరూపదర్శనముచే వ్యథితుం డగుటకు హేతువుఁ జెప్పుచున్నారు అందుకు ఇత్యాదిగా.

హ. వ్యాత్తాననమ్=తెఱవఁబడిననోళ్లు గలవానిని.

శం. ఇఁక వ్యథ కలుగుటకుఁ గారణమునే స్పష్టీకరించుచున్నాఁడు.— విష్ణో=ఓసర్వవ్యాపకుఁడా! నభః స్పృశమ్=ఆకాశము నొరయుచున్నవాఁడవు; లేక, ఆకాశమువలె సర్వంబును స్పృశించువాఁడవు, సర్వవ్యాపకుఁడవు; దీప్తమ్ = తేజోవిశేషముచే మిక్కిలి జ్వలించుచున్నవాఁడవు; అనేకవర్ణమ్=వర్ణింపఁబడుచున్నవి కావున వర్ణము లనఁగా రూపములు, అనేకవిధము లయినరూపములు గలవాఁడవు; బ్రహ్మాదినానావిధవిచిత్రరూపములు గలవాఁడవు; వ్యాత్తాననమ్=తెఱవఁబడిననోళ్ళు గలవాఁడవు; దీప్తవిశాలనేత్రమ్=సూర్యమండలములవలె జ్వలించుచున్న వికృతము లయిననేత్రములు గలవాఁడ వగు; త్వా=నిన్ను; దృష్ట్వా హి=హి అనునది ఏవార్థకము, చూచియే; ప్రవ్యథితాన్తరాత్మా = భయముచే క్షోభపడినమనస్సు గలవాఁడనై; ధృతిమ్=ధైర్యమును; శమంచ=మనస్స్వాస్థ్యమును; నవిన్దామి. మిక్కిలి భయపడుచున్నా నని యర్థము.

మ. భయంకరత్వమునే ప్రపంచించుచున్నాఁడు.—ప్రవ్యథితుఁడనుమాత్రమే కాను నేను నిన్నుఁ జూచి, మ తే మనఁగా, ప్రవ్యథితాన్తరాత్మా=ప్రవ్యథితమయిన మనస్సు గలవాఁడ నగు నేను; ధృతిమ్=ధైర్యమును, దేహేంద్రియాదిధారణాసామర్థ్యమును; శమంచ=మనఃప్రసాదమును; నవిన్దామి=పొంద కున్నాను. ఓవిష్ణుదేవుఁడా! ఎట్టి నిన్నుఁ జూచి? నభః స్పృశమ్=అంతరిక్షవ్యాపిని; దీప్తమ్=ప్రజ్వలించు చున్నవానిని; అనేకవర్ణమ్ = భయంకరము లయిననానాసంస్థానములతోఁ గూడినవానిని;

వ్యాత్తాననమ్=తెఱవఁబడిననోళ్ళు గలవానిని; దీప్తవిశాలనేత్రమ్=ప్రజ్వలితము లైన విస్తీర్ణము లగు కన్నులు గలవానిని. ఇట్టి నిన్నుఁ జూచినంతనె ప్రవ్యథిత మయిన మనస్సు గలవాఁడ నగు నేను ధృతిని శమమును పొందకున్నా నని యన్వయము.

శ్రీ. నేను భయము నొందితి నన్నంతమాత్రమే కాదు, మఱే మనఁగా.—నభఃస్పృశమ్=నభమును స్పృశించువానిని, అంతరిక్షమును వ్యాపించి యున్నవాని నని యర్థము; దీప్తమ్=తేజోయుక్తుని; అనేకము లయినవర్ణములు గలవానిని; తెఱవఁబడిననోళ్ళు గలవానిని; దీప్తములై విశాలము లైననేత్రములు గలవానిని; ఇట్టి, త్వా=నిన్నుఁ; చూచి ప్రవ్యథిత మయినమనస్సు గల నేను ధృతిని—ధైర్యమును ఉపశమమును పొందకున్నాను.

ప. మఱియును.—నభః స్పృశమ్ = అంతరిక్షమును స్పృశించుచున్నవానిని; దీప్తమ్=ప్రజ్వలించుచున్నవానిని; అనేకవర్ణమ్; వ్యాత్తములు—చాఁపఁబడిన వగు నోళ్ళు గలవానిని; దీప్తములు—ప్రజ్వలితములును విశాలములు నగునేత్రములు గలవానిని; విష్ణో=వ్యాపకుఁడా! ఇట్టి నిన్నుఁ జూచి ప్రవ్యథిత మయిన యంతరాత్మ—మనస్సు గల నేను ధృతిని—ధైర్యమును గాని యుపశమమును గాని పొందకున్నాను.

రా. నభస్స్పృశము "త దక్షరే పరమే వ్యోమన్, ఆదిత్యవర్ణం తమసః పరస్తాత్, క్షయ న్త మస్య రజసః పరాకే, యో అస్యా ధ్యక్షః పరమే వ్యోమన్" ఇత్యాదిశ్రుతిప్రసిద్ధ మయిన త్రిగుణప్రకృత్యతీత మగు పరమవ్యోమమును వచించుచున్నది, సవికారం బగు ప్రకృతితత్త్వమునకును సర్వావస్థుఁ డగుపురుషునకును సమస్తమునకును ఆశ్రయ మగుటచే నభః స్పృశ మ్మని చెప్పుటవలన, "ద్యావాపృథివ్యో రిద మన్తరాలం హి వ్యాప్తమ్" అని మున్ను చెప్పుటవలనను గూడ. దీప్తమ్; అనేకవర్ణమ్; వ్యాత్తాననమ్; దీప్తవిశాలనేత్రమ్; త్వా దృష్ట్వా; ప్రవ్యథితా న్తరాత్మా=అత్యంతము భయము నొందినమనస్సు గలవాఁడనై; ధృతిం నవిన్దామి=దేహధారణమును పొందకున్నాను. శమంచ నవిన్దామి=మనస్సుయొక్కయు ఇంద్రియములయు శమంబును పొంద కున్నాను. విష్ణో=సర్వవ్యాపకుఁడా! సర్వవ్యాపకుఁడవు అతిమాత్రుఁడవు అత్యద్భుతుఁడవు అతిఘోరుఁడ వగు నిన్నుం జూచి ప్రశిథిలిసర్వావయవుండను వ్యాకులేంద్రియుండను అగుచున్నా నని యర్థము.

దంష్ట్రాకరాలాని చ తే ముఖాని
దృష్ట్వైవ కాలానల సన్నిభాని

దిశో న జానే న లభే చ శర్మ
ప్రసీద దేవేశ జగన్నివాస. ౨౫

భా. ఎందువలన ?—దంష్ట్రాకరాలానిచ=కోఱలచే వికృతములును; కాలానలసన్నిభాని=ప్రలయకాలమునందు లోకములదహించునగ్ని కాలానలము, దానితో సదృశంబులు నగు; తే=నీయొక్క; ముఖాని = ముఖములను; దృష్ట్వా ఏవ=చూచియే; దిశః=దిక్కులను; తూర్పుపడమర యని వివేకించి, నజానే=ఎఱుంగకున్నాను, దిగ్భ్రమ నొంది యున్నాను. కావున, శర్మచ=సుఖమును; నలభే=పొందకున్నాను. అందువలన, ప్రసీద= ప్రసన్నుఁడ వగుము. దేవేశ = దేవతలకు ఈశ్వరుఁడా! జగన్నివాస= లోకములకు నివాసస్థాన మయినవాఁడా!

కోఱలచే భయంకరంబులై ప్రలయకాలాగ్నులవలె జ్వలించుచున్న నీ ముఖంబులం జూచి దిక్కులు దెలియక దిగులుపడి యున్నాను. దేవేశా! జగన్నివాసా! ప్రసన్నుఁడ వగు మని తాత్పర్యము.

రా. భగవద్దేహమును జూచు చున్నను బరితోషము లేమికిఁ గారణాంతరమును బ్రశ్నపూర్వకముగాఁ జెప్పుచున్నారు ఎందువలన అని. దృష్ట్వైవ అనుచోటి యేవకారముచే ప్రాప్తి వ్యావర్తింపఁబడుచున్నది.

హ. శర్మ=సుఖమును.

శం. చెప్పినయర్థమునే ప్రకారాంతరమునఁ జెప్పుచు భగవత్ప్రసాదమును బ్రార్థించుచున్నాఁడు.—జగన్నివాస=జగత్తులకు నివాసస్థాన మయినవాఁడా! దేవ= ఇతరాపేక్ష లేక తనయంతనే దీవ్యతే—ప్రకాశించువాఁడు కావున దేవుఁడు, దేవుఁడా! ఈశ=తనసన్నిధానమువలన సర్వంబును ఈష్టే—చేష్టింపఁజేయు చున్నాఁడు. కావున ఈశుఁడు, ఈశుఁడా! దిశో నజానే, భయముచేత. చిత్తస్వాస్థ్యమువలనఁ గలుగునట్టి, శర్మ=సుఖమును; నలభే=పొందను. ప్రసీద=ప్రసన్నుఁడ వగుము. తక్కినది స్పష్టము.

మ. దంష్ట్రలచే కరాలములు—వికృతము లగుటచే భయంకరములును; ప్రలయకాలాగ్నిసదృశంబులు నగు; తే ముఖాని; దృష్ట్వైవ=చూచియే, ప్రాపించికాదు; భయవశంబున, దిశః=దిక్కులను, తూర్పు పడమర యను వివేకంబున; నజానే=

ఎఱుంగను. కావున, శర్మ నలభే=సుఖము పొందకున్నాను, నీరూపముఁ జూచుచున్నను. అందువలన, ఓ దేవేశుఁడా! ఓ జగన్నివాసుఁడా! ప్రసీద=ప్రసన్నుఁడ వగుము, నాయెడ, ఎట్లు భయము నొందక నిన్నుఁ జూచుటచేఁ గలుగుసుఖము నొందుదునో అట్లు అని శేషము.

శ్రీ. మఱియును.—ఓదేవేశుఁడా! నీముఖములను జూచి భయావేశంబున దిశలు దెలియకున్నాను. సుఖంబును పొందకున్నాను. ఓజగన్నివాసుఁడా! ప్రసన్నుఁడ వగుము. ఎట్టిముఖములను? దంష్ట్రలచేఁ గరాలము లైనవానిని; కాలానల మనఁగా ప్రలయాగ్ని, దానితో సమానములను.

ప. ఇఁక భయాతిశయంబునఁ దాను కాందిశీకుం* డైనట్లు చెప్పుచున్నాఁడు.—దంష్ట్రలచే కరాలములు—భయానకము లైనవానిని. కాలానలము—సంకర్షణముఖాగ్ని, దానితో సమానములను; తే ముఖాని; దృష్ట్వా; నేను, దిశో నజానే—తూర్పు పడమర మొదలగువిభాగము సూర్యునిచే సిద్ధించుచున్నది, అతఁడును నీకు నాభిభూతుఁడై యున్నాఁ డని యర్థము. అట్లు, ఇఁకమీఁద నేమి యగునో యని, శర్మ = విశ్రాంతిని; నలభే. ఇఁక భయపరిహారము నీవే చేయవలయు నని చెప్పుచున్నాఁడు ప్రసీ దేత్యాదిగా. స్పష్టము.

రా. యుగాంతకాలాగ్నివలె సర్వసంహారమునందుఁ బ్రవృత్తములై యతిఘోరము లైన నీముఖములను జూచి దిక్కులఁ దెలియకున్నాను. సుఖమునుం బొందకున్నాను. జగత్తులకు నివాస మైనవాఁడా! దేవేశ = ఈశ్వరు లైన బ్రహ్మదులకును బరమమహేశ్వరుఁడా! నాయెడఁ బ్రసన్నుఁడ వగుము—ఎట్లు నేను బ్రకృతిగతుండ నగుదునో అట్లు చేయు మని యర్థము.

అమీ చ త్వాం ధృతరాష్ట్రస్య పుత్రాః
సర్వే సహైవావనిపాలసంఘైః
భీష్మో ద్రోణ స్సూతపుత్ర స్తథాఽసౌ
సహాస్మదీయై రపి యోధముఖ్యైః. ౨౬.
వక్త్రాణి తే త్వరమాణా విశన్తి
దంష్ట్రాకరాలాని భయానకాని

* తా నేదిక్కునకుఁ బోవుచున్నాఁడో తెలియనివాఁడు.

కేచి ద్విలగ్నా దశనాన్తరేషు
సందృశ్యన్తే చూర్ణితై రుత్తమాఙ్గైః. ౨౭

భా. దుర్యోధనాదులవలన నాకుఁ బరాజయము కలుగునను నేశంక యుండెనో యదియు నశించెను. ఎందువలన ననఁగా.—అమీ = ఈ; ధృతరాష్ట్రస్య పుత్త్రాశ్చ = ధృతరాష్ట్రునికొడుకులును, దుర్యోధనుఁడు మొదలగువారును; సర్వే=అందఱును; అవనిపాలసంఘైస్సహైవ=రాజుల సమూహములతోఁ గూడనే; త్వామ్=నిన్ను; త్వరమాణాః విశన్తి * = వేగిరపడుచున్నవారై ప్రవేశించుచున్నారు. మఱియును.—భీష్మః = భీష్ముఁడును; ద్రోణః = ద్రోణుఁడును; తథా=అట్లు; అసౌ=ఈ; సూతపుత్త్రః=కర్ణుఁడును; అస్మదీయైః = మావారలైన, ధృష్టద్యుమ్నప్రభృతులగు; యోధముఖ్యై రపి సహ = శూరశ్రేష్ఠులతోను గూడ; త్వాం త్వరమాణాః విశన్తి=నిన్ను వేగిరపడి ప్రవేశించుచున్నారు. మఱియును.—వారు, తే=నీయొక్క; వక్త్రాణి = ముఖములను; త్వరమాణాః=త్వరగలవారలై; విశన్తి=చొచ్చుచున్నారు. ఎట్టిముఖములను? దంష్ట్రాకరాలాని=కోఱలచే వికృతము లయినవానిని; భయానకాని = భయంకరము లయినవానిని. మఱియును.—కేచిత్ = ముఖములఁ జొచ్చినవారిలోఁ గొందఱు; దశనాన్తరేషు=దంతములమధ్యప్రదేశములందు; విలగ్నాః= తగులుకొన్నవారలై; భక్షింపఁబడినమాంసమువలె, చూర్ణితైః = చూర్ణముగాఁ జేయఁబడినశిరస్సులతోఁ; సందృశ్యన్తే=చూడఁబడుచున్నారు.

ధృతరాష్ట్రునికొడుకు లగుదుర్యోధనప్రభృతులును భీష్మద్రోణకర్ణులును తత్సంబంధిరాజవర్గములతోను మాకుఁ జేరినయోధవీరులతోను నిన్నుఁ బ్రవేశించుచున్నారు. వారు దంష్ట్రాకరాలంబులును భయంకరములు నగు నీముఖములను వేగంబునం జొచ్చుచున్నారు. అందుఁ గొందఱు దంతములసందున నిఱికికొని చూర్ణము లయినశిరస్సులు గలవారలై చూపట్టుచున్నా రని తాత్పర్యము.

ఆ. మాకు జయంబును బరులకుఁ బరాజయంబును జూపుచున్ననిన్నుఁ జూచుచున్నా నని చెప్పుచున్నాఁడు దుర్యోధనాదులవలన నిత్యాదిగా. అందుకు

* అని మీఁదిశ్లోకమునుండి యధ్యాహార్యము.

హేతువునుగా శ్లోకమును దించుచున్నారు ఎందువలన ననఁగా నని. దుర్యోధనాదులకు మాత్రమే కాదు పరాజయము, మఱేమనఁగా, భీష్మాదులకుఁ గూడ నని చెప్పుచున్నారు మఱియును అని. భగవద్రూప ముగ్రం బగుటకు హేత్వంతరముఁ జెప్పుచున్నారు మఱియును అని.

హ. *

శం. « యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి » అని నీకు జయమును బరులకుఁ బరాజయమునుం జూడఁగల వని యేది చెప్పఁబడినదో దానిని గూడ నీవిశ్వరూపమునందుఁ జూచి చెప్పుచున్నాఁడు నాలుగుశ్లోకములచేత — అమీ = ఎదుటఁ గనఁబడుచున్న; ధృతరాష్ట్రస్యపుత్రాః = దుర్యోధనాదులు; సర్వేచ = అందఱును; అవనిపాలసంఘైస్సహైవ; త్వామ్= నిన్ను; విశన్తి = చొచ్చుచున్నారు. విశన్తి అనునది యిచటఁ గూడ నన్వయించును. భీష్మః; ద్రోణః; తథా; అసౌ సూతపుత్రః = ఈకర్ణుఁడును; అస్మదీయైః యోధముఖ్యై రపి సహ — ద్రుపదధృష్టద్యుమ్నాదులతోనుం గూడ; త్వాం విశన్తి. త్వరమాణాః; భయానకాని = భయంకరములును; దంష్ట్రాకరాలాని = కోఱలచే వికృతములు నగు; తే= నీయొక్క; వక్త్రాణి; విశన్తి = ప్రవేశించుచున్నారు. అందు, కేచిత్ = కొందఱు యోధముఖ్యులు; చూర్ణితైః = చూర్ణముగాఁ జేయఁబడిన; ఉత్తమాఙ్గైః = శిరస్సులతో; దశనాన్తరేషు = దంతములసందులందు; సంవృశ్యన్తే.

మ. మనకు జయంబును శత్రువులకుఁ బరాజయంబును నీ వెప్పుడును జూడఁ గోరుదువు, దానిం జూడుము, అని « మమ దేహే గుడాకేశ యచ్చాన్యద్ద్రష్టు మిచ్ఛసి » అని భగవంతుఁడు చెప్పినదాని నిప్పుడు చూచుచున్నా నని చెప్పుచున్నాఁ డైదుశ్లోకములచేత.— అమీచ ధృతరాష్ట్రస్య పుత్రాః=దుర్యోధనప్రభృతులు నూర్వురుసోదరులు; యుయుత్సువుదక్క, సర్వే=అందఱును; త్వామ్; త్వరమాణా విశన్తి అని మీఁది శ్లోకమునందలి క్రియాపదముతో నన్వయము. అతిభయసూచకం బగుటచేఁ గ్రియాపదము లేమి యిట గుణమే యగును. అవనిపాలసంఘైస్సహైవ= శల్యాదిరాజసమూహములతోఁ గూడనే; త్వాం విశన్తి. ప్రవేశించువారు దుర్యోధనాదులుమాత్రమే కారు, మఱేమనఁగా, అజయ్యుఁ డని యందఱును గౌరవించుచున్నవాఁడు గూడ, భీష్మః; ద్రోణః; తథా; అసౌ = ఈ, సర్వదా నాకు శత్రు వగు; సూతపుత్రః=

---

* ౨౬, ౨౭, ౨౮, ౨౯ శ్లోకముల కీవ్యాఖ్యానము లేదు.

కర్ణుఁడును; పరకీయులతోడంబాటె, అస్మదీయైః యోధముఖ్యైరపి సహ = మావారలగు ధృష్టద్యుమ్నప్రభృతి యోధశ్రేష్ఠులతోనుం గూడ; త్వాం విశన్తి అని యన్వయము. ఈధృతరాష్ట్రపుత్త్రప్రభృతు లందఱును, తే=నీయొక్క; దంష్ట్రాకరాలాని; భయానకాని; వక్త్రాణి; త్వరమాణాః; విశన్తి అందు, కేచిత్; చూర్ణితంబు లగు శిరస్సులతోఁ గూడినవారై దశనాంతరములందు విలగ్నులై-విశేషించి తగులుకొన్నవారై, సందృశ్యన్తే = నాచేతఁ జక్కగా-నిస్సంశయముగాఁ జూడఁబడుచున్నారు.

శ్రీ. "యచ్చాన్యద్ద్రష్టుమిచ్ఛసి" అని యీయుద్ధమునందుఁ గలుగఁబోవుజయపరాజయాదికమును గూడ నాదేహమునందుఁ జూడు మని భగవంతుండేది చెప్పెనో దాని నిప్పుడు చూచుచుఁ జెప్పుచున్నాఁడైదుశ్లోకములచేత.—అమీ; ధృతరాష్ట్రస్య పుత్త్రాః = దుర్యోధనాదులు; సర్వే; అవనిపాలసంఘైస్సహైవ= జయద్రథాదిరాజసమూహములతోఁ గూడియే; త్వామ్=నిన్ను; విశన్తి అని మీఁది శ్లోకముతో నన్వయము. తథా=అట్లు; భీష్ముఁడును ద్రోణుఁడును, సూతపుత్త్రః=కర్ణుఁడును. వారలుమాత్రమే కాదు, మత్తే మనఁగా, ప్రతివీరు లగు మాయోధముఖ్యులు శిఖండి ధృష్టద్యుమ్నప్రభృతు లెవ్వరు గలరో వారితోఁ గూడ. వీరందఱును. త్వరమాణాః=పరుగెత్తి వచ్చినవారై; తే=నీయొక్క; దంష్ట్రలచే వికృతంబులును భయంకరములు నగు వక్త్రములను బ్రవేశించుచున్నారు. అందుఁ గొందఱు చూర్ణితంబు లగుశిరస్సులతోఁ గూడినవారై దంతసంధులందుఁ దగులుకొన్నవారై కనఁబడుచున్నారు.

ప. ఇఁక మఱియొకటి యపూర్వముఁ జూచుచున్నా నని చెప్పుచున్నాఁడైదుశ్లోకములచేత.—అందు యుద్ధమున మృతులుగాఁ బోవునట్టిభక్తులయొక్కయు భవిష్యద్గతిని మొదటఁ జూచుచున్నాను. అందు భీష్ముఁడును ద్రోణుఁడును సూతపుత్త్రుఁడును—కర్ణుఁడును—వీరు ధర్మ్యయుద్ధము చేయువారును భగవద్భక్తులును గాపున నట్టివారలే యగు నస్మదీయయోధముఖ్యులైన శిఖండిధృష్టద్యుమ్నాదులతోఁ గూడ అపునర్భవమును ♦ ఇచ్చునట్టి నిన్నుఁ బ్రవేశించుచున్నారు. అట్లు వీరు కూటకారు * లనియు ఆతతాయు లనియుఁ బ్రసిద్ధు లయిన ధృతరాష్ట్రపుత్త్రులు దుర్యోధనాదులు, అట్టివారలే యగు రాజులసమూహములతో, త్వరమాణాః= యాతనానిమిత్తము వేగము గలవారలై; తే వక్త్రాణి విశన్తి = నీనోళ్ళను జొచ్చు

♦ ముక్తిని.

* మోసము చేయువారు.

చున్నారు. ఎట్టివోళ్ళు? దంష్ట్రాకరాలాని. కావున, భయానకాని. అందుఁ గొందఱు పాపులు చూర్ణముగాఁ జేయఁబడినశిరస్సులతో, దశనాన్తరేషు = దంతసంధులందు; విలగ్నాః=తగులుకొన్నవారలై; సందృశ్యన్తే.

రా. ఇట్లు సర్వజగత్తునకును స్థితిప్రవృత్తులు స్వాయత్తము లగుటను జూపుచుఁ బార్థసారథి ధృతరాష్ట్రపుత్త్రులై రాజవేషవ్యాజంబున నున్నవారలయు యుధిష్ఠిరపక్షమునఁ జేరినవారలయు నసురులసంహారములచేఁ దాఁ జేయఁదలంచినదియుఁ దానే చేయఁబోవునదియు నగు భూభారావతరణంబును బార్థునకుఁ జూపెను. ఆపార్థుండును భగవంతుని స్రష్టృత్వాదికసర్వైశ్వర్యంబును సాక్షాత్కరించి, ఆసర్వాత్ముఁ డగుభగవంతునందే ధార్తరాష్ట్రులయుపసంహారమును అనాగతమును గూడఁ దత్ప్రసాదలబ్ధ మయినదృష్టిచేఁ జూచుచు నిట్లనియె.—అమీ; ధృతరాష్ట్రస్య పుత్త్రాః=దుర్యోధనాదులు; సర్వే; భీష్ముఁడును ద్రోణుఁడును కర్ణుఁడును, అవనిపాలసంఘైః సహైవ స్వహైవ * = తత్పక్షమునందుఁ జేరిన రాజసమూహములయందలితోనుం గూడ. మావారలతోఁ గూడ కొందఱి యోధముఖ్యులతో త్వరమాణులై దంష్ట్రాకరాలంబులును భయానకములు నగు నీవక్త్రములను వినాశముకొఱకుఁ బ్రవేశించుచున్నారు. అందుఁ గొందఱు చూర్ణితంబు లగు నుత్తమాంగములతో దంతాంతరముల విలగ్నులై కనఁబడుచున్నారు

యథా నదీనాం బహవో ఽమ్బువేగా
స్సముద్రమే వాభిముఖా ద్రవన్తి
తథా తవామీ నరలోకవీరా
విశన్తి వక్త్రాణ్యభివిజ్వలన్తి. ౨౮

భా. ఎట్లు ముఖములను బ్రవేశించుచున్నారు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యథా=ఎట్లు; నదీనామ్=నదులయొక్క; బహవః=అనేకములయిన; అమ్బువేగాః=జలములయొక్క త్వరావిశేషములు; సముద్ర మేవ=సముద్రుని గూర్చియే; అభిముఖాః=అభిముఖములై; ద్రవన్తి=ప్రవేశించుచున్నవో; తథా=అట్లు; అమీ=ఈ; నరలోకవీరాః=మనుష్యలోకమునందు

* వీరిపక్షమునందు "అమీ సర్వే ధృతరాష్ట్రస్యపుత్త్రాః సహైవ స్వహై వాఽవనిపాలసంఘైః" అని పాఠము.

శూరు లైనవారు; తవ=నీయొక్క; అభివిజ్వల న్తి=అంతటను ప్రకాశమా
నము లైన; వక్త్రాణి=ముఖములను; విశ న్తి=ప్రవేశించుచున్నారు.

అనేకము లయిన నదీప్రవాహము లెట్లు సముద్రములోనికే యభిముఖము
లై ప్రవేశించుచున్నవో అట్లు ఈమనుష్యవీరులు జ్వలించుచున్న నీముఖములను
బ్రవేశించుచున్నా రని తాత్పర్యము.

రా. ఉభయ సేనాగతు లగు రాజులు భగవన్ముఖములఁ బ్రవేశించుటను దృ
ష్టాంతముచే వివదీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా.

శం. వెండియు వారలు భగవంతునిఁ బ్రవేశించువిధమునే దృష్టాంతసహి
తముగాఁ బ్రతిపాదించుచున్నాఁడు.—నరలోకవీరాః = మనుష్యలోకమునందు శూరు
లైనభీష్మాదులు. అవశిష్టము స్పష్టార్థము.

మ. రాజులు భగవంతునిముఖములం బ్రవేశించుటయందు దృష్టాంతముఁ
జెప్పుచున్నాఁడు.—యథా=ఎట్లు; నదీనామ్ = అనేకమార్గములఁ బ్రవహించునట్టి
నదులయొక్క; బహవః; అమ్బువేగాః = జలములయొక్క వేగవంతము లగు ప్రవాహ
ములు; అభిముఖాః = సముద్రమున కభిముఖము లై; సముద్రమేవ = సముద్రమునే;
ద్రవ న్తి = చొచ్చుచున్నవో. తథా=అట్లు; అమీ; నరలోకవీరాః; తవ=నీయొక్క;
అభితః=అంతటను *; జ్వల న్తి=జ్వలించుచున్న; లేక, అభివిజ్వల న్తి అనియైనను పాఠము
కావచ్చును; వక్త్రాణి; విశ న్తి.

శ్రీ. ప్రవేశమునే దృష్టాంతముతోఁ జెప్పుచున్నాఁడు.—♦

ప. ఇఁక నుభయపక్షములందును దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు.—
యథా; బహవః=నానామార్గప్రవృత్తము లయిన; నదీనామ్; అమ్బువేగాః=ప్రవా
హములు; సముద్ర మేవ; ద్రవ న్తి=ప్రవేశించుచున్నవో. ప్రవేశించి సముద్రాకార
ములే యగుచున్నవో. తథా; తవ=నీకు; అభిముఖాః=అనుకూలు రగు; నరలోక
వీరాః = ఉత్సాహశాలు లగు భీష్మద్రోణాదులు; త్వాం విశ న్తి=నిన్నుఁ బ్రవేశించు
చున్నారు. అట్లు, ఎవ్వరు మఱి, అభివిజ్వల న్తి=అంతటను జాజ్వల్యమానము లయిన,
వక్త్రాణి=ముఖములను; విశ న్తి=ప్రవేశించుచున్నారో. పైశ్లోకముతో నన్వయము.

* వీరిపక్షమునందు అభితో జ్వల న్తి అని పాఠాంతరము.

♦ మధుసూదనీయముతో సమానము.

రా. *

యథా ప్రదీప్తం జ్వలనం పతఙ్గా
విశన్తి నాశాయ సమృద్ధవేగాః
తథైవ నాశాయ విశన్తి లోకా
స్తవాఽపి వక్త్రాణి సమృద్ధవేగాః. ౨౯

భా. వార లెందుకొఱ కిట్లు ప్రవేశించుచున్నారు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు — యథా=ఎట్లు; ప్రదీప్తమ్=మండుచున్న; జ్వలనమ్=అగ్నిని; పతఙ్గాః=శలభములు; సమృద్ధవేగాః=అధిక మయినవేగము గలవై; నాశాయ=వినాశముకొఱకు; విశన్తి = ప్రవేశించుచున్నవో. తథైవ=అట్లే; లోకాః=ప్రాణులు; సమృద్ధవేగాః = అధిక మయినవేగము గలవారలై; తవ=నీయొక్క; వక్త్రాణ్యపి=ముఖములను గూడ; నాశాయ=వినాశముకొఱకు; విశన్తి=ప్రవేశించుచున్నారు.

ఎట్లు శలభములు తమవినాశముకొఱకు జ్వలించుచున్నయగ్నిని వేగంబునం బ్రవేశించునో అట్లు ప్రాణులును తమవినాశముకొఱకు వేగంబున నీముఖంబులం బ్రవేశించుచున్నా రని తాత్పర్యము.

ఆ. ప్రవేశించుటకుఁ బ్రయోజనంబును తత్ప్రకారభేదంబును మఱియొక దృష్టాంతముచేఁ దెలుపుచున్నారు వారలు ఇత్యాదిగా.

శం. ఎందుకొఱకు వక్త్రములం బ్రవేశించుచున్నారు? అని యడుగఁగాఁ బ్రవేశప్రయోజనమును దృష్టాంతసహితముగా నుపపాదించుచున్నాఁడు.—సమృద్ధవేగాః = ప్రచండ మయినవేగము గలవై. పతఙ్గాః = శలభములు; లోకాః=శత్రుజనులు. తక్కినది స్పష్టము.

మ. అబుద్ధిపూర్వకప్రవేశమునందు నదీవేగమును దృష్టాంతముగాఁ జెప్పి బుద్ధిపూర్వకప్రవేశమునందు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు:—యథా; పతఙ్గాః= శలభములు; సమృద్ధవేగములై బుద్ధిపూర్వముగా, నాశాయ = మరణముకొఱకే; ప్రదీప్తం జ్వలనం విశన్తి. తథైవ; లోకా అపి = ఈదుర్యోధనాదులు అందఱును; సమృద్ధవేగాః; నాశాయ=మరణముకొఱకు; తవ వక్త్రాణి విశన్తి.

---

* ఈభాష్యమునందు ఈశ్లోకమునకు మీఁదిశ్లోకముతోఁ జేర్చి వ్యాఖ్యానము చేయఁబడును.

శ్రీ. అవశులై ప్రవేశించుటయందు నదీవేగము దృష్టాంతముగాఁ జెప్పఁబడినది. బుద్ధిపూర్వప్రవేశమునందు దృష్టాంతముఁ జెప్పుచున్నాఁడు.—ప్రదీప్తమ్; జ్వలనమ్=అగ్నిని; పతఙ్గాః=శలభములు; బుద్ధిపూర్వకముగా సమృద్ధ మయినవేగము గలవై; నాశాయ=మరణముకొఱకే; విశన్తి. తథైవ; లోకా అపి=ఈజనులు గూడ; నీముఖములను బ్రవేశించుచున్నారు.

ప. వారు, యథా = ఎట్లు బుద్ధిపూర్వకముగా; సమృద్ధ మయినవేగము గలవై శలభములు, నాశాయ=మృత్యువుకొఱకు; ప్రదీప్తం జ్వలనం విశన్తి, తథైవ; లోకా అపి = నిన్ననువర్తింపనివారు దుర్యోధనాదులుగూడ; తవ వక్త్రాణి విశన్తి.

రా. ఈరాజలోకములు పెక్కునదీజలప్రవాహములు సముద్రమునుంబోలె శలభములు ప్రదీప్తజ్వలనమునుంబోలె జాజ్వల్యమానము లయిన నీవక్త్రములను దమయంతఁ దాము త్వరమాణులై యాత్మనాశముకొఱకుఁ బ్రవేశించుచున్నారు.

లేలిహ్యసే గ్రసమాన స్సమన్తాత్
లోకాన్ సమగ్రా న్వదనై ర్జ్వలద్భిః
తేజోభి రాపూర్య జగ త్సమగ్రం
భాస స్త వోగ్రాః ప్రతప న్తి విష్ణో. 30

భా. నీవో.—జగత్=జగత్తును; సమగ్రమ్=సమస్తమును; తేజోభిః=కాంతులచే; ఆపూర్య=వ్యాపించి; సమగ్రాన్ = సమస్తము లయిన; లోకాన్=ప్రాణులను; జ్వలద్భిః=జ్వలించుచున్న; వదనైః = ముఖములతో; గ్రసమానః=మ్రింగుచు; సమన్తాత్=అంతటను; లేలిహ్యసే= ఆస్వాదించుచున్నావు. మఱియును.—తవ=నీయొక్క; ఉగ్రాః = క్రూరము లయిన; భాసః=దీప్తులు, ప్రతపన్తి = ప్రతాపముఁ జేయుచున్నవి. విష్ణో=ఓవ్యాపనశీలుఁడా!

నీవో సమస్తప్రపంచమును నీతేజస్సులచే ముంచి జ్వలించుచున్ననోళ్ళతో సమస్తప్రాణులను మ్రింగుచుఁ జవి చూచుచున్నావు. సర్వవ్యాపకుఁడా! నీతేజస్సులు భయంకరంబులై లోకములను దపింపఁజేయుచున్నవని తాత్పర్యము.

ఆ. యుద్ధము చేయ వచ్చినరాజులు భగవన్ముఖములను బ్రవేశించువిధమును బ్రదర్శించి యాయవస్థయందు భగవంతుఁడును తత్తేజస్సులును బ్రవర్తించువిధ

ము౦ దెలుపుచున్నారు నీవ్రా అని. భగవంతుని ప్రవృత్తిం దెలిపి తదీయ తేజస్సుల ప్రవృత్తిని బ్రకటించుచున్నారు మఱియును అని.

హ. లేలిహ్యసే=మిక్కిలి యాస్వాదించుచున్నావు.

శం. ఇట్లు ప్రవేశనప్రయోజనము౦ జెప్పి తద్దశయందుఁ బరమేశ్వరుని కార్యముఁ జెప్పుచున్నాఁడు.—జ్వలద్భిః=ప్రవర్ధ్యాగ్నివలె వెలుపలికి జాజ్వల్యమాన ము లయిన; వదనైః=నోళ్ళచే; సమన్తాత్ = అంతటను బ్రవిష్టు లైన; సమగ్రాన్ లోకాన్=అశేషశత్రుజనులను; గ్రసమానః=మ్రింగుచు; లేలిహ్యసే = నాలుకలచే దౌడలను నాకుచున్నావు. ఓవిష్ణూ! తేజోభిః = తమప్రకాశములచే; సమగ్రమ్= సమస్త మయిన; జగత్=జగత్తును; ఆపూర్య=వ్యాపించి; తవ; ఉగ్రాః = ప్రచండము లైన; భాసః=దీప్తులు; ప్రతపన్తి=గ్రీష్మర్తుసూర్యునివలె తాపముఁ జేయుచున్నవి.

మ. యోద్ధుకాము లగురాజుల భగవన్ముఖప్రవేశప్రకారము౦ జెప్పి యి ప్పుడు భగవంతునియొక్కయుఁ దద్దీప్తులయొక్కయుఁ బ్రవృత్తిప్రకారముఁ జెప్పుచు న్నాఁడు.—ఇట్లు వేగంబునఁ బ్రవేశించుచున్న, లోకాన్=దుర్యోధనాదులను; సమ గ్రాన్=అందఱను; గ్రసమానః=మ్రింగుచు; జ్వలద్భిః వదనైః=జ్వలించుచున్ననోళ్ళ తో; సమన్తాత్=అంతటను; నీవు, లేలిహ్యసే=ఆస్వాదించుచున్నావు. తేజోభిః=దీప్తుల చే; జగత్ సమగ్రమ్ ఆపూర్య—ఎందువలన నీవు దీప్తులచే జగత్తును వ్యాపించుచున్నా వో అందువలన; తవ; ఉగ్రాః=తీవ్రము లయిన; భాసః=దీప్తులు; ప్రజ్వలించుచున్న యగ్నియొక్కదీప్తులవలె; ప్రతపన్తి=సంతాపముఁ గలిగించుచున్నవి. విష్ణో=ఓవ్యాపన శీలుఁడా!

శ్రీ. దానివలన నేమి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—గ్రసమానః=మ్రిం గుచు; సమగ్రాన్ లోకాన్=ఈ యందఱివీరులను; సమన్తాత్=అంతటను; లేలిహ్యసే= మిక్కిలి భక్షించుచున్నావు. వేనిచేత? జ్వలద్భిః వదనైః. మఱియును.—విష్ణో! తవభాసః=నీదీప్తులు; తేజోభిః=ప్రకాశములచేత; సమస్తజగత్తును వ్యాపించి తీవ్రము లై, ప్రతపన్తి=సంతాపము చేయుచున్నవి.

ప. సమగ్రాన్ లోకాన్; సమన్తాత్; జ్వలద్భిః వదనైః; గ్రసమానః= మ్రింగుచు; వెండియు తృప్తినొందక, లేలిహ్యసే=సెలవులను నాకుచున్నావు. విష్ణో= వ్యాపనశీలుఁడా! తవభాసః=నీదీప్తులు; తేజోభిః=స్ఫురణములచేత; సమస్తజగత్తును వ్యాపించి తీవ్రము లై, ప్రతపన్తి=తపింపఁ జేయుచున్నవి. ఇట ఋగ్వేదశ్రుతియును.—

"రక్షోహణం వాజిన మాజిఘర్మి మిత్రం ప్రతిష్ఠ ముపయామి శర్మ । శిశానో అగ్నిః క్రతుభి స్సమిద్ధ స్స నో దివా సరిషః పాతు నక్తమ్॥ అయోదంష్ట్రో అర్చి షా యాతుధానా నుపస్పృశ జాతవేద స్సమిద్ధః । ఆజిహ్వయా మూరదేవా౯ రభస్వ క్రవ్యాదో వృక్త్వా పిధ త్స్వాసర౯" అని. భాష్యము.—రక్షోహణమ్= రాక్షసుల వధించునట్టి; వాజినమ్=బలవంతుఁడైన; అగ్నిని వైశ్వానరాఖ్యుని—విశ్వ రూపుఁడైనయీశ్వరుని, ఆజిఘర్మి = ఘృతముచే వేల్చుచున్నాను. ప్రతిష్ఠమ్= ప్రదీప్తుని—తీక్ష్ణుఁడుగాఁ జేయఁబడినవాని నని యర్థము; ఉపయామి = శరణుపొందు చున్నాను. శిశానః=జ్వాలలచే తీక్ష్ణుఁడైనవాఁడును; క్రతుభిః=కర్మపరులచే; సమిద్ధః= ప్రజ్వలితుఁడు నగు; సః=ఆయగ్ని; నః=మమ్ము; దివానక్తమ్ = పవలును రేయియు; సరిషః = హింసకుఁడైనరాక్షసునివలననుండి; పాతు=రక్షించుఁ గాక. జాతవేదః= వైశ్వానరా! ఈశ్వరా! నీవు, సమిద్ధః=చక్కఁగా దీప్తుఁడవై; అయోదంష్ట్రః=లో హశలాకలవంటికోఱలు గలవాఁడవై; యాతుధానా౯ = రాక్షసులను; అర్చిషా= జ్వాలచే; ఉపస్పృశ—దహింపు మని యర్థము. మఱియును.—మూరదేవా౯=రాక్ష సులను; జిహ్వయా=జ్వాలచే; ఆరభస్వ—చంపు మని యర్థము. చంపి, క్రవ్యాదః= మాంసభక్షకులను; వృక్త్వా = ఛేదించి; ఆస౯=ముఖమునందు; పిధత్స్వ=ఆచ్ఛా దింపుము.

రా. రాజలోకంబులనందఱను జ్వలించుచున్ననోళ్ళతో మ్రింగుచుఁ గోప వేగంబున వారినెత్తు రంటినపెదవులు మొదలగువానిని, లేలిహ్యసే=మాటిమాటికి నాకుచున్నావు. నీ యతిఘోరము లైన, భాసః=కిరణములు; తేజోభిః = తమప్రకా శములచే; జగత్ సమగ్ర మాపూర్య ప్రతపన్తి.

ఆఖ్యాహి మే కో భవా నుగ్రరూపో
నమో உస్తు తే దేవవర ప్రసీద
విజ్ఞాతు మిచ్ఛామి భవన్త మాద్యం
న హి ప్రజానామి తవ ప్రవృత్తిమ్. ౩౧

భా. ఎందువలన నీ విట్లుగ్రస్వభావుఁడవొ అందువలననే.—మే= నాకొఱకు; ఆఖ్యాహి=చెప్పుము. ఉగ్రరూపః=క్రూర మయినయాకారము గలవాఁడ వగు; భవా౯=నీవు; కః=ఎవ్వఁడవు? తే=నీకొఱకు; నమః= నమస్కారము; అస్తు=అగుఁగాక. దేవవర=ఓదేవోత్తముఁడా! ప్రసీద=

ప్రసాదము చేయుము. ఆద్యమ్=ఆదిముఁడ వగు; భవన్తమ్=నిన్ను; విజ్ఞాతుమ్=విశేషించి యెఱుంగుటకు; ఇచ్ఛామి = కోరుచున్నాను. హి=ఎందువలన ననఁగా. తవ=నీయొక్క; ప్రవృత్తిమ్ = చేష్టను; నప్రజానామి= చక్కఁగా నెఱుంగను.

ఇట్టి క్రూర మయినయాకారము గలవాఁడవు నీ వెవ్వఁడవో చెప్పుము. నీకు నమస్కారము. దేవోత్తముఁడా! నాయెడఁ బ్రసన్నుఁడ వగుము. ఆదిమపురుషుఁడ వగు నీ వెవ్వఁడవో చక్కఁగా దెలియఁ గోరెదను. నీ ప్రవృత్తి నాకు స్పష్టముగాఁ దెలియకున్న దని తాత్పర్యము.

ఆ. భగవద్రూపము నర్జునుఁడు చూచి యున్నవాఁ డగుటవలన దానియెడ వానికి జిజ్ఞాస సంభవింప దని యాశంకించి చెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ఉపదేశము వినఁ గోరువాఁడు ఉపదేశము చేయువానియెడ నమ్రత వహింపవలయు నని సూచించుచున్నాఁడు నమో ఽస్తు అని. క్రూరభావమును విడువు మని ప్రార్థించుచున్నాఁడు ప్రసీద అని. నీవే నన్నెఱుంగుదువు, ఏల యిట్లిప్పుడు ప్రార్థించుచున్నావు? నాప్రవృత్తిం జూచి యట్లే యెఱుంగు మని యాశంకించి చెప్పుచున్నాఁడు చతుర్థపాదముచేత.

హ. ♦

శం. కల్పాంతమునందుఁ బ్రాణులను గాలాంతకుఁడుం బోలె మహాశూరులను గూడఁ బ్రజ్వలించుచున్నవదనంబులచే మ్రింగుచున్నావు, విచారింపఁగా నీకృత్యము మహాద్భుతముగాఁ దోఁచుచున్నది, అందువలన నీ వెవ్వఁడవో తెలియకున్నాను, నాకు నీస్వరూపముఁ జెప్పు మని యర్జునుం డడుగుచున్నాఁడు.—దేవవర=దేవశ్రేష్ఠుఁడా! తే నమోఽస్తు—నిన్ను నమస్కరించి యడుగుచున్నాను. ప్రసీద=ఉగ్రభావమును విడిచి ప్రసన్నుఁడ వగుము. ఉగ్రరూపః=ప్రలయకాలరుద్రుని యాకారమువంటియాకారము గలవాఁడ వగు, లేక, ఉగ్రము—సర్వలోకభయంకర మయినయాకారము గలవాఁడ వగు; భవాన్ కః=నీ వెవ్వఁడవు? ప్రలయకాలరుద్రుఁడవా? ప్రలయాగ్నివా? కాలాంతకుఁడవా? పరమపురుషుఁడవా? ఇతరుఁడవా? నీస్వరూపంబును బ్రవృత్తిని, మే=నాకొఱకు; ఆఖ్యాహి = చెప్పుము. ఆద్యమ్—ఆ—అంతటను అత్తుమ్—భక్షించుటకుఁ బ్రవృత్తుఁడవైనవానిని, లేక, ఆదియందున్నవానిని

---

♦ దీని కీవ్యాఖ్యానము లేదు.

జగత్సంహారము చేయువారిలో నగ్రగణ్యుని జగదాద్యుఁ డగుసీశ్వరుని; భవన్తమ్= నిన్ను; విజ్ఞాతు మిచ్ఛామి—తెలియఁ గోరుచున్నాను చెప్పు మని యర్థము. ఓయీ! నాస్వరూపము నాప్రవృత్తి మొదలగువానిఁ జూచుటచేతనే తెలియవచ్చును, నీ వెవ్వఁడ వని యేల యడుగుచున్నావు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—హి=ఎందువలన ననఁ గా; నేను మనుష్యుఁడను కించిద్జ్ఞుఁడను కావున, తవ ప్రవృత్తిం నప్రజానామి = నీప్ర వృత్తిని జక్కఁగా నెఱుఁగను. అందువలన నీవే చెప్పు మని యర్థము.

మ. అందువలన.—ఇట్లు, ఉగ్రరూపః = క్రూర మయినయాకారము గల వాఁడ వగు; భవాన్=నీవు; కః=ఎవ్వఁడవు? మే=అత్యంత మనుగ్రాహ్యుఁడ నగు నాకు; ఆఖ్యాహి=చెప్పుము. కావుననే, తే=సర్వగురుండ వగు నీకొఱకు; నమః అస్తు. దేవవర=ఓ దేవశ్రేష్ఠుఁడా! ప్రసీద=ప్రసాదమును—క్రౌర్యపరిత్యాగమును జేయుము. ఆద్యమ్=సర్వకారణమువగు; భవన్తమ్=నిన్ను; విజ్ఞాతుమ్=విశేషంబున నెఱుంగుటకు; ఇచ్ఛామి=కోరుచున్నాను. హి=ఎందువలన ననఁగా. నీకు సఖుఁడనైనను, తవప్రవృత్తిమ్=నీ చేష్టను; నప్రజానామి=చక్కఁగా నెఱుంగను.

శ్రీ. అందువలన.—భవాన్=నీవు; ఉగ్రరూపః; కః? ఆఖ్యాహి=చెప్పుము. తే నమః అస్తు. దేవవరుఁడా! ప్రసీద=ప్రసన్నుఁడ వగుము. భవన్తమ్; ఆద్యమ్= ఆదిమపురుషుని; విజ్ఞాతు మిచ్ఛామి=విశేషించి తెలియఁ గోరుచున్నాను. ఎందువలన ననఁగా, తవప్రవృత్తిమ్=నీచేష్టను, ఎందు కిట్లు ప్రవర్తించితి వని; ఎఱుంగను. లేక, ఇట్టి నీయొక్క, ప్రవృత్తిమ్=వార్తను గూడ; ఎఱుంగను.

ప. ఇఁక భవిష్యదర్థముఁ జూచుటవలన నాశ్చర్యము నొంది వెండియు నడుగుచున్నాఁడు.—ఉగ్రరూపః భవాన్ కః? మే, ఆఖ్యాహి = చెప్పుము. తే నమో ఽస్తు. ఓదేవవరుఁడా! ప్రసన్నుండ వగుము. ఆద్యపురుషుండ వగునిన్ను విశేషించి యెఱుంగఁ గోరెదను. ఎందువలన ననఁగా. నీరూపముఁ జూచినను, తవ ప్రవృత్తిమ్=ఎందు కిట్లు ప్రవర్తించితివో అని నీచేష్టను; ఎఱుంగకున్నాను.

రా. «దర్శయాత్మాన మవ్యయమ్» అని నిరంకుశ మయిననీయైశ్వర్య ముసు సాక్షాత్కరించుటకు నేను బ్రార్థింపఁగా నీవు నిరంకుశైశ్వర్యముఁ జూపువాఁడ వై యతిఘోరం బగునీరూపముం జూపితివి. అతిఘోరరూపుఁడ వగు నీ వెవ్వఁడవు? ఏమి చేయుటకుఁ బ్రవర్తించితివి? అని నిన్నెఱుంగఁ గోరుచున్నాను. నీవు చేయఁ దలఁచినప్రవృత్తి నెఱుంగ కున్నాను. అది నాకుం జెప్పుము. నమో ఽస్తు తే దేవ

పర ప్రసీద—సర్వేశ్వరుఁడా! నీకు నమస్కారము. ఇట్లు చేయుటకై యీయుక్తి ప్రాయంబున నీసంహర్తృరూపముఁ జూపితి నని చెప్పి ప్రసన్నరూపుఁడవు గమ్ము.

మా. ధర్మాంతరము నెఱుంగుటకై యే యెవ్వఁడవు నీ వని యడుగుచున్నాఁడు. ఎట్లు, ఒకానొకఁ డొకానొకనిఁ బేరు మొదలగుదాని నెఱింగినవాఁడయ్యు జాతిని దెలియుటకై యెవ్వఁడవు నీ వని యడుగునో అట్లు. వానినే యెఱుంగఁ డయ్యేనేని అప్పుడు విష్ణో అని సంబోధనము చేయుఁడు, త్వ మక్షర మిత్యాది వాక్యమునుం బలుకఁడు.

శ్రీభగవా నువాచ.—

కాలో ఽస్మి లోకక్షయకృ త్ప్రవృద్ధో
లోకా న్సమాహర్తు మిహ ప్రవృత్తః
ఋతే ఽపి త్వాం న భవిష్యన్తి సర్వే
యే ఽవస్థితాః ప్రత్యనీకేషు యోధాః ౩౨

భా. శ్రీభగవంతుఁ డిట్లనియె.—లోకక్షయకృత్ = లోకములకు క్షయమును జేయునట్టి; ప్రవృద్ధః=మిక్కిలివృద్ధిని బొందిన; కాలః=కాలుఁడను; అస్మి=అగుచున్నాను. ఎందుకొఱకుఁ బ్రవృద్ధుఁడ నైతినో దాని వినుము.—ఇహ=ఈకాలమునందు; లోకాన్=ప్రాణులను; సమాహర్తుమ్=సంహరించుటకు; ప్రవృత్తః=ప్రవర్తించినవాఁడను. యే=ఎవ్వరు; యోధాః=శూరులు; ప్రత్యనీకేషు=శత్రుసేనలయందు; అవస్థితాః=ఉన్నారో. సర్వే=వారందఱును; ఎవ్వరివలన నీకుభయమో అట్టి భీష్మద్రోణకర్ణప్రభృతులును; త్వాం ఋతే ఽపి=నీవు లేకున్నను; న భవిష్యన్తి=బ్రతుకరు.

నేను లోకములకు వినాశము సేయుటకై ప్రవృద్ధుం డగుకాలుఁడను. ఇప్పుడు లోకములసంహరించుటకై ప్రవర్తించితిని. నీవు యుద్ధము సేయకున్నను ఈ శత్రుసేనలయం దుండుశూరు లందఱును దప్పక వినాశముఁ బొందుదు రని తా.

అ. తన్నును దా నెందుకొఱకుఁ బ్రవర్తించెనో దానిని సమస్తమును భగవంతుఁడు చెప్పె నని చెప్పుచున్నారు శ్రీభగవంతుఁడు ఇత్యాదిగా. కాలుఁడు—క్రియాశక్త్యుపహితుఁ డైనపరమేశ్వరుఁడు. ఈకాలమునందు—ఈయుద్ధసమయమునం దని యర్థము. లోకసంహారముకొఱకు నీవు ప్రవర్తించినను నీప్రవృత్తి సార్థకము

కాదు, ప్రతిపక్షు లయిన భీష్మాదులను నాప్రవృత్తి లేక సంహరింప నశక్య మగుట వలన, అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు త్తరార్థముచేత.

హా. అర్జునునివాక్యము విని దాని కుత్తరము శ్రీభగవంతుఁ డిట్లనియె.— లోకాన్; ఇహ=ఈనాశరీరమునందు; సమాహర్తుమ్=పిండీకరించుటకు; ప్రవృత్తః. ఋతే ఒపి త్వా=నీవు లేకున్నను; నభవిష్యన్తి.

శ్లో. తన్నును దనప్రవృత్తినిం జెప్పుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.— లోకక్షయకృత్ = భూమికి భారభూతు లైనప్రాణులయొక్క—నాశనము చేయునట్టి; ప్రవృద్ధః=ప్రచండుఁ డగు; కాలః అస్మి—సర్వప్రాణులసంహారము సేయునట్టి కాలుఁ డను నే నని యర్థము. ఇట్లు తన్నుఁ దెలిపి తనప్రవృత్తిని దెలుపుచున్నాఁడు.— ఇహ=ఇచ్చట; చేరినట్టి, లోకాన్=జనులను; సమాహర్తుం ప్రవృత్తః. ఓయీ! లోక సంహారముకొఱకుఁ బ్రవర్తించిన నీకు నేను లేనిచో సంహారము చేయ నలవి గాదు, అనఁగాఁ జెప్పుచున్నాఁడు —ప్రత్యనీకేషు=ప్రతిపక్షసేనలయందు; అవస్థితాః=గుంపులు గూడి యున్న; నీకు దుర్జయు లైన భీష్మద్రోణకర్ణాదులగు; యే యోధాః=ఏశూరులు గలరో; వారు, సర్వే=అందఱును; త్వాఋతే ఒపి=నీవు యుద్ధమునకుఁ బ్రవర్తింప కున్నను; నభవిష్యన్తి=ఉండరు. నేను మహామృత్యువను వచ్చి యుండఁగా నెవ్వరు జీవింపఁ గలరు? అందఱును మృతు లగుదు రని యర్థము.

మ. ఇట్లర్జునునిచేఁ బ్రార్థితుండై తా నెవ్వఁడో తనప్రవృత్తి యెట్టిదో దాని సమస్తంబును మూఁడుశ్లోకంబులచే శ్రీభగవంతుఁ డిట్లనియె.—కాలః=క్రియా శక్త్యుపహితుఁడై సర్వంబునకును సంహర్త యగు పరమేశ్వరుఁడను; అస్మి=అగు చున్నాను; ఇప్పుడు, ప్రవృద్ధః=వృద్ధిఁ బొందినవాఁడను. ఎందుకొఱకుఁ బ్రవృత్తుఁడ నైతినో దాని వినుము.—లోకాన్ = దుర్యోధనాదులను; సమాహర్తుమ్ = చక్కఁగా భక్షించుటకు; ప్రవృత్తః=ప్రవర్తించితిని నేను; ఇహ=ఈకాలమునందు. నాప్రవృత్తి లేనిచో నెట్లది సిద్ధించును? అందువేని అట్లు తలంపకు మని చెప్పుచున్నాఁడు.— ఋతే ఒపి త్వా=నీ వర్జునుఁడవు యోద్ధవు కాకున్నను, నీవ్యాపారము లేకున్నను; నావ్యాపారముచేతనే, నభవిష్యన్తి=నశింతురు; సర్వే=భీష్మద్రోణప్రభృతులు పోరుట కశక్యు లని నీవు తలంచినవారును, ఇతరులు గూడ, యే ఒవస్థితాః ప్రత్యనీకేషు యోధాః = యెవ్వరు యోధులు ప్రతిపక్షసైన్యములం దున్నవారో వారును అంద ఱును గూడ; నాచే హతు లగుటవలననే నశింపఁగలరు. అందు నీవ్యాపారము వ్యర్థ మని యర్థము.

**శ్రీ.** ఇట్లు ప్రార్థితుండై శ్రీభగవంతుఁ డిట్లనియె మూఁడుశ్లోకములచేత.— లోకక్షయము చేయునట్టి, ప్రవృద్ధః=అత్యుగ్రుఁ డగు; కాలః; అస్మి. లోకాన్ = ప్రాణులను; సమాహర్తుమ్=సంహరించుటకు; ఇహ=ఈలోకమునందు; ప్రవృత్తుఁడనై తిని. ఇందువలన, ఋతే ఽపి త్వాం=నీవు వధింప కున్నను; నభవిష్యన్తి=జీవింపరు. నీవు నేను వధింప నని యూరకున్నను వీరు కాలాత్ముఁడ నగు నాచేత గ్రస్తులై మరణము పొందనే పొందుదురు. ఎవ్వరు వారు? ప్రత్యనీకేషు = ప్రతిసేనలయందును, భీష్మద్రోణాదుల సర్వసేనలయందును; యే యోధాః=ఎవ్వరు శూరులు; అవస్థితాః; వారలందఱును.

**ప.** ఇట్లు ప్రార్థింపఁబడినవాఁడై భగవంతుఁడు చెప్పెను.—ప్రవృద్ధః= మిక్కిలి వృద్ధిని బొందిన; లోకక్షయకృత్=లోకభక్షకుఁ డగు; కాలః=కాలుఁడను; లోకములను భక్షించుటకే ప్రవర్తించి యున్నాను. దానినే చెప్పుచున్నాఁడు.— యే; ప్రత్యనీకేషు=సేనలసేనలయందును, సర్వసేనలయందును; అవస్థితాః=అభిముఖులైన; యోధాః=సుభటులు గలరో; వారు, సర్వే=అందఱును; నభవిష్యన్తి = జీవింపరు. అప్పుడు నాగతి యేమి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—త్వాం ఋతే = నీవు దక్క, «న మే భక్తః ప్రణశ్యతి» అని చెప్పి యున్నవాఁడ నగుటవలన.

**రా.** ఆశ్రితవాత్సల్యాతిశయంబున విశ్వైశ్వర్యముఁ జూపునట్టి నీవు ఘోరరూపముఁ జూపుటకు నీయభిప్రాయ మేమి? అని యడుగంబడినవాఁడై భగవంతుఁ డగు పార్థసారథి తనయభిప్రాయముఁ జెప్పుచున్నాఁడు.—పార్థునియుద్యోగము లేకున్నను ధార్తరాష్ట్రులు మొదలుగాఁగల సమస్తరాజలోకంబును వధింప నేనే ప్రవర్తించితి నని తెలుపుటకొఱకు నాఘోరరూపముఁ జూపుట, దానిఁ దెలుపుటయుఁ బార్థు నుద్యోగింపఁ జేయుటకు—అని.—కలయతి—గణించుచున్నాఁడు కావున కాలుఁడు, ధార్తరాష్ట్రప్రభృతులయందఱియొక్కయు ఆయుఃక్షయము గణించినవాఁడనై నేను వారిక్షయము చేయువాఁడనై ఘోరరూపంబునఁ బ్రవృద్ధుఁడనై రాజలోకంబులను, సమాహర్తుమ్=ఆభిముఖ్యంబున సంహరించుటకు, ఇప్పుడు ప్రవర్తించినవాఁడ నగుచున్నాను. కావున నాసంకల్పమువలననే, త్వాం ఋతే ఽపి=నీయత్నము లేకున్నను; ధార్తరాష్ట్రప్రభృతులు నీయొక్క శత్రుసేనలయందు ఎవ్వరు యోధులు గలరో వార లందఱును, నభవిష్యన్తి=నశింతురు.

**మా.** కాలశబ్దము జగద్బన్ధన చ్ఛేదన జ్ఞానాది సర్వభగవద్ధర్మముల వచించుచున్నది. «కలబన్ధనే, కలచ్ఛేదనే, కలజ్ఞానే, కలకామధేనుః» అని పఠించెదరు, ప్రసి

ద్ధము గూడ ఆశబ్దము భగవంతునందు—« నియతం కాలపాశేన బద్ధం శక్ర వికత్థసే। అయం స పురుష శ్శ్యామో లోకస్య హరతి ప్రజాః। బద్ధ్వా తిష్ఠతి మాం రౌద్రః పశుం రశనయా యథా» ♦ అని మోక్షధర్మమునందు. విష్ణునిచే బద్ధుండై బలి చెప్పుచున్నాఁడు.—« విష్ణౌ చాధీశ్వరే చిత్తం ధారయ న్కాలవిగ్రహే » * అని భాగవతమునందు. ప్రవృద్ధః = పరిపూర్ణుఁడను, లేక, అనాదిని. « ఋతం చ సత్యం చాభీద్ధాత్ » ⸸ అని గదా శ్రుతి. « ఏత న్మహద్భూతమ్" అనియు. « ప్రవిష్టు రస్తు తవస స్తవీయాం స్త్వేషం హ్యస్య స్థవిరస్య నామ " ¶ అనియును. వృద్ధిఁ బొందినవాఁడను నర్థ మేమో కాదు, « నాసౌ జజాన న మరిష్యతి నైధతే ఽసౌ " § అని గదా భాగవతమునందు. « యస్య దివ్యం హి తద్రూపం హీయతే వర్ధతే నచ » ** అని మోక్షధర్మమునందు. « న కర్మణా వర్ధతే » అన్నశ్రుతికో కర్మముచేతఁ గూడ వృద్ధిఁ బొందఁడు, ఇఁక తనయంత వృద్ధిఁ బొందఁ డని చెప్పవలయునా? అని యభిప్రాయము. లోకాన్ సమాహర్తుమ్, ఇహ—ఇప్పుడు విశేషించి, ప్రవృత్తః. నీసోదరులు లేకున్నను అని యపిశబ్దార్థము. ప్రత్యనీకత్వము బంధువులను గూర్చి, అందుఁను ఉండఁ బోరు. అక్షౌహిణ్యాదిభేదమున బహువచనము యుక్తము.

తస్మా త్త్వ ముత్తిష్ఠ యశో లభస్వ
జిత్వా శత్రూన్ భుఙ్క్ష్వ రాజ్యం సమృద్ధమ్
మయైవైతే నిహతాః పూర్వమేవ
నిమిత్తమాత్రం భవ సవ్యసాచిన్. 33

---

♦ ఇంద్రా! నియతముగా కాలపాశముచే బద్ధుఁడనైన నాతో నీవు ఆత్మస్తుతి చేసికొనుచున్నావు. శ్యామవర్ణుం డగు నట్టి యీపురుషుఁడు లోకప్రజల హరించుచున్నాఁడు. భయంకరుండై త్రాటిచేఁ బశువుంబోలె నన్ను బంధించి యున్నాఁడు.

* అధీశ్వరుఁడు కాలవిగ్రహుఁ డగు విష్ణువునందు మనస్సును నిలిపినవాఁడనై.

⸸ ఋతమును సత్యమును అభీద్ధునివలన—అంతటను ప్రకాశించునట్టి యీశ్వరునివలనఁ గలిగెను—ఇట ఇద్ధశబ్దము ఎట్లు భూతార్థకక్తప్రత్యయాంతమైనను సర్వకాలవాచకమో అట్లు ప్రవృద్ధశబ్దము గూడ నని భావము.

¶ పరిచ్ఛిన్నమయినసూర్యాది తేజస్సుకన్నను విష్ణువు అధిక తేజోరూపుఁ డగుచున్నాఁడు. కావుననే స్థవిరుఁడు—అనాది యగు నితనికి త్వేష మని పేరు.

§ ఇతఁడు పుట్టలేదు, చావఁడు, వృద్ధి పొందఁడు.

** ఎవ్వని దివ్య మగునట్టిరూపము తఱుఁగదో వృద్ధి పొందదో.

భా. ఎందువలన నిట్లో.—తస్మాత్=అందువలన; త్వమ్=నీవు; ఉత్తిష్ఠ=లెమ్ము. భీష్మద్రోణప్రభృతు లతిరథులు దేవతలకుఁ గూడ జయింప నలవి గానివా రర్జునునిచే జయింపఁబడి రని, యశః=కీర్తిని; లభస్వ=పొందుము. పుణ్యములచే మాత్రమే గదా యది పొందఁబడుచున్నది. శత్రూన్=దుర్యోధనాదులను; జిత్వా=జయించి; సమృద్ధమ్=శత్రువర్జితమై నిష్కంటక మయిన; రాజ్యమ్=రాజ్యమును; భుఙ్క్ష్వ=అనుభవింపుము. మయైవ=నా చేతనే; ఏతే=వీరు; పూర్వమేవ=మున్నే; నిహతాః = నిశ్చయముంబునఁ జంపఁబడిరి. నీవు, నిమిత్తమాత్రమ్=నిమిత్తమాత్రుఁడవు; భవ=అగుము. సవ్యసాచిన్=అర్జునా! వామహస్తముచేతఁ గూడ బాణములు ప్రయోగించువాఁ డగుటవలన నర్జునుఁడు సవ్యసాచి యని చెప్పఁబడుచున్నాఁడు.

సవ్యసాచీ! అందువలన నీవు లేచి కీర్తిని బొందుము, శత్రువులను జయించి సమృద్ధ మగు రాజ్యము నుపభోగింపుము. వీ రందఱు మున్నే నాచేతనే వధింపఁబడిరి. నీవు నిమిత్తమాత్రమే కావలయు నని తాత్పర్యము.

ఆ. నీవు వుదాసీనుఁడవై యున్నను శత్రుసేనలయం దుండువారు నాప్రాతికూల్యమువలననే వినాశము నొందుదు రని యెందువలన నిశ్చయింపఁబడినదో అందువలన నీ యౌదాసీన్యము నిష్ఫలం బని చెప్పుచున్నారు ఎందువలన నిట్లో అని. లెమ్ము—యుద్ధమున కున్ముఖుఁడ వగు మని యర్థము. యశోలాభమును వివరించుచున్నారు భీష్మేత్యాదిగా. పురుషార్థము కానట్టి కీర్తి యేల? అని యాశంకించి చెప్పుచున్నారు పుణ్యములచే నిత్యాదిగా. రాజ్యభోగము నపేక్షించి యున్నపుడు అపేక్షింపనిది యేల? అని యాశంకించి చెప్పుచున్నారు శత్రూ నిత్యాదిగా. భీష్మాదు లతిరథు లుండఁగా నా కెట్లు జయము కలుగును? అని యాశంకించి చెప్పుచున్నారు మయై వేత్యాదిగా. అప్పుడు చచ్చినవారిం జంపుటకు నేనేల ప్రవర్తింపవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు నిమి త్తేత్యాదిగా. సవ్యసాచిపదమును విభజించుచున్నారు వా మేత్యాదిగా.

హ. *

శం. ఇట్లు తన్నును దనప్రవృత్తిని జెప్పి ఫలితముఁ జెప్పుచున్నాఁడు — ఎందువలన, మహామృత్యువ నగు నాచేతనే వీర లందఱును మృతిఁ బొందుచుండఁగా

* దీని కీవ్యాఖ్యానము లేదు.

«నయోత్స్యే» అని నీవు యుద్ధము విడుచుట నిష్ఫలమో, తస్మాత్ = అందువలన; త్వమ్; ఉత్తిష్ఠ = యుద్ధమునకు సన్నద్ధుఁడ వగుము. యశో లభస్వ = దేవతలకును జయింపఁ దరము గాని భీష్మాదుల నర్జునుఁడు జయించె ననుకీర్తిని బొందుము. శత్రూన్ = దుర్యోధనాదులను; జిత్వా=జయించి; శత్రుజయముచే లబ్ధ మయిన, సమృద్ధమ్= సర్వైశ్వర్యసంపన్న మగు; రాజ్యంభుఙ్క్ష్వ. భీష్మాదు లతిరథు లుండఁగా శత్రుజయము దుర్లభం బను నర్జునునియాశంకను నివారించుటకై చెప్పుచున్నాఁడు.— శస్త్రాస్త్రబలపరాక్రమసంపత్తిచే భీష్మాదులు దుర్జయులే యైనను, వీరు నీప్రవృత్తికి, పూర్వమేవ=మున్నే; మయైవ = ఈశ్వరుఁడ నగు నాచేత నే; తేజోబలపౌరుషముల నాకర్షించి నిస్సారులుగాఁ జేయఁబడి, నిహతాః—పండుటాకువలెఁ బడుటకుఁ దగి యున్నా రని యర్థము. సవ్యసాచిన్=వామహస్తముచేతఁ గూడ బాణములఁ బ్రయోగించుస్వభావము గలవాఁడా! పండుటాకు పడుటకు వాయువువలె వారిపాటునకు నీవు, నిమిత్తమాత్రం భవ—అందు నీకు యత్నాధిక్యము వల దని యర్థము.

మ. తస్మాత్ = నీవ్యాపారము లేకున్నను ఎందువలన వీరు నశింపనే నశింతురో అందువలన; త్వమ్; ఉత్తిష్ఠ=యుద్ధమున కుద్యుక్తుఁడ వగుము. దేవతలకును దుర్జయు లైన భీష్మద్రోణాద్యతిరథులు శీఘ్రంబున నర్జునుచే నిర్జితు లైరి—అనునట్టి, యశః లభస్వ = కీర్తిని బొందుము. మహాపుణ్యములచేతఁ గదా యశస్సు లబ్ధ మగును. యత్నము లేకయే, శత్రూన్=దుర్యోధనాదులను; జిత్వా; సమృద్ధమ్ = నిష్కంటక మగు; రాజ్యం భుఙ్క్ష్వ = రాజ్యమును నీయధీనము చేసికొని భోగ్యము గావించుకొనుము. ఏతే=ఈ నీశత్రువులు; పూర్వమేవ = నీవు యుద్ధము చేయుటకు మున్నే; మయైవ=కాలాత్ముఁడ నగు నాచేత నే; నిహతాః = సంహరింపఁబడినయాయువు గలవారలు. నీకు యశస్సు లభింపవలయు ననియే రథమునుండి పడఁద్రోయఁబడినవారు మాత్రము కారు. కావున నీవు, నిమిత్తమాత్రమ్ = అర్జునునిచే వీరు నిర్జితు లై రని సర్వలోకప్రసిద్ధికి ఆశ్రయమవు; భవ. సవ్యసాచిన్=ఓసవ్యసాచీ! సవ్యము—వామ మగుహస్తము చేతఁ గూడ శరములను సచితుమ్—సంధించుటకు స్వభావము గలవాఁడా! అట్టివాఁడ వైననీకు భీష్మద్రోణాదిజయం బసంభావితము కాదు, అందువలన నీవు యుద్ధము చేసినచో నాచేత నే వీరు రథమునుండి పడఁద్రోయఁబడుచున్నను నీవే కర్త వని లోకులు తలఁతు రని యభిప్రాయము.

శ్రీ. తస్మాత్; త్వమ్; యుద్ధముకొఱకు, ఉత్తిష్ఠ. దేవతలకును దుర్జయులగు భీష్మద్రోణాదుల నర్జునుఁడు నిర్జించె ననుకీర్తిని, లభస్వ=పొందుము. అనాయా

సముగా శత్రువులను జయించి సమృద్ధ మగురాజ్యము భుజింపుము. నీశత్రువులు వీరు నీ యుద్ధమునకు మున్నే కాలాత్ముఁడ నగు నాచేతనే విహతప్రాయులై యున్న వారు. అయినను నీవు నిమిత్తమాత్రమ వగుము. ఓసవ్యసాచీ! వామహస్తముచే సంధించుస్వభావము గలవా డనువ్యుత్పత్తిచే వామహస్తముచేఁ గూడ బాణములు ప్రయోగించుటవలన సవ్యసాచి యని యర్జునుఁడు చెప్పఁబడుచున్నాఁడు.

ప. ఆకారణంబువలన నీవు యుద్ధమునకు లెమ్ము. దానిఫలమును—దేవతల కును దుర్జయు లగు భీష్మద్రోణాదుల నర్జునుండు నిర్జించె నను యశస్సును బొందుము. అంత శత్రువుల జయించి, సమృద్ధము—దేశ బల కోశ దుర్గాదులతోఁ గూడిన దగు రాజ్యమును భుజింపుము. శత్రుజయమునకై యిట్లే యుద్దేశించి బృహత్సామము గూడ పరమేశ్వరుని స్తుతించుచున్నది యని భగవంతునియాశయము. బృహత్సామ ము.—"త్వామిద్ధి హవామహే సాతౌ వాజస్య కారవః। త్వాం వృత్రే ష్విన్ద్ర సత్పతిం నర స్త్వాం కాష్ఠా స్వర్వతః" అని. భాష్యము.—ఇన్ద్ర = ఓపరమాత్మా! నరః=మనుష్యులము మేము; కారవః=స్తుతించువారము; వాజస్య = బలముయొక్క; సాతౌ=లాభము కోరఁబడుచుండఁగా; త్వా మిద్ధి=నిన్నే; హవామహే=పిలుచుచున్నా ము. అట్లు, వృత్రేషు = ఆవరకములు—ఆచ్ఛాదించునవివచ్చినపుడు; త్వామ్=నిన్నే పిలుచుచున్నాము. అట్లు, అర్వతః=యుద్ధముయొక్క; కాష్ఠాసు=మర్యాదలయందు, వ్యూహరచనచేఁ జేయుభగ్నయుద్ధములయందు; త్వామ్=నిన్నే; సత్పతిమ్=భక్తపక్ష పాతి యగు ప్రభువును పిలుచుచున్నాము, ఇతరునిఁ బిలువ మని యర్థము. ఆపస్తంబ శాఖయందును.—"ఇన్ద్రేణ దేవేన పృతనా జయామి త్రైష్టుభేన చ్ఛన్దసా పఞ్చదశేన స్తోమేన బృహతా సామ్నా వషట్కారేణ సహజాః" అని. భాష్యము.—ఇన్ద్రేణ= పరమాత్మచేత; దేవేన=దేవునిచేత; పృతనాః=శత్రుసేనలను; జయామి = జయించు చున్నాను. అం దనుష్ఠానము చెప్పుచున్నది—బృహతా సామ్నా=బృహత్సామము చే, దాని నుపాసించుటచే. ఎట్టి బృహత్సామముచేత ? త్రైష్టుభేన చ్ఛన్దసా=నలు వదినాలుగక్షరములు గల ఛందస్సుచేత. అట్లు, పఞ్చదశేన స్తోమేన. బ్రాహ్మణము గూడ—"పఞ్చభ్యోహి కరోతి స తిసృభి స్స ఏకయా" అని. ఇది యరము--ఒక్క సూక్తమును ముమ్మాఱావృత్తి చేయవలయును, అందు మొదటియావృత్తియందుఁ బ్రథమఋక్కునకు ముమాఱావృత్తి, రెండవయావృత్తియందు ద్వితీయఋక్కునకు ముమ్మాఱును మూఁడవయావృత్తియందుఁ దృతీయఋక్కునకు ముమ్మాఱును ఆవృత్తి, ఇది పంచదశస్తోమము, దానిచేత. ఇట్టి యుపాసనముచే వషట్కారము వజ్రీభూత

మై శత్రువులను హింసించును. ప్రకృతమునందు శత్రువులు సహజులు, వాని నని యర్థము. సాయనభాష్యకారులచే నాధిదైవికాభిప్రాయంబున బాహ్యయుద్ధవిష యముగా వ్యాఖ్యానము చేయఁబడినది. రావణభాష్యమునందు అధ్యాత్మరీతిచే ఆభ్యంతరయుద్ధవిషయముగా వివరింపఁబడినది. వేంటభాష్యమునందో యుభయవిష యముగాను వ్యాఖ్యాత మయ్యెను. ఈయర్థమునందు ఋక్సాఖాగ్రశ్రుతియును —“ సం సృష్టం ధన ముభయం సమాకృత మస్మభ్యం దత్తాం వరుణశ్చ మన్యుః । భియం దధానా హృదయేషు శత్రవః పరాజితాసో అపనిలయన్తామ్ ” అని భాష్యము.— అస్మభ్యమ్=మాకొఱకు; పరమేశ్వరునిచే, సమాకృతమ్=యథాయోగ్యముగా; ఉభ యం ధనమ్=రెండుధనములు; సంసృష్టమ్=చక్కగా నిర్మింపఁబడినవి, ఆధ్యాత్మికం బును ఆధిదైవతంబును. వాని నిచ్చువారు ఇద్దఱు. ఆధ్యాత్మికము నిచ్చువాఁడు, వరుణః=ప్రకాశకుఁడగుపరమాత్మ. రెండవది యిచ్చువాఁడు “మన్యు రిన్ద్రో బృహ స్పతిః ” అను శ్రుతివలన, మన్యుః=ఇంద్రుఁడు, దేవతలయం దైశ్వర్యము గలవాఁడు. ఇఁక రెండుధనములయు ఫలముఁ జెప్పుచున్నాఁడు.—ఈధనములచే, హృదయేషు= ప్రాణులయంతఃకరణములయందు; శత్రవః=ఆఱుగురుశత్రువులు; భియం దధానాః= భయంబు గలిగించు చున్నవారలై; తమయంతనే యుద్ధము లేకయే, పరాజితాసః= పరాజితులై; అపనిలయన్తామ్= నాశము నొందుచున్నారు. ఇది యధ్యాత్మపక్షము నందు. అధిదైవతపక్షమునందును, మాయంతఃకరణమునందు భయము గలిగించుచుట్టి శత్రువులు పరాజితులై తమయంతనే నాశము నొందుదు రని యర్థము. ఇఁకఁ బ్రకృతము ననుసరించెదము. ఇట్లు శత్రుపరాజయమునందు నీకుఁ బ్రయాస లేదు. ఎందువలన ననఁగా, వీరు మున్నే నాచే నిహతులై యున్నా రని నీవే చూచితివి. ఇఁకమీఁద, సవ్యసాచిన్=ఓయర్జునా! నీవు, నిమిత్తమాత్రం భవ. ఇది యభిప్రా యము.—పూర్వము నేను రుద్రుని నిమిత్తముగాఁ జేసికొని నానిర్మించినధనుస్సునందుఁ గల్పాంతకాలాగ్నితుల్యబాణరూపుఁడనై దుర్జయ మైనత్రిపురమును దహించితిని. ఇప్పుడు నిన్ను నిమిత్తమాత్రము గావించుకొనెదను. జగత్సృష్టిప్రలయసమర్థసంక ల్పుల మైనమాకుఁ గురుకులదహనం బెంతమాత్రము? అని యర్థము.

౩౪. అందువలన నీవు వారలతో యుద్ధమునకు లెమ్ము. ఆశత్రువులను జయించి యశస్సుఁ బొందుము. ధర్మ్య మయినరాజ్యమును గూడ సమృద్ధ మయిన దాని భుజింపుము. నాచేతనే కృతాపరాధు లగువీరు, నిహతాః = చంపుటయందు వినియోగింపఁబడిరి. నీవో వారిం జంపుటయందు నిమిత్తమాత్రమ వగుము—నాచే

వధింపఁబడుచున్న వీరియందు శస్త్రాదిస్థానీయుఁడ వగుము. సవ్యసాచిన్-వచ సమవాయే, సవ్యముచే బాణసచనశీలుఁడు సవ్యసాచి, సవ్యహస్తముచేతఁ గూడ బాణసమవాయము చేయువాఁడు, రెండుచేతులతోను బోసటకు సమర్థుఁ డని యర్థము.

**మూ.** ♦

ద్రోణం చ భీష్మం చ జయద్రథం చ
కర్ణం తథా ఽన్యా నపి యోధవీరాన్
మయా హతాం స్త్వం జహి మా వ్యథిష్ఠాః
యుధ్యస్వ జేతాసి రణే సపత్నాన్. 34

**భా.** ద్రోణంచ=ద్రోణుని; భీష్మంచ=భీష్మునిఁ; జయద్రథంచ = సైంధవుని; కర్ణన్=కర్ణుని; ఏయే యోధులయం దర్జునున కాశంక కలిగెనో వారలను భగవంతుఁడు మయా హతాన్ అని వ్యపదేశించుచున్నాఁడు; అందు ద్రోణభీష్ములయం దేమో యాశంకాకారణము ప్రసిద్ధము, ద్రోణుఁడు ధనుర్వేదాచార్యుఁడు దివ్యాస్త్రసంపన్నుఁడును, తనకును విశేషించి గురువైనవాఁడు; భీష్ముఁడు స్వచ్ఛందమరణుండు దివ్యాస్త్రసంపన్నుఁడును, పరశురామునితో ద్వంద్వయుద్ధము గావించెను, పరాజితుఁడు గాఁ డయ్యె; అట్లు జయద్రథుఁడును, వానితండ్రి తపస్సు చేయుచున్నాఁడు-ఎవ్వఁడు నాపుత్త్రునిశిరము భూమిం బడఁద్రోయునో వాని శిరస్సునుం బడు నని; కర్ణుండును, ఇంద్రదత్తమైనయమోఘ మగుశక్తి కలవాఁడు, సూర్యపుత్త్రుఁడు కానీనుఁడు, కావుననే యతండును పేరితోనే నిర్దేశింపఁబడియె; తథా=అట్లు; అన్యానపి = ఇతరులను గూడ; యోధవీరాన్=శూరు లయిన యోధులను; మయా= నాచే; హతాన్= వధింపఁబడినవారిని; త్వమ్=నీవు; జహి=నిమిత్తమాత్రమున వధింపుము. మా వ్యథిష్ఠాః=వారివలన భయము నొందకుము. యుధ్యస్వ=పోరుము. రణే = యుద్ధమునందు; సపత్నాన్=శత్రువులను దుర్యోధనప్రభృతులను; జేతాసి=జయింపఁగలవు.

ద్రోణుఁడును భీష్ముఁడును సైంధవుఁడును కర్ణుఁడును మఱియు నితరవీరులును అందఱును నాచేతనే హతులై యున్నారు. కావున నీవు నిమిత్తమాత్రంబవై

♦ దీనికి మూర్వభాష్యము లేదు.

యనాయాసముగా వీరినందఱ వధింపుము. భయపడ వలదు, యుద్ధము చేయుము, యుద్ధంబున శత్రువుల జయింపఁగల వని తాత్పర్యము.

ఆ. మ యైవ ఇత్యాదిగాఁ జెప్పినదానిఁ బ్రపంచించుచున్నారు ద్రోణంచ ఇత్యాదిగా. ఎందువలనఁ గొందఱుమాత్రమె యిట ద్రోణాదులు గణియింపఁబడు చున్నారు? అనఁగాఁ జెప్పుచున్నారు ఏయే యోధులయందు ఇత్యాదిగా. ద్రోణా దులయం దేమిశంక యని యాశంకించి యుద్ధతీయందు శంకకు నిమిత్తము చెప్పుచు న్నారు అందు ఇత్యాదిగా. జయద్రథునియందును శంకానిమిత్తము చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. దివ్యాస్త్రసంపన్నుఁ డని సంబంధము వానియందు శంకకుఁ గారణాంతరముఁ జెప్పుచున్నారు వానితండ్రి ఇత్యాదిగా. కర్ణునందును శంకాకారణముఁ జెప్పుచున్నారు కర్ణుంకును ఇత్యాదిగా. పూర్వమునందువలె దివ్యాస్త్రసంపన్నుఁ డని సంబంధము. కారణాంతరముఁ జెప్పుచున్నారు ఇంద్రదత్తము ఇత్యాదిగా. అది యమోఘము పురుషునొక్కని అత్యంతసమర్థుని వధించియే గదా మరలును. జన్మముచేతఁగూడ నతఁడు శంకనీయుఁ డని చెప్పుచున్నారు సూర్యపుత్త్రుఁ డని. కుంతి కన్యావస్థయందు మంత్రప్రభావము నెఱుంగుటకై సూర్యుని రావించెను గదా! అంత నయ్యవస్థయందే యితఁడు పుట్టెను—ఆయర్థముఁ జెప్పుచున్నారు కానీనుఁ డని. ఈయభిప్రాయముననె కర్ణగ్రహణం బని చెప్పుచున్నారు కావుననే ఇత్యాదిగా. చెప్పినవారియందును ఇతరులయందును నీవు శంకింపవలసినది లే దని చెప్పుచున్నారు మయా ఇత్యాదిగా.

హ. జహి = కొట్టుము. మా వ్యథిష్ఠాః = శంకింప వలదు, భయంబును చలనంబును పొందకు మని యర్థము. జేతాసి = జయింపఁగలవు.

శం. చెప్పినయర్థమునే నిస్సందేహ మగుటకై స్పష్టీకరించుచున్నాఁడు.— ద్రోణుని భీష్ముని జయద్రథుని కర్ణుని, తథా; అన్యా నపి యోధవీరాన్= భగదత్తుఁడు సౌమదత్తి మొదలగు నితరయోధవీరులను గూడ; మయా=నాచేత; తేజోబలపౌరుష ముల నాకర్షించుటచే, హతాన్ = హతప్రాయు లయినవారిని; త్వం జహి=నీవు బాణ ములచేఁ బడఁద్రోయుము. అందు, మావ్యథిష్ఠాః = ద్రోణుఁడు దివ్యాస్త్రసంపన్నుఁ డనియు స్వచ్ఛందమరణుఁడు దివ్యాస్త్రసంపన్నుఁడు భీష్ముఁ డనియు సూర్యవీర్యశక్తి యుక్తుఁడు కర్ణుఁడు దుర్జయుం డనియుఁ బితృవరంబున నవధ్యుఁడు సైంధవుఁ డనియు మనస్సునఁ గొంచెమేని వ్యథ వహింపకుము. మ తే మనఁగా నాయనుగ్రహముచే,

రణే=యుద్ధమునందు; సపత్నాన్=దుర్యోధనాదిశత్రులను; జేతాసి=జయింపఁగలవు. ఇందు సందేహము లేదు. అందువలన, యుధ్యస్వ. ఇట విధి లేదు. మఱేమనఁగా, ముక్తికిఁ గారణము జ్ఞానము, దానికిఁ గారణము చిత్తశుద్ధి, దానికిఁ గారణము స్వధర్మానుష్ఠానము—అని సూచించుచుఁ జెప్పుచున్నాఁడు యుధ్యస్వ అని. ముముక్షుండవగునీవు స్వధర్మము ననువర్తింపు మని తాత్పర్యార్థము. ఇందుచే, భక్తిచే నారాధితుండై పరమేశ్వరుఁడు తనభక్తులకు దుర్లభ మగు కార్యమును గూడ సులభముఁ గావించు నని సూచితం బగుచున్నది.

మ. ఓయీ! ద్రోణుఁడు బ్రాహ్మణోత్తముఁడు ధనుర్వేదాచార్యుఁడు నా గురువు విశేషించి దివ్యాస్త్రసంపన్నుఁడును, అట్లు భీష్ముఁడు స్వచ్ఛందమృత్యువు దివ్యాస్త్రసంపన్నుఁడును బరశురామునితో ద్వంద్వయుద్ధము నొందియుఁ బరాజితుఁడు కానివాఁడు, అట్లు ఎవ్వనితండ్రి వృద్ధక్షత్త్రుఁడు “నాపుత్త్రునిశిరస్సు నెవ్వఁడు భూమిమీఁదఁ బడవేయుచున్నాఁడో వానిశిరము గూడఁ దక్షణమే భూమిమీఁదఁ బడు” నని తపస్సు చేయుచున్నాఁడో అట్టి జయద్రథుఁడును జయింప నలవికాఁడు తానును మహాదేవు నారాధించినవాఁడు దివ్యాస్త్రసంపన్నుఁడును, అట్లు కర్ణుఁడును సూర్యసమానుఁడు సూర్యారాధనముచే దివ్యాస్త్రసంపన్నుఁడును ఇంద్రునివలన నేకపురుషఘాతినియు మరలింప నలవి గానిదియు నగు శక్తిం గొన్నవాఁడు, అట్లు కృపాశ్వత్థామ భూరిశ్రవఃప్రభృతులు మహానుభావులు అన్నివిధంబులను దుర్జయులే యగుదురు, వీర లుండఁగా నెట్లు శత్రువుల జయించి రాజ్యము భుజింపఁగలను? ఎట్లు మఱి యశస్సు పొందఁగలను? అనునర్జును నాశంకను దొలఁగించుటకై తదాశంకకు విషయీభూతు లగువారిఁ బేరులతోఁ బేర్కొనుచుఁ జెప్పుచున్నాఁడు.—నీ యాశంకకు విషయీభూతు లగు ద్రోణాదులను యోధవీరుల నందఱనే కాలాత్ముఁడ నగు నాచేత హతు లయినవారినే నీవు వధింపుము. హతు లయినవారి వధించుట యందుఁ బరిశ్రమ మేమి గలదు? కావున, మా వ్యథిష్ఠాః = ఎట్లు నేను శక్తుఁడ నగుదు నను వ్యథను—భయనిమిత్తమైనపీడను పొందకుము. భయము విడిచి, యుధ్యస్వ. రణే=యుద్ధమునందు; సపత్నాన్=శత్రువులనందఱను; జేతాసి=శీఘ్రముననే జయింపఁగలవు. ఇట, ద్రోణంచ భీష్మంచ జయద్రథంచ అను మూఁడుచకారములచే మున్ను చెప్పిన యజయ్యత్వశంక యనువదింపఁబడుచున్నది. తథాశబ్దముచేఁ గర్ణునందును, అన్యా నపి యోధవీరాన్ అనుచో నపిశబ్దముచే నన్యయోధవీరులయందును అజయ్యత్వాశంక యనువదింపఁబడుచున్నది. అందువలన నెవ్వరివలనను నీకుఁ బరా

జనుమును గాని వధనిమిత్తమయినపాపమును గాని శంకింపవల దని యభిప్రాయము. «కథం భీష్మ మహం సఙ్ఖ్యే ద్రోణంచ మధుసూదన। ఇషుభిః ప్రతియోత్స్యామి పూజార్హౌ» అనుస్థలమునందువలె నిటఁ గూడ సముదాయాన్వయానంతరము ప్రత్యేకాన్వయం బని యెఱుంగునది.

శ్రీ. «న చైత ద్విద్మః కతర న్నో గరీయః» ఇత్యాదిక మగు నేశంక చేసితివో యది యుఁ జేయరా దని చెప్పుచున్నాఁడు.—ఎవ్వరివలన నీవు శంకించుచున్నావో ఆద్రోణాదులను నాచేతనే హతు లయినవారిని నీవు వధింపుము. మా వ్యథిష్ఠాః=భయపడకుము. సపత్నాన్=శత్రువులను; రణే=యుద్ధమునందు; నిశ్చితముగా, జేతాసి=జయింపఁగలవు.

ప. ద్రోణుని భీష్ముని జయద్రథుని కర్ణుని అట్లు, అన్యానపి; యోధవీరాన్=యోధులయందు వీరు లైనవారిని; మయా = సంహారకాలరూపుఁడ నగు నాచేత; హతాన్=అపహరింపఁబడినశక్తి గలవారలను; జహి=చంపుము. మఱి, మావ్యథిష్ఠాః=భయపడ వలదు. నిర్భయుఁడవై, యుధ్యస్వ. రణే=సంగ్రామమునందు; సపత్నాన్=శత్రువులను; జేతాసి=జయింపఁగలవు.

రా. ద్రోణభీష్మకర్ణాదులను కృతాపరాధు లగుటవలన నాచేతనే వధమునందు వినియుక్తు లైనవారిని, త్వం జహి=నీవు వధింపుము. గురువులను బంధువులను ఇతరులను గూడ భోగాసక్తు లైనవారిని ఎట్లు వధింతు నని, మా వ్యథిష్ఠాః—వారినుద్దేశించి ధర్మాధర్మభయముచేతఁ గాని బంధుస్నేహంబుచేఁ గాని కారుణ్యంబుచేఁ గాని వ్యథఁ బొందకుము. ఎందువలన ననఁగా, వారు కృతాపరాధులు నాచేతనే వధమునందు వినియోగింపఁబడి యున్నవారు. కావున నిశ్శంకుఁడవై, యుధ్యస్వ. రణే; సపత్నాన్; జేతాసి = జయింపఁగలవు. వీరి వధించుటయందు నృశంసత * లేశమేనియు లేదు, మ త్తే మనఁగా జయమే లబ్ధ మగు నని యర్థము.

మా. ఎవ్వఁడు ఛిన్నమయిన వీనిశిరస్సును నేలఁబడ వేయునో వానిశిరస్సు భిన్న మగు నని వానితండ్రి వర మిచ్చుటవలన జయద్రథుఁడును విశేషించి చెప్పఁబడెను. «ప్రవరావాసవీశక్తిః» అని యుండుటచే గర్ణుఁడును విశేషించి చెప్పఁబడెను.

---

* క్రౌర్యము—పాపము.

సంజయ ఉవాచ.—

ఏతచ్ఛ్రుత్వా వచనం కేశవస్య
కృతాఞ్జలి ర్వేపమానః కిరీటీ
నమస్కృత్వా భూయఏ వాహ కృష్ణం
సగద్గదం భీతభీతః ప్రణమ్య. 35

భా. సంజయుఁ డిట్లనియె.—కేశవస్య = కృష్ణునియొక్క; ఏతత్ = ఈ; వచనమ్ = పూర్వోక్తవాక్యమును; శ్రుత్వా = విని; కిరీటీ = అర్జునుఁడు; కృతాఞ్జలిః = చేయఁబడినచేమోడ్పు గలవాఁడై; వేపమానః = వడఁకుచు; నమస్కృత్వా = నమస్కరించి; భీతభీతః = మాటిమాటికి భయపడినవాఁడై; ప్రణమ్య = నమ్రత నొంది; కృష్ణమ్ = కృష్ణుని గూర్చి; భూయఏవ = మెండియును; సగద్గదమ్ = భయావిష్టునకు దుఃఖాభిఘాతము వలనను స్నేహావిష్టునకు హర్షోద్భవమువలనను నేత్రము లశ్రుపూర్ణములై శ్లేష్మముచేఁ గంఠావరోధము కలుగును, అందువలన వాక్కునకుఁ బటుత్వము లేక ధ్వని మంద మగుట యేది గలదో అది గద్గద మనఁబడును, దానితోఁ గూడినట్లుగా, ఇది వచనక్రియావిశేషణము; ఆహ=చెప్పెను. ఈయవసరమునందు సంజయవచనము సాభిప్రాయము. ఎట్లు? అజయ్యులగు ద్రోణాదులు నలుగురు నర్జునునిచే నిహతులు కాఁగా నిరాశ్రయుండై దుర్యోధనుండు నిహతుఁడే యని తలంచి ధృతరాష్ట్రుఁడు జయమునెడ నిరాశుండై సంధి సేయఁగలఁడు, దానివలన నుభయపక్షములకును శాంతి కలుగఁగలదు—అని. దానిని గూడ భవితవ్యతావశంబువలన ధృతరాష్ట్రుఁడు విన్నవాఁడు కాఁడు.

సంజయుఁ డిట్లనియె.—భగవంతుని యీవాక్యము విని యర్జునుఁడు చేతులుమోడ్చి వడంకుచు నమస్కరించి పలుమాఱు భయమువలనఁ బ్రణతుఁడై డగ్గుత్తిక గదురఁ గృష్ణునితో మెండియు ని ట్లనియె నని తాత్పర్యము.

ఆ. పరాజయభయమువలన సంధి సేయు ననుతలంపుచే సంజయుఁడు ధృతరాష్ట్రున కీవృత్తాంతము చెప్పె నని చెప్పుచున్నారు సంజయుఁడు ఇత్యాదిగా. పూర్వోక్తవాక్యమును — కాలోస్మి ఇత్యాదికమును. విశ్వరూపదర్శనదశయందు

భగవంతునకును అర్జునునకుఁ గలిగిన సరివాదమును సంజయుఁ డేల రాజునకు విన్న వించె నని యాశంకించి సంజయవాక్యతాత్పర్యముఁ జెప్పుచున్నారు ఈయవసరము నందు ఇత్యాదిగా. ఆయభిప్రాయమునే ప్రశ్నద్వారంబున విశదీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. అప్పుడు సంజయవచనము విని యేల రాజు సంధి గావింపఁ డయ్యె ననఁగాఁ జెప్పుచున్నారు దానిని గూడ ఇత్యాదిగా.

హ. వేపమానః = కంపము నొందినవాఁడై. కిరీటీ = అర్జునుడు.

శ్రీ౦. జరగినయుద్ధమును సర్వంబును ధృతరాష్ట్రునకు సంజయుఁడు చెప్పె ను.——కిరీటీ = అర్జునుఁడు; వేపమానః = కంపము నొందుచు; కృతాఞ్జలిర్భూత్వా; కేశవస్య; పూర్వోక్త మయిన, వచనం శ్రుత్వా; చేతులతో నమస్కరించి సాష్టాంగముగా భూమిమీఁదఁ బ్రణమిల్లి, సగద్గదమ్= హర్షాతిశయముచేతను ఆనందాశ్రువేగముచే తను తగ్గినకంఠధ్వని కలుగునట్లుగా; భీతభీతః = మిక్కిలి భయము నొందినవాఁడై; భూయఏవ = వెండియును; ఈవాక్యమును; కృష్ణమ్; ఆహ.

మ. ద్రోణ భీష్మ జయద్రథ కర్ణులు జయాశకు నిమిత్త మైనవారు హతు లయినప్పుడు నిరాశ్రయుఁడై దుర్యోధనుండు హతుఁడే యగు నని యనుసంధించి జయాశను విడిచి ధృతరాష్ట్రుఁడు సంధి సేయునేని యప్పు డుభయపక్షములవారికి శాంతి కలుగు ననునభిప్రాయము గలవాఁడై యంత నేమి జరగె నని యడుగఁగా సంజయుఁడు పలికెను.——ఏతత్ = పూర్వోక్త మగు; కేశవస్య; వచనమ్; శ్రుత్వా; కిరీటీ = ఇంద్రునిచే నియ్యఁబడినకిరీటము గలవాఁడు పరమవీరుం డని ప్రసిద్ధుఁడు అర్జు నుఁడు; వేపమానః= పరమాశ్చర్యముఁ జూచుటచేఁ గలిగినసంభ్రమంబున వడంకుచు; సగద్గదమ్ = భయముచేతను హర్షముచేతను నేత్రము లశ్రుపూర్ణములు గాఁగాఁ గంఠము కఫరుద్ధ మగుటచే వాక్కునకు మందతయును కంపమును మొదలగువికార మేది గలదో అది గద్గదము, దానితోఁ గూడునట్లుగా; భీతభీతః = మిక్కిలి భయప డినవాఁడై; కృష్ణమ్ = భక్తులపాపములను కర్షించునట్టి భగవంతునిఁ గూర్చి; కృతాఞ్జ లిః; నమస్కృత్వా = మొదట నమస్కరించి; వెండియు, ప్రణమ్య = మిక్కిలి నమ్రుఁ డై; భూయఏవ = వెండియును; ఆహ = చెప్పెను.

శ్రీ. అంత నేమి జరగెనో దాని ధృతరాష్ట్రునితో సంజయుఁ డిట్లనియె — ఏతత్ = ఈశ్లోకత్రయాత్మక మయిన; కేశవస్యవచనం శ్రుత్వా; వేపమానః= కంపము నొందుచు; కిరీటీ= అర్జునుఁడు; కృతాఞ్జలిః= సంపుటముగాఁ జేయఁబడినచేతులు గల

వాఁడై; కృష్ణం నమస్కృత్య; వెండియును బలికెను. ఎట్లు పలికెను? సగద్గదమ్ = భయహర్షాద్యావేశమువలన గద్గదముతో — కంఠకంపముతోఁ గూడినట్లుగా. మఱియును, భీతభీతః= భయపడినవానికన్నను భయపడినవాఁడై; ప్రణమ్య= అవనతుండై.

ప. ఇఁక ధృతరాష్ట్రునితో సంజయుఁ డిట్లనియె.—కిరీటీ = అర్జునుఁడు; ఏతత్ కేశవస్య వచనం శ్రుత్వా; వేపమానః= వడంకుచు; కృతాంజలియై; సగద్గదమ్= వడఁకుచున్న స్వరము గలుగునట్లుగా; భీతభీతుఁడై, ప్రణమ్య=దండమువలె నేలఁబడి; భూయఏవ; కృష్ణమ్= మున్ను చెప్పఁబడిన భక్తాఽభక్తకోటిద్వయగతుం డగుకృష్ణునిఁ గూర్చి; ఆహ.

తా. ఏతత్; ఆశ్రితవాత్సల్యసముద్రుఁ డగు కేశవుని వాక్యమును; శ్రుత్వా; అతనికి నమస్కరించి భీతభీతుండై వెండియు నతనిఁ బ్రణమిల్లి కృతాంజలియై వేపమానుండై యర్జునుఁడు సగద్గదముగ ని ట్లనియె.

మూ. *

అర్జున ఉవాచ.—

స్థానే హృషీకేశ తవ ప్రకీర్త్యా
జగ త్ప్రహృష్య త్యనురజ్యతే చ
రక్షాంసి భీతాని దిశో ద్రవన్తి
సర్వే నమస్యన్తి చ సిద్ధసఙ్ఘాః. ౩౬

భా. స్థానే=యుక్తము. ఏకః? హృషీకేశ=ఓకృష్ణా! తవ=నీయొక్క; ప్రకీర్త్యా=మాహాత్మ్యకీర్తనముచేత, వినఁబడినదానిచేత; జగత్ =ప్రపంచము; ప్రహృష్యతి = సంతోషముఁ బొందుచున్నది యనునది యేది గలదో అది. లేక, స్థానే యనునది విషయవిశేషణము. యుక్తము హర్షాదివిషయము భగవంతుఁడు. ఎందువలన ననఁగా, ఈశ్వరుఁడు సర్వాత్ముఁడును సర్వభూతసుహృదుఁడును. అందువలన. అట్లు, అనురజ్యతే చ = అనురాగము పొందుచున్నది యనునది యేది గలదో అదియు యుక్తము. భగవంతుఁ డనురాగవిషయ మగుటయు యుక్త మని వ్యాఖ్యేయము. మఱియును —రక్షాంసి=రాక్షసులు; భీతాని = భయావిష్టు

* దీనికి మాధ్వభాష్యము లేదు.

లై; దిశః=దిక్కులను గూర్చి; ద్రవన్తి=పరువిడుచున్నారు, అదియు యుక్తము. అట్లు భయమునకు విషయ మగుటయు యుక్తము. సిద్ధసఙ్ఘాః=కపిలాదు లగు సిద్ధులసమూహములు; సర్వే=అన్నియు; నమస్యన్తిచ=నమస్కరించుచున్నవి గూడ, అదియు యుక్తము.

హృషీకేశా! నీమాహాత్మ్యకీర్తనము విని జగత్తు హర్షమును అనురాగమును బొందుచున్నది, రాక్షసులు భయపడి దిక్కులకుఁ బరువెత్తుచున్నారు, కపిలాది సిద్ధులందఱును నమస్కారము చేయుచున్నారు, ఇవి యంతయు నీవిషయమున మిక్కిలి యుక్త మని తాత్పర్యము.

ఆ. అర్జునుఁడు భగవంతుని గూర్చి సగద్గదవచనం బేమి పలికెను? అనఁగా దానిఁ జెప్పుచున్నారు అర్జున ఉవాచ అని. విషయవిశేషణత్వముచే వ్యక్తీకరించుచున్నారు యుక్తము ఇత్యాదిగా. భగవంతుఁడు హర్షాదివిషయ మగుట యుక్త మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఎందువలన ననఁగా ఇత్యాదిగా. నీప్రకీర్తిచే హర్షమును బోలె ననురాగమును గూడ జగత్తు పొందుచున్న దని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. జగదేకదేశభూతులై ప్రతిపక్షులై నరాక్షసు లుండఁగా జగత్తునకు భగవంతునందు హర్షానురాగముల నెట్లు చెప్పవచ్చును? అని యాశంకించి చెప్పుచున్నారు మఱియును ఇత్యాదిగా. ఇందువలనఁ గూడ జగత్తునకు భగవంతునందు హర్షాదికము యుక్త మని చెప్పుచున్నారు సిద్ధసఙ్ఘాః ఇత్యాదిగా.

హ. స్థానే=యుక్తము. ప్రకీర్త్యా—ప్రకృష్ట మైనకీర్తిచేత నని యర్థము.

శ౦. ఓహృషీకేశా! తవప్రకీర్త్యా = త్వన్మాహాత్మ్యకీర్తనముచే, వినఁబడిన దానిచే, నీమాహాత్మ్యకీర్తనము వినుటచే ననుట; సమస్త మయిన, జగత్=జగత్తు; ప్రహృష్యతి = అధిక మయినహర్షము నొందుచున్నది యనునది యేది గలదో అది; స్థానే=యుక్తము. నీవు సర్వజగంబునకును హర్షవిషయంబ నగుట యుక్త మని యర్థము. అట్లు నీమాహాత్మ్యము వినుటచే జగత్తు నీయందు, అనురజ్యతేచ=అనురాగమును గూడఁ బొందుచున్నది యన్నది యేది గలదో అదియు; స్థానే—నీవు జగదనురాగమునకు విషయంబ నగుట యుక్త మని యర్థము. నీమాహాత్మ్యము వినుటచే; భీతాని=భయపడినవారలై; రక్షాంసి=రాక్షసులు; దిశః ద్రవన్తి=దిక్కులను గూర్చి పాఱుచున్నారనునది యేది గలదో అదియు; స్థానే—నీవు రాక్షసులపలాయనమునకు హేతువ వగుటయు యుక్త మని యర్థము. సిద్ధసఙ్ఘాః=సిద్ధులయొక్క—దేవతా

విశేషములయొక్క సమూహములు; సర్వే; నిన్ను, నమస్యన్తి=నమస్కరించుచున్న వనునది యేది గలదో అది; స్థానే—నీవు సర్వదేవతానమస్కారములకు విషయము వగుటయు యుక్తమని యర్థము. లేక. ఓహృషీకేశా! "కాలోఽస్మి లోకక్షయకృత్ప్రవృద్ధో లోకాన్ సమాహర్తుమిహ ప్రవృత్తః" అని భూభారభూతులైన సర్వదుష్టులసంహరించుకొఱకుఁ బ్రవర్తించితి నని నీవు చెప్పినట్టి, తవ ప్రకీర్త్యా=నీయొక్క ప్రకృష్టవాక్యముచేత, దాని వినుటచేత; జగత్=సాధులోకము; ప్రహృష్యతి=సంతోషమును బొందుచున్న దనునది యేది గలదో; అది. స్థానే=యుక్తము. సర్వేశ్వరుండవు సర్వలోకత్రాణపరాయణుండ వగు నీవు సర్వదుష్టసంహారము చేయునప్పుడు సాధువులు హర్షించుట యుక్తమే యని యర్థము. నీవాక్యము వినుటచే సాధులోకము భక్తవత్సలుఁడవు సర్వభూతసుహృదుండవు పరమాత్మ వగు నీయందు, అనురజ్యతే—అనురాగము నొందుచున్న దన్న దియేది గలదో అది; స్థానే= యుక్తము. లోకోపద్రవనివారణంబున కుద్యుక్తుడవు పరమకృపాలుఁడవు పరమేశ్వరుఁడ వగు నీయందు సాధువుల కనురాగము కలుగుట యుక్తమే యని యర్థము. తవప్రకీర్త్యా—దుష్టుల సంహరింపఁ బ్రవర్తించితి నని నీప్రకృష్టవాక్యము వినుటచేత, రక్షాంసి = రాక్షసులు; భీతాని = భయపడినవారై; దిశః = దిక్కోణములను గూర్చి; ద్రవన్తి=పలాయనము చేయుచున్నారు. తవ ప్రకీర్త్యా, సర్వలోకసుఖముఁ గోరుచుండునట్టి, సిద్ధసఙ్ఘాః సర్వే; నిన్ను, నమస్యన్తి—అదియు యుక్తము. సిద్ధశబ్దము దేవజాతుల కుపలక్షణము, దేవర్షిసిద్ధగంధర్వచారణాదులందఱును స్వామీ! అది యట్లే చేయవలయు నని ప్రార్థించుచు నిన్ను నమస్కరించుటయు యుక్తమే యని యర్థము.

మ. పదునొకండుశ్లోకములచే నర్జునుఁ డిట్లనియె.—స్థానే—ఇది యవ్యయము, యుక్త మని యర్థము. హృషీకేశ=ఓ సర్వేంద్రియప్రవర్తకుఁడా! ఎందువలన మిక్కిలి యద్భుత మయినప్రభావము గలవాఁడవును భక్తవత్సలుఁడవును అగుచున్నావో అందువలన, తవ=నీయొక్క; ప్రకీర్త్యా=ప్రకృష్ట మయిన కీర్తిచేత, నిరతిశయప్రశస్తియొక్క—కీర్తనముచేతను శ్రవణముచేతను, నేనుమాత్రమె కాను హర్షించువాఁడను, మఱేమనఁగా, జగత్ = సమస్త మయినజగత్తును, రాక్షసవిరోధి యగు చేతనమాత్ర మంతయును; ప్రహృష్యతి = అధిక మయినహర్షమును బొందుచున్న దగుట యేది గలదో అది; స్థానే=యుక్తమే యని యర్థము. అట్లు సమస్తజగత్తును, అనురజ్యతే=తద్విషయ మయినయనురాగము నొందుచున్న దనుటయు నేది గలదో అదియు; స్థానే—యుక్తమే. అట్లు, రక్షాంసి; భీతాని = భయావిష్టములై; దిశః ద్ర

వన్తి=సర్వదిక్కులను గూర్చి పలాయనము చేయుచున్న వనుట యేది గలదో అదియు; స్థానే=యుక్తమే. అట్లు, సర్వే; సిద్ధసఙ్ఘాః=కపిలాదిసిద్ధులసమూహములు; నమస్యన్తి చ=నమస్కరించుచున్న వనుటయు నేది గలదో అదియు; స్థానే=యుక్తమే. అంతటను తవ ప్రకీర్త్యా అనుదానికిని స్థానే అనుదానికిని అన్వయము. ఈశ్లోకము రక్షోఘ్నమంత్రముగా మంత్రశాస్త్రమునందుఁ బ్రసిద్ధము. అది నారాయణాష్టాక్షర సుదర్శనాస్త్రమంత్రములతో సంపుటితం బని రహస్యము.

శ్రీ. సర్వే; సిద్ధసఙ్ఘాః = యోగతపోమంత్రసిద్ధులయొక్క సమూహములు; నమస్యన్తి=ప్రణమిల్లుచున్నా రనుట యేది గలదో; ఇది యంతయు, స్థానే=యుక్తమే, చిత్రము గా దని యర్థము ♦.

ప. నీయొక్క యద్భుతసామర్థ్యభక్తవాత్సల్యరూప మయినకీర్తిచే నిన్ననుసరించి జగత్తు ప్రహర్షము నొందుచున్నది, నీయందలివిశ్వాసముచే అనురాగము నొందుచున్నది—ఇది, స్థానే= యుక్తమే. దీనిం జూచి కపిలాదసిద్ధు లందఱును నిన్ను నమస్కరించుచున్నారు—ఇదియు, స్థానే=యుక్తమే.

రా. స్థానే = యుక్తము. యుద్ధము చూడఁ గోరి వచ్చిన దేవ గంధర్వ సిద్ధ యక్ష విద్యాధర కిన్నర కింపురుషాదిక మగుజగత్తు నీప్రసాదమువలన నిన్ను సర్వేశ్వరు నవలోకించి, తవ ప్రకీర్త్యా సర్వంబును, ప్రహృష్యతి=ప్రహర్షము నొందుచున్న దనుట యేది గలదో; అనురజ్యతే చ=అనురాగము నొందుచున్న దనుటయు నేది గలదో; మఱియును, నిన్నుఁ జూచి రాక్షసులు భీతులై సర్వదిక్కులకును బఱువెత్తుచున్నా రనునదియు నేది గలదో; సర్వే, సిద్ధసఙ్ఘాః=సిద్ధాదు లగు ననుకూలుర సమూహములు; నమస్యన్తి చ = నమస్కరించుచున్న వనుటయు నేది గలదో; అది యంతయు యుక్త మని పూర్వముతో సంబంధము.

మా. ఈ చెప్పఁబోవున దేది గలదో అది, స్థానే=యుక్తమే యని యర్థము. అగ్నిష్టోమాదుల కంతర్యామివై జగత్తును హర్షింపఁజేయుట మొదలగునవి చేయుట వలన హృషీకేశుఁడు. అంశువులు కేశనియతము లగుటచే కేశత్వము. ప్రమాణము శశిసూర్యనేత్ర మ్మనుచోఁ జెప్పఁబడినది. హృషీకములకు—ఇంద్రియములకు ఈశుఁ డగుటవలనఁ గూడ. విశేషించి వాని కీశుం డనుట «యః ప్రాణే తిష్ఠన్» ఇత్యాది శ్రుతిప్రసిద్ధము. «నమే హృషీకాణి పతన్త్య సత్పథే» ఇత్యాదిప్రయోగమువలనఁ.

♦ తక్కినది మధుసూదనీయముతో సమానము.

గూడ. ఇతర మయినయర్థము మోక్షధర్మమునందు సిద్ధము—“ సూర్యా చన్ద్ర మసో శ్శశ్వ త్కేశై ర్యే రంశు సంజ్ఞితైః । బోధయత్ స్థాపయ చ్చైవ జగ దుత్పద్యతే పృథక్॥ బోధనాత్ స్థాపనా చ్చైవ జగతో హర్షసంభవాత్ । అగ్నీషోమ కృతై రేభిః కర్మభిః పాణ్డునన్దన॥ హృషీకేశో మహేశానో వరదో లోకభావనః ” * అని.

కస్మాచ్చ తే న నమేర న్మహాత్మన్
గరీయసే బ్రహ్మణో ఽప్యాదికర్త్రే
అనన్త దేవేశ జగన్నివాస
త్వ మక్షరం స దస త్తత్పరం యత్. 38

భా. భగవంతుఁడు హర్షాదివిషయ మగుటకు హేతువును బ్రదర్శించుచున్నాఁడు.—కస్మాచ్చ=ఏ హేతువువలన మఱి; తే=నీకొఱకు; ననమేరన్= నమస్కరింపరు? మహాత్మన్=ఓ మహాత్మా! గరీయసే=గురుతరుఁడ వైన వానికొఱకు; బ్రహ్మణోఽపి=హిరణ్యగర్భునికిఁ గూడ; ఆదికర్త్రే = కారణము వైనవానికొఱకు. ఎందువలన నీవు హిరణ్యగర్భునకుఁ గూడ కారణమయినవాఁడవో అందువలన నీ కేల వీరందఱు నమస్కరింపరు? కావున హర్షాదులకును నమస్కారమునకును నీవు తగినవిషయమే యగుదువని యర్థము. అనన్త=ఓ యనంతుఁడా! దేవేశ = దేవతలకును ఈశ్వరుఁడా! జగన్నివాస = జగత్తున కునికిపట్టయినవాఁడా! త్వమ్=నీవు; తత్పరమ్ అక్షరమ్—ఏది వేదాంతములయందు వినఁబడుచున్నదో అట్టి తత్పర మయినయక్షరమవు నీవు. ♦ తచ్ఛబ్దముచేఁ జెప్పఁబడునది యేది? సదసత్—సత్=ఉన్న దని గ్రహింపఁబడునది; అసత్ = లేదనుబుద్ధి కలుగునో అది; ఆసదసత్తులు ఏయక్షరమున కుపాధిభూతములో, దేనిద్వారమున నవి సత్తు అసత్తు అని యుపచరింపఁబడుచున్నవో అట్టి యక్షరమవు నీవు. పరమార్థంబుననో, తత్పరమ్=ఆసదసత్తులకుఁ బర

* ఎల్లప్పుడు సూర్యచంద్రులకిరణములతో నిండిన నాకేశములచే జగత్తును బోధించుచు స్థాపించుచు సూర్యాదికము ఉదయము నొందుచున్నది. జగత్తును బోధించుటవలనను స్థాపించుటవలనను హర్షము పుట్టించుటవలన అగ్నీషోమకృత మగు నీకర్మములచే, పాండునందనుఁడా! నేను హృషీకేశుఁడను మహేశానుఁడను వరదుఁడను లోకభావనుఁడను.

♦ తత్పర మ్మనుచో.

మయినయక్షరము; యత్ =ఏది గలదో, దేని వేదవిదులు చెప్పుచున్నారో; అది నీవే, ఇతరము కా దని యభిప్రాయము.

అనంతుఁడా! దేవేశా! జగన్నివాసా! మహాత్మా! నీవు అందఱకన్నను గొప్పవాఁడవు, హిరణ్యగర్భునికిని గారణమవు, కావున నీ కెట్లు వారు నమస్కరింప కుందురు? మఱియును, సదసత్తులు ఉపాధులుగాఁ గల యక్షరము నీవు, పరమార్థమున ఆసదసత్తులకుఁ బర మైనయక్షరము నీవే, కావున నీ కెల్లరును నమస్కరించుచున్నా రని తాత్పర్యము.

ఆ. చెప్పినయర్థమునందు హేతూక్తిపరముగా మీఁదిశ్లోకమును దించుచున్నారు భగవంతుఁడు ఇత్యాదిగా. మహాత్ముఁడా— అక్షుద్ర మయినచిత్తము గలవాఁడా! గురుతరుండ వగుటవలన నమస్కారాదియోగ్యుఁ డని చెప్పుచున్నారు గురుతరుఁడ వైనవానికొఱకు అని. అందే హేత్వంతరము చెప్పుచున్నారు బ్రహ్మణః ఇత్యాదిగా. చెప్పఁబడినమహాత్మ్యత్వాది హేతువులకు ఫలముఁ జెప్పుచున్నారు కావున నిత్యాదిగా. అందే హేత్వంతరములు సూచించుచున్నారు అనన్త ఇత్యాదిగా. అనవచ్ఛిన్నత్వంబును సర్వదేవనియంతృత్వంబును సర్వజగదాశ్రయత్వంబును నీవు నమస్కారాదియోగ్యుండ వగుటకుఁ గారణ మని యర్థము. అందే మఱియొకహేతువుఁ జెప్పుచున్నారు త్వమ్ ఇత్యాదిగా. అందుకుఁ బ్రమాణము చెప్పుచున్నారు ఏది ఇత్యాదిగా. ఎట్లు ఒక్కటే సదసద్రూపం బగును? అనఁగాఁ జెప్పుచున్నారు ఆసదసత్తులు ఇత్యాదిగా. ఎట్లు సత్తును అసత్తును అక్షరమున కుపాధి యగును? అనఁగాఁ జెప్పుచున్నారు దేనిద్వారమున నిత్యాదిగా. తత్పరం యత్ అనుదానికి వ్యాఖ్యానము చేయుచున్నారు పరమార్థంబుననో ఇత్యాదిగా.

హ. న నమేరన్ = నమస్కరింపరు? అక్షరమ్ = బ్రహ్మము. సదసత్ = సత్తును అసత్తును సదసత్తు, సదసదాత్మకం బని యర్థము. ఆసదసత్తులకంటెఁ బర మైనది యేది గలదో అదియు నీవు.

శం. భగవంతుఁడు సర్వదేవనమస్కార్యుం డగుటకు హేతువులను జెప్పుచుఁ గాకువుచే సర్వనమస్కార్యత్వము నే సాధించుచున్నాఁడు.—చకారము తు అనుదాని యర్థము గలది. మహాత్మన్ = మహత్తరము—సర్వోత్కృష్ట మగు ఆత్మ—స్వభావము గలవాఁడా! తే=నీకొఱకు; సిద్ధాదిదేవతలు అందఱును, కస్మాచ్చ=ఏహేతువువలన; నన మేరన్=ఏకారణముచే నీకు నమస్కరింపరు? సర్వవిధములచేతను విచారింపఁగా

నీకే నమస్కరింతు రని యర్థము. ఓయీ! నేనును లోకసాధారణుఁడను, ఏవిశేష
మును బట్టి నాకు నమస్కరింతురు? అని యాశంకింపఁగా, ఐశ్వర్యబలవీర్యతేజశ్శక్తి
విశేషములచేతను బరమార్థముచేతను నీవే సర్వోత్తముఁడవు సర్వనమస్కార్యుఁడ
వని సర్వనమస్కార్యుఁ డగుటకు హేతువులు చెప్పుచున్నాఁడు.—గరీయసే=జ్ఞానాదు
లగు పూర్వోక్తవిశేషములచే నెవ్వఁడు సర్వోత్తముఁడు సర్వగరీయసుఁడో అట్టివాని
కొఱకు, గురుతరుఁ డైనవానికొఱకు, జ్ఞానాదులచే నందఱికంటె గురుతరుండ వగుట
వలన నని యర్థము. మఱియును, బ్రహ్మణోఽపి = బ్రహ్మదేవునకు హిరణ్యగర్భునకుఁ
సర్వభూతపతియు సర్వారాధ్యుఁడు నగువానికిఁ గూడ; ఆదికర్త్రే=ఆదివి—జననకారణ
మవు, కర్తవు—నియామకుఁడవు, ఆదియు కర్తయు నైనవానికొఱకు. అట్టివానికిఁ
గూడ స్రష్టవును ఈశ్వరుఁడవును అగుటవలన నీవు సర్వనమస్కార్యుఁ డని చెప్పెడి
దేమి? అని యర్థము. మఱియు హేత్వంతరములను జెప్పుచున్నాఁడు.—అనన్త
దేవేశ జగన్నివాస—అనంతుఁడవును దేవతల కీశ్వరుఁడవును జగన్నివాసుఁడవును
అగుటవలన సర్వనమస్కార్యుఁడ వగుచున్నా నని యర్థము. అనంతుఁడు గదా ఆత్మ
«యో దేవానా మధిపో యస్మిఁ ల్లోకా అధిశ్రితాః» అను శ్రుతివలన. ఓయీ!
నా కనంతత్వము సంభవింపదు, జగత్తుచేతను తత్కారణముచేతను వ్యవధానము కలు
గుటవలన—అని యాశంకింపఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.—సదసత్ = నామరూప
ములచే నేది యున్న దని నిర్దేశింపఁబడుచున్నదో అది సత్తు కార్య మయినజగత్తు,
తద్విలక్షణ మయినది అసత్తు జగత్కారణ మయిన యవ్యాకృతము, ఆసదసత్తులు
రెండును నీవే, «సర్వం హ్యేత ద్బ్రహ్మ» అను శ్రుతివలన. ఓయీ! సదసద్రూ
పుఁడనైనను నా కనంతత్వము సంభవింపదు పరబ్రహ్మముచే వ్యవధానము కలుగుట
వలన—అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—తత్పరమ్ = ఆ కార్యకారణములైన
జగదవ్యాకృతములకు నిత్యత్వముచేతను సచ్చిదానందరూపత్వముచేతను నిరతిశయ
మహత్త్వముచేతను అతిసూక్ష్మత్వముచేతను పరము—విలక్షణమును కారణమును
«యో వా ఏత దక్షరం గార్గ్యవిదిత్వా» ఇత్యాది శ్రుతిప్రసిద్ధము; యత్ అక్షరమ్=
ఎప్పుడును దేనిచేతను ఎట్లును క్షరణము నొందదు కావున అక్షరము, నిత్యకూటస్థము
సచ్చిదానందైకరసము అద్వితీయము నిర్విశేష మగునది యేది గలదో; తత్=ఆ
పరబ్రహ్మము; త్వమ్=నీవే, నీకంటె వేఱు గాదు. అందువలన అనంతత్వము సిద్ధము,
«సత్యం జ్ఞాన మనన్తం బ్రహ్మ» అను శ్రుతివలన. అందువలన నీకు సర్వదేవనమ
స్కార్యత్వము యుక్త మని తాత్పర్యార్థము.

మ. భగవంతుఁడు హర్షాదివిషయం బగుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—కస్మాచ్చ= ఏ హేతువువలన; తే= నీకొఱకు; న నమేరన్= నమస్కరింపరు, సిద్ధులందఱును? మహాత్మన్=ఓపరమోదారచిత్తుఁడా! అనన్త= సర్వపరిచ్ఛేదశూన్యుఁడా! దేవేశ=హిరణ్యగర్భాదిదేవతలకుఁ గూడ నియామకుఁడా! జగన్నివాస=సర్వాశ్రయుఁడా! ఎట్టి నీకొఱకు? బ్రహ్మణో ఒపి; గరీయసే = గురుతరుఁ డైనవానికొఱకు; ఆదికర్త్రే= బ్రహ్మదేవునకుఁ గూడ జనకుఁ డైనవానికొఱకు. నియంతృత్వము ఉపదేష్టృత్వము జనకత్వము—ఇవి యొక్కటొక్కటియు నమస్కార్యత్వమునకు హేతువగును, ఇఁక మహాత్మ త్వానంతత్వ జగన్నివాసత్వాది నానాకల్యాణగుణములతోఁ జేరినవై హేతు వగు నని చెప్పెడి దేమి? అని సిద్ధులు నమస్కరించుట యాశ్చర్యము గా దని సూచించుచున్నది కస్మాచ్చ అనునది. చకారము వా అనుదానియర్థము గలది. మఱియును, సత్= విధిముఖంబున కల దని ప్రతీయమాన మగునది; అసత్= నిషేధముఖంబున లే దని ప్రతీయమాన మగునది; లేక, సత్= వ్యక్తము; అసత్= అవ్యక్తము; అవి, త్వమ్= నీవే. అట్లు, తత్పరమ్ = ఆసదసత్తులకంటెఁ బర మయిన మూలకారణము; యత్ అక్షరమ్ = బ్రహ్మ మేది గలదో; అదియును నీవే. నీకంటె భిన్న మగునది యేదియు లే దని యర్థము. ఈ హేతువులచే నిన్నందఱును నమస్కరించుచున్నా రనుట యెంతమాత్రమును జిత్రము గా దని యర్థము.

శ్రీ. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—ఓ మహాత్ముఁడా! ఓ యనంతుఁడా! ఓ దేవేశా! ఓ జగన్నివాసా! ఏ హేతువువలన నీకు వారు నమస్కారము చేయరు? ఎట్టి నీకొఱకు? బ్రహ్మణో ఒపిగరీయసే ఆదికర్త్రే=బ్రహ్మదేవునకును గురుతరుండవు జనకుండవు నగు నీకొఱకు. మఱియును. సత్= వ్యక్తమును; అసత్= అవ్యక్తమును; తత్ పరమ్ = వానికంటెఁ బరము మూలకారణ మగు; యత్ అక్షరమ్= ఏబ్రహ్మము గలదో అదియు; త్వమ్= నీవే. ఈ తొమ్మిదికారణములచే నిన్నందఱును నమస్కరించుచున్నా రనుట చిత్రము గా దని యర్థము.

ప. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—మహాత్మన్ = మహాత్మశబ్దముచేఁ జెప్పఁ దగినవాఁడా! అనన్త, దేవేశ, జగన్నివాస; తే = ఆసిద్ధులు కపిలాదులు; లేక, తే=నీకొఱకు; కస్మాత్ =ఏకారణమువలన; ననమేరన్=నమస్కారము చేయరు? ఎట్టి నీకొఱకు? బ్రహ్మణో ఒపి = జగత్తును సృజించువానికన్నను; గరీయసే= శ్రేష్ఠతమునికొఱకు; ఆదికర్త్రే= బ్రహ్మదేవునకుఁ గూడ ఆదికర్త యయినవానికొ

అను, ఇఁక నితరులకుఁ గర్తవని చెప్పెడి దేమి? యత్ = ఎందువలన ననఁగా. త్వమ్= నీవు; అక్షరమ్ = బ్రహ్మము వు. సత్ = వ్యక్తము; అసత్ = అవ్యక్తము; వానికన్నను బర మయిన మూలకారణమువు.

రా. యుక్తత్వమునే యుపపాదించుచున్నాఁడు.—మహాత్మన్; తే=నీకొఱకు; బ్రహ్మణోఽపి=హిరణ్యగర్భునకుఁ గూడ; ఆదికర్త్రే = ఆదిభూతుఁడవు కర్తవు నయినవానికొఱకు; హిరణ్యగర్భాదులు, కస్మాత్ =ఏ హేతువువలన; న నమేరన్=నమస్కరింపరు? అనన్త, దేవేశ, జగన్నివాస; త్వమ్=నీవే; అక్షరమ్ = నక్షరతి—నశింపదు కావున జీవాత్మతత్త్వము, "న జాయతే మ్రియతే వా విపశ్చిత్" ఇత్యాది శ్రుతిసిద్ధుఁ డయిన జీవాత్మ గదా నాశము లేనివాఁడు. సత్తును అసత్తును నీవే. సదసచ్ఛబ్దములచేఁ జెప్పఁబడునది కార్యకారణభావంబున నున్న ప్రకృతితత్త్వము. నామరూపవిభాగము గలిగి కార్యావస్థమైనది సత్తు, తదనర్హమై కారణావస్థ మగునది యసత్తు. ఆరెండును నీవే. తత్పరం యత్ = ఆ ప్రకృతికన్నను బ్రకృతిసంబంధియైన జీవాత్మకన్నను పరము—ఇతర మయిన ముక్తాత్మతత్త్వము ఏది గలదో అదియు నీవే.

మా. ఎట్లు యుక్తము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—పూర్ణుఁడును ఆత్మయును గావున మహాత్మ. ఆత్మశబ్దము భారతమునందు నిర్వచింపఁబడినది.—"యచ్చాప్నోతి యదాదత్తే యచ్చాత్తి విషయానిహ। యచ్చాస్య సంతతో భావ స్తస్మా దాత్మేతి భణ్యతే" ♦ అని. తత్పరమ్=సదసత్తులకంటెఁ బరము. "అసచ్చ సచ్చైవ చ యద్విశ్వం సదసతః పరమ్" అని భాగవతమునందు.

త్వమాదిదేవః పురుషః పురాణః
త్వమస్య విశ్వస్య పరం నిధానమ్
వేత్తాఽసి వేద్యంచ పరం చ ధామ
త్వయా తతం విశ్వమనన్తరూప. ౩౮

భా. మఱియు స్తుతించుచున్నాఁడు.—త్వమ్=నీవు; ఆదిదేవః=మొదటిదేవుఁడవు, జగత్తునకు స్రష్ట వగుటవలన. పురాణః=చిరంతనుఁ డగు,

♦ ఎందువలన వ్యాపించుచున్నాఁడో ఎందువలన గ్రహించుచున్నాఁడో ఎందువలన విషయములు భుజించుచున్నాఁడో ఎందువలన నీదేహమునం దితనికి నిత్యసత్త గలదో అందువలన ఆత్మ యని చెప్పఁబడుచున్నాఁడు.

పురుషః=పురుషుఁడవు, పురమునందు శయనించుటవలన. త్వమ్=నీవే; అస్య విశ్వస్య = ఈప్రపంచమునకు; పరమ్=ప్రకృష్ట మయిన; నిధానమ్= నిధీయతే--ఉంపఁబడుచున్నది వీనియందు జగత్తు సర్వంబును మహాప్రల యాదియందు కావున నిధానమవు. మఱియు.—వేత్తా=ఎఱింగినవాఁడవు, సమస్తవేద్యజాతమును గూడ; అసి=అగుచున్నావు. వేద్యంచ = ఏది యెఱుంగఁ దగినదో అదియు; అగుచున్నావు. పరమ్=పరమ మయినది; ధామచ = వైష్ణవం బగు పదమును; అగుచున్నావు. త్వయా = నీచేత; విశ్వమ్=సమస్తమును; తతమ్=వ్యాప్తము. అనన్తరూప=అంతము లేని రూపములు గలవాఁడా! నీరూపముల కంతము లేదు.

నీ వాదిదేవుఁడవు పురాణపురుషుఁడవు, నీవే యీసమస్తజగత్తునకును నిధానభూతుఁడవు, సర్వజ్ఞుఁడవు, జ్ఞేయము గూడ నీవే, పరమం బగు వైష్ణవపదము నీవే. అనంతము లయినరూపములు గలవాఁడా! ఈసమస్తంబును నీచే వ్యాపింపఁ బడి యున్న దని తాత్పర్యము.

**శ్రీ.** అనంతత్వాదులచే భగవంతునకు నమస్కారయోగ్యత్వము చెప్పఁబడి నది. ఇప్పుడు జగత్స్రష్టృత్వాదికముచేఁ గూడ నమస్కారయోగ్యత కల దని స్తుతి ద్వారంబునఁ బ్రదర్శించుచున్నారు త్వమాదిదేవ ఇత్యాదిగా. జగత్తునకు స్రష్ట యగు పురుషుఁడు హిరణ్యగర్భుఁ డనుపక్షమును నిరాకరించుచున్నారు పురాణః అని. స్రష్టృత్వము నిమిత్తమే యని తటస్థేశ్వరవాదులు చెప్పెదరు, వారి నిరాకరించుచు న్నారు త్వ మిత్యాదిగా. మహాప్రలయాదియందు అనుచోటి యాదిపదము అవాం తరప్రలయగ్రహణార్థము. ఈశ్వరునకు రెండువిధంబులను గారణత్వమును సర్వజ్ఞత్వ ముచే సాధించుచున్నారు మఱియు నిత్యాదిగా. వేద్యవేదితృభావముచే నద్వైతా నుపపత్తి యని యాశంకించి చెప్పుచున్నారు వేద్యంచ అని. ముక్తికి ఆలంబన మయిన బ్రహ్మ మర్థాంతర మని యాశంకించి చెప్పుచున్నారు పరమ్ ఇత్యాదిగా. అతఁడు పూర్ణుం డని చెప్పుచున్నారు త్వ యేత్యాదిగా. వ్యాప్యవ్యాపకభావముచే భేదము నా శంకించి యది కల్పిత మగుటవలన భేదము లే దని చెప్పుచున్నారు అనన్తరూప అని.

**హ.** నిధీయతే—ఉంపఁబడుచున్నది దీనియందుఁ గావున నిధానము. వేత్తా= ఎఱుఁగువాఁడవు. ధామ = తేజస్సు. తతమ్=వ్యాపింపఁబడినది.

శం. "బ్రహ్మైవేదం సర్వమ్" ఇత్యాదిశ్రుత్యర్థము నవలంబించి సవిశేషంబును నిర్విశేషంబును సర్వంబును నీవే యని భగవంతుని సర్వాత్మత్వమును బ్రతిపాదించుచున్నాఁడు.—పూర్ణుఁ డగుటవలన పురుషుఁడు. తాను నిర్వికారుఁ డగుటవలన పురాణుఁడు. ఆదిదేవః=జగత్కారణ మగుటవలన ఆది, తనయంతనే దీవ్యతే—ప్రకాశించుచున్నాఁడు కావున దేవుఁడు, ఆదియు దేవుఁడు నగువాఁడు ఆదిదేవుఁడు, మాయోపాధికుఁ డగు పరమేశ్వరుఁడు నీవే యని యర్థము. త్వమ్=నీవే; అస్య=ఈ కనఁబడుచున్న; విశ్వస్య=ప్రపంచమునకు; పరం నిధానమ్=మృత్తికయందు ఘటాదులుం బోలె జలమునందుఁ దరంగాదులుఁ బోలె దేనియందు మహదాదిసర్వవికారంబులును నిధీయన్తే=నిలిచి యుండునో అట్టి నిధానమవు, జగద్బీజ మగు మాయయు నీవే యని యర్థము. వేత్తా=బుద్ధిని తద్వికారము లయిన యహంకార మమకారాదులను వ్యవధానము లేక యెవ్వఁ డెఱుఁగుచున్నాఁడో అట్టి వేత్త, సర్వసాక్షి యగు ప్రత్యగాత్మయును; అసి=నీవే యగుచున్నావు. వేద్యమ్=ఎఱుంగఁ దగినట్టి బుద్ధియు తద్వికారములును మొదలగు సర్వదృశ్యజాతమును; నీవే యగుచున్నావు. మఱియును. పరమ్=సర్వదృశ్యవిలక్షణ మగుటచే సర్వమహత్తమంబును మాయాతత్కార్యలేశసంబంధశూన్యంబును జీవేశజగదాభాసకల్పనాధిష్ఠానంబును నిత్యశుద్ధబుద్ధముక్తస్వభావంబును నిర్విశేషంబును నిరాభాసంబును నిత్యానందైకరసంబును అద్వితీయంబు నగు; తురీయ మయిన యే, ధామ=జ్యోతిస్సు, పరబ్రహ్మము గలదో, అదియును; నీవే యగుచున్నావు. అనన్తరూప=అనంతము—అంతశూన్యము చిదాత్మక మగురూపము గలవాఁడా! ఎందువలన, త్వయా=నీచేత, సద్రూప మగు బ్రహ్మముచేత; భ్రమకల్పిత మగు, విశ్వమ్=ఈ సమస్తమును; తతమ్=వ్యాపింపఁబడినదో, ఏది దేనిచే వ్యాపింపఁబడినదో అది తన్మాత్రమే యను న్యాయముచే నెందువలన నీచే వ్యాప్త మగునిది సమస్తంబును నీవే యగుచున్నావో అందువలన సమస్తమును నీవే, కావుననే యనంతరూపుఁడ వగుచున్నావు, నీ నద్వితీయుఁడ వని యర్థము.

మ. భక్త్యుద్రేకమువలన వెండియు స్తుతించుచున్నాఁడు.—త్వమ్=నీవు; ఆదిదేవః, జగత్తునకు సృష్టిహేతువ వగుటవలన. పురుషః=పూరించువాఁడవు. పురాణః = అనాదివి. త్వమ్; అస్యవిశ్వస్య; పరమ్; నిధానమ్ = లయస్థానమవు, సర్వమును నీయందు నిధీయతే—నిలుచుచున్నది, కావున. ఇట్లు సృష్టిప్రలయస్థాన మగుటచే నుపాదాన మని చెప్పి సర్వజ్ఞత్వముచేఁ బ్రధానమును వ్యావర్తించుచు నిమిత్తకారణత్వమును జెప్పుచున్నాఁడు.—వేత్తా=సర్వమును ఎఱుంగువాఁడవు; అసి=అగు

చున్నావు. ద్వైతాపత్తిని వారించుచున్నాఁడు.—వేద్యంచ = ఎఱుంగఁదగినది యేది గలదో అదియు నీవే యగుచున్నావు వేదనరూపుఁడగు వేదితయందుఁ బరమార్థ సంబంధము లేమిచే వేద్యము సర్వంబును కల్పిత మగుటవలన. కావుననే, పరం ధామ చ=ఏది సచ్చిదానందఘనము అవిద్యాతత్కార్యవిముక్త మగు విష్ణువుయొక్క పరమపద మేది గలదో అదియు నీవే యగుచున్నావు. త్వయా = సద్రూపుఁడవు స్ఫురణరూపుఁడవు నగు కారణమునైన నీచేత; విశ్వమ్ = స్వతస్సత్తాస్ఫూర్తిశూన్యం బగు కార్యము సమస్తమును; తతమ్ = మాయికసంబంధముచేతనే స్థితికాలమునందు వ్యాపింపఁబడినది. అనన్తరూప=ఓ యపరిచ్ఛిన్నస్వరూపుఁడా!

శ్రీ. మఱియును.—త్వమ్; ఆదిదేవః= దేవతలకు మొదటివాఁడవు. ఎందు వలన నీవు, పురాణఃపురుషః = అనాదిపురుషుఁడవో; అందువలన. త్వమ్; అస్య విశ్వ స్య; పరమ్; నిధానమ్ = లయస్థానమవు. అట్లు, విశ్వమును, వేత్తా = ఎఱుంగువాఁ డవు నీవు. మఱియు, వేద్యమ్ = ఎఱుఁగఁ దగినవస్తుజాత మేది గలదో; పరంధామ చ = వైష్ణవపద మేది గలదో; అదియు నీవే యగుచున్నావు. కావున, ఓ యనంత రూపుఁడా! త్వయా = నీచేతనే; విశ్వమ్ = ఈప్రపంచము; తతమ్ = వ్యాపింపఁబడి నది. ఈ హేతువు లేడింటిచేతను నీవే నమస్కార్యుఁడ వని భావము.

వ. దానినే చెప్పుచున్నాఁడు.—ఆదిదేవః = ఆదిభూతుఁ డైన దేవుఁడు, స్థూలసూక్ష్మప్రపంచకారణీభూతుఁ డగు సూత్రాత్మ; నీవే. పురాణః పురుషః = హిరణ్యగర్భుఁడు; నీవే. విశ్వస్య= చరాచరముయొక్క; నిధానమ్ = విరాట్టనుపేరు గల లయస్థానము; నీవే. జీవరూపంబున, వేత్తా = ఎఱుంగువాఁడును; నీవే యగు చున్నావు. అనన్తరూప = ఓ సమష్టిరూపుఁడా! పరంధామ = నివాసస్థాన మయిన బ్రహ్మాండము; విశ్వమ్; త్వయా; తతమ్ = విస్తరింపఁబడినది. అదియు నీవే. నీవొక్కఁ డవే యిట్లు నిరూపించినప్రకారంబుల వర్తించుచున్నా వని యర్థము. శ్రుతియు ను.—“ యోనః పితా జనితా యో విధాతా ధామాని వేద భువనాని విశ్వా। యో దేవానాం నామధా ఏకఏవ తం సంప్రశ్నం భువనా యన్త్యన్యే ” అని. భాష్య ము.—యః = ఎవ్వఁడు; నః = మాకు; పితా = బీజరూపుఁడు సూత్రసంజ్ఞుఁ డగు; జనితా = నిర్మించువాఁడో, సూక్ష్మభూతరూపుఁ డైన హిరణ్యగర్భుఁడో; అంత స్థూలభూతములచే, విదధాతి— నిర్మించువాఁడు కావున, విధాతా = విరాట్టో; అంత, విశ్వా = సమస్తము లయిన; ధామాని = శరీరములను; భువనాని = భూర్భువస్సువ

రాదులను; జీవరూపంబున, వేద=ఎవ్వఁ డెఱుంగుచున్నాఁడో. యః=ఎవఁడు; దేవానామ్ = దేవతలయొక్క; నామధాః = సూత్రాదినామముల ధరించువాఁ డైనను; ఏక ఏవ = ఒక్కఁడే యగునో; తమ్ = ఇట్టి యతని; భువనా = చరాచరాదులు; సంప్రశ్నం యన్తి = ఎట్టివాఁడు పరమేశ్వరుఁ డని ప్రశ్న చేయుచున్నవి. ఇఁక నీ చెప్పినయర్థమునకు విలోమముగా శ్రుతియే ప్రశ్నమున కుత్తరము చెప్పుచున్నది.—« ఏకపా ద్భూయో ద్విపదో విచక్రమే ద్విపా త్త్రిపాద మభ్యేతి పశ్చాత్। చతుష్పాదేతి ద్విపదా మభిస్వరే సంపశ్యన్ పఙ్క్తీ రుపతిష్ఠమానః » అని. భాష్యము.—« జీవో బ్రహ్మైక పాదమ్ " అని చెప్పి యుండుటవలన, ఏకపాత్ = జీవుఁడు; భూయః=ఆభాసాదులచే; ద్విపదః = విరాడ్రూపమును; ప్రచక్రమే = పొందుచున్నాఁడు. పశ్చాత్ = పిమ్మట; ద్విపాత్ = విరాట్టు; త్రిపాదమ్ = హిరణ్యగర్భాఖ్యమును; అభ్యేతి = పొందుచున్నాఁడు, « త్రిపా దూర్ధ్వ ఉదైత్ " అను శ్రుతివలన. అదియు, చతుష్పాత్ = పూర్ణబ్రహ్మమును; ఏతి = పొందుచున్నది. ఇట్లు, ద్విపదామ్ = మనుష్యులయొక్క; అభిస్వరే = హృదయాకాశమునందు; పఙ్క్తీః = ఏకపాదాదిపంక్తులను; సంపశ్యన్ = సాక్షియై చూచుచు; ఉపతిష్ఠమానః – అధిష్ఠించి యున్నవాఁడై యెవ్వఁ డున్నాఁడో అతఁడే పరమేశ్వరుఁ డని యర్థము.

రా. అందువలన.—త్వమ్; ఆదిదేవః. పురుషః పురాణః. త్వ మస్య విశ్వస్య పరం నిధానమ్—నిలుచుచున్నది నీయందు విశ్వము కావున నీ వీ విశ్వమునకుఁ బరమనిధానమవు, శరీరభూత మయిన విశ్వమున కాత్మ వగుటచేఁ బరమాధారభూతుఁడవు నీవే యని యర్థము. జగత్తునందు సమస్తవేదితయు సర్వవేద్యంబును నీవే. ఇట్లు సర్వమునకు నాత్మ వై యున్న నీవే, పరమ్; ధామచ = స్థానంబును, ప్రాప్యస్థానము గూడ నని యర్థము. త్వయా విశ్వం తతమ్—ఆత్మ వగుటం జేసి నీచే చిదచిన్మిశ్రం బగు జగత్తు వ్యాపింపఁబడినది. అనన్తరూప.

మూ. •

వాయు ర్యమో ఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః
ప్రజాపతి స్త్వం ప్రపితామహ శ్చ
నమో నమ స్తే ఽస్తు సహస్రకృత్వః
పున శ్చ భూయో ఽపి నమో నమ స్తే. ౩౯

• ౩౮, ౩౯, ౪౦, ౪౧—ఈ శ్లోకములకు మాధ్వభాష్యము లేదు.

భా. మఱియును.—వాయుః=వాయువును; యమః = యముఁడును; అగ్నిః=అగ్నియును; వరుణః = వరుణుఁడును; శశాఙ్కః=చంద్రుఁడును; ప్రజాపతిః=కశ్యపాదిప్రజాపతియును; త్వమ్=నీవు. ప్రపితామహశ్చ=పితామహునకు పిత ప్రపితామహుఁడు, బ్రహ్మదేవునకును తండ్రి నీవే యని యర్థము. నమః=నమస్కారము; నమః=నమస్కారము; సహస్రకృత్వః=వేయిమాఱులు; తే=నీకొఱకు; అస్తు=అగుఁగాక. పునశ్చ = మరలను; భూయోఽపి = వెండియును; తే=నీకొఱకు; నమః నమః=నమస్కారము నమస్కారము. పలుమాఱు నమస్కారాభ్యాసావృత్తిగణనము కృత్వసుచ్చు • చెప్పుచున్నది. పునశ్చ భూయోఽపి అనునది శ్రద్ధాభక్త్యతిశయమువలనబుద్ధియొక్క యపరితోషమును దెలుపుచున్నది.

వాయువును యముఁడును అగ్నియును వరుణుఁడును చంద్రుఁడును ప్రజాపతియును—ఈదేవత లందఱును నీవే. లోకపితామహుఁ డగు బ్రహ్మదేవునకుఁ దండ్రి నీవు. నీకు నమస్కారము, నమస్కారము, వేయిమాఱులు నమస్కారము చేసెదను, వెండియు వెండియు నీకుఁ బలుమాఱు నమస్కారము చేయుచున్నా నని తా.

ఆ. అతఁడు సర్వాత్ముఁ డనుటకు మఱియొకహేతువుఁ జెప్పుచున్నారు మఱియును అని. కశ్యపాది యనుచోటి యాదిశబ్దముచే విరాడ్దక్షాదులు గ్రహింపఁబడుచున్నారు. పితామహః=బ్రహ్మదేవుఁడు, వానికిఁ బిత సూత్రాత్ముఁడును అంతర్యామియు నని చెప్పుచున్నారు బ్రహ్మదేవునకును ఇత్యాదిగా. సర్వదేవతలును నీవే యని చెప్పుటకు ఫలితముఁ జెప్పుచున్నారు నమః ఇత్యాదిగా. సహస్రకృత్వః అను చోటి కృత్వసుచ్చుచే వివక్షిత మయినయర్థమును జెప్పుచున్నారు పలుమాఱు ఇత్యాదిగా. పునరుక్తితాత్పర్యముఁ జెప్పుచున్నారు పునశ్చ ఇత్యాదిగా. శ్రద్ధాభక్తుల యతిశయమువలన నమస్కారము చేసినను తనబుద్ధికి అపరితోషము—చాలు నను తలంపు లేకుండుట, దానిఁ దెలుపుటకై పునరుక్తి యని యర్థము.

హ. ప్రజాపతిః=దక్షుఁడు; పితామహుఁడు—బ్రహ్మ, వానికిని పిత ప్రపితామహుఁడు.

శం. ఎందువలన నిట్లో అందువలన సర్వంబును నీవే యని "త్వం యజ్ఞస్త్వం విష్ణుస్త్వం వషట్కారః" ఇత్యాది శ్రుతిప్రసిద్ధ మగునర్థమును ప్రతిపాదించు

• సహస్రకృత్వః అనుచోటి కృత్వః అనునది.

చున్నాఁడు.—వాయువును యముఁడును అగ్నియును వరుణుఁడును, శశాఙ్కః = చంద్రుఁడును; ప్రజాపతిః=సర్వలోకపితామహుం డగు చతుర్ముఖుఁడును; ప్రపితామహశ్చ= వానికిని జనకుఁ డగు విష్ణువును; త్వమ్—నీవే యని యర్థము. ఇట్లు సర్వంబును నీవే యని భగవంతుని సర్వాత్మభావమును సార్ధశ్లోకముచేఁ బ్రతిపాదించి యిప్పుడు శ్రద్ధాభక్తివేగంబున సర్వాత్ముఁ డగు పరమేశ్వరుని నమస్కరించుచున్నాఁడు సార్ధశ్లోకము చేత నమో నమస్తే ఇత్యాదిగా. అర్థము స్పష్టము.

మ. వాయు ర్యమో ఽగ్ని ర్వరుణ శ్శశాఙ్కః—సూర్యాదులకును ఉపలక్షణం బిది. ప్రజాపతిః= విరాట్టును హిరణ్యగర్భుఁడును; ప్రపితామహశ్చ= హిరణ్యగర్భునితండ్రియు; త్వమ్=నీవు. ఎందువలన నిట్లు సర్వదేవాత్మకుండ వగుటవలన నీవే యందఱిచేతను నమస్కార్యుఁడ వగుచున్నావో అందువలన అల్పుఁడ నగు నాయొక్కయు, నమో నమః—నమస్కారములు; తే = నీకొఱకు; అస్తు; సహస్రకృత్వః = వేయిమాఱులు. పునశ్చ భూయో ఽపి = వెండియు మాటిమాటికి; నమో నమస్తే. భక్తిశ్రద్ధాతిశయంబున నెన్నినమస్కారములు చేసినను దనివి లేమి యీనమస్కారావృత్తిచే సూచింపఁబడుచున్నది.

శ్రీ. ఇందువలనఁ గూడ నీవే యందఱిచేతను నమస్కార్యుఁడవు, సర్వదేవాత్మకుఁడ వగుటవలన, అని స్తుతించుచుఁ దానును నమస్కరించుచున్నాఁడు.—వాయ్వాదిరూపుఁడవు నీ వని సర్వదేవాత్మకత్వ ముపలక్షించుటకై చెప్పఁబడినది. ప్రజాపతిః= పితామహుఁడు. వానికిని జనకుఁడ వగుటవలనఁ బ్రపితామహుఁడవు నీవు. అందువలన, తే= నీకొఱకు; సహస్రకృత్వః= వేయిమాఱులు, నమః అస్తు. భూయో ఽపి= వెండియు; వేయిమాఱులు, నమోనమః అని భక్తిశ్రద్ధాభరాతిరేకంబున నమస్కారములయందుఁ దృప్తి నొందనివాఁడై పెక్కుమాఱులు ప్రణమిల్లుచున్నాఁడు.

ప. ఇఁక, అనంతరూపత్వమునే ప్రకటించుచున్నాఁడు.—వాయువు మొదలగు నేడుగురు దేవతలరూపమున నీవే యున్నావు. అట్టి నీకొఱకు, నమో నమో ఽస్తు. వీప్సయాదరార్థకము. సప్తరూపాత్ముఁడవుమాత్రమా నీవు? సహస్రకృత్వః = సహస్రరూపాత్ముఁడ వగు నీకొఱకు; భూయో ఽపి నమో నమః.

రా. అందువలన నీవే వాయ్వాదిశబ్దవాచ్యుఁడ వని చెప్పుచున్నాఁడు.—అందఱకును బ్రపితామహుఁడు నీవే. సర్వప్రజలకును తండ్రులుప్రజాపతులు, ప్రజాపతులకుఁ దండ్రి హిరణ్యగర్భుఁడు ప్రజలకుఁ బితామహుఁడు, హిరణ్యగర్భునకును

దండివి నీవు ప్రజలకుఁ బ్రపితామహుఁడవు. పితామహాదుల కాత్మ వగుటచే తత్త చ్ఛబ్దవాచ్యుఁడవు నీవే యని యర్థము. అత్యద్భుతప్రకారుం డగు భగవంతుం జూచి హర్షోత్ఫుల్లనేత్రుండై యత్యంతభయంబున వినమ్రుండై యంతటను నమస్కరించు చున్నాఁడు రెండుశ్లోకార్థముల చేత.

నమః పురస్తా దథ పృష్ఠత స్తే
నమో ఽస్తు తే సర్వత ఏవ సర్వ
అనన్తవీర్యామితవిక్రమ స్త్వం
సర్వం సమాప్నోషి తతో ఽసి సర్వః. ౪౦

**భా.** అట్లు.—పురస్తాత్ = పూర్వదిక్కునందు; నమః=నమస్కారము. అథ = మఱియు; పృష్ఠతః = పశ్చిమదిక్కునందును; తే = నీకొఱకు; నమస్కారము. సర్వతఏవ = సర్వదిక్కులయందును; ఉన్నట్టి, తే = నీకొఱకు; నమః అస్తు = నమస్కార మగుఁగాక. సర్వ= ఓసర్వుఁడా! అనన్తవీర్యామితవిక్రమః = అనంత మైనవీర్యము గలవాఁడవు అమిత మయిన విక్రమము గలవాఁడవు, వీర్య మనఁగా సామర్థ్యము, విక్రమ మనఁగా పరాక్రమము, వీర్యవంతుఁ డైనను ఒకానొకఁడు శస్త్రాదివిషయంబునఁ బరాక్రమింపఁడు, మందపరాక్రముఁడు గాని యగుచున్నాఁడు, నీవో అనంతవీర్యుఁడవును అమితవిక్రముఁడవును; అట్టి, త్వమ్=నీవు; సర్వమ్=సమస్తమయినజగతును; సమాప్నోషి = చక్కగా ఒక్కఁడవే వ్యాపించుచున్నావు, ఎందువలననో; తతః=అందువలన; సర్వః=సర్వుఁడవు; అసి=అగుచున్నావు. నీవు దక్క మఱి యేదియు లే దని యర్థము.

నీకుఁ బూర్వదిక్కునందు నమస్కారము, పడమరను గూడ నీకు నమస్కారము, అట్లు సర్వదిక్కులయందును తత్తత్స్వరూపంబున సర్వరూపుఁడవై యున్న నీకు నమస్కారము. ఓ సర్వస్వరూపుఁడా! నీవు అనంత మయినవీర్యంబును అమిత మైనపరాక్రమంబును గలవాఁడవై, సర్వజగత్తును నీ వొక్కఁడవే వ్యాపించి యున్నావు, కావున సర్వంబును నీవే యని తాత్పర్యము.

**అ.** మఱియొకవిధంబున భగవంతుని స్తుతించి నమస్కరించుచు నభిముఖీకరించుచున్నాఁ డని చెప్పుచున్నారు అట్లు అని. ఏదిక్కునందు నూర్యుఁ డుదయిం

చుచున్నాఁడో అది పూర్వదిక్కు. ఆదిక్కునందు వ్యవస్థితమై యున్నది సర్వంబును నీవే, అట్టి నీకు నమస్కారం బగు చెప్పుచున్నాఁడు పురస్తా దిత్యాదిగా. అథశబ్దము సముచ్చయార్థకము. పశ్చిమదిక్కునం దున్నదియు సర్వంబును నీవే, అట్టి నీకు నమస్కార మని చెప్పుచున్నాఁడు అ థేత్యాదిగా. అధిక మేల? ఎన్నిదిక్కులు గలవో వానియం దంతటను ఏది వర్తించుచున్నదో అది యశేషంబును నీవే, అట్టి నీకు నమస్కారం బగుఁ గాక యని చెప్పుచున్నాఁడు సర్వతఏ వేత్యాదిగా. ఫలిత మయిన సర్వాత్మభావమును సూచించుచున్నాఁడు సర్వ అని. వీర్యవిక్రమములకుఁ బౌనరుక్త్యము లే దని చెప్పుచున్నారు వీర్యము ఇత్యాదిగా. వీర్యవంతునకు విక్రమము నిశ్చయముగా నుండుటవలన నర్థపౌనరుక్త్యము కాఁగల దని యాశంకించి చెప్పుచున్నారు వీర్యవంతుఁడు ఇత్యాదిగా. భగవంతునందు లోకముకంటె విశేషము చెప్పుచున్నారు నీవో ఇత్యాదిగా. చెప్పినసర్వాత్మత్వమును బ్రపంచించుచున్నారు సర్వమిత్యాదిగా. సప్రపంచత్వమును వారించుచున్నారు నీవుదక్క ఇత్యాదిగా.

హ. పురస్తాత్ = ముందట. పృష్ఠతః=వెనుక. సర్వతః= ముందరను పార్శ్వములయందును వెనుకను. అనన్తవీర్య = అనంత మైనవీర్యము గలవాఁడా! అమితము-అపరిచ్ఛిన్న మయినవిక్రమము-పరాక్రమము గలవాఁడ వగు; త్వమ్ = నీవు; సర్వమును వ్యాపించుచున్నావు అందువలన సర్వంబును నీవే యగుచున్నావు.

శం. భక్తివేగముచేఁ గలిగిన సంతోషాతిశయంబున స్తుతించుచు వెండియు సర్వదిక్కులందును నమస్కరించుచున్నాఁడు.—సర్వ= ఓసర్వాత్ముఁడా! సర్వాత్ముఁడ వగు, తే= నీకొఱకు; పురస్తాత్ అథపృష్ఠతః = తూర్పునను పడమరను; నమః. సర్వతః= అంతటను; తే నమః అస్తు, సర్వ అని విశేషణము చేయుటవలన సర్వాత్మునకుఁ బ్రాగాదిదిగ్విభాగము సంభవింపదు వాస్తవమే, దిగ్విభాగమునకు హేతు వగు సూర్యుఁడును సర్వాత్మునియం దంతర్భవించుటవలన, అయినను నమః పురస్తాత్ అని స్వదృష్టిచేఁ జెప్పఁబడినది, కాని వస్తుగతిచేఁ గాదు. సర్వ అని నామముచేఁ జెప్పఁబడినది గాని యర్థముచేఁ గా దని యెంతమాత్రము తలంపఁగూడదు, అల్లయినచో "అనన్త జగన్నివాస త్వ మాదిదేవః" ఇత్యాదివాక్యములయర్థమునకు వ్యాఘాతము సంభవించుటవలన. కావుననే సర్వశబ్దార్థమును అనన్తేత్యాదికముచేఁ దానే నిర్వర్తించి తత్సిద్ధికి హేతువుఁ జెప్పుచున్నాఁడు.—అనన్తవీర్యామితవిక్రమః = అంతటను విశేషించి ఈరయితుమ్-ప్రసరింపఁజేయుటకు యోగ్యము వీర్యము- తేజస్సు, విక్రమశబ్దముచే వ్యాపనశీలత్వము చెప్పఁబడుచున్నది, అనంత మయినవీర్యము గలవాఁ

డును అమిత మయినవిక్రమము గలవాఁడును, విశేషణోభయపదకర్మధారయము; హేతుగర్భం బీవిశేషణము, అనంతవీర్యుఁడవును అమితవిక్రముఁడవు నగుటవలన, త్వమ్= నీవు; సర్వమ్= సమస్తజగత్తును; ఎంతువలన, సమాప్నోషి= వెలుపలను లోపలను అంతటను మృత్తిక ఘటాదికములనువలె వీర్యముచే—తేజస్సుచేతను స్ఫూర్తిచేతను విక్రమముచే— సత్తచేతను చక్కఁగా వ్యాపించి యున్నావో; తతః = అందువలననే; సర్వః అసి—సర్వాత్మకుఁడ వగుచున్నా వని యర్థము. ఇందుచే, "నామరూపాత్మక మయినజగత్తు సర్వంబును నీవే, నీకంటె నితరం బణుమాత్రమైనను నిరాత్మక మగుట వలన నిరూపింప శక్యము గాదు" అని సూచింపఁబడినది.

మ. నీకొఱకు; పురస్తాత్=అగ్రభాగమునందు; నమః. అథశబ్దము సముచ్చయార్థము. పృష్ఠమునందుఁ గూడ నీకు నమస్కారము. సర్వతఏవ= సర్వదిక్కులయందును; ఉన్నట్టి, తే=నీకొఱకు; నమో ఽస్తు. ఓసర్వుఁడా! వీర్యము—శారీర బలము, విక్రమము శిక్షా శస్త్రప్రయోగకౌశలము, "ఏకం వీర్యాధికం మన్య ఉతైకం శిక్షయా ఽధికమ్" * అని చెప్పియుండుటవలన భీమదుర్యోధనులయందును ఇతరులయందును ఒక్కొకటి వ్యవస్థితము, నీవో అనంతవీర్యుఁడవును అమితవిక్రముఁడవును; సమాసముచే నొక్కపదము; అనన్తవీర్య అనిసంబోధన మయినను గావచ్చును. సర్వమ్=జగత్తును సమస్తంబును; సమాప్నోషి=చక్కఁగా నొకటై సర్వాత్మక మైనస్వరూపముచే వ్యాపించుచున్నావు. తతః = అందువలన; సర్వః అసి—నీకంటె వ్యతిరిక్త మేదియు లే దని యర్థము.

శ్రీ. మఱియును—సర్వ=ఓసర్వాత్మకుఁడా! సర్వతఏవ=సర్వదిక్కులయందును; తే నమో ఽస్తు. సర్వాత్మకత్వము నుపపాదించుటకై చెప్పుచున్నాఁడు.—అనంత మైనవీర్యము—సామర్థ్యము గలవాఁడవు, అమిత మయినవిక్రమము—పరాక్రమము గలవాఁడవు. ఇట్టి నీవు, సర్వమ్=సమస్తమును; సమాప్నోషి=చక్కఁగా—లోపలను వెలుపలను వ్యాపించుచున్నావు; సువర్ణము కటకకుండలాదికములను బోలెఁ స్వకార్యములను వ్యాపించి యున్నావు. అందువలన సర్వస్వరూపుఁడ వగుచున్నావు.

ప. అపరిచ్ఛిన్నుఁడ వైనను నీకు నమస్కారం బని రథంతరసామాభిప్రాయంబున నమస్కరించుచున్నాఁడు.—ఓ సర్వాత్మకుఁడా! పురస్తాత్ = అగ్రము

* ఒక్కని—భీముని వీర్యముచే నధికునిఁగాను మఱియొకని—దుర్యోధనుని శిక్షచే—నేర్పుచే నధికునిఁగాను ఎంచుచున్నాను.

నందును; పృష్ఠమునందును, తే=నీకొఱకు; నమః. రెండుదిక్కులయం దున్నవానికి మాత్రమే కాదు, మఱేమనఁగా, సర్వత ఏవ = సర్వదిక్కులయందును ఉన్ననీకు; నమో అస్తు. ఇఁక దృశ్యమాత్రుఁడవై యున్నవాఁడవు మాత్రమే కావు అని చెప్పుచున్నాఁడు.—ఓ స్వామీ! అనంతవీర్యుఁడవై యమితవిక్రమబలౌజస్సులతోఁ గూడిన వాఁడవు. శ్రుతియును.—« విష్ణోర్నుకం వీర్యాణి ప్రవోచం యః పార్థివాని విమమే రజాంసి » అని. భాష్యము.—నుక మ్మను నిపాతము అవధారణార్థము. అట్టి, విష్ణోః= విష్ణువుయొక్క; వీర్యాణి = వీర్యములను; ప్రవోచమ్ = చెప్పుచున్నాను. ఎట్టివాని యొక్క? యః=ఎవ్వఁడు; పార్థివాని=పృథివ్యంతరిక్షసంబంధు లగు; రజాంసి=లోకములను; విమమే = నిర్మించెనో అట్టి విష్ణువుయొక్క. ఇట్లు, త్వమ్=నీవు; సర్వమ్; సమాప్నోషి= లోపలను వెలుపలను వ్యాపించి యున్నావు. తతః= ఆకారణముచేత; సర్వః అసి=సర్వాత్మకుఁడ వగుచున్నావు, « తదన్తరస్య సర్వస్య తదు సర్వస్యాస్య బాహ్యతః " * అను శ్రుతివలన. అట్లు రథంతరసామము గూడ.—« అభిత్వా శూర నోనుమో ఽదుగ్ధా ఇవ ధేనవః । ఈశాన మస్య జగతః స్వర్దృశ మీశాన మిన్ద్ర తస్థుషః » అని దాని సంహితాపాఠము. భాష్యము.—« ఇన్ద్ర = ఓపరమాత్ముఁడా! శూర = శత్రువధము చేయువాఁడా! మేము; త్వా = నిన్ను; అభి = అంతటను; నోనుమః=నమస్కరించుచున్నాము. ఎట్టి నిన్ను? అస్య జగతః = ఈ జంగమమునకును; తస్థుషః=స్థావరమునకును; ఈశానమ్=నియామకుని; స్వర్దృశమ్ = జగత్ప్రకాశకుని. ఈశాన మ్మనుపదమున కావృత్తి యాదరార్థము. వేనివలె నమస్కరించుచున్నాము? అదుగ్ధాః=పాలుపిదుకని యట్టి; ధేనవఇవ=ఆవులవలె. ఎట్లు క్షీరము పూర్ణముగాఁ గలవై గోవులు దూడలను విడిచి నిన్నుఁ జేరుచున్నవో అట్లు మేమును విషయజాతమును సర్వంబును విడిచి సర్వగతుండ వగు నిన్ను నమస్కరించుచున్నాము. అట్లాపస్తంబశాఖయందును.—« అగ్నినా దేవేన పృతనా జయామి గాయత్రేణ చ్ఛన్దసా త్రివృతా స్తోమేన రథన్తరేణ సామ్నా వషట్కారేణ వజ్రేణ పూర్వజాన్భ్రాతృవ్యా నధరా న్పాదయామి " అని. భాష్యము.—అగ్నినా=విశ్వరూపునిచేత; దేవేన=దీవ్యమానుఁ డగువానిచేత; పృతనాః = శత్రుసేనలను; జయామి = జయించుచున్నాను. శేషము స్పష్టము.

రా. అనన్తవీర్య=అపరిమితమయినవీర్యము గలవాఁడా! అమితవిక్రమః= అపరిమితమయినపరాక్రమము గల; త్వమ్=నీవు; సర్వమ్=సమస్తమును; ఆత్మ వగు

* ఈ సర్వప్రపంచమునకును లోపల నదియే యున్నది, వెలుపలను అదియే యున్నది.

టచే; సమాప్నోషి=వ్యాపించుచున్నావు. తతః సర్వః అసి—ఎందువలన నీవు సమస్తమయిన చిదచిద్వస్తుజాతమును ఆత్మనై వ్యాపించి యున్నావో అందువలన చిదచిద్వస్తుజాతము సమస్తమును నీశరీర మగుటచే నీకు విశేషణ మగుటవలన సర్వమును విశేషణముగాఁ గల నీవే సర్వశబ్దవాచ్యుఁడ వగుచున్నా వని యర్థము. "త్వ మక్షరం సదసత్, వాయు ర్యమో ఽగ్నిః" ఇత్యాదిగా సర్వసామానాధికరణ్యనిర్దేశమునకు ఆత్మభావంబున వ్యాపించి యుండుటయె హేతు వని స్పష్టముగాఁ జెప్పఁబడినది, "త్వయా తతం విశ్వ మనన్తరూప, సర్వం సమాప్నోషి తతో ఽసి సర్వః" అని.

సఖేతి మత్వా ప్రసభం యదుక్తం
హే కృష్ణ హే యాదవ హే సఖేతి
అజానతా మహిమానం తవేదం
మయా ప్రమాదా త్ప్రణయేన వా ఽపి. ౪౧

యచ్చా ఽవహాసార్థ మసత్కృతో ఽసి
విహారశయ్యాసనభోజనేషు
ఏకో ఽథవా ఽ ప్యచ్యుత తత్సమక్షం
తత్క్షామయే త్వా మహ మప్రమేయమ్. ౪౨

భా. ఎందువలన నేను నీమాహాత్మ్యము నెఱుంగక యపరాధి నైతినో అందువలన.—సఖా=సమాన మయినవయస్సు గలవాఁడవు; ఇతి=అని; మత్వా=తలఁచి; తవ=నీయొక్క ఈశ్వరునియొక్క; ఇదమ్ = విశ్వరూపమును; మహిమానమ్ = మాహాత్మ్యమును; తవ ఇద మ్మహిమానమ్—నీయొక్క విశ్వరూపం బను మాహాత్మ్యము నని వ్యధికరణముగా నన్వయము; తవేమమ్ అని పాఠము కలదేని అప్పుడు సమానాధికరణముగానే యన్వయం బగును; అజానతా=ఎఱుంగనివాఁడను, మూఢుఁడ నగు; మయా=నాచేత; ప్రమాదాత్ = విక్షిప్తచిత్తత ♦ వలనఁ గాని; ప్రణయేన వా ఽపి = ప్రణయం బనఁగా స్నేహమువలనఁ గలుగు విశ్వాసము, ఆ కారణముచేతఁ గాని; హే కృష్ణ=ఓ కృష్ణుఁడా! హే యాదవ=ఓ యాదవా! హే సఖే=ఓ చెలీ! ఇతి=అని; ప్రసభమ్ = విపరీతబుద్ధిచే నభిభ

♦ మనస్సు కలఁగి యుండుట.

పించి, బలాత్కరించి; యత్ =ఏది; ఉక్తమ్ = చెప్పఁబడినదో. మఱియును.—అవహాసార్థమ్ = పరిహాసముకొఱకు; విహారశయ్యాసనభోజనేషు= విహార మనఁగా విహరణము పాదావ్యాయామము *, శయ్యా అనఁగా పాన్పు, ఆసన మనఁగా పీఁట, భోజన మనఁగా భుజించుట—వీనియందు; ఏకః=పరోక్షుఁడనై ♦; అసత్కృతః = పరిభవింపఁబడినవాఁడవు; అపిచ యత్ =అగుచున్నా వనునదియు నేది గలదో; అథవా ఉపి=మఱియును; అచ్యుత=ఓయచ్యుతుఁడా! తత్ =అట్లు; ఇది క్రియావిశేషణార్థము; సమక్షమ్=ప్రత్యక్షముగాఁ గాని; అసత్కృతో ఉసిచ యత్ =పరిభవింపఁబడితి వనునదియు నేది గలదో; తత్ = ఆయపరాధజాతమును సమస్తమును; అహమ్= నేను; అప్రమేయమ్= ప్రమాణాతీతుఁడ వగు; త్వామ్= నిన్ను; క్షామయే= క్షమింపఁ జేసికొనుచున్నాను.

నీవు నాయీడువాఁడ వని తలఁచి నీ యీమహిమను నెఱుంగక మూఢుఁడనై బుద్ధి చెడి గాని స్నేహంబునఁ గాని నిన్నుఁ దక్కువ చేసి కృష్ణా యాదవా సఖుఁడా యని పలికితిని, మఱియు, నిన్నుఁ బరిహాసముకొఱకు విహరించునప్పుడును బరుండునప్పుడును గూర్చుండునప్పుడును భోజనకాలమునందును నీపరోక్షంబునఁ గాని ప్రత్యక్షంబునఁ గాని, ఓ యచ్యుతా! నిన్నవమానించి యున్నాను, ఆ నాయపరాధ మంతయు నప్రమేయుండ వగు నీవు క్షమింపవలయు నని వేఁడుచున్నా నని తాత్పర్యము.

ఆ. అజ్ఞానముచేఁ జేసినయపరాధమును క్షమింప వేఁడుచున్నాఁ డని చెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ఇదంశబ్దార్థముఁ జెప్పుచున్నారు విశ్వరూపము నని. ఇద మ్మనుదానికిని మహిమాన మ్మనుదానికిని సామానాధికరణ్యము సంభవింపదు లింగవ్యత్యాసమువలన నని చెప్పుచున్నారు త వేద మిత్యాదిగా. పాఠాంతరము సంభవించునెడ సామానాధికరణ్య ముపపన్న మగు నని చెప్పుచున్నారు త వేమ మిత్యాదిగా. ఏది చెప్పఁబడినదో దాని క్షమింపఁజేయుచున్నా నని మీఁది శ్లోకముతో సంబంధము. అయుక్త మేది చెప్పఁబడినదో దాని క్షమింపవలయు నని మాత్రమే కాదు, మ త్తే మనఁగా, పరిహాసార్థము క్రీడాదిసమయములయందు నేఁ

* నడచుట యనుట.

♦ నీ వేకాంతమున నొంటరిగా నున్నప్పు డనుట.

జేసిన తిరస్కారమును గూడ క్షమింపవలయు నని చెప్పుచున్నాఁడని చెప్పుచున్నారు మఱియును అని. విహారణము—క్రీడ, లేక, వ్యాయామము. పీఁట—ఇది సింహాసనాదుల కుపలక్షణము. విషయభూతము లయిన వీనియం దని యర్థము. ఏకశబ్దము ఏకాంతమున నున్న యేకాకిని విచించుచున్న దని చెప్పుచున్నారు పరోక్షుఁడవై యని. ప్రత్యక్షముగాఁ గాని పరోక్షముగాఁ గాని అట్లు—పరిభవం బగునట్లు అని యోజన నంగీకరించి చెప్పుచున్నారు ఇది క్రియావిశేషణార్థము అని. క్షమింపఁ జేసికొనుచున్నా ననుటకు అపరిమితత్వము హేతు వని చెప్పుచున్నారు అప్రమేయ మ్మని.

హ. సఖేతి—ఇట సఖే ఇతి అనుచో పరలోపము * ఎఱుంగునది. ఏకః= అసహాయుఁడవై. సమక్షమ్=బహుజనసమక్షముగా. క్షామయే = ప్రసాదింపఁజేయుచున్నాను.

శ్లో౦. ఇట్లు స్తుతించి నమస్కరించి మున్ను తాఁ జేసినయపరాధమును క్షమింపఁ గోరుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—తవ= అపరిమిత తేజోబలవీర్యసమగ్రైశ్వర్యసంపన్నుఁడవు సర్వోత్తముఁడవు సృష్ట్యాదికర్త వగు నీయొక్క; ఇదమ్= ఈ కనఁబడుచున్న; మహిమానమ్=విశ్వాత్మక మయినస్వరూపమును; అజానతా; తెలియనివాఁడ నగు; మయా=నాచేత; సఖేతి=నా కితఁడు స్నేహితుఁడు మేనమామకుమారుఁడు అని; మత్వా=తలఁచి; హేకృష్ణ హేయాదవ హేసఖే; ఇతి=అని; ప్రమాదాత్= ఏమఱుపాటువలనఁ గాని; ప్రణయేన వా అపి=స్నేహముచేఁ గాని; ప్రసభమ్=హఠము వలన; నానావిధ మయినవాక్యము; యత్=ఏది; ఉక్తమ్. తత్ క్షామయే=దానినంతయు క్షమింపవలయు నని ప్రార్థించుచున్నా నని మీఁదిశ్లోకముతో సంబంధము. ఇట హేసఖేతి యనుచో సంధియార్షము. మహిమానంతవేద మ్మని ప్రచురమైనపాఠము. తవేమ మ్మని పాఠాంతరము గూడఁ గలదు. ఇదం మహిమాన మ్మనుచో ఇదం పదమునకు మహిమాన మ్మనుదానికిని «కన్యేయం కులభూషణమ్» అనుచోటం బోలె లింగవ్యత్యయంబున సామానాధికరణ్యము. తవేమ మ్మనుపాఠమునందు విచారము లేదు. మఱియును—అచ్యుత=నచ్యవతే—సదా యేకరూపంబున అవిక్రియరూపంబున కూటమువలె నున్నాఁడు కావున అచ్యుతుఁడు, ఓపరమాత్మా! విహారశయ్యాసనభోజనేషు= విహారము—క్రీడ, శయ్యా—పరుండుట, ఆసనము = సింహాసనాదులయందుఁ గూర్చుండుట, భోజనము—అన్నోదకాదుల గ్రహించుట, వీనియందు; నీవు ఏకః=ఏ

* ఇకారలోపము.

కాంతమున నొంటిగా నున్నవాఁడవైగాని; అథవా=లేక; తత్సమక్షమ్=పెక్కండ్రయెదుటఁ గాని; నాచేత మేనమామకుమారుఁడ వనుతలంపుచేత, అవహాసార్థమ్ = పరిహాసముకొఱకు; యచ్చ=ఎంతెంత; అసత్కృతః అసి=అవమానింపఁబడినవాఁడ వయితివో; తత్=ఆయపరాధజాతము సమస్తమును; అప్రమేయమ్=అచింత్య మయినమహిమము గల పరమేశ్వరుని; త్వామ్ = నిన్ను; క్షామయే—క్షమింపు మని ప్రార్థించుచున్నా నని యర్థము.

మ. నేను నీమాహాత్మ్యము నెఱుంగక యెల్లప్పుడు నపరాధములఁ జేయుచుంటిని, కావునఁ బరమకారుణికుండ వగు నిన్ను నమస్కరించి నాయపరాధముల క్షమింపు మని వేఁడుచున్నా నని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—నీవు నాకు, సఖా= సరియీడువాఁడవు; ఇతిమత్వా=అని తలంచి; తవ= నీయొక్క; ఇదమ్=ఈవిశ్వరూపమును; మహిమానమ్=ఐశ్వర్యాతిశయమును; ఇమ మ్మనుపాఠమునందు, ఈవిశ్వరూపాత్మక మయిన మహిమ నని యర్థము; అజానతా=ఎఱుంగనట్టి; మయా = నాచేత; ప్రమాదాత్=చిత్తవిక్షేపమువలనను; ప్రణయేనవా=అపి=స్నేహముచేతను; ప్రసభమ్=నాయుత్కర్షమును వెల్లడిచేయుటకై నిన్నభిభవించి; హేకృష్ణ హేయాదవ హేసఖేతి; యదుక్తమ్=ఏది చెప్పఁబడినదో. మఱియును. అవహాసార్థమ్=పరిహాసముకొఱకు; విహారశయ్యాసనభోజనేషు=విహారము—క్రీడ, లేక వ్యాయామము, శయ్య—పఱపు మొదలగు నాస్తరణవిశేషము, ఆసనము—సింహాసనము మొదల గునది, భోజనము—అనేకులతోఁ బంక్తిభోజనము, వీనివిషయమునందు; నీవు, ఏకః = సఖులను విడిచి యేకాంతమున నున్నవాఁడవు గాని; అథవా=లేక; తత్సమక్షమ్=నాతోఁ జేరి పరిహాసించుచున్న యాసఖులయెదుటఁ గాని; అచ్యుత = సర్వదా నిర్వికారుఁ డైన వాఁడా! యత్ అసత్కృతోఽసి=నాచేఁ బరిభవింపఁబడినవాఁడ వైతి వనునది యేది గలదో; తత్ = వచనరూపంబును అసత్కరణరూపంబు నగు నాయపరాధజాతమును సమస్తమును; అప్రమేయమ్=అచింత్యప్రభావుఁడ వగు; త్వామ్=నిన్ను; అహం క్షామయే—అచింత్యప్రభావుఁడవు నిర్వికారుఁడవు పరమకారుణికుఁడవు భగవంతుఁడ వగు నీవు నీమాహాత్మ్యము నెఱుంగనట్టి నాయపరాధముల క్షమింపవలయు నని యర్థము.

శ్రీ. ఇప్పుడు భగవంతునివలన క్షమాపణము గోరుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—నిన్ను ప్రాకృతుఁడగు సఖుఁ డని తలఁచి, ప్రసభమ్= హఠముచేత, తిరస్కారముచేత; యదుక్తం. తత్ క్షామయే త్వామ్ అని మీఁదిశ్లోకముతో నన్వ

యము. ఏమని చెప్పఁబడినది? హేకృష్ణ హేయాదవ హేసఖేతి. సఖేతి అనుచో సంధియార్షము. ప్రసభోక్తియందు హేతువు —తవ=నీయొక్క; మహిమానమ్=ప్రభావమును; ఇదమ్ = ఈవిశ్వరూపమును; అజానతా = ఎఱుంగనట్టి; మయా = నాచేత; ప్రమాదంబువలనఁ గాని; ప్రణయేణ వాపి=స్నేహముచేతనుం గాని. యదుక్తం తత్ క్షామయే. మఱియును. ఓయచ్యుతుఁడా! యచ్చ—పరిహాసముకొఱకుఁ గ్రీడాదులయందుఁ దిరస్కరింపఁబడినాఁడ వనునది యేది గలదో; ఏకః = ఏకాకివి, సఖులను విడిచి యేకాంతమున నున్నవాఁడ వని యర్థము; అథవా; తత్సమక్షమ్=పరిహాసించుచున్న యాసఖుల యెదుటను. తత్=ఆయపరాధసమూహమును సమస్తమును; అప్రమేయమ్ = అచింత్యప్రభావుఁడ వగు; త్వామ్ = నిన్ను; క్షామయే = క్షమింపఁజేయుచున్నాను.

ప. ఇప్పుడు తనయపరాధమును క్షమింప వేఁడుటకై చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత —నిన్నుఁ బ్రాకృతుఁడవు సఖుఁడ వని తలంచి, ప్రసభమ్ = తిరస్కారంబున; హేకృష్ణ హేయాదవ హేసఖేతి; సంధిఛాందసము; ఇదమ్=ఈ యనుభవింపఁబడుచున్న; తవ మహిమానమ్; అజానతా = ఎఱుంగనట్టి; మయా = నాచేత; తిరస్కారప్రకారములను జెప్పుచున్నాఁడు.—ప్రమాదాత్ = ఎచ్చరిక లేమివలనఁ గాని; ప్రణయేన వాపి=ప్రీతిచేతఁ గాని; యదుక్తమ్=ఏది చెప్పఁబడినదో. యచ్చ; అవహాసార్థమ్=పరిహాసనిమిత్తము; విహారశయ్యాసనభోజనేషు = క్రీడించునపుడును పరుండునపుడును సభయందుఁ గూర్చుండునపుడును పంక్తిలో భుజించునపుడును; అసత్కృతోఽసి=అవమానింపఁబడినవాఁడ వైతివి. తత్ = ఆయపరాధజాతమును; అప్రమేయమ్ = అచింత్య మయినప్రభావము గలవాఁడ వగు; త్వామ్; క్షామయే= క్షమింపఁజేయు చున్నాను. ఇది యర్థము.—సామవేదమునందలి బృహద్రథంతరాది పావమాన్యస్తుతులచేఁ బ్రసన్నుఁ డైన భగవంతునివలన యశోలభస్వ ♦ ఇత్యాదిగాఁ జెప్పఁబడిన నశ్వరఫలము నపేక్షింపను. మఱే మనఁగా, అపరాధమునే క్షమింప వేఁడుచున్నాను. అందుచే వెండియుఁ జతుర్భుజరూపదర్శనమువలన ముక్తిఁ జెందఁ గలను. అపరాధము గావించినపురుషునికిఁ గదా నశ్వరఫలము కలుగును. అని యర్జునుని యాశయము. శ్రుతియును వాజసనేయారణ్యకమునందు,—“ అథాతః పవమానానా మేవా ఽభ్యారోహః స వై ఖలు ప్రస్తోతా సామ ప్రస్తౌతి స యత్ర ప్రస్తుయా త్త దేతాని జపేత్ అసతో మా సద్గమయ తమసో జ్యోతి ర్గమయ మృ

♦ కీర్తిని పొందుము.

తిర్మ్యోతిర్గమయ మృత్యోర్మా౽మృతం గమయ " అని. భాష్యము.—అథాతః = ఈశ్వరస్తావక మగుట వలన; పవమానానామ్=పావమాన్యశ్రుతులకు; అభ్యారోహః=ఉత్కర్షము. వై=ఎందువలన ననఁగా. సః=అతఁడు; ప్రస్తోతా=ప్రకర్షంబునఁ బరమేశ్వరుని స్తుతించువాఁడై; సామ=సామరూపుఁడై నపరమేశ్వరుని; ప్రస్తౌతి ఖలు=ప్రకర్షంబున స్తుతించుచున్నాఁడు గదా! సః=అతఁడు; యత్ర=ఎప్పుడు; ప్రస్తుయాత్=స్తుతించునో; తదా=అప్పుడు; ఏతాని=ఈ మూఁడుయజుస్సులను; జపేత్=జపింపవలయును. ఆ యజుస్సులను జెప్పుచున్నది.—అసతః=అసద్రూప మయిన ప్రపంచమునుండి; మా = నన్ను; సత్ = బ్రహ్మమును; గమయ=బోధింపుము. తమసః=అజ్ఞానమునుండి, జ్యోతిః=ప్రకాశరూప మయిన జ్ఞానమును; గమయ = పొందింపుము. మృత్యోః = సంసారమునుండి; మా=నన్ను; అమృతమ్=ముక్తిని; గమయ = పొందింపుము. తైత్తిరీయకమునందును.—" యథా మధ్యే సముద్రస్య ప్లవ మన్వార్జేయు స్తాదృక్ తదనుత్సర్గం బృహద్రథంతరాభ్యాం మిత్వా ప్రతిష్ఠాం గచ్ఛతి " అని. భాష్యము.—ఎట్లు సముద్రమధ్యమునందుఁ బడినవారు, ప్లవమ్=ఓడను; అన్వార్జేయుః=ఆశ్రయించుచున్నారో. తాదృక్=అట్లు; తదనుత్సర్గమ్ = తన్నిర్విశేషముగా—దానితో సమానముగా; బృహద్రథంతరసామములచే అజ్ఞానసముద్రమును, మిత్వా=కొలిచి, తరించి యనుట; ప్రతిష్ఠామ్=బ్రహ్మమునందు స్థితిని; గచ్ఛతి = పొందుచున్నాఁడు. నశ్వరఫలమో యింద్రాదిస్తుతులచేఁ బొందఁబడుచున్నది. శ్రుతియును.—అథయా నీతరాణి స్తోత్రాణి తే ష్వాత్మనో ఽన్నాద్య మాగాయేత్ తస్మా త్తదు క్తేషు వరం వృణీత యం కామం కామయే తే త మాగాయేత్ " అని. భాష్యము—ఇఁక నితర స్తోత్రములు పావమాన్యశ్రుతివ్యతిరిక్తము లేవి గలవో వానియందు అన్నాదులను బ్రార్థింపవలయును, అందువలన వానియందుఁ జెప్పఁబడినవానిలో వరము వరింపవలయును, ఏకామమును గోరుచున్నాఁడో దానిఁ బొందును.

రా॥ నీయొక్క అనంతవీర్యత్వము అమితవిక్రమత్వము సర్వాంతర్యామిత్వము స్రష్టృత్వము మొదలగు నేమహిమము గలదో అట్టి యీమహిమను ఎఱుంగనట్టి నాచేత; ప్రమాదాత్=మోహమువలనఁ గాని; ప్రణయేన = బహుకాలపరిచయము చేతఁ గాని; సఖేతి=నాచెలికాఁ డని; మత్వా = తలఁచి; హేకృష్ణ హేయాదవ హే సఖే అని, ప్రసభమ్ = వినయము లేనట్లు; యదుక్తమ్; యచ్చ; పరిహాసముకొఱకు ఎల్లప్పుడు సత్కారమునకే యుక్తుఁడ వగు నీవు, అసత్కృతో ఽసి; విహారశయ్యా

సనభోజనములు కలసి చేయునపుడు ఏకాంతమునం గాని సమక్షముగాఁ గాని, అస త్కృతోఽసి. తత్=దాని సమస్తమును; త్వా మప్రమేయ మహం క్షమాపయే.

మూ. నీ వొక్కఁడవే చేయించువాఁడవు. ఇతరుఁడు లేఁడు. అట్లయినను,

పితాఽసి లోకస్య చరాచరస్య
త్వ మస్య పూజ్యశ్చ గురు ర్గరీయాన్
న త్వత్సమోఽస్త్యభ్యధికః కుతోఽన్యో
లోకత్రయేఽప్య ప్రతిమప్రభావ. ౪౩

భా. ఎందువలన ననఁగా.—త్వమ్= నీవు; అస్య= ఈ; చరాచరస్య= జంగమస్థావరాత్మక మయిన; లోకస్య = ప్రాణిజాతమునకు; పితా= జనకుఁడవు; అసి=అగుచున్నావు. నీ వీ జగత్తునకు జనకుఁడవు మాత్రమే కావు, మఱేమనఁగా, పూజ్యశ్చ=పూజార్హుఁడవు గూడ. ఎందువలన ననఁగా. గురుః=గురుఁడవు; గరీయాన్=గురుతరుఁడవు ♦. ఎందువలన గురుతరుం డనఁగాఁ జెప్పుచున్నాఁడు.—లోకత్రయేఽపి=ముల్లోకములయందు, అంతటను; త్వత్సమః=నీతో సమానుఁడు; అన్యః= ఇతరుఁడు; నాఽస్తి=లేఁడు. ఈశ్వరద్వయము సంభవింపదు గదా! అనేకు లీశ్వరు లైనచో వ్యవహార మనుపపన్న మగుటవలన. నీకు సమానుఁడే యితరుఁడు సంభవింపఁడు, ఇఁక ఇతరుఁడు, అభ్యధికః=ఎక్కువ యయినవాఁడు; కుతః=ఎక్కడ సంభవించును? అప్రతిమప్రభావ = ప్రతిమీయతే—దీనిచేఁ బోల్పఁబడుచున్నది కావున ప్రతిమ యనఁగా సాదృశ్యము, అది లేనిది యప్రతిమము, అట్టి ప్రభావము గలవాఁడా! నిరతిశయ మయినప్రభావము గలవాఁడా యని యర్థము.

నీ వీచరాచరప్రపంచమున కంతకుఁ దండ్రివి, పూజ్యుఁడవు, గురుఁడవు, గురువులకును గురుఁడవు, నిరతిశయ మయినప్రభావము గలవాఁడా! ముల్లోకంబుల యందును నీకు సమానుఁడే మఱియొకఁడు లేఁడు, అధికుఁడు మొదలే లేఁ డని తా.

ఆ. గుణాధికుఁ డగుటవలనఁ బూజార్హత్వమును, ధర్మాధర్మములయు ఆత్మజ్ఞానముయొక్కయు సంప్రదాయమునకుఁ బ్రవర్తకుఁడై శిక్షకుఁ డగుటవలన గురు

♦ గురువులకును గురుఁడవు.

త్వంబును, గురువు లయినసూత్రాదులకును గురుఁ డగుటవలన గురుతరత్వంబును. దానినే ప్రశ్నద్వారంబున సాధించుచున్నాఁడు ఎందువలన నిత్యాదిగా. మఱియొక యీశ్వరుఁడు సమానుఁ డుండవచ్చు నని యాశంకించి చెప్పుచున్నారు ఈశ్వ రేత్యాదిగా. అనేకు లీశ్వరు లన్నచో నొక్కొక్కరును స్వతంత్రు లగుటవలనను వారి కైకమత్యమునందు హేతువు లేమివలనను భిన్నమతు లయినపుడు ఒకనికి సృజనేచ్ఛ కలుగఁగా నొకనికి సంహారేచ్ఛ సంభవించుటవలనను వ్యవహారము లుప్త మగుం గావున నయుక్తం బీశ్వరానేకత్వ మని యర్థము. అభ్యధికుఁడు లేఁ డనుటను కైముతికన్యాయముచేఁ జూపుచున్నారు నీకు సమానుఁడే ఇత్యాదిగా. అందుకు హేతువును దీసి వివరించుచున్నారు అప్రతి మేత్యాదిగా.

హా. *

శం. ఓయీ! గదుఁడు మొదలగువారలు నీ కెట్లో అట్లే నేనును, ఎందుకు క్షమింపు మని నన్నుఁ బ్రార్థించుచున్నావు? అందువేని, అట్లు కాదు, నీవు సర్వలోకపూజ్యుఁడవు పరమేశ్వరుఁడ వని సహేతుకముగాఁ బూజ్యత్వమునే ప్రతిపాదించుచున్నాఁడు.—చరాచరస్య=జంగమస్థావరాత్మక మయిన; అస్య=ఈ యనుభవింపఁబడుచున్న; లోకస్య = సర్వప్రాణిజాతమునకు; త్వమ్ = నీవు; పితా = జనకుఁడవు; అసి = అగుచున్నావు, « యతో వా ఇమాని » అను శ్రుతివలన. నీవు సర్వభూతములకును జనకుఁడవు మాత్రమే కావు, మ తే మనఁగా మహాగురుఁడవు గూడ నని చెప్పుచున్నాఁడు.—సకలానర్థబీజభూత మయిన యవిద్యాతత్కార్యములను నశింపఁజేయునట్టి తత్త్వజ్ఞానము నుపదేశించుటచే, గరీయాన్ = సర్వోత్తముఁ డైన; గురుః = గురుఁడవు గూడ నగుచున్నావు. అందువలన నీవు, పూజ్యః = సర్వలోకములకును బూజ్యుఁడవు. ఇఁక నాకు మాత్రము పూజ్యుఁడ వని చెప్పనలయునా? ఓయీ! నా కన్నను అధికులు బ్రహ్మాదు లుండనే యున్నారు, అనఁగాఁ జెప్పుచున్నాఁడు.— « ఆత్మన ఆకాశ స్సంభూతః, అస్య మహతో భూతస్య » ఇత్యాదిశ్రుతులవలన ఆకాశాదిసర్వభూతజనకత్వమునందును ధర్మజ్ఞానమూలసకలవేదోపదేష్టృత్వమునందును, లోకత్రయేఽపి = ముల్లోకములయందును; మహత్తముఁ డయిన, త్వత్సమః = నీతో సమానుఁడు; అన్యః = ఇతరుఁడు; నాస్తి = లేఁడు. ఉండునేని ఈశ్వరాంతరము సిద్ధించుటచే సర్వవ్యవహారలోపము సంభవించుటవలన. రెండవయీశ్వరుఁ డున్నచో నొకఁడు సృజింపవలయు ననియు నొకఁడు సంహరింపవలయు ననియు నిచ్ఛింపఁగా

* దీని కివ్యాఖ్యానము లేదు.

వ్యవహారము సిద్ధింపదు గదా! అందువలన నీకు సమానుఁ డెవ్వఁడును లేఁ డని యర్థము. నీకు సమానుఁడే లేనియప్పుడు, అభ్యధికః = చెప్పినధర్మములచే నీకంటె గొప్పవాఁడు; కుతః = ఎక్కడ సంభవించును ? ఎక్కడను సంభవింపఁ డని యర్థము, «న తత్సమశ్చా ఽభ్యధికశ్చ దృశ్యతే » అను శ్రుతివలన. నీకు సమానుఁ డైన పురుషుఁడే సంభవింపఁ డనుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—అప్రతిమప్రభావ = ప్రతిమీయతే—దీనిచేతఁ బోల్పఁబడును గావున ప్రతిమ యనఁగా సాదృశ్యము, సాదృశ్యము లేనట్టిప్రభావము -- మాయాయోగజ మయిన ప్రపంచబంధమోక్షాదికార్యఘటనాఽఘటనపటుత్వరూప మయినసామర్థ్యము గలవాఁడా! నిరతిశయ మగు మహత్త్వముతోఁ గూడినవాఁడా యని యర్థము.

మ. అచింత్యప్రభావతనే ప్రపంచించుచున్నాఁడు.—అస్య చరాచరస్య లోకస్య, పితా = జనకుఁడవు; త్వమ్; అసి = అగుచున్నావు. పూజ్యశ్చ = పూజ్యుఁడవును అగుచున్నావు, సర్వేశ్వరుఁడ వగుటవలన. గురుః = శాస్త్రోపదేష్టవు గూడ అగుచున్నావు. కావున సర్వప్రకారములచేతను, గరీయాన్ = గురుతరుఁడ వగుచున్నావు. అందువలననే, త్వత్సమః నాస్తి. అభ్యధికః అన్యః కుతః లోకత్రయేఽపి? ఓ అప్రతిమప్రభావుఁడా! ఎవ్వనికి సముండును లేఁడో రెండవపరమేశ్వరుఁడు లేమివలన, వానికి అధికుఁడు మఱియొకఁ డెక్కడ సంభవించును? అన్నివిధంబులను సంభవింపనే సంభవింపఁ డని యర్థము.

శ్రీ. అచింత్యప్రభావత్వమునే చెప్పుచున్నాఁడు.—ప్రతిమ—ఉపమ లేనిది యప్రతిమము, అట్టిప్రభావము గలవాఁడా! త్వ మస్య చరాచరస్య లోకస్య, పితా= జనకుఁడవు అగుచున్నావు. కావుననే పూజ్యుఁడవును గురుఁడవును గురువులకన్నను గురుతరుఁడవును అగుచున్నావు. అందువలన, లోకత్రయేపి, త్వత్సమః= నీకు సమానుఁడే; అన్యః నాస్తి; పరమేశ్వరుఁడు మఱియొకఁడు లేమివలన. నీకన్నను, అభ్యధికః = గొప్పవాఁడు, మఱి; కుతః = ఎక్కడఁ గలఁడు ?

వ. ఇఁక క్షమాపణమునందు బీజముఁ జెప్పుచున్నాఁడు.—పితా= పుట్టించువాఁడవు. పూజ్యః = పూజింపఁ దగినవాఁడవు. గురుః = ఉపదేశించువాఁడవు. వానికన్నను, గరీయాన్ = గురుతరుఁడవు. దృష్టాంతము లేమిని జెప్పుచున్నాఁడు.—ఓ యప్రతిమప్రభావుఁడా! నీతో సమానుఁడు మఱియొకపరమేశ్వరుఁడు లేఁడు, ఇఁక నీకంటె నధికుఁడు ఎక్కడఁ గలఁడు? శ్రుతియును రథంతరసామోత్తరము,—«నత్వా

వా మన్యో దివ్యో న పార్థివో న జాతో న జనిష్యతే»* అని. ఇట వామ్ అనునది వినా అనుదానియర్థము గలది. శేషము స్పష్టము.

రా. అప్రతిమప్రభావ! త్వమ్; అస్య చరాచరస్య లోకస్య=సర్వప్రపంచమునకును, పితాఽసి. ఈలోకమునకు గురుఁడవును అగుచున్నావు. కావున నీవీ చరాచరలోకమునకు, గరీయాన్=పూజ్యతముఁడవు. నత్వ త్సమో ఽస్త్యభ్యధికః కుతో ఽన్యో లోకత్రయే ఽపి—నీకంటె నితరుఁడు కారుణ్యాదిక మయిన యేగుణముచే నేనియు నీకు సమానుఁ డైనవాఁడు లేఁడు, ఇఁక అధికుఁ డెక్కడఁ గలఁడు?

మూ. ♦

తస్మాత్ప్రణమ్య ప్రణిధాయ కాయం
ప్రసాదయే త్వా మహ మీశ మీడ్యమ్
పితేవ పుత్త్రస్య సఖేవ సఖ్యుః
ప్రియః ప్రియా యార్హసి దేవ సోఢుమ్. ౪౪

భా. ఎందువలన నిట్లో.—తస్మాత్=అందువలన; ప్రణమ్య=నమస్కరించి; కాయమ్=దేహమును; ప్రణిధాయ=ప్రకర్షంబున నమ్రముగాఁ జేసి; ఈశమ్=ఈశితవు; ఈడ్యమ్=స్తుత్యుఁడ వగు; త్వామ్=నిన్ను; అహమ్=నేను; ప్రసాదయే=ప్రసన్నునిఁ జేసికొను చున్నాను. నీవు మఱి, పుత్త్రస్య=పుత్త్రునియొక్కయపరాధమును; పితేవ=తండ్రివలె, తండ్రి యెట్లు క్షమించునో; సఖ్యుః = మిత్త్రునియొక్కయపరాధమును; సఖేవ = మిత్త్రుఁ డెట్లు క్షమించునో; ప్రియాయాః=ప్రియురాలియొక్కయపరాధమును; ప్రియః=ప్రియుఁ డెట్లు క్షమించునో; అట్లు, దేవ=ఓదేవుఁడా; సోఢుమ్=సహించుటకు, క్షమించుట కని యర్థము; అర్హసి=తగుదువు.

అందువలన నీకు నమస్కరించి నమ్రుఁడనై యీశ్వరుఁడవు స్తోత్రార్హుఁడ వగు నిన్నుఁ బ్రసన్నునిఁగాఁ జేసికొనుచున్నాను. ఓదేవుఁడా! పుత్త్రునియపరాధము తండ్రి క్షమించునట్లును మిత్త్రునియపరాధము మిత్త్రుఁడు క్షమించునట్లును

* నీవు దక్క మఱియొకఁడు దివ్యుఁడు— స్వర్గమునందలివాఁడు గాని పార్థివుఁడు— పృథివియందలివాఁడు గాని లేఁడు, పుట్టినవాఁడును గాఁడు పుట్టనుం బోఁడు.

♦ ఇది మొదలు ౪౫వ శ్లోకమువఱకు భాష్యము లేదు.

ప్రియురాలియపరాధమును ప్రియుఁడు క్షమించునట్లును నాయపరాధమును నీవు క్షమింపవలయు నని తాత్పర్యము.

ఆ. అప్రతిమప్రభా వేత్యాదికముచే నిరతిశయప్రభావమును హేతువు గాఁ జేసి నిన్నుఁ బ్రణామపూర్వకముగాఁ బ్రసన్నునిఁ జేయుచున్నా నని చెప్పుచున్నాఁ డని చెప్పుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ప్రసాదనానంతరము భగవంతుఁడు చేయవలసినదానిఁ బ్రార్థించుచున్నాఁ డుత్తరార్ధముచేత. ప్రియ ఇవ అని ఇవకారము అనువర్తించుచున్నది. ప్రియాయార్హసి అని సంధి ఛాందసము. క్షమించుటకు—అపరాధజాతము నని శేషము.

హ. ప్రణిధాయ = ప్రకర్షంబున నమ్రముగా దండమువలె భూమియందు దేహమును బడవేసి. సోఢుమ్ = అపరాధములను సహించుటకు.

శం. జగద్గురుండవు జగజ్జనకుండ వగుటచే సర్వలోకపూజ్యుఁడవు పరమేశ్వరుఁడ వగు నీయెడ నే నపరాధము చేయఁ గూడదు, ప్రమాదముచే నేమి యపరాధము చేసితినో దాని క్షమింపు మని ప్రార్థించుచున్నా నని పలికి యిప్పుడు ప్రణామపూర్వకముగాఁ బ్రసన్నునిఁ జేసికొనుచున్నాఁడు—ఎందువలన నీవు నిరతిశయమహత్త్వసంపన్నుఁ డగు పరమేశ్వరుఁడవో, తస్మాత్ = అందువలన; కాయమ్; ప్రణిధాయ = ఎనిమిదియంగములును తగులునట్లు భూమియం దుంచి; ప్రణమ్య=నమస్కరించి; ఈడ్యమ్=బ్రహ్మాదులచే స్తుతింపఁ దగినవాఁడవు; ఈశమ్ = పరమేశ్వరుఁడ వగు; త్వామ్ = నిన్ను; అహమ్; ప్రసాదయే = ప్రసన్నుఁడవు క మ్మని ప్రార్థించుచున్నాను. ఓ దేవుఁడా! నాచేఁ బ్రార్థితుఁడ వగు నీవు, పుత్త్రునియపరాధమును తండ్రివలెను సఖునియపరాధమును సఖునివలెను, ప్రియాయాః = ప్రియురాలగు స్త్రీయొక్క, యపరాధమును ప్రియునివలెను నాయపరాధమును క్షమింపవలయు నని యర్థము. ప్రియాయార్హసి యనుచో సంధి యార్షము.

మ. ఎందువలన నిట్లో.—తస్మాత్=అందువలన; ప్రణమ్య=నిన్ను నమస్కరించి; కాయమ్; ప్రణిధాయ=మిక్కిలి నమ్రముగాఁ జేసి, దండమువలె భూమిమీఁదఁ బడి యని యర్థము. అహమ్ = అపరాధి నగు నేను; ఈశమ్; ఈడ్యమ్ = సర్వలోకస్తుత్యుండ వగు; త్వాం ప్రసాదయే. కావున ఓ దేవుఁడా! పితేవ పుత్త్రస్య=పుత్త్రుని యపరాధమును తండ్రివలె; సఖేవసఖ్యుః=సఖునియపరాధమును సఖునివలె; ప్రియాయాః = పతివ్రత యగు భార్యయొక్క-యపరాధమును; ప్రియః = భర్తవలె; నాయప

రాధమును నీవు, సోఢుమ్ = క్షమించుటకు; అర్హాసి, నేను అనన్యశరణుఁడ నగుటవలన. ప్రియాయా యర్హాసి యను-చో ఇవ శబ్దలోపంబును సంధియును ఛాందసము.

శ్రీ. ఎందువలన నిట్లో.—తస్మాత్ =అందువలన; ఈశమ్=జగన్నాథుఁడవు; ఈడ్యమ్=స్తుత్యుఁడ వగు; త్వామ్; ప్రసాదయే=ప్రసన్నునిఁ జేయుచున్నాను. ఎట్లు? కాయం ప్రణిధాయ = దేహమును దండమునుం బోలెఁ బడవేసి; ప్రణమ్య=ప్రకర్షంబున నమస్కరించి. అందువలన నీవు నాయపరాధమును, సోఢుమ్=క్షమించుటకు; అర్హాసి. ఎవ్వరియపరాధమును ఎవ్వరువలె? పుత్త్రునియపరాధమును తండ్రి యెట్లు కృపచే క్షమించుచున్నాఁడో, సఖ్యుః= మిత్త్రునియపరాధమును, సఖా= నిరుపాధిబంధువు ఎట్లు క్షమించునో, ప్రియుండును ప్రియురాలియపరాధమును తత్ప్రియార్థము ఎట్లు క్షమించునో అట్లు.

ప. అందువలన, కాయమ్; ప్రణిధాయ = దండమునవలెఁ బడవేసి; త్వామహమ్; ప్రసాదయే=ప్రసన్నునిఁగాఁ జేయుచున్నాను. ఎట్టి నిన్ను? ఈశమ్=నియామకుని; ఈడ్యమ్ = స్తుత్యుని. ఈవిధంబున నీవును నాయపరాధమును క్షమింపవలయును, ఎవ్వరియపరాధము నెవ్వరు క్షమించినట్లు? పితాపుత్త్రస్యేవ; సఖా సఖ్యురివ. ప్రియః = సుహృదుఁడవు; ప్రియాయాః= ప్రియమునకొఱకు.

రా. ఎందువలన నీవు సర్వంబునకును తండ్రివి పూజ్యతముఁడవు గురుఁడవు కారుణ్యాదిగుణములచే సర్వాధికుఁడవు నగుచున్నావో, తస్మాత్ = అందువలన; ఈశమ్; ఈడ్యమ్; ప్రణమ్య; కాయం ప్రణిధాయ; ప్రసాదయే. ఎట్లు అపరాధియైనవానికిఁ గూడ పుత్త్రునకును ఎట్లు సఖునకును ప్రణామపూర్వకముగాఁ బ్రార్థితుండై తండ్రిగాని సఖుఁడుగాని ప్రసన్నుఁ డగునో అట్లు నీవు పరమకారుణికుఁడవు, ప్రియః = నాకుఁ బ్రియుఁడవు; ప్రియాయ = ప్రియుఁడ వైన నాకొఱకు; సమస్తమును సహింపవలయును.

అదృష్టపూర్వం హృషితో౽స్మి దృష్ట్వా
భయేన చ ప్రవ్యథితం మనో మే
త దేవ మే దర్శయ దేవ రూపం
ప్రసీద దేవేశ జగన్నివాస. ౪౫

భా. అదృష్టపూర్వమ్= ఎప్పుడును మున్ను చూడఁబడినది కాదు ఈ నీవిశ్వరూపము నాచేతఁ గాని యన్యులచేతఁ గాని, అట్టిదానిని; నేను,

దృష్ట్వా = చూచి; హృషితః = హృష్టుఁడను; అస్మి = అగుచున్నాను. భయేనచ= భయముచేతఁ గూడ; మే=నాయొక్క; మనః= మనస్సు; ప్రవ్యథితమ్= మిక్కిలి పీడింపఁబడినది. అందువలన, దేవ= ఓదేవుఁడా! మే = నాకు; ఏది నాకు మిత్త్రిమో, తత్ = ఆ; రూపమేవ = రూపమునే; దర్శయ = చూపుము. ప్రసీద = ప్రసన్నుఁడ వగుము. దేవేశ = దేవతలకు నాథుఁడా! జగన్నివాస = జగత్తునకు నివాసస్థాన మయినవాఁడా.

దేవా! ఇదివఱ కెన్నఁడును ఎవ్వఁడును జూడని యీవిశ్వరూపముం జూచి సంతోషము నొందితిని. అయినను భయము గూడ నామనస్సును బీడించుచున్నది. కావున నాకు మిత్త్రిభూత మయిన యారూపమునే చూపుము. దేవేశా! జగన్నివాసా! ప్రసన్నుఁడ వగు మని తాత్పర్యము.

ఆ. హేతువుఁ జెప్పుచు విశ్వరూపోపసంహారమును బ్రార్థించుచున్నాఁడు.—హృష్టుఁడను—తుష్టుఁడ నని యర్థము. భయముచేత—దానికిఁ గారణ మయిన వికృతదర్శనముచేత నని యర్థము.

హ. హృషితః=గగుర్పాటు నొందిన వెండ్రుకలు గలవాఁడను.

శం. దేవేశా జగన్నివాసా యని ప్రసన్నునిఁ జేయుచు స్తుతించుచు విశ్వరూపోపసంహారమును బ్రార్థించుచున్నాఁడు.—అదృష్టపూర్వమ్ = ఎప్పుడును జూడఁబడనట్టి విశ్వరూపమును; దృష్ట్వా = చూచి; హృషితోఽస్మి = సంతుష్టుఁడ నగుచున్నాను. అయినను ఇది బహూదరవక్త్రాదులచే వికృతం బగుటవలన, భయేన; మే మనః; ప్రవ్యథితంచ = వ్యాకులము గూడ నగుచున్నది. ఓదేవుఁడా! ప్రసీద = ప్రసన్నుఁడ వగుము. తదేవ = మునుపటిదానినే సౌమ్య మయినదానిని; కృష్ణుని దైనదానిని; రూపమ్=రూపమును; మే దర్శయ—దృష్టికి విషయముగాఁ జేయు మని యర్థము.

మ. ఇట్లపరాధక్షమాపణముఁ బ్రార్థించి వెండియు విశ్వరూపోపసంహారముచే మునుపటిరూపముఁ జూప వేఁడుచున్నాఁడు రెండుశ్లోకములచేత —అదృష్టపూర్వమ్=ఎప్పుడును మున్ను చూడఁబడనివిశ్వరూపమును; దృష్ట్వా=చూచి; హృషితోఽస్మి=హృష్టుఁడ నగుచున్నాను. దానివికృతరూపము చూచుటవలనఁ గలిగినట్టి, భయేనచ= భయముచేఁ గూడ; మే మనః; ప్రవ్యథితమ్= వ్యాకులముగాఁ జేయఁబడినది. అందువలన, తదేవరూపమ్=ఆప్రాచీన మైనదానినే; నాకుఁ బ్రాణముకన్నను

ద్రూపము నయినరూపమును; మే దర్శయ. ఓ దేవుఁడా! ఓ దేవేశుఁడా! ఓ జగన్నివాసుఁడా! ప్రసీద = ప్రాచీనరూపదర్శనరూప మయినప్రసాదమును జేయుము.

శ్రీ. ఇట్లు క్షమియింపఁ జేసికొని ప్రార్థించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.— ఓ దేవా! మున్ను చూడఁబడని నీరూపమును జూచి, హృషితో౽స్మి = హృష్టుఁడ నగుచున్నాను. అట్లు, భయేనచ మే మనః ప్రవ్యథితమ్ = మిక్కిలి చలించినది. అందువలన నాన్యథ నివర్తిల్లుటకై, తదేవరూపం దర్శయ. దేవేశ! జగన్నివాస! ప్రసీద = ప్రసన్నుఁడ వగుము.

ప. ఇఁక క్షమాపణానంతరము ప్రార్థించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—పూర్వము—జన్మజన్మాంతరమునందును దృష్టము కానిది యదృష్టపూర్వము, అట్టి విశ్వరూపములోని చతుర్భుజరూపమును జూచి నావంటివారల కివి యలభ్యలాభం బని, హృషితో౽స్మి. అనంతరము, దంష్ట్రాకరాలంబు లగురూపములం జూచి, భయేన మే మనః ప్రవ్యథితమ్. కావున నీకవిూఁద ఓ దేవేశా జగన్నివాసా! ప్రసీద=ప్రసన్నుఁడ వగుము. ప్రసన్నుఁడ నైనచో నేమి యాచించెదవు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తదేవ = దానినే, మొదటఁ జూడఁబడిన హర్షజనక మైనచతుర్భుజమునే; రూపం మే దర్శయ. అంతమాత్రముచేతనే కృతార్థుఁడ నగుదు నని యర్థము.

రా. అదృష్టపూర్వమ్ = అత్యద్భుతమును అత్యుగ్రము నగు నీరూపమును జూచి, హృషితో౽స్మి = ప్రీతుఁడ నగుచున్నాను. భయేన మే మనః ప్రవ్యథితంచ. కావున, తదేవరూపమ్ = ఆ నీప్రసన్నరూపమునే; మే దర్శయ. ప్రసీద = ప్రసాదము చేయుము. దేవేశ = బ్రహ్మాదిదేవతలకుఁ గూడ ఈశుఁడా! జగన్నివాస = నిఖిలజగదాశ్రయభూతుఁడా!

కిరీటినం గదినం చక్రహస్త
మిచ్ఛామి త్వాం ద్రష్టుమహం తథైవ
తేనైవ రూపేణ చతుర్భుజేన
సహస్రబాహో భవ విశ్వమూర్తే. ౪౬

భా. కిరీటినమ్=కిరీటము గలవానిని; అట్లు, గదినమ్=గద గలవానిని; చక్రహస్తమ్=చక్రము చేతియందుఁ గలవానిని; త్వామ్=నిన్ను; తథైవ= అట్లే, పూర్వమువలె నని యర్థము; ద్రష్టుమ్ = చూచుటకు; అహమ్=

నేను; ఇచ్ఛామి=ప్రార్థించుచున్నాను. అందువలన, తేనైవరూపేణ=ఆ వసుదేవపుత్త్రరూపముతోనే; చతుర్భుజేన = నాలుగుభుజములు గల దానితో; సహస్రబాహో = వర్తమానవిశ్వరూపముచే వేయిచేతులు గలవాఁడా! విశ్వమూర్తే=విశ్వరూపుఁడా! భవ=ఉండుము. విశ్వరూపము నుపసంహరించి యావసుదేవపుత్త్రరూపముతోనే యుండుము అని యర్థము.

కిరీటమును గదను జక్రమును ధరించి పూర్వమువలె నున్న నిన్నుఁ జూడఁ గోరుచున్నాను. కావున నిప్పుడు విశ్వరూపమున సహస్రబాహుఁడవై యున్న వాఁడా! మునుపటిచతుర్భుజరూపము గలవాఁడవే యగుము అని తాత్పర్యము.

ఆ. దానినే చూపుము అని చెప్పఁబడినది. అది యేది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—నాయిచ్ఛను ఫలపర్యంతముగాఁ జేయవలయును అని చెప్పుచున్నాఁడు అందువలన నిత్యాదిగా. చతుర్భుజుం డైనపుడు సహస్రబాహు వెట్లగును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు వర్తమానేత్యాదిగా. విశ్వరూప ముండునపుడు ఎట్లు పూర్వరూపము పొందవచ్చును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు విశ్వరూపము నిత్యాదిగా.

హ. ఎట్లు నేను మున్ను చూచితినో అట్లే చతుర్భుజరూపముతోఁ గూడినవాఁడ వగుము అని యర్థము.

శ్రీ. త దేవ యని చెప్పి యపేక్షితం బగుటవలనఁ జూడఁ గోరినరూపమును విశేషణములచేఁ దెలుపుచున్నాఁడు.—పూర్వ మెట్లో, తథైవ=అట్లే; కిరీటినం గదినం చక్రహస్తం త్వామ్; ఇప్పుడు, ద్రష్టు మిచ్ఛామి. ఎందువలన నీరూపము భయంకరమో అందువలన, చతుర్భుజేన=నాలుగుభుజములు గల; తేనైవరూపేణ=శాంత మయిన యావాసుదేవరూపముతోనే; కూడినవాఁడవు, భవ=అగుము. అప్పుడది చతుర్భుజవిశిష్ట మయినరూపము గాదని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—సహస్రబాహో=వేయిచేతులు గలవాఁడా! విశ్వమూర్తే=ప్రపంచమే మూర్తిగాఁ గలవాఁడా! సర్వాత్ముఁడా! ఈరూపము నుపసంహరించి మునుపటి శాంతరూపముఁ జూపుము అని యర్థము.

మ. ఆరూపమునే వివరించుచున్నాఁడు.—కిరీటము గలవాఁడవు గద గలవాఁడవు చక్రహస్తుఁడ వగు నిన్నుఁ జూడఁ గోరుచున్నాను, తథైవ= పూర్వమువలెనే. అందువలన, తేనైవరూపేణ చతుర్భుజేన=ఆచతుర్భుజరూపముతోనే, వసుదేవపుత్త్రుఁడ

నై; భవ=ఉండుము. ఇప్పుడు, సహస్రబాహో విశ్వమూర్తే=సహస్రబాహుఁడా విశ్వరూపుఁడా! విశ్వరూపము నుపసంహరించి పూర్వరూపముతోనే కనఁబడు మని యర్థము. ఇందుచే నర్జునుఁ డెల్లప్పుడును భగవంతునిచతుర్భుజరూపమునే చూచుచుండె నని చెప్పఁబడినది.

శ్రీ. కిరీటమును గదను చక్రమును ధరించి యుండు నిన్నుఁ జూడఁ గోరుచున్నాను, పూర్వ మెట్లు చూచుచుంటినో అట్లే. కావున, సహస్రబాహో విశ్వమూర్తే! ఈ విశ్వరూపము నుపసంహరించి, తేనైవరూపేణ చతుర్భుజేన=ఆ కిరీటాదియుక్తమయినచతుర్భుజరూపముతోనే; భవ=ఆవిర్భవింపుము. ఇందుచే నర్జునుఁడు మున్నును శ్రీకృష్ణుని కిరీటాదియుక్తునిఁ గానే చూచుచుండె నని తెలియవచ్చుచున్నది. ఇఁక విశ్వరూపదర్శనమునందు “కిరీటినం గదినం చక్రిణంచ పశ్యామి” అని యేది చెప్పఁబడినదో అది బహుకిరీటాద్యభిప్రాయంబున నని తెలియునది. లేక. ఇంతకాలము కిరీటిని గదిని చక్రినిగాను సుప్రసన్నునిఁగాను నిన్నుఁ జూచుచుంటిని, అట్టి నిన్నే యిప్పుడు తేజోరాశినిగాను దుర్నిరీక్షునిఁగాను జూచుచున్నా నని యచటివచనంబున కభిప్రాయము, కావున విరోధము లేదు.

ప. ఇఁక నుపక్రమమునందుఁ జూచినరూప మెట్టిది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—కిరీటగదాచక్రములు గలవాని ననుట యుపలక్షణము, అందుచే సర్వాయుధములు ధరించినవాని నని యర్థము. ఇట నిది యభిప్రాయము. విశ్వరూపదర్శనోపక్రమమునందు దివ్యదృష్టిచే చతుర్భుజము తేజోరూపమై మనోజ్ఞ మగు నేరూపము చూడఁబడెనో అది విష్ణునందుఁ దక్క నితరునియందు సంభవింప దని పూర్వము పురాణాదులవలన విని యుంటిని, అట్టిరూపము నప్రయాసముగా నేను జూడఁ గంటి నని నాకు హర్షము కలిగెను, అనంతరము దంష్ట్రాకరాలము నత్యుగ్రము నగు నేరూపముఁ జూచితినో అది భయజనక మయ్యెను, అందువలనఁ గిరీటాద్యలంకృత మైన యారూపమునే చూడఁ గోరుచున్నాను, కాని భయజనక మైనరూపముఁ జూడ నొల్లను. అందువలన, విశ్వమూర్తే సహస్రబాహో! తేనైవ చతుర్భుజేన రూపేణ; భవ=ఆవిర్భవింపుము. ఇఁక విశ్వరూపదర్శనమునకు మున్నును నిరంతర మర్జునుఁడు చతుర్భుజరూపమునే చూచుచుండె నని చెప్పుదురేని, అప్పుడు “పశ్యామి దేవాం తవ దేవదేహే” అనుస్థలమున “కిరీటినం గదినం చక్రిణంచ” అని పునరుక్తి యుక్తము కాదు. మఱియును. చతుర్భుజరూపము దైవము కాని మానుషము కాదు,

మొదటనే వైష్ణవరూపము గాంచుచున్నపుడు "యచ్చావహాస మసత్కృతోఽసి" అనుట సంభవింపదు. ఇంతియ గాక, "అవజానన్తి మాం మూఢా మానుషీం తను మాశ్రితమ్" అనియు "దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన" అనియు నుపక్రమోపసంహారములను సర్వమనుష్యసాధారణ మయిన ద్విభుజ రూపమే నిర్దేశింపఁబడినది.

రా°. తథైవ=పూర్వమువలెనే; కిరీటినం గదినం చక్రహస్తం త్వాం ద్రష్టు మిచ్ఛామి. కావున, తేన=పూర్వసిద్ధ మయిన; చతుర్భుజేన రూపేణైవ; భవ=యుక్తుఁడ వగుము. సహస్రబాహో విశ్వమూర్తే—ఇప్పుడు సహస్రభుజమై విశ్వశరీరమై కనఁబడుచున్నరూపముగల నీవు ఆరూపముతోనే కూడినవాఁడ వగు మని యర్థము.

శ్రీభగవా నువాచ —

మయా ప్రసన్నేన తవార్జునేదం
రూపం పరం దర్శిత మాత్మయోగాత్
తేజోమయం విశ్వ మనన్త మాద్యం
యన్మే త్వదన్యేన న దృష్టపూర్వమ్. ౪౭

భా°. అర్జునుని భయము నొందినవానిఁగాఁ జూచి విశ్వరూపము నుపసంహరించి ప్రియవచనంబున నాశ్వాసించుచు శ్రీభగవంతుం డిట్లనియె.—ప్రసన్నేన = ప్రసాద మనఁగా నీయం దనుగ్రహబుద్ధి, అది గలవాఁడ నగు; మయా=నాచేత; తవ=నీకు; అర్జున=ఓ యర్జునుఁడా! మే=నాయొక్క; యత్=ఏరూపము; త్వదన్యేన=నీకంటె నితరునిచే నెవ్వనిచేతను; దృష్టపూర్వం న=పూర్వము చూడఁబడినది కాదో; అట్టి, తేజోమయమ్=తేజఃప్రాయుంబును♦; విశ్వమ్=సమస్తంబును; అనన్తమ్=అంతరహితంబును; ఆద్యమ్ = ఆదియం దున్నదియు నగు; ఇదమ్=ఈ; పరం రూపమ్=విశ్వరూపము; ఆత్మయోగాత్=నాయైశ్వర్యసామర్థ్యమువలన; దర్శితమ్=చూపఁబడినది.

శ్రీభగవంతుఁ డిట్లనియె.—అర్జునా! నేను నీయెడ ననుగ్రహము చేసి యుదివఱకు మున్నెన్నఁడును నీకంటె నితరుఁ డెవ్వఁడును చూడనిదియు తేజోమ

♦ తేజస్సుచే నిండినదియు.

యంబును విశ్వాత్మకమును అనంతమును ఆద్యము నగు నీవిశ్వరూపమును నాయైశ్వర్యసామర్థ్యమువలన నీకుఁ జూపితి నని తాత్పర్యము.

ఆ. అర్జునుఁడు స్థానే హృషీకేశ ఇత్యాదిగాఁ జెప్పినవచనమును విని భగవంతుఁడు చెప్పినవాక్యమున కవతారిక చేయుచున్నారు అర్జునః ఇత్యాదిగా భగవత్ప్రసాదరూప మైనయుపాయముచేతనే లభ్యము తద్దర్శనం బనునభిప్రాయముతోఁ జెప్పుచున్నారు ప్రసన్నే నేత్యాదిగా.

హ. ఆత్మయోగాత్ = ఆత్మస్వరూపముతో యోగము ఆత్మయోగము, దానివలన.

శం. "స్థానే హృషీకేశ" ఇత్యాదిగా స్తుతించినవాఁడును విశ్వరూపసందర్శనముచేఁ బ్రహృష్టుఁడును భయముచేతనుం బీడితుండు నగు నర్జును నాశ్వాసించుటకును, అతిదుర్లభం బైన విశ్వరూపసందర్శనము నాయనుగ్రహముచే నీకు లబ్ధమయ్యె నని యభినందించుటకును శ్రీభగవంతుం డిట్లనియె.—ఓయర్జునా! నీభక్త్యతిశయమువలన, ప్రసన్నేన=నీయం దనుగ్రహము గలిగినట్టి; మయా = నాచేత; తేజోమయమ్=కోటిసూర్యప్రకాశ మయిన; విశ్వమ్=విశ్వాత్మక మయిన; కావుననే, అనన్తమ్=అంతవర్జిత మయిన; ఇదమ్=ఈ కనఁబడుచున్న; రూపమ్=విశ్వరూపము; ఆత్మయోగాత్=నాయొక్క మాయాయోగసామర్థ్యమువలన; తవ=భక్తాగ్రగణ్యుఁడవగు నీకు; దర్శితమ్ = చూపఁబడినది, ఇతరులకు శ్రవణవిషయము మాత్రమే ఇది, నీకు మాత్రము దృష్టివిషయము చేయఁబడిన దని యర్థము. ఓయీ! ధృతరాష్ట్రగృహమునందు భీష్మాదులకును బాల్యమునందు యశోదకును అక్రూరునకును దీని నీవు చూపియే యున్నావు, ప్రసన్నుఁడవై చూపితి నని యెట్లు చెప్పవచ్చును? అని యాశంకింపఁగా, అది యవాంతరరూపము, ఉత్తమము గాదు, ఇదియో సర్వోత్తమంబును ఇతరులచేఁ జూడఁబడనిదియు నని చెప్పుచున్నాఁడు.—త్వదన్యేన = భక్తవర్యుఁడ వగు నీకంటె నితరునిచేత, ఎవ్వనిచేతను గూడ; నదృష్టపూర్వమ్= మున్ను చూడఁబడనట్టి; మే=నాయొక్క, పరమేశ్వరునియొక్క; యత్ = ఏస్వరూపము; ఆద్యమ్ = ఆదికాలమునం దున్నది ఈశ్వరత్వకారణము సర్వోత్తమము గలదో; ఆ రూపమే యిది నీకుఁ జూపఁబడినది, తద్దర్శనము నీకు భాగ్యమువలన లబ్ధ మయినది. నాయీరూపముఁ జూచుటచే నీవు కృతార్థుఁడ వైతి వని యర్థము.

మ. ఇట్లర్జునునిచేఁ బ్రసాదితుండై భయపీడితుం డగు నర్జునుం జూచి విశ్వరూపము నుపసంహరించి యుచితవచనంబున నతని నాశ్వాసించుచు మూఁడు

శ్లోకములచే శ్రీభగవంతుఁ డిట్లనియె.—ఓయర్జునా! భయపడకుము. ఎందువలన ననఁగా, మయా = నాచేత; ప్రసన్నేన = నీయందుఁ గృపాతిశయము గలవానిచేత; ఇదమ్=ఈ విశ్వరూపాత్మక మయిన, పరమ్=శ్రేష్ఠ మగు; రూపమ్=రూపము; ఆత్మయోగాత్ =అసాధారణ మయిన నాసామర్థ్యమువలన; తవ దర్శితమ్. పరత్వమును వివరించుచున్నాఁడు.—తేజోమయమ్ = తేజఃప్రచురమును; విశ్వమ్=సమస్తమును; అనంతమును ఆద్యమును; మే=నాయొక్క; యత్=ఏరూపము; త్వదన్యేన=నీకంటె నితరునిచే నెవ్వనిచేఁ గాని; నదృష్టపూర్వమ్ = పూర్వము చూడఁబడినది గాదో, అట్టిది.

శ్రీ. ఇట్లు ప్రార్థితుఁడై యతని నాశ్వాసించుచు శ్రీభగవంతుఁడు పలికెను మూఁడుశ్లోకములచేత.—ఓ యర్జునా! ఏల నీవు భయపడుచున్నావు? ప్రసన్నుఁడ నగు నాచేఁ గృపావశంబున నీకీపరము—ఉత్తమ మయినరూపము చూపఁబడినది, ఆత్మయోగాత్ = నాయొక్క యోగమాయాసామర్థ్యమువలన. పరత్వమునే చెప్పుచున్నాఁడు.—తేజోమయమ్; విశ్వమ్=విశ్వాత్మకమును; అనంతమ్; ఆద్యమ్; యత్ మే=నాయొక్క యేరూపము; త్వదన్యేన = నీయట్టిభక్తునికన్న నితరునిచేత; నదృష్టపూర్వమ్=మున్ను చూడఁబడినది కాదో, అట్టిది.

ప. ఇఁక నాశ్వాసించుచు భగవంతుండు చెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—“ప్రవ్యథితాన్తరాత్మా ధృతిం నవిన్దామి” అని నీవు భయము నొందితి నని చెప్పితివి, ఆకస్మికాద్భుత భయానకరూపదర్శనముచే భయము పుట్టును, ప్రకృతమునందో ప్రసన్నుఁడనైన నాచే దివ్యదృష్టి దానపూర్వకముగా, తవ=నీకొఱకు; ఆత్మయోగాత్=నాదు మాయావైభవమువలన; పరమ్=ఉత్కృష్ట మగు; రూపమ్=రూపము; దర్శితమ్ = చూపఁబడినది. కావుననే నాలుగువిశేషణములచేఁ జెప్పుచున్నాఁడు.—తేజోమయం విశ్వ మనన్త మాద్యమ్ అని. ఏది నీకంటె నితరుఁ డెవ్వని చేతను పూర్వము దృష్టము గాదో అట్టిది.

రా. యత్=ఏ; మే=నాయొక్క, తేజోమయమ్=తేజస్సులరాశి యయిన దియు; విశ్వమ్=విశ్వమునకు ఆత్మభూత మయినదియు; అనన్తమ్=అంతరహిత మయినదియు, ప్రదర్శనార్థం బది, ఆదిమధ్యాంతరహితమును; ఆద్యమ్ = మద్వ్యతిరిక్త మయిన సమస్తమునకును ఆదిభూతంబును; త్వదన్యేన=నీకంటె నితరుఁ డెవ్వనిచేతను; నదృష్టపూర్వమ్; రూపమ్=రూపము గలదో; అట్టి, ఇదమ్=ఇది; ప్రసన్నేన మయా;

నాభక్తుఁడ వయిన నీకుఁ జూపఁబడినది. ఆత్మయోగాత్=నాయొక్క సత్యసంకల్పత్వ సామర్థ్యమువలన.

న వేదయజ్ఞాధ్యయనై ర్న దానైః
నచ క్రియాభి ర్న తపోభి రుగ్రైః
ఏవంరూప శ్శక్య అహం నృలోకే
ద్రష్టుం త్వదన్యేన కురుప్రవీర. ౪౮

భా. మద్రూపదర్శనముచే నీవు కృతార్థుఁడవే యయితి వని దాని స్తుతించుచున్నాఁడు.—ఏవంరూపః= ఇట్టి—నీవు చూచినట్టి విశ్వరూపము గల; అహమ్=నేను; నృలోకే = మనుష్యలోకమునందు; త్వదన్యేన=నీకంటె నితరునిచేత; ద్రష్టుమ్=చూచుటకు; వేదయజ్ఞాధ్యయనైః = యథావిధి నాలుగువేదములయధ్యయనములచేతను యజ్ఞాధ్యయనములచేతను, వేదాధ్యయనములచేతనే యజ్ఞాధ్యయనము సిద్ధమగుటవలన వేఱుగా యజ్ఞాధ్యయనము గ్రహించుట యజ్ఞవిజ్ఞానోపలక్షణార్థము ♦; నశక్యః= అలవికాను. అట్లు, దానైః = తులాపురుషాదిదానములచేతను; న=అలవికాను. క్రియాభిశ్చ=అగ్నిహోత్రాదు లగు శ్రౌతాదికర్మములచేతను; న=అలవికాను. ఉగ్రైః=ఘోరము లగు; తపోభిః=చాంద్రాయణాదితపస్సులచేతను; న=అలవికాను. కురుప్రవీర=కురువంశమునం దుత్తమవీరుఁడైనవాఁడా!

కురువీరా! వేదాధ్యయనములచేఁ గాని యజ్ఞాధ్యయనములచేఁ గాని దానములచేఁ గాని కర్మములచేఁ గాని యుగ్రతపస్సులచేఁ గాని నీవు చూచినట్టి విశ్వరూపముతోఁ గూడిన నన్నుఁ జూచుటకు మనుష్యలోకంబున నీకుఁ దక్క మఱి యెవ్వరికి నలవి గా దని తాత్పర్యము.

అ. దాని అనుటచేఁ బ్రకృత మయినదర్శనము పరామర్శింపఁబడుచున్నది. వేదాధ్యయనముకంటె వేఱుగా యజ్ఞాధ్యయనము గ్రహించుట పునరుక్తివలన నయుక్త మని యాశంకించి చెప్పుచున్నారు వేదాధ్యయనములచేతనే ఇత్యాదిగా. వేదాధ్యయనగ్రహణమువలననే యజ్ఞవిజ్ఞానము గూడ గ్రహింపఁబడినది

♦ యజ్ఞవిజ్ఞాన మనఁగా యజ్ఞములప్రయోగక్రమము తెలియుట.

అధ్యయనం బర్థావబోధపర్యంత మగుటవలన నన నలవికాము, అధ్యయనం బక్షర గ్రహణాంత మని వృద్ధులచే సాధితం బగుటవలన నని భావము. శక్య అహమ్ అని సంధి చేయ కుండుట శ్లోకపూరణార్థము. నీకంటె నితరునిచేత—నాయనుగ్రహము లేనివానిచేత నని శేషము.

హ. అధ్యయనైః = అంగాధ్యయనములచేత. క్రియాభిః = గురుపరిచర్య మొదలగు క్రియలచేత.

శ్రీ. ఏతద్రూపదర్శనము దుర్లభం బనుటనే ప్రతిపాదించుచున్నాఁడు — వేదయజ్ఞాధ్యయనైః = ద్వంద్వాంతంబున శ్రూయమాణం బగు నధ్యయనశబ్దము ప్రత్యేకమును సంబంధించును, వేదాధ్యయనములచేతను యజ్ఞాధ్యయనములచేతను అని, ఋగాదు లగు నాలుగువేదములను నియమంబున నధ్యయనించుటలు వేదాధ్యయనములు, వానిచేతను, యజ్ఞీయ మంత్ర దేవతాప్రయోగ ప్రతిపాదక వేదార్థ జ్ఞానము లు యజ్ఞాధ్యయనములు, వానిచేతను; ఓయీ! వేదాధ్యయనములచేతనే యజ్ఞాధ్యయనము సంభవించుటవలన రెండియు యజ్ఞాధ్యయనము చెప్పవలసినది లేదు, అందు వేని, అట్లు చెప్పఁగూడదు, వేదాధ్యయనకాలమునందే పెక్కండ్రకుఁ దదర్థ విచారయోగ్యత సంభవింపమినవలన; విచారము పదప్రమాణాధ్యయనానంతరము చేయవలసిన దగుటవలనను, "అథాతో ధర్మజిజ్ఞాసా" అని ధర్మజిజ్ఞాస వేదము తదంగములను అధ్యయనించిన పిదప సంభవించు నని చెప్పఁబడుటవలనను మొదట నక్షరగ్రహణార్థంబును బిదప నర్థజ్ఞానార్థంబును అధ్యయనము కర్తవ్యమే యని సిద్ధము; దానైః = కన్యాదాన గోదానాదులచేతను; క్రియాభిః = శ్రౌతస్మార్తకర్మానుష్ఠానములచేతను; ఉగ్రైః=దుష్కరము లయిన; తపోభిః = కృచ్ఛ్ర చాంద్రాయణాది పుణ్యకర్మవిశేషములచేతను గూడ; ఏవం రూపః = విశ్వాత్మకుఁడ నగు; అహమ్=నేను బరమేశ్వరుఁడను; నృలోకే=మనుష్యలోకమునందు; త్వదన్యేన= నాభక్తవర్యునికంటె నితరునిచేత; ద్రష్టుమ్=చూచుటకు; నశక్యః=శక్యుండఁ గాను, మత్ప్రసాదము లేనివారికి ఇట్టి నన్నుఁ జూడ నలవి గా దని యర్థము. ఆర్ష మగుట వలన సంధి లేమి దోషము గాదు.

మ. ఏతద్రూపదర్శనాత్మక మయిన యతిదుర్లభ మగు నాప్రసాదము నొంది కృతార్థుఁడ వైతివి నీ వని చెప్పుచున్నాఁడు. నాలుగు వేదములయొక్కయు నధ్యయనములచేత—అక్షరగ్రహణరూపములచేత, అట్లు మీమాంసాకల్పసూత్రద్వా

రంబున యజ్ఞములయొక్క—వేదబోధితకర్మములయొక్క యధ్యయనములచేత, అర్థవిచారములచేత, వేదయజ్ఞాధ్యయనములచేతను; దానైః = తులాపురుషదానాదులచేతను; క్రియాభిః=అగ్నిహోత్రాదికర్మములచేతను; తపోభిః=కృచ్ఛ్రచాంద్రాయణాదులచేతను, కాయేంద్రియశోషణంబు లగుటచే దుష్కరము లగువానిచేతను; ఏవంరూపః; అహమ్; నృలోకే=మనుష్యలోకమునందు; త్వదన్యేన = నాయనుగ్రహము లేనివానిచేత; ఓ కురుప్రవీరుఁడా! ద్రష్టుమ్; నశక్యః. శక్యో ఽహ మ్మని చెప్పవలసియుండఁగా విసర్గలోపము ఛాందసము. ప్రత్యేకము నకారప్రయోగము నిషేధదార్ఢ్యముకొఱకు. నచ క్రియాభిః అనుచో చకారమువలన అనుక్తము లయినసాధనాంతరములు సముచ్చితములు.

శ్రీ. అతిదుర్లభ మయిన యేతద్రూపదర్శనము నొంది నీవు కృతార్థుఁడ వైతి వని చెప్పుచున్నాఁడు —వేదాధ్యయనాతిరిక్త మయిన యజ్ఞాధ్యయనము లేమింజేసి యజ్ఞశబ్దముచే కల్పసూత్రాదియజ్ఞవిద్యలు లక్షితము లగుచున్నవి; వేదములయుయజ్ఞవిద్యలయు నధ్యయనములచేత నని యర్థము; దానైః; క్రియాభిః=అగ్నిహోత్రాదులచేతను; ఉగ్రైః; తపోభిః = కృచ్ఛ్రచాంద్రాయణాదులచేతను; ఏవం రూపః ఽహం త్వదన్యేన నృలోకే ద్రష్టుం నశక్యః. ము తేమనఁగా, నీవుమాత్రమే నాప్రసాదంబునం జూచి కృతార్థుండ వైతివి.

మ. ఇఁక నిది దుర్లభం బని చెప్పుచున్నాఁడు.—వేదములు ఋగాదులు, యజ్ఞము లశ్వమేధాదులు, అధ్యయనము శాస్త్రపఠనము, వీనిచేతను; తులాపురుషాదిదానములచేఁ గూడ, క్రియాభిః = శ్రౌతస్మార్తకర్మములచేతను గూడ, తపోభిః= కృచ్ఛ్రచాంద్రాయణాదులచేతను; నృలోకే = మనుష్యలోకమునందు, అర్జనభూమియందు *; త్వదన్యే ద్రష్టుం నశక్యః. కురుప్రవీర అనుటచే నిర్భయుండ వగు నీవు భయము నొందుట యనుచితం బని సూచింపఁబడినది.

రా. అనన్యభక్తిచేతనే తక్కఁ దక్కిన సర్వోపాయములచేతను గూడ నిట్టి నన్నుఁ జూడ శక్యము గా దని చెప్పుచున్నాఁడు.—ఏవం రూపః=ఇప్పు డున్నరూపము గల; అహమ్ = నేను; నాయందు భక్తిమంతుఁడ వగు నీకన్న నితరునిచేత—ఏకాంతభక్తి లేనివానిచేత, ఏపురుషునిచేత నేనియు కేవలము లగు వేదయజ్ఞాదులచేఁ జూడ శక్యము కాను.

---

* కర్మానుష్ఠానముచే ఫలము సంపాదింపఁదగుభూమియందు అనుట.

మా తే వ్యథా మా చ విమూఢభావో
దృష్ట్వా రూపం ఘోర మీదృ జ్మ మేదమ్
వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం
తదేవ మే రూప మిదం ప్రపశ్య. ౪౯

భా. ఘోరమ్=భయంకర మయిన; ఈదృక్=యథాదర్శిత మగు; మమ=నాయొక్క; ఇదమ్=ఈ; రూపమ్=రూపమును; దృష్ట్వా = చూచి; తే=నీకు; వ్యథా=భయము; మా=వలదు. విమూఢభావశ్చ=విమూఢచిత్తత్వము గూడ; మా=వలదు. వ్యపేతభీః=పోయినభయము గలవాఁడవును; ప్రీతమనాః = సంతోషించినమనస్సు గలవాఁడవున్నై; పునః = వెండియు; త్వమ్=నీవు; తదేవ=నీ కిష్ట మయిన చతుర్భుజమును శంకచక్రగదాధరము నగు దానినే; మే=నాయొక్క; ఇదం రూపమ్=ఈరూపమును; ప్రపశ్య= చక్కఁగాఁ జూడుము.

భయంకర మయిన నా యీవిశ్వరూపముఁ జూచుటచే నీకు భయము వలదు, చిత్తమోహంబును వలదు, నీవు మరల నిర్భయుండవై సంతుష్టహృదయుండవై నీకుఁ బ్రియ మగు నాచతుర్భుజరూపమునే చూడు మని తాత్పర్యము.

ఆ. విశ్వరూపదర్శనము నిట్లు స్తుతించి దీనిం జూచుటవలన భయపడుదువేని దీని నుపసంహరించుచున్నా నని చెప్పుచున్నాఁడు.—బహువిధముగా ననుభవింపఁబడినది యను నభిప్రాయముతో ఈదృక్ అని చెప్పఁబడినది. ఇద మ్మని ప్రత్యక్షయోగ్యత్వము చెప్పఁబడినది.

హ. *

శం. ఏరూపముఁ జూచుటచే నీమనస్సునకు వ్యథ కలిగెనో ఆరూపము నుపసంహరించెదను, వ్యథ వల దని చెప్పుచున్నాఁడు.—ఈదృక్=బహుబాహూదరాదియుక్త మయిన; ఘోరమ్ = భయంకర మైన; రూపమ్; దృష్ట్వా; తే; వ్యథా = పరితాపము; మా=లేకుండుఁ గాక. విమూఢభావశ్చ = చిత్తవ్యామోహము గూడ; మా=లే కుండుఁ గాక. మ తే మనఁగా. వ్యపేతభీః = గతభయుండవై; ప్రీతమనాః= సంతోషించినమనస్సు గలవాఁడవై; మే=నాయొక్క; తదేవరూపమ్=శ్రీకృష్ణసంబంధి

* దీనికిని నీఁదిశ్లోకమునకు నీవ్యాఖ్యానము లేదు.

రూపమునే; ఇదమ్=దీని; పునః=మరల; ప్రపశ్య. చూచి శాంతుఁడ వగు మని యర్థము.

మ. ఇట్లు నిన్ననుగ్రహించుటకై యావిర్భవించిన యీరూపముచే నీకు నుద్వేగము కలుగునేని, అప్పుడు.—ఇదం ఘోరమీదృక్=అనేకము లయిన బాహువులు మొదలగువానితోఁ గూడిన దగుటచే జేసి భయంకర మయినయీ; మమ; రూపమ్; దృష్ట్వా = చూచి యున్నట్టి; తే=నీకు; వ్యథా = భయనిమిత్త మయినపీడ యేది గలదో అది; మా=లేకుండుఁ గాక. అట్లు, నారూపముఁ జూచుచున్నను, విమూఢభావశ్చ=వ్యాకులచిత్తత, అపరితోషము ఏది గలదో అదియు; మా=లేకుండుఁ గాక. మ తే మనఁగా. వ్యపేతభీః=విగతభయుఁ డవును; ప్రీతమనాశ్చ=సంతుష్ట మనస్కుఁడవునై; పునః; త్వమ్; తదేవ=చతుర్భుజంబును వాసుదేవత్వాదివిశిష్టంబును నీచే నెల్లప్పుడును మున్ను చూడఁబడినదియు నైన దానినే; రూపమ్; ఇదమ్= విశ్వరూపము నుపసంహరించి ప్రకటింపఁబడుచున్నదీనిని; ప్రపశ్య = ప్రకర్షంబున–నిర్భయముగాను సంతోషముగాను జూడుము.

శ్రీ. ఇట్లయినను నీకీ ఘోరరూపముఁ జూచుటవలన వ్యథ కలుగునేని నీకారూపమునే చూపెద నని చెప్పుచున్నాఁడు —ఈదృక్= ఇట్టిదైన; నా ఘోరరూపముఁ జూచి నీకు వ్యథ వలదు. విమూఢభావశ్చ = విమూఢత్వము గూడ; మా= వలదు. వ్యపగతభయుఁడవు ప్రీతమానసుండవునై వెండియు నీవు దానినే యీనా రూపమును బ్రకర్షంబునఁ జూడుము.

ప. అందువలననే చెప్పుచున్నాఁడు.—ఘోరమ్ = భయానక మయిన; మమ రూపం దృష్ట్వా; తే; వ్యథా=భయము; విమూఢ భావః= భ్రాంతత్వము; మా= వలదు. ఇఁకమీఁద, వ్యపేతభీః; ప్రీతమనస్కుఁడవునై, తదేవ=మున్ను చూచినదానినే; వెండియుఁ జూడుము.

రా. ఇట్టి ఘోరరూపముఁ జూచుటచే నీ కేవ్యథయు విమూఢభావమును కలుగుచున్నదో ఆ రెండును లేకుండుఁ గాక. నీవు మున్ను చూచుచుండినదానినే సౌమ్యరూపముఁ జూపుచున్నాను, ఆయీ నారూపమునే చూడుము.

సఞ్జయ ఉవాచ.—

ఇత్యర్జునం వాసుదేవ స్తథోక్త్వా
స్వకం రూపం దర్శయామాస భూయః

ఆశ్వాసయామాస చ భీత మేనం
భూత్వా పున స్సౌమ్యవపు ర్మహాత్మా. ౫౦

భా. సంజయుఁ డిట్లనియె —ఇతి=ఈవిధముగా; వాసుదేవః = కృష్ణుడు; అర్జునమ్=అర్జునుని గూర్చి; తథా=అట్టివచనమును; ఉక్త్వా=చెప్పి; స్వకమ్=తనదైన, వసుదేవగృహమునందుఁ బుట్టిన; రూపమ్=రూపమును; భూయః=వెండియును; దర్శయామాస=చూపెను. పునః=మరల; మహాత్మా=గొప్పప్రభావము గల కృష్ణుఁడు; సౌమ్యవపుః=ప్రసన్నమయిన దేహము గలవాఁడై; భీతమ్ = భయపడినట్టి; ఏనమ్=ఈయర్జునుని; ఆశ్వాసయామాస చ=ఊఱడించెను గూడ.

సంజయుఁ డిట్లనియె —వాసుదేవుఁ డిట్లు పలికి యర్జునునకుఁ దనమెప్పటి స్వరూపముఁ జూపెను. అట్లు మరల సౌమ్యరూపము నొంది యమ్మహాత్ముఁడు భీతుండగునర్జునుని వెండియు నూఱడించె నని తాత్పర్యము.

ఆ. ఈ జరిగినవృత్తాంతమును ధృతరాష్ట్రునకు సంజయుఁడు విన్నవించె నని చెప్పుచున్నారు సంజయుఁడు ఇత్యాదిగా. అట్టివచనమును—మయా ప్రసన్నే నేత్యాదికమును. పూర్వపరిచిత మగు నారూపమును జూపినమాత్రమున నేమి ఫలము ? ప్రసన్నరూపుఁడై భగవంతుఁ డర్జును నాశ్వాసించుటయు నుచితం బనుటకు హేతువుఁ జెప్పుచున్నారు మహాత్మా అని.

శ్రీ. మహాత్మా=అప్రమేయ మయినస్వభావము గల; వాసుదేవః = భగవంతుఁడు; తథా = అట్లు—వ్యపేతభీః ప్రీతమనాః పున స్త్వం తదేవ మే రూప మిదం ప్రపశ్య అని; ఉక్త్వా=చెప్పి; తత్క్షణముననే, స్వకం రూపం దర్శయామాస. ఉపసంహారంబును ప్రదర్శనంబును నిమీలనోన్మీలనంబులవలె ♦ స్వాధీనంబు లని తెలుపుటకై తథా అని చెప్పఁబడినది. పునః సౌమ్యవపుః భూత్వా; ధైర్యవాక్యములచే, భీతమేనమ్; ఆశ్వాసయామాస = నిర్భయునిఁగాఁ జేసెను.

మ. వాసుదేవః; అర్జునమ్; ఇతి = మున్ను చెప్పినవాక్యమును; ఉక్త్వా= పలికి; తథా=ఎట్లు పూర్వ ముండెనో అట్లు; స్వకం రూపమ్= కిరీటమకరకుండలగదాచక్రాదియుక్తంబును చతుర్భుజంబును శ్రీవత్సకౌస్తుభవనమాలాపీతాంబరాదిశోభి

♦ మూయుట తెఱచుటలవలె.

తంబు నగు తనరూపమును, భూయః=మరల; దర్శయామాస. పునః=మునుపటివలె; సౌమ్యవపుః=ఉగ్రము కాని శరీరము గలవాఁడు; భూత్వా=అయి; మహాత్మా=పరమ కారుణికుఁడు సర్వేశ్వరుఁడు సర్వజ్ఞుఁడు—ఇత్యాదికల్యాణగుణాకరుఁడు; భీతమ్; ఏనమ్=ఈయర్జునుని; ఆశ్వాసయామాసచ.

శ్రీ. ఇట్లు పలికి మునుపటిరూపమునే చూపె నని సంజయుఁడు చెప్పెను.—శ్రీవాసుదేవుఁ డర్జునుని గూర్చి యిట్లు చెప్పి పూర్వ మెట్లుండెనో అట్లే కిరీటాది యుక్తము చతుర్భుజ మగురూపమును వెండియుఁ జూపెను. భీతుం డగునీయర్జునుని నిట్లు ప్రసన్నశరీరుండై వెండియు నాశ్వాసించెను. మహాత్మా=విశ్వరూపుఁడు, లేక, కృపాలువు.

ప. వెండియు సంజయుఁ డిట్లనియె.—ఇతి=చెప్పినవిధంబున; వాసుదేవః; ఉక్త్వా; స్వకంరూపమ్ = తనచతుర్భుజరూపమును; దర్శయామాస. పునః=అనంతర ము; మహాత్మా = విశ్వరూపుఁడు, విష్ణువు; సౌమ్యవపుః = మనుష్యాకృతి గలవాఁడు; భూత్వా=అయి; భీతమ్; ఏనమ్=ఈ యర్జునుని; ఆశ్వాసయామాస.

రా. ఇట్లు పాండుపుత్త్రునితో భగవంతుఁడు వసుదేవపుత్త్రుఁడు పలికి మరలఁ దనచతుర్భుజరూపమునే చూపెను. అపరిచిత మయినస్వరూపముఁ జూచుటచే భయపడి యున్న యర్జునుని వెండియుఁ బరిచిత మయిన సౌమ్యశరీరము గలవాఁడై ఆశ్వాసించెను గూడ. మహాత్మా=సత్యసంకల్పుఁడు. సర్వేశ్వరుండును బరమ పురుషుండును బరబ్రహ్మమును జగదుపకారార్థము మర్త్యుఁడైనవాఁడు నగు వసుదేవ పుత్త్రునకుఁ జతుర్భుజరూపమే స్వరూపము. కంసునివలన భయపడినట్టి వసుదేవుని ప్రార్థనముచే గంసవధం బగువఱకు భుజద్వయము నుపసంహరించి యుండి యటు పిమ్మట బయలుపఱచెను. «జాతోఽసి దేవ దేవేశ శఙ్ఖచక్రగదాధర। దివ్యం రూప మిదం దేవ ప్రసాదే నోపసంహర, ఉపసంహర విశ్వాత్మన్ రూప మేత చ్చతుర్భుజమ్" * అని గదా వసుదేవుఁడు ప్రార్థించెను, ద్వేషి యగు శిశుపాలునకుఁ గూడ వసుదేవపుత్త్రునిచతుర్భుజరూపమే యనవరతభావనావిషయమై యుండెను «ఉదార పీవర చతుర్బాహుం శఙ్ఖచక్రగదాధరమ్" ♦ అని. అందువలనఁ బార్థునిచే నిట « తేనైవరూపేణ చతుర్భుజేన » అని చెప్పఁబడినది.

* దేవా! దేవేశా! శంఖచక్రగదాధరా! పుట్టితివి, ప్రసాదముచే నీదివ్యరూపము నుపసంహరింపుము. విశ్వాత్ముఁడా! ఈచతుర్భుజరూపము నుపసంహరింపుము.

♦ గొప్పబలిసిననాలుగుచేతులు గలవానిని శంఖచక్రగదాధరుని.

మా. స్వకం రూప మ్మనుట భ్రాంతదృష్టిచేత. కానిచో నదియు స్వకంబే. ప్రమాణములలో మున్నే చెప్పఁబడినవి.

అర్జున ఉవాచ.—

దృష్ట్వేదం మానుషం రూపం తవ సౌమ్యం జనార్దన
ఇదానీ మస్మి సంవృత్త స్సచేతాః ప్రకృతిం గతః. ౫౧

భా. అర్జునుఁ డిట్లనియె.—జనార్దన = కృష్ణా! తవ= నీయొక్క; ఇదమ్=ఈ—నాకు మిత్త్ర మయిన; సౌమ్యమ్=ప్రసన్న మగు; మానుషం రూపమ్=మనుష్యసంబంధి యయినరూపమును; దృష్ట్వా=చూచి; ఇదానీమ్=ఇప్పుడు; సచేతాః = ప్రసన్న మయినచిత్తము గలవాఁడనుగా; సంవృత్తః=అయినవాఁడను; అస్మి=అగుచున్నాను. ప్రకృతిమ్=స్వభావమును; గతః=పొందినవాఁడ నైతిని.

అర్జునుఁ డిట్లనియె.—కృష్ణా! సౌమ్యమును నాకుఁ బరిచితము నగు నీయీ మనుష్యరూపముఁ జూచిన పిదప నిప్పుడు నామనస్సు స్వస్థ మయి నాకు ధైర్యము గలిగె నని తాత్పర్యము.

రా. ఇట్లు భగవంతునిచే నాశ్వాసింపఁబడినవాఁడై యర్జునుం డాతనిఁ జూచి పలికె నని చెప్పుచున్నారు అర్జునుఁడు ఇత్యాదిగా.

హ. ఇదమ్=ఈ, పరమపదప్రాప్తికారణ మైన.

శం. మనుష్యరూపముఁ జూపుటచేతను ఆశ్వాసవాక్యముచేతను స్వస్థుఁడై యర్జునుం డిట్లనియె.—సౌమ్యమ్ = శాంత మయిన; తవ; ఇదం రూపమ్; దృష్ట్వా; ఇదానీమ్; భయకంపాదిలక్షణ మయిన వికృతిని విడిచి, ప్రకృతిమ్=స్వభావమును; గతః=పొందినవాఁడ నైతిని. సచేతాః=స్వస్థచిత్తుఁడనుగా; సంవృత్తః=అయినవాఁడను; అస్మి=అగుచున్నాను.

మ. అంత నిర్భయుండై యర్జునుఁ డిట్లనియె—ఇదానీమ్; సచేతాః= భయముచేఁ గలుగువ్యామోహము లేమిచే అవ్యాకుల మయినచిత్తము గలవాఁడను; సంవృత్తో౽స్మి. అట్లు, ప్రకృతిమ్=భయముచేఁ గలుగువ్యథ లేమిచే స్వస్థతను; గతః. ఇతరము స్పష్టము.

శ్రీ. అంత నిర్భయుండై యర్జునుం డిట్లనియె.—సచేతాః = ప్రసన్న మయినచిత్తము గలవాఁడను; ఇదానీమ్; సంవృత్తః అస్మి=అయితిని. ప్రకృతిమ్=స్వస్థతను గూడ; గతః=పొందినాఁడను. శేషము స్పష్టము.

ప. వెండియు నర్జునుం డిట్లనియె.—మానుషమ్=మనుష్యులు చూచుటకు యోగ్య మయిన; సచేతాః= ప్రసన్నచిత్తుఁడను; సంవృత్తః అస్మి. ప్రకృతిమ్= స్వాస్థ్యమును గూడ; గతః.

రా. నిరతిశయసౌందర్యసౌకుమార్యలావణ్యాదియుక్తంబును నీకే యసాధారణంబును మనుష్యాకారంబున నున్నదియు నతిసౌమ్యంబు నగు నీ యీరూపముఁ జూచి యిప్పుడు సచేతుఁడ నైతిని, ప్రకృతినిం బొందితిని.

మూ. ♦

శ్రీభగవా నువాచ.—

సుదుర్దర్శ మిదం రూపం దృష్టవా నసి య న్మమ
దేవా అ ప్యస్య రూపస్య నిత్యం దర్శనకాఙ్క్షిణః. ౫౨

భా. శ్రీభగవంతుఁ డిట్లనియె.—ఇదం రూపమ్ = ఈ విశ్వరూపము; సుదుర్దర్శమ్ = మిక్కిలి దుఃఖంబుచేత దర్శనము గలది *; మమ = నాయొక్క; యత్ రూపమ్ = ఏరూపమును; దృష్టవాన్ = చూచినవాఁడవు; అసి = అగుచున్నావో; అది. దేవా అపి = దేవతలు గూడ; అస్యరూపస్య = అట్టి యీరూపముయొక్క; నిత్యమ్ = ఎల్లప్పుడును; దర్శనకాఙ్క్షిణః = దర్శనము గోరువారలు. అయినను జూచినవారు కారు, చూడనుం జాలరు అని యభిప్రాయము.

శ్రీభగవంతుఁ డిట్లనియె.—ఏ నావిశ్వరూపమును నీ విప్పుడు చూడఁ గల్గితివో దాని నెవ్వరికిని జూడ నలవి కాదు. దేవతలు గూడ నీరూపము నెల్లప్పుడుఁ జూడఁ గోరు చుందురు, కాని చూడ లే రని తాత్పర్యము.

ఆ. ఉపాస్యం బని తెలుపుటకై విశ్వరూపమును స్తుతించునట్టి భగవద్వాక్యము నెత్తుచున్నారు శ్రీభగవంతుఁడు ఇత్యాదిగా. నీకుఁ దక్క నితరుల కీరూపముఁ జూడ శక్యము గా దనునర్థమును విశదీకరించుచున్నారు దేవా అపి ఇత్యాదిగా.

♦ ఇది మొద లధ్యాయము కడవఱకు మాధ్వభాష్యము లేదు.

* బహుకష్టములచేఁ గూడఁ జూడ నశక్య మయిన దనుట.

హ. *

శం. ప్రశాంతుం డగు నర్జునుం జూచి యతనికిఁ బ్రహ్లాదముఁ గలిగించుట కై శ్రీభగవంతుం డి ట్లనియె.—అపరిమిత తేజోమయుం డగుటవలన దుఃఖముచే దర్శనము గలది దుర్దర్శము, మిక్కిలి దుర్దర్శము సుదుర్దర్శము, అట్టి; యత్ =ఏ; ఇదమ్ = ఈ నీకుఁ జూపఁబడినట్టి; మమ=నాయొక్క; రూపమ్ = విశ్వాఖ్యరూపము గలవో: దాని నీవు; దృష్టవా నసి=చూచినాఁడవు గదా! దీనిదర్శనం బలభ్యము, ప్రాప్యమువలన నీకు లభించె నని యర్థము. అలభ్యత్వమునే విశదీకరించుచున్నాఁడు.—తేజోబలపరాక్రమంబులచే నుత్కృష్టు లగు, దేవా అపి = ఇంద్రాదులు గూడ; అస్య రూపస్య=నా యీరూపముయొక్క; నిత్యం దర్శనకాఙ్క్షిణః—ఎల్లప్పుడును ఈ రూపముఁ జూడ నపేక్షించు చున్నారు. కాని నీవు చూచినట్లు వారు చూచినవారు కారు. దేవతలకును దుర్లభము నాదర్శనం బని యర్థము.

మ. తాను జేసిన యనుగ్రహం బతిదుర్లభ మని తెలుపుచు నాలుగుశ్లోకములచే శ్రీభగవంతుఁ డి ట్లనియె.—మమ=నాయొక్క; యత్ =ఏరూపమును; ఇప్పుడు నీవు, దృష్టవా నసి. ఇదం రూపమ్ = ఆయీ విశ్వరూపము; సుదుర్దర్శమ్ = ఎంత మాత్రము చూచుట కశక్యము. ఎందువలన ననఁగా. దేవా అపి; అస్య రూపస్య; నిత్యమ్ = ఎల్లప్పుడు; దర్శనకాఙ్క్షిణః. కాని నీవలె మున్నును జూచినవారు కారు, ఇఁకమీఁదనుం జూడఁ బో రని యభిప్రాయము, దర్శనకాంక్ష నిత్య మనుటవలన.

శ్రీ. తాను గావించినయనుగ్రహ మతిదుర్లభం బని తెలుపుచు శ్రీభగవంతుఁ డి ట్లనియె.—ఏ నావిశ్వరూపమును నీవు చూచితివో అట్టి యిది, సుదుర్దర్శమ్=మిక్కిలి చూడ నశక్యము. ఎందువలన ననఁగా, దేవతలు గూడ దీనిఁ జూచుట కెల్లప్పుడును గోరుచున్నారు మాత్రమే కాని దీని జూడ లేకున్నారు.

ప. వెండియు భగవంతుఁ డి ట్లనియె. మమ రూపం యద్దృష్టవా నసి= నారూపమును దేనిని జూచితివో; ఇదమ్=ఆయిది; సుదుర్దర్శమ్ = మిక్కిలి దుఃఖము చేతఁ గూడఁ జూడ నలవిగానిది. అస్య రూపస్య; దేవా అపి; నిత్యమ్; దర్శనకాఙ్క్షిణః=దర్శనమునకు మనోరథముమాత్రము కలిగి యున్నారు, కాని పొంద కున్నారు.

రా. సర్వంబును బ్రకాశించునదియు సర్వాశ్రయంబును సర్వకారణభూతంబు నగు నాయొక్కయీరూపమును దేనిఁ జూచితివో, అది, సుదుర్దర్శమ్=ఎవ్వని

* ౫౨, ౫౩, ౫౪ శ్లోకములకు హ. వ్యాఖ్యానము లేదు.

చేతను జూడ శక్యము కానిది. అస్య రూపస్య దేవా అపి నిత్యం దర్శనకాఙ్క్షిణః. కాని చూచినవారు కారు.

నాఽహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా
శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా. ౫౩

**భా.** ఎందువలన ?—అహమ్=నేను; వేదైః=ఋగ్యజుస్సామాథర్వ వేదములనాలుగింటిచేతను; నశక్యః=అలవికాను; తపసా=ఉగ్ర మయిన చాంద్రాయణాదితపస్సుచేతను; న=అలవికాను; దానేన=గో భూ హిర ణ్యాదిదానముచేతను; న=అలవికాను; ఇజ్యయాచ = యజ్ఞముచేతను; లేక, పూజచేతను; న=అలవికాను; ఏవం విధః=ఇట్టివిధము గలవాఁడను; ద్రష్టుమ్ = చూచుటకు. నీవు, మామ్=నన్ను; యథా=ఎట్లు; దృష్టవా నసి=చూచితివో, అట్లు చూచుటకు.

వేదములచేతఁ గాని చాంద్రాయణాదితపస్సుచేఁ గాని గో భూ హిర ణ్యాదిదానముచేతఁ గాని యజ్ఞముచేతఁ గాని పూజనముచేతను గాని నీవు చూచిన విధంబున నావిశ్వరూపంబు నెట్టివారికిని జూడ శక్యము గా దని తాత్పర్యము.

**ఆ.** దర్శనోపాయము లేమివలన దుర్దర్శ మని శంకించుచున్నాఁడు ఎందు వలన అని. వేదాదు లుపాయము లున్నను ఉక్తలక్షణుం డగు భగవంతునిఁ జూడ శక్యము గా దని చెప్పుచున్నాఁడు నాహ మిత్యాదిగా. అప్పుడు దర్శనమున కయో గ్యుఁ డగుటవలనఁ జూడ శక్యము గా దని యాశంకించి చెప్పుచున్నాఁడు దృష్టవా న సీత్యాదిగా.

**శం.** జన్మాంతరములయందు భోగేచ్ఛచే యథావిధి వేదాధ్యయనాది పుణ్యకర్మముల ననుష్ఠించుటవలన దేవభావమును బొందినవారలై మర్త్యకీర్తిరూ న్యులైన యయ్యింద్రాదులకు మద్దర్శన మలభ్యం బని సూచించుటకై వేదాదులు స్వస్వరూపసాక్షాత్కారమునందు సాధనము కాఁజాల వని చెప్పుచున్నాఁడు.— వేదైః=సకలవేదాధ్యయనములచేతను; న=కాను; తపసా=కృచ్ఛ్రాదితపస్సుచేతను; న=కాను; దానేన=కన్యాదిదానముచేతను; న=కాను; ఇజ్యయాచ=శ్రౌతస్మార్తకర్మ ముచేతఁ గూడ; న=కాను; ఏవంవిధః=విశ్వరూపుఁడ నగు; అహమ్=నేను; ద్రష్టుమ్= చూచుటకు. యథా=ఎట్లు; మామ్; నీవు; దృష్టవానసి, అట్లు అట్లు వేదాధ్యయ

వాదిపుణ్యకర్మములు గలవారలు నన్ను సవిశేషునిఁ జూడఁజాలరు, ఇఁక నిర్విశేషు నెట్లు సాక్షాత్కరింతు రని యర్థము. ఇదుచే « నవేద యజ్ఞాధ్యయనైః » అనుశ్లోకమునఁ బ్రతిపాదింపఁబడినయర్థమునే « నాహం వేదైః ” అని వెండియుఁ బ్రతిపాదించుటవలనఁ గర్మములకు మోక్షమునందు సాక్షాత్సాధనత్వ మేవిధంబునను సిద్ధింప దని చక్కఁగా సూచితం బగుచున్నది.

మ. ఎందువలన దేవత లీరూపమును జూచినవారు కారు, చూడనుం బోరు ? అనఁగా మద్భక్తిశూన్యు లగుటవలన నని చెప్పుచున్నాఁడు.—నవేదయజ్ఞాధ్యయనై రిత్యాదిశ్లోకముచే గతార్థం బీశ్లోకము, పరమదుర్లభత్వమును దెలుపుటకై వెండియుఁ జెప్పఁబడినది.

శ్రీ. అందుకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.—అర్థము స్పష్టము.

ప. ఇది గతార్థము.

రా. ఎందువలన ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—అధ్యాపన ప్రవచ నాధ్యయన శ్రవణ జపవిషయములైన వేదములచేతను యాగ దాన హోమ తపస్సుల చేతను మద్భక్తివిరహితములై కేవలము లయినవానిచే నిట్టిరూపము గల నేను జూడ నలవికాను.

భక్త్యా త్వనన్యయా శక్య అహ మేవం విధో ఽర్జున
జ్ఞాతుం ద్రష్టుం చ తత్త్వేన ప్రవేష్టుం చ పరన్తప. ౫౪

భా. ఎట్లు మఱి శక్యుఁడ నవుదువు? అనఁగాఁ జెప్పెదను.—భక్త్యాతు=భక్తిచేతనో; ఎట్టి భక్తిచేత ? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అనన్యయా = పృథగ్భూతము కానిదానిచేత, భగవంతునికంటె నితర మయినచోట వేఱుగా నెప్పుడును ఏది యుండదో అట్టిదానిచేత; దేనిచే సర్వకరణంబులచేతను వాసుదేవునికంటె నితర ముపలబ్ధము కాదో అది యనన్యభక్తి, అట్టి యనన్యభక్తిచేత; శక్యః=అలవియగుదును; అహమ్= నేను; ఏవంవిధః=విశ్వరూపప్రకారుండను; అర్జున=ఓయర్జునా! జ్ఞాతుమ్= శాస్త్రమువలన నెఱుంగుటకును; ఎఱుంగుటకు మాత్రమె కాదు, ద్రష్టుంచ=సాక్షాత్కరించుటకును; తత్త్వేన=తద్భావమున; ప్రవేష్టుంచ = మోక్షము నొందుటకును- పరన్తప=శత్రువులఁ దపింపఁజేయువాఁడా!

అర్జునా! ఎట్టిభక్తిచే వాసుదేవునికంటె నితరము సర్వకరణంబులచేతను అనుభవింపఁబడదో అట్టి అనన్య మయినభక్తిచే మాత్రము విశ్వరూపుండ నగు న న్నెఱుంగుటకును జూచుటకును ఐక్యంబునఁ బ్రవేశించుటకును శక్య మగు నని తా.

ఆ. ఏయుపాయముచే నిఁక భగవంతునిఁ జూడ శక్య మగును? అని యడుగుచున్నాఁడు ఎట్లు ఇత్యాదిగా. శాస్త్రీయజ్ఞానద్వారంబున తద్దర్శనము సఫల ముగా సిద్ధించు నని చెప్పుచున్నాఁడు చెప్పెద నని. భక్తిమాత్ర మందుకు హేతువు గా దని తుశబ్దార్థమును స్ఫుటీకరించుచున్నాఁడు ఎట్టిభక్తిచేత నిత్యాదిగా. అనన్య మగుభక్తినే వ్యక్తీకరించుచున్నారు దేనిచే నిత్యాదిగా.

శం. ఓయీ! వేదాదులు సాధనములు కావేని అప్పుడు దేనిచే నీసాక్షాత్కార మగును? అని యాశంకింపఁగాఁ జెప్పుచున్నాఁడు.—తుశబ్దమునకు ఇతరము సాధనము కా దనుటను నిర్ధారించుట యర్థము. «సర్వం ఖల్విదం బ్రహ్మ» ఇత్యాది శాస్త్రార్థోపదేశముచేఁ గలుగు జ్ఞానముచేఁ బుట్టినట్టి, అనన్యయా=శ్రుతము దృష్టము స్పృష్టము మతము విజ్ఞాతము సర్వంబును బ్రహ్మమే యని సర్వంబును తానును బ్రహ్మ మాత్రమే యని గ్రహింపఁ జేయునదియుఁ బ్రత్యయాంతరశూన్యంబు నగు; భక్త్యా తు=అనుసంధానముచేత నే; ఏవంవిధః = విశ్వాత్మకుఁడ నగు; అహమ్ = పరమాత్మ; చక్కఁగా నారాధింపఁబడినవాఁడనై; తత్త్వేన=యథార్థస్వరూపంబున, ఇదియే పరమార్థ మగువస్తు వని; జ్ఞాతుమ్=నిశ్చయించుటకును; ద్రష్టుమ్ = ఇదియే నే నని స్వరూపంబున సాక్షాత్కరించుటకును; ప్రవేష్టుంచ = విదేహుఁడై మద్రూపంబున నిలుచుటకును; శక్యః = అలవియగు చున్నాను. నిర్విశేషబ్రహ్మరూపంబున జ్ఞానమునకు విషయము నగుచున్నా నని యర్థము. ఇట నిది యభిప్రాయము.—ముఖ్యాధికారి యగు ముముక్షువు చిత్తశుద్ధికొఱకు శ్రద్ధాభక్తులతో బ్రహ్మమే యిదియంతయు నని సవిశేషవిశ్వరూపబ్రహ్మోపాసనము చేయఁగా దానిచే భేదప్రత్యయము నశించుట వలనఁ బరిశుద్ధాత్ముఁడై నిర్విశేష మగుపరబ్రహ్మమును ఎఱుంగుటకును సాక్షాత్కరించుటకును తద్రూపావస్థానలక్షణ మయినవిదేహముక్తిని బొందుటకును దనయంత నే శక్తుఁ డగు నని.

మ. నీవు వేదతపోదానేజ్యలచేఁ జూడ నలవికావేని అప్పు డేయుపాయముచేఁ జూడ నలవి యగుదువు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—తుశబ్దము సాధనాంతరవ్యావృత్త్యర్థము. అనన్యయా=మదేకనిష్ఠ మయిన; భక్త్యా తు = నిరతిశయప్రీతి

చేతనే; ఏవంవిధః = దివ్యరూపధరుండ నగు; అహమ్=నేను; శాస్త్రమువలన, జ్ఞాతుం శక్యః. ఓయర్జునుండా! శక్య అహమ్ అని విసర్గలోపము ఛాందసము పూర్వము వలె. అనన్యభక్తిచే శాస్త్రమువలన నెఱుంగుటకు శక్యుండమాత్రమే కాను; మఱే మనంగా, తత్త్వేన ద్రష్టుంచ=స్వరూపంబున సాక్షాత్కరించుటకుం గూడ శక్యుండను; వేదాంతవాక్య శ్రవణ మనన నిదిధ్యాసనముల పరిపాకముచేత. అంత స్వరూప సాక్షాత్కారమువలన నవిద్యాతత్కార్యములు నివర్తిల్లంగా, తత్త్వేన ప్రవేష్టుంచ= మద్రూపంబునం బొందుటకుం గూడ నేను శక్యుండను. ఓపరంతపుండా అను సంబోధనము అజ్ఞానశత్రుశమనంబునం బ్రవేశయోగ్యతను సూచించుచున్నది.

శ్రీ. అప్పం డేయుపాయముచే నిన్నుం జూడ శక్య మగును? అనంగాం జెప్పుచున్నాండు — అనన్యయా=మదేకనిష్ఠ మయిన; భక్త్యాతు; ఏవంవిధః = విశ్వరూపుండ నగు; అహమ్; తత్త్వేన=పరమార్థమున; జ్ఞాతుం శక్యః, శాస్త్రమువలన; ద్రష్టుమ్, ప్రత్యక్షమున; ప్రవేష్టుంచ, తాదాత్మ్యమున; శక్యః. ఇతరోపాయముల చేం గాను.

ప. మఱే మనంగా.—ఏవంవిధః; అహమ్; అనన్యయా = అవ్యభిచారి యగు; భక్త్యాతు; తత్త్వేన; జ్ఞాతుమ్, శాస్త్రమువలన; ప్రత్యక్షమున, ద్రష్టుంచ; తాదాత్మ్యమున, ప్రవేష్టుంచ; శక్యః. వేఱువిధమునం గాను.

రా. అనన్యయా తు భక్త్యా; తత్త్వంబున శాస్త్రములచే నెఱుంగుటకును తత్త్వంబున సాక్షాత్కరించుటకును తత్త్వంబునం బ్రవేశించుటకును శక్యుండను. అట్లు శ్రుతి.—«నాయమాత్మా ప్రవచనేన లభ్యో న మేధయా న బహునా శ్రుతేన। యమేవైష వృణుతే తేన లభ్యస్తస్యైష ఆత్మా వివృణుతే తనూం స్వామ్» * అని.

మత్కర్మకృన్మత్పరమో మద్భక్తస్సఙ్గవర్జితః
నిర్వైరస్సర్వభూతేషు యస్స మామేతి పాణ్డవ. ౫౫

భా. ఇప్పుడు సమస్త మయిన గీతాశాస్త్రమునకును సారభూతము నిశ్శ్రేయసార్థ మగు నర్థం బిది యనుష్ఠింపవలయు నని సముచ్చయించి

* ఈయాత్మ ప్రవచనముచే లభ్యుండు గాండు, మేధచే లభ్యుండు గాండు, బహుశ్రుతము చేతను లభ్యుండు గాండు. మఱే మనంగా, నేనినే యితండు వరించునో అతనిచే లభ్యుం డగును, వాని కీయాత్మ తనస్వరూపమును కనంబఱచును.

చెప్పఁబడుచున్నది.—మత్కర్మకృత్=నాకొఱకు కర్మము మత్కర్మము, దానిఁ జేయుచున్నాఁడు కావున మత్కర్మకృత్తు; మత్పరమః=నేనే పరమము—పరమగతిగాఁ గలవాఁడు, భృత్యుఁడు స్వామికర్మముఁ జేయుచున్నాఁడు కాని తనకుఁ బరమగతి—దేహత్యాగానంతరము పొందవలసినగతి యని స్వామిని దలంపఁడు, ఇతఁడో మత్కర్మము చేయువాఁడును నన్నే పరమగతినిగాఁ దలంచువాఁడును కావున మత్కర్మకృత్తును మత్పరముఁడును. అట్లు, మద్భక్తః=నన్నే సర్వప్రకారములను సర్వాత్మంబున సర్వోత్సాహంబున భజించువాఁడు కావున మద్భక్తుఁడు; సఙ్గవర్జితః=ధన పుత్త్ర మిత్త్ర కలత్ర బంధువర్గములయందు సంగవర్జితుఁడు, సంగ మనఁగా ప్రీతి, స్నేహము, దానిచే విడువఁబడినవాఁడు; నిర్వైరః=నిర్గత మయిన వైరము గలవాఁడు, శత్రుభావము లేనివాఁడు; సర్వభూతేషు=సర్వప్రాణులయందును, తన కత్యంతాపకారము చేయఁ బ్రవృత్తము లయినవాని యందుఁ గూడ; యః=ఇట్టి మద్భక్తుఁ డెవ్వఁడో; సః=అతఁడు; మామ్=నన్ను; ఏతి=పొందుచున్నాఁడు, నేనే వానికిఁ బరమగతిని; ఇతర మైన గతి * వాని కెప్పుడును సంభవింపదు. ఇది నీ కుపదేశం బిష్టము నాచే నుపదిష్టము. పాణ్డవ=ఓపాండవా!

అర్జునా! నాకొఱకే కర్మము చేయువాఁడును నేనే పరమగతిగా నిశ్చయించినవాఁడును నాయందే భక్తి గలవాఁడును ధనాదులయందుఁ బ్రీతి లేనివాఁడును సర్వభూతములయందును దన కపకారము చేసినవారియందుఁ గూడ వైరము లేనివాఁడును ఎవ్వఁడో అతఁడు నన్నే పొందుచున్నాఁ డని తాత్పర్యము.

టీ. భక్త్యాతు అని విశేషణము చేయుటవలన నితరములకు హేతుత్వము లే దని యాశంకించి చెప్పుచున్నారు ఇప్పుడు ఇత్యాదిగా. సముచ్చయించి—సంక్షేపించి, ప్రుంజీకరించి యని యర్థము. మత్కర్మకృత్తని చెప్పుటచే మత్పరమత్వము అర్థసిద్ధ మగుటవలనఁ బునరుక్తి యని యాశంకించి చెప్పుచున్నారు భృత్యుఁడు ఇత్యాదిగా. భగవంతుఁడే పరమగతి యని నిశ్చయము గలవానికి అతనియందే నిష్ఠ సిద్ధించు నని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. అతనియందే సర్వప్రకారముల చేతను భజనము సిద్ధింపదు ధనాదిస్నేహముచే నాకృష్టుఁ డగుటవలన నని యాశం

---

* ప్రాప్యస్థానము.

కించి చెప్పుచున్నారు సంగేత్యాదిగా. ద్వేషపూర్వక మయిన యనిష్టాచరణము వైరము. అనపకారులయందది లేకున్నను అపకారులయందుండనే యుండు నని యాశంకించి చెప్పుచున్నారు తనకు ఇత్యాదిగా. ఇది యంతయు సంక్షేపించి యనుష్ఠానార్థము చెప్పఁబడినది, ఇట్లనుష్ఠించువానికి భగవత్ప్రాప్తి యవశ్యము కలుగు నని యుపసంహరించుచున్నారు ఇది ఇత్యాదిగా. ఇట్లు మత్కర్మకృ దిత్యాదిన్యాయంబున విశ్వరూపుఁడు సర్వాత్ముఁడు సర్వజ్ఞుఁడు సర్వేశ్వరుఁ డగు భగవంతుని యభిధ్యానమును గ్రమముక్తిఫలంబును బ్రతిపాదించుటంజేసి తత్పదవాచ్యార్థము వ్యవస్థాపిత మయ్యెను.

హ. మత్పరమః = నేను వాసుదేవుఁడను పరమము-ప్రధానముగాఁ గలవాఁడు మత్పరముఁడు.

శ్రీ. ఇట్లు భక్తికి బ్రహ్మప్రాప్తియందుఁ గారణత్వముఁ బ్రతిపాదించి యిప్పుడు చెప్పఁబోవుసాధనపంచకముతోఁ గూడినవాఁడై యెవ్వఁడు నన్ను భజించుచున్నాఁడో యతనికే చిత్తప్రసాదంబును సమ్యక్జ్ఞానంబును మోక్షంబును సిద్ధించు నని సూచించుచు నధ్యాయము నుపసంహరించుచున్నాఁడు.—మత్కర్మకృత్ = నాకొఱకే కర్మమును, లౌకికమును వైదికమును, చేష్టామాత్రము సర్వంబును ఎవ్వఁడు చేయుచున్నాఁడో కొంచెమేనియు స్వార్థము చేయఁడో అతఁడు మత్కర్మకృత్తు; మత్పరమః=దేనికొఱకుఁ బురుషుఁడు కర్మముఁ జేయుచున్నాఁడో దానినే ఫలమునుగాఁ బొందుచున్నాఁడు ఇతరమును బొందఁడు, అట్లితఁడును నాకొఱకే కర్మముఁ జేయుచున్నవాఁడై నన్నే పొందుచున్నాఁడు, కావున నేనే తాఁజేసినకర్మములకు ఫలభూత మయిన పరమము-అనుత్తమ గతిగాఁ గలవాఁడు మత్పరముఁడు; లేక; అతఁడే రక్షకుఁడు అతఁడే యాశ్రయణీయుఁడు అతఁడే ప్రార్థనీయుఁడు. అతఁడే ప్రాప్తవ్యుఁడు అతఁడే యాధారము అతఁడే గతియు నాకని నిరతిశయప్రీతిచే నేనే పరముఁడను-రక్షకత్వాదిధర్మములచే నుత్కృష్టతముఁడను ఎవ్వనికో అతఁడు మత్పరముఁడు; లేక; మీయతే-తెలియఁబడుచున్నది పదార్థము దీనిచేతఁ గావున మా అనఁగా ఇంద్రియవృత్తి, మత్పరము - అంతటను మత్స్వరూపగ్రహణపర మగు మా-ఇంద్రియవృత్తి గలవాఁడు మత్పరముఁడు; అందువలననే, మద్భక్తః = సర్వాత్ముఁడ నగు నన్ను సర్వత్ర సర్వదా భజించుచున్నాఁడు—చక్షురాదులకు విషయభూత మయిన వస్తువును సర్వంబును బ్రహ్మమునుగానే యనుసంధించుచున్నాఁడు

కావున మద్భక్తుఁడు; సఙ్గవర్జితః = రాగహేతువు లయిన పుత్త్రమిత్త్రకళత్త్రాదుల యందు అసద్బుద్ధిచే రాగము లేనివాఁడు; అప్పుడు వారియం దనురాగము లేని యప్పుడు ద్వేషము కలుగనే గలుఁగు నని యాశంకించి చెప్పుచున్నాఁడు.—నిర్వైరః సర్వభూతేషు=తన కుపద్రవము చేయునది యైనను సర్వభూతములయందును నిర్వైరుఁడు, వైర మనఁగా శత్రుత్వబుద్ధి, సర్వత్ర బ్రహ్మభావనముచే నది నిర్గతము ఎవ్వనికో అతఁడు నిర్వైరుఁడు; అట్లు ఉపశాంతము లయిన సర్వవికారములు గలవాఁడగును; యః=ముముక్షు వెవ్వఁడో; సః=ఆభక్తవర్యుఁడు; నిర్విశేషబ్రహ్మవిజ్ఞానముచే ఆత్మప్రసాదసంపన్నుఁడై, మామ్=నన్ను పరబ్రహ్మమును; ఏతి=పొందుచున్నాఁడు. విదేహకైవల్యము నొందుచున్నాఁ డని యర్థము.

మ. ఇప్పుడు సమస్తగీతాశాస్త్రమునకును సారభూత మయిన యర్థము నిశ్శ్రేయసార్థు లనుష్ఠింపవలయు నని పుంజీకరించి చెప్పఁబడుచున్నది.—నాకొఱకుఁ గర్మమును వేదవిహితమును చేయుచున్నాఁడు కావున మత్కర్మకృత్; స్వర్గాదికామన యుండఁగా నది యెట్లు? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—మత్పరమః= నేనే పరముఁడు—ప్రాప్తవ్యుఁడుగా నిశ్చితుఁడు ఎవ్వనికో అతఁడు, స్వర్గాదికము ప్రాప్య మని తలంచువాఁడు కాఁడు; కావుననే మత్ప్రాప్తి నాశించి, మద్భక్తః=సర్వప్రకారములచేతను నన్నే భజించువాఁడు; పుత్త్రాదులయందు స్నేహ ముండఁగా నది యెట్లగును? అని యాశంకించి చెప్పుచున్నాఁడు.—సఙ్గవర్జితః=బాహ్యవస్తువులయందు స్పృహ లేనివాఁడు; శత్రువులయందు ద్వేష ముండఁగా నది యెట్లని యాశంకించి చెప్పుచున్నాఁడు.—నిర్వైరః సర్వభూతేషు=సర్వభూతములయందును అపకారులయందుఁ గూడ ద్వేషశూన్యుఁడు; యః=ఎవ్వఁడో; సః=అతఁడు; మామ్= నన్ను; ఏతి=అభేదంబునఁ బొందుచున్నాఁడు. ఓపాండవా! ఈయర్థము నీకుఁ దెలియవలసినది నాచే నుపదేశింపఁబడినది యింతకుమీఁద నేదియుఁ జేయవలసినది లేదని యర్థము.

శ్రీ. ఇఁక సర్వశాస్త్రసార మైన పరమరహస్యము వినుమని చెప్పుచున్నాఁడు.—మత్కర్మకృత్=నాకొఱకుఁ గర్మమును చేయువాఁడు; మత్పరమః=నేనే పురుషార్థముగాఁ గలవాఁడు; మద్భక్తః = నాయందే భక్తి నాశ్రయించినవాఁడు; పుత్త్రాదులందు సంగవర్జితుఁడు, సర్వభూతములయందు నిర్వైరుఁడు, ఇట్టివాఁ డెవ్వఁడో అతఁడు నన్నుఁ బొందుచున్నాఁ డని.

బుధులకేని తపోయజ్ఞముఖ్యకర్మ
కోట్లచేనైనఁ జూడంగఁ గూడనట్టి
పరమవిశ్వరూపంబును భక్తకోటికి
నిటులు చూపెను భగవంతుఁ డెలమి మీఱ.

ప. ఇందు రహస్యము వినుమని చెప్పుచున్నాఁడు.—నాకొఱకుఁ గర్మము చేయువాఁడు నేనే పురుషార్థముగాఁ గలవాఁడు నాయందు భక్తుఁడు—ఆశ్రితుఁడు పుత్త్రకళత్రాదులయందు సంగవర్జితుఁడు సర్వభూతములయందు నిర్వైరుఁడును ఎవ్వఁ డగుచున్నాఁడో అతఁడు నన్నుఁ బొందుచున్నాఁడు, ఇతరుఁడు పొందఁజాలఁడు అధ్యాయతాత్పర్యము.—నేను మనుష్యుఁడ నని తలంతువేని భూర్భువస్స్వరాదిలోకంబులవ్యాపించి యుండు నావైభవమును అభయమును అమృతగతిని జూడఁగోరుదువేని నాయిచ్చినదివ్యదృష్టిచే దానిం జూడుము, నిహత మయిన శత్రువర్గమునుం జూడుము, బ్రహ్మాదిదేవతలం జూడుము అని యీయేకాదశాధ్యాయమునందు యదుపతి వక్కాణించెను.

రా. వేదాధ్యయనాదు లగు సమస్తకర్మములను మదారాధనరూపములనుగా నెవ్వఁడు చేయుచున్నాఁడో అతఁడు మత్కర్మకృత్తు; మత్పరమః = సర్వారంభములకును నేనే పరమోద్దేశ్యభూతుఁడ నెవ్వనికో అతఁడు మత్పరముఁడు; మద్భక్తః= అత్యంతము నేనే ప్రియుఁడుగాఁ గలవాఁ డగుటచే మత్కీర్తన స్తుతి ధ్యానార్చన ప్రణామాదులచేతనే గాని యాత్మధారణము నొందనివాఁడై మదేకప్రయోజనత్వంబున నెవ్వఁడు సంతతము వానిని జేయుచున్నాఁడో అతఁడు మద్భక్తుఁడు; సఙ్గవర్జితః= మదేకప్రియుం డగుటచే నితరసంగము సహింపనివాఁడు; నిర్వైర స్సర్వభూతేషు= మత్సంయోగముచేత మాత్రమే సుఖమును మద్వియోగముచేత మాత్రమే దుఃఖమును బొందుస్వభావము గలవాఁ డగుటవలనను తనదుఃఖము తనయపరాధమువలననే కలుగునది యని యనుసంధించువాఁ డగుటవలనను సర్వభూతములును బరమపురుషపరతంత్రంబు లని యనుసంధించువాఁ డగుటవలనను సర్వభూతములయందును వైరమునకు నిమిత్తము లేమింజేసి వైరము లేనివాఁడు; యః=ఎవ్వఁడో; సః=అట్టివాఁడు, మామేతి=నన్ను యథావదవస్థితునిఁ బొందుచున్నాఁడు. నిరస్తము లయిన యవిద్యాద్యశేషదోషగంధములు గలవాఁడై మదేకానుభవుం డగుచున్నాఁ డని యర్థము.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే విశ్వరూపదర్శనం నామైకాదశోఽధ్యాయః.

వ్యాసప్రోక్తమయిన శతసహస్రగ్రంథసమ్మితంబగు శ్రీమహాభారతంబను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు విశ్వరూపదర్శనం బనం బరఁగు నేకాదశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్సవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందు నేకా
దశాధ్యాయ టీక.



అధ్యాయమైకాదశకం వేదం గీతార్థవివృతి రక్షితేయమ్
పరిపూర్తి మియాదచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన.
ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యాఽపిచ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



శ్రీ రస్తు.

శ్రీగణేశ శారదా గురుభ్యో నమః.

పరమార్థచంద్రికాసహిత

# శ్రీభగవద్గీత, ద్వాదశాధ్యాయము.

సగుణోపాస్త్యా నిర్గుణసముపాస్త్యా చానయా మిహ ప్రాప్యామ్
మాయామానుషవేష స్తాం విద్యా మచ్చికాం వన్దే.
యో విశ్వరూప మతులం కృపయా పార్థాయ దర్శయామాస
సులభోపాసనసిద్ధ్యై తం వన్దే కృష్ణ మాత్మానమ్.

అర్జున ఉవాచ.—

ఏవం సతతయుక్తా యే భక్తా స్త్వాం పర్యుపాసతే
యే చా ఽప్యక్షర మవ్యక్తం తేషాం కే యోగవిత్తమాః. ౧

శంకరభాష్యము.—

ద్వితీయము మొదలుగా విభూత్యంతము లయినయధ్యాయములయందు సర్వవిశేషణవిరహితంబై యక్షర మగు బ్రహ్మముయొక్క—పరమాత్మయొక్క-యుపాసనము ప్రతిపాదింపఁబడినది. సర్వయోగైశ్వర్య సర్వజ్ఞానశక్తిమంతుఁడు సత్త్వోపాధి యగు నీశ్వరుఁడవు నీయొక్క యుపాసనము గూడ నచ్చటచ్చటఁ జెప్పఁబడినది. విశ్వరూపాధ్యాయమునందో ఐశ్వరము ఆద్యము సమస్తజగదాత్మరూప మైన నీ దగు విశ్వరూపం బుపాసనార్థమే ప్రదర్శింపఁబడినది నీచేత. దానిం బ్రదర్శించి చెప్పినాఁడవు గూడ మత్కర్మకృ దిత్యాదిగా. అందువలననే నీ రెండు పక్షములలో నుత్తమ మైనదాని నెఱుంగుటకై ని న్నడుగుచున్నా నని యర్జునుం డి ట్లనియె.—ఏవమ్ అనునది మత్కర్మకృ దిత్యాదిక మగు నతీతానంతరశ్లోకముచే ♦ జెప్పఁబడినయర్థమును బరామర్శించుచున్నది. ఏవమ్ = ఇట్లు; సతతయుక్తాః—నిరంతరముగా యథోక్త మయిన భగవత్కర్మాదికమునందు సమాహితులై ప్రవర్తించినవా రని యర్థము; యే=

♦ కడచిన యవ్యవహిత మయినశ్లోకముచే—వెనుకటిశ్లోకముచేత ననుట.

ఎవ్వరు; భక్తాః=అనన్యశరణులై *; త్వామ్=నాచేఁ జూపఁబడినట్లు విశ్వరూపము గలవాఁడగు నిన్ను; పర్యుపాసతే = ధ్యానించుచున్నారో. యే చాఽపి=మఱియు నితరులును సర్వైషణల విడిచినవారు సర్వకర్మముల సన్న్యసించినవారు ఎవ్వరు; యథా విశేషిత మగు, అక్షరమ్=బ్రహ్మమును; నిరస్త సర్వోపాధిక౦ బగుటవలన, అవ్యక్తమ్=కరణములకు అగోచర మైనదానిని; ఏది లోకమునందుఁ గరణగోచరం బగునో అది గదా వ్యక్త మని చెప్పఁబడుచున్నది, అఞ్జి ధాతువు తదర్థకం బగుటవలన; ఈయక్షరమో తద్విపరీతము; శేషించినట్టి చెప్పఁబోవు విశేషణములతోను విశిష్ట మయినది; అట్టిదానిని ఎవ్వరు పర్యుపాసించుచున్నారో. తేషామ్= ఆ రెండు తెగలవారిలోపల; కే=ఎవ్వరు, యోగవిత్తమాః=అతిశయంబున యోగవిదులు? అని యర్థము.

నీవు కడచినయధ్యాయముచివరను జెప్పినచొప్పున నిరంతరముగా భగవత్కర్మాదులందే ప్రవర్తించినవారై యనన్యగతికులై యెవ్వరు విశ్వరూపుండ వగు నిన్ను ధ్యానించుచున్నారో మఱియు నెవ్వరు సర్వకర్మముల సన్న్యసించినవారు సర్వోపాధివర్జితమై సర్వకరణంబుల కగోచర మైనయక్షరము నుపాసించుచున్నారో, ఈ రెండు తెగలయోగులలో నెవ్వ రధికులు? అని తాత్పర్యము.

ఆనందగిరికృత టీక.—

అతీతానన్తరాధ్యాయ మిత్యాదిగా విభూత్యధ్యాయమువఱకుఁ గల యధ్యాయములందు నిరుపాధికబ్రహ్మమును జ్ఞేయంబుగా ననుసంధింపవలయు నని చెప్పఁబడిన దని కడచినవిషయమును గీర్తించుచున్నారు ద్వితీయము ఇత్యాదిగా. అతీతము లయిన యాయాయధ్యాయములందు సోపాధికబ్రహ్మము గూడ ధ్యేయంబుగాఁ బ్రతిపాదింపఁబడిన దని చెప్పుచున్నారు సర్వేత్యాదిగా. సర్వయోగ—సమస్తప్రపంచము యొక్కయు యోగము—జన్మస్థితిభంగప్రవేశనియమనంబు లనుపేరు గల ఘటనము, దానియందు ఐశ్వర్యము—సామర్థ్యము, దానిచే సర్వజ్ఞానశక్తిమంతుఁడు—సమస్తమయినజ్ఞేయమునందును ప్రతిబంధరహిత మయినజ్ఞానశక్తి గలవాఁడు; అట్టి సత్త్వోపహితుఁ డైనభగవంతునియొక్క—ధ్యానము, అచ్చటచ్చటఁ బ్రసంగము కలిగించుకొని మందమధ్యమాధికారుల ననుగ్రహించుకొఱకై చెప్పఁబడిన దని యర్థము.

* ఇతర మయినశరణము లేనివారై.

ఏకాదశాధ్యాయమునఁ జెప్పినదాని ననువదించుచున్నారు విశ్వరూపేత్యాదిగా. తదధ్యాయాంతమున భగవంతుఁ డుపదేశించినదాని ననువదించుచున్నారు దానిం బ్రదర్శించి ఇత్యాదిగా. అధికారముచొప్పునఁ దారతమ్యయుక్తము లయిన సాధనములను నియమించుటకై మీఁదియధ్యాయము నవతరింపఁజేయుచు మొదటఁ బ్రశ్న నెత్తుచున్నారు అందువలన ఇత్యాదిగా. అందువలన—సోపాధికధ్యానంబును నిరుపాధికజ్ఞానంబును జెప్పుటవలన నని యర్థము. ఏవంశబ్దార్థముఁ జెప్పుచున్నారు ఏవమ్ అనునది ఇత్యాదిగా. సతతయుక్తాః అనుదానికి వ్యాఖ్యానము చేయుచున్నారు నిరంతరముగా నిత్యాదిగా. భక్తాః అనుదానికి వ్యాఖ్యానము చేయుచున్నారు అనన్యశరణులై యని. సగుణశరణు లగు మందమధ్యమాధికారులం జెప్పి నిర్గుణనిష్ఠు లగు నుత్తమాధికారుల నిర్దేశించుచున్నారు యే చాపి ఇత్యాదిగా. యథా విశేషితము—అనిర్దేశ్యమ్ సర్వత్రగమ్ అచిన్త్యమ్ కూటస్థమ్ అనునది మొదలగు చెప్పఁబోవువిశేషణములతో విశిష్ట మని యర్థము. నక్షరతి—నశింపదు, లేక, అశ్నుతే—వ్యాపించుచున్నది, కావున అక్షరము. అవ్యక్తమ్ అనుదాని వివరించుచున్నారు నిరస్తేత్యాదిగా. కరణముల కగోచర మనుటనే వ్యతిరేకద్వారమునఁ దెలుపుచున్నారు ఏది ఇత్యాదిగా. యథావిశేషిత మని చెప్పినదాని స్పష్టపఱచుచున్నారు శేషించినట్టి ఇత్యాదిగా. పూర్వార్ధమందలి క్రియాపదమున కనుషంగమును ♦ సూచించుచున్నారు అట్టిదానిని ఇత్యాదిగా. వీ రందఱును యోగం విన్దన్తి—సమాధిని బొందుచున్నారు కావున యోగవిదులు, ఎవ్వరు మఱి వీరిలోపల నతిశయంబున యోగవిదు లగు యోగులు? అని యడుగుచున్నాఁడు కే ఇత్యాదిగా.

హనుమద్విరచిత పైశాచభాష్యము.—

ఇట్లు సుదర్శనం బగు భగవద్రూపంబును బ్రత్యక్షముగాఁ జూచి యది యుపాస్యం బని భగవద్వచనమువలననే విన్నవాఁడు కావున, ఇట్టి సాకారం బగు భగవద్రూపమే యుపాస్యమా? లేక అవ్యక్త మగు బ్రహ్మస్వరూపం బుపాస్యమా? అని సంశయించినవాఁడై దాని నిర్ణయించుకొనుటకై యర్జునుం డిట్లనియె.—సతతయుక్తాః=సాకారధ్యాననిష్ఠులై. యోగవిత్తమాః=పరమాత్మవిదులయందుత్తములు.

♦ అనువృత్తిని.

శంకరానందీయ గీతా తాత్పర్యబోధిని.—

నవమాధ్యాయాంతమున «మన్మనా భవ మద్భక్తః» అని చిత్తశుద్ధికొఱకు భగవదుపాసనము కర్తవ్య మని యుపదేశింపఁగా, భగవత్స్వరూపము తెలిసినం గదా తదుపాసనము చేయ శక్య మగు నని యాకాంక్ష కలుగుటవలన, మందప్రజ్ఞుల కుపాసనముకొఱకు విష్ణ్వాదివిభూతివిశేషముల నుపన్యసించి, అందు ముఖ్యాధికారికి «ఏకాంశేన స్థితో జగత్" అని విశ్వాత్మకం బగు నైశ్వరరూప ముపాస్యం బని సూచించి, ఏది ముముక్షువుల కుపాసనీయం బని చెప్పితివో అట్టి నీవిశ్వాత్మకరూపమును నేను జూడఁదలఁతు నని ప్రార్థించినయర్జునునకు దానిం బ్రదర్శించి, నాయీరూపమును యథోక్తసాధనసంపత్తితోఁ గూడినవాఁడై యెవ్వఁ డుపాసించునో అతఁడు జ్ఞానమునొంది పరమపురుషార్థ మయిన కైవల్యమును బ్రాపించుచున్నాఁ డని తదుపాసనము మహాఫలం బని ప్రతిపాదించి, ఇప్పుడు సగుణనిర్గుణోపాసకులకుఁ దారతమ్యవిశేషంబును అందు సగుణోపాసకులకుఁ దదుపాసనంబునకు సాధనాంతరములను నిర్గుణబ్రహ్మవిదులకును సముత్పన్న మయినజ్ఞానము రక్షించుకొనుటకై సాధనవిశేషంబును నిరూపించుటకై ద్వాదశాధ్యాయం బారంభింపఁబడుచున్నది. అందు మొదట «నజాయతే మ్రియతే వా» ఇత్యాదివచనముచే పరబ్రహ్మము జ్ఞేయం బని ప్రతిపాదించి «నిస్త్రైగుణ్యో భ వార్జున" అనియు «తద్బుద్ధయః" అనియు «మహాత్మానస్తు మాం పార్థ" అనియు «మద్భక్తా యాన్తి మా మపి» అనియు సప్తమాష్టమ నవ మాధ్యాయములందుఁ బరబ్రహ్మముయొక్క యుపాసనంబును దత్ఫలంబును జెప్పఁబడినది; దశ మైకాదశాధ్యాయములందు సగుణబ్రహ్మస్వరూపంబును దత్ఫలంబును బ్రతిపాదింపఁబడినది. ఈరెండురూపంబులను విని యీరెండుపక్షంబులవిశేషము తెలిసినయెడ సుకర మైనదానియందు ముముక్షువులు ప్రవర్తింతు రనుతలంపుతో సగుణనిర్గుణోపాసకులతారతమ్యవిశేషంబు వినఁగోరి భగవంతు నడుగుటకై యర్జునుం డి ట్లనియె —ఏవమ్=ఇట్టి త్వత్కర్మకృత్త్వము * త్వత్పరమత్వము త్వద్భక్తత్వము అసంగత్వము నిర్వైరత్వము అను సాధనములచేత; సతతయుక్తాః = సర్వదా అభేదబుద్ధితోఁ గూడినవారలై; యేఽవ; భక్తాః= సగుణనిష్ఠులు; త్వామ్=నిన్ను, విశ్వరూపుని సర్వజ్ఞుని సర్వకారణమును బరమేశ్వరుని; పర్యుపాసతే=భజించుచున్నారో, మఱియును, అవ్యక్తమ్ = శబ్దాదివిశేషము లేని దగుటవలన నవ్యజ్యతే—వ్యక్తము కానిది—సర్వేంద్రియములకును అగోచరము

* నీకొఱకుఁ గర్మము చేయువాఁ డగుట.

అస్థూల మన ణ్వహ్రస్వ మిత్యాదిశ్రుతిప్రసిద్ధము; అక్షరమపి=తనయందు అధ్యస్తమగు మహదాదిస్థూలాంతము సర్వంబును అశ్నుతే—వ్యాపించునది కావున అక్షరమును, నిర్విశేషపరబ్రహ్మము నగు నిన్నును; యేచ=ఎవ్వరు బ్రహ్మవిదులు; శమదమాదులతోను అద్వేష్టృత్వాదులతోను సత్సాధనములతోఁ గూడినవారలై; పర్యుపాసతే = నిరంతరం బనుసంధించుచున్నారో; తేషామ్ = ఆ రెండు తెగలవారిలోపల; కే=ఎవ్వరు; యోగవిత్తమాః = యోగమును—సమాధిని బొందువారలు యోగవిదులు, వారిలో నెవ్వరు ఉత్తమయోగు లని యర్థము. ఇది యభిప్రాయము.—సగుణోపాసనంబును నిర్గుణోపాసనంబును రెండును మోక్షసాధనం బని నీవుపదేశించితివి, అందు సుకరం బగునది యేది? సాక్షాన్మోక్షహేతు వగునది యేది? దానిం జెప్పు మని.

మధుసూదనసరస్వతీరచిత గూఢార్థదీపిక.—

పూర్వాధ్యాయాంతమున « మత్కర్మకృ న్మత్పరమో మద్భక్త స్సఙ్గవర్జితః । నిర్వైర స్సర్వభూతేషు య స్స మామేతి పాణ్డవ » అని చెప్పఁబడినది. అట మచ్ఛబ్దార్థమందు సందేహము—ఏమి భగవంతునిచే నిరాకారమే సర్వస్వరూపమగువస్తువు చెప్పఁబడినదా? లేక, సాకారము చెప్పఁబడినదా? అని. ఉభయస్థలములందును బ్రయోగము కనఁబడుచున్నది. « బహూనాం జన్మనా మన్తే జ్ఞానవా న్మాం ప్రపద్యతే । వాసుదేవ స్సర్వ మితి స మహాత్మా సుదుర్లభః » ఇత్యాదికమునందు నిరాకారవస్తువు వ్యపదేశింపఁబడినది. విశ్వరూపదర్శనానంతరము « నాఽహం వేదై ర్న తపసా న దానేన న చేజ్యయా । శక్య ఏవం విధో ద్రష్టుం దృష్టవా నసి మాం యథా " అని సాకారవస్తువు వ్యపదేశింపఁబడినది. ఈభగవదుపదేశములు రెంటికిని అధికారిభేదంబుననే వ్యవస్థ కావలయును, అట్లు కానిచో విరోధము కలుగును. అట్లు కావున, ముముక్షుఁడ నగు నేను నిరాకారవస్తువునే చింతింపవలయునా? లేక, సాకారవస్తువును జింతింపవలయునా? అని తనయధికారమును నిశ్చయించుకొనుటకై సగుణనిర్గుణవిద్యలందు విశేషము నెఱుంగఁ గోరి యర్జునుం డిట్లనియె.—ఏవమ్=మత్కర్మ దిత్యాదిక మగు పూర్వశ్లోకమునఁ జెప్పఁబడినప్రకారంబున; సతతయుక్తాః = నైరంతర్యంబున భగవత్కార్యములయందు సావధానముగాఁ బ్రవర్తించినవారలై; భక్తాః=సాకారవస్తువే శరణముగాఁ గలవారలై; త్వామ్=ఇట్టి సాకారుండ వగు నిన్ను; యే=ఎవ్వరు; పర్యుపాసతే=ఎల్లప్పుడు ధ్యానించుచున్నారో, యే చాపి=మఱియు నెవ్వరు సర్వమునుండియు విరక్తులు సర్వకర్మముల

సన్న్యసించినవారు; అక్షరమ్=నక్షరతి-నశింపదు, లేక అశ్నుతే-వ్యాపించుచున్నది కావున అక్షరము-« ఏతద్వై తదక్షరం గార్గి బ్రాహ్మణా అభివదన్త్య స్థూల మన ణ్వహ్రస్వ మదీర్ఘమ్ " • ఇత్యాదిశ్రుతులచేఁ బ్రతిషేధింపఁబడిన సర్వోపాధులు గల నిర్గుణ మగుబ్రహ్మమును; అందువలననే, అవ్యక్తమ్=సర్వకరణంబులకును అగోచరుఁడవు నిరాకారుఁడ వగు నిన్ను; పర్యుపాసతే. తేషామ్=ఆరెండు తెగలవారిలోపల; కే=ఎవ్వరు; యోగవిత్తమాః=అతిశయమున యోగవిదులు? యోగమును-సమాధిని విన్దన్తి-పొందుచున్నారు, లేక, విదన్తి-ఎఱుంగుచున్నారు కావున యోగవిదులు రెండుతెగలవారును; వారిలోపల నెవ్వరు శ్రేష్ఠులైనయోగులు? ఎవ్వరి జ్ఞానమును నే ననుసరింపవలయు నని యర్థము.

శ్రీధరస్వామిప్రణీత సుబోధిని.—

సగుణనిర్గుణోపాస్తినిష్ఠాద్వయమున
నేది శ్రేయ మంచును నిశ్చయించుకొఱకు
ద్వాదశాధ్యాయ మిదియు నుపక్రమించెఁ
బరమకారుణ్యపాథోధి పరమగురువు.

పూర్వాధ్యాయాంతమున మత్కర్మకృన్మత్పరమ ఇత్యాదిశ్లోకము చే భక్తినిష్ఠునకు శ్రేష్ఠత చెప్పఁబడినది. కౌన్తేయ ప్రతిజానీహీత్యాదికంబునను అచ్చటచ్చట నతనికే శ్రేష్ఠత్వము వర్ణింపఁబడినది. అట్లు « తేషాం జ్ఞానీ నిత్యయుక్త ఏకభక్తి ర్విశిష్యతే » ఇత్యాదికముచేతను « సర్వం జ్ఞానప్లవే నైవ వృజినం సంతరిష్యసి » ఇత్యాదికముచేతను జ్ఞాననిష్ఠునకు శ్రేష్ఠత చెప్పఁబడినది. ఇట్లు ఇద్దఱును శ్రేష్ఠులైనను విశేషము నెఱుంగఁగోరి భగవంతుని గూర్చి యర్జునుం డిట్లనియె.—

ఏవమ్-సర్వకర్మార్పణము మొదలగువానితో; సతతయుక్తాః=ఎల్లప్పుడును యుక్తులై-నీయందు నిష్ఠ గలవారలై; యే భక్తాః; త్వామ్=విశ్వరూపుని సర్వజ్ఞుని సర్వశక్తిని నిన్ను; పర్యుపాసతే=ధ్యానించుచున్నారో. యే చాపి; అవ్యక్తమ్=నిర్విశేష మగు; అక్షరమ్=బ్రహ్మమును; ఉపాసించుచున్నారో. వారిరెండుతెగలవారిలోపల నెవ్వరు అతిశయమున యోగవిదులు? శ్రేష్ఠు లని యర్థము.

• దీనినే అయాక్షరమును అస్థూల మనియూ అనణు వనియూ అదీర్ఘ మనియూ బ్రాహ్మణులు అంటటను జెప్పుచున్నారు.

పరమార్థప్రప, దైవజ్ఞసూర్యపండిత ప్రణీతము.—

పూర్వాధ్యాయముచివర మత్కర్మకృ న్మత్పరమ యనుశ్లోకమున సర్వోపాయములచేతను అగమ్యుం డగు విశ్వరూపస్వరూపునియొక్క జ్ఞానమునందును దర్శనమునందును ప్రాప్తియందును శ్రేష్ఠుం డధికారి యని చెప్పఁబడియె. మున్ను, «జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అనుటచేతను «సయోగీ పరమో మతః» అనుట చేతను, అట్లు «బ్రహ్మవి దాప్నోతి పరమ్» అనుశ్రుతిచేతను యోగజ్ఞానాదిసంపద గలవాఁడు శ్రేష్ఠుఁ డని ప్రతిపాదింపఁబడియె. ఆయిద్దఱిలో నెవ్వఁడు శ్రేష్ఠుఁ డని ప్రశ్నవ్యాజంబునఁ బరబ్రహ్మము నెఱుంగఁ గోరినవాఁడై యర్జునుం డడుగుచున్నాఁడు.—♦

రామానుజభాష్యము.—

భక్తియోగనిష్ఠులకుఁ బ్రాప్యభూతుండును బరబ్రహ్మము నగు భగవంతుఁడు నారాయణునియొక్క నిరఙ్కుశైశ్వర్యమును సాక్షాత్కరింపఁ గోరిన యర్జునునకు నిరవధికాతిశయకారుణ్యౌదార్యసౌశీల్యాదిగుణసాగరుఁడు సత్యసంకల్పుఁ డగు భగవంతునిచేఁ దనయైశ్వర్యము యథావస్థితముగాఁ బ్రదర్శింపఁబడినది. చెప్పఁబడినది గూడ, తత్త్వంబున భగవద్జ్ఞానదర్శనప్రాప్తులు ఐకాంతికంబును ఆత్యంతికంబునగు భక్తిచేతనే లభ్యంబు లని. ఇఁక, ఆత్మప్రాప్తిసాధనభూత మయిన యాత్మోపాసనముకంటె భక్తిరూప మైనభగవదుపాసనము, స్వసాధ్యసాధనమునందు శీఘ్రం బగుటవలనను సుసుఖోపాదానం * బగుటవలనను శ్రేష్ఠంబనుటయు, భగవదుపాసనోపాయంబును, దానియం దశక్తునకు అక్షరనిష్ఠతయు, తదపేక్షితంబులును జెప్పఁబడుచున్నవి. భగవదుపాసనము ప్రాప్యభూతుఁ డైనయుపాస్యుని శ్రేష్ఠత్వమున శ్రేష్ఠం బనుటయో «యోగినా మపి సర్వేషాం మద్గతే నా ఽన్తరాత్మనా । శ్రద్ధావాన్భజతే యో మాం స మే యుక్తతమో మతః" అనుస్థలంబునఁ బ్రతిపాదింపఁబడినది.—ఏవమ్=మత్కర్మ దిత్యాదిశ్లోకంబునఁ జెప్పఁబడినప్రకారంబున; సతతయుక్తాః= భగవంతుని నిన్నే పరమప్రాప్యునిఁ గాఁ దలంచు చున్నవారలై; యేభక్తాః; త్వామ్= నిన్ను సకలవిభూతియుక్తుని అనవధికాతిశయసౌందర్య సౌశీల్య సార్వజ్ఞ్య సత్యసఙ్కల్పత్వా ద్యనంతగుణసాగరుని; పర్యుపాసతే = పరిపూర్ణముగా నుపాసించుచున్నారో; యేచా ఽపి; అక్షరమ్=ప్రత్యగాత్మస్వరూపమును; దానినే, అవ్యక్తమ్=

♦ టీక శ్రీధరీయముతో సమానము.

*-మిక్కిలిసుఖ మయినసాధనము గలది.

చక్షురాదికరణములకు అనభివ్యక్తమయినస్వరూపము గలదానిని; ఉపాసించు చున్నారో. తేషామ్=ఆరెండు తెగలవారిలో; కే యోగవిత్తమాః—ఎవ్వరు తమ సాధ్యమును శీఘ్రముగాఁ బొందువారలు? అని యర్థము. “భవామి నచిరాత్పార్థ” అని ముందు యోగవిత్తమత్త్వము శీఘ్రతావిషయం బని గదా తెలుపఁ బోవు చున్నాఁడు.

మాధ్వభాష్యము.—

అవ్యక్తోపాసనముకంటె భగవదుపాసన ముత్తమం బని ప్రదర్శించి తదుపాయమును బ్రదర్శించుచున్నాఁ డీయధ్యాయమునందు. అవ్యక్తోపాసనము గూడ మోక్షసాధనముగాఁ గనఁబడుచున్నది “శ్రియం వసానా అమృతత్వ మాయ న్భవన్తి సత్యా సమిథా మితద్రౌ” ♦ అని. “అనాద్యన్తం మహతః పరం ధ్రువం నిచాయ్యతం మృత్యుముఖా త్ప్రముచ్యతే” * అనియు. మహతః పరమ్ అనఁగా అవ్యక్త మని యర్థము, “మహతః పర మవ్యక్తమ్” అని పరామర్శించుటవలన. “ఉపాస్యతాం శ్రియ మవ్యక్తసంజ్ఞాం భక్త్యా మర్త్యో ముచ్యతే సర్వబన్ధైః” ♦♦ అని సామవేదంబున నగ్నివేశ్యశాఖయందు. గొప్పమాహాత్మ్యము గూడ ఆశ్రీదేవికి వేదంబులందుఁ జెప్పఁబడుచున్నది.—“చతుష్కపర్దా యువతి స్సుపేశా ఘృతప్రతీకా వయునాని వస్తే । తస్యాం సుపర్ణా వృషణా నిషేదతు ర్యత్ర దేవా దధిరే భాగధేయమ్, చతుశ్శిఖణ్డా యువతి స్సుపేశా ఘృతప్రతీకా వయునాని వస్తే” § అని. “అహం రుద్రేభి ర్వసుభి శ్చ రామ్యహ మాదిత్యై రుత విశ్వదేవైః” అని యారంభించి “అహం రాష్ట్రీ సంగమనీ వసూనాం చికితుషీ ప్రథమా యజ్ఞియానామ్ । తాం మా దేవా వ్యదధుః పురుత్రా భూరి స్థాత్రాం భూ ర్యావేశయ న్తీమ్ । మయా సో అన్నమత్తి యో విపశ్యతి యః ప్రాణితి య ఈం శృణో త్యుక్తమ్ ।

---

♦ శ్రీదేవి నుపాసించువారలు అమృతత్వము నొందిరి, వారికోరికలు సత్యము లగుచున్నవి క్షీరసముద్రమునందు.

* ఆద్యంతములు లేనిదియు మహత్తుకంటెఁ బరమైనదియు నిత్యంబు నగు దాని నారాధించి మృత్యుముఖమునుండి విడివడు చున్నాఁడు.

♦♦ మనుష్యుఁడు భక్తిచే అవ్యక్త మను పేరు గల యాశ్రీదేవి నుపాసించి సర్వబంధములచేతను విముక్తుఁ డగుచున్నాఁడు.

§ నాలుగుజడలు గలదియు మంచిరూపముగలదియు ప్రకాశించుచున్న యవయవములు గలదియు నగు స్త్రీ జ్ఞానములను కప్పుకొనుచున్నది. ఆయమయందు పరమానందములను సేచకములు నగు రెండు రూపంబుల భగవంతుఁ డున్నాఁడు, ఆయమవలననే దేవతలు భాగ్యము నొందిరి.

అమ న్తవో మాం త ఉపక్షియ న్తి శ్రుధి శ్రుతం శ్రద్ధివం తే వదామి । యం కామయే తం తముగ్రం కృణోమి తం బ్రహ్మాణం తమృషిం తం సుమేధమ్ । అహం రుద్రాయ ధనురాతనోమి బ్రహ్మద్విషే శరవే హ న్తవా ఉ । అహం సువే పితర మస్య మూర్ధ న్మమ యోని రప్స్వ న్త స్సముద్రే । పరో దివా పర ఏనా పృథివ్యై తావతీ మహినా సంబభూవ » ఇత్యాదిగా. « త్వయా జుష్ట ఋషి ర్భవతి దేవి త్వయా బ్రహ్మ గతశ్రీ రుత త్వయా » అని గూడ ♦. ఇట్టిశంక * యెవ్వనికేని కలుగ వచ్చును. కావున నెఱింగినవాఁ డయ్యును సూక్ష్మయుక్తి నెఱుంగుటకై యడుగుచున్నాఁడు.—ఏవంశబ్దముచే కన్నదియు విన్నదియు నగురూపంబును మత్కర్మకృదిత్యాద్యుక్తప్రకారంబును బరామర్శింపఁబడుచున్నది. అవ్యక్తమ్=ప్రకృతి. « మహతః పర మవ్యక్తమ్ " అను ప్రయోగమువలన. « యత్త త్త్రిగుణ మవ్యక్తం నిత్యం సదసదాత్మకమ్, ప్రధానం ప్రకృతిం ప్రాహు రవిశేషం విశేషవత్ " అనియు భాగవతమునందు. అక్షరంబును అదియే « అక్షరా త్పరతః పరః " అను శ్రుతివలన. పరబ్రహ్మమో, భగవంతునికంటె నితరము కాదు గదా! « అనన్త మాసన్ద మయే ఽవసానే సర్వాత్మకే బ్రహ్మణి వాసుదేవే » అని భాగవతమునందు. ఇట్టిరూపము గూడ సాధింపఁబడినది మున్ను. ఉపాసనము గూడ నట్లే చేయవలయును. « సహస్రశీర్షా పురుష స్సహస్రాక్ష స్సహస్రపాత్ " అని యారంభించి « త మేవం విద్వా

♦ నేను రుద్రులతోను వసువులతోను సంచరించుచున్నాను, నేను ఆదిత్యులతోను విశ్వదేవులతోను సంచరించుచున్నాను... నేను రాజ్ఞిని, యజ్ఞార్హము లయిన ధనములఁ బొందించుదానను మొదటిదాన నై సర్వత్ర నివసించియున్నదానను, పెక్కుస్థానముల నున్నదానను పెక్కుస్థానముల దేవతల నిలుపుదాన నగు నన్ను దేవతలు పెక్కుస్థానములయందుఁ బ్రతిష్ఠించిరి, ఎవ్వఁ డన్నము తినుచున్నాఁడో ఎవ్వఁడు చూచుచున్నాఁడో ఎవ్వఁ డూర్చుచున్నాఁడో ఎవ్వఁడు వినుచున్నాఁడో వాఁడు వాఁడు నాచేతనే అన్నము తినుచున్నాఁడు చూచుచున్నాఁడు ఊర్చుచున్నాఁడు వినుచున్నాఁడు, ఎవ్వరు నిరపరాధులో వారు నాసమీపమున వసించుచున్నారు వినుము ప్రసిద్ధమును విశ్వసింపఁ దగినదానిని నీకుఁ జెప్పెదను, నే నెవ్వనిఁ గోరుచున్నానో వాని రుద్రునిఁగాఁ జేయుదును వాని బ్రహ్మదేవునిఁ జేయుదును వాని ఋషినిగాఁ జేయుదును వాని మంచిబుద్ధి గలవానిఁగాఁ జేయుదును, నేను బ్రాహ్మణశత్రు వగు హింసకుని వధించుటకై రుద్రునకు ధనుస్సును ఇచ్చుచున్నాను, నే నీజగత్తునకుఁ దండ్రియైనబ్రహ్మను సర్వాధిక్యమున నుంచుచున్నాను, నాస్థానము సముద్రములోపల జలములం దున్నది, నేను ఆకాశముకంటెఁ బరురాలను ఈపృథివికంటెఁ బరురాలను, మహిమచే నట్టిదాన నై యున్నాను... ఓ దేవీ! నీచే ననుగ్రహింపఁబడినవాఁడు ఋషి యగును, బ్రహ్మయును నీచేత సంపదను బొందినవాఁడు.

* భగవదుపాసనము శ్రేష్ఠమా? అవ్యక్తోపాసనము శ్రేష్ఠమా? అనుశంక.

నమృత ఇహ భవతి, నాన్యః పన్థా అయనాయ విద్యతే॥ అని యభ్యాసయుక్తము గా శ్రుతి చెప్పుచున్నది. ఆదిత్యవర్ణత్వాదికము వ్యర్థ మయినయుపచారం బని యంగీకరింపఁ జనదు, ఎందువలన ననఁగా, సామవేదమునందు సౌకరాయణశ్రుతి.— "స్థాణు ర్హవై ప్రాజాపత్య స్స ప్రజాపతిం పితర మేత్యోవాచ। ముముక్షుభి స్సాధుభిః పూతపాపైః కిముహ వై తారకం తారవాచ్యమ్। ధ్యానం చ తస్యాऽఽత్త రుచేః కథం స్యా ద్ధ్యేయశ్చ కః పురుషోऽలోమపాదః। తం హోవాచ చైష వై విష్ణు స్తారకోऽలోమపాదో ధ్యానం త స్యాత్తరుచే ర్వదామి। సోఽనన్త శీర్షో బహువర్ణ స్సువర్ణో ధ్యేయ స్స వై లోహితాదిత్యవర్ణః। శ్యామోऽథవా హృదయే సోऽప్రబాహు రనన్తవీర్యోऽనన్తబలః పురాణః" * అని. అరూపత్వాదికమున కో గతి చెప్పఁబడినది. పురుషభేదము గూడ ప్రశ్నాదికమునందుఁ గానవచ్చుచున్నది "త్వాం పర్యుపాసతే, యే చాऽప్యక్షర మవ్యక్తమ్" ఇత్యాదికమునందు.

మయ్యావేశ్య మనో యే మాం నిత్యయుక్తా ఉపాసతే
శ్రద్ధయా పర యోపేతా స్తే మే యుక్తతమా మతాః. ౨

భా. శ్రీభగవంతుఁ డిట్లనియె.—ఎవ్వరు మఱి యక్షరోపాసకులు సమ్యగ్దర్శులు నివృత్తైషణులు గలరో వారివిషయ మట్లుండుఁ గాక. వారి విషయ మేది చెప్పవలయునో అది మీఁదఁ జెప్పెదము. ఇఁక నితరులు.—మయి = నాయందు, విశ్వరూపుఁ డైనపరమేశ్వరునియందు; మనః = మనస్సును; ఆవేశ్య = సమాహితము చేసి; యే = ఎవ్వరు; భక్తులై, మామ్ = నన్ను, సర్వయోగేశ్వరులకును అధీశ్వరుఁ డైనవానిని సర్వజ్ఞుని విముక్తరాగాదిక్లేశతిమిరదృష్టిని; నిత్యయుక్తాః = అతీతానంతరాధ్యాయాంతోక్తశ్లోకార్థన్యాయంబున సతతయుక్తులై; పరయా =

* ప్రజాపతి పుత్త్రుం డగు రుద్రుఁడు తండ్రి యగు ప్రజాపతి నుపసర్పించి యిట్లనియె. సాధకులును పాపరహితులు నగు ముముక్షువులు ఎవ్వని నాశ్రయింపవలయును? ఏది తారకము? ప్రణవమునకు వాచ్య మేది? మహాప్రకాశుం డగు నతనిధ్యాన మెట్లు? లోమపాదరహితుఁ డగుపురుషుఁ డెవ్వఁడు ధ్యేయుఁడు? అని యడిగెను. ప్రజాపతి యతనితో నిట్లనియె. ఈవిష్ణువు తారకుఁడు అలోమపాదుఁడు, మహాప్రకాశుం డగు నతనిధ్యానమును జెప్పుచున్నాను. అతఁడు అనంతము లైన శిరస్సులుగలవాఁడు బహువర్ణుఁడు సువర్ణవర్ణుఁడు, హృదయమునం దతని నెఱ్ఱనియాదిత్యవర్ణము గలవానిఁగాఁ గాని నీలవర్ణము గలవానిఁగాఁ గాని ధ్యానింపవలయును. అతఁడు అనంతవీర్యుఁడు అనంతబలుఁడు పురాణుఁడు.

ప్రకృష్ట మయిన; శ్రద్ధయా= శ్రద్ధతో; ఉపేతాః = కూడినవారలై; ఉపాసతే = ఉపాసించుచున్నారో. తే = వారు; యుక్తతమాః = ఉత్తము యోగు లని; మే = నాకు; మతాః = సమ్మతులు. నిరంతరముగాఁ గదా వారు మచ్చిత్తులై యహోరాత్రము గడపుచున్నారు, అందువలన యుక్తము వారు యుక్తతము లనుట.

శ్రీభగవంతుఁ డి ట్లనియె.—నాయందు మనస్సు నిలిపి కడచినయధ్యాయముచివరఁ జెప్పినచొప్పున సతతయుక్తులై పరమశ్రద్ధాపూర్వకముగా నెవ్వరు నన్నుపాసించుచున్నారో వారు యోగులలో నుత్తము లని నాయభిప్రాయ మని తా.

ఆ. ఏమి యీ రెండుయోగములలో సుకర మైనదాని నడుగుచున్నావా? లేక, సాక్షాన్మోక్షహేతువు నడుగుచున్నావా? అని వికల్పించి క్రమంబున నుత్తరము భగవంతుఁడు చెప్పె నని చెప్పుచున్నారు శ్రీభగవంతుఁడు ఇత్యాదిగా. రెండవపక్షమునే యడుగుదువేని అట్టియోగము చెప్పఁబోయెదను కావున నది యడుగఁ దగినది కా దని చెప్పుచున్నారు ఎవ్వరు మఱి ఇత్యాదిగా. మొదటిపక్షము నడుగుదువేని విను మని చెప్పుచున్నారు ఇఁక నితడులు ఇత్యాదిగా. సర్వయోగేశ్వరులకును -- యోగము నధిష్ఠించినవారి కెల్లను, ఎల్లయోగులకును అని యర్థము. విముక్తరాగాదిక్లేశతిమిరదృష్టిని— విముక్తము - విడువఁబడిన దగు, రాగాదిక మను పేరుగలదియు క్లేశనిమిత్తభూతమయినదియు తిమిరశబ్దముచేఁ జెప్పఁబడిన యనాద్యజ్ఞానముచేఁ గలిగినదియు నగుదృష్టి- అవిద్య- మిథ్యాబుద్ధి గలవానిని. నిత్యయుక్తత్వమును సాధించుచున్నారు అతీతేత్యాదిగా. కడచినయవ్యవహిత మయినయధ్యాయముచివర నుండుశ్లోకమునఁ జెప్పఁబడినయర్థము — మత్కర్మకృత్త్వాదికము, దానియందు న్యాయము—నిశ్చయంబున అయనము—అయనము గమనము—దానిని నియమంబున ననుష్ఠించుట, దానిచేత నని యర్థము. ఉపాసించుచున్నారో — నాయందలి స్మృతిని సదా చేయుచున్నారో అని యర్థము. ఈ చెప్పినయుపాసకులకు యుక్తతమత్వమును వ్యక్తీకరించుచున్నారు నిరంతరముగా ఇత్యాదిగా. నిరంతరముగా నని చెప్పినదానినే స్ఫుటీకరించుచున్నారు అహోరాత్రము అని. పగలును రాత్రియును మిక్కిలి యధికముగా నన్నే విషయాంతరవిముక్తులై చింతించుచున్నారని యర్థము.

హ. మయి = నాయందు, సాకారుఁ డైనభగవంతునియందు.

శం. ఇట్లగుటంగా, ఆరురుక్షువునకు మొదటిదే యుత్తమసాధనము సుకరము, రెండవది యారూఢున కని సూచించుచు, ఆరురుక్షు వగునర్జునునకు మొదటి దానినే ప్రరోచనపూర్వకముగా ♦ నుపదేశించుటకై శ్రీభగవంతుఁ డిట్లనియె.—మయి=మోక్షరూపుఁడ వగు నాయందు; మనః=మనస్సును; ఆవేశ్య=చక్కఁగా నిలిపి, మోక్షమునే కోరుచున్నవారలై యని యర్థము; లేక; మయి=నాస్వరూపమునందు, దృష్టము స్పృష్టము శ్రుతము మతమును సర్వంబును బ్రహ్మమే యని సర్వంబును నేనే యని గ్రహించుటయందే; మనః; ఆవేశ్య=చక్కఁగా నుంచి; లేక; మయి=నా ధ్యానమునందే, కాని విషయచింతనమునందుఁ గాదు; మనః; ఆవేశ్య, నిత్యయుక్తాః=మత్కర్మకృత్త్వాదిధర్మములందు నిత్యము—ఎల్లప్పుడును యుక్తాః—నియతులై; పరయా=నిశ్చల మయిన; శ్రద్ధయా=ఈసాధనములచేఁ బరమేశ్వరు నుపాసించినయెడఁ జిత్తశుద్ధియు దానివలన జ్ఞానంబును దానివలన మోక్షంబును సిద్ధించునా సిద్ధింపదా? ఇత్యాదిసంశయము లేని దృఢ మయినయాస్తిక్యబుద్ధితో; ఉపేతాః=కూడినవారలై; స్వధర్మమును స్వాశ్రమమును స్వజనమును స్వలక్షణమును విడువకయే మిక్కిలి భక్తితో; యే=ఎవ్వరు; మామ్=నన్ను; విశ్వరూపుని సర్వజ్ఞుని సర్వాత్మకుని పరమేశ్వరుని; ఉపాసతే=సదా సర్వత్ర సర్వంబును నేనే యని భావించుచున్నారో; తే=వారలే; యుక్తతమాః=యోగిశ్రేష్ఠు లని; మే మతాః—నాచే నిశ్చయింపఁబడి రని యర్థము. గృహమునందే యుండి మోక్షైకకామనచే మత్కర్మకృత్త్వాదిమోక్షసాధననిష్ఠులై సదా సర్వంబును నన్నుఁగా నే భావించుచు నెవ్వరు కాలము గడపుదురో వారలే యోగివరిష్ఠు లనుట యుక్త మని యభిప్రాయము. ఇందుచే స్వాధికారానురూప మయిన సగుణోపాసనమే యారురుక్షు వగు ముముక్షువునకు సుకరంబును స్వార్థప్రదంబు నగు సాధన మని సూచితం బగుచున్నది.

మ. అందు సర్వజ్ఞుఁ డగుభగవంతుం డర్జునునకు సగుణవిద్యయందే యధికార మని యెఱింగినవాఁడై వానికి దానిని, అధికారము చొప్పునఁ దారతమ్యయుక్తము లైనసాధనములను గూడ విధింపఁబోవుచున్నాఁడు. అందువలన మొదట సాకారబ్రహ్మవిద్యను రుచిఁ బుట్టించుటకై స్తుతించుచు మొదటివారు శ్రేష్ఠు లని యుత్తరమును శ్రీభగవంతుఁ డిట్లనియె.—మయి=నాయందు, భగవంతుఁడను వాసుదేవుఁడను బరమేశ్వరుఁడను సగుణబ్రహ్మము నగు నాయందు; మనః; ఆవేశ్య=అనన్యశరణు

♦ రుచిఁ బుట్టించి.

లై యతిశయప్రియులై ప్రవేశింపఁజేసి; హింగులరంగమునందు * లత్తుకవలె తన్మయముగాఁ జేసి; యే; మామ్=సర్వయోగేశ్వరులకును ఈశ్వరుని సర్వజ్ఞుని సమస్త కల్యాణగుణనిలయుని సాకారుని నన్ను; నిత్యయుక్తాః = ఎల్లప్పుడును ఉద్యుక్తులై; పరయా=ప్రకృష్ట మయిన, సాత్త్విక మయిన; శ్రద్ధయా=శ్రద్ధతో; ఉపేతాః=కూడినవారలై; ఉపాసతే = సదా చింతించుచున్నారో. తే=వారు; యుక్తతమాః; మే మతాః=నాకు సమ్మతులు. వారు గదా సదా మదాసక్తచిత్తులై విషయాంతరవిముఖులై నన్నే చింతించుచు నహోరాత్రంబులం గడపుచున్నారు. కావున వారలే యుక్తతము లని నామతము.

శ్రీ. అందు మొదటివారు శ్రేష్ఠు లని యుత్తరమును శ్రీభగవంతుఁడు చెప్పెను.—మయి = పరమేశ్వరుఁడను సర్వజ్ఞత్వాదిగుణవిశిష్టుఁడ నగు నాయందు; మనః; ఆవేశ్య = ఏకాగ్రమునుగాఁ జేసి; నిత్యయుక్తాః=నాకొఱకు కర్మము ననుష్ఠించుట మొదలగువానిచే నాయందే నిష్ఠ గలవారై; శ్రేష్ఠ మయినశ్రద్ధతోఁ గూడినవా రగు; యే=ఎవ్వరు; మామ్; ఉపాసతే = ఆరాధించుచున్నారో. వారు యుక్తతము లని నాకభిమతులు.

ప. ఇఁక భగవంతుఁ డుత్తరముఁ జెప్పుచున్నాఁడు.—†

రా. అత్యంతము మత్ప్రియు లగుటచే, మనః; మయి; ఆవేశ్య; పరయా; శ్రద్ధయా; ఉపేతాః; నిత్యయుక్తాః = నిత్యయోగమును గోరుచున్నవారలై; యే మామ్ ఉపాసతే—ప్రాప్యవిషయ ** మైనమనస్సును నాయందుంచి యెవ్వరు నన్నుపాసించుచున్నారో యని యర్థము. తే యుక్తతమాః మే మతాః—వారు నన్ను సుఖంబున శీఘ్రముగాఁ బొందుచున్నా రని యర్థము.

మా. ••

యే త్వక్షర మనిర్దేశ్య మవ్యక్తం పర్యుపాసతే
సర్వత్రగ మచిన్త్యం చ కూటస్థ మచలం ధ్రువమ్. 3

---

* ఎఱ్ఱనిరంగుగల ఒకవిధ మైనవర్ణకద్రవ్యమునందు.

† టీక శ్రీధరీయముతో సమానము.

** ప్రాప్యము విషయముగాఁ గలది.

•• దీనికి మాధ్వభాష్యము లేదు.

సన్నియ మ్యేన్ద్రియగ్రామం సర్వత్ర సమబుద్ధయః
తే ప్రాప్నువన్తి మామేవ సర్వభూతహితే రతాః. ४

**భా.** ఏమి యితరులు యుక్తతములు కారా? అట్లు తలంపకు. మఱి యెట్లు తలంపవలయు నందువేని, వారివిషయ మేది చెప్పవలయునో దాని వినుము. యేతు=ఎవ్వరు మఱి; అక్షరమ్=బ్రహ్మమును; అనిర్దేశ్యమ్=అవ్యక్త మగుటవలన శబ్దగోచరము కానిదానిని, నిర్దేశించుటకు శక్యము కాదు కావున అనిర్దేశ్య మయినదానిని; అవ్యక్తమ్ = ఏప్రమాణముచేతను నవ్యజ్యతే—వ్యక్తము కాదు కావున అవ్యక్తమును; పర్యుపాసతే=పరి—అంతటను ఉపాసించుచున్నారో; ఉపాసన మనఁగా నేమి? యథాశాస్త్రముగా నుపాస్య మయినవస్తువును విషయీకరించి దాని సామీప్యమునొంది తైలధారవలె సమానప్రత్యయ ప్రవాహముచే దీర్ఘకాల ముండుట యేది గలదో అది యుపాసన మని చెప్పుచున్నారు. అక్షరమునకు విశేషణము చెప్పుచున్నాఁడు.—సర్వత్రగమ్ = ఆకాశమువలె వ్యాపకమును; అచిన్త్యంచ=అవ్యక్త మగుటవలన అచింత్యమును, ఏది కరణగోచరం బగునో అది గదా మనస్సుచే నైనను చింత్య మగుచున్నది, తద్విపరీత మగుటవలన అక్షరము అచింత్యము; కూటస్థమ్= వెలుపలికిఁ గనఁబడుచున్నగుణము గలదై లోపల దోషము గలవస్తువు కూట మనఁబడును, కూటరూపము కూటసాక్ష్యము మొదలగువానియందుఁ గూటశబ్దము లోకమునం బ్రసిద్ధము, అట్లు అనేకసంసారబీజంబును అంతర్దోషవంతంబును మాయాఽవ్యాకృతాది * శబ్దవాచ్యంబై "మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్, మమ మాయా దురత్యయా" ఇత్యాదికమునందుఁ బ్రసిద్ధంబు నగు నవిద్యాదికం బేది గలదో అది కూటము, ఆకూటమునందు దాని కధ్యక్షంబై స్థితము—ఉన్నది, కావున కూటస్థమును; లేక; కూటమువలె—రాశివలె—నున్నది కూటస్థము, అట్టిదానిని; అందువలననే, అచలమ్=నిశ్చలమును; ఎందువలన అచలమో అందువలన, ధ్రువమ్=నిత్యమును; ఇన్ద్రియగ్రామమ్ = ఇంద్రియములసముదాయమును; సన్నియమ్య = చక్కఁగా నియ

* మాయాప్రకృత్యాది—అని పాఠాంతరము.

మించి, సంహరించి; పర్యుపాసించుచున్నారో అట్టి, సర్వత్ర=సర్వకాలము నందును; సమబుద్ధయః=ఇష్టానిష్టప్రాప్తులయందు తుల్య మయినబుద్ధి గల వారై; సర్వభూతహితే=సర్వభూతంబులకొఱకును హితమునందు; రతాః= ఆసక్తులు, సర్వభూతంబులకొఱకును హితమునే చింతించుచు దానినే చేయుచుండువారు; ఇట్టివా రెవ్వరు గలరో, తే=వారు; మామేవ= నన్నే; ప్రాప్నువన్తి = పొందుచున్నారు. మఱి వారివిషయమున నేమి యుఁ జెప్పవలసినది లేదు, వారు నన్నుఁ బొందుచున్నా రని. "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని గదా చెప్పఁబడినది. భగవత్స్వరూపులై యున్నవారికి యుక్తతమత్వము గాని అయుక్తతమత్వము గాని చెప్పఁ దగదు గదా!

ఎవ్వరు మఱి యే ప్రమాణముచేతను దెలియ నలవిగానిదియు కావున శబ్దముచే నిర్దేశింప శక్యము గానిదియు సర్వవ్యాపకంబును మనస్సుచేతను జింతింప నలవిగానిదియు మాయాధిష్ఠాన మయి యున్నదియు—రాశివలె నిర్వికారమై యున్న దియు—కావున నిశ్చలంబును నిత్యంబు నగు నక్షరమును సర్వేంద్రియముల నిగ్ర హించి యుపాసించుచున్నారో, సర్వకాలంబును ఇష్టానిష్టప్రాప్తులందు సమబుద్ధు లును సర్వభూతహితరతులు నగు నాయక్షరోపాసకులు నన్నే పొందుచున్నా రని తాత్పర్యము.

టీ. ముందు చెప్పెదము అని చెప్పినదానిని ప్రశ్నపూర్వకముగాఁ బ్రక టించుచున్నారు ఏమి ఇత్యాదిగా. యే తు అనుచోటి తుశబ్దము పూర్వులకన్నను ఫలమునందు విశేషమును దెలుపుచున్నది. అవ్యక్తత్వమును అనిర్దేశత్వమునందు హేతువునుగాఁ జెప్పుచున్నారు అవ్యక్త మగుటవలన నిత్యాదిగా. నిరుపాధిక మయినయక్షరమునం దెట్లుపాసనం బని యడుగుచున్నాఁడు ఉపాసన మనఁగా నేమి యని. శాస్త్రమువలన నక్షరము నెఱింగి దానిని ఉప—ఆత్మనుగాపొంది యుపాసించుచున్నారు—అట్లే నిలుచుచున్నారు—పూర్ణచిదేకతాన మయిన యక్ష రము తానే యని సదా భావించుచున్నారు అని యిట వివక్షితం బని చెప్పు చున్నారు యథాశాస్త్రముగా నిత్యాదిగా. అవ్యక్తత్వమే యచింత్యత్వమునందు హేతు వని చెప్పుచున్నారు ఏది ఇత్యాదిగా. కూటశబ్దమునకుఁ జెప్పినయర్థమును వృద్ధప్రయోగమువలన సాధించుచున్నారు కూటరూపము ఇత్యాదిగా. మొదలు

అనుటచే అనృతము గ్రహింపఁబడుచున్నది. ప్రకృతమునఁ గూటశబ్దముచేఁ జెప్పఁబడు ననృత మేది? అని యాశంకించి చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. చెప్పినరీతిని కూటశబ్దమున కనృతార్థత్వము సిద్ధ మగుచుండఁగా, అనేక మయిన సంసారమునకు బీజముగా నిరూపింపఁబడు చున్నదియు నానావిధదోషయుక్తంబును, “తద్భేదం తర్హ్యవ్యాకృతమ్, మాయాంతు ప్రకృతిమ్, మమమాయా” ఇత్యాదిస్థలములందు మాయాదిశబ్దితమై ప్రసిద్ధంబు నగు నేయవిద్యాదికము గలదో అది కూటశబ్దిత మని యర్థము. దానియం దుండుట యేరూపముచే నని యాశంకించి చెప్పుచున్నారు దాని కధ్యక్షుండై యని. కూటస్థశబ్దమునకు నిష్క్రియత్వ మర్థాంతరము చెప్పుచున్నారు లేక ఇత్యాదిగా. పూర్వవిశేషణము నుపజీవించి మీఁదవిశేషణము ప్రవర్తించిన దని చెప్పుచున్నారు అందువలననే యని. ఎట్లక్షరము నుపాసించుచున్నారు? దాని నుపాసించుటచే నేమి యగును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు ఇన్ద్రియగ్రామ మిత్యాదిగా. తుల్యము—హర్షవిషాదరాగద్వేషాదిరహితము, సమ్యక్ జ్ఞానముచే నజ్ఞానము వినాశితం బగుటవలన. క్రమపరోక్షములు సంభవింప వని వివక్షించి చెప్పుచున్నారు ఇట్టివా రెవ్వరు ఇత్యాదిగా. జ్ఞానవంతులకు వారిజ్ఞానము వలననే భగవత్ప్రాప్తి యర్థసిద్ధ మగుటవలన ననువాదమాత్రమే యిది యని చెప్పుచున్నారు మఱి ఇత్యాదిగా. జ్ఞానులకు భగవత్ప్రాప్తి సిద్ధమే యనుటయందుఁ బ్రమాణము చెప్పుచున్నారు జ్ఞానీ త్విత్యాదిగా. జ్ఞానవంతులకు భగవత్ప్రాప్తి సిద్ధ మయినయెడ వారినే యుక్తతములనుగాఁ జెప్పవలయును, ఎట్లు సగుణబ్రహ్మోపాసకులను యుక్తతములనుగాఁ జెప్పితివి? అని యాశంకించి చెప్పుచున్నారు భగవత్స్వరూపులై ఇత్యాదిగా.

హా. అనిర్దేశ్యమ్ = ఇట్టిది యది యని నిర్దేశింపయోగ్యము కానిదానిని; అవ్యక్తమ్ = ప్రత్యక్షాదిప్రమాణములచేఁ దెలియ నలవిగాని దానిని. కూటస్థమ్= కూటమువలె—పర్వతమువలె నున్నది కావున కూటస్థ మైనదానిని.

శ్లో. మందప్రజ్ఞు లగు ముముక్షువులకు సగుణోపాసనమునందుఁ బ్రవృత్తి సిద్ధించుటకై “తే మే యుక్తతమాః” అని కర్మయోగులను స్తుతించి యిప్పుడు పరబ్రహ్మమునకు స్వరూపంబును సాధకులకు సాధనసంపత్తినిం బ్రతిపాదించువాఁడై, నిర్గుణోపాసకులకు యుక్తతమత్వంబును తదుపాసనమునకు సాక్షాన్మోక్షైకసాధనత్వంబును, ఫలము దెల్పుటచేఁ దనంత స్పష్టం బగు నని బ్రహ్మవిదులబ్రహ్మోపాసనంబునకు

ఫలముం జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఉపాసకులకును ఉపాసనమునకును ఉపాస్యమునకును క్రమంబున సాధనముచేతను ఫలముచేతను స్వరూపముచేతను బూర్వులకంటె వైలక్షణ్యము తెలుపుచున్నది తుశబ్దము. ఇన్ద్రియగ్రామమ్; సన్నియమ్య=చక్కఁగా నిరోధించి, విషయగ్రహణమున నింద్రియములు చలించినయెడ మనస్సును జలించుచున్నది, అందుచే సమాధి భిన్నమగును, అందువలన ఇంద్రియములను విషయగ్రహణవిముఖంబులనుగాఁ జేసి యని యర్థము; సర్వభూతహితే= మశకపిపీలికాదు లగు సర్వప్రాణులకును హితమునందు—ఉపద్రవము చేయకుండుట యందు, “జనకృపా నైష్ఠుర్య ముత్సృజ్యతామ్” ✦ అనున్యాయంబున అహితము చేయకుండుటయందు; రతాః=నిరతులై; లేక; బ్రహ్మాది స్తంబపర్యంతము లయిన సర్వప్రాణులకును హితమునందు—పరమప్రేమాస్పద మగుటవలనఁ బ్రియతమ మయిన ప్రత్యగాత్మయందు రతులై, సర్వత్ర ప్రత్యగ్రూపంబున నున్నయాత్మను సర్వాత్మకుఁడను నేనని స్వస్వరూపంబునఁ జూచుచున్నవారలై యని యర్థము; అందువలననే, సర్వత్ర=సమస్తప్రపంచమునందు; సమబుద్ధయః=బ్రహ్మదృష్టి గలవారలై; యే=ఎవ్వరు మఱి యతులు బ్రహ్మవిదులు తాము; అవ్యక్తమ్=శబ్దస్పర్శరూపాదులు లేమివలన నవ్యజ్యతే—వ్యక్తము కానిది యవ్యక్తము, సర్వేంద్రియములకును అగోచర మైనదానిని; అందువలననే, అనిర్దేశ్యమ్=వాగాదులచే నిది యని నిర్దేశింప నశక్య మైనదానిని; సర్వత్రగమ్=ఆకాశమువలె నిరాకార మయి పరిపూర్ణ మయిన దానిని; అవ్యక్త మగుటవలననే, అచిన్త్యమ్=చింతింపనలవి గానిదానిని; కావుననే, కూటస్థమ్=కూటమువలె ✱ కదల్పరానిదై యున్నదానిని; అందువలననే, అచలమ్= చలనము లేనిదానిని; అందువలననే, ధ్రువమ్=శాశ్వత మైనదానిని; ఇట్టిలక్షణము గల, అక్షరమ్ = పరబ్రహ్మమును; పర్యుపాసతే = సర్వదా అనుసంధించుచున్నారో, సర్వంబును నిర్విశేషబ్రహ్మమునుగానే యెవ్వరు చూచుచున్నారో యని యర్థము. తే = ఆబ్రహ్మనిష్ఠులు; మామేవ = నన్నే, సచ్చిదానందైకరస మగుపరబ్రహ్మమునే; ప్రాప్నువన్తి = పొందుచున్నారు. సగుణోపాసకు లగుపూర్వోక్తభక్తులు అగ్న్యాది దేవతలను బొంది క్రమంబున నన్నుఁ బొందుచున్నారు, అక్షరోపాసకులలో యిట్టి యంతియు దేవతాంతరప్రాప్తియు లేకయే యవ్యవహితముగా బ్రహ్మమును నన్నే పొందుచున్నా రని యర్థము. అందువలన సాక్షాద్బ్రహ్మప్రాప్తియే బ్రహ్మవిదులకును

✦ జనులయందు దయయును నిష్ఠురతయును విడువవలయును.

✱ పర్వతమువలె.

అబ్రహ్మవిదులకును యుక్తతమత్వమును అయుక్తతమత్వము విస్పష్టీకరించుచున్నది. ఎట్లు పరానపేక్షచేతను పరాపేక్షచేతను రాజసన్నిధిఁ బొందినవారికి ఆప్తతమత్వమును అనాప్తతమత్వమును తత్ప్రాప్తియే విశదీకరించుచున్నదో అట్లు. అందుచే యుక్తతమత్వము మొదటఁ జెప్పఁబడినవారి కౌపచారిక మని సిద్ధము. నిర్గుణోపాసనమే సాక్షాన్మోక్షసాధనం బగుట బ్రహ్మప్రాప్తిచే సూచింపఁబడినది. ఇందుచే సదసద్వివేకవంతులు పండితులు శుద్ధాత్ములు తీవ్రమోక్షేచ్ఛు లగువారు సర్వకర్మసన్న్యాసపూర్వకముగా శ్రవణాదికముచే బ్రహ్మము నెఱింగి తదుపాసనమే చేయవలయును విదేహకైవల్యసిద్ధికొఱ కని సూచితం బగుచున్నది.

ప్ర. నిర్గుణబ్రహ్మవిదులకంటె సగుణబ్రహ్మవిదుల కేమి యతిశయము? అతిశయ మున్నం గదా వారే యుక్తతము లని నీ కభిమతులు కావచ్చును. అని యాకాంక్షింపఁగా నాయతిశయముఁ జెప్పుటకై తన్నిరూపకు లగు * నిర్గుణబ్రహ్మవిదులను బ్రస్తుతించుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—ఎవ్వ రక్షరము నుపాసించుచున్నారో వారును నన్నే పొందుచున్నా రని రెండుశ్లోకములకును ఏకాన్వయము. పూర్వులకంటె వైలక్షణ్యద్యోతకము తుశబ్దము. అక్షర మనఁగా నిర్విశేషబ్రహ్మము వాచక్నవీబ్రాహ్మణమునందుఁ బ్రసిద్ధము. దాని బోధించుటకై యేడువిశేషణములు. అనిర్దేశ్యమ్ = శబ్దముచే వ్యపదేశింప నశక్య మైనది; ఎందువలన ననఁగా, అవ్యక్తమ్= శబ్దప్రవృత్తినిమిత్తము లగుజాతిగుణక్రియాసంబంధములు లేనిది, జాతిని గాని గుణమును గాని క్రియను గాని నిమిత్తీకరించియే శబ్దము ప్రవర్తించుటవలన, నిర్విశేషమునందు శబ్దమునకుఁ బ్రవృత్తి సంభవింపమివలన; ఎందువలన జాత్యాదులు లేనిది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సర్వత్రగమ్ = సర్వవ్యాపకము, సర్వకారణము, అందువలన జాత్యాదిశూన్యము, పరిచ్ఛిన్న మగుకార్యమునకే జాత్యాదియోగము కనఁబడుటవలన, ఆకాశాదులకుఁ గూడ కార్యత్వ మంగీకరించుటవలనను; అందువలననే, అచిన్త్యమ్ = శబ్దవృత్తికిం బోలె మనోవృత్తికిఁ గూడ విషయము కానిది, మనోవృత్తిగూడ పరిచ్ఛిన్నవిషయం బగుటవలన, « యతో వాచో నివర్తన్తే । అప్రాప్య మనసా సహ » అనుశ్రుతివలన; అప్పుడు ఎట్లు « తం త్వౌపనిషదం పురుషం పృచ్ఛామి, దృశ్యతే త్వగ్ర్యయా బుద్ధ్యా " ♦ అనుశ్రుతియును « శాస్త్ర

* ఎవ్వరికంటె సగుణబ్రహ్మవిదుల కతిశయము చెప్పుచున్నాఁడో అట్టివార లగు.

♦ ఔపనిషత్ప్రతిపాదితుఁ డైనపురుషు నడుగుచున్నాను, అగ్ర్య మయినబుద్ధిచేత నెఱుంగఁబడుచున్నది.

యోనిత్వాత్" ¹ అనుసూత్రంబును సంగతము లగును? అందువేని చెప్పుచున్నాము, అవిద్యాకల్పితసంబంధముచే శబ్దజన్య మయినచరమ మగుబుద్ధివృత్తియందుఁ బరమానందబోధరూపము శుద్ధ మగువస్తువు ప్రతిబింబిత మైనప్పుడు కల్పితము లయిన యవిద్యాతత్కార్యములకు నివృత్తి యుపపన్న మగుటవలన నుపచారముచే విషయత్వము చెప్పఁబడినది; అందువలన నటుఁ గల్పిత మయిన యవిద్యాసంబంధమును బ్రతిపాదించుటకై చెప్పుచున్నాఁడు.—కూటస్థమ్ = ఏది మిథ్యాభూత మై సత్యముగాఁ బ్రతీత మగునో అది కూట మని లోకులచేఁ జెప్పఁబడుచున్నది, కూటకార్షాపణము కూటసాక్షిత్వము * మొదలగువానియందువలె, మాయాఖ్య మయినయజ్ఞానంబును కార్యప్రపంచసహితముగా మిథ్యాభూత మయినను లౌకికులచే సత్య మని గ్రహింపఁబడుచున్నది కావున కూట మనఁబడుచున్నది, దానియందు ఆధ్యాసికసంబంధముచే నధిష్ఠాన మయి యున్నది కావున కూటస్థము, అజ్ఞానతత్కార్యముల కధిష్ఠాన మని యర్థము; ఇందుచే సర్వానుపపత్తులకును బరిహారము చేయఁబడినది; అందువలననే సర్వవికారంబులును అవిద్యాకల్పితంబు లగుటవలన తదధిష్ఠాన మయినసాక్షిచైతన్యము నిర్వికార మని చెప్పుచున్నాఁడు.—అచలమ్ = చలన మనఁగా వికారము, అది లేనిది; అచల మగుటవలననే, ధ్రువమ్ = పరిణామము లేనిది, నిత్యము; ఇట్టి శుద్ధ మయినబ్రహ్మమును నన్ను, పర్యుపాసతే = శ్రవణముచేఁ బ్రమాణగత మయిన యసంభావనను మననముచే ప్రమేయగత మయినయసంభావనను నివర్తించి యనంతరము విపరీతభావనానివృత్తికొఱకు ధ్యానించుచున్నారో, విజాతీయప్రత్యయము తిరస్కరించి తైలధారవలె నవిచ్ఛిన్న మగుసమానప్రత్యయప్రవాహముచే—నిదిధ్యాసనసంజ్ఞకం బైనధ్యానమున విషయీకరించుచున్నారో యని యర్థము; ఎట్లు మఱి విషయేంద్రియసంయోగము కలుగుచుండఁగా విజాతీయప్రత్యయతిరస్కారము సంభవించును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఇన్ద్రియగ్రామమ్ = కరణసముదాయమును; సంనియమ్య=స్వవిషయములనుండి యుపసంహరించి; ఇందుచే శమదమాదిసంపత్తి చెప్పఁబడినది; విషయభోగవాసన యుండఁగా నింద్రియములకు విషయనివృత్తి యెక్కడిది? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—సర్వత్ర—సర్వవిషయములందును, సమము—తుల్యము హర్షవిషాదంబులును రాగద్వేషంబులును లేని దగుబుద్ధి గలవారలు,

---

¹ శాస్త్రము యోనిగా — ఎఱుంగుటకు సాధనముగాఁ గల దగుటవలన. బ్రహ్మసూ. అ-౧. పా-౧. సూ-౩.

* చెల్లనికాసు, తప్పుసాక్ష్యము.

సమ్యక్ జ్ఞానముచే హర్షవిషాదాదికారణ మయినయజ్ఞానము నివర్తిత మగుటవలనను విషయములందు దోషదర్శనాభ్యాసముచే స్పృహా వినాశితం బగుటవలనను, వారు సర్వత్ర సమబుద్ధులు; ఇందుచే వశీకారసంజ్ఞ మగువైరాగ్యము చెప్పఁబడినది; అందువలననే సర్వత్ర ఆత్మదృష్టిచే హింసాకారణ మయినద్వేషము లేనివా రగుటవలన, సర్వభూతహితే రతాః = 'అభయం సర్వభూతేభ్యో మత్తః స్వాహా' ♦ అనుమంత్రముచే సర్వభూతములకును అభయదక్షిణ నిచ్చినవారు, సన్న్యసించినవా రని యర్థము; తే=అట్టి సర్వసాధనసంపన్నులై తామే బ్రహ్మభూతు లయినవారు; సర్వసాధనఫలభూత మగు నిస్సంశయసాక్షాత్కారముచే, మామేవ = నన్నే, అక్షర బ్రహ్మమునే; ప్రాప్నువన్తి—పూర్వంబును మద్రూపులే యైనవారై యవిద్యానివృత్తిచే మద్రూపులుగానే నిలుచుచున్నా రని యర్థము, "బ్రహ్మైవ సన్ బ్రహ్మాప్యేతి, బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" ఇత్యాదిశ్రుతులవలన. ఇందును 'జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్' అని చెప్పఁబడినది.

శ్రీ. అప్పుడు, ఇతరులు శ్రేష్ఠులు గారా? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—యేతు; అక్షరమ్; పర్యుపాసతే = ధ్యానించుచున్నారో; తే మామేవ ప్రాప్నువన్తి అని రెంటికిని అన్వయము. అక్షరమునకు లక్షణము అనిర్దేశ్య మిత్యాదికము. అనిర్దేశ్యమ్ = శబ్దముచే నిర్దేశింప నశక్యము. ఎందువలన ననఁగా, అవ్యక్తమ్=రూపాదివిహీనము. సర్వత్రగమ్=సర్వవ్యాపి. అవ్యక్తమగుటవలననే, అచిన్త్యమ్. కూటస్థమ్=కూటమునందు—మాయాప్రపంచమునందు అధిష్ఠానమై యున్నది. అచలమ్ = వృద్ధ్యాదిరహితము. అందువలననే, ధ్రువమ్= నిత్యము. ఇతరము స్పష్టము.

ప. అప్పు డితరు లేమి శ్రేష్ఠులు కారా? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—యేతు; అనిర్దేశ్యమ్ = నిర్దేశింప నశక్యంబును; అందువలననే అక్షరంబును అవ్యక్తంబును; సర్వత్రగమ్ = వ్యాపకమును; అచిన్త్యమ్ = చింతింప నశక్యమును; కూటమునందు— మాయాప్రపంచమునందు అధిష్ఠానభావమున నున్నది కావున కూటస్థమును; అచలమ్ = వృద్ధ్యాదిరహితమును, అట్టి స్వరూపమును; సర్వత్ర సమదర్శు లగుపురుషులు; ఇన్ద్రియగ్రామం సన్నియమ్య; పర్యుపాసతే. తే మామేవ ప్రాప్నువన్తి. రెండుతెగలవారికిని ఫలమునందు భేదము లే దని యర్థము.

---

♦ నావలన సర్వభూతములకును అభయ మగుఁగాక.

రా. యేతు; అక్షరమ్ = ప్రత్యగాత్మస్వరూపమును; అనిర్దేశ్యమ్=దేహము కంటె భిన్న మగుటవలన దేవాదిశబ్దములచే నిర్దేశింపఁగూడనిదానిని; అందువలననే చక్షురాదికరణముల కనభివ్యక్త మయినదానిని; సర్వత్రగమ్ అచిన్త్యంచ= సర్వత్ర—దేవాదిదేహములయం దున్నదైనను తద్విజాతీయ మగుటచే నాయారూపమున * చింతించుట కనర్హమైనదానిని; అందువలననే, కూటస్థమ్ = సర్వసాధారణమును, ఆయాదేహముల యసాధారణాకారముతో సంబంధింపనిదాని నని యర్థము; అపరిణామి యగుటచేఁ దనయసాధారణాకారమునుండి నచలతి—చ్యుతము కాదు కావున అచల మైనదానిని; అందువలననే, ధ్రువమ్ = నిత్యమును; ఇన్ద్రియగ్రామమ్ సన్నియమ్య=చక్షురాదిక మైనయింద్రియగ్రామమును సర్వంబును స్వవ్యాపారములనుండి చక్కఁగా నియమించి; సర్వత్ర సమబుద్ధయః=సర్వత్ర దేవాదివిషమాకారము లైన దేహములయం దున్నయాత్మలయందు జ్ఞానైకాకారు లని సమబుద్ధి గలవారలు; అందువలననే, సర్వభూతహితే రతాః=సర్వభూతములకును అహితమునందలియాసక్తి నుండి నివర్తిల్లినవారు; సర్వభూతాహితాసక్తికి ఆత్మయందు దేవాదివిషమాకారాభిమానము గదా నిమిత్తము; ఎవ్వ రిట్లు అక్షరము నుపాసించుచున్నారో; తే మాం ప్రాప్నువన్త్యేవ=వారును నన్నుఁ బొందనే పొందుచున్నారు—మత్సమానాకారుఁడై యసంసారి యగునాత్మను బొందనే పొందుచున్నా రని యర్థము. « మమ సాధర్మ్య మాగతాః » అని గదా చెప్పఁబోవుచున్నాఁడు. శ్రుతియును—« నిరఞ్జనః పరమం సామ్య ముపైతి » అని. అట్లు అక్షరశబ్దనిర్దిష్టుఁ డైనకూటస్థునికంటెఁ బరబ్రహ్మ మన్యం బని చెప్పఁబోవుచున్నాఁడు « కూటస్థో ఽక్షర ఉచ్యతే । ఉత్తమః పురుషస్త్వన్యః " అని. 'అథ పరా యయా త దక్షర మధిగమ్యతే' అని యక్షరవిద్యయందో అక్షరశబ్దనిర్దిష్టము పరబ్రహ్మమే, భూతయోనిత్వాదులవలన.

మా. నిన్నుపాసించువారే యుత్తము లగుదురు గాక. ఇతరులకు మఱి యేమిఫలము? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అనిర్దేశ్యత్వము గూడ చెప్పఁబడినది భాగవతమునందు మాయకు—« అప్రతర్క్యా దనిర్దేశ్యా దితి కేష్వపి నిశ్చయః " అని. ఈశ్వరుఁడో దైవశబ్దముచేఁ జెప్పఁబడియె « దైవమన్యే పరే » అనుచోట. చెప్పఁబడినది గూడ సామవేదంబున కాషాయణశ్రుతియందు.—« నాస దాసీ న్నోసదాసీ త్తదానీమ్, స మహాభూతం నోపభూతం త దాసీత్ " అని యారంభించి, « తమ ఆసీ త్తమసా గూఢ మగ్రే " అనియు, « తమో హ్యవ్యక్త మజర మని

* దేవాదిరూపమున.

ర్దేశ్య మేషా హ్యేవ ప్రకృతిః" అనియు. సర్వగత్వాచింత్యత్వాదిలక్షణము గలది గదా ఆప్రకృతి. అట్లు మోక్షధర్మమునందు.--« నారాయణగుణాశ్రయా దజరాద తీన్ద్రియా దగ్రాహ్యా దసంభవతః । అసత్యా దహింసాత్ లలామా ద్ద్వితీయ ప్రవృత్తి విశేషా దవైరా దక్షయా దమరా దక్షరా దమూర్తితః । సర్వస్యా స్సర్వకర్తు శ్శా శ్వత తమసః" అని. « ఆసీ దిదం తమోభూత మప్రజ్ఞాత మలక్షణమ్ । అప్ర తర్క్య మవిజ్ఞేయం ప్రసుప్త మివ సర్వతః » అని మానవమునందు. « కూటస్థో ఽక్షర ఉచ్యతే » అని చెప్పఁబోవు చున్నాఁడు. కూటమునందు—ఆకాశమునందు ఉన్నది కూటస్థ « ఆకాశే సంస్థితా త్వేషా తతః కూటస్థితా మతా" అని ఋగ్వే దఖిలములందు. « సా సర్వగా నిశ్చలా లోకయోనిః సా చాక్షరా విశ్వగా విర జస్కా" అని సామవేదమున గోపవనశాఖయందు.

క్లేశో ఽధికతర స్తేషా మవ్యక్తాసక్తచేతసామ్

అవ్యక్తా హి గతి ర్దుఃఖం దేహవద్భి రవాప్యతే. ౫

భా. మ తేమి ?—క్లేశః=కష్టము; అధికతరః = మిక్కిలి యధికము; మత్కర్మాదిపరులకు క్లేశం బ్బహుమే వాస్తవమ్, అయినను, తేషామ్= ఆపరమార్థదర్శు లగు నక్షరాత్ములకు; అధికతరము—దానికన్న నధికము దేహాభిమానపరిత్యాగనిమిత్త మయిన క్లేశము; అవ్యక్తాసక్తచేతసామ్= అవ్యక్తమునం దాసక్త మయినమనస్సు గలవారలకు ♦. హి=ఎందువలన ననఁగా. అవ్యక్తాగతిః=అక్షరాత్మక మయినగతి; దుఃఖమ్=దుఃఖము చేత; దేహవద్భిః = దేహాభిమానవంతుల చేత; అవాప్యతే=పొందఁబడుచున్నది. అందువలన వారికిఁ గ్లేశం బధికతరము. అక్షరోపాసకులవృత్తి యేది గలదో దాని ముందు చెప్పెదము.

అవ్యక్త మయినయక్షరము నుపాసించువారలకు సగుణోపాసకులకన్నను కష్టము మిక్కిలి యధికము, ఎందువలన ననఁగా, దేహాభిమానము విడిచినవారికే గాని యక్షరోపాసనము శక్యము గాదు, కావున దేహాభిమానము గలవారికి అవ్యక్త ప్రాప్తి సిద్ధించుట బహుకష్ట మని తాత్పర్యము.

ఆ. అపుడు సగుణోపాసకులకుఁ గూడ యుక్తతమత్వం బెట్లు? అని యాశంకించుచున్నాఁడు మ తేమి అని. అక్షరోపాసనము దుష్కరం బగుటవలనను

♦ అట్టి యక్షరోపాసకుల కనుట.

ఉపాసనాంతరము సుకరం బగుటవలనను అనునభిప్రాయముతోఁ జెప్పుచున్నారు క్లేశః ఇత్యాదిగా. అధికతరః—ఇతడు లైనద్వైతదర్శు లగుకామవంతులకన్నను అని శేషము. అక్షరోపాసకులకుఁ గ్లేశం బధికతరం బనుటకు హేతువుగా విశేషణము చేయుచున్నారు దే హేత్యాదిగా. అవ్యక్తము—అత్యంతసూక్ష్మము నిర్విశేష మయిన యక్షరము, దానియం దాసక్తము—అభినివిష్ట మయినమనస్సు గలవారి కని యర్థము. అక్షరోపాసకులకుఁ గ్లేశ మధికతరం బనుటకు భగవంతుఁడే హేతువు చెప్పుచున్నాఁ డుత్తరార్థముచేత. దుఃఖముచేత—కష్టముచేత నని యర్థము. అందువలన—దేహాభిమానము విడుచుటవలన నని యర్థము. వా రెట్లు వర్తింతురు? అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు అక్ష రేత్యాదిగా.

హా. అవ్యక్తా గతిః=అవ్యక్త మగుజ్ఞానము.

శం. అపక్వచిత్తులకు అక్షరోపాసనమునందుఁ గ్లేశం బధిక మని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—వ్యక్తుఁడ వగు నన్నీశ్వరు నుపాసించువారికిని మత్కర్మకృత్త్వాదిధర్మములు సిద్ధించుట కధికక్లేశ ముండనే యున్నది వాస్తవమే, అట్లయినను దీనికన్నను, అవ్యక్తాసక్తచేతసామ్ = అవ్యక్తమునందు—సర్వేంద్రియములకును అగోచరము అదృశ్యత్వాదిగుణకము అతర్క్యము అచింత్యము అప్రమేయ మగు పరబ్రహ్మమునందు, ఆసక్తము—తద్భావాపత్తికై యత్నించుచున్న దగు, చేతస్సు—మనస్సు గలవారలకు, పరబ్రహ్మనిదిధ్యాసనము చేయుచుండుయతులకు; విషయత్యాగంబునను ఆశ్రమధర్మానుష్ఠానంబునను యమనియమాద్యభ్యాసంబునను అసత్ప్రత్యయవర్జనంబునను నిరాకార మగుబ్రహ్మమునందు మనఃస్థాపనంబునను, క్లేశః=కష్టము; అధికతరః = మిక్కిలి యధిక మగుచున్నది, ఒక్కొక్కసాధనము సిద్ధించుటయు దుష్కరం బగుటవలన. అందును అనాత్మయం దహంభావము విడుచుట బ్రహ్మదేవునకును శక్యము గాదు, అట్లె బ్రహ్మమునందు జగత్ప్రత్యయమును విడుచుట గూడ; తత్త్యాగము నిరంతరక్లేశసాధ్య మగుటవలన బ్రహ్మవిదుల కధికతరమే క్లేశ మని యర్థము. ఈయర్థమును తానే స్పష్టీకరించుచున్నాఁడు శ్రీభగవంతుఁడు.—హి—ఏకారణమువలన ననఁగా. అవ్యక్తా = అవ్యక్తాత్మక మయిన; గతిః=తద్భావాపత్తిః; దేహవద్భిః = దేహతాదాత్మ్యము గలపురుషులచేత; దుఃఖమ్ = దుఃఖముచేత, అతిక్లేశముచేత; అవాప్యతే = పొందఁబడుచున్నది. సామాన్యప్రయత్నముచే దేహాద్యహంకారము పురుషునకు నివర్తిల్లునా? చిరకాల నిత్య నిరంతర నియత నిర్వికల్ప

సమాధినిష్ఠావిశేషాతిశయముచేతనే కదా యది నివర్తిల్లవలయును. అది నిశ్శేషముగా నశించినం గదా బ్రహ్మమునందే యాత్మభావము సిద్ధించును. అందువలన యుక్త మవ్యక్తాసక్తచేతసులకుఁ గ్లేశం బధికతరం బనుట. వారలకు దేహాద్యహంకారవిచ్ఛిత్తియు సాధనసంపత్తియు నేది గలదో యది ముందు చెప్పఁబడును.

మ. ఇప్పుడు వీరికన్నను బూర్వము చెప్పినవారి కతిశయముఁ దెల్పుటకై చెప్పుచున్నాఁడు.—పూర్వము చెప్పినవారికిఁ గూడ మనస్సును విషయంబులనుండి మరలించి సగుణబ్రహ్మమునందు నిలుపుటయందును సంతతము మత్కర్మపరాయణత్వమునందును పరమశ్రద్ధ గలుగుటయందును క్లేశము అధికమే కలదు. కింతు=మఱేమనఁగా; అవ్యక్తాసక్తచేతసామ్=నిర్గుణబ్రహ్మచింతనపరులకు, పూర్వోక్తసాధనసంపన్నులగువారికి; క్లేశః=ఆయాసము; అధికతరః=అతిశయంబున నధికము. ఇందుకుఁ దానే హేతువు చెప్పుచున్నాఁడు భగవంతుఁడు.—హి=ఏకారణమువలన ననఁగా. అవ్యక్తా గతిః=గంతవ్యము ఫలభూత మయినయక్షరాత్మక మగుబ్రహ్మము; దుఃఖేన=బహుకష్టముచేత; దేహవద్భిః=దేహాభిమానులచేత; అవాప్యతే. సర్వకర్మసన్న్యాసము చేసి గురువు నుపసర్పించి తత్త్వద్వైతాంతవాక్యవిచారముచేత తత్త్వజ్ఞప్తిమసిరాకరణమునందు మహాప్రయాసము ప్రత్యక్షసిద్ధము. అందువలన క్లేశో ఽధికతరస్తేషామ్ అని చెప్పఁబడినది. ఫల మొక్కటే యయినను, ఎవ్వరు దుష్కరోపాయముచేఁ బొందుచున్నారో వారికన్నను సుకరోపాయముచేఁ బొందువారు శ్రేష్ఠు లగుచున్నా రని యభిప్రాయము.

శ్రీ. వారును నిన్నే పొందుచురేని, అప్పుడు ఇతరులకు యుక్తతమత్వ మెందువలన? అని యాశంకించి క్లేశాఽక్లేశకృత మయినవిశేషముఁ జెప్పుచున్నాఁడు మూఁడుశ్లోకములచేత.—అవ్యక్తమునందు—నిర్విశేషమునందు ఆసక్త మయిన చేతస్సు గలవారికి; క్లేశః అధికతరః. హి=ఎందువలన ననఁగా. అవ్యక్తవిషయ మయిన, గతిః= నిష్ఠ; దేహాభిమానులచే, దుఃఖమ్ అవాప్యతే, దేహాభిమానులకు నిత్యంబును ప్రత్యక్ప్రవణత దుర్ఘటం బగుటవలన నని భావము.

ప. అందును మొదటివాఁడు శ్రేష్ఠుఁ డని చెప్పుచున్నాఁడు.—అవ్యక్తమునందు—అక్షరమునందు ఆసక్త మయినచేతస్సు గలవారలకు; క్లేశో ఽధికతరః. హి=ఎందువలన ననఁగా. అవ్యక్తవిషయ మయినగతి, దేహవద్భిః = దేహాభిమానులచేత; దుఃఖమ్=దుఃఖముచేత; అవాప్యతే.

రా॥ తేషామ్; అవ్యక్తాసక్తచేతసామ్; క్లేశః; అధికతరః. అవ్యక్తా హి గతిః=అవ్యక్తవిషయ మయినమనోవృత్తి; దేహవద్భిః=దేహాత్మాభిమానయుక్తులచేత; దుఃఖముగఁ బొందఁబడుచున్నది. దేహవంతులు దేహమునే గదా యాత్మ యని తలంచుచున్నారు.

మూ॥ ఎట్లప్పుడు నిన్నుపాసించువార లుత్తము లగుదురు? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—అవ్యక్తాగతి ర్దుఃఖం స్యాద్వాప్యతే—గతి యనఁగా మార్గము, అవ్యక్తోపాసనద్వారక మయినమత్ప్రాప్తిమార్గము దుఃఖముచేఁ బొందఁబడు చున్నదని యర్థము. అతిశయంబున నుపాసించుటయు, సర్వేంద్రియాతినియమనము సర్వసమబుద్ధిత్వము సర్వభూతహితరతత్వము అతిసదాచారము సమ్యగ్విష్ణుభక్తి మొదలగుసాధనములసంపత్తియు లేక యవ్యక్త మపరోక్షము గాదు. అది లేక విష్ణుప్రసాదము కలుగదు. అవ్యక్తాపరోక్షత యున్నను సమ్యగ్భగవదుపాసనము లేక విష్ణుప్రసాదము కలుగదు. అది లేనిచో మోక్షము లేదు. అవ్యక్తోపాసనము లేకున్నను భగవదుపాసకులకు మోక్షము కలుగనే కలుగుచున్నది. ఇట్లు బహుక్లేశము గలది యీమార్గ మని భావము. అట్లయినను అవ్యక్తసాక్షాత్కారము గలవారికి భగవదుపాసనము సుకరమగును. ఇదియే ప్రయోజనము. అందును, అవ్యక్తాపరోక్షతకై యెంతప్రయాసము పడవలయునో అంతటిప్రయాసముఁ గాని యంతకన్నఁ దక్కువయగుప్రయాసముసం గాని భగవంతు నుపాసించునేని, అప్పుడు భగవదపరోక్షతయే సిద్ధించును, కావున భగవదుపాసనం బధికము. ఇంద్రియసంయమాదులు తక్కువపడినప్పుడు ఎంతటియుపాసకునకేని దేవి యతిప్రసన్నురాలు కాదు, దేవుఁడో యాసాధనములను భక్తిమంతునకుఁ దానే ప్రయత్నంబున నిచ్చుచున్నాఁడు, కావున భక్తులకు భగవదుపాసనమునందు సౌకర్యము, ఇతరమునందుఁ గ్లేశం బధికతరము. ఇది యంతయు « పర్యుపాస్తే, సన్నియమ్య, అధికతరః » అనుచోటుల పరి సం తరప్ శబ్దములచే సూచింపఁబడినది. సామవేదంబున మధుచ్ఛందశ్శాఖయందును జెప్పఁబడినది. « భక్తాశ్చ యే ఽతీవ విష్ణావతీవ జితేన్ద్రియా స్సమ్య గాచారయుక్తాః । ఉపాసతే తాం సమబుద్ధయశ్చ తేషాం దేవీ దృశ్యతే నేతరేషామ్ । దృష్టాచ సా భక్తిమతీవ విష్ణా దత్వోపాస్తే సర్వవిఘ్నాం శ్ఛినత్తి । ఉపాస్య తాం వాసుదేవం విదిత్వా తత స్తత శ్శాన్తి మత్యన్తమేతి » ♦ అని, చెప్పఁబడినది గూడ సామవేదమున

♦ ఎవ్వరు విష్ణువునం దత్యంతము భక్తులై అత్యంతము జితేంద్రియులై సమీచీన మయినయాచారములోఁ గూడినవారలై సమబుద్ధులునై యుపాసించుచున్నారో వారికి దేవి దృశ్యురా లగును, ఇత

అయాస్యశాఖయందు —«ప్రసన్నో భవితా దేవ స్సోఽవ్యక్తేన సహైవ తు । యావతా తత్ప్రసాదో హి తావ త్తైవ న సంశయః । నతత్ప్రసాదమాత్రేణ ప్రీయతే స మహేశ్వరః । తస్మిన్ప్రీతే తు సర్వస్య ప్రీతిస్తు భవతి ధ్రువమ్ । యద్య ప్యుపాసనాధిక్యం తథాపి గుణదో హి సః । ముక్తిద శ్చ సఏ వైకో నావ్యక్తాదిస్తు కశ్చన» * అని. «మహాత్మభావ మిచ్ఛన్తో యతన్తే పరమాత్మనే» ♦♦ అనియు. మోక్షధర్మమునందు శ్రీవచనము.—«ధర్మనిత్యే మహాబుద్ధౌ బ్రహ్మణ్యే సత్యవాదిని । ప్రశ్రితే దానశీలేచ సదైవ నివసామ్యహమ్» ¶ అని. మహతః పరమ్ అని చెప్పఁబడినదియు బ్రహ్మమే. అట్లు భగవంతునిచే § సయుక్తికముగాఁ జెప్పఁబడినది.—«వదతీతి చేన్నప్రాజ్ఞో హి, త్రయాణామేవ చైవ ముపన్యాసః ప్రశ్నశ్చ» ♦ అని. తమ్ అను పుంలింగమువలనఁ గూడ ** ఇది సిద్ధించుచున్నది. అవ్యక్తముకంటెఁ బరుఁడైనవానికి మహాత్పరత్వంబును ఉండనే యున్నది. అట్లు అగ్నివేశ్యశాఖయందు.—«అనాద్యనన్తం మహతః పరం ధ్రువమ్» అని. «పరో హి దివః పురుహూతో మహాత్మః» అని. అవ్యక్తరూపము భగవంతునిచే నిషిద్ధమునుం గాదు, భారతాదికమునందు సాధితం బగుటవలన. «శరీరరూపకవిన్యస్తగృహీతేః» §§ ఇత్యాదికము

---

రులకుఁ గాదు. దేవి దృశ్యయై విష్ణువునం దత్యంతభక్తి నొసంగి వీని ననుగ్రహించుచుండును, సర్వవిఘ్నంబుల భేదించును. ఆదేవి నుపాసించి యందువలన వాసుదేవుని సాక్షాత్కరించి నత్యంతశాంతిని బొందుచున్నాఁడు.

* ఎంతప్రయాసముచే అవ్యక్తప్రసాదము కలుగునో అంతప్రయాసముచేతనే ఆదేవుఁడు అవ్యక్తముతోఁ గూడనే ప్రసన్నుఁ డగును, సంశయము లేదు అవ్యక్తప్రసాదము నొందినమాత్రాన ఆ మహేశ్వరుఁడు ప్రీతుఁడు గాఁడు. అతఁడు ప్రీతుఁడైనచో అవ్యక్తాదికము సర్వంబును ప్రీత మగును. నిశ్చయము. ఉపాసన మధికముగాఁ జేయవలసినను అతఁడు గుణము నిచ్చువాఁడు గదా! ముక్తి నిచ్చువాఁడును అతఁ డొక్కఁడే, అవ్యక్తాదిక మేదియుఁ గాదు.

♦♦ నాయుపాసనముచే కైవల్యము కోరినవారై పరమాత్మకొఱకు యత్నించుచున్నారు.

¶ ధర్మమునందు నియతుఁడును మహాబుద్ధియును బ్రాహ్మణప్రియుండును సత్యవాదియును వినయవంతుఁడును దానశీలుండు నగువానియందు నే నెల్లప్పుడు ప్రసన్నురాల నగుదును.

§ వ్యాసునిచే.

♦ బ్రహ్మసూ. అ-౧. పా-౪. సూ-౫.౬.—శ్రుతి ప్రధానము జ్ఞేయ మని చెప్పుచున్నది అన్నయెడ, కాదు ప్రకరణమువలనఁ బ్రాజ్ఞుఁడు గదా చెప్పఁబడుచున్నాఁడు. త్రయాణామేవచ—అగ్ని జీవపరాత్మలమూఁడింటికే, ఏవమ్—ఇట్లు, ఉపన్యాసంబును ప్రశ్నంబును.

** అనాద్యనన్తం మహతః పరం ధ్రువం నిచాయ్య తం మృత్యుముఖాత్ప్రముచ్యతే అను శ్రుతియందనుట.

§§ బ్రహ్మసూ. అ-౧. పా-౪. సూ-౧.

నందో సాంఖ్యప్రసిద్ధ మగుప్రధానమును నిషేధించి వైదిక మగునవ్యక్తమే చెప్పఁబడినది. అట్లు సౌకరాయణశ్రుతి.—“శరీరరూపకా అశరీరస్య విష్ణోర్యతః ప్రియాసా జగతః ప్రసూతిః” ‡ అని. సువ్రతులకు శీఘ్రముగా దేవి గొప్పయైశ్వర్యము నిచ్చుచున్నది దేవుఁ డియ్యఁ డని విశేషము. “సువర్ణవర్ణాం పద్మకరాంచ దేవీం సర్వేశ్వరీం వ్యాప్తజడాంచ బుద్ధ్వా। సైవేతి వై సువ్రతానాం తు మాసా న్మహావిభూతిం శ్రీస్తు దద్యాన్న దేవః” * అని ఋగ్వేదఖిలమునందు.

యేతు సర్వాణి కర్మాణి మయి సన్న్యస్య మత్పరాః
అనన్యేనైవ యోగేన మాం ధ్యాయన్త ఉపాసతే.

తేషా మహం సముద్ధర్తా మృత్యుసంసారసాగరాత్
భవామి నచిరా త్పార్థ మ య్యావేశితచేతసామ్.

భా. యేతు=మఱియెవ్వరు; సర్వాణి=సమస్తము లయిన; కర్మాణి=కర్మములను; మయి=నాయందు ఈశ్వరునియందు; సన్న్యస్య=సన్న్యసించి; మత్పరాః=నేను బరుఁడుగాఁ ♦ గలవారలై; అనన్యేనైవ=విశ్వరూపుఁ డయిన దేవుఁడు ఆత్మదక్క నితర మయినయాలంబనము లేనిదే యగు; యోగేన=సమాధిచేత; మామ్=నన్ను; ధ్యాయన్తః=చింతించుచు; ఉపాసతే=ఉపాసించు చున్నారో. వారల కేమి? మయి=నాయందు విశ్వరూపునియందు; ఆవేశితచేతసామ్=ప్రవేశితము—సమాహిత మగు మనస్సు గలవార లగు; తేషామ్=వారలకు, మదుపాసనైకపరులకు, అహమ్=నేను ఈశ్వరుఁడను; సముద్ధర్తా=చక్కఁగా నుద్ధరించువాఁడను; దేనినుండి? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—మృత్యుసంసారసాగరాత్=మృత్యుయుక్త మయినసంసారము మృత్యుసంసారము, అదియే సాగరమువంటిది కావున సాగరము, తరింప నలవిగాని దగుటవలన, అట్టి మృత్యుసంసారసాగరమునుండి; నేను వారి నుద్ధరించువాఁడను, భవామి=

‡ అశరీరుఁ డగువిష్ణువునకు శరీరరూపిణి యగు ప్రియురాలా దేవి, ఆమెవలననే జగదుత్పత్తి.

* సువర్ణవర్ణయును పద్మహస్తయును సర్వేశ్వరియును జడప్రపంచమును వ్యాపించి యున్నదియు నగు దేవిని ఎఱింగి చెప్పినప్రకారంబున మంచివ్రతముతో నుపాసించినవారికి ఆశ్రీదేవియే యొక మాసమున మహైశ్వర్యము నొసంగును, దేవుఁ డొసంగఁడు.

♦ బరమగతిగాఁ.

అగుచున్నాను; నచిరాత్=బహుకాలమునకుఁ గాదు, మత్తే మనఁగా, శీఘ్రమున నే. పార్థ=ఓయర్జునా ?

ఓయర్జునా! ఎవ్వరు సర్వకర్మములను నా కర్పించి నేనే పరమగతిగాఁ గలవారలై యనన్యయోగంబున నన్ను ధ్యానించుచు నుపాసింతురో విశ్వరూపుఁడ నగు నాయం దుంపఁబడినమనస్సు గలవార లగు నాభక్తులను మృత్యుసంసారసముద్రమునుండి శీఘ్రమున నేనే యుద్ధరించుచున్నా నని తాత్పర్యము.

ఆ. అపరోక్షోపాసకులు నిన్నే పొందుదు రని చెప్పితివి గదా! అప్పుడేమి సగుణోపాసకులు నిన్నుఁ బొందువారు కారా ? అనఁగా, అట్లు తలంపకు, వారును గ్రమంబున నన్నుఁ బొందుదు రని చెప్పుచున్నాఁడు.—యేతు—తుశబ్దము శంకానివృత్త్యర్థము. ఆభగవద్ధ్యానపరుల కేమిఫల మని శంకించి ఫలము చెప్పుచున్నారు వారలకు ఇత్యాదిగా. ఉద్ధరించువాఁడను—ఉత్—మీఁదికి లేవనెత్తువాఁడను, జ్ఞానం బను చేయూఁత నిచ్చుటచే నని యర్థము. మృత్యుయుక్తము—మృత్యువనఁగా అజ్ఞానము మరణాద్యనర్థహేతు వగుటవలన, దానితో తత్కార్య మగుటచే యుక్తము, సంసారము.

హ. అనన్యేన = లేదు అన్యము ఏయోగమునందో అది యనన్యము; అట్టి యోగముచే.

శం. అందువలన, అనాయాసంబున నక్షరోపాసనసిద్ధికిఁ గారణము సగుణోపాసనము, కావున దాని ముముక్షువు లవశ్యము చేయవలయును, ఎవ్వ రట్లు సగుణోపాసనము చేయుదురో వారు సుఖంబున నక్షరోపాసనమును దత్ప్రాప్తిని బొందుచున్నారు. అని రెంటికిని సాధ్యసాధనభావము నంగీకరించి మొదట సాధనమే యవశ్యకర్తవ్యం బని సూచించుటకై చెప్పుచున్నాఁడు.—తుశబ్దము పూర్వోపాసకవ్యావృత్త్యర్థము. యేతు = ఎవ్వరు మఱి సగుణోపాసకు లగునాభక్తులు; సర్వాణి=వైదికములును అవైదికములు ♦ నగు; కర్మాణి=కర్మములను; మయి=నాయందు పరమేశ్వరునియందు; సన్న్యస్య=నాకర్పితములుగాఁ జేసి; మత్పరాః=మదేకప్రవణులై *; లేక; మత్పరాః=నేనే—విశ్వరూపుఁడను పరమాత్మనే, పరుఁడు—లేన కంటె నితరము—శ్రోతవ్యము ద్రష్టవ్యము స్ప్రష్టవ్యము మంతవ్యము జ్ఞాతవ్య మగు

♦ లౌకికములును.

* నాయందే యాసక్తి గలవారలై.

పదార్థముగాఁ గలవారై, తమకంటె వ్యతిరిక్తమయినవస్తువునం దంతటను మద్బుద్ధి గలవారలై యని యర్థము; అందువలననే, అనన్యేనైవ = లేదు బుద్ధికి మద్వ్యతిరిక్తమయినయాలంబనము దేనియందో అది యనన్యము, అట్టిదే యగు; యోగేన= సమాధిచే; మామ్ = విశ్వరూపుని సర్వాత్మకునిఁ బరమేశ్వరుని నన్ను; ధ్యాయన్తః ఉపాసతే—మదాకారవృత్తిచే సదా నన్నే యెవ్వరు భజించుచున్నారో యని యర్థము. ఇట్లు సగుణోపాసనముచే శుద్ధాత్ములైనవారికి అక్షరోపాసనంబును దత్ఫలప్రాప్తియును సులభం బని సూచించుటకై సగుణోపాస్తిఫలముఁ జెప్పుచున్నాఁడు.— మయి=విశ్వరూపుఁడను « ఏష సర్వభూతాన్తరాత్మా '' ఇత్యాదిశ్రుతిప్రసిద్ధుఁ డను బరమేశ్వరుండ నగు నాయందే; ఆవేశితచేతసామ్ = ఆవేశితము—సర్వంబును బ్రహ్మమే యనుభావనయందు స్థాపితం బగు చేతస్సు—మనసు గలవారలకు, సర్వదా సర్వవిధంబులను నన్నే భజించువారలకు, అట్లు నన్ను భజించుటచే సత్త్వశుద్ధి పొందినవారలకు; తేషామ్=ఆనాభక్తులకు; నచిరాత్ =శీఘ్రమునుగా, నన్నుపాసించుటచేఁ జక్కనిచిత్తశుద్ధిఁ బొందినయుత్తరక్షణమునందే యని యర్థము; « తేషాం సతతయుక్తానాం భజతాం ప్రీతిపూర్వకమ్ । దదామి బుద్ధియోగం తం యేన మా ముపయాన్తి తే॥ తేషా మేవా ఽనుకమ్పార్థ మహ మజ్ఞానజం తమః । నాశయా మ్యాత్మభావస్థో జ్ఞానదీపేన భాస్వతా '' అని చెప్పినప్రకారంబున, అహమ్ = నేను బరమేశ్వరుఁడను; సమ్యగ్దర్శనలక్షణ మయినజ్ఞానయోగము నొసంగి జ్ఞానదీపముచే నజ్ఞానాంధకారనాశంబునుం జేసి చక్కని నిర్గుణబ్రహ్మనిష్ఠను గలిగించి, మృత్యుసంసారసాగరాత్ = మ్రియన్తే — చచ్చుచున్నారు మాటిమాటికిఁ బ్రాణులు దేనివలననో అది మృత్యువు, అనఁగా సర్వానర్థకారణ మయినయజ్ఞానము, దానితో యుక్తము — తత్కార్యభూత మయినసంసారము — అహం మ మేత్యాదిప్రవృత్తిరూపము, అది నిరవధిక మగుటవలనను దుస్తరం బగుటవలనను సాగరమువలె నున్నది కావున మృత్యుసంసారసాగరము, దానినుండి; సముద్ధర్తా = సముద్ధరణమును జేయువాఁడను, భవామి=అగుచున్నాను, బ్రహ్మజ్ఞానంబును తన్నిష్ఠయును తత్ప్రాప్తియు నెట్లు సిద్ధించునో అట్లనుగ్రహము చేయుచున్నా నని యర్థము. ఇందుచేఁ సగుణోపాసన మంగము, నిర్గుణోపాసన మంగి, ఆరెంటియొక్కఫలము మోక్షమే మత్ప్రసాదైకలభ్యం బని సూచితం బగుచున్నది.

**ప.** ఓయీ! ఫలము సమాన మైన నెడ క్లేశ మల్పం బధికం బనుకారణముచే నుత్కర్షాపకర్షములు గావచ్చును. అది సమానము కాదు. నిర్గుణబ్రహ్మ

విదులకు ఫలము అవిద్యాతత్కార్యనివృత్తిచే నిర్విశేషపరమానందబోధబ్రహ్మరూపత్వము గదా! సగుణబ్రహ్మవిదులకో అధిష్ఠానభ్రమ * లేమింజేసి యవిద్యాతత్కార్యనివృత్తి లేకుండుటవలనఁ గార్యబ్రహ్మలోకగతు లయినపుడు ఐశ్వర్యవిశేషము ఫలము, అందువలన ఫలాధిక్యముకొఱకు ఆయాసాధిక్యముచే న్యూనత సంభవింపదు. అందువేని అట్లనుట యుక్తము కాదు, సగుణోపాసనముచే సర్వప్రతిబంధములను నిరసించుకొన్న వారికి గురూపదేశము లేకయే శ్రవణ మనన నిదిధ్యాసనాద్యావృత్తిక్లేశము లేకయే తనంత నావిర్భూతమై యీశ్వరప్రసాదసహాకృత మగు వేదాంతవాక్యముచే తత్త్వజ్ఞాన ముదయించుటవలన నవిద్యాతత్కార్యములు నివర్తిల్లుటంజేసి బ్రహ్మలోకమునందే యైశ్వర్యభోగాంతంబున నిర్గుణబ్రహ్మవిద్యాఫల మైన పరమకైవల్యముపపన్నం బగుటవలన, « స ఏతస్మా జ్జీవఘనా త్పరాత్పరం పురిశయం పురుష మీక్షతే » అను శ్రుతివలన—సః=హిరణ్యగర్భైశ్వర్యము నొందినవాఁడు; భోగాంతమునందు, ఏతస్మాత్ జీవఘనాత్=ఈ సర్వజీవసమష్టిరూపుఁ డైన; పరాత్=శ్రేష్ఠుఁ డైన హిరణ్యగర్భునికంటె; పరమ్=విలక్షణుఁడైన, శ్రేష్ఠుఁడైన; పురిశయమ్=తనహృదయగుహాయందు నివిష్టుఁ డైన; పురుషమ్=పూర్ణుఁడు ప్రత్యగభిన్నుఁడు అద్వితీయుఁ డగు పరమాత్మను; ఈక్షతే=తనయంత నావిర్భవించిన వేదాంతప్రమాణముచే సాక్షాత్కరించుచున్నాఁడు, అంతమాత్రమున ముక్తుఁ డగుచున్నాఁ డని యర్థము. అట్లు మున్ను చెప్పినక్లేశము లేకయే సగుణబ్రహ్మవిదులకు నీశ్వరప్రసాదముచే నిర్గుణబ్రహ్మవిద్యాఫలప్రాప్తి సిద్ధించు ననునీయర్థమును రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.—తుశబ్దము చెప్పినయాశంకను నివర్తించుటకు. యే; సర్వాణి కర్మాణి; మయి సన్న్యస్య=నాయందు—సగుణుఁ డగు వాసుదేవునియందు సమర్పించి; మత్పరాః=నేనే భగవంతుఁడను వాసుదేవుఁడనే పరము—ప్రకృష్ట మయినప్రీతివిషయము ఎవ్వరికో అట్టివారలై; అనన్యేనైవ యోగేన=నేను భగవంతుఁడను దక్క నితర మైనయాలంబనము లేదు దేనికో అట్టియోగముచేత, ఏకాంతభక్తియోగ మనునామాంతరముగల సమాధిచేత; మామ్=నన్ను భగవంతుని వాసుదేవుని సకలసౌందర్యసారనిధిని ఆనందఘనవిగ్రహుని, ద్విభుజునిఁ గాని చతుర్భుజునిఁ గాని, సమస్తజనమనోమోహనమైయున వేణువును అతిమనోహరంబు లగుసప్తస్వరములచేఁ బూరించుచున్నవానిఁ గాని శంఖపద్మకౌమోదకీచక్రహస్తునిఁ గాని, నరసింహరాఘవాదిరూపునిఁ గాని, ఇట్టిమహాశోభిత విశ్వరూపధరునిఁ గాని; ధ్యాయన్తః=చింతించుచు; ఉపాసతే=

* అధిష్ఠానముయొక్క యథార్థజ్ఞానము.

సమానాకారమైన యవిచ్ఛిన్న మగు చిత్తవృత్తిప్రవాహమును జేయుచున్నారో, లేక, సమీపవర్తులై యున్నారో. తేషామ్; మయి ఆవేశితచేతసామ్= నాయందు అట్టి వాసుదేవునియందు ఆవేశితము ఏకాగ్రముగా ప్రవేశింపఁజేయఁబడిన చిత్తము గలవారలకు; అహమ్ = ఎల్లప్పుడు నుపాసింపఁబడినట్టి నేను భగవంతుఁడను; మృత్యుసంసారసాగరాత్=మృత్యుయుక్తమయినసంసారము—మిథ్యాజ్ఞానతత్కార్యప్రపంచము, అదియే సముద్రమువంటిది దుస్తరం బగుటవలన, దానినుండి; సముద్ధర్తా=చక్కఁగా—అనాయాసంబున, ఉత్—ఊర్ధ్వమునందు—సర్వబాధావధిభూతంబై శుద్ధమైనబ్రహ్మమునందు ధర్తను—ధారయితను * జ్ఞానావష్టంభము నిచ్చుటచేత; భవామి= అగుచున్నాను; నచిరాత్ = శీఘ్రముగనే, ఆజన్మమునందే. పార్థ యనుసంబోధన మాశ్వాసనార్థము.

శ్రీ. నాభక్తులకో నాప్రసాదమువలన ననాయాసంబుననే సిద్ధి కలుగు నని రెండుశ్లోకములచేఁ జెప్పుచున్నాఁడు.—మయి—పరమేశ్వరునియందు; సర్వాణి కర్మాణి; సన్న్యస్య=సమర్పించి; మత్పరులై, మామ్ ధ్యాయన్తః; అనన్యేనైవ యోగేన=లేఁడు ఇతరుఁడు భజనీయుఁడు దేనియందో అట్టియోగముచేతనే, ఏకాంతభక్తియోగముచేతనే; ఉపాసతే ఇట్లు, నాయం దావేశిత మయినచేతస్సు గలవారలకు, మృత్యుయుక్తమైనసంసారసాగరమునుండి చక్కఁగా నుద్ధరించువాఁడను శీఘ్రంబుననే యగుచున్నాను.

ప. మద్భక్తులకో ప్రయాసము లేకయె ప్రాప్తించు నని చెప్పుచున్నాఁడు.—నాయందు ఆవేశితము—ప్రవేశిత మయినచిత్తము గల, తేషామ్ = ఆపురుషులకు; మృత్యుసంసారసాగరాత్ =మృత్యు వనఁగా మరణము, సంసార మనఁగా సంసరణము—జన్మము, జన్మమరణరూప మయినసాగరమునుండి; అహం నచిరాత్ సముద్ధర్తా భవామి. ఎవ్వరికి? యేతు; సర్వాణి కర్మాణి; మయి; సన్న్యస్య=సమర్పించి; మత్పరాః=మదేకనిష్ఠులై; ఇతరుఁడు భజనీయుఁడు లేఁడు దేనియందో అది యనన్యము, అట్టియోగముచేత; మామ్; ధ్యాయన్తః; ఉపాసతే=ఉపాసనను చేయుచున్నారో, వారలకు. ఇట నిది యభిప్రాయము.—దుస్సాధ మయినకర్మము ఆశ్రయము లేక సిద్ధింపదు, ఎట్లు లీఁతనేర్చినవానికిఁ గూడ చేతులతో గంగానదిఁ దరింపఁ గోరినప్పుడు చోరకాయయూఁత కావలయునో అది లేనియెడఁ గాలుసేతులు విలవిలఁ

* నిలుపువాఁడను.

ణోయి నడుమనే నిమగ్నుఁ డగునో, అట్లు కర్మయోగజ్ఞానవంతుఁ డైనను నాయాశ్రయము లేక బ్రహ్మసాయుజ్యము పొందఁజాలఁడు, ఎందువలన ననఁగా, సిద్ధి మొదలగు విక్షేపశతంబులచే భ్రష్టుఁ డగును. అది చెప్పఁబడినది మహాపురాణమునందు—« తథా న తే మాధవ తావకాః క్వచి ద్భ్రశ్యన్తి మార్గాత్ త్వయి బద్ధసౌహృదాః । త్వయాఽభిగుప్తా విచరన్తి నిర్భయా వినాయకానీకపమూర్ధసు ప్రభో " * ఇత్యాదిగా.

రా॰ భగవంతు నుపాసించువారలకు యుక్తతమత్వమును సువ్యక్తముగాఁ జెప్పుచున్నాఁడు.—యేతు; సర్వాణి కర్మాణి=లౌకికములను—దేహయాత్రార్థములు దేహధారణార్థము లయినయశనాదులు నగుకర్మములను, వైదికములను—యాగదాన హోమతపఃప్రభృతులను సమస్తకర్మములను కారణసహితములను ఉద్దేశ్యసహితములను; పరమాత్మనిష్ఠ మగుచిత్తముతో, మయి సన్న్యస్య; మత్పరాః = మదేకప్రాప్యులై †; అనన్యేనైవ యోగేన=అనన్యప్రయోజన మగుయోగముచేత; మాం ధ్యాయన్తః ఉపాసతే—ధ్యానార్చన ప్రణామ స్తుతి కీర్తనాదులను తమయంతనే ‡ యత్యంత ప్రియములను ప్రాప్యతుల్యములను § చేయుచు నన్నుపాసించు చున్నారో యని యర్థము. తేషామ్; మత్ప్రాప్తికి విరోధ యగుటచే మృత్యుభూత మయిన సంసారాఖ్యసముద్రమునుండి, నేను శీఘ్రకాలంబుననే సముద్ధర్త నగుచున్నాను.

మ॰ నన్నుపాసించునట్టి భక్తులకుఁ గ్లేశమే లేదని తెలుపుచున్నాఁడు యే త్విత్యాదిగా. చెప్పఁబడినది గూడ పౌకరాయణశ్రుతియందు—« ఉపాసతే యే పురుషం వాసుదేవ మవ్యక్తాదే రీప్సితం కిన్ను తేషామ్ " ** అని. « తేషా మేకాన్తినః శ్రేష్ఠా స్తే చైవానన్యదేవతాః । అహ మేవ గతి స్తేషాం నిరాశీః కర్మకారిణామ్ » *** అనియు మోక్షధర్మమునందు.

---

* అట్లు, ఓమాధవా! నీభక్తులు నీయందు స్థిర మయినసౌహృదము గలవారలు కావున మార్గమునుండి యెప్పుడును భ్రష్టులు కారు ప్రభూ! నీచే రక్షింపఁబడినవారై విఘ్నసమూహపాలకులశిరస్సులమీఁద నిర్భయులై సంచరించుచుందురు.

† నేనొకఁడనే ప్రాప్యుఁడుగాఁ గలవారలై.

‡ ఫలాపేక్షచేఁ గాదని యర్థము.

§ ప్రాప్యుఁడ నగునాతో సమానముగా నెంచఁబడినవానిని.

** ఎవ్వరు పురుషుఁ డగువాసుదేవు నుపాసించుచున్నారో వారి కవ్యక్తాదులవలన నేమి యపేక్షితము గలదు ?

*** వారిలో నేకాంతులు శ్రేష్ఠులు వారే యనన్యదేవతులు; అట్టి ఫలాపేక్ష లేనివారై కర్మము జేయువారికి నేనే గతిని.

మయ్యేవ మన ఆధత్స్వ మయి బుద్ధిం నివేశయ
నివసిష్యసి మయ్యేవ అత ఊర్ధ్వం న సంశయః. ౮

భా. అందువలన.—మయ్యేవ = నాయందే, విశ్వరూపుఁ డగు నీశ్వరునియందే; మనః = సంకల్పవికల్పాత్మక మయినమనస్సును; ఆధత్స్వ = స్థాపింపుము. మయి=నాయందే; బుద్ధిమ్=అధ్యవసాయము * చేయునట్టి బుద్ధిని; ఆవేశయ=స్థాపింపుము. అందువలన నీకే మగునో వినుము. మయ్యేవ = నాయందే; నివసిష్యసి = నిశ్చయముగా మద్రూపుఁడవై నాయందు వాసము చేయఁగలవు; అతః—శరీరపాతముకంటె; ఊర్ధ్వమ్ = ఆవల. నసంశయః= సంశయం బిందుఁ గర్తవ్యము గాదు.

నాయందే మనస్సు నిలుపుము, నాయందే బుద్ధిని నిలుపుము, అందుచే దేహపాత మయినపిమ్మట నాయందే మద్రూపంబున నిశ్చయముగా వసింపఁగలవు, సంశయింపకు మని తాత్పర్యము.

ఆ. భగవదుపాసనము మహాఫలం బని సిద్ధ మగుటవలన భగవన్నిష్ఠయందుఁ బ్రయత్నింపవలయు నని చెప్పుచున్నారు అందువలన నని. సంధిచేయమి శ్లోకపూరణార్థము. మనోబుద్ధులను భగవంతునందు స్థాపించుటకుఁ బ్రశ్నపూర్వకముగా ఫలముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. భగవన్నిష్ఠునకు భగవత్ప్రాప్తియందుఁ బ్రతిబంధము లేమి సూచించుచున్నారు సంశయంబు ఇత్యాదిగా.

హ. *

శ్రీ. ఎందువలన నక్షరజ్ఞానంబును దత్ఫలంబును మత్ప్రసాదైకలభ్యమో మత్ప్రసాదంబును మదుపాసనైకలభ్యమో, అందువలన మదుపాసనముఁ జేయు మని చెప్పుచున్నాఁడు.—మకారమును బ్రయోగించి ** సంధి చేయ వచ్చును. అయినను దాను బహువ్యాకరణజ్ఞుం డని వెలిపుచ్చుటకై అత ఊర్ధ్వ మ్మని చెప్పఁబడినది. మయ్యేవ=విశ్వరూపుఁడను సగుణుఁడ నగునాయందే, కాని నిరాకార మగు కేవల మయినయక్షరమునందుఁ గాదు, మదుపాసనముననే గాని తద్జ్ఞానంబును తదుపాస

* నిశ్చయమును.

* ఇది మొదలు ౧౨వ శ్లోకమువఱకు ఏతద్వ్యాఖ్యానము లేదు.

** మయ్యేవ అత ఊర్ధ్వమ్ అనుచోట ఏవమ్ అనుశబ్దమును బ్రయోగించి మయ్యేవ మత ఊర్ధ్వమ్ అని.

నంబును అతిదుర్లభం బగుటవలన; మనః ఆధత్స్వ = సర్వత్ర వృత్తికి విషయమును నన్నే చేయుము, శబ్దాదికమును చేయకుము. మఱియును. మయి=ఈలక్షణము గల నాయందే; బుద్ధిమ్ = వస్తుతత్త్వనిశ్చయస్వభావ మయినయంతఃకరణవృత్తిని విశేష రూపమును; నివేశయ—ఇది సర్వంబును బ్రహ్మమే యను నిశ్చయము గలబుద్ధిచే సదా నన్ననుసంధింపు మని యర్థము. అత ఊర్ధ్వమ్—నిర్విశేషజ్ఞానము నొంది తద్బలంబున దేహసంబంధమును విడిచి నిర్విశేషరూపంబున, మయ్యేవ=నాయందే, నిర్విశేష మగు పరబ్రహ్మమునందే; నివసిష్యసి—విదేహకైవల్యమును బొందఁగలవు. లే దిందు సంశయము, నాభక్తుఁడ వగునీకుఁ బ్రతిబంధవశమున విదేహకైవల్యము సిద్ధించునా సిద్ధింపదా అని సంశయము లేదు. మ తేమనఁగా, మదేకాశ్రయుం డగువానికి మదుపాసనముచేఁ జిత్తశుద్ధియును దానిచే జ్ఞానంబును దానిచే విదేహకైవల్యంబును నిర్విఘ్నముగా సిద్ధించు నని యర్థము.

మ. ఇట్లింతప్రబంధముచే సగుణోపాసనను స్తుతించి యిప్పుడు విధించు చున్నాఁడు.—మయ్యేవ = సగుణబ్రహ్మమునందే; మనః = సంకల్పవికల్పాత్మకమును; ఆధత్స్వ = స్థాపింపుము, సమస్తము లయినమనోవృత్తులను మద్విషయంబులుగానే చేయుము. ఏవకారము ముందును అనువర్తించు చున్నది. మయ్యేవ = నాయందే; బుద్ధిమ్=అధ్యవసాయలక్షణ మయినబుద్ధిని; నివేశయ—సమస్తము లయినబుద్ధివృత్తులను మద్విషయములుగానే చేయుము, విషయాంతరము విడిచి సర్వదా నన్నుఁ జింతింపు మని యర్థము. అందువలన నే మగు నన(గాఁ జెప్పుచున్నాఁడు.—నివసిష్యసి= నీవు జ్ఞానము నొందినవాఁడవై మద్రూపంబున వసింపఁగలవు; మయ్యేవ=నాయందే, శుద్ధబ్రహ్మమునందే; అతఊర్ధ్వమ్=ఏత ద్దేహాంతమునందు. న సంశయః—ఈవిషయ మందుఁ బ్రతిబంధము కలుగునేమో యని శంక చేయవల దని యర్థము. ఏవ అత ఊర్ధ్వమ్ అనుచోట సంధి లేమి శ్లోకపూరణార్థము.

శ్రీ. అందువలన.—మయ్యేవ; సంకల్పవికల్పాత్మక మయినమనస్సును, ఆధత్స్వ=స్థిరీకరింపుము. అధ్యవసాయలక్షణ మయినబుద్ధిని గూడ నాయందే నిలుపుము. ఇట్లు చేయుదువేని నాప్రసాదంబున జ్ఞానము నొందినవాఁడవై, అతఊర్ధ్వమ్= దేహాంతమునందు; మయ్యేవ; నివసిష్యసి=నివసింపఁగలవు, మద్రూపుఁడవై వాసము చేయఁగలవు. ఇందు సందేహము లేదు. అట్లు శ్రుతి.—“ దేహాన్తే దేవః పరం బ్రహ్మ తారకం వ్యాచష్టే ” ♦ అని.

♦ దేహాంతమునందు దేవుఁడు తారక మగుపరబ్రహ్మమును దెలుపు చున్నాఁడు.

ప. అందువలన.—సంకల్పవికల్పాత్మక మయినమనస్సును, మయ్యేవ; అథత్స్వ=స్థిరముగా నుంపుము. అట్లు, వ్యవసాయాత్మక మయినబుద్ధిని, మయి; నివేశయ=ప్రవేశింపఁజేయుము, అతఊర్ధ్వమ్=ఇఁకమీఁద; మయ్యేవనివసిష్యసి = మదాకారుఁడ వగుదువు. అది చెప్పఁబడినది.—" చేతోమత్తమతఙ్గజం మదభరభ్రాన్తం భ్రమన్తం దిశో దుస్సంకల్పవికల్పదన్తదలితప్రోద్దామధైర్యద్రుమమ్ । ఉద్యద్గాఢతరప్రబోధనిగడం భూయస్సమాక్రామితుం ధాత్రా యోజిత మద్భుతం నరహరే రాలాన మఙ్ఘ్రిద్వయమ్ " * అని.

తా. అందువలన, పరమపురుషార్థం బగుటవలనను సులభం బగుటవలనను శీఘ్రలభ్యం బగుటవలనను, మయ్యేవ మన ఆధత్స్వ=నాయందు మనస్సమాధానముఁ జేయుము. మయి బుద్ధిం నివేశయ= నేనే పరమప్రాప్యుఁడ నని యధ్యవసాయము చేయుము. అతఊర్ధ్వం మయ్యేవ నివసిష్యసి—నేనే పరమప్రాప్యుఁడ నని యధ్యవసాయము చేసి మనస్సును నాయందు నిలిపినవెంటనే నాయందు నివసింపఁగల వని యర్థము.

మూ. **

అథ చిత్తం సమాధాతుం నశక్నోషి మయి స్థిరమ్ ।
అభ్యాసయోగేన తతో మామిచ్ఛాప్తుం ధనఞ్జయ. ౯

భా. అథ=ఇఁక; ఎట్లు చెప్పితిమో అట్లు, మయి=నాయందు, చిత్తమ్=మనస్సును; స్థిరమ్ = నిశ్చలముగా; సమాధాతుమ్ = స్థాపించుటకు; నశక్నోషి=శక్తుఁడవు కావేని. తతః=అంత; అభ్యాసయోగేన = చిత్తమును ఒకయాలంబనమునందు సర్వమునుండి సమాహరించి మాటిమాటికి స్థాపించుట యభ్యాసము, తత్పూర్వక మయినయోగము—సమాధానము, దానిచేత; మామ్=నన్ను, విశ్వరూపుని; ఆప్తుమ్ = ప్రాపించుటకు; ఇచ్ఛ=ప్రార్థింపుము. ధనఞ్జయ=ఓయర్జునా!

---

* మిక్కిలి దృఢ మయినజ్ఞానము అను గొలుసుగల దైనను మదాతిశయముచే భ్రాంతంబును దిక్కులకుఁ బరువిడు చున్నదియు దుష్టము లయినసంకల్పవికల్పము లనుదంతములచేఁ బడఁద్రోయఁబడిన ధైర్యగం బనువృక్షము గలదియు నగు మనస్సు అను నేనుఁగును మాటిమాటికిఁ గట్టుటకై ధాతచే నద్భుత మైననరహరిచరణద్వయము కట్టుఁగంబముగా నేర్పఱుపఁబడినది.

** ౯, ౧౦, ౧౧, ౧౨ శ్లోకముల కేతద్భాష్యము లేదు.

ఇక నేఁ జెప్పినచొప్పున విశ్వరూపుఁడ నగునాయందు మనస్సును స్థిరముగా నిలుపుటకు నీకు శక్తి లేనియెడ, అప్పుడు సులభ మయినప్రతిమాద్యాలంబనమునందు మనస్సును నిలిపి సమాధి చేయుట యభ్యాసయోగ మనఁబడును, దాని నాచరించుచు విశ్వరూపుఁడ నగునన్నుఁ బొందుటకు యత్నింపు మని తాత్పర్యము.

శ్రీ. స్వమతమును బ్రదర్శించి భగవత్ప్రాప్తియం దుపాయాంతరముఁ జెప్పుచున్నారు అథేత్యాదిగా. ఏకయాలంబనమునందు—స్థూల మైనప్రతిమాదికమునందు. సమాధానము—దానికన్నను అభ్యంతర మయినవిశ్వరూపమునందు చిత్తైకాగ్రత.

శం. అనేకవిపరీతప్రత్యయములచేఁ బ్రతిబంధకములు గలదగు విశ్వరూపోపాసనమును జెప్పినరీతిని జేయ నశక్తులైన యతిమందప్రజ్ఞులకు సాధనాంతరముల నుపదేశించుచున్నారు—ధనఞ్జయ = ప్రజ్ఞాబలముచే జ్ఞానధనమును జయించువాఁడా! అథ=లేక, ఉక్తరీతిని, మయి=నాయందు, విశ్వరూపుఁడ నగుపరమాత్మయందు; స్థిరమ్=నిశ్చలముగా; చిత్తమ్; సమాధాతుమ్ = చక్కఁగా స్థాపించుటకు; నశక్నోషి=చాలవేని. అప్పుడు నీవు, అభ్యాసయోగేన=విపరీతప్రత్యయములను దిరస్కరించి సజాతీయప్రత్యయావృత్తి యభ్యాసము, ఘటపటాదిప్రత్యయములప్రవిలాపనము చేసి ఇది సర్వంబును భౌతికమే యని సర్వమునందును సర్వప్రమాణసిద్ధ మయినభౌతికత్వప్రత్యయమును బహుకాల మభ్యసించినయెడ సదా సర్వత్ర విపరీతప్రత్యయానంతరిత మయిన భౌతికత్వప్రత్యయము దృఢతరముగా నుదయించుచున్నది, దానిచే చిత్తమునకుఁ జలనహేతువు లగుఘటాదిప్రత్యయములు వాసనాసహితముగా క్షయించుటంజేసి చిత్తము సుస్థిరం బగుచున్నది, ఇట్లు సర్వంబును భౌతికమాత్రం బనుప్రత్యయము నభ్యసించుట సగుణోపాస్తిసిద్ధి కుపాయం బగుటచే యోగ మని చెప్పఁబడుచున్నది, అట్టియభ్యాసరూప మయినయోగముచే; మనస్సు నిశ్చలము గాఁగా, తతః=అటుపిమ్మట; మామ్=విశ్వరూపుని నన్ను; ఆప్తుమ్=సర్వత్ర భౌతికత్వప్రత్యయమును విడిచి సర్వంబును బ్రహ్మమే యని సగుణబ్రహ్మమును నన్ను విశ్వరూపుని బ్రహ్మప్రత్యయంబున నుపాసించుటకు; ఇచ్ఛ=ఇచ్ఛింపుము, సర్వంబును బ్రహ్మమే యని సర్వమును నన్నుఁగానే భావింపు మని యర్థము.

మ. ఇప్పుడు సగుణబ్రహ్మధ్యానమునం దశక్తులకు శక్తితారతమ్యమును బట్టి ప్రథమంబున బాహ్య మగుప్రతిమాదికమునందు భగవద్ధ్యానాభ్యాసంబును తదశక్తులకు భాగవతధర్మానుష్ఠానంబును తదశక్తులకు సర్వకర్మఫలత్యాగంబును అను

మూఁడుసాధనంబులను మూఁడుశ్లోకంబులచే విధించుచున్నాఁడు.—అథ=పక్షాంతరంబున; స్థిరమ్=నిశ్చల మగునట్టుగా; మయి; చిత్తమ్; సమాధాతుమ్=స్థాపించుటకు; నశక్నోషి = శక్తుఁడవు కావేని; తతః; ప్రతిమాదిక మగునొక్కయాలంబనమునందు సర్వమునుండి సమాహరించి చిత్తమును మాటిమాటికి స్థాపించుట యభ్యాసము, తత్పూర్వక మయినయోగము—సమాధి—అభ్యాసయోగము, దానిచేత; మామ్; ఆప్తుమ్; ఇచ్ఛ=యత్నింపుము. ఓధనంజయా! పెక్కండ్రనుశత్రువులను జయించి రాజసూయాద్యర్థము ధనము దెచ్చినవాఁడవు మనస్సు అను నొక్కశత్రువును జయించి తత్త్వజ్ఞానధనము సంపాదింపఁగల వనుట నీవిషయమున నాశ్చర్యము గాదని సంబోధనార్థము.

శ్రీ. ఇం దశక్తునకు సులభోపాయముఁ జెప్పుచున్నాఁడు.— స్థిరముగా నాయందుఁ జిత్తమును నిలుపుటకు శక్తుఁడవు కావేని, అప్పుడు విక్షిప్త మయిన చిత్తమును మాటిమాటికిఁ బ్రత్యాహరించి నన్ననుసరించుట యనులక్షణము గలది యభ్యాసయోగము, దానిచే నన్నుఁ బొందుటకు, ఇచ్ఛ=ప్రయత్నము చేయుము.

ప. ఇఁక నీయుపాయమునం దశక్తుఁడైనయెడ నుపాయాంతరముఁ జెప్పుచున్నాఁడు.—అథ; మయి; చిత్తమ్; స్థిరమ్=నిశ్చలముగా; సమాధాతుమ్ = చేయుటకు; నశక్నోషి. అప్పుడు, ప్రత్యాహరించి నన్ననుస్మరించుచుండుట యభ్యాసము, దానిచే, మామ్; ఆప్తుమ్=పొందుటకు; ఇచ్ఛ=ప్రయత్నము చేయుము.

రా. అథ; ఇప్పుడే, మయి స్థిరం చిత్తం సమాధాతుం నశక్నోషి; తతః అభ్యాసయోగేన మా మాప్తు మిచ్ఛ—స్వాభావికనిరతిశయ సౌందర్య సౌశీల్య సౌహార్ద వాత్సల్య కారుణ్య మాధుర్య గాంభీర్యౌదార్య శౌర్య వీర్య పరాక్రమ సార్వజ్ఞ సత్యకామత్వ సత్యసంకల్పత్వ సర్వేశ్వరత్వ సకలకారణత్వా ద్యసంఖ్యేయ గుణసాగరుండను నిఖలహేయప్రత్యనీకుండ నగునాయందు నిరతిశయ ప్రేమ గర్భ స్మరణాభ్యాసరూప మయినయోగముచే స్థిర మయినచిత్తసమాధానము నొంది నన్నుఁ బొందుట కిచ్ఛింపుము.

అభ్యాసేఽ ప్యసమర్థో ఽసి మత్కర్మపరమో భవ
మదర్థ మపి కర్మాణి కుర్వ న్ సిద్ధి మవాప్స్యసి. ౧౦

భా. అభ్యాసేఽపి=అభ్యాసయోగమునందును; అసమర్థః = అశక్తుఁడవు; అసి=అగుదు వేని; అప్పుడు, మత్కర్మపరమః=నాకొఱకైనకర్మము

మత్కర్మము, అది పరమముగాఁ గలవాఁడవు, మత్కర్మమే ప్రధానము
గాఁ గలవాఁడ వని యర్థము; భవ=అగుము. అభ్యాసము లేకున్నను,
మదర్థమ్=నాకొఱకు; కర్మాణి=కర్మములను మాత్రమే; కుర్వన్నపి=చేయు
చున్నవాఁడ వైనను; సిద్ధిమ్=సిద్ధిని; సత్త్వశుద్ధిజ్ఞానయోగప్రాప్తిద్వారం
బున, అవాప్స్యసి= పొందఁగలవు.

అభ్యాసమునందును నీవు సమర్థుఁడవు కావేని నాకొఱకుఁ గర్మములు
చేయు చుండుము. అభ్యాసము చేయకున్నను నాకొఱకుఁ గర్మములు చేయు చుందు
వేని నీవు క్రమంబున మోక్షము నొందఁగల వని తాత్పర్యము.

ఆ. ద్వైతమునందలియభినివేశమువలన నభ్యాసాధీన మయినయోగము
నందును సామర్థ్యము లేనియెడ పెండియు నుపాయాంతరము చెప్పుచున్నాఁడు
అభ్యాసే పీత్యాదిగా. అభ్యాసయోగము చేయక భగవదర్థము కర్మములను జేయు
చుండువాని కేమగును? అని యాశంకించి చెప్పుచున్నారు అభ్యాసము లేకున్నను
ఇత్యాదిగా. సిద్ధిని—బ్రహ్మభావమును. అపిశబ్దము వ్యవధిని సూచించుచున్నది.

శం. ఉక్తలక్షణం బగు నభ్యాసయోగమునఁ గూడ బ్రహ్మము నుపాసింప
నశక్తుఁ డైన యతిమందబుద్ధికి సాధనాంతరముఁ జెప్పుచున్నాఁడు.—అభ్యాసే ౭పి=
సజాతీయప్రత్యయావృత్తిరూప మయిన యభ్యాసమునందుఁ గూడ; నీవు, అసమర్థో
౭సి=అశక్తుఁడ వగుదువేని; అప్పుడు నీవు అభ్యాసయోగము చేయకయే నియమం
బున, మత్కర్మపరమః= మదర్థమే కాని కొంచెమైనను స్వార్థము కాదు, అట్టి వైదిక
మును లౌకికము నగుకర్మము మత్కర్మము, అదియే పరమము—ప్రధానము—తాత్ప
ర్యముచే కర్తవ్యము, కాని ధ్యానాదికము కాదు, ఎవ్వనికో అతఁడు మత్కర్మపర
ముఁడు, అట్టివాఁడవు; భవ=అగుము. ఎట్లు రాజుకొఱకు భటుఁడుచేయునో అట్లు
నాకొఱకే నీవు సర్వంబును జేయు మని యర్థము. ఇట్లు ఈశ్వరార్థమే కర్మము
చేయుచుండువానికిఁ దదనుష్ఠానఫలముఁ జెప్పుచున్నాఁడు.—నియమముచేతను శ్రద్ధ
చేతను, మదర్థమ్=నాకొఱకే; కర్మాణి= సర్వకర్మములను; కుర్వన్నపి= చేయు చున్న
వాఁడ వైనను; తదనుష్ఠానముచేఁ గలుగు చిత్తశుద్ధిజ్ఞానప్రాప్తులద్వారమున, సిద్ధిమ్=
కైవల్యసిద్ధిని; అవాప్స్యసి=పొందఁగలవు. ఇందుచే, అజ్ఞునకు ఈశ్వరోద్దేశంబున సర్వ
కర్మాచరణము అభ్యాసముకన్నను ముక్తికి సుఖసాధన మని సూచితం బగుచున్నది.

మ. మత్ప్రీత్యర్థ మగుకర్మము మత్కర్మము, శ్రవణకీర్తనాదిభాగవతధర్మము, తత్పరముఁడవు—తదేకనిష్ఠుఁడవు; భవ. అభ్యాసమునందు సామర్థ్యము లేనియప్పుడు మదర్థము భాగవతధర్మాఖ్యంబు లగుకర్మములనైనను; కుర్వన్; సిద్ధిమ్=బ్రహ్మభావలక్షణ మయినసిద్ధిని; సత్త్వశుద్ధిజ్ఞానోత్పత్తిద్వారంబున, అవాప్స్యసి.

శ్రీ. అభ్యాసమునందును అశక్తుఁడ వగుదువేని, అప్పుడు మత్ప్రీత్యర్థములైనకర్మములు ఏకాదశ్యుపవాసనామసంకీర్తనాదులు ఏవి గలవో తదనుష్ఠానమే పరమముగాఁ గలవాఁడ వగుము. ఇట్టికర్మములను గూడ మదర్థము చేయుచు మోక్షము నొందఁగలవు.

ప. మదనుస్మరణరూప మయినయభ్యాసమునందును, అసమర్థోఽసి=సమర్థుఁడవు కావేని; అప్పుడు మదర్థము తపోదానవ్రతాదు లగుకర్మము లేవి గలవో, అవియే పరమముగాఁ గలవాఁడవు—తదేకనిష్ఠుఁడ వగుము. ఇట్టి కర్మములను; మదర్థమ్; కుర్వన్నపి; సిద్ధిమ్; అవాప్స్యసి.

రా. ఇఁక నిట్టిస్మరణాభ్యాసమునందును అసమర్థుఁడవైనయెడ, మత్కర్మపరమోభవ—మదీయము లగుకర్మములు ఆలయనిర్మాణోద్యానకరణ ప్రదీపారోపణ మార్జనాభ్యుక్షణోపలేపన పుష్పాహరణ పూజాప్రవర్తన నామసంకీర్తన ప్రదక్షిణ స్తుతి నమస్కారాదులు ♦, వానిని అత్యంతప్రియములనుగాఁ దలఁచి యాచరింపుము. అత్యంతప్రియభావంబున, మదర్థం కర్మాణి కుర్వన్నపి; శీఘ్రంబున అభ్యాసయోగపూర్వకముగా నాయందు స్థిర మయినచిత్తస్థితిని బొంది మత్ప్రాప్తిరూప మయినసిద్ధిని బడయఁగలవు.

అథైతదప్యశక్తోఽసి కర్తుం మద్యోగ మాశ్రితః
సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్. ౧౧

భా. అథ=ఇఁక; ఏతదపి=మత్కర్మపరత్వ మేది గలదో దీనిని గూడ; కర్తుమ్=చేయుటకు; అశక్తోఽసి = అసమర్థుఁడవగుదువేని; తతః=అంత; మద్యోగమ్=చేయుచుండుకర్మములను నాయందు సన్న్యసించి, చేయుట—ఆకర్మముల ననుష్ఠించుట యేది గలదో అది మద్యోగము; దానిని; ఆ

♦ ఆలయనిర్మాణము—గుడికట్టుట, ఉద్యానకరణము—తోఁటవేయుట, ప్రదీపారోపణము—దీపము పెట్టుట, మార్జనము—తుడుచుట, అభ్యుక్షణము—నీరు చల్లుట, ఉపలేపనము—అలుకుట, పుష్పాహరణము—పూలు తెచ్చుట.

శ్రితః=ఆశ్రయించినవాఁడవై; యతాత్మవాన్=సంయత మయినచిత్తము గలవాఁడవై, సర్వకర్మఫలత్యాగమ్ = సమస్తకర్మములయొక్కయు ఫలముల సన్న్యసించుట సర్వకర్మఫలత్యాగము, దానిని; కురు=చేయుము.

ఇఁక మత్కర్మపరమత్వమును గూడ నీవు చేయఁజాలవేని అప్పుడు నీవు చేయుకర్మములను నాకు సమర్పించి చేయుచు మనస్సును ఫలముమీఁదఁ బోనీక సర్వకర్మఫలత్యాగముఁ జేయు మని తాత్పర్యము.

ఆ. భగవత్కర్మపరమత్వము గూడ నశక్య మని శంకించుచున్నాఁడు అథేత్యాదిగా. బహిర్విషయములచేఁ జిత్త మాకృష్ట మగుటవలన నని యర్థము. అప్పుడు భగవత్ప్రీత్యుపాయం బని సంయతచిత్తుఁడవై కర్మఫలసన్న్యాసముఁ జేయు మని చెప్పుచున్నాఁడు మద్యోగ మిత్యాదిగా.

శం. ఉక్తలక్షణ మగుకర్మము ననుష్ఠించుటకును అశక్తుఁడైనయత్యంత మందబుద్ధికి సాధనాంతరముఁ జెప్పుచున్నాఁడు. సదా మదుపాసనము నే ముముక్షు వవశ్యము చేయవలయు నని సూచించుటకు.—అథ=లేక; చెప్పినరీతిని నన్నుద్దేశించియే కర్మములను ప్రాధాన్యంబునఁ జేయుటకు నీవు శక్తుఁడవు కావేని, అప్పుడు, యతాత్మవాన్ = సంయతము—కామసంకల్పవిముఖముగాఁ జేయఁబడినదగుచిత్తము గలవాఁడవై, నియతచిత్తుఁడవై; మద్యోగ మాశ్రితః=ఈకర్మముచేత భగవంతుఁడు ప్రీతుఁ డగుఁగాక యని చేయఁబడుకర్మముల నన్నిటిని పరమేశ్వరుఁడ నగు నాయందుఁ జేర్చుట మద్యోగము—నాయందు సర్వకర్మసమర్పణము సర్వకర్మసన్న్యాస మని యర్థము, దానిని; ఆశ్రితః=ఆశ్రయించినవాఁడవై; తతః= అనుష్ఠించినకర్మము అను నాయందు సమర్పించినవెంటనే; సర్వకర్మఫలత్యాగమ్ = చేయఁబడిన సమస్త కర్మములయొక్కయు ఫల మేది గలదో దాని త్యాగమును—సన్న్యాసమును; కురు= చేయుము. కర్మఫలమందుఁ గామమును బరిత్యజింపు మని యర్థము. కర్మములు నాయందు సమర్పితము లైనపుడు వానియందుఁ బరార్థకర్మములందుం బోలె ఫల కామన సంభవింపమివలన నెట్లు సర్వకర్మపరిత్యాగము సిద్ధించునో అట్లే నీకు ముక్తి సిద్ధించు నని యభిప్రాయము. ఇందుచే, కర్మఫలములందుఁ గామమును నిశ్శేషముగాఁ బరిత్యజించి యీశ్వరార్పణబుద్ధిచే విధ్యుక్తకర్మము నాచరించుట యతిమూఢ బుద్ధికిఁ గూడ ముక్తికి సుఖసాధనం బని సూచింపఁబడినది.

మ. అథ; బహిర్విషయాకృష్టచిత్తుఁడ వగుటవలన, ఏతదపి=ఈమత్కర్మ పరమత్వమునుగూడ; కర్తుమ్ = చేయుటకు; అశక్తోసి = సమర్థుఁడవు కావేని; తతః= అంత; మద్యోగమ్ = మదేకశరణత్వము, లేక, నాయందు సర్వకర్మముల సమర్పించుట మద్యోగము, దానిని; ఆశ్రితః = ఆశ్రయించినవాఁడవై; యతాత్మవాన్= యతుఁడవు—సర్వేంద్రియముల నిగ్రహించినవాఁడవును, ఆత్మవంతుఁడవును—వివేకివైనవాఁడవునై; సర్వకర్మఫలత్యాగంకురు—ఫలాభిసంధిని విడువు మని యర్థము.

శ్రీ. అత్యంతము భగవద్ధర్మనిష్ఠయం దశక్తుఁ డగువానికిఁ బరాంతరముఁ జెప్పుచున్నాఁడు.—దీనిని గూడఁ జేయుట కశక్తుఁడ వగుదువేని, అప్పుడు, మద్యోగమ్=మదేకశరణత్వమును; ఆశ్రితుఁడవై, దృష్టార్థము లగుసర్వకర్మములయు ఆవశ్యకము లగు నగ్నిహోత్రాదికర్మములయు ఫలములను నియతచిత్తుఁడవై పరిత్యజింపుము. ఇది యభిప్రాయము.—నేనేమో యీశ్వరాజ్ఞచే యథాశక్తిఁ గర్మములఁ జేయవలయును, ఫలమో దృష్టము గాని యదృష్టము గాని పరమేశ్వరాధీన మని నాయందు భార మారోపించి ఫలాసక్తిని బరిత్యజించి వర్తింతువేని మత్ప్రసాదంబునఁ గృతార్థుఁడ వగుదువు.

ప. ♦

రా. ఇఁక మద్యోగము నాశ్రయించి దీనినిగూడఁ జేయ శక్తుఁడవు కావేని—మద్గుణానుసంధానముచేఁ గలుగు మదేకప్రియత్వము స్వరూపముగాఁ గల భక్తియోగము నాశ్రయించి భక్తియోగాంకురరూప మయిన యీమత్కర్మమును గూడఁ జేయ నశక్తుఁడవేని, అప్పుడు, ఆత్మస్వభావానుసంధానరూపంబును పరభక్తిజనకంబు నగు పూర్వాధ్యాయషట్కప్రతిపాదిత మయిన యక్షరయోగము నాశ్రయించి తదుపాయ మయిన సర్వకర్మఫలత్యాగమును జేయుము. నేనే ప్రియుఁడుగాఁ గలిగి నేనే ప్రాప్యుఁ డనుబుద్ధి ప్రక్షీణాశేషపాపునకే * గదా జనియించును. యతాత్మవాన్=నియతమైనమనస్సు గలవాఁడవై. అంత ఫలాభిసంధి విడిచి మదారాధనరూపంబున ననుష్ఠింపఁబడినకర్మముచే సిద్ధ మగునాత్మధ్యానముచేత నవిద్యాదిసర్వతిరోధానంబులును నివృత్తములై మచ్ఛేషతైకస్వరూపుఁ డగుప్రత్యగాత్మ సాక్షాత్కృతుఁడైనపుడు నాయందుఁ బరభక్తి తానే యుత్పన్న మగుచున్నది. అట్లు చెప్పఁబోవు

♦ శ్రీధరీయముతో సమానము.

* నశించినసమస్తపాపములు గలవానికే.

చున్నాఁడు.—"స్వకర్మణా త మభ్యర్చ్య సిద్ధిం విన్దతి మానవః" అని యారంభించి "విముచ్య నిర్మమ శ్శాన్తో బ్రహ్మభూయాయ కల్పతే । బ్రహ్మభూతః ప్రసన్నాత్మా నశోచతి నకాఙ్క్షతి । సమస్సర్వేషు భూతేషు మద్భక్తిం లభతే పరామ్" అని.

శ్రేయో హి జ్ఞాన మభ్యాసా జ్జ్ఞానా ద్ధ్యానం విశిష్యతే
ధ్యానా త్కర్మఫలత్యాగ స్త్యాగా చ్ఛాన్తి రనన్తరమ్. ౧౨

భా. ఇప్పుడు సర్వకర్మఫలత్యాగమును స్తుతించుచున్నాఁడు.— శ్రేయఃహి=మిక్కిలి ప్రశస్తము గదా! జ్ఞానమ్=జ్ఞానము. దేనికంటె? అభ్యాసాత్ = అవివేకపూర్వక మయినయభ్యాసముకంటె. జ్ఞానాత్ = ఆజ్ఞానమునకన్నను; ధ్యానమ్=జ్ఞానపూర్వక మయినధ్యానము; విశిష్యతే= అధిక మగుచున్నది. ధ్యానాత్ =జ్ఞానయుక్త మయినధ్యానముకన్నను; కర్మఫలత్యాగః = కర్మములఫలము విడుచుట; విశిష్యతే, అని యనువర్తించుచున్నది, అధిక మగుచున్నది యని యర్థము. త్యాగాత్ =ఇట్లు పూర్వవిశేషణవంత మగుకర్మఫలత్యాగముకంటె; శాన్తిః = సహేతుక మయినసంసారమునకు ఉపశమము; అనన్తరమ్=వెంటనే కలుగును, మఱి కాలాంతరము నపేక్షింపదు. అజ్ఞునకుఁ గర్మమునందుఁ బ్రవృత్తుఁ డైన వానికిఁ బూర్వోపదిష్టము లయినయుపాయముల ననుష్ఠింప శక్తి లేని యెడ సర్వకర్మములఫలత్యాగము శ్రేయస్సాధనముగా నుపదేశింపఁబడినది, మొదటనే కాదు; అందువలన శ్రేయో హి జ్ఞానమభ్యాసా దిత్యాదిగా నుత్తరోత్తరవిశిష్టత్వము * నుపదేశించుటచే సర్వకర్మఫలత్యాగము స్తుతింపఁబడుచున్నది, సంపన్నసాధనానుష్ఠానమునందు శక్తి లేనియెడ ననుష్ఠేయం బని చెప్పఁబడుటవలన. ఏసాధర్మ్యముచే స్తుతిత్వము? "యదా సర్వే ప్రముచ్యన్తే" అని సర్వకామప్రహాణమువలన నమృతత్వము చెప్పఁబడినది, అది ప్రసిద్ధము. కామములో అన్నియు శ్రౌతస్మార్తసర్వకర్మంబులఫలములు. వాని విడిచినపుడు విద్వాంసునకు జ్ఞాననిష్ఠునకు వెంటనే శాంతి గలుగును. ఇట్లు సర్వకామత్యాగసామ్యము అజ్ఞాని కర్మఫలత్యాగంబునకును గలదు. కావునఁ దత్సామ్యమువలన సర్వకర్మఫలత్యాగస్తుతి యిది ప్రరోచనార్థము. ఎట్లు బ్రాహ్మణుఁ డగు

* వెనుకటిదానికంటె వెనుకటిది యధిక మని.

నగస్త్యునిచే సముద్రము ద్రాగఁబడిన దని యిప్పటివారు గూడ బ్రాహ్మణులు బ్రాహ్మణత్వసామ్యమువలన స్తుతింపఁబడు చున్నారో అట్లు. ఇట్లు కర్మఫలత్యాగమువలనఁ గర్మయోగమునకు శ్రేయస్సాధనత్వము ప్రతిపాదింపఁబడినది.

అజ్ఞానముతోఁ జేయు నభ్యాసముకన్నను జ్ఞానము శ్రేష్ఠము గదా! అట్లు జ్ఞానముకన్నను జ్ఞానపూర్వక మయినధ్యాన ముత్తమము. అట్టిధ్యానముకన్నను కర్మఫలత్యాగము శ్రేష్ఠము. ఏల యనఁగా త్యాగము సిద్ధించినవెంటనే యశేషసంసారవిముక్తి కలుగు నని తాత్పర్యము.

ఆ. ఉత్తరశ్లోకతాత్పర్యము చెప్పుచున్నారు ఇప్పుడు ఇత్యాదిగా. జ్ఞానము—శబ్దప్రమాణముచేతను యుక్తిచేతను ఆత్మనిశ్చయము. అభ్యాసము—జ్ఞానార్థము శ్రవణాభ్యాసము, లేక, నిశ్చయము లేని ధ్యానాభ్యాసము. జ్ఞానయుక్త మయిన ధ్యానము విశిష్టం బనుటకు, అది సాక్షాత్కారమునకు హేతువగుట హేతువు. త్యాగము విశిష్ట మనుటకు హేతువుఁ జెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. ఇట్లు—భగవంతుఁడు ప్రీతుఁ డగుఁగాక యని భగవంతునందుఁ గర్మసన్న్యాసపూర్వకముగా నని యర్థము. పూర్వవిశేషణవంతము—నియతచిత్తుఁ డగుపురుషునియొక్క యథోక్త త్యాగముకంటె నని యర్థము. వెంటనే యని చెప్పినదాని స్పష్టీకరించు చున్నారు మఱి ఇత్యాదిగా. ఓయీ! కర్మఫలత్యాగము వెంటనే శాంతిని గలిగించున దను నెడ సమ్యగ్దర్శనం బట్టి దను శ్రుతిస్మృతిప్రసిద్ధి విరోధించును అనఁగా నందుకుఁ జెప్పుచున్నారు అజ్ఞునకు ఇత్యాదిగా. దీర్ఘకాలము ఆదరనైరంతర్యముల ననుష్ఠితం బగు ధ్యానమువలన వస్తుసాక్షాత్కారద్వారంబున సంసారదుఃఖ ముపశాంత మగుచున్నది, అట్టిధ్యానముకంటె త్యాగం బధిక మని చెప్పుటవలన త్యాగస్తుతి యిట నభిప్రేత మని చెప్పుచున్నారు అందువలన అని. అందు హేతువుఁ జెప్పుచున్నారు సంపన్నేత్యాదిగా, సంపన్నములు—ప్రాప్తము లగుసాధనములు—అహంగ్రహోపాసనాదులు, వాని లోపలఁ బూర్వపూర్వము ననుష్ఠింప శక్తిలేనియెడ నుత్తరోత్తర మనుష్ఠేయం బని యుపదేశించుటవలనను త్యాగమునం దుపదేశపర్యవసానం బగుటవలనను అని యర్థము. త్యాగము విశిష్ట మనుట యేసాధర్మ్యముచే స్తుతి యగు నని యడుగుచున్నాఁడు ఏసాధర్మ్యముచే స్తుతిత్వము అని. ఉత్తరముఁ జెప్పుచున్నారు య దేత్యాదిగా. అమృతత్వము చెప్పఁబడినది "అథ మర్త్యో ఽమృతో భవతి" అనువాక్య శేషము వలన నని శేషము. కామప్రహాణమువలన నమృతత్వము గల్గుటకు "అథా

కామయమానః '' ఇత్యాదికమునందుఁ గూడ సిద్ధ మని చెప్పుచున్నారు అది ప్రసిద్ధము అని. కామత్యాగం బమృతత్వహేతు వైనను ఎట్లు కర్మఫలత్యాగం బమృతత్వహేతు వగు నని యాశంకించి చెప్పుచున్నారు కామములో ఇత్యాదిగా. కర్మఫలత్యాగమువలననే శాంతి సిద్ధించునేని ఇఁక జ్ఞాననిష్ఠ యేల ? అని యాశంకించి చెప్పుచున్నారు వాని విడిచినప్పుడు ఇత్యాదిగా. అట్లయినను ఎట్లజ్ఞుని కర్మఫలత్యాగమునకు స్తుతి యగు నని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు ఇత్యాదిగా. విద్వాంసునిత్యాగమునకువలె నవిద్వాంసునిత్యాగమునకును త్యాగత్వము సమానం బగుట వలన విశిష్టత్వోక్తి యుక్తం బని స్తుతి నుపసంహరించుచున్నారు కావున నిత్యాదిగా. ఎందుకొఱకు స్తుతి ? అని యాశంకించి త్యాగమునందు రుచి కలిగించి ప్రవర్తింపఁ జేయుట కని చెప్పుచున్నారు ప్రరోచనార్థ మని. త్యాగస్తుతిని దృష్టాంతముచే స్పష్టీకరించుచున్నారు ఎట్లు ఇత్యాదిగా. ఫలత్యాగము శ్రేయస్సాధన మగునేని కర్మత్యాగమువలనఁ గూడ ఫలత్యాగము సిద్ధించుటవలనఁ గర్మానుష్ఠాన మేల ? అని యాశంకించి చెప్పుచున్నారు ఇట్లు కర్మ ఇత్యాదిగా. ఫలాభిలాష విడిచి యీశ్వరార్పిత మగుకర్మానుష్ఠానము శ్రేయస్సాధన మని వివక్షితం బగుటవలన అనుష్ఠానము నిరర్థకము గా దని యర్థము.

శ్లో ౧౨. ఇట్లు యతాత్ముఁడవై సర్వకర్మఫలత్యాగమును జేయు మని యుపదేశించి యిందే యుపండితుఁ డగుముముక్షువునకుఁ బ్రవృత్తి సిద్ధించుటకు రుచిఁ బుట్టించుటకై సర్వకర్మఫలత్యాగమే సమస్తము లయినమోక్షసాధనములకంటె నుత్తమం బగుసాధన మని దాని స్తుతించుచున్నాఁడు.—ముముక్షువునకు, అభ్యాసాత్ =సర్వకర్మసన్న్యాసపూర్వక మగు యమనియమాదిశ్రమసాధ్య మయినశ్రవణాద్యభ్యాసముకంటె; జ్ఞానమ్=శ్రవణమననములచే సంభావితము లయిన శ్రుతియుక్తులవలనఁ గలుగుజ్ఞానము బ్రహ్మాత్మైకత్వవేదనరూపము; శ్రేయోహి=మోక్షమునకు శ్రేష్ఠతర మయినసాధనము గదా ! హిశబ్దము శాస్త్రప్రసిద్ధిని సూచించుచున్నది. జ్ఞానాత్ =ప్రతిబంధకసహిత మయినజ్ఞానముకంటె; ప్రతిబంధకనివృత్తికారణ మయిన, ధ్యానమ్—సజాతీయప్రత్యయావృత్తిరూపము; విశిష్యతే=జన్మాదిహేతు వగు నవిద్యాకామసంకల్పాదిప్రతిబంధమును నివర్తించునది యగుటవలన విశిష్టతరం బగుచున్నది. ధ్యానాత్ =ఈచెప్పినలక్షణము గలధ్యానముకంటె; కర్మఫలత్యాగః విశిష్యతే—మనస్సునకు నిశ్చలత్వ మతిదుర్లభం బగుటవలనను విపరీతప్రత్యయనివారణము గూడ నతిదుష్కరం బగుటవలనను నిత్యనిరంతరప్రయత్నైకసాధ్యం బగుటవలనను ధ్యాన

ము మహత్తరక్లేశసాధ్యము, కావున యథాశక్తిఁ జేయఁబడినకర్మములఫలమును విడుచుట యట్టిశ్రమము లేని దగుటచేతను మోక్షమున కంతరంగసాధనం బగుటచేతను ధ్యానముకంటె విశిష్టతరం బగుచున్నది, కామనాశకత్వధర్మము రెంటను సమానం బైనను పైచెప్పినశ్రమము లేని దగుటచే కర్మఫలపరిత్యాగము ధ్యానముకంటె శ్రేష్ఠ మగుచున్నది. త్యాగాత్ = కర్మఫలత్యాగముకంటె, అనన్తరమ్=కర్మఫలత్యాగము చేసినయుత్తరక్షణమునందే; సర్వకర్మసన్న్యాసవంతుఁడును నియతచిత్తుఁడును కామసంకల్పాదిదోషనిర్ముక్తుండును శుద్ధబుద్ధియు నగు తదనుష్ఠాత యయిన కర్మయోగికి, శాన్తిః=సంసారోపశమము, మోక్షము; సిద్ధించుచున్న దని యర్థము. ఓయీ! కర్మఫలత్యాగమువలననే మోక్షము సిద్ధ మగునెడ "తరతి శోక మాత్మవిత్, త మేవం విద్వా నమృత ఇహ భవతి, నాన్యః పన్థా విద్యతే ఽయనాయ" ఇత్యాదిబహుశ్రుతివిరోధంబును జ్ఞానంబువలననే ముక్తి యను సర్వశాస్త్రసమయమునకు విరోధంబును అగును; అందువేని కాదు, త్యాగాచ్ఛాన్తి రనన్తర మ్మను నీవాక్యము కర్మఫలత్యాగస్తుతిపరం బగుటవలనను, స్తుతి ప్రవృత్తిప్రరోచనార్థం బగుటవలనను. "అథ చిత్తం సమాధాతుమ్" అని యారంభించి ముముక్షువునకు అతిమందప్రజ్ఞునకు అభ్యాసమునందును ఈశ్వరోద్దేశమునఁ గర్మాచరణమునందును అశక్తుఁ డైనవానికిఁ జిత్తశుద్ధిసాధనముగా ననుష్ఠింపవలయు నని కర్మఫలత్యాగమును విధించుటవలనను, ఇదియే ముఖ్యం బనునెడ ప్రాథమ్యంబుననే నిర్దేశింపవలయుటవలనను, మత్కర్మకృ న్మత్పరమ ఇత్యాదిసాధనపంచకవిధానమునకు వ్యర్థత సంభవించుటవలనను, "ఆత్మా వా అరే ద్రష్టవ్యః" అని యాత్మసాక్షాత్కారము నుద్దేశించి శ్రవణాదివిధియనర్థకం బని ప్రసక్తించుటవలనను కర్మఫలత్యాగస్తుతియే యిది. బ్రహ్మమునందుఁ గర్మము లర్పితము లైనపుడు వానియందును తత్ఫలమునందును సంకల్పము గాని కామము గాని యుదయింపదు, అది యుదయింపమియే చిత్తశుద్ధి, అది కలిగినయెడ సద్గురూపదేశమువలననే జ్ఞానంబును దానిచే మోక్షంబును సిద్ధించుచున్నది. కావున నుపాయంబున మోక్షతముని భగవదర్థ మయినకర్మమునందుఁ బ్రవర్తింపఁజేయుటకై కర్మఫలత్యాగము స్తుతింపఁబడుచున్నది శ్రేయో హీత్యాదిగా. అందువలన నిట శ్రుతివిరోధము లేదు, సమయవిరోధము గాని లేదు. లేక, "మయ్యేవ మన ఆధత్స్వ" అని యారంభించి "సర్వకర్మఫలత్యాగం తతః కురు యతాత్మవాన్" అనువఱకుఁ గల గ్రంథముచేత ముముక్షువులకుఁ జిత్తశుద్ధికిఁ బరమకారణమును అధికారిభేదముచే గురులఘుత్వాదిభేదభిన్నం బగు సగుణోపాసనమును

కర్తవ్యముగాఁ బ్రతిపాదించి యిప్పుడు సగుణోపాసనముచేఁ బరిశుద్ధబుద్ధి యయినవానికి తదుపాసనఫలభూత మయినయక్షరోపాసనము కర్తవ్యం బని బోధించుటకై తదుపాసనరూపము లైనశ్రవణాదుల కుత్తరోత్తరోత్కర్షమును బ్రతిపాదించుచున్నాఁడు—పరిశుద్ధాత్ముఁ డగుముముక్షువునకు అభ్యాసము—శ్రవణాద్యభ్యాసము శ్రేయము, సగుణోపాసనముల యన్నిటికంటె శ్రేష్ఠము, "జ్ఞానా దేవతు కైవల్యమ్" అని శ్రుతిచేతనే తుశబ్దముచే నితరవ్యావృత్తిపూర్వకముగా జ్ఞానమే సాక్షాన్మోక్షకారణం బని యవధారిత మగుచున్నది, జ్ఞానసిద్ధికిఁ బరమకారణము శ్రవణాదికమే యగుటవలన జ్ఞానహేతు వగుశ్రవణాదికము చేయనిచో పూర్వోక్తసగుణోపాసనములు నిష్ఫలములే యగును, అందువలన యుక్తము శ్రవణాద్యభ్యాసము సగుణోపాసనములకన్న శ్రేయం బనుట. అదియే మోక్షైకకామునకు శుద్ధాత్ముఁ డగువానికి సర్వకర్మసన్న్యాసపూర్వకముగాఁ గర్తవ్యం బని శ్రేయం బనుటచే బోధిత మగుచున్నది. "ఆత్మా వా అరే ద్రష్టవ్యః, సో ఽన్వేష్టవ్యః, సన్న్యస్య శ్రవణం కుర్యాత్" ఇత్యాది శ్రుతిస్మృతిప్రసిద్ధిద్యోతనార్థము హిశబ్దము. అభ్యాసాత్=శ్రవణాభ్యాసముకంటె; జ్ఞానమ్=తజ్జన్య మగుబ్రహ్మాత్మైకత్వజ్ఞానము; శ్రేయః=శ్రేష్ఠతరము. జ్ఞాన ముత్పన్నము కాదేని యభ్యాసము నిష్ఫలం బగుటవలన యుక్తము జ్ఞానము దానికన్న శ్రేష్ఠతరం బనుట. ఇచటఁ గూడ శ్రేయం బనుటచే బహుబ్రహ్మవిదులసన్నిధియందు బహువిధంబుల శ్రవణము చేసి జ్ఞానము సంపాదింపవలయు నని బోధితం బగుచున్నది. జ్ఞానాత్=అజ్ఞానముకన్నను బ్రతిబంధసహిత మైనదానికన్నను; తత్ప్రతిబంధనివృత్తికారణ మయిన, ధ్యానమ్=ఉక్తలక్షణ మగుధ్యానము; విశిష్యతే, "తతస్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః" అను శ్రుతివలన ధ్యానము అప్రతిబంధసాక్షాత్కారహేతు వగుటవలన నది జ్ఞానముకంటె నుత్తమం బనుట యుక్తము. ధ్యానాత్ = అట్టిధ్యానముకన్నను; కర్మఫలత్యాగః విశిష్యతే = ప్రత్యగ్వృత్తి యగువాసనకుఁ గర్మమై * యేదృశ్యజాతము ఫల మగు చున్నదో అది కర్మఫల మని చెప్పఁబడుచున్నది, దానియొక్క-త్యాగము—నిత్యనిరంతర నిర్వికల్ప సమాధినిష్ఠచే అదర్శనము, వెలుపలను లోపలను సర్వత్ర బ్రహ్మమాత్రదర్శనము కర్మఫలత్యాగము, అది ధ్యానముకంటె నుత్తమ మగుచున్నది. "యత్రత్వస్య సర్వ మాత్మైవా ఽభూత్" అనుశ్రుతివలన కర్మఫలత్యాగము సర్వవిశేషములను నిరవశేషముగా నశింపఁజేయున దగుటవలన త్రిపుటీయుక్త మయినధ్యానముకంటె

* విషయమై.

విశిష్టం బగుట యుక్తము. త్యాగాత్ = సర్వకర్మఫలత్యాగముకంటె, నిర్వికల్పక సమాధికంటె; విపరీతవాసనాగ్రంథిని నిశ్శేషముగా నశింపఁజేసినట్టిజ్ఞానికి, అనన్తరమ్=దేహపాతానంతరమే; శాన్తిః=ఆత్యంతికసంసారోపశమము, బ్రహ్మరూపావస్థానలక్షణ మయినవిదేహకైవల్యము; సిద్ధించుచున్న దని యర్థము. రెండుచోటులను విశిష్యతే అనుటచే మోక్షైకకాముఁడు జ్ఞానం బప్రతిబద్ధం బగుటకై సవికల్పకసమాధియు నిర్వికల్పకసమాధియు నవశ్యము చేయవలయు నని బోధితం బగుచున్నది.

మ. ఇప్పు డిందే సాధనవిధానపర్యవసానం బగుటవలన నీసర్వకర్మఫలత్యాగమును స్తుతించుచున్నాఁడు.—శ్రేయోహి=ప్రశస్తతరమే; జ్ఞానమ్=శబ్దప్రమాణమువలనను యుక్తివలనను ఆత్మనిశ్చయము; అభ్యాసాత్=జ్ఞానార్థక మయిన శ్రవణాభ్యాసముకంటె, జ్ఞానాత్=శ్రవణమనననిష్పన్న మయినజ్ఞానముకన్నను; ధ్యానమ్=నిదిధ్యాసన మనుపేరుగల ధ్యానము; విశిష్యతే=అధిక మగుచున్నది, సాక్షాత్కారమున కవ్యవహితహేతు వగుటవలన. ఇట్లు సర్వసాధనములలోను శ్రేష్ఠము ధ్యానము, దానికన్నను అధిక మని అజ్ఞకృత మయినకర్మఫలత్యాగము స్తుతింపఁబడుచున్నది.—ధ్యానాత్ కర్మఫలత్యాగః; విశిష్యతే అని యనువర్తించుచున్నది. త్యాగాత్=నియతచిత్తుం డగుపురుషునిచేఁ జేయఁబడిన కర్మఫలత్యాగమువలన; శాన్తిః=సహేతుక మగుసంసారమున కుపశమము; అనన్తరమ్=అవ్యవధానముగానే యగును. కాలాంతరము నపేక్షింపదు. ఇట, "యదా సర్వే ప్రముచ్యన్తే కామా యే ఽస్య హృది స్థితాః । అథ మర్త్యో ఽమృతో భవ త్యత్ర బ్రహ్మ సమశ్నుతే" ♦ ఇత్యాది శ్రుతులయందును ప్రజహాతి యదా కామాన్ సర్వా నిత్యాది స్థితప్రజ్ఞలక్షణములయందును సర్వకామత్యాగము అమృతత్వసాధనం బని తెలియవచ్చుచున్నది, కర్మఫలములే కామములు, కావున కర్మఫలత్యాగము గూడ కామత్యాగత్వసామాన్యమువలన సర్వకామత్యాగఫలముచే స్తుతింపఁబడుచున్నది. ఎట్లు బ్రాహ్మణుం డగస్త్యుఁడు సముద్రమును ద్రాగె నని, మఱియు నెట్లు బ్రాహ్మణుఁడు పరశురాముఁడు భూమిని క్షత్రియరహితము గావించె నని బ్రాహ్మణత్వసామాన్యమువలన ఇప్పటివారు గూడ బ్రాహ్మణు లపరిమేయపరాక్రము లని స్తుతింపఁబడుచున్నారో అట్లు.

శ్రీ. అట్టి యీకర్మఫలత్యాగమును స్తుతించుచున్నాఁడు.—సమ్యగ్జ్ఞానరహిత మయినయభ్యాసముకంటె యుక్తిసహితమై యుపదేశపూర్వక మగుజ్ఞానము

♦ ఎప్పుడు వీనిహృదయమున నున్నకామము లేవి గలవో అవి యన్నియు విముక్తము లగుచున్నవో అప్పుడు మర్త్యుఁడు అమృతుఁ డగుచున్నాఁడు ఇందే బ్రహ్మమును పొందుచున్నాఁడు.

శ్రేష్ఠము. జ్ఞానముకన్నను జ్ఞానపూర్వక మయినధ్యానము విశిష్టము, "తతస్తు తం పశ్యతి నిష్కలం ధ్యాయమానః" అనుశ్రుతివలన. దానికన్నను ఉక్తలక్షణ మగు కర్మఫలత్యాగము శ్రేష్ఠము. అందువలన నిట్టికర్మఫలత్యాగమువలనఁ గర్మములందును తత్ఫలములందు నాసక్తి నివర్తిల్లుటచేతను మత్ప్రసాదముచేతను వెంటనే సంసారశాంతి యగుచున్నది.

ప. ఇఁక ఫలత్యాగప్రశంసను జెప్పుచున్నాఁడు.—కేవలము కరచరణవ్యాపారరూప మయినయభ్యాసముకంటె సమ్యక్జ్ఞానము శ్రేయము. దానికన్నను భక్తిపూర్వక మయినధ్యానము—నిర్విషయైకాగ్రత విశిష్టము. దానికన్నను కర్మఫలత్యాగము—తనయంతనే యుపరతివలనఁ గర్మఫలరాహిత్యము శ్రేష్ఠము. దానివలన శాంతి—సర్వోపరతిచే మత్ప్రసాదమువలన ఆత్మసుఖము సిద్ధించుచున్నది.

రా. అత్యంతప్రీతివిరహితమై కర్కశ మయినస్మరణాభ్యాసముకంటె అక్షరతత్త్వానుసంధానపూర్వక మయినతదపరోక్షజ్ఞానమే యాత్మహితం బగుటయందు శ్రేష్ఠము. అనిష్పన్నరూప * మైన యాత్మాపరోక్షజ్ఞానముకన్నను తదుపాయభూత మగునాత్మధ్యానమే యాత్మహిత మగుటయందు విశిష్టము. అనిష్పన్నరూప మయిన తద్ధ్యానము కన్నను తదుపాయభూతము ఫలత్యాగముచే ననుష్ఠితం బగుకర్మమే విశిష్టము. ఫలాభిసంధి లేక యనుష్ఠిత మయినకర్మమువలన అనంతరమే నిరస్తపాపం బగుటచే మనస్సునకు శాంతి కలుగును. మనస్సు శాంతము గాఁగా ఆత్మధ్యానము సిద్ధించును. ధ్యానమున తదపరోక్షతయు తదపరోక్షతవలనఁ బరభక్తియును సిద్ధించును. కావున భక్తియోగాభ్యాసమునం దశక్తుం డైనవాని కాత్మనిష్ఠయే శ్రేయము. ఆత్మనిష్ఠునకుఁ గూడ అశాంతమనస్కునకు నిష్ఠ సిద్ధించుటకై అంతర్గతాత్మజ్ఞానంబును ఫలాభిసంధి లేనిదియు నగు కర్మనిష్ఠయే శ్రేయం బని యర్థము.

మా. అజ్ఞానపూర్వక మయినయభ్యాసముకంటె జ్ఞానమే యుత్తమము. జ్ఞానమాత్రముకంటె జ్ఞానసహిత మయినధ్యాన ముత్తమము. అట్లు సామవేదంబున ననభిమ్లానశాఖయందు.—"అధికం కేవలాభ్యాసాత్ జ్ఞానం తత్సహితం తతః । ధ్యానం తత శ్చాపరోక్షం తత శ్శాన్తి ర్భవిష్యతి" ♦ అని. "ధ్యానాత్కర్మ ఫలత్యాగః"

* అసమగ్రము.

♦ కేవల మయినయభ్యాసముకంటె జ్ఞానం బధికము, దానికన్నను జ్ఞానసహిత మయినధ్యాన మధికము, దానికన్నను అపరోక్ష మధికము, దానివలన శాంతి కలుగుచున్నది.

అనుటయే స్తుతి. అట్లు గాదేని ఎట్లు అసమర్థోఽసి అని చెప్పఁబడు చున్నది? «తయోస్తు కర్మసన్న్యాసాత్కర్మయోగో విశిష్యతే» అనియుఁ జెప్పఁబడినది. «సర్వాధికం ధ్యాన ముదాహరన్తి ధ్యానాధికే జ్ఞానభక్తీ పరాత్మన్ । కర్మాఫలాకాఙ్క్షమథో విరాగ స్త్యాగశ్చ నజ్ఞానకలాఫలార్హాః» § అనియు కాషాయణశాఖయందు. వాక్యము సమానం బయినను అసమర్థవిషయత్వము చెప్పుటవలన ఇతర స్థలమున తాత్పర్యము లేదని తెలియవచ్చుచున్నది. త్యాగము ధ్యానాదిప్రాప్తి కారణం బగుటవలనను గూడ త్యాగస్తుతి యనుట యుచితము. కేవలధ్యానముకంటె ఫలత్యాగయుక్త మయినధ్యాన మధికము. ధ్యానయుక్తత్యాగమే యిటఁ జెప్పఁబడినది. అటు గానియెడ ఎట్లు «త్యాగాచ్ఛాన్తి రనన్తరమ్» అని చెప్పఁబడును, ధ్యానముకన్న నాధిక్యంబును ఎట్లు? అట్లు గావవనశాఖయందు.—«ధ్యానాత్తు కేవలా త్త్యాగయుక్తం తదధికం భవేత్» ♦ అని. త్యాగమాత్రానంతరమే ముక్తి కలుగదు గదా! ధ్యానయుక్త మయినత్యాగమువలననే కలుగుచున్నది. కేవల త్యాగస్తుతి యీవిధంబునను నగుచున్నది—ఎట్లు? ఈభటునితోఁ గూడినయెడ జయింపఁగలఁడు, కానియెడ జయింప లేఁడు అనునట్లు. *

అద్వేష్టా సర్వభూతానాం మైత్రః కరుణ ఏవచ
నిర్మమో నిరహఙ్కార స్సమదుఃఖసుఖః క్షమీ. ౧౩

**భా.** ఇట నాత్మేశ్వరభేదము నాశ్రయించి విశ్వరూపుఁ డగునీశ్వరుని యందుఁ జిత్తసమాధానలక్షణ మయినయోగము చెప్పఁబడినది. ఈశ్వరార్థము కర్మానుష్ఠానాదికము గూడ. «అథైత దప్యశక్తోఽసి» అని యజ్ఞానకార్యము సూచించుటవలన సభేదదర్శి యగు నక్షరోపాసకునకుఁ గర్మయోగం బుపపన్నము కా దని ప్రదర్శించుచున్నాఁడు. అట్లు, కర్మయోగి కక్షరోపాసనానుపపత్తిని బ్రదర్శించుచున్నాఁడు భగవంతుఁడు, «తే ప్రాప్నువన్తి మా మేవ» అని. అక్షరోపాసకులకుఁ గైవల్యప్రాప్తి

§ ధ్యానము సమస్తముకంటె నధికము పరమాత్మవిషయమునందు. జ్ఞానభక్తులు ధ్యానముకంటె నధికములు. కర్మఫలాకాంక్ష లేమియు విరాగంబును త్యాగంబును జ్ఞానమునందు కలాంశముయొక్క ఫలమునకుఁ గూడ అర్హములు గావు.

♦ కేవల మయినధ్యానముకంటె త్యాగయుక్త మయినధ్యానము అధిక మగును.

* ఇట భటునిస్తుతి యెట్లో అట్లు త్యాగస్తుతి యనుట.

యందు స్వాతంత్ర్యమును బ్రతిపాదించి యితరులకుఁ బారతంత్ర్యము నీశ్వరాధీనతను బ్రదర్శించెను « తేషా మహం సముద్ధర్తా » అని, వారును ఈశ్వరున కాత్మభూతు లని సమ్మతు లగుదు రేని యభేదదర్శు లగుటవలన నక్షరరూపులే వారు కావున సముద్ధరణకర్మవచనము వారియెడ నపేశలం ♦ బగును గదా! అర్జునునకును అత్యంతము హితైషి యగుభగవంతుం డతనికి సమ్యగ్దర్శనానన్వితం బగుకర్మయోగమును భేదదృష్టిమంతమునే యుపదేశించెను. మఱియు నాత్మ నీశ్వరునిఁగాఁ బ్రమాణము వలన నెఱింగి యెవనికిఁ గాని గుణభావము * పొందనొల్లఁ డెవ్వండును, విరోధమువలన. అందువలన, అక్షరోపాసకులు సమ్యగ్దర్శననిష్ఠులు సన్న్యాసులు త్యక్తసర్వైషణు లగువారి ధర్మపూగమును ♦♦ అద్వేష్టా సర్వభూతానా మిత్యాదికమును సాక్షాదమృతత్వసాధనమును జెప్పెదనని ప్రవర్తించు చున్నాఁడు —సర్వభూతానామ్ = సమస్తభూతములకును; అద్వేష్టా=ద్వేషింపనివాఁడు; తనకు దుఃఖహేతువునైనను ఎవ్వనిని ద్వేషింపఁడు, సర్వభూతములను ఆత్మనుగాఁ గదా చూచు చున్నాఁడు. మైత్రః=మిత్రభావము మైత్రి, మిత్రుఁడై వర్తించుచున్నాఁడు కావున మైత్రుఁడు. కరుణఏవచ = కరుణ యనఁగా కృప, దుఃఖితులయందు దయ, అది కలవాఁడు కరుణుఁడు, సర్వభూతంబులకును అభయప్రదుఁడు సన్న్యాసి యని యర్థము. నిర్మమః=మమప్రత్యయము లేనివాఁడు. నిరహఙ్కారః=అహంప్రత్యయము లేనివాఁడు. సమదుఃఖసుఖః= దుఃఖమును సుఖమును సమములు— ద్వేషరాగములు కలిగింపనివి యెవ్వనికో అతఁడు సమదుఃఖసుఖుఁడు. క్షమీ=క్షమ గలవాఁడు, తిట్టఁబడినను కొట్టఁబడినను నిర్వికారుఁడు గానే యున్నవాఁడు. §

సర్వభూతంబులయందును ద్వేషము లేనివాఁడు, సర్వభూతములకును మిత్రుఁడు, దుఃఖితులయందు దయ గలవాఁడు, దేనియందును మమకారము లేనివాఁడు, అహంకారము లేనివాఁడు, దుఃఖము వచ్చినను సుఖము వచ్చినను ద్వేష

♦ అసమర్థం బనుట.

* అధీనతను.

♦♦ ధర్మసముదాయమును.

§ పైశ్లోకముతో నన్వయము.

మును గాని రాగమును గాని పొందక సమానుఁడై యుండువాఁడు, తిట్టినను గొట్టినను వికారము నొందక యోర్పు గలవాఁ డని తాత్పర్యము.

అ॰ ఇప్పుడు అద్వేష్టేత్యాదిగ్రంథము నవతరింపఁజేయుటకై కడచిన విషయమును గీర్తించుచున్నారు ఇట నిత్యాదిగా. ఆత్మేశ్వరులకు ఆత్యంతిక మయిన యభేదమేని అప్పుడు ఈశ్వరునియందు మనస్సమాధానరూప మయినయోగము సంభవింపదు, అత్యంతాభేదమునందు ధ్యాతృత్వధ్యేయత్వములు సంభవింపమివలన; మఱియు నత్యంతాభేదమునందు కర్మానుష్ఠానము గాని తత్ఫలత్యాగము గాని సంభవింపదు, పరస్పరమునందే యవి సంభవించుటవలన నని యర్థము. భగవద్వచనసామర్థ్యమువలనఁ గూడ కర్మయోగాదికము అభేదదృష్టిమంతునకు సంభవింప దని చెప్పుచున్నారు అథైత దిత్యాదిగా. అక్షరోపాసకునకుఁ గర్మయోగము సంభవింపనియట్లు కర్మయోగికి నక్షరోపాసన ముపపన్నము గా దనియుఁ బ్రదర్శితం బని చెప్పుచున్నారు అట్లు ఇత్యాదిగా. అక్షరోపాసకు లగుసమ్యగ్దర్శననిష్ఠులు తమజ్ఞానముచొప్పున భగవంతునే పొందుచున్నారు, అట్లు కర్మయోగులు సాక్షాద్భగవత్ప్రాప్తికి సమర్థులు కారు, అందువలనఁ గర్మయోగికి నక్షరోపాసన ముపపన్నము గా దని యర్థము. ఇందువలనఁ గూడ నక్షరోపాసనంబును గర్మానుష్ఠానంబును ఒక్కనియందు యుక్తము గా దని చెప్పుచున్నారు అక్షరోపాసకులకు ఇత్యాదిగా. ఓయీ! అక్షరోపాసకులకుం బోలె నితరులకును ఈశ్వరాత్మత్వ ముపమానం బగుటవలన ఎక్కడిది యీశ్వరాధీనత్వము? అనఁగాఁ జెప్పుచున్నారు వారును ఇత్యాదిగా. కర్మయోగంబును అక్షరోపాసనంబును ఏకకాలంబున నొక్కనియందు సంభవింప వనుటకు హేత్వంతరముఁ జెప్పుచున్నారు అర్జునునకును ఇత్యాదిగా. కురుకర్మైవ ఇత్యాదిస్థలమునం దని శేషము. మఱియు నక్షరోపాసకుఁడు వాక్యమువలన నీశ్వరు నాత్మనుగాఁ♦ నెఱుంగుచున్నాఁడు, కావున నితఁడు కర్మమునందు గుణభావంబునఁ* గర్తృత్వము ననుభవింపఁడు, గుణత్వంబునకును ఈశ్వరత్వమునకును ఒక్కనియందు విరోధ మగుటవలన, ఇందువలనఁ గూడ నక్షరోపాసనంబును గర్మానుష్ఠానంబును ఒక్కనియందు యుక్తము గా దని చెప్పుచున్నారు మఱియు నిత్యాదిగా. అక్షరోపాసనకర్మయోగములు ఒక్కనియం దేకకాలంబునఁ గాని పర్యాయంబునఁ గాని యుక్తములు గా వని యేర్పడఁగా ఫలితముఁ జెప్పుచున్నారు అందువలన నిత్యాదిగా. అజ్ఞు లగుకర్ములకు

♦ ఈశ్వరుఁడే తా నని.

* అధీనత్వంబున.

వక్ష్యమాణధర్మసముదాయము సాకల్యంబున సంభవింపమివలన నక్షరనిష్ఠులకే యిది చెప్పఁబడుచున్నది, అవిరుద్ధాంశమో సర్వార్థం బనుట యిష్టమే యని యర్థము. సర్వభూతంబులలో నెవ్వఁడు దుఃఖహేతువో అతని విద్వాంసుఁడు గూడ ద్వేషింపనే ద్వేషించు నని యాశంకించి చెప్పుచున్నారు తనకు ఇత్యాదిగా. అందుకు హేతువు—సర్వభూతంబులను ఇత్యాదిగా. సర్వభూతానా మ్మనునది మైత్రః అనుదానితోఁ గూడ సంబంధించుచున్నది. మమప్రత్యయము లేనివాఁడు—దేహామునందుఁ గూడ అనిశేషము. వృత్తస్వాధ్యాయ ♦ కృత మయినయహంకారము లేనివాఁ డని చెప్పుచున్నారు అహంప్రత్యయము లేనివాఁ డని.

హ°. కరుణ గలవాఁడు కరుణుఁడు, అర్శఆద్యచ్ప్రత్యయాంతము.

శ౦. శాంతిలక్షణ మయినబ్రహ్మభావమును విదేహకైవల్యమును బొందఁ గోరినవాఁడై యెవ్వఁడు మఱి యద్వేష్ట్రిత్యాదిధర్మసంపన్నుఁడై బ్రహ్మనిష్ఠయందే యున్నాఁడో అట్టి నాభక్తుఁడే నాకుఁ బ్రియుం డని బ్రహ్మవిదుని స్తుతించుచున్నాఁడు, యతులు సమ్యగ్జ్ఞానసిద్ధికొఱకు బ్రహ్మనిష్ఠ చేయవలయు నని సూచించుటకై యేడు శ్లోకములచేత.—సర్వభూతానామ్ = సమస్తప్రాణులకును; అద్వేష్టా=ద్వేష మనఁగా అప్రీతి, దానిని దన కుపద్రవము చేయుదానికైనను ఏజంతువునకును జేయఁడు—మనోవాక్కాయకర్మములచే నాచరింపఁడు కావున అద్వేష్ట. నిర్వికల్పసమాధినిష్ఠచే భేదప్రత్యయము నిర్మూలితం బగుటవలన నేనే యిదియంతయు నని సర్వాత్మభావముఁ బొందియున్నవిద్వాంసునకు ద్వైతప్రత్యయము లేనప్పుడు స్వస్వరూప మయిన సర్వమునందును బ్రీతి కలుగుటం జేసి ద్వేషబుద్ధి సంభవింపమినలన సర్వభూతంబులకును అద్వేష్టయే యగుచున్నాఁడు బ్రహ్మవిదుఁ డగుయతి. ఒకదానియందు రాగ మున్న యెడఁ దదపకారులయందు ద్వేషము కలుగును, సర్వాత్మభావాపన్నున కొకదానియందు రాగము సంభవింపమివలన యుక్తము విద్వాంసుఁడు సర్వభూతంబులకును అద్వేష్ట యనుట. అద్వేష్ట యనుటచే విద్వాంసునకు రాగద్వేషాదులు లేమియు నందుచే ముక్తికిఁ బ్రతిబంధము లేమియు సూచితం బగుచున్నది. మఱియును సమస్తభూతంబులకును, మైత్రః=మిత్త్రునివలె ననుకూలుఁడై యున్నవాఁడు, స్వాత్మభూతంబులయం దంతటను విద్వాంసునకు మిత్త్రియట్లు వర్తించుచున్నాఁ డనుట యుక్తము. మిత్త్రత్వసిద్ధికిఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—కరుణః = కరుణచే సర్వప్రాణు

♦ వృత్తము—ఆచారము, స్వాధ్యాయము—విద్య.

లకు ననుకూలుఁడై వర్తించుచున్నాఁడు, కాని గుణబుద్ధిచేఁ గాదు, గుణము దోష మువలె బంధకం బగుటవలన. కరుణః అనుచో మత్వర్థీయమచ్ప్రత్యయము *. అద్వేష్టృత్వాదిధర్మములు మూఁడును సిద్ధించుటకుఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.— నిర్మమః = పరదేహమునందుంబోలెఁ దనదేహమునందును నిర్గతము మమభావము ఎవ్వనికో అతఁడు నిర్మముఁడు, రాగద్వేషహేతు వగు మమతాబంధమునుండి నిర్ము క్తుఁ డని యర్థము, అది లేమివలననే యితనికి అద్వేష్టృత్వాదిధర్మత్రయము సిద్ధించు చున్నది. నిర్మమత్వసిద్ధికిఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—నిరహఙ్కారః=బ్రహ్మమే నే నని పరబ్రహ్మమునందు ఆత్మభావము నొందుటచే దేహమునందు నిశ్శేషముగా నిర్గతము అహంబుద్ధి యెవ్వనికో అతఁడు నిరహంకారుఁడు, నిరంతరబ్రహ్మనిష్ఠచే బ్రహ్మమునందే నిరూఢ మయినయాత్మబుద్ధి గలవానికే దేహాదికమునం దహంభావ ము విచ్ఛిన్న మగును, అందువలననే నిర్మమత్వము సిద్ధించును, దేహమునం దహం బుద్ధి యుండఁగా మమభావ మించుకయైనను బోదు గదా! అందువలన దేహమునం దహంభావము లేనివాఁ డగుటవలననే విద్వాంసుఁడు నిర్మముఁడు. అందువలననే, సమదుఃఖసుఖః=సమములు—అనిష్టము ఇష్టము అనుబుద్ధిని విడిచి యేకరూపంబున గృహీతంబులు; దుఃఖసుఖములు ద్వేషరాగజనకములు బ్రహ్మనిష్ఠ నుండునట్టి యే యతికో అతఁడు సమదుఃఖసుఖుఁడు, సుఖదుఃఖములు వచ్చినపుడు హర్షవిషాదరహి తుఁ డని యర్థము. సుఖదుఃఖములయందు సమబుద్ధిత్వసిద్ధికిఁ హేతువుఁ జెప్పుచు న్నాఁడు.—క్షమీ=తితిక్షువు, ఆధ్యాత్మికాదిదుఃఖములను సంతాపవిలాపరహితుఁడై సహించుచునే యున్నవాఁ డని యర్థము, "వృక్ష ఇవ తిష్ఠాసే చ్ఛిద్యమానో న కు ప్యేత న కమ్పేత" ♦ అనుశ్రుతివలన.

వా. ఇట్లు మందాధికారికి అతిదుష్కరం బగుటచే నక్షరోపాసనము నిం దించి సుకరం బగుసగుణోపాసనము విధించి యశక్తితారతమ్యము ననుసరించుచు నితరము లయినసాధనములను గూడ విధించెను భగవంతుఁడు వాసుదేవుఁడు, ఎ ట్లయినను సర్వప్రతిబంధరహితుఁడై యుత్తమాధికారమునొంది ఫలభూత మయిన యక్షరవిద్యయందు దిగు నను నభిప్రాయంబున, సాధనవిధానము ఫలార్థం బగుట వలన. అది చెప్పఁబడినది.—"నిర్విశేషం పరంబ్రహ్మ సాక్షాత్కర్తు మనీశ్వరాః। యే మన్దా స్తే ఽనుకమ్ప్యన్తే సవిశేషనిరూపణైః॥ వశీకృతే మనస్యేషాం సగుణ

* కరుణ గలవాఁ డనుట.

♦ వృక్షమువలె నుండవలయును, ఛేదింపఁబడినను కోపింపఁగూడదు చలింపఁగూడదు.

బ్రహ్మశీలనాత్ । తదేవా ఽఽవిర్భవే త్స్వాత్మా దవేతోపాధికల్పనమ్ " § అని. భగవంతుఁ డగు పతంజలిచేతనుం జెప్పఁబడినది.—“ సమాధిసిద్ధి రీశ్వరప్రణిధానాత్, తతః ప్రత్యక్చేతనాధిగమో ఽప్యన్తరాయా ఽభావశ్చ ” ♦♦ అని. తతః—ఈశ్వర ప్రణిధానమువలన నని యర్థము. అందువలన, అక్షరోపాసనము నిందించుట సగుణోపాసనస్తుతికొఱకే గాని హేయ మని కాదు, ఉదితహోమవిధియం దనుదితహోమము నిందించుటవలె, “ నహి నిన్దా నిన్దితుం ప్రవర్తతే ఽపితు విధేయం స్తోతుమ్ ” * అనున్యాయమువలన. అందువలన, అక్షరోపాసకులే పరమార్థంబున యోగవిత్తములు, “ ప్రియోహి జ్ఞానినో ఽత్యర్థ మహం స చ మమప్రియః । ఉదారా స్సర్వ ఏవైతే జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్ ” ఇత్యాదిగా మాటికిమాటికిఁ బ్రశస్తతములని చెప్పఁబడినవారు. వారియొక్క జ్ఞానమును ధర్మజాతమునే నీ వధికారము నొంది యనుసరింపవలయు నని యర్జునునకు బోధింపఁ గోరినవాఁడై పరమహితైషి యగు భగవంతుం డభేదదర్శులు కృతకృత్యు లగు నక్షరోపాసకులను బ్రస్తుతించుచున్నాఁ డేడుశ్లోకములచేత.—సర్వభూతంబులును తానే యని చూచుచుఁ దనకు దుఃఖహేతు వగుప్రాణియందుఁ గూడఁ బ్రతికూలబుద్ధి లేనివాఁ డగుటవలన, అద్వేష్టా—ద్వేషము చేయువాఁడు కాఁడు సర్వభూతములకును. మ తే మనఁగా, మైత్రః మైత్రి యనఁగా స్నేహము, అది కలవాఁడు. ఎందువలననఁగా, కరుణః=కరుణ యనఁగా దుఃఖితులందు దయ, అది గలవాఁడు, సర్వభూతాభయభద్రుఁ డగు పరమహంసపరివ్రాజకుం డని యర్థము. నిర్మమః = దేహమునందుఁ గూడ నాది యను ప్రత్యయము లేనివాఁడు. నిరహఙ్కారః=వృత్తస్వాధ్యాయాదులవలనఁ గలుగు నహంకారము విడిచినవాఁడు. సమదుఃఖసుఖః = ద్వేషరాగంబులఁ గలిగింపని వగుటచే సమములైన దుఃఖసుఖములు గలవాఁడు. అందువలననే, క్షమీ=తిట్టుట కొట్టుట మొదలగువానిచేతఁగూడ వికారము పొందనివాఁడు.

---

§ నిర్విశేష మగుపరబ్రహ్మమును సాక్షాత్కరించుట కసమర్థు లగుమందబుద్ధు లెవ్వరు గలరో వారు సవిశేషబ్రహ్మోపదేశములచే ననుగ్రహింపఁబడుచున్నారు. సగుణబ్రహ్మోపాసనమువలన వశీకృతమయిన వీరిమనస్సునందు సాక్షాన్నిరూపాధిక మయినబ్రహ్మమే యావిర్భవించును.

♦♦ ఈశ్వరప్రణిధానమువలన సమాధిసిద్ధి యగును, ఈశ్వరప్రణిధానమువలననే ప్రత్యగాత్మజ్ఞానమును విఘ్నము లేమియుఁ గలుగును.

* నింద నిందించుటకుఁ బ్రవర్తించినది కాదు, మ తే మనఁగా, విధేయమును స్తుతించుటకుఁ గదా ప్రవర్తించుచున్నది.

శ్రీ. ఇట్టిభక్తునకు శీఘ్రముగనే పరమేశ్వరప్రసాదహేతువు లగుధర్మములం జెప్పుచున్నాఁ డెనిమిదిశ్లోకములచేత.—సర్వభూతానామ్; వారివారికిఁ దగినట్లు, అద్వేష్టయు మైత్త్రుఁడును కరుణుఁడును—ఉత్తములయందు ద్వేషము లేనివాఁడు సమానులయందు మైత్త్రి గలవాఁడు హీనులయందు దయాలు వని యర్థము. నిర్మముఁడును నిరహంకారుఁడును. దయాలు వగుటవలననే యితరులతోఁ గూడ సమము లైనసుఖదుఃఖములు గలవాఁడు. క్షమీ=క్షమ గలవాఁడు.

ప. ఇఁకఁ బ్రసాదజనకంబు లగుధర్మములఁ జెప్పుచున్నాఁ డెనిమిదింటిచేత. అందు మొదటిరెండుశ్లోకము లేకాన్వయములు.—సర్వభూతానామ్; అద్వేష్టా=ద్వేషశూన్యుఁడు. అప్పు డుదాసీనుఁ డగు ననఁగాఁ జెప్పుచున్నాఁడు.—మైత్త్రః—అందు ఉత్తము లతిపూజ్యు లగుటవలన వారియెడ మైత్త్రి యప్రసక్త మగుటం జేసి సములయందు మైత్త్రుఁడు. అపకృష్టులయందు కరుణుఁడు. అయినను వారి యెడ, నిర్మమః = మమత లేనివాఁడు. అట్లే యహంకారశూన్యుఁడు. మఱియు, సమము లయినసుఖదుఃఖములు గలవాఁడు. క్షమీ=క్షమ గలవాఁడు.

రా. ఫలాభిసంధిరహితకర్మనిష్ఠున కుపాదేయము లయినగుణములం జెప్పుచున్నాఁడు.—సర్వభూతానామ్ అద్వేష్టా=తనయెడ ద్వేషించుచున్నవా రైనను అపకారము చేయుచున్నవా రైనను సమస్తభూతములయెడ ద్వేషము చేయని వాఁడు. నాయపరాధమున కనుగుణముగా నీశ్వరప్రేరితము లై యీభూతములు ద్వేషంబును అపకారంబును జేయుచున్న వని యనుసంధించుచు నట్లు ద్వేషంబును అపకారమును జేయుచున్నయాభూతములయన్నిటియందును, మైత్త్రః=మిత్త్రబుద్ధిని జేయుచున్నాఁడు కావున మైత్త్రుఁడు. వారియందే దుఃఖితు లైనవారియందు, కరుణః=కరుణను జేయువాఁడు. నిర్మమః = దేహేంద్రియములయందును తత్సంబంధుల యందును మమత లేనివాఁడు. నిరహఙ్కారః=దేహాత్మాభిమానరహితుఁడు. అందు వలననే, సమదుఃఖసుఖః=సాంకల్పికము లయిన సుఖదుఃఖప్రాప్తులయందు హర్షోద్వేగ ములు లేనివాఁడు. క్షమీ = స్పర్శమువలనఁ గలుగునట్టి యాసుఖదుఃఖములయందు అనివార్యము లయినవానియందు వికారము లేనివాఁడు.

మ. **

** ౧౩-౧౪-౧౫ శ్లోకములకీభాష్యము లేదు.

సన్తుష్ట స్సతతం యోగీ యతాత్మా దృఢనిశ్చయః
మ య్యర్పితమనోబుద్ధి ర్యో మద్భక్త స్స మే ప్రియః. ౧౪

**భా.** సతతమ్=ఎల్లప్పుడును; సంతుష్టః=దేహస్థితికారణము ♦ లభించినను లభింపకున్నను అలంప్రత్యయము * గలవాఁడు, అట్లు మంచిది లభించినప్పుడును తద్విపర్యయమునందును ♦♦ సంతుష్టుఁడు. ఎల్లప్పుడును, యోగీ=సమాహితచిత్తుఁడు. యతాత్మా=సంయత మయినస్వభావము గలవాఁడు. దృఢనిశ్చయః=దృఢము—స్థిరము నిశ్చయము—అధ్యవసాయము ఆత్మతత్త్వవిషయమునం దెవ్వనికో అతఁడు దృఢనిశ్చయుఁడు. మయి=నాయందు; అర్పితమనోబుద్ధిః = సంకల్పాత్మక మయినమనస్సును అధ్యవసాయలక్షణ మయినబుద్ధియును నాయందే అర్పితములు—స్థాపితములు, ఏసన్న్యాసికో అతఁడు అర్పితమనోబుద్ధి. ఇట్టి §, మద్భక్తః=నాభక్తుఁడు; యః=ఎవ్వఁడు గలఁడో; సః=అతఁడు, మే=నాకు; ప్రియః=ప్రియుఁడు. "ప్రియో హి జ్ఞానినో ఒత్యర్థ మహం సచ మమ ప్రియః" అని సప్తమాధ్యాయమునందు సూచింపఁబడినది. అది యిటఁ బ్రపంచింపఁబడుచున్నది.

ఎల్లప్పుడును భిక్షాదికము దొరకినను దొరకకున్నను మంచిదిదొరకినను చెడ్డదిదొరకినను సంతోషము గలవాఁడును సమాధి గలవాఁడును దేహమును నిగ్రహించుకొని స్వాధీనముగాఁ జేసికొన్నవాఁడును ఆత్మతత్త్వవిషయంబున దృఢ మయిన నిశ్చయము గలవాఁడును నాయందే మనోబుద్ధు లుంచి యున్నవాఁడును—ఇట్టి యద్వేష్టృత్వాదిధర్మములు గల నాభక్తుఁ డెవ్వఁడో అతఁడు నాకుఁ బ్రియుఁ డని తా.

**ఆ.** అక్షరోపాసకుఁ డగుజ్ఞానికి విశేషణాంతరములు చెప్పుచున్నారు.— సతత మ్మనునది యన్నిటితోను అన్వయించుచున్నది. స్వభావ మనఁగా కార్యకరణ సంఘాతము ‡. స్థిరము—కుతర్కాదికముచే నభిభవింప నలవిగానిది. నాభక్తుఁడు—

♦ అన్నము మొదలగునది.

* చాలు నని బుద్ధి, తృప్తి.

♦♦ చెడ్డది లభించినప్పుడును.

§ అద్వేష్టృత్వాదిగుణములు గల.

‡ దేహము.

నన్ను భజించువాఁడు, జ్ఞానవంతుఁ డని భావము. జ్ఞాని భగవత్ప్రియుం డనుటకుఁ బ్రమాణము చెప్పుచున్నారు ప్రియో హీత్యాదిగా. ఎందు కప్పుడు వెండియుఁ జెప్పవలయును? అనఁగాఁ జెప్పుచున్నారు అది ఇత్యాదిగా.

హా. *

శం. అప్పు డెట్లుండవలయును? అనఁగా నందుకుఁ జెప్పుచున్నాఁడు.— సతత మ్మనునది యైదువిశేషణములతోను అన్వయించు చున్నది. సుఖదుఃఖముల యందును మానావమానములయందును లాభాలాభములయందును, సతతమ్=ఎల్లప్పుడును; సంతుష్టః=బ్రహ్మానందానుభవముచే సంతోషము గలవాఁడై ప్రసన్నవదనుఁ డయ్యే యున్నవాఁడు. సదా ఆనందయుక్తుఁ డగుటకు హేతువుఁ జెప్పుచున్నాఁడు.— యోగీ=సర్వదా ఆనందస్వరూపం బగుబ్రహ్మమునందే నిశ్చలచిత్తముతో స్థితి యోగము, అది గలవాఁడు కావున యోగి; సదా ఆత్మారాముఁ డని యర్థము. యోగిత్వసిద్ధికి హేతువుఁ జెప్పుచున్నాఁడు.—యతాత్మా=ఎల్లప్పుడును యతము—సంయతము «సమంకాయ శిరోగ్రీవమ్» అని చెప్పినట్లు స్థాపిత మగుఆత్మ—దేహము ఎవ్వనికో అతండు యతాత్ముఁడు. కార్యకరణసంఘాతము నిరోధించిననే సమాధి సిద్ధించును, సమాధి గలవానికే విపరీతప్రత్యయనాశ మగును, దానివలననే సమ్యగ్జ్ఞానము కలుగును, అది గలవానికే విదేహముక్తి, అందువలన యతి సదా సమాధి చేయుచుండవలయు నని సూచింపఁబడినది. లేక. యతము—నిరుద్ధము ఆత్మ—స్వభావము వాసన ఎవ్వనికో అతఁడు యతాత్ముఁడు. సతతం యోగీ యతాత్మా అను రెండువిశేషణములచేఁ జెప్పఁబడు నిశ్చలయోగసిద్ధికిఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—దృఢనిశ్చయః=నిరంతరసమాధిచేఁ బుట్టినసమ్యగ్జ్ఞానమునకు విషయభూత మయినపరబ్రహ్మమునందే యాత్మత్వానుభవముచేత సముత్పన్నము—బ్రహ్మమే నేను సంసారిని గాను అనునట్టి దృఢమైన—ప్రమాణాంతరప్రత్యయాంతరములచే అచ్ఛేద్య మయిన స్వభావనిశ్చయము ఎవ్వనికో అతఁడు దృఢనిశ్చయుఁడు, మూఢుఁడు దేహమునం దెట్లో అట్లు బ్రహ్మమునందే యారూఢ మయినయహంబుద్ధి గలవాఁ డని యర్థము. లేక. నిత్యనిరంతరసమాధినిష్ఠాసంభూత మైన యధిష్ఠానతత్త్వసందర్శనముచే ఆరోపితవస్తుతత్ప్రత్యయములనాశము సిద్ధ మయినపుడు ఇది యంతయు నేనును బ్రహ్మమే యని సర్వంబునకును దనకును సాక్షాద్బ్రహ్మమాత్రత్వాధిగమరూపము దృఢము—ప్రమా

* ఈశ్లోకమున కీవ్యాఖ్యానము లేదు.

ణాంతరముచేఁ జలింపనియట్టినిశ్చయము—వస్తుతత్త్వావధారణరూపము ఎవ్వనికో అతఁడు దృఢనిశ్చయుఁడు. ఇట్లు దృఢనిశ్చయత్వము సిద్ధించుటకుఁ గారణముఁ జెప్పుచున్నాఁడు.—మయి అర్పితమనోబుద్ధిః=బుద్ధి యనఁగా అహంవృత్తి, మన స్సనఁగా ఇదంవృత్తి, ఇద మహా మాత్మకము లైనమనోబుద్ధులు నాయందే—ప్రత్యగభిన్నము పూర్ణ మయినబ్రహ్మమునందే అర్పితములు—సర్వదా మదేకవిషయములుగా స్థాపితములు ఎవ్వనిచేతనో అతఁడు మయ్యర్పితమనోబుద్ధి, అహంబుద్ధికిని ఇదంబుద్ధికిని నన్నే విషయముగాఁ జేసి యెవ్వఁడు సర్వదా నన్ననుసంధించుచున్నాఁడో అట్టివాఁడు. అట్టి, యః మద్భక్తః=మదనుసంధానపరుఁడు, సదా సర్వత్ర బ్రహ్మమాత్రదర్శి బ్రహ్మవిదుఁ డగుయతి యెవ్వఁడు గలఁడో; సః=అతఁడు; మే=నాకు, ఈశ్వరునకు; ప్రియః=ప్రియుఁడు, ఆత్మభూతుఁ డగుటవలన; అందఱకును ఆత్మయే సదా ప్రియుఁడు; "జ్ఞానీ త్వాత్మైవ మే మతమ్" అని జ్ఞాని నాకాత్మభూతుం డని నిశ్చితుఁ డగుటవలన ఆత్మభూతుఁ డగుజ్ఞానియే నాకు నిత్యప్రియుఁడు, ఇతరులో నైమిత్తికప్రియు లని యర్థము. "ప్రియో హి జ్ఞానినో ఽత్యర్థ మహం సచ మమప్రియః" అని చెప్పినయర్థమే, వెండియు నిట శుద్ధాత్ములు వివేకవంతులు సూక్ష్మబుద్ధు లగువారికి, మేమును బ్రహ్మభూతులమై యీశ్వరునకుఁ బ్రియు లయ్యెద మని శ్రవణమననిదిధ్యాసనసమాధులయందుఁ బ్రవృత్తి కలుగుటకై ప్రతిపాదింపఁబడినది.

౧౪. వానికే విశేషణాంతరములు.—సతతమ్; శరీరస్థితికారణము లభించినను లభింపకున్నను, సంతుష్టః=అలంప్రత్యయము గలవాఁడు, అట్లె మంచిది లభించినను చెడ్డది లభించినను. సతత మ్మనునది సర్వత్ర సంబంధించుచున్నది. యోగీ=సమాహితచిత్తుఁడు. యతాత్మా = సంయత మయినశరీరేంద్రియసంఘాతము గలవాఁడు. దృఢనిశ్చయః = దృఢము—కుతార్కికులచే అభిభవింప నశక్య మగుటచేత స్థిర మయిననిశ్చయము—నేనే అకర్త్రభోక్త్ర సచ్చిదానందాద్వితీయ మయినబ్రహ్మము అను నధ్యవసాయ మెవ్వనికో అతఁడు దృఢనిశ్చయుఁడు, స్థితప్రజ్ఞుఁ డని యర్థము. మయి=నాయందు, భగవంతుఁడను వాసుదేవుఁడను శుద్ధబ్రహ్మమ నగునాయందు; అర్పితమనోబుద్ధిః = సమర్పిత మయినయంతఃకరణము గలవాఁడు. ఇట్టి, యో మద్భక్తః = శుద్ధాక్షరబ్రహ్మవిదుఁడు గలఁడో; సః మే ప్రియః=అతఁడు నాకుఁ బ్రియుఁ డెల్లప్పుడును, ఆత్మ యగుటవలన.

శ్రీ. సతతమ్—లాభమునందును అలాభమునందును; సంతుష్టః = ప్రసన్న చిత్తుఁడు. యోగీ=ప్రమాదము లేనివాఁడు. యతాత్మా=సంయత మయినస్వభావము గలవాఁడు. దృఢ మయినమద్విషయనిశ్చయము గలవాఁడు. నాయం దర్పితము లయినమనోబుద్ధులు గలవాఁడు. ఇట్టి మద్భక్తుఁ డెవ్వఁడు గలఁడో అతఁడు నాకుఁ బ్రియుఁడు.

ప. సతతమ్=నిరంతరముగా, లభించినను లభింప కున్నను; సంతుష్టః= ప్రసన్నచిత్తుఁడు. యోగీ=ప్రమత్తుఁడు కానివాఁడు. యతాత్మా = సంయత మయిన చిత్తము గలవాఁడు. దృఢనిశ్చయః=అచల మయినమద్విషయనిశ్చయము గలవాఁడు. నాయం దర్పితము లైనమనోబుద్ధులు గలవాఁడు. ఇట్టివాఁడు మద్భక్తుఁ డెవ్వఁడు గలఁడో, అతఁడు నాకు, ప్రియః=సఖుఁడు.

రా. సంతుష్టః=యదృచ్ఛా ♦ లబ్ధ మయినదేహధారణద్రవ్యముచే దేనిచే నైనను సంతోషించువాఁడు. సతతం యోగీ = ఎల్లప్పుడును ప్రకృతివియుక్తాత్మాను సంధానపరుఁడు. యతాత్మా = నియమిత మయినమనోవృత్తి గలవాఁడు. దృఢనిశ్చయః=అధ్యాత్మశాస్త్రమునఁ జెప్పఁబడినయర్థములందు దృఢ మయిననిశ్చయము గలవాఁడు. మయ్యర్పితమనోబుద్ధిః=భగవంతుఁడు వాసుదేవుఁడే ఫలాభిసంధిరహితముగా ననుష్ఠింపఁబడుకర్మముచే నారాధింపఁబడు చున్నాఁడు, ఆరాధితుఁడై నాకు ఆత్మాపరోక్ష్యమును సిద్ధింపఁజేయుఁ గలఁ డని నాయందు మనోబుద్ధుల నర్పించినవాఁడు. ఎవ్వఁడు ఇట్టిమద్భక్తుఁడు గలఁడో—ఇట్లు కర్మయోగముచే నెవ్వఁడు నన్ను భజించు చున్నాఁడో, అతఁడు నాకుఁ బ్రియుఁడు.

యస్మా న్నోద్విజతే లోకో లోకా న్నోద్విజతే చ యః
హర్షామర్షభయోద్వేగై ర్ముక్తో యస్సచ మే ప్రియః. ౧౫

భా. యస్మాత్=ఏసన్న్యాసివలన; లోకః=జనము; నోద్విజతే=ఉద్వేగము నొందదో, సంతాపము నొందదో, సంక్షోభము నొందదో. అట్లు, యః=ఏసన్న్యాసి; లోకాత్=జనమువలన; నోద్విజతే = ఉద్వేగమును—సంతాపమును—సంక్షోభమును బొందఁడో. యః=ఎవ్వఁడు; హర్షామర్షభయోద్వేగైః=హర్షముచేతను అమర్షముచేతను భయముచేతను ఉద్వే

♦ ప్రయత్నము లేక.

గముచేతను, హర్షము—ప్రియము లభించినపుడు రోమాంచము బాష్పము మొదలగువానిచేఁ దెలియవచ్చునట్టి యంతఃకరణోత్కర్షము *, అమర్షము—సహింపమి, భయము—త్రాసము, ఉద్వేగః—ఉద్విగ్నత ‡, వీనిచేత; ముక్తః=విడువఁబడినవాఁడో. సచ=అతఁడే; మే=నాకు; ప్రియః=ప్రియుఁడు.

ఎవ్వనివలన లోకము సంతాపము నొందదో యెవ్వఁడు లోకమువలన సంతాపము నొందఁడో యెవ్వఁడు హర్షము అమర్షము భయము ఉద్వేగము లేనివాఁడో అట్టిసన్న్యాసి నాకుఁ బ్రియుఁ డని తాత్పర్యము.

రా. ఉద్వేగాదులు లేకుండుటయు జ్ఞానికి విశేషణ మని చెప్పుచున్నాఁడు.—సన్న్యాసి కుద్వేగమున కపాదానత్వ మనుపపన్న మనుట మాత్రమే కాదు, మతే మనఁగా, తత్కర్తృత్వము గూడ ననుపపన్న మని చెప్పుచున్నాఁడు ** అట్లు ఇత్యాదిగా. సహింపమి—ఇతరులప్రకర్షము నని శేషము. త్రాసము—తస్కరాది దర్శనములవలనఁ గలుగునది. ఉద్విగ్నత అచేతనమువలన—చేతనమువలనఁ గలుగునది లోకాత్ అనుచో చెప్పఁబడుటవలన.

హా. ఉద్వేగము—చలచిత్తత్వము. అమర్షము—క్రోధము.

శం. అద్వేష్టృత్వాదులు స్థిరమతిత్వాంతములు ముప్పదియాఱు సిద్ధునిలక్షణములు, సాధకునకును జ్ఞానపరిపాకసాధనములు, వాని నతఁ డవశ్యము సంపాదింపవలయు నని సూచించుటకై యధ్యాయసమాప్తివఱకు వానిఁ బ్రతిపాదించుచున్నాఁడు.—లోకః=జనము; యస్మాత్=ఎవ్వనివలన; నోద్విజతే=ఉద్వేగమును బొందదో, పరిభ్రమించుని యాగమన శ్రవణదర్శనాదులచేఁ బ్రాణివర్గము విక్షేపము నొందదో. లోకాత్ = ఉపద్రవము చేయునట్టి చోరసర్పవ్యాఘ్రాదికమువలన; యశ్చ=ఎవ్వఁడు తానును; నోద్విజతే=వారి యాగమనదర్శనస్పర్శనాదులచే ఉద్వేగము నొందఁడో. హర్షామర్షభయోద్వేగైః = ఇష్టప్రాప్తియందు హర్షము, రోగాద్యుపద్రవప్రాప్తియందు అమర్షము—సహింపమి, చోరసర్పాదిక్రూరజంతుదర్శనాదులచే భయము, ప్రాణాపాయహేతు వగునదర్థము ప్రాప్తించినప్పుడు ఉద్వేగము—ఈచిత్తవికారముల

---

* చిత్తవికాసము.

‡ సంతాపము.

** సన్న్యాసివలన లోక ముద్వేగము నొంద దని మాత్రమే కాదు, సన్న్యాసియు లోకమువలన నుద్వేగము చేయఁ దని.

చే, స్వాజ్ఞానకృతము లయినవానిచే; ముక్తః=విడువఁబడినవాఁడై; హర్షాదులకు విపరీతధర్మములయందుఁ బరినిష్ఠితుఁడై, యః=ఎవ్వఁడు, మన్నిష్ఠయందే యున్నాఁడో స మే ప్రియః=వాఁడు నాకుఁ బ్రియుఁడు.

మ. వెండియు వానికే విశేషణములు.—యస్మాత్ = సర్వభూతములకును అభయదాయి యగు ఏసన్న్యాసివలన; నోద్విజతే = సంతాపమునొందదో; లోకః= ఏజనము గూడ. అట్లు, లోకాత్ =నిరపరాధుల సంతపింపఁజేయుటయే వ్రతముగాఁగల దుష్టజనమువలన; యశ్చ; నోద్విజతే = సంతాపము నొందఁడో; అద్వైతదర్శియగుటవలనను బరమకారుణికుఁ డగుటచే క్షమాశీలుం డగుటవలనను. మఱియును. హర్షము—తనకుఁ బ్రియలాభమునందు రోమాంచాశ్రుపాతాదిహేతువై యానందాభివ్యంజక మగుచిత్తవృత్తివిశేషము, అమర్షము—పరోత్కర్షాసహనరూప మయిన చిత్తవృత్తివిశేషము, భయము—వ్యాఘ్రాదిదర్శనముచేఁ గలుగు చిత్తవృత్తివిశేషము త్రాసము. ఉద్వేగము—ఏకాకిని ఎట్లు సర్వపరిగ్రహశూన్య మయినవిజనస్థానమునందు జీవింపఁగలను ? అనువ్యాకులతారూప మయినచిత్తవృత్తివిశేషము, ఆహర్షామర్షభయోద్వేగములచే, యః ముక్తః=ఎవ్వఁడు విడువఁబడినవాఁడో, అద్వైతదర్శి యగుటంజేసి యాహర్షాదుల కయోగ్యుఁ డగుటచే వానిచేతఁ దమంతటనే విడువఁబడినవాఁడు, కాని తాను వాని విడుచుటయందు యత్నించినవాఁడు కాఁడో యని భావము. చకారముచే మద్భక్తః అని యనుకర్షింపఁబడుచున్నది. ఇట్టి నాభక్తుఁ డెవ్వఁడో అతఁడు నాకుఁ బ్రియుఁ డని యర్థము.

శ్రీ. మఱియును.—యస్మాత్ =ఎవ్వనివలన; లోకః=జనము; నోద్విజతే= భయశంకచే సంక్షోభము నొందదో. యశ్చలోకాత్ నోద్విజతే. మఱియు నెవ్వఁడు స్వాభావికము లయినహర్షాదులచే ముక్తుఁడో; అందుహర్షము—తనకు ఇష్టార్థము లభించుటకై యుత్సాహము, అమర్షము—పరునకు లభించినపుడు ఓర్వమి, భయము—త్రాసము, ఉద్వేగము—భయాదినిమిత్త మయినచిత్తక్షోభము. ఎవఁడు వీనిచే విముక్తుఁ డగునో. అట్టి మద్భక్తుఁడు నాకుఁ బ్రియుఁడు.

ప. మఱియును.—వాఁడు నాకుఁ బ్రియుఁడు. ఎవ్వఁడు ? యస్మాత్ లోకః నోద్విజతే. యశ్చ లోకాత్ నోద్విజతే—సర్వభూతంబులయందును ఈశ్వరాధిష్ఠానమును జూచుటవలన. అది చెప్పఁబడినది. "నోన్మత్తా త్రిశునా జనా ద్విదమతే సర్వాత్మభూతః పుమాన్ తస్మాత్సర్వ సుహృత్తమాదపి జనో నాశఙ్కతే

కశ్చన। అత్యుగ్రైర్జలజన్తుభిర్జలనిధిర్నైష్వాధిమేతిక్షణం నోయాదాంసి భజన్తి భీతి ముదధే రత్యార్జితా త్సర్వతః॥ * అని. మఱియు. హర్షామర్షభయో ద్వేగైః ముక్తః = హర్షము—స్వార్థము లభించినపుడు ఉత్సాహము, అమర్షము—పరునకు లభించినపుడు అసహనము, భయము—త్రాసము, ఉద్వేగము—భయాదినిమిత్త మయినచిత్తక్షోభము.

రా. యస్మాత్=ఏకర్మనిష్ఠుఁ డగుపురుషునివలన; లోకో నోద్విజతే—ఎవ్వఁడు లోకమున కుద్వేగము గలిగించునట్టికర్మము నొంచెమేనియుఁ జేయఁడో యని యర్థము. లోకాచ్చ=లోకమువలనను, యః నోద్విజతే = ఎవ్వనికి ఉద్వేగము గలిగించు కర్మమును సర్వలోకంబును జేయదో, ఇతఁడు సర్వప్రాణులకును అవిరోధి యనునిశ్చయమువలన. అందువలననే, ఒకానొకనిగూర్చి హర్షముచేతను ఒకానొకనిగూర్చి యమర్షముచేతను ఒకానొకనిగూర్చి భయముచేతను ఒకానొకనిగూర్చి యుద్వేగము చేతను ఎవ్వఁడు విడువఁబడినవాఁడో; ఇట్టివాఁ డెవ్వఁడో అతఁడును నాకుఁ బ్రియుఁడు.

అనపేక్ష శ్శుచి ర్దక్ష ఉదాసీనో గతవ్యథః
సర్వారమ్భపరిత్యాగీ యో మద్భక్తస్స మే ప్రియః. ౧౬

భా. అనపేక్షః = అపేక్షకు విషయము లయినదేహేంద్రియవిషయ సంబంధాదులయందు అపేక్ష—స్పృహ లేనివాఁడు. శుచిః = బాహ్యమును ఆభ్యంతరము నగు శౌచముతో సంపన్నుఁడు. దక్షః=ప్రత్యుత్పన్నము లైన * కార్యములందు తత్కాలమునఁ జక్కఁగా నెఱుంగుటకు సమర్థుఁడు. ఉదాసీనః = మిత్త్రాది యగు నెవ్వనిపక్ష మేనియు భజింపఁ డెవ్వఁడో అతఁ డుదాసీనుఁడు, యతి. గతవ్యథః=పోయినభయము గలవాఁడు. సర్వారమ్భపరిత్యాగీ = ఆరంభింపఁబడుచున్నవి గావున ఆరంభములు—ఇహాముత్రఫలభోగార్థములు కామహేతుకము లగుకర్మములు, అట్టిసమస్తము లయినయారంభములను బరిత్యజించుట స్వభావముగాఁ

* ఉన్మత్తునివలనఁ గాని పిశునునివలనఁ—మోసకానివలనఁ గాని సర్వాత్మభూతుఁ డగుపురుషుఁడు విరతి నొందఁడు. సర్వభూతసుహృదుఁ డగునతనివలనఁగూడ జనుఁ డెవ్వఁడును శంక నొందఁడు. ఎట్లు అతిభయంకరము లగుజలజంతువులచే సముద్రము క్షణమేనియు భయము నొందదో, జలజంతువులును భయంకర మయినసముద్రమువలన భయము నొందదో అట్లు.

* తత్కాలోచితము లైన.

గలవాఁడు సర్వారంభపరిత్యాగి. ఇట్టి, యః మద్భక్తః=నాభక్తుఁ డెవ్వఁడు గలఁడో; సః మే ప్రియః=అతఁడు నాకుఁ బ్రియుఁడు.

దేనియందును అపేక్ష లేనివాఁడును బాహ్యాభ్యంతరశౌచము గలవాఁడును చేయవలసినకార్యములయందు సమర్థుఁడును మిత్త్రాదులయందుఁ బక్షపాతము లేనివాఁడును నిర్భయుఁడును ఇహపరలోకసుఖసాధనము లైనకామహేతుకము లగు సర్వకర్మములను విడిచినవాఁడు నగు నాభక్తుఁ డెవ్వఁడు గలఁడో అతఁడు నాకుఁ బ్రియుఁ డని తాత్పర్యము.

ఆ. నిరపేక్షత్వాదికము గూడ జ్ఞానికి విశేషణ మని చెప్పుచున్నారు.—సంబంధాదులయందు అనుచోటి యాదిపదము అపేక్షణీయసర్వసంగ్రహార్థము. ఎఱుంగుటకు—ఎఱుంగవలసినవానియెడ నెఱుంగుటకును చేయవలసినవానియెడఁ జేయుటకును అని యర్థము. పరులచేఁ గొట్టఁబడినను పోయినది భయము వీనికని వ్యుత్పత్తి నాశ్రయించి చెప్పుచున్నారు పోయినభయము గలవాఁ డని. క్షమా అనుటచేఁ బానరుక్త్యం బనఁ దగదు, వ్యథ కలిగినప్పుడు గూడ అపకారులకు నపకారము చేయకుండుట క్షమిత్వం బని యంగీకరించుటవలన.

హ. *

శం. బ్రహ్మవిదునకు లక్షణాంతరములం జెప్పుచున్నాఁడు. అనపేక్షః=దృష్టము శ్రుత మగువస్తువునం దంతటను దేహజీవనాదికమునందును అసద్బుద్ధిచే, జీవించియున్నపుడే ముక్తుఁ డగుటవలన మోక్షమునందును, ఎవ్వనికి అపేక్ష లేదో అతం డనపేక్షుఁడు, సర్వకామనిర్ముక్తుఁ డని యర్థము. శుచిః=“కర్మస్వసంగమ శ్శౌచమ్” ♦ అనున్యాయంబున దేహేంద్రియాదులచే—కాదు తనచేత—చేయఁబడునట్టి యన్నాదానవిసర్గాదు లగుకర్మములందు దుష్టములందుఁ గాని యదుష్టములందుఁ గాని కర్మమునం దకర్తృత్వదర్శనముచే తనకు వానితో సంబంధము లేమివలన అకర్త్రాత్మదర్శి యగు బ్రహ్మవిదుఁడే శుచి, నిత్యశుద్ధుఁ డని యర్థము. దక్షః—శ్రుతిస్మృతీతిహాసపురాణన్యాయమీమాంసాది సర్వశాస్త్రములయు నధ్యయనాధ్యాపన తదర్థప్రకాశనానుష్ఠానానుష్ఠాపనములయందు సర్వకర్మములయందును తా నెఱుంగుటకును ఎఱింగించుటకును జేయుటకును జేయించుటకును సమర్థుఁ డని యర్థము.

---

* ౧౬, ౧౭, ౧౮ శ్లోకముల కీవ్యాఖ్యానము లేదు.

♦ కర్మములం దనాసక్తి శౌచము.

అట్లయినను, సర్వారమ్భపరిత్యాగీ=ఆరంభింపఁబడుచున్నవి కావున ఆరంభములు—కర్మములు, సమస్తము లయినసర్వారంభములు—లౌకికవైదికము లగుసమస్తకర్మములు, అవిద్యాకామసంకల్పాహంకారాదిదోషములవృద్ధిఁ బొందించునవి యగుటం జేసి జ్ఞానతత్ఫలంబులకుఁ బ్రతిబంధకంబు లగుటవలన వానిని బరిత్యజించుట స్వభావముగాఁ గలవాఁడు కావున సర్వారంభపరిత్యాగి, సర్వకర్మసన్న్యాసి యని యర్థము. ఓయీ! విహితాచరణము ధర్మము, తత్త్యాగం బధర్మము, అధర్మమునందు ధర్మబుద్ధియును ధర్మమునం దధర్మబుద్ధియును శ్రోత్రియునకు వివేకికి సంతాపమునే కలిగించును, ఎట్లు ధర్మమును విడిచి తా నధర్మముఁ జేసి శ్రోత్రియుఁడు సంతాపము నొందకుండును? అని యాశంకింపఁగా నట్లు కాదు. కర్మములు మోక్షమునకు సాధనము కామివలనను బుట్టినజ్ఞానమునకుఁ గూడఁ బ్రతిబంధకము లగుటవలనను ముముక్షువునకు తత్త్యాగము న్యాయసిద్ధం బగుటవలన న్యాయానువర్తి యగుటం జేసి విద్వాంసుఁడు సంతాపము నొందఁ డని చెప్పుచున్నాఁడు.—గతవ్యథః = గతము—చిత్తమునుండి నిర్గతము, వ్యథ—కృత్యము ననుష్ఠింపమిచేతను అకృత్యము ననుష్ఠించుటచేతను గలుగు సంతాపము ఎవ్వనికో అతఁడు గతవ్యథుఁడు, అనాత్మకర్తృకంబు లగుకృత్యాకృత్యములయం దకర్త్రాత్మదర్శి యగు బ్రహ్మవిదుఁడు సంతపింపఁ డని యర్థము, «నైనం కృతాకృతే తపతః» ♦ అనుశ్రుతివలన. అప్పుడెట్లుండును? అనఁగాఁ జెప్పుచున్నాఁడు.—ఉదాసీనః = ఆహారాదికర్మమునందు యుక్తమునందుఁ గాని యయుక్తమునందుఁ గాని దేహేంద్రియాదులు స్వారబ్ధానుసారంబునఁ బ్రవర్తించుచుండఁగాఁ దాను తటస్థునియట్లు ఉదాసీనుఁడు—సాక్షినై యవిక్రియస్వరూపంబున యూరక యున్నాఁ డని యర్థము. ఇట్టి మద్భక్తుఁ డెవ్వఁడు గలఁడో అతఁడు నాకుఁ బ్రియుఁ డని యర్థము.

౧౬. మఱియును.——అనపేక్షః=సమస్తభోగోపకరణములయందును యదృచ్ఛాప్రాప్తము లయినవానియందుఁ గూడ స్పృహ లేనివాఁడు. శుచిః=బాహ్యాభ్యంతరశౌచసంపన్నుఁడు. దక్షః=జ్ఞాతవ్యములును కర్తవ్యములును ఉపస్థితము లయినప్పుడు తత్క్షణమే యెఱుంగుటకును జేయుటకును సమర్థుఁడు. ఉదాసీనః = మిత్రాదుల యెవ్వరిపక్షమును బొందనివాఁడు. గతవ్యథః=పరులచేఁ దాను గొట్టఁబడినను గతము—ఉత్పన్నము కాదు వ్యథ యెవ్వరికో అట్టివాఁడు. వ్యథ యుత్పన్న మయినప్పుడును అపకారుల కపకారము చేయనివాఁడు క్షమి, వ్యథాకారణము లున్నను

♦ ఇతనిని చేయఁబడినవియుఁ జేయఁబడనివియుఁ దపింపఁజేయవు.

వ్యథ కలుగనివాఁడు గతవ్యథుఁ డని భేదము. ఐహికాముష్మికఫలము లగు సర్వ కర్మములు సర్వారంభములు, వానిని బరిత్యజించుట స్వభావముగాఁ గలవాఁడు సర్వారంభపరిత్యాగి, సన్న్యాసి. ఇట్టి యేనాభక్తుఁడు గలఁడో అతఁడు నాకుఁ బ్రియుఁడు.

శ్రీ॰ మఱియును.—అనపేక్షః = యదృచ్ఛాలబ్ధ మయినయర్థమునందును నిస్స్పృహుఁడు. శుచిః=బాహ్యాభ్యంతరశౌచసంపన్నుఁడు. దక్షః=సోమరితనము లేని వాఁడు. ఉదాసీనః=పక్షపాతము లేనివాఁడు. గతవ్యథః=ఆధి లేనివాఁడు. సర్వము లను—దృష్టాదృష్టార్థము లయినయారంభములను—ప్రయత్నములను బరిత్యజించుట స్వభావముగాఁ గలవాఁడు. ఇట్టివాఁ డగు మద్భక్తుఁడు ఎవఁడు గలఁడో అతఁడు నాకుఁ బ్రియుఁడు.

ప॰ ♦

రా॰ అనపేక్షః= ఆత్మవ్యతిరిక్త మయినసమస్తవస్తువునందును అపేక్ష లేని వాఁడు. శుచిః=శాస్త్రవిహిత మయినద్రవ్యముచే వృద్ధినొందింపఁబడినదేహము గల వాఁడు. దక్షః=శాస్త్రీయకర్మానుష్ఠానమునందు సమర్థుఁడు. ఉదాసీనః = ఇతరమునం దుదాసీనుఁడు. గతవ్యథః=శాస్త్రీయకర్మానుష్ఠానమునందు అవర్జనీయముగాఁ బ్రాప్త ము లయిన శీతోష్ణపరుషస్పర్శాదిదుఃఖములయందు వ్యథ లేనివాఁడు. సర్వారమ్భ పరిత్యాగీ = శాస్త్రీయవ్యతిరిక్తము లయిన సర్వకర్మారంభములను బరిత్యజించిన వాఁడు. ఇట్టిమద్భక్తుఁ డెవ్వఁడు గలఁడో అతఁడు నాకుఁ బ్రియుఁడు.

మా॰ సర్వారంభపరిత్యాగీత్యాదికమునకు సామాన్యవిశేషభావముచేతను వ్యాఖ్యానవ్యాఖ్యేయభావముచేతను అపునరుక్తి. హర్షాదులచే ముక్తుఁ డనఁగా నొకానొకప్పుడైనను హర్షాదికము సంభవించు నని యో నహృష్యతి అని చెప్పఁ బడినది. ఉపచారపరిహారార్థము మున్ను చెప్పఁబడినది. అధిక్యజ్ఞాపనార్థము మద్భక్తః అని పలుమాఱు వచింపఁబడినది. “యేతు సర్వాణి కర్మాణి” ఇత్యాదికమునకుఁ బ్రపంచం బిది *.

యో న హృష్యతి న ద్వేష్టి న శోచతి న కాఙ్క్షతి
శుభాశుభపరిత్యాగీ భక్తిమా న్యస్స మే ప్రియః. ౧౭

---

♦ శ్రీధరీయముతో సమానము.

* అందుఁ జెప్పఁబడినయర్థమే యద్వేష్టేత్యాదిశ్లోకములచేఁ బ్రపంచింపఁబడినది.

భా. మఱియును.—యః=ఎవ్వఁడు; నహృష్యతి = ఇష్టప్రాప్తియందు హర్షింపఁడో. నద్వేష్టి=అనిష్టప్రాప్తియందు ద్వేషింపఁడో. నశోచతి=ప్రియవియోగమునందు శోకింపఁడో. నకాఙ్క్షతి=అప్రాప్తమయినప్రియమును కాంక్షింపఁడో. శుభాఽశుభపరిత్యాగీ=శుభాశుభము లయినకర్మములను బరిత్యజించుట స్వభావముగాఁ గలవాఁడో. ఇట్టి, భక్తిమాన్ యః = నాయందు భక్తిగలవాఁ డెవ్వఁడో; సః=అతఁడు, మే=నాకు; ప్రియః=ప్రియుఁడు.

ఎవ్వఁ డిష్టము లభించినపుడు హర్షింపఁడో, అనిష్టము ప్రాప్తించినపుడు ద్వేషింపఁడో, ఇష్టము నశించినపుడు శోకింపఁడో, ఇష్టము లభింపనియప్పుడు దానిఁ గాంక్షింపఁడో, శుభాశుభకర్మములను బరిత్యజించినవాఁడో, అట్టిమద్భక్తుఁడు నాకుఁ బ్రియుఁ డని తాత్పర్యము.

ఆ. ద్వేషహర్షాదిరాహిత్యము గూడ జ్ఞానికి లక్షణం బని చెప్పుచున్నారు మఱియును అని. సర్వారంభపరిత్యాగి యనుటచే విహితకామ్యత్యాగముఁ జెప్పఁబడుటవలన విహితేతరమునందు సంకోచము గలుగఁగూడ దని ♦ విశేషణముఁ జేయుచున్నారు శుభాశు భేత్యాదిగా.

శం. రాగద్వేషములకంటె వేఱుప్రతిబంధము ముక్తి కేదియు లేదు, ముముక్షువు వాని నవశ్యము పరిహరింపవలయు నని సూచించుటకై ముక్తునకుఁ దద్రాహిత్యము లక్షణ మని చెప్పుచున్నాఁడు.—యః=బ్రహ్మవిదుఁడగు నేయతి; తనయంతనే పరేచ్ఛచేఁ గాని యనిచ్ఛచేఁ గాని యిష్టము ప్రాప్తించినను; నహృష్యతి=హర్షింపఁడో, పరప్రయత్నమునఁగూడ నట హర్షము చేయఁడో అని యర్థము. అట్లే యనిష్టము ప్రాప్తించినపుడు, నద్వేష్టి=ద్వేషింపఁడో, తనకు అనిష్టము కలిగించువానియందును అనిష్టార్థమునందును అప్రీతిని వహింపఁడో అని యర్థము. గొప్ప యనర్థము సంభవించినను, నశోచతి—స్వనిష్ఠచేతను ధైర్యముచేతను దాని కవిషయమయినఆత్మయొక్క-జ్ఞానబలముచేతను దాను అశ్రుమోక్షమును గాని విలాపమును గాని జేయఁడో అని యర్థము. అట్లు, ప్రాప్తమయినయనర్థముయొక్క-నివృత్తిని, నకాఙ్క్షతి—ప్రారబ్ధభోగక్షయము చేతనేగాని వాంఛామాత్రంబునఁ దన్నివృత్తి యశక్యం బగుటవలన తితిక్ష వహించియుండుం గాని తత్ప్రతీకారముకొఱకు ఇంచుక

♦ అవిహితమును నిషిద్ధమును గూడ విడిచినవాఁ డని బోధించుటకై.

నైయైనను యత్నింపఁడని యర్థము. మఱియును. శుభాశుభపరిత్యాగీ=శుభములు—పుణ్యములు, అశుభములు—పాపములు, అజ్ఞానసహచరములు ఇచ్ఛచేతను అనిచ్ఛచేతను చిదాభాసునిచేఁ జేయఁబడుచున్నకర్మములు, వానిని కర్మమునం దకర్మత్వదర్శనముచే నేను గర్తను గానని పరిత్యజించుట—తనకు సంబంధింపనియట్లు చేయుట స్వభావముగాఁ గలవాఁడు కావున శుభాశుభపరిత్యాగి, దేహేంద్రియాదులచేత నే చేయఁబడినకర్మములతోఁ బ్రత్యగ్దృష్టిచేఁ దాను సంబంధింపఁ డని యర్థము, “తద్యథా పుష్కరపలాశే” ఇత్యాదిశ్రుతివలన. ఎవ్వఁ డిట్టిలక్షణము గల, భక్తిమాన్=జ్ఞానవంతుఁ డగుయతి గలఁడో; అతఁడు నాకుఁ బ్రియుఁ డని యర్థము.

మ. మఱియును.—సమదుఃఖసుఖః అని చెప్పినదాని వివరించుచున్నాఁడు.—యః=ఎవ్వఁడు; నహృష్యతి=ఇష్టప్రాప్తియందు హర్షింపఁడో. నద్వేష్టి = అనిష్టప్రాప్తియందు ద్వేషింపఁడో. నశోచతి=ప్రాప్తమయినయిష్టము నశించినపుడు శోకింపఁడో. నకాఙ్క్షతి=అప్రాప్తమయినయిష్టము నొందుటకై కాంక్షింపఁడో. సర్వారంభపరిత్యాగీ అని చెప్పినదాని వివరించుచున్నాఁడు.—శుభాశుభపరిత్యాగీ = శుభములు—సుఖసాధనములు, అశుభములు—దుఃఖసాధనములు, అగుకర్మములను బరిత్యజించుట స్వభావముగాఁ గలవాఁడు కావున శుభాశుభపరిత్యాగి. అట్టిభక్తిమంతుఁ డెవఁడో అతఁడు నాకుఁ బ్రియుఁడు.

శ్రీ. మఱియును.—ప్రియమును బొంది యెవ్వఁడు హర్షింపఁడో, అప్రియము నొంది యెవఁడు ద్వేషింపఁడో, ఇష్టార్థనాశమునం దెవఁడు శోకింపఁడో, అప్రాప్తమయినయర్థము నెవ్వఁడు కాంక్షింపఁడో, శుభాశుభములను—పుణ్యపాపములను బరిత్యజించినవాఁ డెవఁడో, ఇట్టివాఁడై యెవఁడు మద్భక్తిమంతుఁడో, అతఁడు నాకుఁ బ్రియుఁడు.

ప. మఱియును.—నశోచతి=ప్రియవస్తువు పోయినను మృతిఁ బొందినను శోకింపఁడో ♦.

రా. యో నహృష్యతి=ఏది మనుష్యులకు హర్షనిమిత్తమయినప్రియజాతమో దానిఁ బ్రాపించి యేకర్మయోగి హర్షింపఁడో. ఏది యప్రియమో దానిఁ బొంది, నద్వేష్టి = ద్వేషింపఁడో. ఏది మనుష్యులకు శోకనిమిత్తమయినభార్యా

♦ తక్కినది శ్రీధరీయముతో సమానము.

పుత్త్రాదిత్రక్షయాదికము గలదో దానిఁ బొంది, నశోచతి=శోకింపఁడో. అట్టిదానిని * అప్రాప్త మయినదానిని, నకాఙ్క్షతి=కోరఁడో. శుభాశుభపరిత్యాగీ=పాపమునకువలెఁ బుణ్యంబునకును బంధహేతుత్వము సమానం బగుటవలన పుణ్యాపాపములను రెంటిని విడిచినవాఁ డెవఁడో; ఎవ్వఁ డిట్టిభక్తిమంతుఁడో అతఁడు నాకుఁ బ్రియుఁడు.

సమ శ్శత్రౌ చ మిత్త్రే చ తథా మానాపమానయోః
శీతోష్ణసుఖదుఃఖేషు సమ స్సఙ్గవివర్జితః. ౧౮

భా. శత్రౌ చ=శత్రువునందును; మిత్త్రే చ=మిత్త్రునియందును; సమః=సమానుఁడు. తథా=అట్లు; మానాపమానయోః = పూజయందును పరిభవమునందును; సమః=సమానుఁడు. శీతోష్ణసుఖదుఃఖేషు=శీతోష్ణములయందును సుఖదుఃఖములయందును; సమః=సమానుఁడు. సర్వమునందును, సఙ్గవివర్జితః=సంగముచే విడువఁబడినవాఁడు ♦.

శత్రువునందును మిత్త్రునందును సమానుఁడై యున్నవాఁడును తన్నుఁ బూజించినను అవమానించినను సమానమై నిర్వికార మయినచిత్తము గలవాఁడును శీతోష్ణములు సుఖదుఃఖములు సంభవించినను వికారము నొందనివాఁడును సర్వమునందును ఆసక్తి లేనివాఁడు నగు నాభక్తుఁడు నాకుఁ బ్రియుఁ డని తాత్పర్యము.

ఆ. అద్వేష్టేత్యాదికముచే ద్వేషాదివిశేషాభావము చెప్పఁబడినది. ఇప్పుడు సర్వమునందును అవికృతచిత్తత్వము చెప్పఁబడుచున్నది.—సర్వమునందును— చేతన మగు స్త్రీపుత్త్రాదికమునందును అచేతన మగుచందనాదికమునందును నని యర్థము.

శ్రీ. వికారహేతువులయం దవికారరూపంబున నుండుట యిదియే బ్రహ్మవిదుఁ డగుయతికి నుత్తమ మయినలక్షణము సర్వప్రత్యక్ష మని చెప్పుచున్నాఁడు రెండుశ్లోకములచేత.—లోకమునందు అపకారముఁ జేయువాఁడు శత్రువు, ఉపకారము చేయువాఁడు మిత్త్రుఁడు అని వ్యవహారము, అట్లు లోకదృష్టి ననుసరించి తన్నాయముఁ జెప్పుచున్నాఁడు, కాని విద్వద్దృష్టి ననుసరించి కాదు, నేనే యిది యంతయు నని సర్వాత్మదర్శి యగువిద్వాంసునకు శత్రుమిత్త్రాదిభేదప్రత్యయము

* ఏది నశించినచో మనుష్యులకు శోక మగునో అట్టిదానిని.

♦ ఇట్టిమద్భక్తుఁడు నాకుఁ బ్రియుఁ డని యుత్తరశ్లోకముతో నన్వయము.

సంభవింపమివలన. ప్రారబ్ధవశంబున దేహమున కొకానొకఁ డపకారి యగుచు న్నాఁడు, ఒకానొకఁ డుపకారి యగుచున్నాఁడు, అట్టిశత్రునందును మిత్రునందును విద్వాంసుఁడు తాను, సమః = సమదర్శనుఁడు. తథా=అట్లు; మానాపమానయోః= వారు చేయునట్టి సంతోషవిషాదహేతువు లయినపూజాతిరస్కారములయందును; సమః—నిర్వికారుఁడే యగుచున్నాఁ డని యర్థము. అట్లే, శీతోష్ణసుఖదుఃఖేషు= శీతోష్ణసుఖదుఃఖములు ప్రాప్తించినపుడు; సమః = సమదర్శియే యగుచున్నాఁడు. మానాపమానములయందును శీతోష్ణాదులయందును సమదర్శనసిద్ధికి హేతువుఁ జెప్పుచున్నాఁడు.—సఙ్గవివర్జితః=మానావమానశీతోష్ణాదుల ననుభవించునది యాభాస సహిత మయినయహంకారము, తత్తాదాత్మ్యాధ్యాసమే సంగము, దానిచే విడువఁ బడినవాఁడు; విజ్ఞానాత్మవిషయక మయినమానాపమానాదికమున కవిషయ మయిన పరబ్రహ్మమునం దాత్మభావము నొందినవాఁ డగుటచేఁ దానిం దత్సంబంధము లేని వాఁడై సర్వత్ర సమదర్శియే యగుచున్నాఁ డని యర్థము.

మ. మఱియును.—పూర్వశ్లోకమునకే ప్రపంచము ♦. సఙ్గవివర్జితః=చేతనాచేతనసర్వవిషయ మైనశోభనాధ్యాసముచే విడువఁబడినవాఁడు. ఇతరము స్పష్టము.

శ్రీ. మఱియును.—శత్రువునందును మిత్త్రునియందును, సమః = ఏకరూపుఁడు. తథా; మానాపమానములయందును; సమః—హర్షవిషాదశూన్యుఁ డని యర్థము. శీతోష్ణములయందును సుఖదుఃఖములయందును సముఁడు. సఙ్గవివర్జితః= దేనియందును ఆసక్తి లేనివాఁడు.

ప. మఱియును.—రెండుశ్లోకము లేకాన్వయములు. శత్రౌచ మిత్రేచ సమః=సమ మయినస్వభావము గలవాఁడు. అది చెప్పఁబడినది.—"సంవర్ధకం ఛేత్తారముపాగతం వా ఛాయాదిభి ర్విశ్రమిణం కరోతి। వృక్షో యథా తద్వదరౌచ మిత్రే సమస్వభావో హరిదాసవర్యః" * అని. తథా; మానాపమానములయందును శీతోష్ణసుఖదుఃఖాదిద్వంద్వములయందును, సమః = హర్షవిషాదరహితుఁడు. సఙ్గవివర్జితః= దేనియందును ఆసక్తి లేనివాఁడు.

---

♦ వివరణము.

* ఎట్లు వృక్షము తనుఁ బెంచువానికిఁగాని ఛేదింపవచ్చినవానికిఁగాని నీడ నొందలగువానిచే విశ్రాంతి నొందించుచున్నదో, అట్లు శత్రువునందును మిత్త్రునియందును సమాన మయినస్వభావము గలవాఁడు హరిదాసోత్తముఁడు.

రా॰ అద్వేష్టా సర్వభూతానాం మిత్రాదికముచే శత్రుమిత్రాదులయందు ద్వేషాదిరహితత్వము చెప్పఁబడినది. ఇందు దానికన్నను అధిక మయినవిశేషము వారు సన్నిహితులై యున్నను సమచిత్తత్వము చెప్పఁబడుచున్నది.

తుల్యనిన్దాస్తుతి ర్మౌనీ సంతుష్టో యేన కేనచిత్
అనికేతస్స్థిరమతి ర్భక్తిమాన్మే ప్రియో నరః. ౧౯

భా॰ మఱియును.—తుల్యనిన్దాస్తుతిః=నిందయును స్తుతియును తుల్యములు ఎవ్వనికో అట్టివాఁడు తుల్యనిందాస్తుతి; మౌనీ = మౌనము గలవాఁడు, సంయత మయినవాక్కు గలవాఁడు ♦. యేన కేనచిత్=దేనిచేతనైనను, శరీరస్థితిహేతువుచేత *; సంతుష్టః=తృప్తినొందినవాఁడు; అట్లు చెప్పఁబడినది.—“యేన కేనచి దాచ్ఛన్నో యేన కేన చిదాశితః। యత్ర క్వచన శాయీ స్యాత్తం దేవా బ్రాహ్మణం విదుః” ♦♦ అని. మఱియును. అనికేతః=నికేతము—ఆశ్రయము నివాసము నియతముగా నెవ్వనికి లేదో అతఁడు అనికేతుఁడు, నాగారే ఇత్యాదిస్మృత్యంతరమువలన. స్థిరమతిః=స్థిరము పరమార్థవస్తువిషయ మయినమతి యెవ్వనికో అట్టివాఁడు. ఇట్టి, భక్తిమాన్=జ్ఞానవంతుఁ డగు; నరః=మనుష్యుఁడు; మే=నాకు; ప్రియః=ప్రియుఁడు.

తన్ను నిందించినను స్తుతించినను సమముగాఁ దలంచువాఁడును మౌనము గలవాఁడును ఆహారాదు లెట్టివి దొరకినను సంతోషించినవాఁడును నియత మయిననివాసస్థలము లేనివాఁడును పరమార్థవస్తువిషయమున స్థిర మయినబుద్ధి గలవాఁడు నైనజ్ఞాని నాకుఁ బ్రియుఁ డని తాత్పర్యము.

ఆ॰ వాగ్యతత్వాదులు § గూడ జ్ఞానికి విశేషణంబు లని చెప్పుచున్నారు మఱియును అని. నింద—దోషసంకీర్తనము. స్తుతి—గుణగణనము. దేహస్థితిమాత్ర

♦ మాటలాడనివాఁ డనుట.

* అన్నాదికముచేత.

♦♦ దేనిచేనైనను గప్పఁబడినవాఁడు—ఏదైనను వస్త్రముగాఁ గలవాఁడు, దేనిచేనైనను ఆహారము గలవాఁడు, ఎచ్చటనైనను బరుండువాఁడు ఎవ్వఁడో అతనిని దేవతలు బ్రాహ్మణునిగాఁ దలంచుచున్నారు.

§ మౌనిత్వాదులు.

ఫలమయిన యెట్టియన్నాదికముచేనైనను జ్ఞాని సంతుష్టుం డనుటకు స్మృతిని బ్రమాణీకరించుచున్నారు అట్లు ఇత్యాదిగా. నియతనివాసము లేకుండుట గూడ జ్ఞానికి విశేషణం బని చెప్పుచున్నారు మఱియును అని. « నకుడ్యాం నోదకే సఙ్గో నచైలే న త్రిపుష్కరే। నాగారే నాఽఽసనే నాన్నే యస్య వై భైక్షువిత్తు సః » ‡ అనుస్మృతిని ఉక్తార్థమునందుఁ బ్రమాణముగాఁ జూపుచున్నాడు నాగారే ఇత్యాదిగా. మాటిమాటికి భక్తిగ్రహణము మోక్షమార్గమునకుఁ బరమార్థజ్ఞాన ముపాయం బని తెలుపుటకొఱకు.

హ. అనికేతః=గృహము లేనివాఁడు.

శం. మఱియును.—తుల్యనిన్దాస్తుతిః=నింద—ఉన్నవిగాని లేనివిగాని దోషములు ప్రత్యక్షమున వర్ణించుట, స్తుతి—అట్టిగుణములను బ్రత్యక్షంబునఁ గీర్తించుట, అవి యనాత్మగోచరములు కావున తుల్యములు—సమములు ఎవ్వనికో అతఁడు తుల్యనిందాస్తుతి, వానియందు సముఁడు—నిర్వికారుఁ డని యర్థము. సంగవివర్జితుఁ డగుటవలన, మౌనీ=వాచంయముఁడు, వాచ్యము—చెప్పఁదగినది లేకుండుటవలన; సర్వమును బ్రహ్మమునుగానే చూచుచుండువిద్వాంసునకు వాచ్యము కలుగదు గదా! అది లేనివలననే విద్వాంసుఁడు మౌని, « విజాన న్విద్వాన్ భవతే నాతివాదీ » ♦ అనుశ్రుతివలన. సంతుష్టః = ప్రారబ్ధవశమువలన లభించినదానిచే శుద్ధముచేఁ గాని యశుద్ధముచేఁ గాని సదసత్త్వభావనానిర్ముక్తం బగుభైక్షముచే అల్పముచేఁ గాని యధికముచేఁ గాని సంతృప్తుఁడు, చాలు నను ప్రత్యయము నొందినవాఁ డని యర్థము, « యేన కేన చిదాశితః » అనుస్మృతివలన. అనికేతః=నికేత మనఁగా నివాసము, అది నియత మయినది లేదు ఎవ్వనికో అతఁ డనికేతుఁడు, యతి, గ్రామైకరాత్రుఁ డని యర్థము, « అష్టౌమాసాన్ ఏకాకీ యతిశ్చరేత్ » * అనుశ్రుతివలన. స్థిరమతిః=విపరీతభావనాజనకము లగు మానాపమానశీతోష్ణసుఖదుఃఖాదులు ప్రాప్తము లయినను ఇది సర్వంబును నేనును బ్రహ్మమే యని సదా సర్వత్ర బ్రహ్మాకారాపన్నమై యేకవృత్తిచే స్థిరము—నిశ్చల మగు మతి—మననశీల మగుచిత్తవృత్తి యెవ్వనికో

‡ కమండలునందుఁగాని జలమునందుఁగాని వస్త్రమునందుఁగాని త్రిపుష్కరమునందు—తీర్థవిశేషమునందుఁగాని గృహమునందుఁగాని ఆసనమునందుఁగాని అన్నమునందుఁగాని యెవ్వనికి సంగము లేదో అతఁడు సన్న్యాసి.

♦ జ్ఞానము గలవిద్వాంసుఁడు ఎక్కువ మాటలాడువాఁడు కాఁడు.

* ఎనిమిదిమాసము లేకాకియై యతి తిరుగవలయును.

అతఁడు స్థిరమతి, స్థితప్రజ్ఞుఁ డని యర్థము. దృఢనిశ్చయః అనుటచే జ్ఞానమునకు మానాంతరముచే బాధరాహిత్యంబు చెప్పఁబడినది, స్థిరమతిః అనుటచే వృత్తినైశ్చల్యము చెప్పఁబడినది యని భేదము. భక్తిమార్గ—"ఏకాన్తభక్తి ర్గోవిన్దే యత్సర్వత్ర తదీక్షణాత్ । అహైతుక్యవ్యవహితా యాభక్తిః పురుషోత్తమే । లక్షణం భక్తియోగస్య నిర్గుణస్య ఉదాహృతమ్"—దీనియర్థము.—అహైతుకీ = నిమిత్తరహితము, విపరీతప్రత్యయనివృత్త్యాదిప్రయోజనరహితము, బ్రహ్మవిదులకు స్వాభావసిద్ధమైనది; అవ్యవహితా=అవిచ్ఛిన్నము, ఇతరవృత్తివర్జితము; పురుషోత్తమే = ప్రత్యగభిన్నుఁ డైనపరమాత్మయందు; యా భక్తిః=అఖండాకారవృత్తి యేది గలదో; అది యే, నిర్గుణస్య = నిర్గుణవిషయ మయిన; భక్తియోగస్య = భక్తియోగమునకు; లక్షణమ్=స్వరూపముగా; ఉదాహృతమ్ = గొప్పవారిచేఁ జెప్పఁబడినది ♦, ఇట్టిలక్షణము గల ముఖ్య మయినభక్తి కలవాఁడు భక్తిమంతుఁడు, బ్రహ్మనిష్ఠుఁడు; అట్టి; నరః= స్వనిష్ఠచేఁ దన్ను బ్రహ్మమునే నారయతి—పొందించుచున్నాఁడు కాని యోన్యంతరమును లోకాంతరమును బొందింపఁడు కావున నరుఁ డనఁగా బ్రహ్మవిదుఁ డైనయతి. అట్టివాఁ డెవ్వఁడు గలఁడో అతఁడు; మే ప్రియః=నాకుఁ బ్రియుఁడు.

మ. మఱియును.—తుల్యనిన్దాస్తుతిః = నింద—దోషము చెప్పుట, స్తుతి—గుణము చెప్పుట, అవి దుఃఖసుఖములఁ బుట్టింపని వగుటచే తుల్యములు ఎవ్వనికో అట్టివాఁడు. మౌనీ=సంయత మైనవాక్కు గలవాఁడు. ఓయీ! శరీరయాత్రానిర్వాహములకు వాగ్వ్యాపారము అపేక్షితమే యగును, అనఁగా కా దని చెప్పుచున్నాఁడు.—సంతుష్టో యేన కేనచిత్ = తనప్రయత్నము లేకయే బలవత్ప్రారబ్ధకర్మప్రాపితం బగు శరీరస్థితిహేతుమాత్ర మయిన యశనాదికముచే సంతుష్టుఁడు—స్పృహా నివర్తిల్లినవాఁడు. మఱియును.—అనికేతః = నియత మయిననివాసము లేనివాఁడు. స్థిరమతిః=స్థిర మయిన పరమార్థవిషయబుద్ధి గలవాఁడు. ఇట్టివాఁ డెవ్వఁడు భక్తిమంతుఁడు గలఁడో అతఁడు నాకుఁ బ్రియుఁ డైనమనుష్యుఁడు. ఇట పలుమాఱు భక్తిని గ్రహించుట భక్తియే యపవర్గమునకుఁ బుష్కల మయినకారణ మని దృఢీకరించుటకు.

శ్రీ. తుల్యము లయిననిందాస్తుతులు గలవాఁడు. మౌనీ=సంయత మయిన వాక్కు గలవాఁడు. యేన కేనచిత్=దేనిచేతనైనను లబ్ధ మయినదానిచే; సంతుష్టుఁడు.

♦ ఏకాన్తభక్తి ర్గోవిన్దే యత్సర్వత్ర తదీక్షణాత్—సర్వప్రపంచమునందును ఆగోవిందునే—బ్రహ్మమునే చూచుటవలన ఏది కలుగుచున్నదో అదియే గోవిందునియందు ఏకాంతభక్తి యనఁబడును.

అనికేతః = నియతనివాసము లేనివాఁడు. స్థిరమతిః = వ్యవస్థిత మయినచిత్తము గల వాఁడు. ఇట్టిభక్తిమంతుఁడు నాకుఁ బ్రియుఁ డైనమనుష్యుఁడు.

ప. నిందించుటచేఁ గోపింపఁడు, స్తుతించుటచే శ్లాఘింపఁడు. మౌనీ = సంయత మయినవాక్కు గలవాఁడు. యేనకేనచిత్ సంతుష్టః = యథాలాభసంతుష్టుఁడు. అనికేతః = అనియత మయినస్థలము గలవాఁడు. స్థిరమతిః = నిశ్చిత మయిన చిత్తము గలవాఁడు. అట్టివాఁడై భక్తిమంతుఁ డగువాఁడు నాకుఁ బ్రియుఁడు.

రా. ఆత్మయందు స్థిరమతి యగుటచే నికేతనాదులయందు అసక్తుఁడు కావున అనికేతుఁడు. అందువలననే మానావమానాదులయందును సముఁడు. ఎవ్వఁ డిట్టిభక్తిమంతుఁడో అతఁడు నాకుఁ బ్రియుఁడు.

యేతు ధర్మ్యామృత మిదం యథోక్తం పర్యుపాసతే
శ్రద్దధానా మత్పరమా భక్తా స్తే ఽతీవ మే ప్రియాః. ౨౦

భా. అద్వేష్టాసర్వభూతానా మిత్యాదిగ్రంథముచే నక్షరోపాసకులు నివృత్తసర్వైషణులు సన్న్యాసులు పరమార్థజ్ఞాననిష్ఠు లగువారిధర్మ జాతమును బ్రక్రాంత మయినదాని నుపసంహరించుచున్నాఁడు.— యేతు = ఎవ్వరు మఱి సన్న్యాసులు; ధర్మ్యామృతమ్ = ధర్మమునుండి యనపేతము ♦ ధర్మ్యము, అమృతత్వహేతు వగుటవలన అమృతము, ధర్మ్యంబును అమృతంబు నగు; ఇదమ్ = దీనిని; యథోక్తమ్ = అద్వేష్టా సర్వభూతానా మిత్యాదిగ్రంథముచేఁ జెప్పఁబడినరీతిని; పర్యుపాసతే = అనుష్ఠించుచున్నారో; శ్రద్దధానాః = శ్రద్ధ గలవారలై. మత్పరమాః = చెప్పినవిధంబున నేను అక్షరాత్ముఁడను బరమము—నిరతిశయ మయినగతి యెవ్వరికో అట్టివారలును; భక్తాః = ఉత్తమము పరమార్థజ్ఞానలక్షణ మయినభక్తి నాశ్రయించినవారు నగు; తే = వారు; అతీవ = మిక్కిలి; మే ప్రియాః = నాకుఁ బ్రియులు. « ప్రియో హి జ్ఞానినో ఽత్యర్థమ్ » అని యేది సూచింపఁబడినదో అది వ్యాఖ్యానపూర్వకముగా నిట నుపసంహరింపఁబడినది, భక్తా స్తే ఽతీవ మే ప్రియాః అని. ఎందువలన ధర్మ్యామృతమును దీని యథోక్తముగా ననుష్ఠించువాఁడు భగవంతుఁడను విష్ణుఁడను బర

♦ తొలఁగనిది.

మేశ్వరుఁడ నగు నాకు మిక్కిలి ప్రియుం డగుచున్నాఁడో, అందువలన విష్ణువుయొక్క ప్రియము పరమం బగుధామము నొందఁగోరునట్టి ముముక్షు వీధర్మ్యామృతమును యత్నంబున ననుష్ఠింపవలయు నని వాక్యార్థము.

ఎవ్వరు అద్వేష్టేత్యాదిగ్రంథముచే నేను జెప్పినప్రకారంబున నీధర్మ్యామృతమును శ్రద్ధ గలవారై యనుష్ఠించుచున్నారో, అక్షరాత్మను నేనే నిరతిశయగతిగాఁ గలవారును బరమార్థజ్ఞానరూప మయినయుత్తమభక్తి నాశ్రయించినవారు నగునట్టిసన్న్యాసులే నాకు మిక్కిలిప్రియు లని తాత్పర్యము.

ఆ. అద్వేష్టేత్యాదిధర్మజాతము జ్ఞానవంతునకు లక్షణముగాఁ జెప్పినది యుపపాదింపఁబడినది. దాని ననువదించి యుపసంహారశ్లోకము నవతరింపఁ జేయుచున్నారు అద్వేష్టేత్యాదిగా. చతుర్థపాదమునకుఁ దాత్పర్యముఁ జెప్పుచున్నారు ప్రియో హీత్యాదిగా. యథోక్త మయినధర్మజాతము జ్ఞానవంతునకు లక్షణము సరే, అయినను జిజ్ఞాసువులకు జ్ఞానోపాయం బగుటచే యత్నంబున ననుష్ఠేయం బని వాక్యార్థము నుపసంహరించుచున్నారు ఎందువలన నిత్యాదిగా. ఇట్లు సోపాధికధ్యానపరిపాకమువలన నిరుపాధికము ననుసంధించువాఁడును అద్వేష్టా సర్వభూతానా మిత్యాదిధర్మవిశిష్టుఁడును ముఖ్యాధికారియునై శ్రవణాద్యావృత్తి చేయుచుండువానికిఁ దత్త్వసాక్షాత్కారము సిద్ధించి యందుచే ముక్తి యుపపన్న మగుటవలనఁ దద్ధేతువాక్యార్థధీవిషయత్వయోగ్య * మగు తత్పదార్థం బనుసంధేయ మని సిద్ధము.

హ. ధర్మమునుండి యనపేతము ధర్మ్యము, అది యమృతమువంటిది కావున ధర్మ్యామృతము, వ్యాఘ్రాది యగుటవలన సమాసము.

శో. అద్వేష్టా సర్వభూతానా మ్మనునది మొదలుగా బ్రహ్మనిష్ఠుఁ డగు బ్రహ్మవిదునిలక్షణం బేది చెప్పఁబడినదో అది సర్వంబును శ్రవణమననములచేఁ బుట్టిన జ్ఞానము పరిపక్వ మగుటకు ముఖ్యసాధనం బగుటవలన మోక్షైకకాములు సర్వము నుండియు విరక్తులు సాధకు లగుయతులు అవశ్యము సంపాదింపవలయు నని బోధించుటకై తత్సంపాదననిష్ఠు లగుసాధకులను స్తుతించుచు నధ్యాయము నుపసంహరించుచున్నాఁడు.—తుశబ్దము సిద్ధులనుండి సాధకుల వ్యావర్తించుచున్నది. యే= ఎవ్వరు, మద్భావాపత్తినే ప్రార్థించినవారై సుఖసాధనమును సిద్ధమును సర్వంబును

* దానికిఁ గారణ మయినవాక్యార్థజ్ఞానమునకు విషయ మగుటకు యోగ్య మయిన.

సన్న్యసించి శ్రవణాదికముచే జ్ఞానసంపన్నులైనయతులు; శ్రద్దధానాః = ఇదియే ముక్తికిఁ బరమసాధన మవశ్య మనుష్ఠింపవలయు నని విశ్వాసము గలవారై; మత్పరమాః = నేనే—నిర్విశేషపరబ్రహ్మమే, పరమము—ప్రాప్తవ్య మగు నిరతిశయస్థానమను తలఁపు ఎవ్వరికో అట్టివారలై, నాయందే పరమార్థత్వబుద్ధి గలవారలై; లేక; నేనే పరముఁడను—నిరతిశయైశ్వర్యసంపన్నుఁడను విశ్వాధికుఁడను అనుల్లంఘనీయ మయినయాజ్ఞ గలవాఁడను ఈశ్వరుఁడను అనుబుద్ధి యెవ్వరికో అట్టివారలై, నేనే పరమేశ్వరుఁడ ననుబుద్ధిచే నాయాజ్ఞకు వశవర్తులై; యథోక్తమ్ = అద్వేష్టా సర్వభూతానా మిత్యాదిగ్రంథముచే నాచేతఁ బ్రతిపాదింపఁబడినట్టి; ధర్మ్యామృతమ్= యతులకు స్వధర్మ మగుటచేఁ బ్రయత్నంబున ననుష్ఠేయం బగుటవలన ధర్మ్యము, లేక, ముముక్షుత్వధర్మముచేఁ బ్రాప్యము కావున ధర్మ్యము, అమృతమునకు—మోక్షమునకు నియతసాధన మగుటవలన అమృతము, అట్టి; ఇదమ్=ఈ యద్వేష్టృత్వాదిధర్మజాతమును; పర్యుపాసతే = నిత్యము ననుష్ఠించుచున్నారో, తే=అట్టి; భక్తాః=మద్భావనానిష్ఠులు; మే=నాకు, ఈశ్వరునకు; అతీవ=అత్యంతము; ప్రియాః= పరమప్రేమాస్పదు లగుచున్నారు. లోకమున నెల్లరకును జెప్పినచొప్పునఁ జేయువార లత్యంతప్రియులుగాఁ గనఁబడుచున్నారు, అట్లు చెప్పినప్రకారము చేయునట్టి యే యతులు గలరో వారు నా కత్యంతప్రియు లని తాను జెప్పినమోక్షసాధనమునందు వారికిఁ బ్రవృత్తి సిద్ధించుటకై స్తుతి యిది. అందువలనఁ బరమేశ్వరున కత్యంత ప్రియు లగుటకొఱకును భవబంధవిముక్తికొఱకును యథోక్త మయినయీధర్మజాతమును మోక్షకాములై శ్రవణము చేసినవా రగుయతులు ప్రయత్నంబున ననుష్ఠింపవలయు నని సిద్ధము.

మ. అద్వేష్టేత్యాదిగ్రంథముచే నక్షరోపాసకులు జీవన్ముక్తు లగుసన్న్యాసులకు లక్షణభూతమై స్వభావసిద్ధ మయినధర్మజాతము ప్రతిపాదింపఁబడినది. అట్లు చెప్పఁబడినది వార్తికమునందు.—« ఉత్పన్నాత్మావబోధస్య హ్యద్వేష్టృత్వాదయో గుణాః। అయత్నతో భవ న్త్యేవ నతు సాధనరూపిణః » * అని. ఇదియే మున్ను స్థితప్రజ్ఞలక్షణరూపంబునఁ జెప్పఁబడినది. అట్టి యీధర్మజాతము ప్రయత్నముచే సంపాదింపఁబడుచున్నదై ముముక్షువునకు మోక్షసాధనం బగుచున్నది యని ప్రతిపాదించుచు నుపసంహరించుచున్నాఁడు.—యేతు = ఎవ్వరు మఱి సన్న్యాసులు

* ఆత్మజ్ఞానము పుట్టినవానికి అద్వేష్టృత్వాదిగుణములు యత్నము లేక కలుగనే కలుగుచున్నవి, కాని సాధనరూపములు కావు.

ముముక్షువులు; ధర్మ్యామృతమ్ = ధర్మరూపంబును అమృతత్వసాధనం బగుటవలన నమృతమును, లేక; అమృతమువలె ఆస్వాద్య మగుటవలన నమృతమును; ఇదం యథో క్తమ్=అద్వేష్టేత్యాదిగ్రంథముచేఁ బ్రతిపాదింపఁబడిన దీనిని; పర్యుపాసతే= ప్రయత్నముచే ననుష్ఠించుచున్నారో; శ్రద్దధానాః=శ్రద్ధ గలవారలై. మత్పరమాః= నేను భగవంతుఁడను అక్షరాత్ముఁడను వాసుదేవుఁడను, పరమము-ప్రాప్తవ్య మయిన నిరతిశయగతి యెవ్వారికో వారు మత్పరములు, అట్టివారలు; భక్తాః=నన్ను నిరుపాధికబ్రహ్మమును భజించుచున్నవారలు; తే=వారు; మే=నాకు; అతీవ = మిక్కిలి; ప్రియాః=ప్రియులు. «ప్రియో హి జ్ఞానినో ఒత్యర్థ మహం సచ మమప్రియః» అని పూర్వసూచితంబున కిది యుపసంహారము. ఎందువలన ధర్మ్యామృత మయిన దీని శ్రద్ధతో ననుష్ఠించుటచే భగవంతుఁడు విష్ణు వగు పరమేశ్వరున కత్యంతప్రియుఁ డగుచున్నాఁడో, అందువలన నిది జ్ఞానవంతునకు స్వభావసిద్ధం బగుటచే లక్షణ మైనను విష్ణువుయొక్క-పరమపదము పొందఁ గోరునట్టిముముక్షు వగునాత్మ తత్త్వజిజ్ఞాసువు ఆత్మజ్ఞానోపాయం బగుటచే దీని యత్నంబున ననుష్ఠింపవలయు నని వాక్యార్థము. ఇట్లు సోపాధికబ్రహ్మాభిధ్యానపరిపాకమువలన నిరుపాధికబ్రహ్మము ననుసంధించుచున్నవాఁడును అద్వేష్టృత్వాదిధర్మవిశిష్టుండును ముఖ్యాధికారియునై శ్రవణమనననిదిధ్యాసనముల నావర్తించుచున్నవానికి వేదాంతవాక్యార్థతత్త్వసాక్షాత్కారము సంభవించి యందుచే ముక్తి సిద్ధించుటవలన ముక్తిహేతుమహావాక్యార్థాన్వయయోగ్యం బగు తత్పదార్థ మనుసంధేయ మని మధ్యమం బగు నధ్యాయషట్కముచే సిద్ధము.

ధ్యానాభ్యాసవశీకృతం బగువిశుద్ధాత్మంబుతో నిర్గుణం
బై నిష్కర్మము నైనజ్యోతి యతు లొయ్యర్ గాంచిన న్గాంత్రు గా
నైన న్నాకుఁ గలిందజాపులినసమ్యగ్భావనాత్యుత్సుకం
బానీలం బగు తేజమే చిరము నేత్రానందముం జేయుతన్.

శ్రీ. చెప్పినధర్మజాతమును ఫలసహితముగా నుపసంహరించు చున్నాఁడు.—యథో క్తమ్ = ఉక్తప్రకార మయిన; ధర్మామృతమ్ = * ధర్మ మను నమృతమును, అమృతత్వసాధనం బగుటవలన. ధర్మ్యామృత మిద మ్మని కొందఱు పఠించుచున్నారు; దానిని, యే; పర్యుపాసతే = అనుష్ఠించుచున్నారో; శ్రద్ధ చేయువారలును మత్పరములునై. అట్టి నాభక్తులు నా కత్యంతము ప్రియులు.

* వీరిపక్షమునందు 'ధర్మామృత' మ్మని పాఠము.

5

బహులవిఘ్నము కష్ట మవ్యక్తమార్గ
మట్లు గావున బుధుఁ డనశ్యంబు సౌఖ్య
సేవ్య మగుకృష్ణపదసరసీజయుగ్మ
భక్తిసత్పథ మాశ్రయింపంగ వలయు.

ప. ఇఁక నుపసంహరించి చెప్పుచున్నాఁడు.—చెప్పినధర్మసంబంధి యగు నమృతమును, మోక్షసాధన మగుటవలన; యథోక్తమ్ = చెప్పినప్రకారముగా; శ్రద్దధానాః = శ్రద్ధ గలవారలై; మత్పరమాః = నేనే పరముఁడుగాఁ గలవారలై; పర్యుపాసతే. అట్టిభక్తులు నాకు మిక్కిలి ప్రియులు.

ఇఁక నధ్యాయతాత్పర్యము.—కొందఱు నానావిక్షేపవిఘ్నములచే నుపహతమై యాలంబశూన్య మయినమనస్సుచే మాటికి బహుకాలము అవ్యక్తోపాసనము చేయుచున్నారు. మఱికొందఱు స్వాత్మలాభముకొఱకు యోగేశ్వరులకును బరమగురు వయినభగవంతునియందు భక్తిని జేయుచున్నారు. ఆరెంటిలో క్లేశతారతమ్యము ద్వాదశాధ్యాయమధ్యంబున లోకాచార్యునిచే విశదముగాఁ బ్రతిపాదింపఁబడినది.

రా. ఈ యాత్మనిష్ఠునికన్నను భక్తియోగనిష్ఠునకు శ్రేష్ఠతను బ్రతిపాదించుచు నుపక్రమించినప్రకారంబున నుపసంహరించుచున్నాఁడు.—ధర్మ్యమును అమృతమును గావున ధర్మ్యామృతము—ప్రాప్యసమమయి ప్రాపక మయినభక్తియోగమును; యేతు; యథోక్తమ్ = మయ్యావేశ్యమనో యే మామ్ ఇత్యాదిగాఁ జెప్పిన ప్రకారంబున; పర్యుపాసతే. అట్టిభక్తులు మిక్కిలి నాకుఁ బ్రియులు.

మా. పిండీకరించి యుపసంహరించుచున్నాఁడు.—ధర్మ మనఁగా విష్ణువు, తద్విషయము ధర్మ్యము, అమృతము—మరణాదిసంసారనాశకమును గావున ధర్మ్యామృతము. శ్రద్దధానాః = శ్రత్ అనఁగా ఆస్తిక్యము, «శ్ర న్నామాస్తిక్య ముచ్యతే» అనునిఘంటువువలన, దాని ధరించినవారలై.

ఇతి శ్రీమహాభారతే శతసాహస్ర్యాం సంహితాయాం వైయాసిక్యాం భీష్మపర్వణి శ్రీమద్భగవద్గీతాసూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణార్జునసంవాదే భక్తియోగో నామ ద్వాదశో ఽధ్యాయః.

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు భక్తి యోగం బనం బరఁగు ద్వాదశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమత్ఖవాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందు ద్వా
దశాధ్యాయ టీక.



అధ్యాయద్వాదశకం వేదం గీతాన్ధ్రవివృతి రఖిలేయమ్
పరిపూర్తి మియా దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన.

ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కరుణా
సాధనవికలస్యా ఒపిచ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



PRINTED AT THE SARADAMBA VILASA PRESS,—MADRAS.

# ఆంధ్ర వచన గ్రంథములు

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ఆంధ్రవచనభాగవతము, ద్వాదశ స్కంధములు,ఒకేసంపుటం | 9 | 0 |
| ,, మూడుసంపుటములు | 10 | 8 |
| ఆంధ్రవచనభారతము— | | |
| ,, ఆదిసభాపర్వములు | 5 | 0 |
| ,, ఆరణ్యపర్వము | 5 | 0 |
| ,, విరాటోద్యోగపర్వము | 5 | 8 |
| ,, భీష్మద్రోణపర్వములు | 7 | 8 |
| ,, కర్ణశల్యసౌప్తికస్త్రీపర్వములు | 5 | 0 |
| ,, శాంతిపర్వము | 7 | 8 |
| ,, అనుశాసనికము మొదలు స్వర్గారోహణపర్వము వరకుగల సంపుటము | 7 | 8 |
| ఆంధ్రవచనవాల్మీకిరామాయణము, 2 సంపుటములు (అచ్చు) | | |
| ఆంధ్రవాఙ్మయచరిత్రసంగ్రహము | 3 | 0 |
| ఆంధ్రకవిత్వచరిత్ర, బసవరాజు అప్పారావుగారిది | 3 | 0 |
| శ్రీగురుజాడ శ్రీరామమూర్తిగారి ఆంధ్రకవిజీవితములు | 6 | 0 |
| అరేబియన్‌నైట్సుకథలు | 2 | 0 |
| న్యాయవిచారణప్రహసనము | 0 | 8 |
| తులసీదాసురామాయణము | 12 | 0 |
| తిలకుగారిసెక్యూరిటీకేసు, ఉపన్యాసములు | 0 | 14 |

| | ప్రతి 1-కి రూ. | అ. |
|---|---|---|
| ద్వాదశోపనిషత్తులు,వచనం, అచ్చు | | |
| భారతరమణీమణులు, 1 భా॥ | 1 | 0 |
| డిటో రెండవభాగము | 0 | 12 |
| డిటో 3-వ భాగము | 0 | 8 |
| యజుర్వేదకథాసంగ్రహము | 0 | 12 |
| శ్రీమహాభక్తవిజయము, | 12 | 0 |
| నీతిచంద్రిక, చిన్నయసూరి | 0 | 12 |
| పంచతంత్రము, వచనము | 0 | 12 |
| నవనాథభక్తులచరిత్ర | 2 | 8 |
| నీతిరత్నాకరము | 0 | 12 |
| సంగ్రహభారతము | 2 | 4 |
| సంగ్రహభాగవతము | 2 | 4 |
| సంగ్రహరామాయణము | 1 | 8 |
| ప్రాచీనదేశచరిత్రలు | 3 | 0 |
| పతివ్రతలచరిత్రలు | 3 | 0 |
| దక్కనుపూర్వకథలు | 3 | 0 |
| భోజునికథలు | 1 | 0 |
| హితోపదేశము,సులభశైలి | 1 | 0 |
| భోజకాళిదాసకథలు,1 భా॥ | 1 | 0 |
| ,, 2 భా॥ | 1 | 0 |
| తెనాలిరామలింగనికథలు, జీవితము | 0 | 6 |
| తెనాలి రామలింగం: A. S. P. అయ్యరు విరచితము | 0 | 8 |
| సంస్కృతనాటకకథలు | 2 | 0 |
| దశకుమారచరిత్రము | 2 | 0 |

వ్యాసప్రోక్త మయిన శతసహస్రగ్రంథసమ్మితం బగు శ్రీమహాభారతం బను సంహితయందు భీష్మపర్వంబున శ్రీకృష్ణార్జునసంవాదరూపంబును యోగశాస్త్రంబును బ్రహ్మవిద్యాబోధకంబు నగు శ్రీమద్భగవద్గీత లను నుపనిషత్తులయందు భక్తియోగం బనం బరఁగు ద్వాదశాధ్యాయము ముగిసెను.

ఇది శ్రీమష్ఠీహాటోపనామ శ్రీరామవిద్వన్మణితనుజన్మ
సుందరరామశర్మసంకలిత గీతార్థసర్వస్వరూప
పరమార్థచంద్రికాఖ్యాన శ్రీమద్భగవద్గీ
తాంధ్రవ్యాఖ్యానంబునందు ద్వా
దశాధ్యాయ టీక.



అధ్యాయద్వాదశకం వేదం గీతాన్ధ్రవివృతి రక్షితేయమ్
పరిపూర్తి మియాయ దచిరాత్ శ్రీమద్భగవత్ప్రసాదేన.

ఘటయతు భాగవతీ మే దుర్ఘటఘటనాపటీయసీ కృపయా
సాధనవికలస్యాపి ఇహ గీతాపరమార్థచన్ద్రికాపూర్తిమ్.



PRINTED AT THE SARADAMBA VILASA PRESS:—MADRAS.

